డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్
రచనలు - ప్రసంగాలు
సంపుటం. 3

# Dr. Baba Saheb Ambedkar
# Writings & Speeches
## Vol - 3




సారధ్యం
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్

# డా. బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలు

## సంపుటం. 3

<u>అముద్రిత రచనలు</u>

హిందూ మతం - తాత్వికత



భారతదేశం - కమ్యూనిజానికి ముందు కావలసినవి



ప్రాచీన భారత దేశంలో
విప్లవం - ప్రతి విప్లవం



బుద్ధుడూ - కారల్ మార్క్స్



పుస్తక ప్రణాళికలు







డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

జననం : 14 ఏప్రిల్, 1891 పరినిర్వాణం : 6 డిసెంబర్, 1956

# డా. బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలు

## సంపుటం - 3

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్
# రచనలు - ప్రసంగాలు
## సంపుటం - 3



ప్రధాన సంపాదకులు

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు

డా॥ పి.ఆపదరావు
ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
శ్రీ నిర్మలానంద

అనువాదం

ఆంధ్ర విశ్వవిద్యాలయం

సారధ్యం

తెలుగు విశ్వవిద్యాలయం

కన్వీనర్

ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

1994

Dr. BABASAHEB AMBEDKAR

RACHANALU - PRASANGALU VOL - III



Compiled in English : **Vasant Moon**

***First Print***
April, 1994

Copies : 2,000
Library Edition Rs. 80/-
Popular Edition Rs. 50/-



General Editor
**Prof. PERVARAM JAGANNADHAM**

Editors:
**Dr. P. Apada Rao**
**Dr. R. Chandra Sekhar Reddy**
**Sri Nirmalananda**

Convenor
**Prof. JAYADHIR THIRUMAL RAO**

Copies can be had from
**Registrar,**
**Telugu University**
**Lalitha Kala Kshetram**
**Public Gardens**
**Hyderabad.**

Cover: **E. Krishna**

Printed at
**Data News Features**, Hyderabad.

# ముందు మాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళిత వర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనీషి డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్. కుల వ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా॥అంబేద్కర్ ఒక **ఆశాజ్యోతి.** ఒక చైతన్య కేతనం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలు కలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజం చేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దానితో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్య సాధన కోసం కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం, ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥ అంబేద్కర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేశాయి.

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషి చేశారు. రాజ్యాంగంలో దళితుల కోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోక విదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర,ం శృతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని, అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తివంతంగా నడిపించారు.

డా॥ అంబేద్కర్ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయం, ఆర్థిక ధార్మిక విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు - ప్రసంగాలను సేకరించేందుకు 1976లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది.

ఫలితంగా డా॥అంబేద్కర్ గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ జన్మదినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించిది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శత జయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలు తెలుగులోకి అనువదించాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డిగారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడా సమకూర్చినారు.

అనంత కాలంలో ముఖ్యమంత్రి మాన్యశ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డిగారు డా॥అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు. అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాం.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారథ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగు శాఖలు ఉన్న కొన్ని విశ్వ విద్యాలయాలు,ఇతర ముఖ్య సంస్థలను ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి.నారాయణరెడ్డిగారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతాయుతంగా స్వీకరించినాయి. అంతే కాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికీ కొంత భిన్నత, అనువాద శైలీ భేదాలు చోటు చేసుకోక తప్పలేదు.

డా॥అంబేద్కర్ రచనల్లో చేసిన ప్రసంగాల్లో వాడిన పదాలకి ఆయా సందర్భాల ననుసరించి కనిపించే కొన్ని అర్థాలు నేడు వాడుకలో కనిపించడం లేదు. ఆ విధంగా డా॥అంబేద్కర్ ఉపయోగించిన పధాలకు వివిధ శాస్త్రాలకు సంబంధించి రకరకాల అర్థచ్ఛాయలు కనిపిస్తాయి. ఆంగ్ల పదాలకు సరిసమానమైన ఒకే పారిభాషిక పదం అన్నిసందర్భాల్లో అన్వయించక పోవడం మరో ఇబ్బంది. అందుకే సందర్భాన్ని అనుసరించి అర్థం చెడకుండా తెలుగులో వివిధ పదాలను వాడడం తప్పని సరిఅయింది.

డా॥అంబేద్కర్ రచనలు - ప్రసంగాల అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలన సంఘం ఏర్పాటయింది. పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥టి.వి. నారాయణ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె.వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి,వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారథ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా॥అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు హాజరయి తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ డా॥ తాళ్ల వెంకటరెడ్డి ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

డా॥అంబేద్కర్ శత జయంతి ఉత్సవాలను పురస్కరించుకొని తెలుగు విశ్వవిద్యాలయం అనువదించి, ముద్రింపచేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14.4.1992 నాడు ఆవిష్కృతమైంది.

డా॥అంబేద్కర్ జయంతిని పురస్కరించకొని డా॥అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ వారు అనువదించిన మొదటి సంపుటం హైదరాబాదులో 14.4.1993నాడు ఆవిష్కృతమైంది.

డా॥అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ వారు అనువదించిన నాల్గవ సంపుటం, డా॥అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు అనువదించిన ఎనిమిదో సంపుటం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం వారు అనువదించిన తొమ్మిదో సంపుటం మరియు తెలుగు విశ్వవిద్యాలయంవారు అనువదించిన పదకొండవ సంపుటం హైదరాబాదులో తేదీ 25.1.1994నాడు ఆవిష్కృతమైనవి.

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంథావళిలో మూడోది. దీని అనువాదాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు నిర్వహించినారు. ఈ గ్రంథంలో హిందూమత తత్వం, హిందూ సామాజిక వ్యవస్థ - లక్షణాలు, చిహ్నాలు, తవ్వి వెలికి తీసిన భారతదేశ చరిత్ర, సంస్కర్తలూ - భవితవ్యం, బ్రాహ్మణ మత సాహిత్యం, గృహధర్మ సూత్రాలు, భగవద్గీత వ్యాసాలు, బ్రాహ్మణ క్షత్రియ పోరాటాలు, శూద్రులు - ప్రతి విప్లవం తదితరమైన కీలకాంశాలను ఈ గ్రంథంలో డా॥ అంబేద్కర్ విశేషణాత్మకంగా చర్చించినారు.

ఈ మూడో సంపుటం అనువాదాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయ తెలుగు శాఖ రచయితలకు, అనువాదకులకు అప్పగించింది. అనువాదాన్ని సకాలంలో అప్పగించడానికి విశేషంగా తోడ్పడిన డా॥పర్లికొండ ఆపదరావు, శాఖాధిపతి తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి ప్రత్యేక ధన్యవాదాలు. అనువాదకులు డా॥కలెవరపు వెంకట్రామయ్య, శ్రీ బాబివర్ధన్, శ్రీ విజయలక్ష్మి పరమేశ్వరరావు, శ్రీనిర్మలానంద, ఆచార్య జి.పార్థసారథి, ఆచార్య లకంసాని చక్రధరరావు, శ్రీ యం.వి.రమణ, డా॥గణపతిరాజు అచ్యుతరామరాజు, ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, శ్రీ మాటూరి అప్పారావుగార్లకు ధన్యవాదాలు.

ఈ సంపుటం అనువాదం ఆంగ్ల మూలంతో సరిచూసి, కొన్ని పేజీలు అనువదించి, ప్రూఫ్‌లు చూసి శ్రమించిన శ్రీ.కె. శ్రీనివాస్‌గారికి ప్రత్యేక ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిని అనువాదం చేసిన రచయితలకూ, అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు డా॥పర్లికొండ ఆపదరావు, ఆచార్య రాచపాలెం చంద్రశేఖరరెడ్డి, శ్రీ నిర్మలానంద గారలకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా॥అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకీ, ఉన్నత విద్యాశాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన డేటా న్యూస్ ఫీచర్స్, హైదరాబాద్‌వారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటి అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

మరియు

12-4-1994

ప్రధాన సంపాదకులు

# తొలిమాట

భారత రాజ్యాంగ ప్రధాన నిర్మాత డా॥ అంబేద్కర్ ఒక రాజ్యాంగవేత్తగా, పార్లమెంటు వ్యవహర్తగా మాత్రమే ప్రపంచానికి పరిచితుడు కాదు. ఆయన ఒక గొప్ప పండితుడిగా, కార్యశీలి అయిన సంస్కర్తగా విశ్వవిఖ్యాతి గాంచాడు. దళితుల నాయకుడిగా ఆయన హిందూ సమాజంలోని దమన రీతులకు వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలు చేశాడు. ఆయన తన జీవితకాలమంతా స్వాతంత్ర్యం, సమానత్వం, న్యాయం, విశ్వమానవ సౌభ్రాత్రతల మీద ఆధారపడిన ఒక కొత్త సామజిక వ్యవస్థను ఏర్పాటు చేయటానికే కృషి చేశాడు.

వెనుకబడిన వర్గాల సమస్యల పరిష్కారానిక ఆయన చూపిన విప్లవాత్మకమైన, మానవియమైన మార్గానికి బారతీయ సమాజం ఆయనకు ఎంతో ఋణపడి ఉంది.

డా॥ అంబేద్కర్ జీవితకాలమంతా శ్రమించిన వెనుకబడిన వర్గల వారి సంక్షేమం కోసం మహారాష్ట్ర ప్రభుత్వం నిబద్ధమై ఉన్నది. డా॥ అంబేద్కర్ వంటి మహాపురుషుల ఆలోచనలు, బోధనలు కొత్త తరానికి ఎప్పుడూ వెలుగును అందిస్తూనే ఉంటాయి. డా॥ అంబేద్కర్ రచనలను పూర్తిగా ప్రచురించాలనే పథకంలో భాగంగా ఆయన అముద్రిత రచనలను మూడు భాగాలను వరుసగా తీసుకు వస్తున్నందుకు మా ప్రభుత్వం ఎంతో గర్వపడుతున్నది, ఆనందిస్తున్నది.

ఎస్.బి చవాన్
మహారాష్ట్ర ముఖ్యమంత్రి

# ముందుమాట

డా॥ అంబేడ్కర్ రచనలలో ఇప్పటివరకూ ముద్రితం కాని ఈ సంపుటాలకు ముందు మాట రాయవలసిందిగా నన్ను అడగటం, నాకెంతో గౌరవాన్ని ఇచ్చినట్టుగా భావిస్తున్నాను.

భారత సమాజ తత్వశాస్త్ర కోవిదులలో డా॥ అంబేడ్కర్ అత్యుత్తమ స్థానాన్ని అలంకరిస్తారు. ఆయన రచనల ద్వారా ప్రస్ఫుటమయ్యే ఆయన పాండితీ ప్రకర్ష, మన సాంఘిక మతపరమైన సమస్యలకు ఒక హేతుబద్ధమైన మార్గాన్ని సూచించే కాంతిరేఖలా ఉపకరిస్తుంది.

డా॥ అంబేడ్కర్ సంపూర్ణ రచనలను సంపుటాలుగా వెలువరించే పని మహారాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. ఈ పని నిమిత్తమై పునర్నిర్మితమైన సంఘం ఆయన అముద్రిత రచనలను మూడు సంపుటాలుగా వెలువరించింది. భారతీయ సామాజిక, రాజకీయ పరిణామ అధ్యయనపరులు వీటికోసం ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నారు.

భారతీయ సమాజంలోని తాత్విక సమస్యలనూ సాంఘిక సమస్యలనూ, చర్చించిన ఈ సంపుటాలు, హేతువాద ప్రాతిపదికపైన జాతీయ సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనటానికి ఆత్రుత పడుతున్న నవయువతరానికి, మేధావులకూ చాలా ఆసక్తిదాయకమవుతాయి.

ఈ సంపుటాలను త్వరితగతిలో తీసుకు రావటానికి చూపిన ఆసక్తికి, అంకిత భావానికి, శ్రద్ధకు సంపాదకవర్గాన్ని అభినందించాలి.

ఆచార్య రామ్ మేఘే
విద్యాశాఖమంత్రి, మహారాష్ట్ర

# ప్రస్తావన

డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ సోర్స్ మెటీరియల్ పబ్లికేషన్ కమిటీ సభ్యులు మహారాష్ట్ర ప్రభుత్వం తరపున డాక్టర్ అంబేడ్కర్ అముద్రిత రచనలు ఉన్న ఈ సంపుటిని పాఠకులకు అందించటానికి సంతోషిస్తున్నారు. ఈ సంపుటం ఎన్నో విధాల ప్రాముఖ్యత కలిగినదీ, అసాధారణమైనదీను. మొదటగా ఈ సంపుటంలోని అంశాలు ఇంతవరకూ తెలియనివి. ఇవి డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనలు. ఇవి ఇంతవరకు అడ్మినిస్ట్రేటర్ జనరల్ డా॥ అంబేడ్కర్ (ఆస్తి కస్టోడియన్) సంరక్షణలో ఉన్నాయి. ఆయన పాఠకులు, ఆయన విధేయులైన అనుయాయులు, ఈ రచనలు చదవాలని ఎంతో ఆత్రుత పడుతున్నారు. డా॥ అంబేడ్కర్ అనుయాయులు కొంతమంది ఆ రచనలు వారి ఆధీనంలో లేకపోయినా ఆ రచనలను ముద్రించటానికి తమకు అనుమతి ఇవ్వవలసిందిగా కోర్టుకు కూడా వెళ్లారు. ఆ విధంగా ఈ రచనలు ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి. ఒక సమయంలో వీటిని నాశనం చేసేస్తారేమో, పోగొడతారేమో అని భయం కూడా వేసింది.

ఈ సంపుటం ఎందుకింత ప్రాముఖ్యత పొందిందనటానికి రెండో కారణం ఉన్నది. డా॥ అంబేడ్కర్ బహుముఖ ప్రజ్ఞావంతుడిగా పేరొందాడు. తత్వచింతన పైన ఈ పుటలలో ఆయన చేసిన వ్యాఖ్యానం, హిందూ మతాన్ని గురించిన చారిత్రక విశ్లేషణ, ఆయన ఆలోచనపైన కొత్త వెలుగును ప్రసరింప చేస్తాయి.

మూడో అంశం ఏమంటే హిందూ మతంపై డా॥ అంబేడ్కర్ విశ్లేషణ మేధాపరమైన కసరత్తుగా ఉద్దేశించినది కాక, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రత అనే మానవ విలువలు ప్రాతిపదికగా హిందూ సమాజాన్ని పటిష్ఠం చెయ్యటానికి ఉద్దేశించిన ఒక నిర్దిష్టమైన మార్గం. ఈ విశ్లేషణ అంతిమంగా పతిత జాతుల ఉద్ధరణకు, ఆ జనావళిని ప్రధాన జన ప్రవాహంలోకి తీసుకు వెళ్లటానికి దారి తీస్తుంది.

ఈ రచనలను ప్రచురణ కోసం ఈ సంఘానికి అప్పగించిన విషయమై ఈ సందర్భంలో కొన్ని మాటలు చెప్పటం అప్రస్తుతం కాదు. డా॥ అంబేడ్కర్ తన జీవితకాలంలో చాలా పుస్తకాలు ప్రచురించాడు. అంతేకాదు. చాలా వాటి గురించి పథకాలు తయారు చేశాడు. తన ఆత్మకథను, మహాత్మా ఫూలే జీవితచరిత్రనూ, భారతసేనా చరిత్రనూ రాయాలనే ఉద్దేశాన్ని కూడా వ్యక్తం చేశాడు, కాని ఆ అంశాలపై పరిశోధన పత్రాలేమీ రాసిపెట్టిన దాఖలాలు లేవు.

1956లో ఆయన మరణానంతరం, ఆయన అముద్రిత రచనలతోపాటు అన్ని పత్రాలను ఢిల్లీ హైకోర్టు కస్టోడియన్ అధీనంలోకి తీసుకున్నారు. దరిమిలా, ఈ కాగితాలన్ను మహారాష్ట్ర ప్రభుత్వ అడ్మినిస్ట్రేటర్ జనరల్‌కు బదిలీ చేశారు. అప్పటి నుంచీ డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనల రాతప్రతులు ఉన్న పెట్టెలు ఇంకా అనేక ఇతర పత్రాలు అడ్మినిస్ట్రేటర్

నాగపూర్‌కు చెందిన అడ్వొకేట్ శ్రీ జె.బి. బాన్సోడ్ (J.b. Bansod) నాగపూర్‌లో ఉన్న బొంబాయి హైకోర్టు ధర్మాసనంలో మహారాష్ట్ర ప్రభుత్వం మీద ఒక దావా వేశాడు. ఆ తర్వాత దానిని బొంబాయి హైకోర్టుకు బదిలీ చేశారు. అర్జీదారుడు కోరినది చాలా చిన్న కోరిక, అదేమంటే డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనలు జాతీయ ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి కాబట్టి వాటిని ముద్రించటానికి తనకైనా అనుమతి ఇవ్వాలని లేదా ప్రభుత్వమైనా వాటిని ప్రచురించాలనీ ఆయన కోరాడు. ఈ వ్యాజ్యం బొంబాయి హైకోర్టులో చాలా సంవత్సరాలు నిలిచిపోయింది.

ఈ సంఘం ఏర్పడిన తర్వాత, 1978లో శ్రీ వి. డబ్ల్యు. మూన్ ప్రత్యేక అధికారిగా నియామకం అయిన తర్వాత, డా॥ అంబేడ్కర్ అముద్రిత రచనలు సేకరించి చారిత్రక ప్రాముఖ్యం గల ఆధారాలుగా వాటిని ప్రచురించాలని భావించటం జరిగింది. శ్రీ మూన్ డా॥ అంబేడ్కర్ వారసులను, అడ్మినిస్ట్రేటర్ జనరల్‌ని స్వయంగా కలుసుకున్నారు. తమతో సహకరించవలసిందిగా శ్రీ బాన్సోడ్ అడ్వొకేట్‌ని కోరడం కూడా జరిగింది.

శ్రీమతి సవిత అంబేడ్కర్, శ్రీ ప్రకాష్ అంబేడ్కర్ వారి కుటుంబ సభ్యులు, అడ్వొకేట్ శ్రీ బాన్సోడ్, ఎంతో ఆసక్తి కనపరిచి, ముద్రణకై ప్రభుత్వ పథకంతో అంగీకరించి, డా॥ అంబేడ్కర్ రచనలు ఉన్న పెట్టెలు అన్నింటినీ ప్రభుత్వానికి అప్పగించటానికి అంగీకరించినందుకు వారిని తప్పక అభినందించాలి. చివరకు అయిదు ఇనుప పెట్టెలలో ఉన్న అంబేడ్కర్ రచనలు అన్నింటినీ ఈ కమిటీకి అప్పగించటానికి అడ్మినిస్ట్రేటర్ జనరల్ అంగీకరించారు. దాని ప్రకారం ఆ పెట్టెలు అన్నింటినీ ప్రభుత్వం తరపున శ్రీ వసంతమూన్ 18.9.1981నాడు స్వాధీనం చేసుకున్నారు. ఈ అయిదు ఇనుప పెట్టెలను మంత్రాలయం(సచివాలయం)లోని విద్యాశాఖలో అధికారుల గదిలో భద్రంగా ఉంచటమైంది.

డా॥ అంబేడ్కర్‌కు చాలా సన్నిహితుడిగా ఉండటం వల్ల శ్రీ ఎం.బి. చిట్నిస్ ఆయన చేతివ్రాత బాగా గుర్తు పట్టగలడు. ఆయన ఆ సమయంలో సంపాదకవర్గ అధ్యక్షుడు. వ్రాతప్రతులు అందినమీదట వాటినన్నిటినీ ఆయన ఒక పక్షం రోజులు పరిశీలించి ఏవి డా॥ అంబేడ్కర్ వ్రాతప్రతులో నిర్ధారణ చేశాడు. గుర్తుపట్టటం అనే ప్రాథమిక కార్యం అయిన మీదట, వ్రాతప్రతులు చదవటం, వ్యాఖ్యానించటం, దొరికిన వాటిలో వ్రాతప్రతులను సరి చూసుకోవటం, పాఠకులకు ఏ రూపంలో, ఏ క్రమంలో వీటిని అందించాలనే బృహత్కార్య క్రమం మిగిలిపోయింది.

1981లో ఈ పథకం ప్రత్యేకాధికారి శ్రీ మూన్ పనిలోకి దిగాడు. దేనికది చేర్చి పెట్టుకోవటం, వేరు పరచి పెట్టుకోవటం అనే పని చాలా సున్నితమైనదీ, కష్టమైనదీ, చాలా సమయం పట్టేదీ అయింది. డా॥ అంబేడ్కర్ పూర్తి చేయాలని భావించిన ఎన్నో రచనలు అసంపూర్తిగా మిగిలిపోయి, వ్రాతప్రతుల రూపంలో అక్కడ కొన్ని, ఇక్కడ కొన్నిగా, చెల్లా

చెదరయిపోయాయి. చెల్లాచెదరైన భాగాలను ఒకచోట చేర్చి ఒకదానితో ఒకటి పోల్చుకొని ఒక క్రమపద్ధతిలో చేర్చే పని చేపట్టవలసిన అవసరం ఏర్పడింది. ఎన్నో గంటలు ఈ వ్రాతప్రతులనే కాకుండా ఇదివరకే డా॥ అంబేడ్కర్ రచనలుగా ప్రసిద్ధి చెందినవాటిని చదివి, ఎంపిక చేసి, తులనాత్మక పరిశీలన చేసిన మీదట మాత్రమే ఈ ప్రస్తుత ఎంపిక ప్రకారం, వ్రాతప్రతులను ఒక క్రమంలో పెట్టటానికి శ్రీ మూన్‌కు సాధ్యమైంది.

ఈ వ్రాతప్రతులు ఉన్న పరిస్థితి దృష్ట్యా ఈ పని మేధోపరంగా కష్టమైనది కావటమే కాకుండా, భౌతికంగా కూడా చాలా కష్టమయింది. ఈ వ్రాతప్రతులన్నీ 30 ఏళ్లపాటు పెట్టెలో పెట్టి మూసి ఉంచారు. వాటిని పురుగులు తినేశాయి. దాని ఫలితంగా ఈ కాగితాల నుంచి చాలా విపరీతమైన వాసన వచ్చేది. శ్రీ మూన్, ఆయన సహచరులకు కొన్ని చర్మవ్యాధులు సోకి చికిత్స చేయించుకోవలసి వచ్చింది.

రెండు సంవత్సరాలు తీవ్రంగా పరిశ్రమించిన మీదట, ఈ పత్రాలన్నీ ముద్రించవలసిన అవసరం ఉండటంవల్ల, వాటిని ఒక క్రమపద్ధతిలో అమర్చి సమర్పించవలసిన విషయమై శ్రీ మూన్ 17.9.83న సంపాదకవర్గానికి ఒక వివరణాత్మకమైన నివేదికను సమర్పించారు. ప్రస్తుత సంపుటి దాదాపు ఈ సూచనలకు అనుగుణంగానే ఉన్నది.

చాలా శ్రమతో కూడిన ఈ పనిలో స్టెనోగ్రాఫర్లుగా పనిచేసిన శ్రీ అనిల్‌కవాలే, శ్రీ ఎల్.ఆర్. మెహెర్, గుమాస్తాగా ఉన్న శ్రీ ఎస్.ఏ. ముంగేకర్‌లు అమూల్యమైన సహాయం అందించారు.

ప్రతిపాదించిన ఏర్పాట్లను డా॥ బాబాసాహెబ్ మూల రచనల ప్రచురణ సంపాదక మండలి 23-9-1986లో జరిగిన సమావేశంలో అంగీకరించిన తర్వాత, శ్రీ మూన్, వారి సిబ్బంది, ప్రచురణ పనిలోకి అంటే, ప్రూఫ్‌లు దిద్దటం, సూచిక తయారు చేయటంలాంటి పని లోకి దిగారు.

సంపాదక మండలి పరిశీలించిన పత్రాలలో అముద్రిత రచనలు 51 వరకు ఉన్నాయి. ('రిడిల్స్ ఇన్ హిందూయిజం' శీర్షికన ఉన్న 26తో కలిపి). వీటికి అదనంగా బొంబాయిలోని సిద్ధార్థ కాలేజిలో లైబ్రేరియన్‌గా పనిచేసిన శ్రీ ఎస్.ఎస్. రెగే, డా॥ అంబేడ్కర్‌గారి అముద్రిత వ్యాసాలు 14 పంపించారు. క్రింద ఇచ్చిన జాబితాలో శ్రీ రెగే అందజేసిన వ్యాసాలను '*' గుర్తుతో చూపటం జరిగింది. ఈ వ్యాసాలు అన్నీ సంపూర్ణంగా లేవు. ఈ వ్యాసాలు అన్నింటిని మూడు సంపుటాలుగా కూర్చటం జరిగింది.

**మూడో సంపుటం**

1. ఫిలాసఫీ ఆఫ్ హిందూయిజం
2. ది హిందూ సోషల్ ఆర్డర్ : ఇట్స్ ఎసెన్షియల్ ప్రిన్స్‌పుల్స్
3. ది హిందూ సోషల్ ఆర్డర్ : ఇట్స్ యునీక్ ఫీచర్స్
4. సింబల్స్ ఆఫ్ హిందూయిజం

5. ఎన్షెంట్ ఇండియా ఆన్ ఎగ్జ్యుమేషన్
6. ది ఏన్షెంట్ రెజిమ్ – ది స్టేట్ ఆఫ్ ది ఆర్యన్ సొసైటి
7. ఎ సంకెన్ ప్రీస్ట్‌హుడ్
8. రిఫార్మర్స్ అండ్ దెయిర్ ఫేట్
9.* ది డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ బుద్ధిజం
10. ది లిటరేచర్ ఆఫ్ బ్రాహ్మణిజం
11.* ది ట్రయింఫ్ ఆఫ్ బ్రాహ్మణిజం
12. ది మోరల్స్ ఆఫ్ ది హౌస్ – మనుస్మృతి ఆర్ ది గాస్పెల్ ఆఫ్ కౌంటర్ రివల్యూషన్
13. ది ఫిలసాఫిక్ డిఫెన్స్ ఆఫ్ కౌంటర్ – రివల్యూషన్ : కృష్ణా అండ్ హిజ్ గీతా
14. ఎనలిటికల్ నోట్స్ ఆఫ్ విరాట్ పర్వ అండ్ ఉద్యోగపర్వ
15. బ్రాహ్మిణ్స్ వెర్సెస్ క్షత్రియాస్
16. శూద్రాస్ అండ్ కౌంటర్ రివల్యూషన్
17. ది వుమన్ అండ్ కౌంటర్ రివల్యూషన్
18. బుద్ధా ఆర్ కార్ల్‌మార్క్స్
19. స్కీమ్స్ ఆఫ్ బుక్స్

**నాలుగో సంపుటం**

రిడిల్స్ ఇన్ హిందూయిజం (మొదటిదానితో కలిపి 27 అధ్యాయాలు శ్రీ ఎస్.ఎస్. రెగే పంపించినవి).

(ఈ సంపుటిని ముద్రించాలనుకున్నప్పుడు 24 రిడిల్స్, 8 అనుబంధాలతో కలిపి మొత్తం 32 వచ్చాయి).

**అయిదో సంపుటం**

1. అన్‌టచబుల్స్ ఆర్ చిల్డ్రన్ ఆఫ్ ఇండియాస్ ఘెట్టో
2.* ది హౌస్ ది హిందూస్ హేవ్ బిల్ట్
3.* ది రాక్ ఆన్ విచ్ ఇటీస్ బిల్ట్
4.* వై లాలెస్‌నెస్ ఈజ్ లాఫుల్?
5.* టచబుల్స్ వెర్సెస్ అన్‌టచబుల్స్
6.* హిందూయిజం అండ్ ది లెగసీ ఆఫ్ బ్రాహ్మణిజం
7.* పేరలల్ కేసెస్
8. సివిలైజేషన్ ఆర్ ఫెలొనీ
9. ది ఆరిజన్ ఆఫ్ అంటచబులిటీ
10. ది కర్స్ ఆఫ్ కేస్ట్
11.* ఫ్రమ్ మిలియన్స్ టు ఫ్రేక్షన్స్
12. ది రివోల్ట్ ఆఫ్ అన్‌టచబుల్స్

13. హెల్డ్ ఎట్ బే
14. ఎవే ఫ్రమ్ ది హిందూస్
15. ఎ వార్నింగ్ టు ది అన్‌టచబుల్స్
16. కేస్ట్ అండ్ కన్వర్షన్
17.* క్రిస్టియనైజింగ్ ది అన్‌టచబుల్స్
18.* ది కండిషన్ ఆఫ్ ది కన్వర్ట్
19.* అండర్ ది ప్రావిడెన్స్ ఆఫ్ మిస్టర్ గాంధీ
20.* గాంధీ అండ్ హిజ్ ఫాస్ట్

డా॥ అంబేద్కర్ అసలు రచనల ప్రచురణల విషయంలో రేగిన అన్ని అనుమానాలను తీర్చటం కోసం వ్రాతప్రతుల విషయంలో లేవనెత్తిన అన్ని ప్రశ్నల విషయం ఈ ఉపోద్ఘాతంలో ప్రస్తావించాలనుకున్నాం.

డా॥ అంబేద్కర్ (1) రిడిల్స్ ఆఫ్ హిందూయిజం, (2) ది బుద్ధా అండ్ కార్ల్ మార్క్స్ (3) రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్ అనే మూడు గ్రంథాలను పూర్తి చేశారని సాధారణంగా డా॥ అంబేద్కర్ అనుయాయులు విశ్వసిస్తున్నారు. "రిడిల్స్ ఆఫ్ హిందూయిజం" వ్రాతప్రతులు వేరే ఒక ఫైలులో కట్టకట్టి ఉన్నాయి. వీటిలో డా॥ అంబేద్కర్ చేతితో స్వయంగా చేసిన కొట్టివేతలు, చెరిపివేతలు, మార్పులు మొదలైనవి ఉన్నాయి. అదృష్టవశాత్తు ఈ పుస్తకానికి డా॥ అంబేద్కర్ రాసిన ఉపోద్ఘాతం కూడా లభ్యంగా ఉన్నది. అయినప్పటికి, ఈ సంపుటం తుది ప్రతి లభ్యం కాలేదని చెప్పటానికి విచారిస్తున్నాం. ఈ పుస్తకానికి ఉపోద్ఘాతంలో డా॥ అంబేద్కర్ పెట్టిన "రిడిల్స్ ఇన్ హిందూయిజం" అనే పేరును కమిటీ అంగీకరించింది.

"ది బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" పుస్తకం కూడా డా॥ అంబేద్కర్ పూర్తి చేసినట్టు చెపుతారు. కాని వ్రాతప్రతులలో ఆ పుస్తకం మాకు దొరకలేదు. అయితే "గౌతమ ది బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" (ఏ క్రిటిక్ అండ్ కంపేరిటివ్ స్టడీ ఆఫ్ దెయిర్ సిస్టమ్స్ ఆఫ్ ఫిలాసఫి) అనే పేరు మీద లూక్ (Leuke) రాసిన పుస్తకం (విజయ పబ్లిషింగ్ హౌస్, కొలంబో - ప్రచురణ సంవత్సరం పేర్కొనలేదు) టైపు ప్రతి ఒకటి అందులో ఉన్నది. అయితే "బుద్ధ ఆర్ కార్ల్ మార్క్స్" అనే పేరు మీద డా॥ అంబేద్కర్ రాసిన 34 పేజీల చిన్న వ్యాసం ఒకటి దొరికింది. దానిని మూడో సంపుటిలో చేర్చాం. "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్" అనే పుస్తకాన్ని కూడా డా॥ అంబేద్కర్ పూర్తి చేశారనే విశ్వాసం ఉన్నది. కమిటీ వారికి అందిన పత్రాలలో ఈ గ్రంథానికి ఆయన తయారు చేసి ముద్రించుకున్న పథకం మాత్రం దొరికింది. ఒకేసారి అనేక అధ్యాయాలు రాయటం డా॥ అంబేద్కర్ మొదలుపెట్టి ఉంటారు. పెట్టెలలో చెల్లాచెదరయిన పుటలు చాలా దొరికాయి. వాటిని ఒకచోటికి చేర్చటం జరిగింది.

ఒక పుస్తకం రాయటానికి డాక్టర్ అంబేద్కర్ ఎంత గొప్ప మహత్తరమైన కృషి చేస్తారో పాఠకులకు తెలియజేయటానికి డా॥ అంబేద్కర్ అసలు పుస్తకం రాసే విధానం అంతా తెలియ జేయాలనే కోరిక మాకు కలిగింది. ఆయనకు తనదంటూ ఒక క్రమశిక్షణ ఉండేది. గ్రంథ

రచనకు ఉపక్రమించే ముందు మొత్తం పుస్తకంలో ఏమేమి ఉండాలో, ఎలా ఉండాలో తయారు చేసుకొని ఉంచుకొనేవారు. ఆయనే సిద్ధం చేసుకున్నట్టి, అటువంటి పథకాలు సంపాదకమండలికి దొరికాయి. అవి : "ఇండియా అండ్ కమ్యూనిజం", "రిడిల్స్ ఇన్ హిందూయిజం", "కెన్ ఐ బి ఎ హిందూ?", "రివల్యూషన్ అండ్ కౌంటర్ రివల్యూషన్", "వాట్ బ్రాహ్మిణ్స్ హేవ్ డన్ టు అన్‌టచబుల్స్", "ఎస్సెన్స్ ఆన్ భగవద్గీత", "బుద్ధా అండ్ కార్ల్‌మార్క్స్" మొదలైనవి. కాని ఇందులో కొన్ని అసలు మొదలు పెట్టనే లేదు. మొదలు పెట్టినవి పూర్తి చేయనూ లేదు. ఒక ఉదాహరణ చెప్పటం చాలా ఆసక్తికరంగా ఉంటుంది. డా॥ అంబేడ్కర్ "ఇండియా అండ్ కమ్యూనిజం" అనే పుస్తకానికి మొత్తం వివరాలు, పథకం రూపొందించుకున్నారు. వివరాలు ఇలా ఉన్నాయి :

| | | |
|---|---|---|
| **మొదటి భాగం** | - | ది ప్రి రిక్విజిట్స్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 1 | - | ది బర్త్ ప్లేస్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 2 | - | కమ్యూనిజం అండ్ డెమోక్రసీ |
| అధ్యాయం 3 | - | కమ్యూనిజం అండ్ సోషల్ ఆర్డర్ |
| **రెండో భాగం** | - | ఇండియా అండ్ ది ప్రి రిక్విజిట్స్ ఆఫ్ కమ్యూనిజం |
| అధ్యాయం 4 | - | ది హిందూ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 5 | - | ది బేసిస్ ఆఫ్ ది హిందూ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 6 | - | ఇంపెడిమెంట్స్ టు కమ్యూనిజం ఎరైజింగ్ ఫ్రమ్ ది సోషల్ ఆర్డర్ |
| **మూడో భాగం** | - | వాట్ దెన్ షల్ ఉయ్ డు? |
| అధ్యాయం 1 | - | మార్క్స్ అండ్ ది యూరోపియన్ సోషల్ ఆర్డర్ |
| అధ్యాయం 2 | - | మను అండ్ ది హిందూ సోషల్ ఆర్డర్ |

ఈ పథకంలో నాలుగు, అయిదు అధ్యాయాలను మాత్రం అంటే "ది హిందూ సోషల్ ఆర్డర్", "ది బేసిస్ ఆఫ్ ది హిందూ సోషల్ ఆర్డర్" అనే రెండింటిని మాత్రం డా॥ అంబేడ్కర్ పూర్తి చేశారు. మూడో భాగంలో ఇంకో రెండు అంశాల గురించి రాయాలని ఆయనకు అనిపించినప్పుడు ఆ రెండు అంశాలను ఆయన స్వయంగా రాసి టైపు చేసిన పేజీలో చేర్చారు. టైపు చేసి చక్కగా కట్టిపెట్టిన ఫైలులో, "కెన్ ఐ బి ఎ హిందూ?" అనే శీర్షికతో ఆయన పెన్సిలుతో సంతకం చేసి పెట్టుకున్న ఒక పుట కనిపించింది. తర్వాత పుటలో రాసి ఉన్న విషయ క్రమపట్టిక ఇలా ఉన్నది.

ఉపోద్ఘాతం
సింబల్స్ ఆఫ్ హిందూయిజం
**మొదటి భాగం** - కులం

రెండో భాగం - కల్ట్ - వర్షిప్ ఆఫ్ డెయిటీస్
మూడో భాగం - సూపర్ మ్యాన్

మూడో పుటలో అంశాల ఉప శీర్షికలు ఇలా ఉన్నాయి :

1. సింబల్స్ రిప్రజంట్ ది సోల్ ఆఫ్ ఎ థింగ్
2. సింబల్స్ ఆఫ్ క్రిస్టియానిటీ
3. సింబల్స్ ఆఫ్ ఇస్లామ్
4. సింబల్స్ ఆఫ్ జైనిజం
5. సింబల్స్ ఆఫ్ బుద్ధిజం
6. సింబల్స్ ఆఫ్ హిందూయిజం
7. వాట్ ఆర్ ది సింబల్స్ ఆఫ్ హిందూయిజం ?

మూడు

1. కేస్ట్
2. కల్ట్
   1) రామా
   2) కృష్ణా
   3) శివ
   4) విష్ణు
   5) సర్వీస్ ఆఫ్ సూపర్‌మ్యాన్

పై విధంగా రూపొందించిన పథకంలో "సింబల్స్ ఆఫ్ హిందూయిజం" అధ్యాయం తప్ప మిగిలినవి అసంపూర్ణంగా మిగిలిపోయాయి.

'బహుశా) "రిడిల్స్ ఇన్ హిందూయిజం" అనే సంపుటి కోసం ఉద్దేశించిన "రిడిల్స్ ఆఫ్ రామా అండ్ కృష్ణా" అనే అధ్యాయం, సంపాదక వర్గానికి దొరికింది. మొదటి పథకంలో అనుకున్న 24-రిడిల్స్-(చిక్కుముడులు) తరచూ పథకం నిర్మాణంలో మారుతూ ఉండేవి. విషయానుక్రమణిక, అధ్యాయాలు, ఫైలు కూర్పు పొసిగేది కాదు. పుస్తకం విషయసూచికలో రాముడు కృష్ణుని మీది అధ్యాయం చోటు చేసుకోలేదు. అయినప్పటికీ రిడిల్స్ ఉన్న సంపుటిలో దీనిని మేము చేర్చుతున్నాం.

డా॥ అంబేడ్కర్ రచనలలో ఇంతవరకూ ప్రచురితం కాని వాటిని సక్రమమైన రీతిలో ముద్రించి సాధారణ జనావళికీ, ఆసక్తిగల పండితులకూ అందుబాటులోకి తెచ్చినపుడు, మేము అందుకై పడిన శ్రమ, వెచ్చించిన కాలమూ వృథాగా పోవనే విశ్వాసం మాకు ఉన్నది.

డా॥ అంబేడ్కర్ సంపూర్ణ రచనలను ముద్రించటానికి ప్రభుత్వానికి అనుమతి ఇచ్చినందుకు శ్రీమతి సవిత అంబేడ్కర్, శ్రీ ప్రకాష్ అంబేడ్కర్ గార్లకూ, వారి కుటుంబ

సభ్యులకూ మేము కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం. అడ్మినిస్ట్రేటర్ జనరల్, డా॥ అంబేడ్కర్స్ ఎస్టేట్ కస్టోడియనూ అయిన శ్రీ వై.ఐ. దేశాయ్ ప్రభుత్వానికి వ్రాతప్రతులను అందజేసినందుకు అభినందనీయుడు. అలాగే కమిటీతో సహకరించినందుకు అడ్వొకేట్ శ్రీ జె.బి. లాన్స్డ్ కూడా అభినందనీయుడే. ఆరోగ్యం సరిగా లేకపోయినా సమయాన్ని శ్రమను వెచ్చించి సలహాలు ఇచ్చినందుకు కీర్తిశేషులు శ్రీ ఎం.బి. చిట్నిస్‌గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

వ్రాతప్రతులు అన్నింటినీ ముద్రించటానికి నిర్ణయం తీసుకున్నందుకు మహారాష్ట్ర ముఖ్యమంత్రి, గౌరవనీయులు, శ్రీ శంకర్‌రావు చవాన్, విద్యాశాఖామంత్రి ప్రొఫెసర్ రామ్‌మేఘే, విద్యాశాఖ సహాయమంత్రి కుమారి చంద్రికా కేనియాలకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. ఎంతో చొరవ తీసుకొని, సలహాలు అందిస్తూ కమిటీ సమస్యలను పరిష్కరించటంలో అమూల్యమైన ప్రయత్నాలు చేసిన కమిటీ ఉపాధ్యక్షులు ఎం.ఎల్.సి. శ్రీ ఆర్.ఎస్. గవాయ్‌కు ధన్యవాదాలు తెలియజేస్తున్నాం. మహారాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ మధుసూదన్ కొల్హాట్‌కర్‌కు వారి అమూల్యమైన సలహాలకు ధన్యవాదాలు. విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ ఆర్.ఎస్. జంభూలే, జాయింట్ డైరెక్టర్ శ్రీ ఎస్.ఏ. దేవ్‌కర్, అసిస్టెంట్ సెక్రటరీ శ్రీ జె.బి. కుల్‌కర్ణి, డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎం.ఎం. అవాతే, సూపరింటెండెంట్ శ్రీ ఎం. మేశ్రాం గార్లకు, ప్రచురణ కార్యక్రమంలో అత్యంత శ్రద్ధాసక్తులు కనపరిచిన విద్యాశాఖ ఉద్యోగులందరికీ ధన్యవాదాలు.

కమిటీ సభ్యులైన డా॥ పి.టి. బొరాలే, శ్రీ ఎస్.ఎస్. రెగే, డా॥ బి.డి. ఫాడ్కే, శ్రీ దయా పవార్‌లు ఎన్నోసార్లు సమావేశమై ఈ సంపుటం సంపాదకత్వంలో అమూల్యమైన సలహాలు అందించినందుకు ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉన్నది. వారి సహాయానికి ప్రగాఢమైన అభినందనలు తెలియజేస్తున్నాం.

కమిటీ సభ్యులైన శ్రీ ఎస్.ఎస్. రెగే తన వద్ద ఎన్నో ఏళ్లుగా ఉండిపోయిన డా॥ అంబేడ్కర్ 14 వ్యాసాలను మాకు దయతో అందజేశారు. ఈ మూడు సంపుటాలలో కూర్చిన విషయాలకు ఆ వ్యాసాలు వన్నె తెచ్చాయి. వారి దయకు కమిటీ సభ్యులు ఎంతో రుణపడి ఉన్నారు.

ముద్రణ పనిని ఎంతో జాగ్రత్తతోనూ, చిత్తశుద్ధితోనూ నిర్వహించిన ముద్రణాశాఖ డైరెక్టర్ శ్రీ జి.డి. ధోండ్, మేనేజర్లు శ్రీ పి.ఎస్. మోరే, శ్రీ పూర్కార్, డిప్యూటీ మేనేజర్ శ్రీ ఆర్.జె. మహాటేకర్, ఆపరేటర్ ఫిల్మ్ సెట్టర్ శ్రీ జె.ఎస్. నగ్వేకర్ గారలు, ప్రింటింగ్ అండ్ స్టేషనరీ శాఖ సిబ్బంది అందరూ అభినందనీయులు.

సంపాదకులు
డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ సోర్స్
మెటీరియల్ పబ్లికేషన్ కమిటీ
మహారాష్ట్ర

బొంబాయి,
2 అక్టోబరు, 1987

అనువాదం : బొజ్జా తారకం

# విషయసూచిక

# మొదటి భాగం

## హిందూమతం – తాత్వికత

దూమతం – తాత్వికత" అనే వ్యాసం రాతప్రతి చక్కగా బైండు లభించింది. దానికది సమగ్రమైన వ్యాసం. ఈ అధ్యాయమంతా యారు చేసుకున్న బృహత్ ప్రణాళికలో ఒక భాగం. మూలప్రతి 169 పేజీల టైప్‌చేసిన వ్యాసం – సంపాదకులు)

## అధ్యాయం-1

# హిందూమతం-తాత్వికత

## I

హిందూమత తాత్వికత ఏమిటి? దాని తార్కిక క్రమంలో పుట్టే ఓ ముఖ్యమైన ప్రశ్న ఇది. దాని తార్కిక క్రమాన్ని అలా వుంచినా, మన పరిగణనలోనుంచి తొలగించటానికి వీలు లేనంతటి ముఖ్యమైన విషయం ఇది. ఇది తెలియకుండా హిందూమత లక్ష్యాలు, ఆదర్శాలు అర్థం చేసుకోవటం ఎవరికీ సాధ్యం కాదు.

ఈ విధమైన పరిశీలన-ముందుగా అందుకు సంబంధించిన నిర్దిష్టమైన కొన్ని పరిభాషల నిర్వచనాలు; విషయానికి సంబంధించిన నేపథ్యం తెలియకుండా చేయలేమనేది స్పష్టంగా గ్రహించవలసిన అంశం.

మొట్టమొదట అసలు ఈ ప్రతిపాదిత శీర్షికవల్ల మనకు అర్థమవుతున్నదేమిటి? హిందూమత తాత్వికత అనే ఈ శీర్షిక 'మత తాత్వికత' అనే దానితో పోల్చి చూస్తే సమానమైన స్వభావం కలిగినటువంటిదేనా? ఈ విషయంలో అవుననో కాదనో ఖచ్చితంగా నిలబడాలని నాకుంది. కానీ వాస్తవానికి అది నాకు సాధ్యం కాలేదు! నేను ఈ అంశం మీద ఎంతో విషయాన్ని చదివాను-అయినా మతతాత్వికత అంటే ఏమిటో స్పష్టమైన భావన ఒకటి ఇంకా ఏర్పడలేదని నేను అంగీకరిస్తున్నాను. బహుశా ఇది రెండు వాస్తవాల వల్ల కావచ్చు. మొదటిది--మతం అనేది ఖచ్చితంగా నిర్ధారితమైతే-ఇక తత్వం అనే దాంట్లో చేర్చవలసినదేమీ మిగలదు.[1] రెండవది-తత్వం, మతం విరుద్ధమైనవిగా భావిస్తున్నారు కొందరు. వాస్తవంగా తత్వవేత్త, వేదాంతి, వ్యతిరేకులు కారనీ వారికి సంబంధించిన ఈ కథ వల్ల తెలుస్తోంది. ఒకప్పుడు ఒక తత్వవేత్త, వేదాంతి వివాదంలో పడ్డారు "చీకటి గదిలో అక్కడ లేని నల్ల పిల్లి కోసం వెతుకులాడే అంధుని వంటివాడు తాత్వకుడు" అని వేదాంతి ఆరోపించాడు. దానికి సమాధానంగా "చీకటి గదిలో అక్కడలేని నల్లపిల్లికోసం వెతుకులాడటమే కాకుండా, నేను చూచాను అని ప్రకటించే అంధుని వంటివాడు వేదాంతి" అన్నాడు తాత్వికుడు. దాని వాస్తవ నిర్వచన క్షేత్ర పరిధిననుసరించి-అత్యధిక సందిగ్ధతకు కారణమయ్యేటటువంటి 'మతతత్వం' అనే శీర్షికను స్వీకరించటానికి బహుశా ఇంచుమించు దగ్గరగా ఉన్న విశదమైన అభిప్రాయం నేను ప్రొఫెసర్ ప్రింగిల్-పాటిజన్ పరిశీలనలో చూశాను.[2]

అదేమిటంటే?

మాటలు ముందుగా చెప్పుకోవటం ఉపయోగకరమే! తత్వం అనేది విషయాలకు సంబంధించిన సమగ్రమయిన దృష్టిగా చాలా కాలం క్రితమే ప్లేటో వివరించాడు. ఖచ్చితంగా చెప్పాలంటే విషయాలను సమష్టిగా చూడటానికి ఇది ఒక ప్రయత్నం. సమస్త ప్రాపంచిక లక్షణాల్ని దృష్టిలో పెట్టుకుని–ఒక విషయంలోని అనేక భాగాలు ఒకదానితో మరొకటి ఏవిధంగా పరస్పరం సంబంధం కలిగి ఉన్నాయో అవగాహన చేసుకోవటం. ఈ విధంగా మాత్రమే మనం ఆయా అంశాల మధ్య ఒక సమన్వయ దృష్టిని సాధించుకోగలం. అంతేకాదు ప్రపంచ విధానం, ప్రపంచ నేపథ్యం, స్వభావానికి సంబంధించి అంతిమ నిర్ణయాలు చేయటానికి ఏదేని ప్రత్యేక శ్రేణిలోని వాస్తవాల ప్రాముఖ్యాన్ని సరిగా అంచనా వేయగలం. దీనినిబట్టి మతతత్వమైనా, కళాతత్వమైనా, న్యాయ(శాస్త్ర) తత్వమైనా–మొత్తం మీద అనుభవానికి సంబంధించిన ఏ ప్రత్యేకమైన శాఖ యొక్క తత్వమైనా–మనిషి మీద, అతను జీవించిన ప్రపంచం మీద ఆ అనుభవం ప్రసరింపచేసే ప్రభావాన్ని విశ్లేషణాత్మకంగానూ, వివరణాత్మకంగానూ ప్రదర్శించటమనేది స్పష్టం. ఇంకా ఎప్పుడైతే మనం కేంద్రీకరించిన వాస్తవాలు విశ్వజనీనాలవుతాయో, వాటి స్వభావం దృష్ట్యా గుర్తించదగినవి అవుతాయో, మతం తాలూకు, చరిత్ర మూలంగా బహిరంగపరచబడినవేవో, మనిషి మత సంబంధమైన అనుభవాల తత్వం–మన సామాన్య తాత్విక నిర్ణయాలపై నిర్ధారితమైన ప్రభావాన్ని చూపినవే తప్ప మరేమీ కాదు. నిజానికి చాలామంది రచయితలు ఈ ప్రత్యేకమైన చర్చను చాలా సామాన్యమైన అంశంలో బలవంతంగా కలిపేశారు.

మతతాత్వికత వ్యవహరించవలసి వచ్చే వాస్తవాలు మతచరిత్ర (ఆ మాటకు సర్వసమ గ్రమైన అర్థంలోనే) నుంచే సరఫరా అవుతాయి. 'టీలే' పేర్కొన్నట్లు "ప్రపంచంలోని నాగరక, అనాగరక సమాజాల్లోని–మతాలన్నీ అవి నేడు ఉన్నా లేకున్నా–ఏ విధంగా చూచినప్పటికీ అవన్నీ ఒకానొక మానసిక లేక చారిత్రక ప్రవృత్తుల భిన్నరూపాలు అనేది ప్రత్యక్ష వాస్తవం. ఈ వాస్త వాలే మతతాత్వికతకు సంబంధించిన సమాచార సంపుటి. వాటంతట అవి తత్వాన్ని లేక 'టీలే' ఉపయోగించిన మతం తాలూకు "శాస్త్రాన్ని" నిరూపించలేదు. ఇప్పుడున్న మతాలన్నింటి గురించి చాలా సూక్ష్మంగా విచారించినట్లయితే–వాటి సిద్ధాంతాలు, ఇతిహాసాలు, ఆచారాలు, అవి రూపొందించే అనుష్ఠాన పద్ధతులు, వాటిననుసరించి వున్న విషయాల నిర్వహణం, ఆయా మతాల పుట్టుక, వికాసం, శిథిలాల ఆనవాళ్ళు మొదలైనవన్నీ నేను వివిధ మతశాస్త్ర గ్రంథాల నుంచి సేకరించినవే! చారిత్రక లిఖిత ప్రమాణాలు ఎంత సమగ్రమైనవైనప్పటికీ–అవి సరిపోయేటంతటివి మాత్రం కాదు. శుద్ధ చరిత్ర తత్వశాస్త్రం కాదు. మతతత్వాన్ని సమగ్రంగా సాధించాలంటే–లభిస్తున్న ప్రత్యక్ష ప్రమాణాల నుంచి మనం మానవ స్వభావంలోనే మౌలికంగా గుర్తించగలిగిన కొన్ని సామాన్య సూత్రాల్ని కనుక్కోగలగాలి. ఆ సూత్రాలతో కింది స్థాయి నుండి ఉన్నత స్థాయికి–ఆపైన సమగ్ర స్థాయికి వికసించిన దశలలోని పరిణామాల జాడల్ని పట్టవచ్చు. అంతేకాదు మానవ నాగరికతలలో ఇతర ప్రధానమైన అంశాలతో వాటికున్న గాఢమైన సంబంధాన్ని గుర్తించవచ్చు."

ఇదే గనుక మతం తత్వమైతే–మతం తాలూకు అనేక ప్రత్యక్ష అంశాల్నుండి ఒక సామాన్య సూత్రాన్ని కనుక్కునే అదనపు లక్ష్యంతో కూడిన తులనాత్మక మతం (కంపారిటివ్ రెలిజియన్)

అనే ప్రత్యేక శాఖకున్న భిన్నమైన (వేరొక) పేరుగా కేవలం ఇది నాకు కన్పిస్తున్నది. అటువంటి పరిశీలన పరిధి, విలువ ఏమైనప్పటికీ ప్రొఫెసర్ ప్రింగల్-పాటిజన్ మతం తాలూకు తత్వం అనేదాన్ని ఏ అర్థంలో, ఏ ఉద్దేశ్యంలో వాడాడో దానికి విరుద్ధమైన అర్థం, ఉద్దేశంలోనే నేను వాడుతున్నాను. నేను తత్వం అనే పదాన్ని దానికున్న రెండు రకాలైన అర్థాల్లో ఉపయోగిస్తున్నాను. సోక్రటీస్ (ప్రతిపాదించిన) తత్వం, ప్లేటో (ప్రతిపాదించిన) తత్వం అని ప్రజలన్నపుడు-అక్కడ తత్వమనే పదానికి ఉపదేశమనే అర్థం. ఇక రెండో అర్థంలో-తత్వమంటే-విషయాల మీద, సంఘటనల మీద నిర్ణయాలను-తీర్పులను ప్రకటించేటప్పుడు ఉపయోగించే విమర్శనాత్మక హేతువు. ఈ రెండవ అర్థం పునాది మీద ఆధారపడి మతం తాలూకు తత్వం అంటే నా ఉద్దేశంలో అది కేవలం వర్ణనాత్మకమైన శాస్త్రం కాదు. నేను దాన్ని అటు వర్ణనాత్మకంగాను, ఇటు ప్రమాణాత్మక శాస్త్రంగాను రెండు విధాలుగా గుర్తిస్తున్నాను. మతానికి సంబంధించిన బోధనలు గురించి ప్రస్తావించేటప్పుడు-మతం తాలూకు తత్వం అనేది-వర్ణనాత్మక శాస్త్రమే. ఆ ఉపదేశాల (బోధనల) మీద నిర్ణయాత్మకమైన తీర్పులను చేసేటప్పుడు అది (ఉపయోగించుకునే) అనుసంధానించుకునే విమర్శనాత్మక హేతువుల కారణంగా అది ప్రమాణాత్మక శాస్త్రం అనబడుతోంది. దీనివల్ల హిందూ మతతత్వం అనే దాని పరిశీలనలో నేను దేనికి ప్రాధాన్యతనిస్తానో స్పష్టమవుతోంది కదా! స్పష్టంగా చెప్పాలంటే నేను-హిందూ మతాన్ని-అది జీవిత మార్గంలో ఎంతవరకూ విలువైందో-నిర్ధారించటానికి విచారణలో పెడుతున్నాను.

ఇక్కడ ఒక అంశానికి సంబంధించిన విషయం తేటతెల్లమైంది. ఇంకా విశదం కావలసిన భాగం మరొకటి ఉంది. అది సంబంధిత వాస్తవాల నిర్ధారణను, నేను ఉపయోగించబోయే పారిభాషిక పదాలను నిర్వచనాలను కలిగి ఉంటుంది.

మతం తాలూకు తత్వపు పరిశీలన అనేది మూడు దృక్కోణాల నిర్ధారణలతో కూడి వటువంటిదని నాకు తోస్తోంది. నేను వీటిని ప్రత్యేకించి దృక్కోణాలు అని ఎందుకంటున్నానంటే సిద్ధమైన వస్తువులో విక్షిప్తమైన అజ్ఞాత పరిణామాలతో పోలి ఉండటం వల్లనే మతం యొక్క తత్వానికి సంబంధించిన నిర్ధారణ విజయవంతం కావాలంటే ఈ దృక్కోణాలను నిర్వచించి నిర్ధారించుకోవలసిన అవసరం ఎవరికైనా ఉంది.

ఈ మూడు దృక్కోణాలలో మతం మొదటిది. అందువలన మతంతో ఇతర అంశాల పరిశీలనా సమయంలో తలెత్తే వాదోపవాదాలను నివారించుకోటానికి అసలు మతం అంటే అర్థం చేసుకున్నదేమిటో ముందుగా ఎవరైనా నిర్వచించుకోవలసిన అవసరం ఉంది. మతం అనేదానికి అందరూ అంగీకరించిన నిర్వచనం ఒకటి స్పష్టంగా ఇంతవరకు లేదు. కాబట్టి, మత విషయంలో నిర్వచనం అనేది అవసరమైన విషయమే! ఈ సమస్య మీద విశాలమైన ప్రాతిపదికలో వ్యవహరించే అవకాశం లేదు. అందువల్ల మతానికి సంబంధించిన చర్చలో, ఆ మాటను నా అంతట నేనుగా భావించిన ఒకానొక సంతృప్తికరమైన అర్థంలో ప్రయోగిస్తున్నాను.

నేను వేదాంతం అనే అర్థంలో మతం అనే పదాన్ని వాడుతున్నాను. ఇది బహుశా నిర్వచన పరిధిలో సమర్థమైనది కాకపోవచ్చు. ఎందుకంటే వేదాంతం అనేక రకాలుగా ఉన్న టువంటిది. వాటిల్లో నేను దేన్ని నిర్దేశిస్తున్నానో అది ప్రత్యేకించి చెబుతున్నాను. చారిత్రకంగా చూస్తే ప్రాచీన కాలం నుంచీ రెండు రకాలైన వేదాంత దృక్పథాలు ఉన్నాయి. అవి పౌరాణిక వేదాంతం, సాంఘిక (CIVIL) వేదాంతం అనేవి. వీటిని వేర్పరచిన గ్రీకులు ఈ రెండింటికి వేర్వేరు విషయాలను కేటాయించారు. పౌరాణిక వేదాంతమంటే వాళ్ళ దృష్టిలో–దేవుళ్ళకు సంబంధించిన గాథలు, వారి ప్రవర్తనలు, లేక ప్రస్తుత కాల్పనిక సాహిత్యంలో ఆ విషయాలు ప్రసక్తమైన అంశాలు. సాంఘిక వేదాంతమంటే (వాళ్ళ దృష్టిలో) వివిధ దేశీయాలైన విందులు, ఉపదేశాలు వీటికి సంబంధించిన సంపూర్ణజ్ఞానం, ఇంకా కర్మకాండలకు సంబంధించిన సముచితమైన విషయాలు అని అర్థం, వేదాంతమనే పదానికున్న ఈ రెండు రకాలైన అర్థాల్లో ఏ అర్థంలోనూ నేను దాన్ని వాడటం లేదు. నా ఉద్దేశంలో వేదాంతమంటే సహజ వేదాంతశాస్త్రమనే (NATURAL THEOLOGY)[3] సహజ సిద్ధాంతంలో ఒక భాగమైన దేవుడు, ఆ దేవుడికి సంబంధించిన సిద్ధాంతం అనే అర్థంలో ఈ పదాన్ని వాడుతున్నాను. సాంప్రదాయకంగా అర్థం చేసుకున్నంత మేరకు సహజ వేదాంతం మూడు సిద్ధాంతాల్ని ప్రతిపాదిస్తోంది. అవి (1) దేవుడున్నాడు. అతడు మనం దేన్నైతే విశ్వం లేక ప్రకృతి అని పిలుస్తున్నామో దానికి కర్త. (2) అతడు ఈ ప్రకృతి ఏర్పడటానికి కారణమైన సమస్త సంఘటనలను నియంత్రిస్తూ వాటి మీద అధికారం కలిగినవాడు. (3) భగవంతుడు తన సార్వభౌమాధికార సంబంధమైన నైతిక శాసనాలతో మానవ జాతి మీద అధికారం చెలాయిస్తాడు.

ఇదేకాక "బహిర్గత వేదాంతం" (REVEALED THEOLOGY) అనే పేరుగల మరొక వేదాంతశాస్త్రం కూడా ఉన్నదని నాకు తెలుసు. ఇది దైవిక వాస్తవాన్ని అప్రయత్నంగా వెల్లడిచేస్తూ సహజ వేదాంత శాస్త్రం కంటే ప్రత్యేకత కలిగిఉంది. కానీ ఈ ప్రత్యేకత–ప్రత్యేకంగా గుర్తించదగిందికాదు.[4] అది సహజ వేదాంత శాస్త్రం ప్రతిపాదించిన ఫలితాన్ని ఏవిధమైన మార్పు లేకుండా యధాతధంగా ఆమోదించి స్వీకరించడం కావచ్చు. లేక ఏరకమైన ఆసరాలేని మానవ ప్రయత్నం సాధించుకున్న అదనపు జ్ఞానాన్ని కేవలం ఆ సహజ వేదాంతశాస్త్రానికి జోడించడం కావచ్చు లేక ఇది "వాస్తవ ప్రకటనం యొక్క వెలుగులో (జ్ఞానంలో) సహజ వేదాంతానికి సంబంధించిన అన్ని వాస్తవాలు విశాలమైన, గంభీరమైన అర్థంతో సహజ వేదాంతంగా రూపాంతరం చెందటం కావచ్చు" అని పేర్కొనడం జరిగింది. అసలైన సహజ వేదాంతశాస్త్రం, సిసలైన బహిర్గత వేదాంతశాస్త్రం అనేవి పరస్పరం వ్యతిరేకాలుగా నిలుస్తున్నా– ఆ అసలు సిసలత– నిర్ధారణ సాధ్యం కానివి కాబట్టి సురక్షితంగా వాటి వ్యతిరేకతను మినహాయించవచ్చు.

1. భగవంతుని అస్తిత్వం 2. విశ్వంమీద భగవంతుని ఆధిపత్యం 3. మానవాళిమీద భగవంతుని నైతికశాసనాధిపత్యం అనే మూడు సిద్ధాంతాలను (వాదాలను) పరిగణనలోనికి తీసుకొని నేను మతం అనేదానిని– మానవులు నైతిక క్రమంలో జీవించే సాంఘిక వ్యవస్థ లక్ష్యంగా కలిగినటువంటి దైవిక ఆధిపత్యం తాలూకు ఆదర్శవంతమైన ప్రణాళికను ప్రతిపాదిం

చేటటువంటిదని నేను భావిస్తున్నాను. మతం అనేదాన్ని నేను అర్థం చేసుకున్న విధానం ఇది. ఈ చర్చలో మతం అనే పదాన్ని నేను ఈ అర్థంలోనే వాడుతున్నాను.

మతం అనే దానికి సంబంధించిన ఆదర్శ ప్రణాళికను స్వీకరించేది-రెండవదృక్కోణం. ఏ సంఘానికి సంబంధించిన మతంలోనైనా నిర్ధారితమైన, స్థిరమైన, ప్రబలమైన అంశాలన్నీ నిరూపించటం, అనవసరమైన లక్షణాలనుంచి అవసర లక్షణాలను వేరుచేయడం అనేది ఎంతో కష్టమైన విషయం. సంభావ్యమైన సమస్త అంశాల్నిబట్టి ఆవిధమైన క్లిష్టతకు కారణం ప్రొఫెసర్ రాబర్ట్సన్ స్మిత్ చెప్పినట్లుగా ఇది[5] "అనేక శతాబ్దాల కాలగమనంలో మతం తాలూకు సాంప్రదాయకమైన వాడుకలు క్రమబద్ధంగా వికసించాయి. ఈ వికాసం మానవుల ఆలోచనలకు, అలవాట్లకు ప్రతిబింబమైన వారి మానసిక, నైతిక అభివృద్ధిరూపమైన వివిధ దశల ప్రత్యేక లక్షణం. దేవతల లక్షణాలకు సంబంధించిన ఏ భావన అయినా బహుశా- సంస్కృతిలోని ప్రతిదశలోనూ శుద్ధ అనాగరికమైన దానినుండి అభివృద్ధి చెందునటువంటి ప్రాచీనుల పరంపరలనుండి ఏవైతే పారంపర్యంగా, తదనంతరం పూర్వ్యారాధనాన్ని గ్రహిస్తుందో- అది అన్ని అంశాలతోకూడిన వివిధ జటిలమైన కర్మకాండలకు, ఆచారవ్యవహారాలకు సంబంధించిన సమస్త భాగాల్ని భరించగలిగి ఉంటుంది. భూమి ఉపరితలం ఏవిధంగా అయితే ఒక పొరమీద మరొకపొర లేదా కొత్త పాత పొరలు పక్కపక్కన సంరక్షితాలవటం వలన భూమి చరిత్ర ఏర్పడిందో- అదేవిధంగా మత సంస్థలలో విలీనమైనటువంటిదైన మానజాతి మత సంబంధమైన ఆలోచన కూడా వివిధ పొరలతో కూడిన చరిత్ర కలిగినటువంటిదే!

భారతదేశంలో కూడా ఇదే జరిగింది. భారతదేశంలో మతం అభివృద్ధి చెందిన క్రమం గురించి చెబుతూ మాక్స్‌ముల్లర్ అన్నమాటలివి:

"అతి నిరాడంబరమైన శైశవ ప్రార్థనల దశల నుంచి, అత్యంత ఉన్నతమయిన అధిభౌతిక వైరాగ్య దశకి-మతం క్రమంగా ఎదిగిన వైనాన్ని మనం చూడవచ్చు. అధిక సంఖ్యాకమైన వేద ఋక్కుల్లో మనం శైశవదశను గుర్తించవచ్చు. బ్రాహ్మణాలలోను-వాటి యజ్ఞ సంబంధమైన, కుటుంబ సంబంధమైన, నైతిక సంబంధమైన అనుశాసనాలలోనూ-తీరికలేని మనిషి లక్షణాన్నీ; ఉపనిషత్తులలో వైదికమత వృద్ధాప్యాన్ని (పరిపక్వతను) చూడవచ్చు" భారతీయ మేధను చారిత్రక అభివృద్ధిక్రమంలో మనం అర్థం చేసుకుంటే- పరిపక్వతచెందిన బ్రాహ్మణాల కాలానికి చేరుకున్న వెంటనే భారతీయుల శుద్ధశైశవిక ప్రార్థనల్ని తోసివేశారని తెలుస్తుంది. అంతేకాదు, ఎప్పుడైతే బలుల నిరర్థకత, ప్రాచీన దేవతల వాస్తవ స్వభావం తెలిసివచ్చిందో వాటి స్థానంలో మరింత ఉన్నతమైన ఉపనిషత్తుల మతం చొచ్చుకువచ్చింది. కాగా పై మూడు చారిత్రక కాలావధులకు సంబంధించిన భావనలు భారతజాతి బాల్యం, యౌవన వృద్ధాప్య దశకు సంబంధించినవేకావు. మతగతమైన ఈ మూడు దశలూ ప్రతివ్యక్తి తాలూకు జీవిత దశలు మూడింటికి శాశ్వతంగా వర్తించేటట్లు చేయడం జరిగింది. కేవలం ఇందుమూలంగానే పవిత్ర ధార్మిక స్మృతులు-వేదాలు మతభావనలలోని వివిధ దశలను నమోదు చేయడమే కాక, పరస్పర

వ్యతిరేకమైన సిద్ధాంతాలతో నిండి వున్నాయని మనం చెప్పగలుగుతున్నాం."

నిశ్చిత (POSITIVE) మతాల విషయంలో ఈ క్లిష్టత అంత గొప్పదేమీ కాదు. నిశ్చిత మతాల ప్రధాన లక్షణమేమిటంటే- అవి ప్రతి తరంలోనూ తమ ప్రభావాన్ని నిశ్శబ్దంగా ప్రస రింపచేసిన అచేతన శక్తుల క్రియాఫలితమైన పురాతన మతాల్లాగా అభివృద్ధి చెందినటువంటివి కావు. దైవ వాక్కు ప్రతినిధులుగా మహా మత ప్రారంభకులు చేసిన బోధనలలో ఈ నిశ్చిత మతాలు మూలాన్ని వెదుక్కుంటాయి. గుర్తిస్తాయి. పచేతనాగత స్మృతిలో వున్న సూత్రాల ఫలితంగా ఏర్పడినటువంటివి కాబట్టి నిశ్చిత మతాల తత్వాన్ని కనుక్కోవడం తేలిక. వివరించడం కూడా సులభం. జూడాయిజమ్, క్రైస్తవం, ఇస్లాంల లాగానే హిందూమతం కూడా ప్రధానంగా నిశ్చితమతం. దీని దైవిక ఆధిపత్య ప్రణాళిక గురించి వెతికే అవసరం ఎవరికీ లేదు. ఇది అలిఖిత రాజ్యాంగం వంటిది కాదు. హిందూమత దైవిక ఆధిపత్యప్రణాళిక అంతా ఒక లిఖిత రాజ్యాంగం (గ్రంథంలో)గా రూపొందింది. ఎవరైనా దానిగురించి తెలుసుకోవాలంటే అది "మనుస్మృతి"గా మనచేత పిలవబడే పవిత్రగ్రంథంలో స్పష్టమైన రూపంలో కన్పిస్తుంది. ఈ మనుస్మృతి హిందువుల మత, ఆచారవ్యవహారాలను, సాంఘిక జీవిత నియమాలను సూక్ష్మాతి సూక్ష్మంగా వివరించే పవిత్ర స్మృతి గ్రంథం. హిందూ మతతత్వాన్ని గర్భీకరించుకున్న ఈ గ్రంథం, క్రైస్తవులకు బైబిల్ ఎలాంటిదో- హిందువులకు అలాంటిది.

మతం మూడోకోణం- ఏ మతాన్ని అయితే తీసుకున్నామో[6] ఆ మతం తాలూకు దైవిక ఆధిపత్యంయొక్క ఆదర్శవంతమైన ప్రణాళిక విలువని నిర్ణయించడానికి దాన్ని గీటురాయిమీద పెట్టడం. మతాన్ని అలాంటి పరీక్షకు గురిచేయవలసిందే! అయితే ఎలాంటి గీటురాయితో దాన్ని పరీక్షించాలి? అదిగనక తేలితే అప్పుడది (మత) ఆదర్శాన్ని నిర్వచించేదవుతుంది. మతతాత్విక తకున్న మూడు కోణాల్లో ఈ మూడో కోణాన్ని నిర్ణయించడం, నిర్వచించడం అనేది ఎంతో కష్టంతో కూడిన పని.

మతతాత్వికత మీద ఎంతో విషయం రాసివున్నప్పటికీ దురదృష్టవశాత్తు ఈ ప్రశ్నవేయ టంగాని, దానిమీద ఆలోచించడంగాని జరగలేదు. ఈ సమస్యతో వ్యవహరించగల సంతృప్తికర విధానం కనుక్కోవటం జరగలేదు. అందుకే ఈ విషయాన్ని నిర్ణయించటంలో ఎవరి మార్గానికి వారిని వదిలివేయవలసిందే! అసలు ఏ ఉద్యమం తాలూకు లేక సంస్థ తాలూకు తత్వం తెలుసుకోవాలని ఎవరు అనుకున్నా, వారు ఆ ఉద్యమం లేక ఆ సంస్థలో సంభవించిన విప్లవాన్ని ముందుగా తెలుసుకోవటం మంచిదని ఈ విషయంలో నాకుగా నేను అనుకుంటున్నాను. విప్లవం అనేది తత్వానికి తల్లిలాంటిది. తల్లిలాంటిది కాకపోతే కనీసం వెలుగునిచ్చే దీపం వంటిది. మతం కూడా ఈ సూత్రానికి అతీతం ఏమీకాదు. అందువల్ల మతం తాలూకు తత్వాన్ని నిర్ణయించే గీటురాయిని ఎంచుకునే ఉత్తమ మార్గాన్ని నిశ్చయించుకోవటానికి ఆ మతంలో సంభవించిన విప్లవాల్ని అధ్యయనం చేయటం స్పష్టమైన పద్ధతి అని నాకు అనిపిస్తోంది. **నేను** చెప్పి చేయబోయే పద్ధతి ఇదే.

చరిత్రతో పరిచయం ఉన్న విద్యార్థులంతా ఒక మత విప్లవంతో పరిచయం ఉన్నవారే! ఆ విప్లవం మతస్థితికి, దాని అధికార విస్తృతికి సంబంధించినటువంటిది. మతం-మానవ జ్ఞానానికి సంబంధించిన సమస్త క్షేత్రాల్ని ఆక్రమించి; (తిరుగు లేనిదిగా చెలామణి అయిన కాలం ఒకటుంది.) అది ఖగోళ శాస్త్రాన్ని తనలో కలిపేసుకుని విశ్వానికి సంబంధించిన ఒక సిద్ధాంతాన్ని ప్రబోధించింది. దాని ప్రకారం విశ్వం మధ్య భాగంలో భూమి నిలకడగా ఉండగా, సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నిర్దిష్ట నక్షత్రాల సముదాయం అన్నీ కూడా వాటివాటి కక్ష్యలలో భూమి చుట్టూ తిరుగుతున్నాయని చెప్పింది. అది జీవశాస్త్రాన్ని, భూవిజ్ఞాన శాస్త్రాన్ని కూడా తనలో కలుపుకుని-ఈ భూమి మీద జీవుల సృష్టి హఠాత్తుగా ఒక్కసారే జరిగిందని; సృష్టి జరిగినప్పటి నుంచీ, ఆతరువాత కూడా అది అదుపులోనే ఉన్నదనీ, అది దివ్య శరీరాలను (Heavenly Bodies), అన్ని రకాల జంతువుల్ని, వృక్షాల్ని కలిగి ఉందనీ స్పష్టంగా ప్రతిపాదించింది. ఇంకా వైద్యశాస్త్రం కూడా తన పరిధిలోనిదేనని మతం వాదించింది. దాని ప్రకారం వ్యాధి అనేది తప్పుచేసిన దానికి శిక్షగా భగవంతుని పరీక్ష కావచ్చు లేకుంటే దయ్యాల (సైతాను) పనయినా కావచ్చు. ఆ వ్యాధిని సాధువుల (ఋషుల) జోక్యంతో వారిని ప్రత్యక్షంగా కలవటం ద్వారాగాని, వారి (ఆయా సాధువుల) పవిత్ర స్మారక అవశేషాలను దర్శించటం ద్వారాగానీ, ప్రార్థనల ద్వారాగానీ, తీర్థయాత్రల వలనగానీ, (దయ్యాల వలన వ్యాధి కలిగినప్పుడు) అసహ్యం కలిగించే ఆ దయ్యాల్ని (ఆ వ్యాధిగ్రస్తునిలో కనపడకుండా దాక్కున్నటు వంటివి) వదలగొట్టటానికి చదివే మంత్రాల వల్లగానీ నయం చేయవచ్చు. అంతేకాదు (జంతు) శరీర ధర్మశాస్త్రం, మనస్తత్వశాస్త్రాలు కూడా తన పరిధిలోనివేనని-శరీరం, ఆత్మ అనేవి రెండూ వేర్వేరు పదార్థాలనీ మతం వాదించింది.

ఇంతటి విశాలమైన మత సామ్రాజ్యం దశలు దశలుగా క్రమేపి నాశనం అయింది. కోపర్నికస్ సిద్ధాంత విప్లవం ఖగోళ శాస్త్రానికి-మతాధిపత్యం నుంచి స్వేచ్ఛను ప్రస్తావించింది. డార్విన్ సిద్ధాంత విప్లవం జీవశాస్త్రానికి, భూగర్భ విజ్ఞాన శాస్త్రానికి మత బంధాల్నుంచి స్వేచ్ఛ కల్పించింది. వైద్యశాస్త్రం మీద మాత్రం మత ధర్మశాస్త్రానికున్న పట్టు ఇప్పటికీ గూడా ఇంకా పూర్తిగా నాశనం కాలేదు. వైద్య సమస్యల్లో మతం జోక్యం ఇంకా కొనసాగుతూనే ఉంది. కుటుంబ నియంత్రణ, గర్భస్రావం, (లోపం గల వ్యక్తులకు చేసే) సంతాన నిరోధక శస్త్ర చికిత్స మొదలైన విషయాలకు సంబంధించిన అభిప్రాయాలపై ఇంకా మత సంబంధమైన పిడివాద ప్రభావం కొనసాగుతూనే ఉంది. మతగతమైన చిక్కు సమస్యల నుండి మనస్తత్వశాస్త్రం కూడా పూర్తిగా బయటపడలేదు. అయితే వీటన్నింటి కంటే డార్విన్ సిద్ధాంతం మతాధిపత్యం మీద కొట్టిన దెబ్బతో దాని ప్రమేయం విధ్వంసమవటమే కాదు, అది కోల్పోయిన తన సామ్రాజ్యాన్ని (మతం) తిరిగి పొందటానికి ఎలాంటి తీవ్ర ప్రయత్నం కూడా చేయలేకపోయింది.

మత సామ్రాజ్యం విధ్వంసం కావటమనేది గొప్ప విప్లవంగా పరిగణించటం చాలా సహజమైన విషయం. నాలుగు వందల సంవత్సరాలుగా మతం మీద శాస్త్రజ్ఞానం సాగించిన యుద్ధానికి ఫలితం ఇది. ఈ రెండింటి మధ్య వరుసగా జరిగిన అనేక యుద్ధాలలో శాస్త్రీయ జ్ఞానం మతాన్ని ఎంతగా అణగార్చిందంటే, దాని ప్రేరణతో ఆ విప్లవ ప్రకాశంవల్ల ప్రభావితం

కానివారు లేరన్నంతగా.

ఈ మతం (మీద వచ్చిన) విప్లవం ఒక గొప్ప దీవెన అనటంలో సందేహం లేదు. ఇది ఆలోచనా స్వేచ్ఛను స్థాపించింది. "తన మీద అధికారాన్ని తానే గ్రహించటంలోనూ, ఒకప్పుడు అంధ విశ్వాసాలకు లోనైన ప్రపంచాన్ని (వాటి నుంచి తప్పించి) తనదైన ప్రపంచాన్ని ఏర్పాటు చేసుకోవటంలోను, పూర్వం ఉన్న భయాన్ని నిర్భయంగా ఎదుర్కోవటంలోను, తన కోసం ధైర్యంగా నిలబడటంలోను, నిరాటంక క్రియావస్థను స్వతంత్రమైన ఆలోచనా క్షేత్రాన్ని కలిగించటంలోనూ"– ఈ మతం (మీద వచ్చిన) విప్లవం సంఘానికి శక్తిని ఇచ్చింది. నాగరికతా నిర్మాణంలో మత ప్రమేయం లేని పద్ధతిని శాస్త్రవేత్తలు ఆహ్వానించటమే కాదు. సాధ్యమైనంత మేరకు సంస్కృతి నుంచి మతం వేరవడం మొదలయింది. అంతేకాదు మతానుయాయులైన పురుషులు, స్త్రీలు కూడా మతధర్మశాస్త్రం ప్రబోధించిన విషయాల్ని అనవసరాలని భావించే స్థితికి రావటమే కాకుండా, అవి మత జీవనానికి ఆటంకాలు కల్పించేటటువంటివేనని, మతం తాలూకు అనాగరిక పెరుగుదల నుంచి ఈ విధమైన దారి వేసుకోవటం ఆహ్వానించదగిన పద్ధతేనని అనుకోవటం జరిగింది.

కాని మతం తాలూకు తత్వం మీద తీర్పును ఇవ్వటానికి అవసరమైన ఆదర్శం కోసం మనం మతంలో వచ్చిన ఇంకొక భిన్నమైన విప్లవం వైపు చూపు మరల్చవలసి ఉంటుంది. ఆ విప్లవం మనిషికీ మనిషికి, సంఘానికీ మనిషికి, దేవునికీ మనిషికి మధ్య వున్న సంబంధాల్ని నిర్ణయించే ప్రబలమైన సూత్రాల స్వరూపాన్ని, సారాన్ని తాకేటటువంటిది. ఆటవిక సమాజాన్ని నాగరిక సమాజంతో విభజించే వైవిధ్యాలను పరిశీలిస్తే ఆ విప్లవం ఎంత గొప్పదో అర్థమవుతుంది.

ఈ విధమైన మత విప్లవాన్ని గురించి ఒక పద్ధతి ప్రకారం పరిశీలన ఇప్పటిదాకా జరగకపోవటం విచిత్రమైన విషయం. మిగిలిన వాటికంటే ఈ విప్లవం ఎంతో గొప్పది. తీక్షణమైనది. కొద్ది మంది మాత్రమే గుర్తించినట్లుగా–ఆటవిక సమాజాన్ని నాగరిక సమాజాన్ని తీసుకుని చూస్తే మత స్వభావంలో సంపూర్ణమైన మార్పు జరిగినట్లు తెలుస్తోంది.

ఆటవిక సమాజాన్ని నాగరిక సమాజంతో పోల్చటంతో ప్రారంభిద్దాం:

ఆటవిక సమాజంలోని మతంలో రెండు అంశాలు కనిపిస్తాయి. మొదటిది–ఆచారాలు, కర్మకాండలు నిర్వహించటం, ఇంద్రజాలాన్ని అభ్యసించటం, నిషిద్ధాన్ని (టాబూ) పాటించటం, గణ చిహ్నాన్ని (టోటెమ్) ఆరాధించటం–అనే వాటికి సంబంధించింది. ఇక గమనించాల్సిన రెండో అంశం ఏమిటంటే–ఆచారాలు, కర్మకాండలు నిషిద్ధం, గణచిహ్నం, ఆరాధన మొదలైనవన్నీ ఒక ప్రత్యేక సందర్భంతో ముడిపడి స్పష్టం కావడం. ఈ సందర్భాలన్నీ ప్రధానంగా మానవ జీవిత సంక్షోభాల్ని (సంకటాల్ని) ప్రతిబింబించేవే. జననం, తొలి కానుపు, యౌవన దశను చేరుకోవటం, రజస్వల కావటం, వివాహం, రోగగ్రస్తమవటం, మరణం, యుద్ధం అనేవి సాధారణమైన

సందర్భాలు. ఇవన్నీ కూడా ఆచారాలు, కర్మకాండలు, ఇంద్రజాలాన్ని ప్రదర్శించటం, నిషిద్ధాన్ని పూజించటం కోసం నిర్దేశించిన సందర్భాలే.

మతం పుట్టుక, చరిత్ర వీటిని అభ్యసించే విద్యార్థులు–ఇంద్రజాలం, నిషిద్ధం, గణచిహ్నం వాటితో అనుబంధాన్ని పొందిన ఆచారాల్ని, కర్మకాండల్ని ప్రస్తావిస్తూ ఏ విధంగాను సంబంధం లేకుండానే వీటితో బాంధవ్యాన్ని కలిగి ఉన్న ఆయా సందర్భాల్ని భావిస్తూ మతం పుట్టుక, సారం వివరించటానికి వెతుకులాడతారు. దాని పర్యవసానంగా మనకు ఇంద్రజాలం నుంచి గాని, గణచిహ్న ఆరాధన నుంచి గాని ఉత్పన్నమయినది మతం అని వివరించే సిద్ధాంతాలూ పుట్టాయి. దీనికంటే పొరపాటు మరొకటి లేదు. ఆటవిక సమాజం ఇంద్రజాలాన్ని సాధన చేయటం, నిషిద్ధాన్ని నమ్మటం, గణచిహ్నాన్ని ఆరాధించటం వాస్తవమైన విషయమే! అయితే ఇవే మతాన్ని నిర్మించాయనికానీ, మత మూలాలకు ఆధారాలనిగానీ చెప్పడం తప్పు. ఆ ఊహని గ్రహించటం వల్ల ప్రధాన విషయ స్థాయికి అనుబంధ విషయ స్థితిని చేర్చటమే! మానవుని ఉనికికి సంబంధించిన మౌలిక సత్యాలైన జీవనం, మరణం, పుట్టుక, పెళ్ళి మొదలయినవి ఆటవిక మతంలోని ప్రధాన అంశాలు. ఇంద్రజాలం, నిషిద్ధం, గణ చిహ్నారాధన మొదలైన అంశాలు అనుబంధాలు. ఇంద్రజాలం, నిషిద్ధం, గణ చిహ్నారాధన (జడ) పూజావాదం మొదలగునవి సాధ్యాలు కావు. అవి కేవలం సాధనాలు మాత్రమే. జీవితం, జీవిత రక్షణ అనేవి సాధ్యాలు. జీవితాన్ని పదిలపరచుకోవటానికి, జీవితానికి హాని కలుగజేసే దుష్టశక్తుల ప్రభావం నుంచి రక్షించుకోవటానికి మాత్రమే ఆటవిక సమాజంలో ఇంద్రజాలం, నిషిద్ధం మొదలయినవి ఆశ్రయం పొందాయే కాని వీటికోసం అవి ఎంతమాత్రం కావు. ఈ విధంగా ఆటవిక సమాజంలో మతం జీవితానికి, జీవిత భద్రతకు సంబంధించినదని అర్థం అవుతుంది. కాగా ఈ రకమైన జీవిత విధాన క్రమణికలలో మతమూలాలు, మతసారం ఆటవిక సమాజంలో రూపుదిద్దుకున్నాయి. జీవితం, జీవితరక్షణ ఆటవిక సమాజానికి సంబంధించిన అతి గొప్ప విషయాలు. ఇవే వారి మతానికి పునాదులు. జీవితమూ, జీవిత పరిరక్షణా ఆటవిక సమాజంలో ఎంత కేంద్ర అంశాలంటే, వాటిని ప్రభావితం చేసిన ప్రతిదీ మత విషయంలో భాగమైంది. ఆటవిక సమాజానికి చెందిన ఉత్సవాలు కేవలం జననం, పురుషత్వం, యౌవన దశ, వివాహం, రోగగ్రస్తత, మరణం, యుద్ధాలకు మాత్రమే సంబంధించినవి కావు. ఆహారానికి సంబంధించినవి కూడా. గ్రామీణ ప్రజలకు గొర్రెలు, పశువుల మందలు పవిత్రమైనవి కావటానికి కారణం ఇదే. వ్యవసాయదారులలో విత్తనాలు చల్లే కాలంలోను, కోతల సమయంలోను పంటల పెరుగుదలకు, పరిరక్షణకు సూచకాలైన కొన్ని ఉత్సవాలు నిర్వహించటం గుర్తించవచ్చు. అదే విధంగా అనావృష్టి (దుర్భిక్షం) మహమ్మారి–ఇంకా ఇతర కొత్తవైన ప్రకృతి వైపరీత్యాలు, అస్తవ్యస్త పరిస్థితులు సంభవించినపుడు ఉత్సవాలు జరపటం ఆనవాయితి. కోతల సమయానికి, దుర్భిక్షానికి ఈ మత ఉత్సవాల్ని ఎందుకు జోడిస్తున్నారు? ఇంద్రజాలం, నిషిద్ధం, గణ చిహ్నారాధన వంటివి ఆటవికులకు ఎందువల్ల ప్రియమైనవి? అవన్నీ జీవిత రక్షణ క్రమంలో ప్రభావాన్ని చూపుతున్నాయి. కనుక జీవిత విధానం జీవిత పరిరక్షణ ప్రధాన ప్రయోజనాన్ని ఏర్పరచుకున్నందు వల్ల ఆటవిక సమాజంలోని మతానికి జీవితం హృదయం. జీవిత పరిరక్షణ కేంద్రం. ప్రొఫెసర్ "క్రోలే" చెప్పినట్లుగా ఆధునిక సమాజంలోని మతం జీవిత ధృవీకరణంతో ప్రారంభమై జీవిత పంరక్షణతో అంతం అవుతుంది.

జీవితంలోను, జీవిత పరిరక్షణలోను ఆటవిక సమాజ మతం ఇమిడి వుంది. ఆటవిక మతాల విషయంలో ఏదైతే వాస్తవమో, అన్ని మతాల విషయంలోనూ అదే వాస్తవం. ఎందుకంటే ఆ వాస్తవమే మత సారాంశం కూడా. ఈనాటి సమాజంలో దీని తాలూకు వేదాంత సంస్కరణల కారణంగా, ఆ మత మౌలికాంశం ఎక్కడో కానీ రానంత అడుగున పడిపోయింది. అంతే కాదు అసలు దాని గురించి ఎప్పుడో మర్చిపోవటం కూడా జరిగిందన్నది వాస్తవం-అయితే ఆ జీవితం, జీవిత పరిరక్షణ అనేవి మతాన్ని నిర్మించిన ప్రముఖమైన అంశాలని ఈనాటి సమాజాన్ని పరిశీలించి చూసినా తెలుస్తుంది. ప్రొఫెసర్ క్రౌలే ఈనాటి సమాజంలోని మనిషి మత జీవితాన్ని గురించి మాట్లాడుతూ ఇలా చెప్పాడు.

"మానవుని మతం అతని వృత్తిలో గాని, సామాజిక కార్యకలాపాల్లో గాని, శాస్త్ర కళా సందర్భాల్లో గాని ప్రవేశించదు. ఆచరణాత్మకంగా దాని (మతం) ప్రధాన హక్కులన్నీ లౌకిక విషయాలను విడిచిపెట్టిన-వారంలో ఒక్కరోజు (ప్రార్థన చేసే ఆదివారంనాడు) మాత్రమే పరి ష్కారమవుతాయి. వాస్తవంగా మానవుని జీవితం రెండు భాగాలుగా ఉంటుంది. కానీ మతంతో సంబంధించిన అర్థభాగం మాత్రమే ఆది మూలమైంది. జీవితాన్ని గురించిన అతి ముఖ్య సమస్యలైన చావు, పుట్టుకలకు సంబంధించిన తీవ్ర ఆలోచనలు-స్థూలంగా చెప్పాలంటే పూజా పునస్కారాలకు కేటాయించిన వారంలోవి కొస విశ్రామదినం (ఆదివారం), ఆరోజు ప్రార్థన చేసే అలవాటు, లభిస్తున్న ఆహారానికి భగవంతునికి కృతజ్ఞతలు తెల్పడం వ్యక్తావ్యక్తంలో చావు పుట్టు కలకు చెందిన భావనలు, వీటి కొనసాగింపైన పెళ్ళి ఇవన్నీ మతానుసారంగా ఆచరించటం. ఎక్కడైతే చర్యలు, ఆనందం సంస్కారం పొందుతాయో అవన్నీ ఒక ఉపమానపూర్వకంగా చెప్పేటటువంటివి. మతభావన పొంగిపొరలి బయటకు వచ్చినటువంటివీను."

ఈ వివరణలో చెప్పిన వర్తమాన సమాజంలోని మనిషి మత సంబంధాన్ని ఆటవిక సమా జంతో పోల్చి చూసినపుడు సిద్ధాంతంలోను, ఆచరణలోను-అటు ఆటవిక సమాజం గురించి చెప్పేటప్పుడు గాని ఇటు నాగరిక సమాజాన్ని గూర్చి చెప్పేటప్పుడు గాని మతం అనేది రెండింటి లోను అనివార్యంగా సమానం కాదన్నదాన్ని ఎవరు నిరాకరించగలరు?

కాబట్టి ఆధునిక, నాగరిక సమాజాలు ఒక అంశంలో ఏకాభిప్రాయాన్ని పొందుతాయని స్పష్టమవుతోంది. ఈ రెండింటిలో మతానికి చెందిన ప్రధాన ప్రయోజనాలైన-వ్యక్తులు వైయక్తికంగా రక్షణ పొందడం, తద్వారా జాతి నిలిచే జీవిత విధానం-ఇవి సమానమని తెలుస్తోంది. ఈ విషయాల్లో ఆ రెండింటి మధ్య వాస్తవంగా తేడా లేదు. కానీ అవి మరో రెండు ప్రధానమైన అంశాలలో విభేదిస్తున్నాయి.

మొదటిది-ఆటవిక సమాజంలో భగవంతునికి సంబంధించిన భావన ఏదీ లేకపోవటం. మతానికి, నీతికి మధ్య ఖచ్చితమైన హద్దు లేకపోవటం రెండవ అంశం. ఆటవిక సమాజంలో భగవంతుడు లేని మతం ఉంటుంది. ఆ సమాజంలో నీతి కూడా ఉంది. కాని అది మతానికి

లోబడక స్వతంత్రంగా ఉండేది.

ఎప్పుడు ఎక్కడ భగవద్భావనను మతంతో ముడివేయటం జరిగిందో చెప్పటం సాధ్యం కాదు. భగద్భావన అనేది సమాజంలో ఒక గొప్ప వ్యక్తిని పూజించటం-అనే దానిలోంచి ప్రారంభ మయి ఉండవచ్చు. ఆ గొప్ప వ్యక్తి లేక నాయకుడు ఆస్తికత్వ భావానికి తద్వారా దానిలో జీవించే భగవంతుని పట్ల నమ్మకానికి ఎదిగి ఉండవచ్చు. జీవుల్ని ఎవరు సృష్టించారు అనే సమస్య తాలూకు శుద్ధతాత్విక మీమాంస నుంచి భగవంతుడు అనే భావన ఏర్పడి ఉండవచ్చు. విశ్వాన్ని సృష్టించే శిల్పి భగవంతుడనీ[7] -శ్రుతులతో సంబంధము లేకుండా దేవుడున్నాడని మాత్రం నమ్మే సిద్ధాంతానికి (డేయజమ్) ఇదే ఊతమిచ్చింది. ఏ విధంగా చూసినా భగవంతుడు అనే భావన మతంతో అభిన్నమైంది కాదు. మతంలో అది ఏ విధంగా చొరబడిందనేది వివరించటమే కష్టం. మతం, నీతి ఈ రెండింటి మధ్య ఉన్న సంబంధాన్ని పురస్కరించుకొని ఈ మాత్రమైనా నమ్మ కంగా చెప్పగలం. భగవంతుడు మతం వీటి మధ్య సంబంధం పూర్తిగా అభిన్నం కాకపోయినా; మతం నీతి వీటి మధ్య మాత్రం అభిన్నత ఉంది. మతం, నైతికత రెండూ కూడా పుట్టుక పెళ్ళి, జీవితం, మరణం మొదలైన మానవుని అస్తిత్వం తాలూకు మౌలికాంశాలతో సంబంధం కలిగి ఉన్నాయి. మతం ఈ జీవన విధానాలకు సంస్కారం కలిగించగా, నీతి వీటి భద్రతకు సూత్రాలను సమకూర్చింది. మౌలిక జీవిత సత్యాలకు మతం పవిత్రత కలిగించటంతో జీవిత విధానాలు, వీటితో పాటు సమాజం చేత వాటి పరిరక్షణ కోసం నిర్దేశితాలైన సూత్రాలు కూడా పవిత్రీకరణాన్ని పొందుతాయి. ఈ కోణం నుంచి చూచినపుడు మతం, నీతి వీటి మధ్య సంబంధం ఎందుకు ఏర్పడిందో తేలిగ్గా వివరించవచ్చు. మతానికి, భగవంతునికి మధ్య ఉన్న సంబంధం కంటె ఈ సంబంధం మరింత సన్నిహితమైంది. సహజమైంది. అయితే మతానికి నీతికి మధ్య ఇలాంటి ఏకీభావం ఎప్పుడు ఏర్పడిందో ఖచ్చితంగా చెప్పటం మాత్రం అంత తేలిగ్గా సాధ్యమయ్యే విషయం కాదు.

పైదానిలాగే ప్రధానమైన రెండు విషయాలలో నాగరిక సమాజంలోని మతం ఆటవిక సమాజంతో విభేదిస్తుందన్న వాస్తవం కన్పిస్తోంది. నాగరిక సమాజంలో భగవంతుడు మత ప్రణాళికలో భాగంగా వచ్చినవాడు. నాగరిక సమాజంలో నీతిని మతం పవిత్రీకరించింది.

నేను చెప్తున్న మత విప్లవంలో మొదటి దశ ఇది. మతం అభివృద్ధి చెందే దశలో కలిగిన అత్యావశ్యకాలైన ఈ రెండు విషయాలతో ఈ మత విప్లవం అంతమయిందని భావించలేం! నాగరిక సమాజ మత నిర్మాణంలో ఈ రెండు భావనలు భాగమైపోయిన తర్వాత, అవి వాటి అర్థాన్ని, వాటి ప్రాముఖ్యాన్ని విప్లవీకరించిన మరికొన్ని మార్పులకు లోనయ్యాయి. మత విప్లవం తాలూకు రెండో దశ చాలా మార్పులకు దారి తీసినటువంటిది. ఇది ఎంత పెద్దదంటే, దీనివల్ల నాగరిక సమాజం, పురాతన ఆధునిక సమాజాలుగా విడిపోయింది. అందువల్ల నాగరిక సమాజం తాలూకు మతాన్ని గురించి మాట్లాడేటప్పుడు ఆధునిక సమాజానికి వ్యతిరేకమయిన పురాతన సమాజ మతాన్ని గురించి చెప్పవలసిన అవసరం కలుగుతోంది.

నాగరిక సమాజాన్ని ఆటవిక సమాజంతో విభజించిన మత విప్లవం కంటె ఆధునిక సమాజాన్ని పురాతన సమాజంతో విడదీసిన మత విప్లవం మహత్తరమైంది. భగవంతుడు, సంఘం, మనిషి వీటి మధ్య ఉన్న అనుబంధానికి సంబంధించిన భావనల్లో తీసుకొచ్చిన వైరుధ్యాలు ఈ మత విప్లవ కోణాల్లో చాలా స్పష్టమైనటువంటివి.

మొదటి విభేదం సంఘం ఏర్పడే విధానానికి సంబంధించింది.

ప్రతి మనిషీ తన యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా కేవలం తన పుట్టుకను బట్టి, పెరుగుదలను బట్టి 'సహజంగా ఏర్పడ్డ సంఘం' అని దేన్ని అంటున్నామో, దాంట్లో సభ్యుడు. దానివల్ల అతడు ఒక ప్రత్యేకమైన కుటుంబానికీ, దేశానికీ చెందుతాడు. ఈ సభ్యత్వం కాలానుక్రమణికలో అతను నిర్వర్తించాల్సిన కొన్ని ప్రత్యేక బాధ్యతల్ని విధుల్ని ఆపాదిస్తుంది. అవి అనుసరించకపోతే సాంఘిక శిక్షల్ని విధిస్తుంది. అదే సమయంలో కొన్ని సాంఘిక హక్కుల్ని, ప్రయోజనాల్ని కూడా అతనికి సంక్రమింపచేస్తుంది. కానీ ప్రొఫెసర్ స్మిత్ మాటల్లో: 8 'సహజం' అనే మాటకున్న నేటి ఖచ్చితమైన అర్థంలో పురాతన ప్రపంచానికి చెందిన గిరిజన లేక జాతీయ సంఘాలు లేవు. ఆ సమాజాల్లో భగవంతునికి మనిషితో సమానమైన స్థానం, భాగస్వామ్యం ఉండేవి. ఇది ప్రధానమైన వ్యత్యాసం. మనిషి పుట్టిన పరిధిలో మాత్రమే కుటుంబ బాంధవ్యాలు, సహ పౌరసత్వం సంక్రమించటమే కాదు, ఏ సమాజంలో అయితే పుడతాడో ఆ సమాజంలోని మనుషుల్లాగే సభ్యులుగా ఆ ప్రాచీన సంఘ సభ్యుల ఆలోచనలలో నిలిచి పోయిన ఆయా కుటుంబాలకు చెందిన దేవతలు; దేశానికి చెందిన దేవతలు వీరితో కూడా విడదీయరాని సంబంధం ఏర్పడుతుంది. పురాతన కాలానికి చెందిన దేవతలు వారి ఆరాధకుల మధ్య సంబంధం కూడా మానవ సంబంధాలకు సంబంధించిన భాషలనే (ఆయా బాంధవ్య సూచక పదాల ద్వారానే) ఆ పదాలకున్న శాబ్దికార్థంలోనే వ్యక్తం చేయటం జరుగుతుందే కాని ఆలంకారిక పద్ధతిలో కాదు. భగవంతుణ్ణి 'తండ్రి' అని అంటే ఆరాధకులు అతని సంతానమని అర్థం. ఆ భగవంతుడు ఆరాధకులతో ఒకరిపట్ల మరొకరు నిర్వహించే పరస్పర కుటుంబ విధుల మూలంగా ఒక "సహజ" కుటుంబం ఏర్పడుతుంది. లేకపోతే భగవంతుణ్ణి రాజుగా పిలిస్తే ఆరాధకులు తమంతట తాము తమని అతని సేవకులుగా పిలుచుకుంటారు. దేశ సార్వభౌమాధికారం వాస్తవంగా ఆ భగవంతుడి చేతిలోనే ఉందని భావిస్తారు. దానినిబట్టి రాజ్య నిర్వాహకులు ప్రధానమైన అన్ని (రాజ్య వ్యవహార) విషయాల్లోను భగవంతుడి నిర్ణయాలను సూచనలను పొందే అవకాశం ఉంది. అంతేకాదు అత్యంత భక్తిశ్రద్ధలతో, వినయ విధేయతలతో రాజుగా ఆ భగవంతుడి సామీప్యాన్ని చేరుకోటానికి కూడా అవకాశం కల్పించటం జరిగింది.

ఈ విధంగా మనిషి పుట్టుకతో తన తోటి వ్యక్తులతో ఎలాటి నిర్ణీత బాంధవ్యాన్ని పొందుతాడో, భగవంతునితోను అలాంటి సంబంధాన్నే పొందుతాడు. సమాజంలో సభ్యుడుగా మనిషికున్న స్థాయిని బట్టి అతనికెలాంటి ప్రవర్తనా నియమావళి విధించటం జరిగిందో ఆ ప్రవర్తన నియమావళిలో భగవత్సంబంధమైనదంతా అతని మతమే! అనునిత్య జీవితానికి, మత

—

వ్యవస్థకి మధ్య ఏ విధమైన వ్యత్యాసం లేదు. ప్రతి సామాజిక చర్య సాటి మనిషితో ఎలాంటి సంబంధాన్ని కలిగి ఉంటుందో భగవంతుడితోను అలాంటి సంబంధాన్నే కలిగి వుంటుంది. సంఘ నిర్మాణం కేవలం మనుషులతోనే జరుగదు. దేవుడు మనిషితో జరుగుతుంది."

ఈ విధంగా ప్రాచీన సమాజంలో సాంఘిక, రాజకీయ, మత వ్యవస్థలు-మనిషి అతనితో పాటు దేవుడు వీటితో ఏర్పడతాయి. భగవంతుడు, భక్తులు వారి మధ్య వున్న బాంధవ్యం పునాదుల మీద మతం రూపుదిద్దుకుంది. ఆధునిక సమాజం భగవంతుణ్ణి సమాజం నుంచి వేరు చేసింది. మరో మాటలో చెప్పాలంటే కేవలం మనుషులతోటే సమాజం ఏర్పడింది.

దేవుడికీ సమాజానికీ మధ్య ఉన్న సంబంధం విషయంలో పురాతన, ఆధునిక సమాజాల మధ్య ఉన్న తేడా రెండవది. ప్రాచీన ప్రపంచంలో వివిధ జాతుల వారు "అనేక దేవతల ఉనికిని విశ్వసించారు. తమ దేవుళ్ళను, తమ శత్రువుల దేవుళ్ళను కూడా వారు విశ్వసించారు. అయితే, తమకు మేలు చేయలేని, తమ నైవేద్యాన్ని స్వీకరించని కొత్త దేవుళ్ళను వాళ్ళు ఆరాధించేవారు కాదు... ప్రతి తెగకీ స్వంత దేవుడు, బహుశా దేవుడూ దేవతా వుండేవారు. వారికీ ఇతరుల దేవుళ్ళకీ ఏ సంబంధమూ వుండేది కాదు."9

పురాతన సమాజంలోని దేవుడు ప్రత్యేకించి ఒక్కొక్క తెగకు చెందిన వాడు. అంటే ఆ ఒక తెగకు మాత్రమే ఆ దేవుని మీద సర్వాధికారాలు ఉంటాయి. "వివిధ దేవతారాధకుల మధ్య జరిగే అంతఃకలహాలు యుద్ధాలు, వాటిల్లో ఆ దేవుళ్ళు నిర్వహించే పాత్రను బట్టి నిర్ణయించవచ్చు. అక్కడ భగవంతుని శత్రువులను, అతని ప్రజల శత్రువులను ఒక్కటిగానే పరిగణిస్తారు. 'పాత నిబంధన' గ్రంథం ప్రకారం భగవంతుడైన యెహోవా శత్రువులు . వేరెవ్వరో కాదు. ఇజ్రాయిలు శత్రువులే. యుద్ధంలో ప్రతి దేవుడు తన ప్రజలకు విజయం లభించేందుకు పోరాడుతాడు. మొవాబుకి చెమోషు ద్వారా విజయం లభించింది. అస్సిర్ అస్సిరియాకు విజయం ఇచ్చాడు. యుద్ధ సమయంలో భక్తుల తరపున దేవుళ్ళు పోరాడడం (?) అటుంచితే కొన్నిసార్లు యుద్ధ భూమిలోకి దేవుళ్ళ చిహ్నాలు (బొమ్మలు) తీసుకురావడం, వాటి ఫ్ఫూర్తితో పోరాడటం ప్రాచీన యుద్ధ సమయంలో కూడా ఇలాంటి దైవ చిహ్నాలే దర్శనమివ్వడం ందుకు ఉదాహరణం. (ఇజ్రాయిలు) దేవుడి చిహ్నాన్ని యుద్ధ భూమిలో చూసిన పాలస్తీనీ ుులు "మనల్ని వారి అనుష్ఠానం నుంచి విముక్తం చేయగలిగిన దేవతలు శిబిరానికి వచ్చారు. ందుకంటే బాల్‌పెరాజమ్‌లో డేవిడ్ వారిని ఓడించినప్పుడు కొల్లగొట్టిన వాటిలో రణరంగానికి ుకువెళ్ళిన వారి విగ్రహాలు కూడా ఉన్నాయి."-అని అన్న మాటలు దీనికి నిదర్శనాలు. ంతేకాదు ఫిలిప్ మాసిడోన్‌తో కార్తగీనియన్లు సంధి చేసుకుంటూ "యుద్ధ రంగంలో దేవతలు ుధాన పాత్ర వహించారు" అన్నారు. సైన్యాధిపతి శిబిరానికి ప్రక్కనా-పరాజయం పొందిన ైదీలు ఆత్మాహుతి చేసుకున్న ప్రదేశం ఎదురుగానూ-ఉన్న శిబిరంలోని దేవతా ప్రతిమలే యుద్ధ విజయానికి కారణమని ఆ మాటలన్న వాళ్ళ అభిప్రాయం. ఈ విధంగానే ఒక అరబ్బీయుడైన కవి "మోరాద్‌కి వ్యతిరేకంగా యాగూత్ (యుద్ధానికి) వెళ్ళాడు" అని అన్నాడు. అంటే యాగూత్

ప్రతిమను రణభూమికి తీసికెళ్ళారని అర్థం.

దీనివల్ల భగవంతునికీ, వివిధ జాతులకీ మధ్య ఉన్న సంఘీభావం ఎలాంటిదో తేటతెల్ల మవుతుంది.

కాబట్టి, భగవంతునికీ, అతని భక్తులకీ మధ్య ఉన్న సంఘీభావసూత్రం కారణంగా, రాజకీయ వ్యవస్థ లక్షణమైన నిర్దిష్టతత్వం (Particularism) మతరంగంలో ప్రత్యక్షం కాక తప్పలేదు. ఇదే విధంగా ఒక ప్రత్యేకమైన తెగకు చెందిన దేవుడు తాను ఏ తెగకు చెందిన వాడో ఆ తెగకు మాత్రమే సంబంధించినవాడవుతాడు. వాళ్ళకు మాత్రమే ఉపయోగపడతాడు. అంతేకాదు ఆ తెగకు శత్రువులైన వారికి తాను (దేవుడు) కూడా శత్రువు అవుతాడు. ఇంకా ఆ తెగకు ఎవరైనా అపరిచితులౌతారో, వారికి తానూ అపరిచితుడే!"[10]

దేవుడికి సమాజానికీ, సమాజానికీ దేవుడికీ మధ్య విడదీయరాని సంబంధం ఏర్పడింది. స్థూలంగా చెప్పాలంటే దేవుడు తనను ఆరాధించే ఒక్క తెగకు మాత్రమే దేవుడయ్యాడు. అలాగే తెగలు కూడా తాము నిలుపుకున్న దేవుడికి సంబధించిన ప్రత్యేక తెగలు అయ్యాయి.

ఈ వాదానికి పర్యవసానాలు రెండు. దేవుడనే వాడు ఒక్కడేననీ, అంటే ఆ దేవుడు అందరికీ సంబంధించిన వాడే అనే ఆలోచన కూడా చేయలేదు. అంతేకాదు మానవత్వం అనేది ఒకటి ఉందనీ అది మానవాళి అంతటికీ సమానమేననీ ఊహామాత్రంగానైనా పురాతన సమాజం తలంచలేదు.

భగవంతుణ్ణి తండ్రిగా భావించే విషయానికి సంబంధించిన తేడా పురాతన, ఆధునిక సమాజాల భేదాల్లో మూడవది. పురాతన సమాజంలో భగవంతుడు ప్రజల తండ్రి. కాని అలా తండ్రిగా భావించటం భౌతికపరంగా కూడా!

"క్రైస్తవేతర మతాల్లో దేవుణ్ణి తండ్రిగా భావించడం అనేది భౌతిక(పర)మైందే. ఉదాహరణకు కుమ్మరి కుండలను చేసినట్లుగా మట్టితో దేవుడు మనుషుల్ని చేస్తాడనే భావన గ్రీకుల్లో సాపేక్షంగా కొత్తదే. కాని ప్రాచీనుల అభిప్రాయం దీనికి భిన్నమైంది. వారి ప్రకారం ఆయా తెగల్లోని మానవులందరికీ దేవుడొకడున్నాడు. ఆ దేవుడూ, మానవుల పూర్వీకులూ–భూమికి శిశువులు. దేవుడికీ మనిషికీ కూడా తల్లి భూమే కాబట్టి మానవులంతా అతని వంశీకులే లేక అతని గోత్రీకులే. ప్రాచీన సెమైటులకు కూడా ఈ అభిప్రాయం పరిచితమైనదేనని బైబిలు వల్ల తెలుస్తోంది. నీవే నా తండ్రివి అని వారి వంశపితతోనూ, నీవే నాకు జన్మనిచ్చావు అని ఓ రాతితోనూ విగ్రహారాధకులు అన్నట్లుగా జెర్మియా అభివర్ణించాడు. మోయాబైట్లను చెమోష కొడుకులు, కూతుళ్ళుగా పాత నిబంధనలో సంఖ్యాకాండం 21వ అధ్యాయం 29వ చరణంలో పేర్కొనడం జరిగింది. అంతేకాదు దానికి మరికొంత తర్వాత కాలంలో మలాచీ ప్రవక్త క్రైస్తవేతర

స్త్రీని "అన్యదేశపు భగవంతుని కూతురు"గా పిలిచాడు. ఈ పదబంధాలు ఇజ్రాయేలీయుల పొరుగువారు, క్రైస్తవేతరులు తమను గూర్చి తెలుపుకునేటప్పుడు వాడిన భాషలోనివనటంలో సందేహం లేదు. సిరియాలోను, పాలస్తీనాలోను ఒక్కో తెగా లేక తెగల సమూహం ఒక స్వతంత్ర ప్రజా సమూహం. అలాంటి ప్రతీ సమూహంలోని వారు తమకు తండ్రిగా ఒక గొప్ప వ్యక్తిని పేర్కొంటారు. అంతేకాదు గ్రీకుల లాగానే వీరు కూడా తమ జాతికి చెందిన ఆ తండ్రి లేక మూల పురుషుణ్ణి సాధారణంగా తమ జాతి దేవుడుగా గుర్తించి సూచిస్తారు. ఆదికాండంలో అనేక జాతుల పారంపర్య చరిత్రలలో అనేక దేవతల పేర్లు కనిపిస్తాయనే ఆధునిక పరిశోధకుల నిర్ధారణతో ఇది సరిపోతుంది. ఉదాహరణకు ఎడమైట్ల వంశ మూల పురుషుడు ఈడమ్‌ని హీబ్రూలు యాకోబు సోదరుడైన ఏశువుగా గుర్తించారు. కాని క్రైస్తవేతరులకు మాత్రం అతనొక దేవుడే. థియోపోరస్ సొంత పేరు ఓబెడిడంగా కన్పిస్తుంది. "ఈడమ్ ఆరాధకుడు" అని దీనికి అర్థం. ఇక ఫొనీషియస్ మరియు బాబిలోనియాన్ జగత్సృష్టి (మూల) శాస్త్ర విస్తృత అంశాల మూలాల్లోకి వెళితే గిరిజన (పురాతన) మతంగా ఉన్నపుడు దానిలో ఒకానొక ప్రత్యేకమైన సజాతీయుల వ్యక్తిగత దేవుళ్ళ సంబంధం కన్పిస్తుంది. కాలం మలుపులో ఆ సంబంధం కనుమరుగై క్రమేణా దాన్ని మర్చిపోవటం జరిగింది. కానీ ఇప్పటికి దాని స్థూల రూపంలో మనుష్యులందరూ దేవుని బిడ్డలే అని అనుకోవటం ఉంది. ఆ భావనకు ఈ సంబంధమే మూలం. పొనీషియన్ల జగస్సృష్టి మూల శాస్త్రమైన ఫెలోబాబ్లియస్‌లో ఇది చాలా గందరగోళ స్థితిలో కన్పిస్తుంది. దీనికి కారణం గ్రంథకర్తల "యూహిమెరిజమే." అంటే జాతికి గొప్ప మేలును కూర్చే దైవీకరణం చెందిన మనిషికంటె దేవతలు భిన్నులు కారు అని చెప్పే సిద్ధాంతమిది. ఇంకొక విషయం. బెరొసస్ భద్రపరచిన చాల్డియన్ ఇతిహాసంలో మరీ మొరటుగా 'మనుషులు దేవతల రక్త'మనే నమ్మకం వ్యక్తీకరించటం జరిగింది. ఇది మరీ అంత పురాతనం కాదు. దాంట్లో జంతువులు, మనుషులు కూడా శిరచ్ఛేదం చేసిన దేవత రక్తంతో (బంక) మట్టిని కలపగా రూపొందినట్లు చెప్పటం జరిగింది."11

మనుషుల దేవతల రక్త సంబంధ భావనలో ఒక ప్రధానమైన ఫలితముంది. పురాతన ప్రపంచానికి దేవుడు మానవమాత్రుడే. అందువల్ల సంపూర్ణ శక్తి సామర్థ్యాలు, సంపూర్ణమైన మంచితనం కలిగినవాడు కాదు. భగవంతుడు మనిషి శారీరక స్వభావాన్ని పంచుకున్నవాడు కావటం చేత సాధారణ జీవితంలో మనిషి బాధకు లోనయ్యే ఆవేశాలు, అశక్తతలతో పాటు సంతోషం మొదలైన అనేక విషయాలు మనిషికిలాగా భగవంతుడికి సహజాలయ్యాయి. పురాతన ప్రపంచంలోని దేవుడికి మనిషికి లాగానే కోరికలు ఉండేవి. మనిషికిలాగానే ఆకలి ఉండేది. అంతేకాదు మనిషికిలాగా ఆ దేవుడు తరచు సంతోషంలో మునిగితేలేవాడు. ఆరాధకులు తాము దుర్వృత్తులకు లోను కాకుండేటట్లు చూడమని భగవంతుణ్ని వేడుకునేవారు.

ఆధునిక సమాజంలో దైవిక పితృత్వ భావన నుంచి సహజ పితృత్వ భావనలోని భ్రాంతి కాంశ పూర్తిగా విడిపోయింది. దాని స్థానంలో భగవంతుని ప్రతిబింబంగా మానవుడు సృష్టి అయ్యాడన్న భావన వచ్చింది; అతనిక భగవంతుని ఔరసపుత్రుడు కాదు. భగవంతుణ్ని తండ్రిగా భావించే విషయానికి సంబంధించిన భావనలోని ఈ మార్పును, దాని నైతిక దృష్టికోణం నుంచి

చూడటం జరిగి, విశ్వానికి అధిపతైన భగవంతుని స్వభావంలో బ్రహ్మాండమైన మార్పును తెచ్చింది. శారీరక సంబంధమైన పునాదితో భగవంతుడు పరిపూర్ణంగా మంచివాడు కానీ, సంపూర్ణంగా శక్తి సామర్థ్యాలు కలవాడు కానీ కాదు. పాపరహితుడైన (శుద్ధాత్ముడైన) దేవుడుండాలని కోరుకున్న ప్రపంచం పాపరహితత్వాన్ని ఒక స్థిరమైన సిద్ధాంతంగా నొక్కి చెప్పలేదు. మనిషితోటి భగవంతుడికి శారీరక సంబంధం ఎప్పుడైతే విచ్ఛిన్నమైందో, అప్పుడే అది నూటికి నూరుపాళ్ళు మంచిని, పరిపూర్ణ శక్తి సామర్థ్యాల్ని కలిగినవాడు భగవంతుడు అనే భావన ఏర్పడటానికి అవకాశం కల్పించింది.

జాతి సంబంధంగా ఏదైనా మార్పు జరిగినపుడు మతం నిర్వహించే పాత్రకు సంబంధించింది నాల్గవ విభేదాంశం.

ప్రాచీన సమాజంలో జాతి సంబంధి మార్పు అనేది ఎప్పుడూ మతం మార్పును అనుసరించి మాత్రమే ఉండేది. ప్రాచీన ప్రపంచంలో "జాతిని మార్చుకోకుండా ఏ వ్యక్తికి మతాన్ని మార్చుకోవటం సాధ్యం కాదు. ఒక తెగ మొత్తం మరో (క్రొత్త) తెగలో పూర్తిగా కలిసిపోయినప్పుడు మాత్రమే మతాన్ని మార్చుకోగలరు. రాజకీయమైన బంధాలలాగానే మతాలు కూడా తండ్రి నుంచి కొడుక్కి సంక్రమిస్తాయి. దానివల్ల మనిషి తన ఇష్టప్రకారం కొత్త దేవుణ్ణి ఎంచుకునే అవకాశం లేదు. తండ్రి దేవుడే తనకు ఏకైక దేవుడు. అతనితో మాత్రమే స్నేహ సంబంధాల్ని ఏర్పరచుకోవాలి. అతనికే శ్రద్ధాంజలి ఘటించాలి. తన రక్త సంబంధాన్ని తెంచుకొని మరొక నూతనమైన పౌర, మత జీవనాలు కలిగిన తెగతో కలిసిపోయినపుడు మాత్రమే అతని జాతి దేవుళ్ళలో మార్పు సంభవిస్తుంది."

(మరో) సమాజంలో కలిసిపోవాలంటే మతం మార్పు ఎంత అనివార్యమైన కారణమో తెలియజేసే దృష్టాంతం పాత నిబంధన గ్రంథంలో (బైబిల్–Old Testament) నోమ రూత్‌ల మధ్య జరిగిన సంవాదంలో స్పష్టంగా కన్పిస్తోంది.

"నీ సోదరి ఆమె ప్రజల దగ్గరికి ఆమె దేవతల దగ్గరికి తిరిగి వెళ్ళింది" అని రూత్‌తో నోమ అనెను. "నీ సోదరి ప్రజలు నా ప్రజలు. నీ దేవత నా దేవత." అని రూత్ సమాధానమిచ్చెను.

ప్రాచీన ప్రపంచంలో జాతిని మార్చుకోవటం అనేది మతం మార్చుకోవటంతో ముడిపడివుందని దీనివల్ల స్పష్టమవుతోంది. సంఘంలో కలవటం అంటే మతపరమైన కలయికే.

ఆధునిక సమాజంలో సహజపితృత్వ భావన యొక్క భౌతిక పునాది నుంచి దైవిక పితృత్వ భావన పూర్తిగా దూరమయింది.

ఆధునిక సమాజంలోని వ్యక్తి వేరే సమాజంలో కలియాలంటె తన మతాన్ని వదిలిపెట్టన

వసరం లేదు. అలాగే ఆ సమాజ మతాన్ని స్వీకరించవలసిన అవసరం కూడా లేదు. ఆధునిక పరిభాషలోని 'పౌరసత్వ ప్రదానం' అనేది దీనికి సరైన ఉదాహరణ. దీనిలో ఒక దేశానికి చెందిన పౌరుడు ఆ దేశ పౌరసత్వాన్ని వదులుకొని మరో కొత్త దేశ పౌరసత్వాన్ని పొందు తాడు. అయితే ఆ నూతన పౌరసత్వాన్ని పొందేటప్పుడు తన మతం కూడా మార్చుకోవాల్సిన అవసరం లేదు. సాంఘికంగా మరో తెగలో ఏకీకరణం చెందటం అనే "పౌరసత్వ ప్రదానం" (దేశీయకరణం)లో మతపరమైన ఏకీకరణ జరగవలసిన అవసరం లేదు.

పురాతన సమాజం నుంచి ఆధునిక సమాజాన్ని వేరు చేసే అంశాలలో ఆధునిక సమాజం కేవలం మానవ ప్రమేయం మాత్రమే కలది అని చెప్పటం సమంజసం కాదు. వివిధ దేవతలను కొలిచే దేవతారాధకులు ఆధునిక సమాజం అనటం సబబు.

మతంలో భాగమైన దైవతత్వ సంబంధ జ్ఞాన ఆవశ్యకత ఐదవ భేదానికి సంబంధించింది.

ప్రాచీన దృష్టి రీత్యా దేవుళ్ళేమిటనేది మత సంబంధమయిన ప్రశ్నే కాదు, ఊహకు సంబంధించినది; దేవుడు ఏ నియమాల ప్రకారం వర్తిస్తాడో తమ ఆరాధకులు తమ ప్రవర్తనను ఎలా రూపొందించుకోవాలని అతను ఆశిస్తాడో ఆ నియామలతో ఆచరణాత్మక పరిచయం ఉండటం మతానికి అవసరమైన విషయం. II రాజులు అధ్యాయం 17లోని 26 చరణం చెబుతున్న "దేవుని మర్యాద" అంటే పైన చెప్పిన ప్రవర్తనే. ఇజ్రాయేల్ దేశంలో ప్రవక్తలు దైవ అధిపత్యపు జ్ఞాన సూత్రాలు నియమాలను గురించి చెప్పేటప్పుడు మత సారాంశంగా–సమగ్రంగా మతమంటే "యెహోవా గురించిన జ్ఞానమూ, భయము" అన్నారు. అనగా యెహోవా నిర్దేశించిన జ్ఞానమూ, దానిని వినయ విధేయతలతో ఆదరించే ఒద్దిక అని చెప్పారు. మతకల్పనలన్నింటి గురించి కలిగే ఎలాంటి సందేహానికైనా ఫాదరీల నిబంధన గ్రంథం (Book of Ecclesiastes) భక్తి పట్ల సరైన దృష్టి కలిగి వుండడమే సమాధానమని గట్టిగా చెబుతోంది. అంటే "భగవంతునికి భయపడటం, అతని ఆజ్ఞలను (హిజ్ కమాండ్‌మెంట్స్) శిరసావహించడం" ఈ విషయంలో మనిషి ఎలాంటి చర్చలకు దిగరాదని సాధారణ సూత్రం. ఈ సలహాను రచయిత సోల్మన్ ముఖతః అందిస్తాడు. ఇదే మతంపై ప్రాచీన దృక్పథాన్ని సూచిస్తుంది. దురదృష్టవశాత్తు ఈ దృక్పథం ఆధునిక కాలంలో విస్మృతమైంది."

మతంలో విశ్వాసానికున్న స్థానానికి సంబంధించి ఉన్న విభేదమే ఆరవ అంశం. ప్రాచీన సమాజంలో- "ఖచ్చితంగా చెప్పాలంటే కర్మకాండలు ఆచార వ్యవహారాలే ఆ ప్రాచీన మతాల సర్వస్వం. పురాతన కాలంలో మతం ఆచరణాత్మక అన్వయం కలిగిన విశ్వాస వ్యవస్థ కాదు. అది సమాజంలో ప్రతి వ్యక్తి ధైర్యానికి ప్రతీకగా పాటించే సాంప్రదాయక ఆచరణలకు సంబం ధించిన వ్యవస్థ. తాము చేసే కార్యకలాపాలకు సరైన కారణం లేకపోతే ఆ చేసే మనుషులు మనుషులు కారు. కానీ ప్రాచీన కాలపు మతంలో మొట్టమొదటి సూత్రపూర్వకమయిన నిబం ధన, ఆపైన ఆచరణ అనే వాటిని రూపొందించటం జరగలేదు. దానికి విరుద్ధంగా ముందు

ఆచరణ, ఆమీదట సూత్రకల్పన జరిగింది. మనుషులు సాధారణంగా ప్రవర్తన నియమాలను ఏర్పరచుకొనే ముందే వాటిని జీవితంలో ఆచరించటం సహజం. రాజకీయ సంస్థలు రాజకీయ సిద్ధాంతాలకన్న ప్రాచీనమైనవి. అదే విధంగా మత సంస్థలు మత సిద్ధాంతాలకంటె ప్రాచీన తరమైనవి. ఈ పోలిక కేవలం అకారణమైనదేమీ కాదు. వాస్తవానికి పురాతన సమాజంలో మత రాజకీయ సంస్థల మధ్య సంబంధం సాపేక్షకమయినదే. ప్రతీ దశలోను ఆచరణకీ నియమానికీ అత్యంత ప్రాధాన్యత ఆపాదించటం జరిగింది. అయితే నియమం మొదట స్థిరీకరణ పొందినప్పటి నుంచీ, అది తర్వాత తరం వారికి మార్గదర్శకం కావటం అనేది ఒక ప్రాచీన కథగా వ్యాఖ్యానాన్ని పొందింది. ఒకసారి స్థిరీకరణ పొందిన మార్గదర్శక సూత్రం అధికారికమౌతుంది. ఇక దాని నిజా నిజాల నిరూపణకు ఎలాంటి సాక్ష్యమూ అవసరం లేదు. సంఘ నియమాలన్నీ మార్గదర్శక సూత్రాల మీద ఏర్పడినవే. సంఘ వ్యవస్థ విచ్ఛిన్నం కాకుండా ఉండటం చేత ఒకసారి రూపొందించిన నియమాలు చిరకాలం ప్రజలు అనుసరించటం జరిగిందనటం సరైన కారణమవుతుంది.

మతంలో వ్యక్తిగత విశ్వాసానికున్న స్థానం ఏడవ అంశానికి సంబంధించని వ్యత్యాసం. పురాతన సమాజంలో– "క్రమం తప్పకుండా మనుషులు ఎక్కడయితే ఆచారాలను పాటిస్తారో అలాంటి సమాజంలో–పుట్టినట్టి, అప్రయత్నంగా సభ్యుడయినట్టి, మానవుని వ్యవస్థీకృత సాంఘిక జీవన విధానంలో మతం ఒక భాగం. మనుషులకు సమాజం పట్ల ఎలాంటి ఆచరణలు రూపు దిద్దుకున్నాయో అదే విధంగా దేవునికీ అతని ఆరాధనకీ సంబంధించిన విషయాలు ఏర్పడ్డాయి. వీటిని గురించిన ఊహలు గానీ కారణాలు గాని వెలికేటప్పుడు ఆ సాంప్రదాయక ఆచరణలు అనేవి స్థిరమైన విషయాలు అనే నిశ్చితాభిప్రాయంతోనే మొదలుపెట్టాలే కాని వాటిని తోసిరా జనే ఏ ఇతర కారణాల్ని అంగీకరించకూడదు. ఆధునికులమైన మనకు పై వాటన్నింటి కంటే హేతుపూర్వకమైన నమ్మకానికీ, వ్యక్తిగత విశ్వాసానికీ సంబంధించినది మతం. కానీ ప్రాచీనులకు మాత్రం అది (మతం) వ్యక్తి సంఘ జీవితంలో ఒక భాగం. అది కొన్ని నిర్ణీత బంధనాలకు పరిమితమయినది. దాన్ని నిరాకరించడానికి కానీ, విమర్శించడానికి కానీ, అతని స్వేచ్ఛ లేదు. దాన్ని విధిగా అర్థం చేసుకొనవలసిన అవసరం కూడా అతనికి లేదు. మత నిబద్ధత లేకపోవడం రాజ్యం దృష్టిలో నేరం. ఎందుకంటే, పవిత్ర సంప్రదాయం భగ్నమైతే, సామాజిక పునాదులు కుంగిపోతే దైవానుగ్రహం కోల్పోతారు కాబట్టి. అలాకాక అతడు ఎంత కాలమయితే నిర్దేశించిన ఆచారాల్ని చక్కగా పాటిస్తాడో అంతకాలం అతణ్ని పవిత్రునిగా గుర్తించడం జరుగుతుంది. అంతేకాదు, అతని హృదయంలో అసలు ఈ మతం అనేది ఏ విధంగా నెలకొనిందో ఎవ్వరూ ప్రశ్నించరు. అది అతని హేతువును ఎలా ప్రభావితం చేసిందో అడగరు. రాజకీయ విధుల్లో వలెనే దానిలో ఒక భాగమయిన మతం కూడా మనిషి బాహ్య ప్రవర్తనకు సంబంధించిన కొన్ని నిర్దిష్ట నియమాల ఆచరణను సంపూర్ణంగా ఇముడ్చుకొన్నట్టిది.

దేవునికీ–సమాజానికీ, మనిషికీ మధ్య సంబంధం; భగవత్సంబంధమైన విషయంలో సమాజానికీ, మనిషికీ మధ్య వున్న సంబంధ వ్యత్యాసమే ఎనిమిదవ అంశం.

దేవునికీ, సమాజానికీ మధ్య వున్న వ్యత్యాసం గురించి ముందు చెప్పకుందాం. ఈ విషయంలో మూడు అంశాలను గుర్తించాల్సి వుంటుంది.

పురాతన ప్రపంచపు విశ్వాసం-

"భౌతిక పరిస్థితి కన్నా ఎక్కువగా దేన్నీ ఆశించకపోవటం. భౌతిక జీవితాన్ని వరంగా పొందడం, ఆధ్యాత్మిక విషయాల్ని కాకుండా ఐహిక విషయాలు మొదలగునవి."

దేవుళ్ళ నుంచి ఆశించే మంచి విషయాలు-పురాతన సమాజాలు కోరేవీ-తమ దేవుళ్ళ నుంచి పొందాలని ఆశించేవీ-ప్రధానంగా యీ క్రింది అంశాలు.

"ఇబ్బడి ముబ్బడిగా తమకి పంటలు పండడం, శత్రువుల నుంచి రక్షణలో సహాయం; సాధారణంగా ఎదురయ్యే కష్టాల్లో అశరీరవాణి, సోదెల సలహాలు."

పురాతన ప్రపంచంలో- "మతం అనేది వ్యక్తిగతమయినది కాదు. తెగకి సంబంధించిన విషయం. దేవత యొక్క శాశ్వతమైన, తిరుగులేని అభయహస్తం లభించేది వ్యక్తికి కాదు సమాజానికే."

తర్వాత భగవంతునికీ, మనిషికీ మధ్య సంబంధంలోని వ్యత్యాసం గురించి చూద్దాం.

ఏ దేవతలనైతే వ్యక్తి విగ్రహారాధన (=పూజ) చేస్తాడో, ఆ దేవతలు దీర్ఘదృష్టితో ఆ వ్యక్తి సంక్షేమం చూడాలనే నియమం లేదు. అది అసలు వాళ్ళ పనికాదు కూడా. వ్యక్తులు తమ వ్యక్తిగత జీవిత విషయాలను కూడా దేవుళ్ళ ముందు వుంచడం సహజం. తమ కోర్కెలు తీర్చమని ప్రార్థనల ద్వారా, మొక్కుల ద్వారా ఆ దేవతల ప్రత్యేక దీవెనలు కోరడం కూడా జరుగుతుంది. కాని యిది రాజు నుంచి ఒక ప్రత్యేక వరాన్ని కోరినట్టే కోర్తారు. లేకపోతే తండ్రి నుంచి కొడుకు వరాన్ని అర్థించినట్లే అర్థిస్తారు. ఈ అర్థించడంలో తాము కోరిందంతా పొందాలన్న లక్ష్యం వాళ్ళకుండదు. దేవతలు యిచ్చే యీ వరాలన్నీ కూడా ఆ తెగ నాయకునిగా దేవుడు చేసిన సముచితమైన చర్య కాక వ్యక్తిగత అభిమానంతో చేసినట్టుగానే భావించడం జరుగుతుంది."

"దేవతలు మనిషి పౌర జీవితాన్ని జాగ్రత్తగా పర్యవేక్షిస్తూ ఉంటారు. వారు అతనికి లౌకిక ప్రయోజనాల్లో అతని వంతు ప్రయోజనం అతనికి కల్పిస్తారు. ఇబ్బడిముబ్బడిగా వార్షిక పంటల్నీ, ద్రాక్ష పంటల్నీ, జాతీయ శాంతినీ, శత్రువులపై విజయాన్నీ మొదలైన వాటినన్నింటినీ కలుగజేస్తారు. కానీ ప్రతి వ్యక్తీ ఆంతరంగిక అవసరానికే ఆ దేవతలు సహాయం చేస్తారన్న నమ్మకం లేదు. మొత్తం తెగ ప్రయోజనాలకు భిన్నంగా ఉండే ఏ విషయంలోనూ సహాయం

లభించదు. అందువల్ల జరగటానికి అవకాశం వున్న అవసరాలూ, కోరికలూ గురించి మతం నెరవేర్చగలిగిందీ, నెరవేర్చలేనిదీ అనే విషయాల పరిధి ఉందన్నది స్పష్టం."

మనిషి పట్ల దేవుడు, సంఘం వీటి దృష్టి గురించి వున్న వ్యత్యాసమే తర్వాత విషయం. ప్రాచీన ప్రపంచంలో సంఘం వ్యక్తిగత సంక్షేమం అనే విషయాన్ని ఉపేక్షించింది. దేవుడు సంఘానికి మాత్రమే బద్ధుడు అనడంలో సందేహం లేదు. కానీ–

"దేవుడికీ, ఆతని ఆరాధకులకూ మధ్య వున్న ఒప్పందం–ఆ తెగలోని–ప్రతి వ్యక్తి ఆంతరంగిక భద్రతా విషయాల పట్ల ఆ దేవత శ్రద్ధ వహించాలి అనే నియమానికి సంబంధించిన తిరుగులేని ప్రతిజ్ఞ ఏమీ కాదు."

"భగవంతుని నుంచి ఆశించే ప్రయోజనాలన్నీ కూడా సార్వజనీన లక్షణాన్ని కలిగి తెగ మొత్తానికి వర్తించేవయి ఉంటాయి–ముఖ్యంగా ఫలప్రదమైన ఋతువులు, పంటల అధిక దిగుబడి, యుద్ధాలలో విజయం మొదలయినటువంటి ప్రయోజనాలు. తెగ ఎంత కాలం అభివృద్ధి పథంలో ఉంటుందో అంతకాలం ఆ తెగ దైవ కటాక్షానికి పాత్రమవుతూనే ఉంటుంది అనేది వాస్తవం."

దీనికి విరుద్ధంగా ప్రాచీన ప్రపంచం మనిషి బాధ పట్ల ప్రదర్శించిన దృష్టికి ఉదాహరణమిది.

"బాధలు పడేవాడు దుష్టుడు. భగవంతుని దృష్టిలో అసహ్యానికి లోనైనవాడు. ఉత్సవ వినోద దినాల్లో దేవుడి ఎదుట సమావేశమయ్యే (ఆనందదాయకమైన, సంపద్వంతమైన) సమూహంలో అటువంటి మనిషికి స్థానం లేదు."

ఈ దృష్టి ఆధారంగా కుష్టు రోగిని, వ్యసనపరుణ్ని మతం నుంచి వెలివేశారు. సాంఘిక జీవిత ప్రయోజనాల పరిధి నుంచి కూడా వీరిని వెలివేయటం జరిగింది. అంతేకాదు దేవాలయంలోనికి వీరు పెట్టే నైవేద్యాలను తీసుకురానీయకపోవడం కూడా జరిగింది.

వ్యక్తికీ వ్యక్తికీ, వ్యక్తికీ సంఘానికీ మధ్య వున్న సంఘర్షణ విషయంలో భగవంతునికేమీ సంబంధం లేదు. ప్రాచీన ప్రపంచంలో–

"మానవుల కార్యకలాపాలను పరిష్కరించటంలోనే (భగవంతుడు) ఎప్పుడూ నిమగ్నమై వుంటాడని అనుకోవటం తప్ప. నిత్య వ్యవహారాల్లో తమలో తాము సహకరించుకోవటం మానవుల కర్తవ్యం. అయినా మనిషికి దేవుడు ఎల్లప్పుడూ చేరువలోనే వుంటాడనీ, అవసరంలో ఆదుకుంటాడనీ, సామాజిక ఋజువర్తనం క్రమాన్ని కాపాడటంలో పాత్ర వహిస్తాడనీ ఒక అనూహ్యమైన నైతికభావన మనస్సు మారుమూలల్లో ఎల్లప్పుడూ వున్నప్పటికీ నైతిక శక్తి బలం

వ్యక్తిగతంగా అనిశ్చితమయినదే. దుష్టుడెవ్వడూ కూడా తాను చేసిన నేరాలు ఉపేక్షిస్తూ తనను తాను పొగడుకోవటానికి కారణం ఈ విధమైన అనిశ్చితత్వమే."

ప్రాచీన ప్రపంచంలో మనిషి భగవంతుణ్ణి-తన పట్ల ధర్మబద్ధుడై ఉండమని అడగడు.

"పూర్తి సంబంధమయినటువంటి లేక దుష్టమయినటువంటి విషయాల్లో వ్యక్తిగత జీవ వ్యాప్తి గురించి తక్కువగాను, తెగ విషయం ఎక్కువగాను ఆలోచించటం అనేది ప్రాచీన ప్రపంచపు అలవాటు. ఒకవేళ తన విషయంలో ఏదైనా యిబ్బంది ఎదురైనా, దాన్ని తప్పుగా ఎవరూ భావించేవారు కాదు. దేవుడు జాతికంతటికీ, తెగకంతటికీ దేవుడు. ఆ భగవంతుడికి తెగలో సభ్యుడయిన ప్రతి వ్యక్తి తాలూకు సంక్షేమాన్ని గురించి తెలుసు."

వ్యక్తిగతమైన దురదృష్టాన్ని పురాతన ప్రపంచంలోని మనిషి భావించిన తీరు యిది. మనిషి అతని దేవుని ఎదుట సంతోష హృదయంతో ఉంటాడు. అంతేకాదు:

"భగవంతుని ఎదుట సంతోషించటంలో మనిషి తన రక్త సంబంధీకుల, పొరుగువారి; స్నేహితుల ఆనందంలో కూడా పాలుపంచుకుంటాడు. భగవంతుని ఆరాధించటం అనే పవిత్ర చర్య ద్వారా అతని భగవంతునిలో ఐక్యం చేసే బంధాన్ని, తన కుటుంబంతోటి బంధాన్ని కూడా సామాజిక, జాతీయ ప్రయోజనాల దృష్ట్యా పునరుద్ధరించుకుంటాడు."

ప్రాచీన ప్రపంచంలో మనిషి తనను సృష్టించిన ఆ దేవుడు తన పట్ల న్యాయ బద్ధతతో వుండాలని ఆశించడం జరిగింది.

మతంలో వచ్చిన మరో రకమైన విప్లవం ఇది.

ఈ విధంగా మత సంబంధమయిన విప్లవాలు రెండున్నాయి. ఒకటి-బాహ్య విప్లవము, మరొకటి అంతరిక విప్లవము. బాహ్య విప్లవము మతాధికార పరిరక్షణ క్షేత్రానికి సంబంధించినది. మానవ సమాజం మీద భగవంతుని ఆధిపత్యానికి సంబంధించిన ప్రణాళిక విషయమై మతంలో సంభవించే మార్పులను గురించి ప్రస్తావించేది ఆంతరిక విప్లవము. బాహ్య విప్లవం వాస్తవంగా మత సంబంధమైన విప్లవం కానే కాదు. తనది చెందని ప్రాంతంలో ఆధిపత్యాన్ని సంతరించుకొని ప్రాదేశిక (అధికార) పరిధిని కల్పించుకున్న మతం మీద శాస్త్ర విజ్ఞానం సాగించిన విప్లవం ఈ బాహ్య విప్లవం. ఆంతరిక విప్లవం మాత్రమే వాస్తవమైన విప్లవం. ఫ్రెంచి విప్లవం, రష్యా విప్లవం వంటి రాజకీయ విప్లవాలతో దీన్ని పోల్చవచ్చు. ఇది రాజ్యాంగం మార్పుని లోబరుచుకున్నట్టిది. ఈ విప్లవం వలన భగవంతుని ఆధిపత్య ప్రణాళికను మార్చటం, సవరించటం, పునర్నిర్మించటం జరిగింది. పురాతన దైవిక ఆధిపత్య ప్రణాళిక విషయంలో ఈ అంతరిక విప్లవం ఎంత లోతయిన, విస్తారమైన మార్పుల్ని తెచ్చిందో

తేలికగా గ్రహించవచ్చు. ఈ విప్లవం వల్ల భగవంతుడు తెగలోని సభ్యునిగా తన ఉనికిని కోల్పోయాడు. అప్పట్నించీ అతడు నిష్పక్షపాతి అయ్యాడు. భగవంతుడు మనిషికి తండ్రి అనే భౌతికపరమైన శబ్దార్థం కూడా దీనితో అంతరించింది. అతడు విశ్వానికి సృష్టికర్త అయ్యాడు. భగవంతుని తోటి మనిషికున్న రక్త సంబంధం ఎప్పుడయితే తెగిపోయిందో, అప్పటి నుంచి భగవంతుడు మంచివాడన్న అభిప్రాయానికి అవకాశం ఏర్పడింది. ఈ విప్లవం వల్ల మనిషి కేవలం భగవంతుణ్ణి గుడ్డిగా ఆరాధించే స్థాయికి దిగిపోయి, అతని ఆజ్ఞలను తు.చ. తప్పక అనుసరించటమే కాని తాను చేయగలిగింది ఏమీ లేదనే స్థితికి దిగజారాడు. అప్పట్నించి మనిషి భగవంతుని ఆజ్ఞలు దృఢంగా నమ్మటమే కాక వాటిని పరిరక్షించుకోవలసిన బాధ్యత గల వాడయ్యాడు. ఈ విప్లవం వల్ల భగవంతుడు సంఘరక్షకుడుగా, సంఘ శ్రేయోభిలాషిగా తన ఉనికిని కోల్పోయాడు. అంతేకాదు దైవిక వ్యవస్థకి కేంద్ర బిందువుగా తన అస్తిత్వాన్ని కోల్పోయాడు. ఈ దైవిక వ్యవస్థలో కేంద్ర బిందువులుగా మనిషి, సంఘం తమ స్థానాల్ని మార్చుకున్నాయి. ఇప్పుడు మనిషి వాటికి కేంద్ర స్థానంలోనికి వచ్చాడు. దైవిక ఆధిపత్యానికి సంబంధించిన మతపరమైన ఆదేశిక సూత్రాలపై వచ్చిన ఈ విప్లవాన్ని విశ్లేషించటం వల్ల ఒక ప్రధాన ప్రయోజనం వుంది. మతతత్వాన్ని విలువ కట్టటానికి అవసరమైన ఆదర్శాలను కనుక్కోవటమే దాని ప్రయోజనం. అవహానంతో పాఠకులు ఈ ఆదర్శాలు ఎక్కడున్నాయి. అవేమిటి? అని మాత్రం నన్ను ప్రశ్నించవద్దు. ముందు రాబోయే చర్చల్లో పాఠకులు అలాంటి ప్రత్యేకమైన ఆదర్శాలను వేర్వేరు పేర్లతో చూడలేకపోవచ్చు కానీ ఏది ఒప్పు ఏది తప్పు అని నిర్ణయించటానికి అవసరమైన ఆదర్శాల చుట్టూ ఈ మతపరమయిన విప్లవం తిరుగుతుందనే విషయం గుర్తించకపోరు. అలా గుర్తించలేకపోతే, నేను ఈ చర్చ మొత్తంలో అంతర్లీనమయి వున్న విషయాన్ని వెల్లడి చేస్తాను. దైవిక ఆధిపత్యానికి సంబంధించి అంగీకరించిన మత సంబంధమైన ఆదర్శాల విషయంలో విభేదాలు ఆధారంగా పురాతన ఆధునిక సమాజాల మధ్య వున్న తేడాను గురించిన పరిశీలనతో మనం ప్రారంభిద్దాం. విప్లవానికి ఒక చివరన మత సంబంధమైన ఆదర్శాలతో ప్రాచీన సమాజం ఉంది. ఆ కొన సమాజమే. ఈ విప్లవానికి రెండవ చివర ఆధునిక సమాజం, దాని మత సంబంధమైన ఆదర్శాలతో వుంది. ఈ అంను వ్యక్తి ఈ వాస్తవాన్ని ఒక ప్రమాణంగా రూపొందించదలచుకుంటే పురాతన సమాజంలో తప్పో, ఒప్పో నిర్ణయించటానికి–ప్రయోజనం ఆ ప్రమాణానికి గీటురాయి. అలాగే ఆధునిక సమాజంలో ఏది తప్పో, ఏది ఒప్పో నిర్ణయించటానికి ప్రమాణం లేక గీటురాయి న్యాయం. అందువల్ల సమాజంలోని మత సంస్థలో వచ్చిన విప్లవం వాస్తవంగా విప్లవం కాదు. ఎందుకనంటే కేంద్ర బిందువు సమాజం నుంచి వ్యక్తికి మారింది కాబట్టి. ఇది కేవలం ప్రమాణం (ఆదర్శం)లో వచ్చిన విప్లవం మాత్రమే.

నేను సూచించిన ఈ ఆదర్శాలను లేక ప్రమాణాలను కొందరు సందేహించవచ్చు. ఎందువల్లనంటే–వాటిని (ఆ ప్రమాణాలను) ఏర్పరచటానికి నేను అనుసరించిన పద్ధతి కొత్తది కాబట్టి. కానీ నా మనసుకి మాత్రం మతతత్వం మీద తీర్పు ఇవ్వడానికి నేను రూపొందించిన ఈ ప్రమాణాలు (లేక ఆదర్శాలు) వాస్తవమయినవే (సరయినవే)నని అనిపిస్తోంది. ప్రజలు–మానవుని ప్రవర్తనలో ఏది ఒప్పో, ఏది తప్పో నిర్ణయించగలిగిన ప్రమాణం ఒకటి ఏర్పరచటమనేది

నియమాల్లో మొదటి స్థానానికి చెందినటువంటిది. ప్రస్తుత సామాజిక అభిప్రాయాల ప్రకారం నైతిక పర్యవసానం ఏది నిరూపిస్తుందో, ఆ ప్రమాణం ద్వితీయ స్థానానికి చెందినటువంటిది. ఈ రెండు కారణాల దృష్ట్యా మాత్రమే ఆ ప్రమాణాలు సరైనవిగా కనిపిస్తాయి. ఏది ఒప్పో, ఏది తప్పో నిరూపించగలిగిన సామర్థ్యాన్ని అవి మనకు కలిగిస్తాయి. వాటిని స్వీకరించిన సమాజానికి అవి ఎంతగానో తగి ఉంటాయి. సమాజమే అంతిమ లక్ష్యంగా కలిగిన పురాతన సమాజానికి ప్రయోజనమే తగినటువంటి గీటురాయి. నైతిక ప్రవర్తనకు సామాజిక ప్రయోజనం కొంతమేరక యినా ఉండకపోదు. వ్యక్తే అంతిమ లక్ష్యంగా కలిగిన ఆధునిక సమాజానికి న్యాయం అనేది తగినటువంటి గీటురాయి. ఇక్కడ కూడా నైతిక సత్ప్రవర్తన వ్యక్తికి న్యాయం చేకూరడం విషయంలో కొంత పాత్ర వహించవచ్చు. అయితే ఈ రెండు ప్రమాణాల్లో ఏది నైతిక విలువలను బట్టి ఉన్నతమైనది అనే విషయంలో వివాదం ఉంది. అయితే ఇవి అసలు ప్రమాణాలే కావనే తీవ్రమైన అభిప్రాయ భేదం ఉందని మాత్రం నేను అనుకోను. ఈ నియమాలే గనక సర్వశ్రేష్ఠమైనటువంటివి అని గనక అనుకోకపోయేటట్లయితే-నా సమాధానం ఇది. మత తాత్వికత మీద తీర్పు ఇవ్వడానికి అది (ఆ ప్రమాణం) తప్పకుండా దైవ సంబంధి కావాలి. అంతేకాదు అది భూమికి సంబంధించింది కూడా కావాలి. ఏది ఏమయినా హిందూ మత తాత్వికతను పరీక్షించటానికి నేను ప్రతిపాదించి-అనువర్తింపచేసే-ప్రమాణాలు మాత్రం ఇవే!

## II

ఇదంతా పెద్ద డొంకతిరుగుడు వ్యవహారం. కానీ ప్రధాన ప్రశ్నను గురించిన విచారణలో ప్రాథమికమైన ఈ విషయమంతా అవసరమైనదే. ఏది ఏమయినప్పటికీ, ఒక విషయాన్ని గురించిన విచారణ ప్రారంభమయినపుడు ప్రతి వ్యక్తికీ ఎదురయ్యే తొలి కష్టం యిదే. హిందువు అనేవాడు ఎవడూ కూడా ఈ విధమైన విచారణను ఎదుర్కోటానికి సిద్ధంగా లేడు. అతడు సాధారణంగా మతం ఏమాత్రం ప్రాముఖ్యం లేనిదే అని మొదట వాదిస్తాడు. లేకపోతే అన్ని మతాలు మంచివే అనే తులనాత్మక మత పరిశీలనం ముద్రను వేసుకొని, దాని నీడను ఆశ్రయం పొందడానికి ప్రయత్నిస్తాడు. ఈ రెండు అభిప్రాయాలు కూడా తప్పుడు అభిప్రాయాలే! ఏమాత్రం సమర్థనీయాలు కావు.

ఒక సాంఘిక శక్తిగా మతాన్ని అలక్ష్యం చేయలేం. మతం-చరిత్ర అనేవి అనుక్షణం ఒకదానికి ఒకటి తాకే పడుగు పేకల వంటివి అని హెర్బర్ట్ స్పెన్సర్ మతాన్ని గూర్చి నిర్వచిస్తూ అన్నాడు. ఇది ఏ సమాజంలోనైన వాస్తవమే. కాని మతం, భారతదేశచరిత్ర అనే పడుగును ప్రతిచోటా తాకే పేక మాత్రమే కాదు. హిందువు మనస్సును తీర్చిదిద్దిన పడుగూ పేకా-రెండూ అదే. హిందువు జీవితాన్ని ప్రతిక్షణం నియంత్రించిన సాధనం అది. జీవిత కాలంలో వ్యక్తి ఎలా ప్రవర్తించాలి అనేది చెప్పటమే కాదు, చనిపోయిన తర్వాత అతని శరీరాన్ని ఎలా పారవేయాలో కూడా ఆదేశించిందే మతం. అతను ఎప్పుడు ఎలా లైంగిక కార్యకలాపాల్లో పాల్గొనాలో కూడా నిర్దేశించింది. పిల్లవాడి పుట్టుకలో ఎలా జాతక కర్మలు నిర్వహించాలో చెప్పింది. నామకరణం ఎలా చేయాలో చెప్పింది. అన్నప్రాశన ఎలా నిర్వహించాలో ఆదేశించింది. అతడు ఏ వృత్తిని

అవలబించాలో, ఏ స్త్రీని పెండ్లాడాలో కూడా చెప్పింది. అంతేకాదు అది అతను ఎవరితో కలిసి భుజించాలో, ఎలాంటి ఆహారాన్ని తినాలో, ఏ కూరగాయలు వండుకుతినాలో, ఏవి తినకూడదో అధికారికంగా (శాసనరూపంలో) చెప్పింది. దైనందిన జీవితాన్ని ఎలా గడపాలో, ఎన్నిసార్లు భుజించాలో, రోజులో ఎన్నిసార్లు ప్రార్థన చేయాలో కూడా నిర్దేశించింది. హిందువు జీవితంలో మతంచేత ఆజ్ఞాపించబడని లేక మతప్రమేయంలేని ఏ కార్యకలాపమూ లేదు. ఇది ఒక విప్లాక్షికమైన విషయమని భావించి విద్యావంతులయిన హిందువు సైతం వాటిపట్ల ఆసక్తిని ప్రదర్శించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

అదలావుంచితే మతం ఒక సాంఘికశక్తి. నేవింతకుముందే సూచించినట్లుగా దైవిక ఆధిపత్య ప్రణాళికకు మూలంగా మతం నిలబడుతుంది. ఆ ప్రణాళిక సమాజం అనుసరించటానికి తగిన ఆదర్శంగా మారింది. నిర్మితమైనదన్న అర్థంలో ఆదర్శం నేడు తన ఉనికిని కోల్పోయిందని అనవచ్చు. అది వునికిలో లేనప్పటికీ, అది వాస్తవమే. ఆదర్శంగా దానికి పూర్తి శక్తి వున్నది. ప్రతి ఆదర్శంలోనూ ఆ శక్తి అంతర్లీనంగా కనిపిస్తుంది. మత ప్రాధాన్యాన్ని నిరాకరించే వాళ్ళందరూ కూడా దీన్ని మర్చిపోవడమే కాదు. మత ఆదర్శం వెనుక దానిలో కలిపిపోయి, పనిచేసే శక్తిసామర్థ్యాలన్నీ, జనామోదాన్నీ గుర్తించటంలో కూడా విఫలురవుతున్నారు. ఇలా జరగడానికి వాస్తవానికీ ఆదర్శానికీ మధ్య వున్న తేడాని గుర్తించటంలో పొరపాటు పడటమే. ఆ ఆదర్శమనేది మతపరమయినదా లేక మతరహితమయినదా అనే విషయం వాళ్ళు పరిగణించడంలేదు. కానీ ఈ రెండు ఆదర్శాల ప్రమాణాన్ని వాని సాపేక్షక శక్తికి సంబంధించిన మరో పరీక్ష ద్వారా నిరూపించవచ్చు. మనిషి ఆచరణాత్మక సహజ ప్రవృత్తుల మీద ఆధిపత్యం నెరపే విషయాన్ని గుర్తించటమే ఆ పరీక్ష. ఈ ఆదర్శం అనేది అత్యంత ప్రాచీనమయిన దానికి సంబంధించినది. కాని మనిషి ఆచరణాత్మక సహజ ప్రవృత్తులు తక్షణ వర్తమానానికి సంబంధించినవి. ఈ విధంగా ఈ రెండింటినీ, అనగా మనిషి ఆచరణాత్మక సహజాతాల్నీ, సుదూర ఆదర్శాలకు ఎదురుగా నిలబెట్టినప్పుడు ఈ రెండింటిమధ్యా భేదం గ్రహించటంలో పొరపాటుపడే అవకాశం లేదు. ఒకదానినొకటి వ్యతిరేకిస్తున్నా, మనిషి ఆచరణాత్మకమయిన సహజాతాలు నిర్దేశిత మత సంబంధమయిన ఆదర్శాలకు లొంగి ప్రవర్తిస్తున్నాయి. ఇదే సమయంలో మతరహిత ఆదర్శాలతో విభేదిస్తున్న మనిషి సహజాత ఆదర్శాలు వాటికిలొంగి ప్రవర్తించకపోవటం కనిపిస్తుంది. దానికర్థం ఏమిటంటే– మానవజాతి మీద ఐహిక ప్రయోజనాలతో సంబంధం లేకుండా మత ఆదర్శాలు పట్టుని కలిగివున్నాయనే. సెక్యులర్ ఆదర్శాల విషయంలో ఇలా చెప్పలేం. భౌతిక ప్రయోజనాలు కలిగించే శక్తి మీదనే దాని సామర్థ్యం ఆధారపడి వుంటుంది. మానవజాతి మీద ఈ రెండు ఆదర్శాల శక్తి, సామర్థ్యాలమధ్య వున్న తేడాను యిది స్పష్టం చేస్తోంది. మత ఆదర్శం మీద ఎంతకాలమయితే ప్రభావం చూపించే నమ్మకం వుంటుందో అంతకాలమూ అది పనిచేస్తూనే వుంటుంది. మతాన్ని విస్మరించడం అంటే విద్యుత్ తంత్రిని అలక్ష్యం చేయడమే. (To ignore religion is to ignore a live wire)

అన్ని మతాలూ సత్యమైనవే, మంచివే అనుకోవడం పొరపాటు విశ్వాసాన్ని కలిగి వుండడమే. తులనాత్మక మత అధ్యయనం అనేదానివల్ల ఈ విశ్వాసం ఏర్పడిందని చెప్పడానికి

విచారిస్తున్నాను. మానవజాతికి ఈ తులనాత్మక పరిశీలనం చేసిన ఒక మహోపకారం ఒకటి ఉంది. ఇది తాను చెప్పేదే వాస్తవానికి మంచి అని చెప్పే వ్యక్త (revealed) మతాల హక్కుని, అణచివేతను బద్దలుకొట్టింది. కేవలం అకారణమైన పూర్వాభిప్రాయాలమీద నిలబడినటువంటివైన వాస్తవ, కృత్రిమ మతాల మధ్యవున్న అస్థిరమైన భేదాన్ని ఈ తులనాత్మక మతం నిరాకరించడం ఒక మంచి విషయమైతే, మతాన్ని గురించి కొన్ని తప్పుడు అభిప్రాయాల్ని ఏర్పరచడం మాత్రం శోచనీయమైన విషయం. నేను ఇంతకు ముందు చెప్పినట్లుగా అన్ని మతాలు సమానంగా మంచివే, వాటిమధ్య భేదం పాటించవలసిన అవసరం లేదనేది అవి వ్యక్తం చేసిన అభిప్రాయాలలో అత్యంత భయంకరమైనటువంటి అభిప్రాయం. దీనికంటే పెద్దతప్పు మరొకటి లేదు. అన్ని సామాజిక ప్రభావాల్లాగే వ్యవస్థల్లాగే మతం ఒక సంస్థ. లేక ప్రభావితాంశం. అది తన గుప్పిట్లోని సమాజానికి మంచీ చేయవచ్చు, లేక అపకారం కలుగచేయవచ్చు. ప్రొఫసర్ టీలే పేర్కొన్నట్లు[12] మతం– "మానవజాతి చరిత్రలో అత్యంత బలమైన చాలకశక్తి కలది. అది జాతులను ఏర్పరచింది. ఛిన్నాభిన్నం చేసింది. సామ్రాజ్యాలు ఏకం చేసింది. విడగొట్టింది. అత్యంత క్రూరమైన ఆటవిక పనులు చేయించింది. ఆచారాల పిచ్చిని కలుగజేసింది. ప్రశంసనీయమైన శౌర్యపరాక్రమ చర్యలకు స్పందనవిచ్చింది. వైరాగ్యాన్ని, ప్రార్థనాతత్వాన్ని కలిగించింది. పైశాచికమైన యుద్ధాలకు మూలమయింది. విప్లవాలకూ, వినాశనానికీ హేతువయింది. జాతులకు స్వేచ్ఛ, సంతోషం, శాంతి యిస్తూనే– మరోవైపు క్రూర ప్రభుత్వాలకు మద్దతును ఇచ్చింది. ఒక్కో పర్యాయం సంకెళ్ళను తెగగొట్టింది. మరోసారి కొత్తవయిన, మేధోవంతమయిన నాగరికతల అస్తిత్వానికీ, వ్యాప్తికీ హేతువయింది. మరొకసారి కళలు, శాస్త్రజ్ఞానం, అభ్యుదయానికి అడ్డుకట్టయింది."

మతంమూలంగా ఏర్పడిన ఇటువంటి ఆశ్చర్యకరమైన వైరుధ్యాల వెనుకవున్న శక్తిని చూసి కూడా, దాని నిర్మాణాన్ని పరిశీలించకుండానే, చాలామంచిదనీ, ఉత్తమ ఆదర్శాలు కలిగినటువంటిదనీ అంటున్నారు. దైవిక ఆధిపత్య ప్రణాళిక కలిగివున్నటువంటి ఏమతాన్ని తీసుకున్నా, అది కలిగివున్న సామాజిక ఆదర్శం మీదే ఏ విషయమైనా ఆధారపడి ఉంటుంది. తులనాత్మక మతపరిశీలనా శాస్త్రం స్వీకరించనటువంటి ప్రశ్న ఇది. తులనాత్మక మతం ఎక్కడయితే అంతమవుతుందో, అక్కడ ఆరంభమయ్యే విషయం ఇది. మతాలు ఎన్నో వున్నా అవన్నీ మంచివేనంటూ హిందువు తప్పించుకుంటున్నాడు. కానీ అది వాస్తవం కాదు. హిందువుల్లో చాలామంది హిందూమతతాత్వికతకు సంబంధించిన యిలాంటి విచారణను భూస్థాపితం చేయడానికి చూస్తున్నారు. ఏమయినప్పటికీ దాన్నుంచి తప్పించుకోలేరు. వారు దాన్ని ఎదుర్కొని తీరవలసిందే!

## III

ఇక ఇప్పుడు విషయానికొద్దాం. హిందూ మతతాత్వికతను నిర్ణయించడానికి ఇటు న్యాయసంబంధమైన పరీక్షను, అటు ప్రయోజన సంబంధమైన పరీక్షను రెండింటినీ కూడా అనువర్తింపచేయదలచుకున్నాను. మొదట న్యాయసంబంధమైన పరీక్షను అనువర్తిస్తాను. అది

చేయడానికి ముందు, అసలు న్యాయసంబంధ సూత్రమంటే నేను ఏమనుకుంటున్నానో దాన్ని వివరిస్తాను. ప్రొఫెసర్ బేర్గాన్ 13 కంటే ఎవరూ దీనిని చక్కగా వ్యాఖ్యానించలేదు. అతని వ్యాఖ్యానం ప్రకారం– న్యాయసంబంధమైన సూత్రమంటే–నైతిక వ్యవస్థకు మూలమయిన ఇతర అన్ని సూత్రాల సంక్షేపరూపమైన సూత్రం. ధర్మం ఎప్పుడూ సమానత్వభావనని, "నష్టపరిహార" పరిమాణాన్ని కాపాడుతుంది. న్యాయం సమానత్వాన్ని సూచిస్తుంది. సమానత్వానికున్న విలువను బట్టి చూస్తే– అది నియమాలు, నిబంధనలు, హక్కులు, అధికారాలు వీటికి సంబంధించినది. మానవులందరూ సమానులే అనేది సాధారణ సారాంశం. ఆ సారాంశం అందరికీ ఒకేరకమైన ప్రాథమిక హక్కులను, సమానమైన స్వేచ్ఛను–అధికారాన్ని కల్పిస్తోంది.

సంగ్రహంగా న్యాయమనేది స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రాలకున్న మారుపేరు. ఈ అర్థంలోనే నేను న్యాయమనే 14 పదాన్ని హిందూమతాన్ని విమర్శించటానికి గీటురాయిగా వాడుతున్నాను.

ఈ విలువల్లో దేన్ని హిందూమతం గుర్తించింది? వరుసగా ఒక ప్రశ్న తరువాత మరో ప్రశ్నను పరిశీలిద్దాం

1. హిందూమతం సమానత్వాన్ని గుర్తించిందా?

ఈ ప్రశ్న ఎవరికైనా తక్షణమే కులవ్యస్థని గుర్తుకుతెస్తుంది. కులవ్యవస్థలో గుర్తించదగిన అంశం ఒకటి ఏమిటంటే– ఒకే సమతలంమీద భిన్నకులాలు (అడ్డంగా) సమాంతరస్థితిలో ఒకదాని పక్కన మరొకటి వున్నవి కావు. మరి సమతలంమీద నిలువుగా ఒకదానిమీద మరొకటి వున్నటువంటివి. కులసృష్టికి మనువు బాధ్యుడు కాకపోవచ్చు. మనువు వర్ణ పవిత్రత గురించి బోధించాడు. వర్ణమే కులానికి మూలమని ఇంతకుముందే నేను నిరూపించాను. కులవ్యవస్థకు కారకుడు లేకపోయినా, మనువు ఆ (కులశబ్ద) అర్థంలో మూలపురుషుడే! కులవ్యవస్థకు సంబంధించి మనువు తప్పు ఉన్నా లేకున్నా కులాల మధ్య అంతస్తుల్ని ఏర్పాటుచేసే వర్గాల్ని కల్పించే సిద్ధాంతాల్ని వ్యాప్తిలోకి తీసుకురావటానికి మాత్రం కారకుడనడంలో సందేహం లేదు.

మనువు ప్రణాళికలో బ్రాహ్మణుడు పై తరగతికి చెందినవాడు. అతని దిగువవాడు క్షత్రియుడు. అతని తరువాతవాడు వైశ్యుడు. అతని క్రిందివాడు శూద్రుడు. వీరందరికంటే అడుగు తరగతికి చెందుతాడు అతిశూద్రుడు (అస్పృశ్యుడు). ఈ తరగతి విభజన, పద్ధతి అసమానతా సిద్ధాంతాన్ని ప్రతిపాదించే మరో సూక్ష్మమార్గం. కాబట్టి హిందూమతం సమానత్వాన్ని గుర్తించలేదని చెప్పటం వాస్తవం అవుతుంది. రాజాస్థానాలలో జరిగే ఉత్సవాల్లో పాల్గొనే వ్యక్తుల స్థానాలు నిర్ణయించటానికి చేసిన అధికార సూత్రం వంటిది ఇది ఏమాత్రం కాదు. మరి అన్ని ప్రదేశాల్లో, అన్ని కాలాల్లో, సమస్త ప్రయోజనాలకు అనుగుణంగా శాశ్వతంగా ఆయా తరగతుల మధ్య ఒక నిర్ణీతమైన సాంఘిక సంబంధం కొనసాగటానికి చేసిన ఏర్పాటు మాత్రమే.

జీవితంలో ప్రతిసన్నివేశంలో మనువు జీవిత ప్రధానశక్తులమధ్య ప్రవేశపెట్టిన ఈ అసమానతను ప్రదర్శించటానికి చాలా సమయం అవసరం. కానీ బానిసత్వం, వివాహం, న్యాయసూత్రాల నియమం మొదలైన కొన్నింటిని మాత్రమే గ్రహించి, నేను ఈ అసమానతను మనువు ఏవిధంగా కల్పించాడో ఉదాహరణ పూర్వకంగా వివరిస్తాను.

మనువు బానిసత్వాన్ని విధించాడు. 15 కానీ దాన్నతడు కేవలం శూద్రులకే పరిమితం చేశాడు. అగ్రవర్ణాలు మూడింటికీ–శూద్రుల్ని మాత్రమే బానిసలుగా రూపొందించాడు. కానీ ఆనాడు అగ్రవర్ణాలవారు శూద్రులకు బానిసలు కారు.

మనువు- ప్రబోధించిన ధర్మశాస్త్ర సూత్రాలకు విరుద్ధంగా శూద్రులే కాకుండా, ఇతర మూడు వర్ణాల వారు కూడా బానిసలుగా (సమాజ) ఆచరణలో ఉన్నట్లు స్పష్టమైన ఆధారాలు వున్నాయి. ఈ పద్ధతి ఉన్నదని గుర్తించిన (మనువుకు తర్వాత కాలం వాడైన) నారదుడు ఒక కొత్త శాసన సూత్రాన్ని చేశాడు. 16 నారదుడుచేసిన ఆ కొత్త సూత్రం ఈ క్రిందిది.

"ఎక్కడైతే ఒక వర్ణానికి చెందిన వ్యక్తి తన ప్రత్యేక విధుల్ని ఉల్లంఘిస్తాడో, అక్కడ తప్ప చతుర్వర్ణాలకు సంబంధించిన బానిసత్వం విలోమ పద్ధతిలో ఆజ్ఞాపించడం జరగలేదు. ఆ ఉద్దేశ్యంలో బానిసత్వం భార్య పరిస్థితితో పోలిక కలిగినటువంటిది" (5–39)

బానిసత్వాన్ని విధించడం దుష్టమైనదే! కానీ బానిసత్వం సూత్రాన్ని దానంతట దాన్ని స్వేచ్ఛగా విడిచిపెట్టి ఉంటే, తప్పకుండా దాని మూలంగా కనీసం ఒక్క ప్రయోజనకరమైన ఫలితమైనా ఉండేది. దానికి చదును చేసే శక్తి ఉంది. వర్ణవ్యవస్థ తాలూకు పునాది నాశనమయి ఉండేది. దానివల్ల బ్రాహ్మణుడు అస్పృశ్యునికి బానిస అయి ఉండేవాడు. అస్పృశ్యుడు బ్రాహ్మణునికి యజమాని కాగలిగేవాడు. నిర్బంధరహిత బానిసత్వం సమానసూత్రంగా కన్పిస్తుండగా, దాన్ని రూపుమాపటానికి ఒక ప్రయత్నం జరిగింది. కాబట్టి బానిసత్వాన్ని గుర్తించడంలో మనువు అతని అనుయాయులు వర్ణ విధానానికి వ్యతిరేకంగా, విలోమపద్ధతిలో మాత్రం బానిసత్వం ఉండకూడదని స్పష్టంగా నిర్దేశించారు. అంటే ఒక బ్రాహ్మణునికి మరో బ్రాహ్మణుడు బానిస కావచ్చు. కానీ అతను మరొక వర్ణానికి అంటే క్షత్రియ, వైశ్య, శూద్ర లేక అతిశూద్ర వర్ణాలకుచెందిన వారికి బానిస కారాదు. పైపెచ్చు బ్రాహ్మణుడు మాత్రం మిగిలిన నాలుగు వర్ణాల వారిని బానిసలుగా చేసుకోవచ్చు. క్షత్రియునికి క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు, అతిశూద్రుడు వీరిలో ఎవరైనా బానిస కావచ్చు. కానీ బ్రాహ్మణుడు మాత్రం బానిస కాదు. వైశ్యునికి వైశ్యుడు, శూద్రుడు, అతిశూద్రులు బానిసలు కావచ్చు కానీ బ్రాహ్మణ క్షత్రియులు బానిసలు కాదు. శూద్రుడు శూద్రుడ్ని, అతిశూద్రుడ్ని మాత్రమే బానిసలు చేసుకోవచ్చు. అతిశూద్రుడు అతిశూద్రుడ్ని బానిసలు చేసుకోవచ్చు. కానీ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అతనికి బానిసలు కారు.

ఇక వివాహ విషయంలో మనువు అభిప్రాయాలు చూద్దాం. వివిధ వర్ణాల మధ్య జరిగే వర్ణాంతర వివాహం విషయంలో అతడు విధించిన నియమాలు ఈక్రింద పేర్కొంటున్నాను.

మనువు ఈవిధంగా చెప్తాడు:

"ద్విజులు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు) ముందుగా తమ వర్ణానికి చెందిన స్త్రీని మాత్రమే వివాహం చేసుకోవాలి. కానీ కామం (కోరిక)తో తిరిగి ఇంకొక వివాహం చేసు కోవాలంటే అనులోమక్రమంలో ఇతర స్త్రీలను కూడా మీద చెప్పబోయే క్రమంలో వివాహం చేసుకోవచ్చు" (3–12)

"శూద్ర స్త్రీ ఒక్కతయే శూద్రునకు భార్య. ఆమె, వైశ్యస్త్రీ ఇద్దరు వైశ్యునకు భార్యలు. వారిద్దరు, క్షత్రియ స్త్రీ క్షత్రియునకు భార్యలు. వారుముగ్గురు, బ్రాహ్మణ స్త్రీ బ్రాహ్మణునకు భార్యలు కావచ్చు" (3–13)

మనువు వర్ణాంతర వివాహాన్ని వ్యతిరేకించకపోలేదు. ప్రతివర్ణంవాళ్ళు, తమ వర్ణంలోని వాళ్ళను మాత్రమే వివాహం చేసుకోవాలనేది అతను విధించిన నియమం. కానీ వర్ణాంతర వివాహాన్ని తాను చెప్పిన పద్ధతిలో తప్ప, మరోరకంగా అంగీకరించడు. కానీ ఇక్కడ కూడా అతడు వర్ణాల మధ్య ప్రతిపాదించిన అసమానతా సూత్రానికి హాని కలుగకుండా మాత్రమే అంగీకరించాడు. బానిసత్వంలాగానే వర్ణాంతర వివాహాన్ని కూడా అనులోమ క్రమంలోనే కాని విలోమ క్రమపద్ధతిలో అంగీకరించలేదు. బ్రాహ్మణుడు వర్ణాంతర వివాహం చేసుకునేటప్పుడు, తనకంటే క్రింది తరగతిలోని ఏ స్త్రీని అయినా వివాహం చేసుకోవచ్చు. క్షత్రియుడు తనకంటే క్రిందవైన వైశ్య, శూద్ర వర్ణాలకు చెందిన స్త్రీలను వివాహం చేసుకోటానికి స్వేచ్ఛ వుంది. అంతేకాని తనకంటే ఉన్నత వర్ణమైన బ్రాహ్మణస్త్రీని మాత్రం చేసుకోరాదు. వైశ్యుడు తనకంటే తక్కువైన శూద్రస్త్రీని వివాహం చేసుకోవచ్చు. కాని తనకంటే పైవర్ణం వారైన బ్రాహ్మణ, క్షత్రియ స్త్రీలను వివాహం చేసుకోకూడదు.

ఈ భేదభావం ఎందుకు? దీనికి ఒక్కటే సమాధానం. మనువుకు తన ప్రధాన లక్ష్యమైన అసమానతా సూత్రాన్ని రక్షించుకోవాలనే తాపత్రయం తప్ప వేరొకటి కాదు.

ఇక న్యాయశాస్త్ర నియమాన్ని తీసుకుందాం. న్యాయశాస్త్ర నియమం అంటే–చట్టం దృష్ట్యా సమానమనేది సులభంగా అర్థమయ్యే విషయం. ఈ విషయాన్ని గురించి మనువు ఏంచెప్పాడో తెలుసుకోవాలని ఆసక్తి కలిగినటువంటివారికోసం, అతని సూత్రాలలోని విషయాన్ని తేలిగ్గా అర్థమయ్యేందుకు వీలుగా వివిధ శీర్షికల క్రింద అమర్చి ఈ దిగువన పొందుపరుస్తున్నాను.

సాక్షుల గురించి: మనువు ప్రకారం వారు ఈ క్రింది విధంగా ప్రమాణం చేయాలి.

"దేవ, బ్రాహ్మణుల విగ్రహాల సమక్షంలో ఉత్తర దిక్కుగా అయినా, తూర్పుదిక్కుగా అయినా నిలబడి బ్రాహ్మణుడు మొదలైన సాక్షులను, తానును శుచులై-న్యాయాధిపతి ఉదయంపూట సత్యాన్ని చెప్పమని అడగాలి" (8-87)

"కేవలం 'చెప్పు' అనే పదంతో బ్రాహ్మణుడ్ని, 'నిజాన్ని చెప్పమని' క్షత్రియుడ్ని, 'అబద్ధమాడితే గోవుల్ని, ధాన్యాన్ని, బంగారాన్ని దొంగిలించినపుడు కలిగే పాపంలాంటి పాపం కలుగుతుందని' వైశ్యుడ్ని, 'అబద్ధమాడితే సకల పాపాలు నీకు కలుగుతాయని' శూద్రుడికీ చెప్పి- సాక్ష్యం చెప్పమనాలి" (8-88)

"(అబద్ధం చెబితే) సత్యం (ఫలం) నశిస్తుందని బ్రాహ్మణునిచేత, వాహనాలు, ఆయుధాలు నశిస్తాయని క్షత్రియునిచేత, గోవులు, ధాన్యం, బంగారం పోతాయని వైశ్యునిచేత, సకలపాపాలు కలుగుతాయని శూద్రుని చేతను- వారి వారి శిరస్సులపై తాకి వేరు వేరుగా ప్రమాణం చేయించాలి" (8-113)

మనువు అబద్ధపు సాక్ష్యాలు ఇచ్చేవారిని గురించి కూడా చెప్పాడు. అతని ఉద్దేశ్యం ప్రకారం అబద్ధపు సాక్ష్యం చెప్పడం నేరం. దాన్ని ఇలా చెబుతాడు.

"సత్యరూపమైన ధర్మం నశించకుండా ఉండటానికీ, అసత్యరూపమైన అధర్మాన్ని వారించడానికీ, కూట (అబద్ధ) సాక్ష్యం విషయమై పూర్వులైన మునులచేత నిర్ణీతములైనవి ఈ శిక్షలు" (8-122)

"అలాంటి అబద్ధం సాక్ష్యం చెబితే క్షత్రియుడు మొదలైన మూడు వర్ణాల వారికి మొదట తగిన శిక్ష విధించి, ఆపైన దేశబహిష్కారం చేయాలి. బ్రాహ్మణులనైతే శిక్షలేకుండా దేశం నుంచి బయటకు సాగనంపాలి" (8-123)

కానీ మనువు ఈ విషయంలోనూ ఒక మినహాయింపును కల్పించాడు.

"అనేకమంది భార్యలు కలవాడు- 'నీమీద మాత్రమే ప్రేమ సుమా!' అని ఒక స్త్రీ విషయంలో అన్నా! వివాహ సమయంలో 'మరియొకతెనెవరినీ వివాహమాడను' అని అన్నా, గోవులకు ఆహారం సంపాదించే విషయంలోను, అగ్నిహోత్రం కార్యం విషయంలోనూ, ప్రాణాపాయ పాపాన్ని తప్పించే విషయంలోనూ బ్రాహ్మణుడు ఎలాంటి శపథం (ఒట్టుపెట్టుకున్నా) చేసినా తప్పులేదు" (8-112)

అతిముఖ్యమైన శిక్షార్హనేరం (క్రిమినల్ అఫెన్స్) చేసిన ఆయా వ్యక్తుల కార్యకలాపాల విషయానికి సంబంధించి మనువుచేసిన అధికార శాసనాన్ని ఉదాహరణ పూర్వకంగా ప్రస్తావిస్తాను.

పరువు నష్టం విషయమైన నేరానికి సంబంధించి మనువు చెప్పినదాన్ని చూద్దాం.

"బ్రాహ్మణుని నీవు దొంగవని తూలనాడిన క్షత్రియుడికి నూరుపణాలు శిక్షగా విధించాలి. ఈపనే చేస్తే వైశ్యునికి నూటయాభైగాని, రెండు వందలుగాని పణాలు జరిమానాగా విధించాలి. అదే శూద్రుడైతే వధించడానికి అతడు అర్హుడు" (8–267)

"క్షత్రియుడ్ని పైనచెప్పినట్లు ఆక్షేపించిన బ్రాహ్మణునికి యాభై పణాలు దండనగా విధించాలి. వైశ్యుని ఆక్షేపిస్తే ఇరవై అయిదు పణాలు, శూద్రుని ఆక్షేపిస్తే పన్నెండు పణాలు దండనగా విధించాలి" (8–268)

అవమానించే నేరాన్ని తీసుకుందాం. దీన్నిగురించి మనువు ఇలా చెప్పాడు.

"శూద్రుడు బ్రహ్మ అధమ స్థానం నుంచి పుట్టిన ఏకజన్ముడు, అధముడు కాబట్టి– బ్రాహ్మణుని పాపపు తిట్లు తిడితే అతని నాలుకను కోయించాలి" (8–270)

"బ్రాహ్మణులను 'ఓరీ! దేవదత్తుడా!', 'బ్రాహ్మణాధముడా!' అని అహంకారంతో పేరు, జాతి ఎత్తి ఎవడైతే (శూద్రుడు) తిడతాడో వాడి నోటిలో ఎర్రగా కాల్చిన పది అంగుళాల పైబడిన ఇనుప శీలను దిగగొట్టించాలి" (8–271)

"ఏదోవిధంగా ధర్మస్వరూపాన్ని కొద్దిగా తెలుసుకున్న శూద్రుడు– బ్రాహ్మణునికి గనుక ధర్మాన్ని ఉపదేశిస్తే– వాడి నోటిలోను, చెవులలోను మరిగించిన చమురును రాజు పోయించాలి" (8–272)

తిట్టిన నేరాన్ని తీసుకుందాం. దానిని గూర్చి మనువు ఈ విధంగా చెప్పాడు.

"బ్రాహ్మణులకు, క్షత్రియులకు మధ్య తిట్టుకోవడం సంభవిస్తే దండశాస్త్రం తెలిసిన రాజు బ్రాహ్మణునకు దయతోకూడిన అతి తక్కువ జరిమానాను, క్షత్రియునికి శిక్షలలో మధ్యస్థమైన శిక్షను విధించాలి" (8–276)

"వైశ్యుడు, శూద్రుడు పరస్పరం తిట్టుకుంటే– బ్రాహ్మణ క్షత్రియులకులాగానే శూద్రుని తిట్టిన వైశ్యునకు తొలి (రకం) తప్పుకు విధించే శిక్షను, వైశ్యుని తిట్టిన శూద్రునకు (మలిరకం) తప్పుకు విధించేశిక్షను అమలు పరచాలి" (అంటే దీనికి ముందు బ్రాహ్మణుల్ని (బూతులు) తిట్టిన శూద్రునకు నాలుక కోయడం శిక్షగా చెప్పడం జరిగిందన్నమాట) (8–277)

కొట్టిన నేరాన్ని ఆచరించిన వారిని గురించి మనువు చెప్పిన శిక్షలివి:

"శూద్రుడు ఏ శరీర భాగంతో అయితే బ్రాహ్మణుడ్ని కొడతాడో రాజు శూద్రుని ఆ అవయవాన్ని ఖండింపచేయాలి లేదా, కొట్టిన గాయానికి తగిన నిష్పత్తిలో కత్తిరించాలి అని ధర్మశాసనం" (8–279)

"చెయ్యెత్తిగానీ, కర్రతోగానీ కొడితే చేతిని నరకడం, కాలెత్తి తంతే పాదాన్ని ఖండించడం శిక్షగా శూద్రుడికి విధించాలి" (8–280)

అహంకారాన్ని ప్రదర్శించే నేరం విషయమై మనువు అన్న మాటలివి:

"బ్రాహ్మణునితో సరిసమానంగా ఒకే ఆసనంలో కూర్చోటానికి ప్రయత్నించిన శూద్రుడ్ని కటి ప్రదేశంలో తప్తలోహంతో కాల్పించి, దేశ బహిష్కారం చేయాలి, లేదా వాడి పిర్రనయినా కోయించాలి" (8–281)

"బ్రాహ్మణుడ్ని అవమానించటానికి శూద్రుడు గర్వంతో అతని మీద ఉమ్మివేస్తే రెండు పెదవుల్ని, మీద ఉచ్చపోస్తే లింగాన్ని, యాదృచ్ఛికంగా కాకుండా అవమానించడానికే బ్రాహ్మణుని మీద పిత్తితే గుదాన్ని కోయించాలి" (8–282)

"బ్రాహ్మణున్ని బాధించడానికి అతని జుట్టు, పాదాలు, గడ్డం, వృషణాన్ని ఎవడైతే గర్వించి పట్టుకుంటాడో, ఏవిధమైన సంకోచం లేకుండా వాడిచేతులు నరికివేయాలి" (8–283)

వ్యభిచారం విషయమై మనువు చెప్పిన శిక్షలివి:

"బ్రాహ్మణ స్త్రీతో శూద్రుడు నిజంగా వ్యభిచరిస్తే, వాడికి మరణశిక్ష విధించాలి. నాలుగు వర్ణాల వారి భార్యలు జాగ్రత్తగా అదుపాజ్ఞలలో ఉంచి ప్రత్యేకంగా రక్షింపదగినవారు" (8–359)

"ఉత్తమజాతి (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతుల) కన్యను, అధమజాతి పురుషుడు (శూద్రుడు) అనుభవిస్తే (అలాంటి నేరం చేసిన) వాడికి మర్మావయవాన్నైనా కోయించాలి లేదా మరణశిక్షయినా విధించాలి. కానీ సజాతికి చెందిన కన్యనే గనుక పొందితే– ఆమె తండ్రి కోరితే శుల్కాన్ని చెల్లించి అతడే పెళ్ళిచేసుకోవచ్చు" (8–366)

"భర్త మొదలైన వారిచే సంరక్షితయినా, కాకున్నా బ్రాహ్మణస్త్రీని శూద్రుడు పొందితే విధించవలసిన శిక్షలు ఇవి. సంరక్షిత కాని స్త్రీని పొందితే మర్మావయవ విచ్ఛేదం, అతని ధనాన్ని మొత్తం తీసుకోవడం చేయాలి. రక్షిత అయిన స్త్రీని పొందితే అతని సర్వస్వాన్ని తీసుకోవడంతోపాటు అతన్ని వధించాలి" (3–374)

"వైశ్యుడు రక్షిత అయిన బ్రాహ్మణ స్త్రీని పొందినట్లైతే ఒక సంవత్సరం కారాగార వాసం విధించటమే కాకుండా, అతని సంపద మొత్తం స్వాధీనం చేసుకోవాలి. క్షత్రియుడు రక్షిత అయిన స్త్రీని పొందితే, వేయి పణాలు జరిమానా పుచ్చుకుని, గాడిద మూత్రంతో తలగొరిగించాలి" (3-375)

"అరక్షిత అయిన బ్రాహ్మణ స్త్రీని వైశ్య, క్షత్రియులు పొందినట్లయితే వైశ్యునికి ఐదువందలునూ, క్షత్రియునికి వేయి పణాలున్నూ రాజు దండనగా విధించాలి" (3-376)

"ఆవైశ్య క్షత్రియులిద్దరూ రక్షిత అయినటువంటి, మంచి గుణాలు కలిగినటువంటి బ్రాహ్మణ స్త్రీని పొందినట్లైతే శూద్రునకులాగా వధించాలి, లేక వైశ్యుని ఎర్రదర్భలచేతనూ, క్షత్రియుని మామూలు రెల్లుగడ్డిచేతను చుట్టి కాల్చేయాలి." (8-377)

"రక్షిత క్షత్రియ స్త్రీని వైశ్యుదును, గుప్త వైశ్య స్త్రీని క్షత్రియుడు పొందినట్లైతే వారిరువురికి- గుప్త బ్రాహ్మణ స్త్రీని పొందిన వైశ్యునకు ఐదు వందలును, క్షత్రియునికి వెయ్యి పణాలును విధించినట్లు- దండన విధించాలి" (8-382)

"కానీ రక్షిత వైశ్య, క్షత్రియ స్త్రీలను పొందిన బ్రాహ్మణునకును వెయ్యి పణాలు దండనగా విధించాలి. అలాగే రక్షిత శూద్ర స్త్రీని పొందిన క్షత్రియ, వైశ్యులకు కూడా వేయి పణాలు శిక్షగా విధించాలి" (8-383)

"అరక్షిత క్షత్రియ స్త్రీని పొందిన వైశ్యునకు అయిదువందల పణాలు దండనగా విధించాలి. ఒక క్షత్రియుడు గనుక అలాంటి స్త్రీని పొందినట్లయితే మూత్రంతో ముండనం చేయించాలి. లేకపోతే ఐదువందల పణాలు దండనగానైనా చెల్లించాలి" (8-384)

"బ్రాహ్మణుడు అరక్షిత క్షత్రియ, వైశ్య, శూద్ర స్త్రీలను పొందినట్లైతే అయిదు వందల పణాల దండనకు అర్హుడౌతాడు. చండాల స్త్రీని పొందినట్లయితే వేయిపణాల శిక్షకు అర్హుడవుతాడు" (8-385)

ఇక నేరాలకు విధించే శిక్షల విషయానికొస్తే- మనువు ప్రణాళిక ఈ విషయంలో ఇంకా ఎన్నో కొత్త సంగతుల్ని వెల్లడి చేస్తోంది. ఈ కింది అధికార శాసనాల్ని గమనించండి

"చంపివేసేంత శిక్ష వేయవలసి వస్తే బ్రాహ్మణునకు కేవలం తలగొరిగించి వదలివేయాలి. క్షత్రియుడు మొదలగు ఇతర వర్ణాల వారి విషయంలోనైతే చెప్పిన విధంగానే మరణశిక్ష అమలు జరపాలి" (8-379)

"బ్రాహ్మణుడు ఎంత పాపకార్యాన్ని ఆచరించినా అతడు చంపదగనివాడు. అతడు సంపాదించుకుని, దాచుకున్న ధనాన్ని మొత్తం అతడికే వదలివేసి, శారీరకంగా అతనికి ఎలాంటి బాధ కలుగజేయకుండా దేశం నుంచి బయటకు సాగనంపాలి" (8–380)

"ప్రమాదవశాత్తు కాకుండ బుద్ధిపూర్వకంగానే బ్రాహ్మణుడు ఉత్తమ క్షత్రియుడ్ని గనుక చంపినట్లయితే, దానికి ప్రాయశ్చిత్తంగా బ్రహ్మహత్య ప్రాయశ్చిత్తంలో నాలుగవ భాగం (మూడు సంవత్సరాలు) శిక్షగా విధించాలి. మంచివాడైన వైశ్యుని చంపినట్లయితే ఎనిమిదవ భాగం (పద్దెనిమిది నెలలు), తన విధ్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వహించే శూద్రుడ్ని చంపితే పదహారవ భాగం (తొమ్మిది నెలలు) శిక్షగా విధించాలి" (11–127)

"కానీ బుద్ధిపూర్వకంగానే బ్రాహ్మణుడు క్షత్రియుడ్ని గనుక చంపినట్లైతే ఆ దోషాన్నుంచి పవిత్రుడవడంకోసం వేయి ఆవులను, ఒక ఎద్దును ఉత్తమ బ్రాహ్మణునకు దానం ఇవ్వాలి" (11–128)

"లేకపోతే (పైనచెప్పిన నేరం చేసిన బ్రాహ్మణుడు) మరొక బ్రాహ్మణునికి మూడు సంవత్సరాలు మనసావాచా కర్మణా సేవచేసి ప్రాయశ్చిత్తం తీర్చుకోవాలి. క్షురకర్మ చేయించుకోకుండా, గ్రామానికి వెలుపల, చెట్టునీడలో జీవిస్తూ కాలం గడపాలి" (11–129)

"బుద్ధిపూర్వకంగా కాకుండా యాదృచ్ఛికంగా వైశ్యుడ్ని బ్రాహ్మణుడు చంపినట్లయితే బ్రాహ్మణుడు ప్రాయశ్చిత్తాన్ని ఒక సంవత్సరం ఆచరించాలి. లేదా నూరు ఆవుల్ని, ఒక ఎద్దును మరొక బ్రాహ్మణునకు ఇవ్వాలి" (11–130)

"బుద్ధిపూర్వకంగా కాకుండా యాదృచ్ఛికంగా శూద్రుడ్ని గనుక బ్రాహ్మణుడు చంపేట్లయితే అతడు ప్రాయశ్చిత్తాన్ని ఆరునెలలు ఆచరించాలి. లేదా పది తెల్లని ఆవుల్ని, ఒక ఎద్దుని బ్రాహ్మణునకు ఇవ్వాలి" (11–131)

"బ్రాహ్మణుడ్ని చంపడంకంటే గొప్పపాపం భూమిమీద ఇంకోటి లేదు. కాబట్టి రాజయినా కూడా ఎలాంటి సమయంలోనైనా బ్రాహ్మణుడ్ని చంపే విషయాన్ని ఆలోచించకూడదు." (8–381)

"మాటి మాటికి ఇలాంటి నేరాలను చేసేవారిని గుర్తించి– రాజు– ఆనేరం జరిగిన ప్రదేశాన్ని, సమయాన్ని నిర్ధారించుకుని, నేరం చేసినవాడి శక్తిసామర్థ్యాలను, వాడు చేసిన తప్పును తెలిసికొన్న తర్వాత వాడి తాహతునుబట్టి శిక్షవేయాలి" (8–126)

"స్వాయంభువ మనువు– క్షత్రియుడు మొదలైన మూడు వర్ణాల వారిని శిక్షించే పది

స్థానాలను చెప్పాడు. బ్రాహ్మణుడైతే (ఈశిక్షలన్నిటి నుంచి మినహాయించి) అతడ్ని ఎలాంటి శరీరబాధలకు గురిచేయకుండా దేశం నుంచి బయటకు సాగనంపాలి" (8–124)

"మర్మాంగం, పొట్ట, నాలుక, చేతులు, కళ్ళు, కాళ్ళు, ముక్కు, చెవులు, సంపద, శరీరం– మొదలైన ఈ పది అవయవాల్లో దేనిచేత నేరం చేస్తాడో అప్పడది శిక్షించదగింది. నేరం మరీ పెద్దదైతే వధించాలి". (8–125)

న్యాయశాస్త్రం విషయకంగా హిందూ, హిందూయేతర శిక్షా విధానంలో ఎంత ఆశ్చర్యకరమైన విధానం? శిక్షాస్మృతి విషయకంగా హిందూమతంలో ఎంతటి తీవ్ర అసమానత? న్యాయంకోసమే నిర్దేశించిన ఏ శిక్షాస్మృతిలో అయినా మనకు కన్పించే ముఖ్యమైన అంశాలు రెండు. మొదటిది నేరాన్ని నిర్వచించేది కాగా, రెండోది నేరాన్ని నిర్ధారించి దానికి సమంజసమైన శిక్షను విధించి, దాన్ని ఎలాంటి పక్షపాతంలేకుండా అందరికీ సమానంగా అమలుచేసేది. కానీ మనుస్మృతిలో మనకు కన్పించేదేమిటి? విచక్షణ లేకుండా మూర్ఖంగా శిక్షలు విధించడం అనేది– మనుస్మృతిలో కొట్టొచ్చినట్లు కన్పించే మొదటి అంశం. ఉదాహరణకు నేరంలో పాలుపంచుకున్న అంగాన్ని శిక్షించడం మూర్ఖత్వానికి మచ్చుతునక. పొట్ట, నాలుక, ముక్కు, చెవులు, మర్మాంగం ఇవన్నీ మనిషి ఆలోచన అదుపాజ్ఞల్లోనే కానీ వాటంతటవే స్వంతగా నేరాలు చేయడంలేదుకదా! మరి అలాంటపుడు నేరాలకు బాధ్యులు అవే అన్నట్టు వాటికే శిక్షలు వేయడం విచక్షణా రాహిత్యం కాదా? నేరానికి తగినట్లుగా కాకుండా అమానుషంగా శిక్షించడం మనుస్మృతిలో కన్పించే మరో ప్రధానమైన అంశం. ఒకే నేరం చేసిన వ్యక్తులకు, వారి వారి వర్ణాన్నిబట్టి రకరకాల శిక్షలు వేయడం మనుస్మృతిలో కన్పించే అసమానతకు పరాకాష్ట. ఈ అసమానతను మనువు ప్రదర్శించడంలో కేవలం నేరస్తుల్ని శిక్షించటమే ప్రధాన ధ్యేయం కాదు. న్యాయంకోసం న్యాయస్థానానికి వచ్చే ప్రజల మధ్య పుట్టుకనుబట్టి తాను ఏర్పరచిన అంతరాల్ని అంటే వర్ణవ్యవస్థలోని అసమానతలను శాశ్వతంగా నిలబెట్టాలన్నదే మనువు దృఢసంకల్పం.

సాంఘిక అసమానతలను పెంపొందించడంలో మనువు నిర్వహించిన భూమికను తెలిపే ఉదంతాలను మాత్రమే ఇప్పటిదాకా నేను ప్రస్తావించాను. అంతేకాదు మతపరమైన అసమానతను పెంపొందించడంలో కూడా మనువు ప్రధానపాత్రనే నిర్వహించాడు. దానికి సంబంధించిన అంశాల్ని ఇప్పడు ప్రస్తావిస్తాను. ఆ అంశాలన్నీ అనుష్ఠానాలకు, ఆశ్రమ ధర్మాలకు సంబంధించినవి.

క్రైస్తవుల్లాగానే హిందువులక్కూడా సంస్కారాల్లో నమ్మకం ఎక్కువ. కాకపోతే ఒక ముఖ్యమైన తేడా ఉంది. సంస్కారాలకు ఎంతో ప్రాధాన్యమిచ్చే రోమన్ కాథలిక్కులు కూడా చాలామంది హిందువులు పాటించే ఈ అసంఖ్యాకమైన సంస్కారాల్ని చూచి ఆశ్చర్యపోవడం లేకపోలేదు. మనిషి జీవితంలోని ప్రధానమైన సంఘటనలు, జీవిత (బాల్య, యౌవన, వృద్ధాప్య) దశలు మూడింటికి సంబంధించిన సంస్కారాలు మొదట్లో నలభైవరకు ఉండేవి. ఆ తర్వాత వాటి సంఖ్య ఇరవైకి, ఆ మీదట పదహారుకి తగ్గింది. [17] హిందువులు ఆచరించే ఈ పదహారు

సంస్కారాలు నాటి నుంచి నేటిదాకా శాశ్వతంగా నిలిచిపోయాయి.

ఈ సంస్కారాల మూలంగా అపమానత ఎలా వచ్చింది అనే విషయం తెలుసుకోవాలంటే, ఆ నియమాలేమిటో పాఠకుడు ముందుగా తెలుసుకోవాలి. వాటిగురించి నేను ఇప్పుడు వివరిస్తాను. అయితేఅన్నిటినీ కూలంకషంగా వివరించడం అసాధ్యం. కనీసం కొన్నింటినయినా వివరించగలిగితే నేను నా పనిలో సఫలీకృతుడ్ని అయినట్లే. సంధ్యావందనం, గాయత్రి, దైనిక యజ్ఞాలు అనే మూడు ప్రధాన అంశాల్ని గురించి వివరిస్తాను.

మొదటిది సంధ్యావందనం. యజ్ఞోపవీతం వేసుకున్న (ఉపనయనం జరిగిన) వాడికే ఈ సంధ్యావందనాన్ని ఆచరించే అర్హత వుంటుంది. ఈ సంస్కారాన్ని పొందటానికి ఉండవలసిన అర్హతల గురించి మనువు విధించిన ప్రధానమైన నియమాలు ఇవీ:.

"తల్లి గర్భంలో పడిన నాటి నుంచి ఎనిమిదో సంవత్సరంలో బ్రాహ్మణునికి, పదకొండో ఏడ క్షత్రియునికి, పన్నెండో ఏట వైశ్యునికి తండ్రి ఉపనయనం జరిపించాలి." (2–36)

"వేదజ్ఞానాన్ని అతనుగానీ, అతని తండ్రిగానీ కోరేటట్లయితే ఉపనయనానికి విధించిన వయస్సు రానప్పటికీ బ్రాహ్మణునికి అయిదవ యేట, అధికారాన్ని (బలాన్ని) కోరుకున్న క్షత్రియునికి ఆరవయేట, వ్యాపారాభివృద్ధిని కోరే వైశ్యునికి ఎనిమిదవ యేట ఉపనయనం చేయించాలి" (2–37)

"ఉపనయనానికి కనిష్ట వయస్సులో సడలింపు ఉన్నా, గరిష్ట వయస్సు విషయంలో ఖచ్చితమైన పరిమితి ఉంది. బ్రాహ్మణునికి పదహారు సంవత్సరాల లోపు, క్షత్రియునికి ఇరవైరెండు సంవత్సరాల లోపు, వైశ్యునికి 24 సం.ల లోపు విధిగా ఉపనయనం చేయించాలి" (2–38)

"బ్రాహ్మణుడు మొదలైన మూడు వర్ణాల వారికి పైన చెప్పిన విధంగా ఉపనయనం జరగకపోతే (అంటే పదహారు, ఇరవైరెండు, ఇరవైనాలుగు సంవత్సరాల కాలపరిమితి దాటిపోతే) వారు వరుసగా వ్రత్యులు, కులబహిష్కారులు, గాయత్రి పతితులు అయి పెద్దలచేత నిందలు మోస్తారు" (2–39)

"కామవశులైన తలిదండ్రుల కలయికవలన కలిగిన గర్భంనుంచి పుట్టిన పుట్టుక అసలైన పుట్టుక కాదు" (2–147)

"వేదాలు తెలిసిన ఆచార్యుడు, విధ్యుక్తప్రకారంగా, గాయత్రీ దేవత మంత్రోపదేశపూర్వకంగా కలిగించే జన్మ ఏదైతే ఉందో, అదే నిజమైన జన్మ. అది వయస్సుతోగాని, మరణంతోగాని

సంబంధంలేనిది" (2–148)

"మొదటి జన్మ సహజమైంది. తల్లివలన కలిగేది. రెండవజన్మ ఉపనయనం వలన కలిగేది. మూడవది యజ్ఞదీక్ష వలనకలిగేది. ద్విజులు అనేవారికి వేదం ప్రకారం కలుగుతున్న జన్మలు ఇవి" (2–169)

"ఈ మూడు జన్మల్లోనూ ఉపనయనంవల్లా, యజ్ఞదీక్షవల్లా కలిగే జన్మ బ్రహ్మజన్మ. ఈ జన్మలో గాయత్రి అతని తల్లి. ఆచార్యుడు తండ్రి" (2–170)

ఇక గాయత్రి విషయానికి వద్దాం. ఒక ప్రత్యేకమైన, శక్తివంతమైన ప్రార్థనా పూర్వకమైనది ఆ మంత్రం. అదేమిటో మనువు వివరించాడు.

"అకార, ఉకార, మకార వర్ణాలను, భూః, భువః, సువః (లేక భూమి, ఆకాశం, స్వర్గం) అనే మూడు నిగూఢ శబ్దాలను ఋగ్వేద, యజుర్వేద, సామవేదాల నుంచి మూడు వరుసగా తీసుకుని కలిపి బ్రహ్మ ఈ మంత్రాన్ని సృజించాడు"

"అందరికంటే ఉన్నతుడు, సృష్టికర్త అయిన బ్రహ్మ ఈ మూడు వేల నుంచి 'తత్' అనే శబ్దం మొదటిగా కలిగిన మూడు పాదాలు సావిత్రి లేక గాయత్రిని పిదికాడు" (2–77)

"వేదవేత్త అయిన ద్విజుడు ఈ ఓంకారమును, మూడు పాదాలు కలిగిన సావిత్రిని వ్యాహృతియుక్తంగా ఉదయ, సాయం సంధ్యలలో క్రమం తప్పకుండా జపిస్తే మూడు వేలను పఠించిన పుణ్యఫలం కలుగుతుంది" (2–78)

"ఓంకారం, వ్యాహృతి (త్రిపాద), గాయత్రి– ఈ మూడింటిని జనావాసంలేని ప్రదేశంలో (నదీతీరంలోగాని, అరణ్యంలోగాని) సంధ్యాకాలంలో ప్రతిపూట ఒక వేయి చొప్పన బ్రాహ్మణుడు ఒక నెలరోజులపాటు జపిస్తే పాముకుబుసం వదలినట్లు ఎంతటి నేరం నుంచి అయినా విముక్తుడు అవుతాడు" (2–79)

"బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో ఎవరైతే తమ తమ సంధ్యోపాసానాది కర్మల సమయంలో ఈ గాయత్రీ జపాన్ని విడిచిపెడతారో, వారు పెద్దలచేత నిందితులవుతారు" (2–80)

"ఓంకారం, తరువాత వచ్చే మూడు వ్యాహృతులు, తరువాత మూడు పాదాల గాయత్రి కలిపి వేదాల ముఖం లేదా ప్రధానాంశంగా పరిగణించాలి." (2–81)

"ఏ బ్రాహ్మణుడైతే మూడు సంవత్సరాలు ప్రతిరోజు క్రమంతప్పకుండా ఈ ఓంకార

వ్యాహృతితో కూడినటువంటి గాయత్రిని జపిస్తాడో, అతను పరమాత్మలో లీనమవుతాడు. వాయురూపుడై అంతటా వ్యాపించిన వాడవుతాడు. కామచారుడై బ్రహ్మస్వరూపాన్ని పొందు తాడు" (2-82)

"ఓంకారం (పరబ్రహ్మం పొందడానికి కారణం కాబట్టి అదే) పరబ్రహ్మకి చిహ్నం. (దాని అర్థమైనటువంటి) పరబ్రహ్మ భావనచేత ప్రాణాయామంతో మనస్సు భగవంతునిమీద లగ్నం చేయడం ఉన్నతమైన భక్తి. అయితే గాయత్రి జపం కంటే ఉన్నతంలేదు. మౌనం కంటే సత్యవచనం ఉత్కృష్టం" (2-83)

"వేదాల్లో చెప్పిన యజ్ఞాలూ, హోమాలూ అన్నీ అంతరించిపోతాయి. కానీ, 'ఓం'కారం మాత్రం నిలిచి వుంటుంది. అందుకే అది అక్షరం. ఓంకారం శాశ్వతమెందుకంటే అది దైవానికి, బ్రహ్మనికి గుర్తు." (2-84)

"యజ్ఞయాగాది క్రతువుల కంటే బ్రహ్మనామాన్ని జపించడం పదిరెట్లు మేలు. ఇవి రెండూ ఏకమయినా గాయత్రి జపంతో కూడిన యజ్ఞాన్ని ఆచరించినపుడు కలిగే ఫలితంలోని పదహారవ వంతుతో అయినా సరిపోవు" (2-85)

ఇక ఇప్పుడు దైనిక యజ్ఞాల గురించి చూద్దాం.

"తెలియకుండా చేసిన తప్పుల విష్కృతికోసం, వరసక్రమంలో చెప్పిన ప్రదేశాల్లో గృహస్థులు పంచమహాయజ్ఞాలను ప్రతిరోజూ చేయదగినవిగా మనువు మొదలైన మహర్షులు నిర్ణయిం చారు." (3-69)

"(అధ్యయనం) బ్రహ్మయజ్ఞం, (నీటిచే తర్పణం) పితృయజ్ఞం, (హోమం) దేవయజ్ఞం, (బలి) భూతయజ్ఞం, (అతిథిపూజ) మనుష్య యజ్ఞం- ఇవీ పంచమహాయజ్ఞాలు" (3-70)

"ఈ పంచమహాయజ్ఞాల్ని శక్త్యానుసారంగా- వదలకుండా ఎవడు చేస్తాడో వాడు స్థిరంగా ఇంటిలోవున్నా సూనాదోషాన్ని (పొయ్యి, సన్నెకల్లు, పొత్తరం; చీపురు మొదలైన గృహోపకరణాలు, రోలు, రోకలి, నీళ్ళబిందె- ఈ పదింటినీ వినియోగించినపుడు కలిగే దోషం) పొందడు" (3-71)

ఇక ఆశ్రమ ధర్మాల విషయానికి వద్దాం. హిందూమత తత్వంలో 'ఆశ్రమ ధర్మాల సిద్ధాంతం' ఒక ప్రత్యేకమైన లక్షణం. (హిందూమతంలో తప్ప) ఏ మత బోధనలలో కూడా దీనికి స్థానం కన్పించదు. ఆశ్రమ ధర్మాల సిద్ధాంతం ప్రకారం జీవితాన్ని నాలుగు దశలుగా విభజించారు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలు అవి. బ్రహ్మచర్య జీవి తంలో మనిషి అవివాహితుడుగా వుండి తన కాలాన్నంతా చదువుకి, జ్ఞాన సముపార్జనకు

వినియోగించాలి. ఈ దశ తరువాత దశలో అతడు గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తాడు. ఈ ఆశ్రమంలో వివాహం చేసుకుంటాడు. కుటుంబాన్ని వృద్ధిచేసుకుంటాడు. లౌకిక కార్యకలాపాల్లో పాల్గొంటాడు. దానితర్వాత మూడవదైన వానప్రస్థ ఆశ్రమంలో ప్రవేశిస్తాడు. 'వానప్రస్థుడు'గా అరణ్యాల్లో మునిగా నివసిస్తాడు. మునిగా జీవించినా కుటుంబ బంధాల్ని వదులుకోవడంగానీ, లౌకిక కార్యకలాపాల్లో పాల్గొకపోవడంగాని వుండదు. అయినా విధిగా కొనసాగుతాడు. ఇక నాల్గవదీ, చివరిదీ అయిన 'సన్యాసాశ్రమం'. ప్రాపంచిక బంధాలన్నింటిని వదలివేసి భగవంతుని తెల్సుకోవడంలో జీవితాన్ని గడిపే దశ యిది. బ్రహ్మచర్య గృహస్థాశ్రమాలు ఎవరికైనా ఉండేవే. చివరి రెండు వానప్రస్థ, సన్యాసాశ్రమాలు మాత్రం కోరినవారు స్వీకరించవచ్చు. వీటి విషయంలో నిర్బంధం ఏమీ లేదు. ఈ ఆశ్రమ ధర్మాలననుసరించి మనువు చెప్పిన విషయాలు ఇవి.

"మనువు నిర్దేశించిన సూత్రాల క్రమంలో గృహస్థాశ్రమ ధర్మాలను నిర్వహించిన తర్వాత ముందు చెప్పబోయేవిధంగా ఇంద్రియాలను జయించి యదార్థంగా వానప్రస్థాశ్రమంలో ప్రవేశించి ఆ ధర్మాలను ఆచరించాలి". (6–1)

"గృహస్థాశ్రమంలో ఉండి తన శరీరం వదలడం, తల నెరియడం, మొదలైన వృద్ధాప్య లక్షణాలు ప్రారంభం కాగానే తన సంతానానికి సంతానం పుట్టిన తర్వాత అరణ్యాన్ని ఆశ్రయించాలి". (6–2)

"వ్యవసాయం ద్వారా పండించిన ఆహార ధాన్యాలు మాత్రం వదలిపెట్టి తనసర్వస్వాన్ని పరిత్యజించి అతడు భార్యను, పుత్రుల సంరక్షణకు అప్పగించిగానీ, ఆమెతోనేగాని అరణ్యాలను ఆశ్రయించాలి". (6–3)

"ఈ మూడవ దశయైన వానప్రస్థాశ్రమంలో (సహజసిద్ధమైన) మరణం సంభవించకుండా జయప్రదంగా గనక ముగించుకుంటే ఆయుష్యంలో నాలుగవపాలు అనగా మిగిలిన జీవితకాలంలో సర్వసంగాలను విడచి సన్యసించాలి". (6–33)

స్పష్టంగా కనిపించకపోతున్నప్పటికి ఈ సూత్రాల్లో అసమానత చక్కగా చోటుచేసుకుందనేది వాస్తవం. ఈ సంస్కారాలు, ఆశ్రమధర్మాలు అన్నీ కూడా ద్విజులకే మనువు పరిమితం చేశాడని మనం గుర్తించవచ్చును. ఈ ఆశ్రమ ధర్మాల ఫలితాల్నించి శూద్రుల్ని మినహాయించాడు మనువు.[18] వీటిని శూద్రులు ఆచరించడంలో మనువుకు అభ్యంతరం లేదు కానీ, ఆయా క్రతువుల్ని ఆచరించేటప్పుడు పవిత్ర మంత్రాల్ని శూద్రులు చదవటాన్ని మాత్రం మనువు అడ్డుకుంటాడు. ఈ విషయాన్ని గురించి మనువు ఇలా చెప్పాడు.

"ఏ శూద్రులైతే వాళ్ళ వాళ్ళ ధర్మాల్ని తెలిసికొన్న వారై ధర్మప్రాప్తిని కోరుతూ పై మూడు వర్ణాల గృహస్థుల సంస్కారాల్ని ఆచరిస్తూ కేవలం భక్తి నమస్కార మంత్రాలతో పంచయజ్ఞ

మొదలైన ధర్మాల్ని ఆచరిస్తారో వారు పాపానికి దూరం అవుతారు. లోకంలో తగిన విధంగా ప్రశంసాపాత్రులవుతారు." (10–127)

ఈ విషయంలో స్త్రీలను గూర్చి మనువు అన్న మాటల్ని గమనించండి.

"యజ్ఞోపవీతం మినహా పైన చెప్పిన సంస్కారాలన్నీ (జాతకకర్మాది క్రియాకలాపాలు కూడా) ఆయా నిర్దేశిత వయసులలో సమగ్రంగా అదేక్రమంలో స్త్రీకి వేదమంత్రాలు ఏవీ లేకుండా శరీర సంస్కారార్ధమంత్రకంగా చేయాలి". (2–66)

ఆయా సంస్కారాల ఫలితాల్నించి శూద్రుల్ని మనువు ఏ కారణంచేత దూరం చేశాడు? శూద్రులు సన్యాసాశ్రమం తీసుకోకుండా ఏ కారణంచేత మనువు నిషేధించాడో ఎంతకీ అంతుతెలియని చిక్కుప్రశ్న. అసలు సన్యాసి అంటే అర్థం లౌకిక వ్యవహారాలన్నింటినీ వదిలివేసి నవాడని. న్యాయశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే సన్యాసి అంటే సంఘం దృష్టిలో మరణించినవాడు అని అర్థం. దాన్నిబట్టి ఎప్పుడైతే ఒకడు సన్యాసి అవుతాడో ఆక్షణం నుంచి అతడు మరణించి నట్లు లెక్క. అతని సమస్తం వారసుల పరమైనట్లే. శూద్రుడు గనుక సన్యాసి అయితే, వెంటనే జరిగే పని ఇది ఒక్కటే. అలాంటి పరిణామం ఒక్క శూద్రుడ్ని మాత్రం తప్ప మరెవ్వరినీ బాధించదు కదా! మరి అలాంటప్పుడు ఈ నిషేధం ఎందుకోసమని? ఈ అంశం ఎంతో ప్రాధాన్యత కలిగినటువంటిది. అందువల్ల నేను మనువు సూత్రాన్నే ఉదహరించి సంస్కారాల, సన్యాసాశ్రమ ప్రాధాన్యతను, సార్థకతను వివరిస్తాను. ఈ విషయానికి సంబంధించి మనుధర్మ శాస్త్రంలోని ఈ క్రింది సూత్రాలను పర్యాలోకనం చేద్దాం.

"వేదమూలాలు–శుభప్రదాలు అయిన మంత్ర కర్మలచే ద్విజులకు గర్భాదానం మొదలైన సంస్కారాలు ఈ లోకంలోను, పైలోకంలోను కూడా పాపాన్ని నశింపచేసేవి కాబట్టి చేయదగినవి". (2–26)

"వేదాధ్యయనం చేతను, మధుమాంసాల్ని విసర్జించడం చేతనూ ప్రొద్దుటిపూట, సాయంత్రపుపూట హోమాల చేతను, వేదవ్రతంచేతను బ్రహ్మచర్య దశలో దేవ ఋషి పితృతర్పణ రూపమైన విధిచేతను, గృహస్థాశ్రమంలో పుత్రోత్పాదనం చేతనూ, దేవయజ్ఞం మొదలైన పంచ యజ్ఞాల చేతను, అగ్నిష్టోమం మొదలైన వానిచేతను బ్రహ్మప్రాప్తి కలిగేదాక శరీరావృతమైన ఆత్మ నిర్వహిస్తుంది. కర్మయుక్తమైన బ్రహ్మజ్ఞానం వలననే ద్విజుడు ముక్తుడగుతాడు". (2–28)

సంస్కారాల ఆశయం–ప్రధానోద్దేశం ఇదే. సన్యాసానికి సంబంధించిన ప్రధాన ఉద్దేశాల్ని లక్ష్యాన్ని సూచించి కూడా మనువు వివరిస్తాడు.

"అతను (సన్యాసి) ఈ రీతిగ క్రమంగా భవబంధాలను వదిలిపెట్టి, రాగద్వేషాలను

విడిచిపెట్టి బ్రహ్మయందు మాత్రమే మనస్సును నిలిపి శాంతిని పొందుతాడు". (6-81)

"సన్యసించిన ద్విజుడు పైన చెప్పిన కర్మలన్నీ అనుష్ఠించిన తర్వాత, ఇహలోకంలో పాపాలన్నింటిని కడిగివేసుకుని తర్వాత బ్రహ్మ సాన్నిధ్యాన్ని చేరుకుంటాడు" (6-85)

మనువు వివరించిన ఈ సూత్రాలవల్ల ఒక విషయం మాత్రం స్పష్టంగా తెలుస్తోంది. సంస్కారాలు అన్నింటిని సక్రమంగా నిర్వహిస్తే శరీరము పవిత్రమవడమే గాకుండా దేవుని సాన్నిధ్యం చేరటానికి అర్హత సంపాదించు కుంటుంది. అలాగే సన్యాసంలోని ప్రధాన ఉద్దేశం కూడ దేవుని సాన్నిధ్యం చేరటమే. అయితే సంస్కారాలు నిర్వహించుట, సన్యాసాశ్రమం చేపట్టడం కేవలం ఉన్నత వర్గాలకు మాత్రమే ఉన్న హక్కులు. శూద్రులకు వీటిని పొందే హక్కు లేదు. ఎందుకని? శూద్రుడి శరీరానికి పవిత్రత అక్కరలేదా? అతని ఆత్మకి శుద్ధి అవసరం లేదా? భగవంతుడ్ని చేరుకోవాలనే ఆశ శూద్రుడికి ఉండదా? ఈ ప్రశ్నలకు మనువు అపుడే సమాధానం చెప్పి ఉండేవాడు. మరి ఇలాంటి నిర్ణయాలను మరి ఎందుకు ప్రతిపాదించాడు. సాంఘిక అసమానతల పట్ల మనువుకి ప్రగాఢమైన నమ్మకం ఉంది. మత సంబంధమైన సమానత ఎంత ప్రమాదకరమైనదో అతనికి తెలుసు. దేవుడి ముందు నేను అందరితో సమానున్నైనప్పుడు, భూమి మీద ఈ తేడా ఏమిటి? బహుశా! ఈ ప్రశ్నే మనువుని భయకంపితుడ్ని చేసి ఉండవచ్చు. మత సమానత్వాన్ని అంగీకరిస్తే సాంఘిక సమానత్వాన్ని ఆమోదించ వలసి వస్తుంది కనుక మత సమానత్వాన్ని నిరాకరించడమే మంచిదనుకున్నాడు. మనువు.

ఈ విధంగా సాంఘిక అసమానత, మత అసమానత హిందూ తత్వశాస్త్రంలో నిక్షిప్తం కావడాన్ని గుర్తించవచ్చు.

పాపం నుంచి తానంతట తాను పవిత్రుడవటాన్ని అడ్డుకోవటానికి భగవంతుడి సాన్నిధ్యమును చేరడాన్ని నివారించడానికి! హేతువాది అయిన ఎవరికైనా ఈ నియమాలు అపసవ్యంగా కన్పిస్తాయి. అంతేకాదు పిచ్చివాడి మాటల్లా అన్పిస్తాయి. హిందూమతం సమానత్వానికి బద్ధ వ్యతిరేకి అనీ, మనిషి వ్యక్తిత్వానికి అవసరమైన పవిత్రగుణాన్ని కూడా ఇది నిరాకరిస్తుందని చెప్పటానికి ఇంతకంటే రుజువేమి కావాలి?

ఇంతటితోనే ఆగకుండా, మానవ వ్యక్తిత్వాన్ని గుర్తించకపోవటమేకాక, మరెన్నో నీచాలకు మనువు పాల్పడ్డాడు. ఈ విషయానికి సంబంధించి హిందూమత తత్వ లక్షణాలలో రెండింటి గురించి మాత్రమే నేను చర్చిస్తాను.

కులవ్యవస్థను గురించి అధ్యయనం చేసిన వారు ఎవరైనా సరే అసలు దీని ఆవిర్భావం ఏమిటి అనే విషయం పట్ల ఆసక్తి చూపడం సహజం. కులవ్యవస్థకు మార్గదర్శకుడైన మనువు ఏయేకులం ఎలా పుట్టిందో వివరించటానికి చాలా తంటాలు పడవలసి వచ్చింది. ఈ కుల

పునాదులననుసరించి మనువు ఇచ్చిన వివరణలు ఏమిటి? అతని వివరణ చాలా తేలికైనది. ప్రధాన వర్ణాలు నాలుగు మినహా మిగతావన్నీ (బ్రహ్మ) పాదాలనుంచి పుట్టినవే. ఈ నాలుగు ప్రధాన వర్ణాల్లోని స్త్రీ పురుషులు విచక్షణా రహితంగా వ్యభిచరించడం వల్ల పుట్టిన సంకరజాతి వారే వీరు. చతుర్వర్ణాలకు చెందిన స్త్రీ పురుషులలో నైతికత లోపించడం, సచ్ఛీలత లేకపోవడం కారణంగా అసంఖ్యాకమైన ప్రజలతో లెక్కలేనన్ని కులాలు పుట్టుకొచ్చాయి!! చతుర్వర్ణాల స్త్రీ, పురుషుల మీద తాను ఎలాంటి దారుణమైన నిందారోపణ చేస్తున్నాడో ఊహించకుండా మనువు ఇటువంటి ప్రతిపాదన చేశాడు. ఛండాలురు అంటే అంటరాని వారంతా బ్రాహ్మణ స్త్రీకి, శూద్ర పురుషుడికి పుట్టినవారే అయితే బ్రాహ్మణ స్త్రీలంతా తప్పకుండా వేశ్యలు, పడుపుగత్తెలు అయి వుండాలి. శూద్ర పురుషులందరూ బరితెగించి వారితో వ్యభిచరించి వుండాలి. చతుర్వర్ణాలను విశ్లేషించే పిచ్చిలో కావాలనే చారిత్రక వాస్తవాలను వక్రీకరించాడు మనువు. దానికి సంబంధిం చిన రెండు ఉదంతాలను చెబుతాను. 'మగధ', 'వైదేహిక' కులాల పుట్టు పూర్వోత్తరాల గురించి మనువు చెప్పిన దాన్ని ప్రముఖ వ్యాకర్త అయిన పాణిని చెప్పినదానితో సరిపోల్చితే ఎంత వ్యత్యాసముందో తెలుస్తుంది. వైశ్య పురుషుడు క్షత్రియ స్త్రీల శారీరక సంగమం వల్ల మగధ కులం పుట్టిందని మనువు చెబుతాడు. అలాగే వైశ్య పురుషుడు బ్రాహ్మణ స్త్రీతో సంగమిస్తే పుట్టిన వారు వైదేహిక కులస్థులు అని అంటాడు. మరి పాణిని ఏమన్నాడో చూద్దాం. మగధ దేశంలో నివశించే వాడు మాగధుడవుతాడని పాణిని చెప్పాడు. అలాగే విదేహ దేశంలో నివసించే వాడు వైదేహకుడు. ఎంత తేడా! ఎంత కిరాతకం! పాణిని కాలం క్రీ.పూ 300 సంవత్సరాలకు పూర్వం కాగా, మనువు జీవించిన కాలం క్రీ.శ 200 ప్రాంతం. పాణిని కాలం నాటికి ఏ కళంకం లేనివాళ్ళు, మనువుచేతిలో ఇంత కళంకాన్ని ఎందుకు పొందవలసి వచ్చింది? సమాధానం ఒక్కటే. వాళ్ళను దిగజార్చటం అనే లక్ష్యానికి మనువు లొంగిపోయాడు కాబట్టే! అయితే మనువు ఎందుకు లొంగిపోయాడు అనే దానికి ఇప్పటికీ సమాధానం అంతుపట్టదు.
19 కొట్టొచ్చినట్టు కన్పించే క్రూరత్వం మరొకటుంది. ఏ దేశంలో అయినా మతం మానవ వికాసానికి, ఔన్నత్యానికి అకుంఠిత దీక్షతో కృషి చేస్తుంటే ఒక్క హిందూ మతం మాత్రం కించపరచటానికి, దిగజార్చడానికి నడుం కట్టినదనిపిస్తోంది.

(హిందూ) బిడ్డకు పేరు పెట్టే విషయంలో హిందూమతం వారసత్వంగా సంపాదించు కున్న దిగజారుడు లక్షణాన్ని వివరించే మరో ఉదంతాన్ని ఇక్కడ నేను చెప్పదలుచుకున్నాను.

రాజు (అధికారం) లేక వర్మ (కవచం), వైశ్యులకు గుప్త (బహుమతులు) లేక దత్త (దాత), శూద్రునకు దాసుడు (సేవ) అనేవి పేరులో రెండవ భాగంగా స్థిరపడిపోయాయి. ఆయా వర్ణాల పేర్లకు సంబంధించి మొదటి భాగం గురించి కూడా మనువు వివరించాడు. దాని ప్రకారం బ్రాహ్మణుల పేరులోని మొదటిభాగం శుభసూచకంగానూ, క్షత్రియుల పేరులోని మొదటిభాగం అధికారాన్ని, వైశ్యుల పేరులోని మొదటి భాగం సంపదను సూచించేదై వుండాలి. కాని శూద్రుని పేరులోని మొదటి భాగానికి ఎలాంటి ప్రత్యేకత లేకపోగా, అది చులకన భావాన్ని కలిగించేదిగా ఉండాలని మనువు నిర్దేశించాడు. మనువు ప్రతిపాదించిన ఈ తత్వం మింగుడు పడని వాళ్ళెవరైనా వుంటే, అలాంటి వారి సందేహాన్ని తీర్చేందుకు మనుస్మృతిలోని మాటల్ని ఇక్కడ ఉదహరిస్తాను. నామకరణోత్సవానికి సంబంధించి మనువు ఇలా చెప్పాడు.

"పుట్టినరోజు మొదలుకొని పదోరోజునగానీ, పన్నెండోరోజునగాని తండ్రే స్వయంగాగానీ, లేక ఇతరుల చేతనైనాగానీ నామకరణం చేయించాలి. అయితే శుభనక్షత్రం, ముహూర్తం, తిధి వగైరాలను మర్చిపోకూడదు". (2–30)

"బ్రాహ్మణులకు (పేరులోని మొదటిభాగం) శుభసూచకంగానూ, క్షత్రియులకు అధికార సూచకంగానూ, వైశ్యులకు సంపద సూచకంగానూ, శూద్రులకు సేవక భావాన్ని సూచించేదిగానూ ఉండాలి". (2–31)

"(పేరులోని రెండవభాగం) బ్రాహ్మణులకైతే శుభాన్ని, సంతోషాన్నీ, క్షత్రియులకు రక్షణను, వైశ్యులకు సంపదను, శూద్రులకు సేవను సూచించేవిగా ఉండాలి". (2–32)

మంచి అర్థానిచ్చే పేరును శూద్రునకు పెట్టటాన్ని మనువు ఏమాత్రం సహించలేకపోయాడు. వృత్తిరీత్యా కించపరచటమేకాక పేరులో సైతం వారిపట్ల మనువు చులకన భావాన్ని ప్రదర్శించాడు.

సాంఘిక సమానత్వాన్ని, మత సమానత్వాన్ని కాలరాయటంలో హిందూమత వ్యవస్థ ఎంత కర్కశంగా ప్రవర్తించిందో తెలియడానికి ఇంతకంటే వేరేమీ ఉదాహరణలు అక్కరలేదనుకుంటాను.

## హిందూమతం స్వేచ్ఛను గుర్తించిందా?

నిజమయిన స్వేచ్ఛ కొన్ని సామాజిక పరిస్థితులతో జతకూడి ఉంటుంది.[20]

మొట్టమొదట అసలు సాంఘిక సమానత్వం అనేది ఉండాలి. "విశేషాధికారం సాంఘిక చర్యను దాన్ని పొందిన వారికి అనుగుణంగా మలచుతుంది. పౌరుల సాంఘిక హక్కులు అంతే సమప్రాధాన్యం కలవి. వారి స్వేచ్ఛను వినియోగించుకుంటానికి అవి ఎక్కువ సమ

ర్థంగా ఉపయోగపడతాయి... స్వేచ్ఛ అనేది దాని పతాకస్థాయికి చేరుకోవాలంటే, సమానత్వం ఉండటం ఎంతో అవసరం."

ఇక రెండోది ఆర్థిక పరమయినది. మరో విధంగా చెప్పాలంటే ఆర్థికపరమైన (రక్షణ) స్వేచ్ఛ. తనకు నచ్చిన ఎలాంటి వృత్తినైనా (ఉద్యోగాన్ని) ఎన్నుకొనడానికి మానవుడు స్వతంత్రుడు. ఉద్యోగానికి భద్రత లేనప్పుడు తాను ఎన్నుకున్న వృత్తి బానసత్వంకన్నా భరించరానిదవుతుంది. అప్పుడు తనమీద తనకు నమ్మకం నశిస్తుంది. జీవితంలో సుఖసంతోషాలకు గండి పడుతుంది. కనుక ఆర్థిక స్వాతంత్ర్యంలేని (రక్షణ) 'స్వేచ్ఛ' ఉన్నా లేనట్లే. అప్పుడు స్వేచ్ఛ తాలూకు ముఖ్య ఉద్దేశానికి ముప్పు వాటిల్లుతుంది. అది నామకః స్వేచ్ఛ అవుతుంది.

ఇక మూడోది- చాలా ముఖ్యమయినట్టిది. విజ్ఞానం, సంపద అందరికీ అందుబాటులో ఉండాలి. సంక్లిష్టమైన ప్రపంచంలో మనిషి ఎంత బాధ్యతతో బ్రతుకుతున్నప్పటికీ, అనేక సంకట పరిస్థితులను ఎదుర్కోనక తప్పడంలేదు. వీటి నుంచి బయటపడే మార్గం- 'స్వేచ్ఛకు ఎలాంటి భంగం కలుగకుండా- తానే కనుగొనాలి.

"ఇలాంటి పరిస్థితులలో మనిషి మానసికంగా ఎదిగి జ్ఞానాన్ని సంపాదించుకోని పక్షంలో ఇచ్చిన స్వేచ్ఛను వినియోగించుకోవడం కష్టసాధ్యమవుతుంది. దీనికి ముఖ్యమయింది విద్యా హక్కు. దీన్ని ప్రాథమిక హక్కుగా మలచుకున్నపుడు స్వేచ్ఛను ఎలా వినియోగించుకోవాలో దానంతట అదే బోధపడుతుంది. జ్ఞానాన్నుంచి ఏ మనిషినయితే దూరం చేస్తామో, అతన్ని తనకంటే 'అదృష్టవంతులైన' ఇతరులకు తప్పనిసరిగా బానిసను చేస్తున్నట్లే లెక్క. జ్ఞాన సముపార్జన నుంచి దూరం చేయటమంటే అనుకున్న లక్ష్యాన్ని చేరటానికి అవసరమైన స్వేచ్ఛను, తత్సంబంధమైన శక్తిని, నిరాకరించటంతో సమానమైనదే. ఒక అజ్ఞానియైన మనిషికి స్వేచ్ఛను ఇచ్చినా అతడు సుఖ, సంతోషాలతో జీవిస్తాడన్న భరోసా లేదు"

ఈ నియమాన్ని హిందూమతం ఎంతవరకు నెరవేర్చింది? హిందూమతం సమానత్వాన్ని ఏవిధంగా నిరాకరించిందో ఇప్పటికే స్పష్టమైపోతోంది. అది హక్కుల్ని కాలరాసి, అసమానత్వానికి పట్టం కట్టింది. ఈ విధంగా హిందూ మతంలో స్వేచ్ఛకు అవసరమైన ప్రాథమిక నియమం కనుమరుగయిందని వెల్లడయింది.

ఆర్థికపరమైన స్వేచ్ఛ (రక్షణ)కు సంబంధించి హిందూమతంలో మూడు విషయాలు స్పష్టమవుతాయి. ఇష్టమైన వృత్తిని నిరాకరించటం హిందూమతం చేసిన మొదటి నియమం. మనిషి పుట్టకముందే అతడు ఏ వృత్తి చేయాలో నిర్ణయించి ఉంటుందన్నది మనువు ప్రణాళికలోని భాగం. ఇష్టమైన వృత్తి చేసుకోవటానికి హిందూమతం ఏమాత్రం అనుమతించలేదు. అభీష్టానికి, సామర్థ్యానికి ఎలాంటి సంబంధం లేకుండానే మనిషి వృత్తి అతడు పుట్టకముందే నిర్ణయించటం వింతగాలేదూ?

ఇక రెండవ విషయం– మానవులు అనుకున్న లక్ష్యాలను చేరడంలో హిందూమతం అవలంబించిన పాత్రకి సంబంధించింది. బలవంతాన ఇతరులు సూచించిన గమ్యాలకు చేరుకోవడం ఇక్కడ మనం గమనిస్తాం. అగ్రవర్ణాలకుచెందిన వారికి సేవలు చెయ్యటానికే శూద్రులు పుట్టారు అని మనువు చెప్పడం దీనికి ఉదాహరణ. సేవ చెయ్యడాన్ని ఆదర్శంగా పెట్టుకోమని మనువు శూద్రుడికి ఉద్బోధిస్తాడు. మనువు ఉద్దేశించిన ఈ క్రింద నియమాన్ని గమనించండి.

"బ్రాహ్మణులకు సేవ చెయ్యటం ద్వారా జీవనం గడవనప్పుడు శూద్రుడు క్షత్రియుణ్నైనా, వైశ్యుణ్నైనా ఆశ్రయించి వారికి సేవ చెయ్యడంద్వారా జీవనం సాధించాలి" (10–121)

"శూద్రుడు బ్రాహ్మణునికే సేవ చెయ్యాలి...". (10–122)

శూద్రుడు ఎవరెవరికి ఏమేమి సేవలు చేయాలో నిర్ణయించడంతోనే మనువు ఆగిపోలేదు. మరో అడుగు ముందుకేసి, శూద్రుడు తనకప్పగించిన పనుల నుండి తప్పించుకోకుండా ఉండేందుకు కూడా పకడ్బందీ ఏర్పాట్లు చేశాడు. శూద్రుడికి అప్పగించిన పనులను అతడు సక్రమంగా నిర్వర్తించేలా చేసే బాధ్యతను మనువు క్షత్రియుడికి అప్పగించాడు.

"రాజనేవాడు వైశ్యుని వ్యాపారం చేయమని, సొమ్మును వడ్డీలకు తిప్పమని, వ్యవసాయం చేయమని, పశువుల్ని కాయమని ఆదేశించాలి. అలాగే ద్విజునికి శూద్రుడు ఎల్లప్పుడూ సేవ చేయాలని కూడా రాజు ఆదేశించాలి". (8–410)

"ఎవరిచేత వారి పనులు నిర్వర్తింప చేయటంలో రాజు అత్యంత జాగ్రత్తగా వ్యవహరించాలి. నిఘా వెయ్యాలి. పైన చెప్పిన విధుల్ని ఆయా వర్గాల వారు సక్రమంగా నిర్వహించని పక్షంలో ప్రపంచమంతా సందిగ్ధంలో పడిపోతుంది". (8–418)

అప్పగించిన పనులు చేయకపోవడం నేరంగా భావించి న్యాయపరంగా రాజు వారిని శిక్షించాలి.

"అప్పగించిన పనిని తండ్రికాని, గురువుకాని, స్నేహితుడుకాని, తల్లికాని, భార్యకాని, కొడుకుకాని, కుటుంబ పురోహితుడు కాని నిర్వర్తించని పక్షంలో రాజు వారిని కూడా శిక్షించాలి." (8–335)

"తక్కువ వర్ణములో పుట్టిన వాడు తప్పుచేస్తే ఒక పణం జరిమానా వసూలు చేయాలి. అదే రాజు నేరం చేస్తే వెయ్యి పణాలు జరిమానా చెల్లించాలి. ఇలా వసూలు చేసిన సొమ్మును పూజారులైన బ్రాహ్మణులకు దానంగా ఇవ్వాలి లేదా గంగలోనైనా కలపాలి. ఇది చాలా పవిత్రమైన శాసనం". (8–336)

మనువు రూపొందించిన ఈ నియమాలు రెండు రకాల విశేషాన్ని కలిగి వున్నాయి. ఒకటి భక్తి విశ్వాసాలకు సంబంధించినది, మరోకటి ఆర్థికపరమైన అంశం. భక్తి ముసుగులో బానిసత్వ బోధన చేసారు. బానిసత్వం అనే దానికున్న చట్టపరమైన అర్థం గురించేకాని, దాని అంతరార్థం చాలామందికి తెలియదు. దాని అంతరార్థాన్ని దృష్టిలో పెట్టుకొని "ఇతరుల ప్రయోజనాలకు అనుగుణంగా ఎవరి ప్రవర్తన అయితే నియంత్రణ అవుతుందో అటువంటి వ్యక్తి బానిస" అని ప్లేటో నిర్వచించాడు. ఈ అర్థంలో బానిస తనకు తాను లక్ష్యం కాదు. అతడు ఇతరులు కోరుకునే లక్ష్యాన్ని పూరించే సాధనం మాత్రమే. ఈ విధంగా అర్థం చేసుకుంటే శూద్రుడు బానిసే. ఆర్థిక విలువలకున్న ప్రత్యేకత దృష్ట్యా శూద్రుడి ఆర్థిక స్వాతంత్ర్యాలను నిషేధించే నియమాలివి. శూద్రుడు సేవించాల్సిందేనని మనువు పేర్కొన్నాడు. దాంట్లో ఫిర్యాదు చేయవలసిన అంశం ఏమీ లేదు. కానీ దాంట్లో వున్న తప్పంతా అతన్ని ఇతరులకు సేవ చేయమనటంలోనే వుంది. అతన్ని తనకు తాను సేవ చేసుకోమనటం లేదు. అంటే దాని అర్థం అతడికి గనక ఆర్థిక స్వాతంత్ర్యం లభిస్తే ఆ తరువాత ఇక శ్రమపడవలసిన అవసరం లేదు. అతడు జీవితాంతం ఆర్థికపరంగా ఇతరులమీద ఆధారపడి జీవించాల్సిందే. దీనిని గురించి మనువు ఇలా చెప్పాడు.

"మిగిలిన మూడు వర్ణాలను సంపూర్ణంగా సేవించటమే శూద్రునికి వృత్తి అని దేవుడు నిర్దేశించాడు". (1–91)

శూద్రుడు సంపదను కూడబెట్టుకోటానికి హిందూమతం ఏమాత్రం అవకాశం కల్పించక పోవడం మూడవ అంశం. మిగిలిన మూడు అగ్రవర్ణాలు శూద్రుని సేవకునిగా నియమించు కున్నప్పుడు, వారు అతనికి చెల్లించవలసిన జీతభత్యాల విషయమై మనువు చాలా ఖచ్చితమైన సూచనల్ని చేశాడు. జీతభత్యాల విషయాన్ని చర్చిస్తూ మనువు చెప్పిన మాటలు ఇవి.

"ఈ మూడు అగ్రవర్ణాల వారు అతనికి (శూద్రునికి) తమ కుటుంబ పోషణకు పోను మిగిలిన సంపదలో– ఆ శూద్రుని శక్తిసామర్థ్యాలు, పనిపాటును, అతను పోషించవలసిన కుటుంబ సభ్యుల సంఖ్యను దృష్టిలో పెట్టుకొని అతనికి జీతభత్యాలు చెల్లించాలి". (10–124)

"తాము తినగా మిగిలిన ఆహార పదార్థాల్ని మాత్రమే శూద్రునికి ఇవ్వాలి. తమ పాతబట్టల్ని, తాము తినని ఆహార ధాన్యాల్ని, పాతబడిపోయిన గృహోపకరణాల్ని అతనికి ఇవ్వాలి". (10–125)

జీతభత్యాల విషయమై మనువు చేసిన సూత్రాలివి. ఇది కనీస జీతభత్యాల పరిధిలోకాదు. గరిష్ట పరిధిలోదే. శూద్రుడు ధనాన్ని సంపాదించుకొనడానికి కానీ, కూడబెట్టుకొనడానికి కానీ, ఆర్థిక స్వావలంబనను సాధించుకుంటానికి కానీ అవకాశం లేకుండా ఆ శూద్రుడ్నించి ఎలాంటి భయం లేకుండా వుంటానికి వీలుగా రూపొందించిన అత్యంత కఠోర శాసనమిది. శూద్రుడు

ఆస్తిని కూడబెట్టుకుంటాన్ని సంపూర్ణంగా నిషేధించడం ద్వారా మనువు అతడి ఔన్నత్యానికి ఏమాత్రం అవకాశం లేకుండా చేశాడు. ఆజ్ఞాపూర్వకంగా మనువు యిట్లా చెప్పాడు.

"శూద్రుడు డబ్బు సంపాదించటానికి సమర్ధుడయినప్పటికీ, అతను సంపదను కూడబెట్టకూడదు. కారణమేమిటంటే— డబ్బును సంపాదించిన శూద్రుడు బ్రాహ్మణున్ని బాధిస్తాడు". (10–129)

ఈ విధంగా హిందూమతంలో ఇష్టమొచ్చిన వృత్తిని స్వీకరించడానికి అవకాశం లేదు. దానిలో ఆర్థిక స్వాతంత్ర్యంగానీ, ఆర్థిక భద్రతగానీ లేవు. ఆర్థికపరంగా చెప్పాలంటే శూద్రుడి స్థితి - దైవాధీనమే!

జ్ఞాన విస్తరణకు రెండు అనుకూల పరిస్థితులు తప్పనిసరిగా వుండాలి. విద్యాలయాల వ్యవస్థ (నియత విద్య) వుండాలి. అక్షరాస్యత వుండాలి. ఇవి రెండూ లేకుండా జ్ఞానవ్యాప్తి అసాధ్యం. విద్యాలయాల వ్యవస్థ లేకుండా సంక్లిష్ట సమాజంలోని సమస్త వనరులనూ, విజయాలను ప్రసారం చేయడం కుదరదు. నియత విద్య గనక లేకపోయినట్లయితే ఏదయినా ఒక విషయానికి సంబంధించిన, సంపుటీకరించబడిన ఆలోచనలూ, అనుభవాలూ యువతకు అందుబాటులో లేకుండా పోతాయి. ఇతరుల వద్ద ఒక అనియత పద్ధతిలో కాకుండా శిక్షణ పొందితే ఇలాంటి జ్ఞాన సముపార్జనకు అవకాశం వుండదు. నియత విద్య లేకపోయినట్టయితే ఎవరికీ నూతనమైన జ్ఞానం కలిగే అవకాశం లేదు. అతని తెలివితేటలు విస్తరించవు. తన దైనందిన పనిపాటులకే పరిమితమయ్యే అవివేక బానిస అయిపోతాడు. కానీ ఈ నియత అనేది— పాఠశాలలు, పుస్తకాలు విధానపూర్వకమయిన విషయాలు అంటే చదువులు మొదలైన వాటితో ముడిపడినటువంటిది. అక్షరజ్ఞానం, చదవటం, వ్రాయటం తెలియనివాడు ఈ సంస్థల వలన లాభం ఎలా పొందగలడు? చదవటం, వ్రాయటం— వీటికి సంబంధించిన ప్రావీణ్యం— అనగా అక్షరజ్ఞానం, నియత విద్య— ఇవి ఒకరి నుంచి మరొకరికి సంక్రమించవలసినవి. ఇవి రెండూ లేకుండా జ్ఞాన విస్తరణ అనేది సాధ్యం కాదు.

ఈ విషయంలో హిందూమతం ఏంచేసిందో చూద్దాం!

హిందూమతంలో నియత విద్యకు సంబంధించిన భావన చాలా సంకుచిత పరిధి కలది. నియత విద్య కేవలం వేదాలను చదువుకోడానికి మాత్రమే పరిమితం. అది చాలా సహజం. ఎందుకనంటే— వేదాలను మించిన జ్ఞానం మరెక్కడా లేదని హిందువుల విశ్వాసం. ఈ కారణం చేతనే నియత విద్యను వేదాధ్యయనానికి పరిమితం చేశారు. అంతేకాదు— పర్యవసానంగా వేదాలను చదువుకొనటానికి స్థాపించిన పాఠశాలల్లో మాత్రమే చదువుకోడాన్ని హిందువులకు తప్పనిసరి విధిగా గుర్తించడం జరిగింది. ఈ పాఠశాలలు కేవలం బ్రాహ్మణులకు మాత్రమే ఉపకరించాయి. వర్తకుల జీవితానికీ, వివిధ వృత్తుల పనివారికీ సంబంధించిన కళలూ, శాస్త్రాలు

చదువుకోటానికి వీలైన పాఠశాలలను ప్రారంభించటంలో ప్రభుత్వం ఏమాత్రం బాధ్యత వహించలేదు. ప్రభుత్వ నిరాదరణకు గురైన ఆ కళలూ, శాస్త్రాలు కాలక్రమేణా వాటంతట అవే నశించాయి.

ప్రతివారు– తాము సాంప్రదాయికంగా ఏ వృత్తిని అనుసరించేవారో, ఆ పనిచేసే విధానాన్ని వారసత్వంగా తర్వాత తరాలకు నేర్పేవారు. ఒక వైశ్య యువకుడు తన వృత్తికి సంబంధించిన ప్రాథమిక పరిజ్ఞాన సంబంధమయిన వ్యాపార భౌగోళిక శాస్త్రమూ, గణితమూ, కొన్ని భాషలను నేర్చుకోవడంతోపాటుగా వ్యాపారానికి సంబంధించిన మెలకువలు కూడా తెలుసుకోవలసిన అవసరం వుంది. శూద్ర కులానికి చెందిన వివిధ చేతివృత్తుల వారు కూడా తమ పిల్లలకి ఈ విధంగానే ఆయా వృత్తుల్ని, కళల్నీ నేర్పించారు. విద్య కుటుంబ సంబంధమయింది. విద్య ఆచరణాత్మకమయింది. అదే కేవలం ఒక ప్రత్యేక వస్తువుని తయారుచేసే నైపుణ్యాన్ని మాత్రమే పెంచింది. కొత్త జ్ఞానానికి అవకాశం ఇవ్వలేదు. పరిధిని విస్తృతం చెయ్యలేదు. ఫలితంగా ఆచరణాత్మక విద్య మూస పద్ధతిలో, సమాజం నుంచి సంబంధం లేని ఏకాకితనంలో వ్యవహరించడాన్ని నేర్పింది. పరిస్థితులలో మార్పు వస్తే ఆ విద్య ఎందుకూ కొరాగానిదయ్యేది. నిరక్షరాస్యత హిందూ మతానికి పరంపరాగతమైనది. పరోక్షంగానే అయినా, అది హిందూమతంలో అవిభాజ్యభాగం. ఈ విధానాన్ని మనం అర్థం చేసుకోవాలంటే వేదాల బోధనకు, అధ్యయనానికీ సంబంధించి మనువు రూపొందించిన సూత్రాల పట్ల మన దృష్టిని లగ్నం చేయాలి. "అతను (బ్రహ్మ) బ్రాహ్మణులకు వేదాలను చదవటం, బోధించడం వృత్తిగా నిర్దేశించాడు". (1–88)

"అతను (బ్రహ్మ) క్షత్రియుణ్ని వేదం చదవమని ఆదేశించాడు". (1–89)

"అతను (బ్రహ్మ) వైశ్యుణ్ని వేదం .... చదవమని ఆదేశించాడు". (1–90)

"ఎవడైతే వేదాన్ని అభ్యాసంగా చదువుకుంటున్నటువంటి వాడి దగ్గర వినిగానీ, లేదా వేరొకనికి పాఠం చెబుతున్నప్పుడు గాని ఆ చదివేవారుగానీ, చెప్పేవారుగానీ అనుజ్ఞ లేకుండా వేదాన్ని నేర్చుకుంటాడో వాడు దాన్ని (వేదాన్ని) దొంగిలించినవాడు అవుతాడు. అందువల్ల నరకాన్ని పొందుతాడు". (1–116)

"శూద్రుల సమక్షంలో అతడు (ద్విజుడు) వేదాన్ని ఎప్పుడూ చదవకూడదు" (1–99)

"స్త్రీలకు వేదపాఠాల ప్రమేయం అవసరం లేదు". (9–18)

"ద్విజుడు అనుచితంగా (శూద్రులకు, స్త్రీలకు) వేదాన్ని బోధిస్తే తప్పు చేసిన వాడవుతాడు. ఆ నేరానికి శిక్ష బార్లీ తింటూ మాత్రమే ఒక సంవత్సరం బతకాలి". (11–199)

ఈ సూత్రాల్లోముఖ్యమైన అంశాలు మూడు వున్నాయి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు వేదాలను చదువవచ్చు. వీరిలో బ్రాహ్మణులకు మాత్రమే వేదాలను బోధించే అధికారం వుంది. కానీ శూద్రుని విషయంలోనికి వస్తే అతడు వేదాన్ని చదవటాన్కి మాత్రమే కాదు, చదువుతుంటే వినటానికి కూడా అనుమతించబడలేదు.

మనువు తర్వాత వచ్చిన సూత్రకర్తలు కూడా శూద్రులు వేదాలను చదవడం నేరమని చెప్పటమే కాకుండా, దానికి ఎన్నో కఠిన శిక్షలు విధించారు.

ఉదాహరణకి గౌతముడు చెప్పిన మాటలివి:–

"వల్లెవేయటం కోసం ఉద్దేశపూర్వకంగా శూద్రుడు వేదాలను పఠించేటప్పుడు గనుక వింటే అతని చెవులలో కరిగించిన సీసం లేక లక్కను పోయాలి. వేదాన్ని ఉచ్చరిస్తే, అతని నాలుకను కోసివేయాలి. వేదాన్ని సంపూర్ణంగా అపోశనం పడితే అతని శరీరమును ముక్కలుగా నరికివేయాలి". (12–4)

కాత్యాయనుడు కూడా పై విధంగానే చెప్పాడు.

జన సామాన్యాన్ని విద్యావంతులను చేయడంలో వైఫల్యానికి ప్రాచీన ప్రపంచాన్ని మొత్తంగా తప్పపట్టవచ్చు. కానీ ఏ సమాజం కూడా దాని మతానికి సంబంధించిన గ్రంథాలను ఆ సంఘం ప్రజలు చదవకుండా చేసిన నేరానికి పాల్పడలేదు. అడ్డుకోలేదు. సామాన్యుడు జ్ఞాన సముపార్జన చేయటం అనేది శిక్షించదగిన నేరం అని ప్రకటించడానికి ప్రయత్నించిన సమాజం ఏదీ లేదు. కానీ దైవదత్త సూత్రాలను చెబుతున్నానన్న ఒక్క మనువు మాత్రమే సామాన్య మానవునికి జ్ఞాన సముపార్జన హక్కుని నిరాకరించాడు.

కానీ నేను ఈ విషయాన్ని ఇంకా విస్తరించదలుచుకోలేదు. జన సామాన్యం వేదాలను చదవకూడదని నిషేధించడం వల్ల అది నిరక్షరాస్యతను ఎలా పెంచిందో, లౌకిక జీవితాన్ని నిర్లక్ష్యం చేసిందో ఇప్పుడు చెబుతాను. సమాధానం చాలా సులువైదే. వేదాలను చదవటానికి హక్కులేనివారికి వాటితో అవసరం లేదు. ఈవిధంగా చదవటం, రాయటం అనేవి వేదాధ్యయనంతో అనుకోకుండా ముడిపడి వున్నాయి. ఫలితంగా వేదాలను అధ్యయనంచేయటం, బోధించటం– అనే విషయాలకు సంబంధించిన హక్కులు, నిషేధాలు, చదవటం, వ్రాయటం, బోధించడం– అనే విషయాలను కళలకు విస్తరించడం జరిగింది. వేదాల్ని చదవటాన్కి అర్హత వున్న వారికి మాత్రమే వ్రాయటం, చదవటం అనే హక్కులు లభించాయి. వేదాల్ని చదవటానికి అర్హతలేని వారికి చదవటం, వ్రాయటానికి దూరం చేయబడ్డారు. కాబట్టి చదవటం, రాయటం అనేటువంటి అగ్రవర్ణాల వారి హక్కుగానూ, నిరక్షరాస్యత నిమ్న వర్ణాల తలరాతగానూ, మనుధర్మ సూత్రాలు నిర్దేశించాయని తెలుస్తోంది.

మనువు సామాన్య ప్రజానీకాన్ని చదువు సంధ్యల్లో నిషేధించడం ద్వారా, వారి అజ్ఞానానికి ఏవిధంగా కారణభూతుడయ్యాడో తెలపడానికి ఈ విశ్లేషణ ఒక మెట్టుమాత్రమే.

ఈ విధంగా హిందూమతం జ్ఞాన వ్యాప్తిని ప్రోత్సహించకపోవడం ద్వారా వారి సామాన్య ప్రజల జీవితాల్లో కారు చీకట్లను నింపింది.

ఈ విషయాలన్నిటినీ పరిగణనలోకి తీసుకుంటే, హిందూ మతం స్వేచ్ఛ అభివృద్ధి చెందే అన్ని పరిస్థితుల్నీ వ్యతిరేకించింది. అంటే స్వేచ్ఛనే నిరాకరించింది.

## IV

హిందూమతం సౌభ్రాతృత్వాన్ని గుర్తించిందా?

సాధారణంగా సమాజంలో కనిపించే శక్తులు రెండు. వ్యక్తివాదమూ, సౌభ్రాతృత్వం. వ్యక్తివాదం ఎప్పుడూ వుండేది. ప్రతివ్యక్తీ యిలా అంటాడు. "నేనూ నా పొరుగువాళ్లూ సోదరులవుతామా? దాయాదులమా? నేను వారి సంరక్షకుణ్ణా? నేను వాళ్ళకోసం మంచెందుకు చేయాలి?" యిలాంటి ప్రశ్నలతో వ్యక్తిగత ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని తననే తనకి లక్ష్యంగా చేసుకొని సంఘంలో కలవని, ఒక్కొక్కప్పుడు సంఘానికి వ్యతిరేకమైన దృష్టిని అభివృద్ధి చేసుకుంటాడు. వ్యక్తివాదానికి విరుద్ధమయిన లక్షణాలు కలిగింది సౌభ్రాతృత్వం. సహభావనకు మరొకపేరే సౌభ్రాతృత్వం. ఇతరుల మంచిలోనే తననితాను గుర్తించుకునే అభిప్రాయాన్ని కలిగిన వ్యక్తి సౌభ్రాతృత్వం కలిగి వుంటాడు. అప్పుడు మన ఉనికికి అవసరమైన భౌతిక పరిస్థితుల లాగానే, ఇతరుల మంచి వ్యక్తికి సహజమైనదిగాను, అవసరమయినదిగాను తయారవుతుంది. సౌభ్రాతృత్వానికి సంబందించిన ఈ భావం వుండటం వల్లనే తనలాగే సంతోషం కోసం వ్యక్తి పాకులాడే ప్రతి సహజీవినీ, తనకి శతృవుగానే భావిస్తాడు. వాళ్ళ లక్ష్య సాధనలో వాళ్ళని ఓడించి తద్వారా తన లక్ష్యసాధనలో తాను గెలుపొందాలని చూస్తాడు. వ్యక్తి వాదం అరాచకత్వాన్ని సృష్టిస్తుంది. మానవుల మధ్య నైతిక విధానాన్ని పెంపొందించి, దాన్ని రక్షించేది ఒక్క సౌభ్రాతృత్వమే. ఈ విషయంలో ఏ విధమైన సందేహమూ లేదు.

సౌభ్రాతృత్వానికి సంబంధించిన సహవేదనాభావం అసలు ఎలా పుడుతుంది? ఈభావం సహజసిద్ధమేనని జె.యస్. మిల్ అంటాడు.

సాంఘిక వ్యవస్థ అనేది మానవుడికి ఎంతో సహజమైనది, చాలా అవసరమైనది. అంతే కాదు– మనిషికి బాగా అలవాటయినటువంటిది. ఏవో కొన్ని అసాధారణ పరిస్థితుల్లో తప్ప లేక ఐచ్ఛికమయిన ఏవో కొన్ని వైరాగ్యం వల్ల కానీ, మనిషి దానిలో సభ్యుడు కాకుండా పోతాడు. సంఘంతో మనిషికున్న అనుబంధం రోజురోజుకి బలపడుతుంది. దీనిమూలంగా మానవజాతి

ఆటవిక స్వేచ్ఛాదశ నుంచి బయటపడుతుంది. కాబట్టి సమాజ స్థితికి అవసరమైన ఏ పరిస్థితి అయినా, మనిషి పుట్టిన, మనిషి గమ్యమయిన సంఘ పరిస్థితులకు సంబంధించిన భావనలతో అత్యంత అవిభాజ్యమయిన సంబంధం ఏర్పడుతుంది.

ఇక మానవులు సభ్యులయిన ఈసమాజంలో, యజమానీ, సేవకుడూ సంబంధాలు మినహాయిస్తే, అందరి ప్రయోజనాలను పరిగణనలోనికి తీసుకుంటేనే తప్ప, మరేవిధంగా ఇతర నిర్ణయాలు సాధ్యం కాదు. అందరి ప్రయోజనాలూ సమానంగా గౌరవింపబడినప్పుడు మాత్రమే సమానుల మధ్య సమాజం అస్తిత్వాన్ని కలిగివుంటుంది. అందువల్ల నాగరికతకి సంబంధించిన అన్ని దశల్లోనూ, సర్వంసహా చక్రవర్తిమినహా, ప్రతివ్యక్తీ సమానుడే. ఎవరో ఒకరితో ప్రతివ్యక్తి ఈ నియమాలకు అనుగుణంగా సహజీవనం చేయకతప్పదు. మరే యుగంలోనైనా దీనిలో (ఆ నియమబద్ధ జీవన విధానంలో) సంఘ పరంగా కొంత అభివృద్ధి కనిపించిందేకానీ, ఎవ్వరితోనూ, మరేయితర నియమాలతోనైనా శాశ్వతంగా జీవించడం అసాధ్యమయినది. ఈవిధంగా ప్రజలు ఇతర ప్రజల ప్రయోజనాలను గుర్తించడం ద్వారా మాత్రమే అభివృద్ధి చెందడం సాధ్యమయింది.

ఈ సోదరభావం హిందువులలో ఎక్కడయినా కనిపిస్తుందా? ఈ క్రింది వాస్తవాలు ఈ ప్రశ్నకు సంబంధించి ఎన్నో విషయాలను తెలియజేస్తాయి. మనల్ని పట్టి నిలబెట్టే మొట్ట మొదటి వాస్తవం— కులాల సంఖ్య. ఆ కులాల సంఖ్యను యింతవరకూ ఎవరూ ఖచ్చితంగా లెక్కించలేకపోయారు. కానీ, వాటి సంఖ్య రెండువేల పైనే వుంటుందని అంచనా వేశారు. అవి మూడువేలు కావచ్చు. ఈ వాస్తవానికి సంబంధించిన ఆలోచనా అంశాల్లో ఇది ఒక్కటే కాదు. మరికొన్ని వున్నాయి. కులాలు ఉపకులాలుగా విభజింపబడ్డాయి. వాటి సంఖ్య అసంఖ్యాకం. బ్రాహ్మణ కులం మొత్తం జనసంఖ్య కోటిన్నర. కానీ ఆ బ్రాహ్మణ కులంలో 1886 ఉపశాఖలు, శాఖలున్నాయి. ఒక్క పంజాబు రాష్ట్రంలోనే సారస్వత బ్రాహ్మణుల్లో 469 ఉపకులాలున్నాయి. అలాగే పంజాబులోని కాయస్థులలో 590 ఉపకులాలున్నాయి. సాంఘిక జీవనాన్ని చిన్న చిన్న ముక్కలుగా విడగొట్టే యిలాంటి అసంఖ్యాక ఉపకులాల సంఖ్యను ఎవ్వరైనా స్పష్టంగా గమనించవచ్చు.

కులాలు అసంఖాక్యమైన చిన్న చిన్న ముక్కలుగా విడిపోవటమనేది మూడవ అంశం. ఉపకులాలు కేవలం వంద కుటుంబాలు మాత్రమే కలిగినటువంటివి. వాళ్ళు ఎంతగా అంత స్సంబంధాలు కలిగి వుంటారంటే సగోత్ర సంబంధ నియమాలను అతిక్రమించకుండా తమ కులంలోనే వివాహం చేసుకోవడం వాళ్ళకి చాలా కష్టం.

ఎటువంటి అల్ప కారణాలతో ఈ శాఖోపశాఖలు ఏర్పడ్డాయో గమనించడం అవసరం.

అలాగే కులాల వ్యవస్థలోని అంతరాల నిచ్చెన మరొక గమనార్హ అంశం. కులాలన్నీ అంచెల స్వభావాన్ని రూపొందించుకున్నాయి. దాని ప్రకారం ఒక కులం అన్నిటికంటే ప్రథమ

స్థానంలో వుంటుంది. అది ఉన్నతమైనది. మరొకటి అల్పమైనది. ఇది అన్నిటికంటే నిమ్నమయి వది. ఈ రెండింటికీ మధ్య కొన్నింటికంటే పైన, కొన్నింటికంటే దిగువన మరికొన్ని కులాలు వున్నాయి. ఈ కుల వ్యవస్థ కులాల మధ్య హెచ్చుతగ్గులను నిరూపించే పద్ధతికి చెందింది. దీని ప్రకారం ఉన్నత, అట్టడుగు కులాలు తప్ప మిగిలిన కులాలు అన్నీ మరికొన్ని ఇతర కులాల కంటె ఆధిక్యాన్ని కలిగి ఉన్నవే. ఆధిక్యాన్ని అగ్రస్థానాన్ని ఎలా నిర్ణయించారు? ఆధిక్యం, నిమ్నత్వం, అవిధేయత్వం రెండు నియమాలపై నిర్ణయం అవుతాయి. అవి:

1. మతపరమైన కర్మకాండలతో ముడిపడినటువంటివి.

2. సహపంక్తి భోజనానికి సంబంధించినటువంటివి.

హెచ్చుతగ్గుల నియమాల ప్రాతిపదికగా మతం మూడు మార్గాల్లో తన ప్రణాళికను ఏర్పరచుకున్నది. మొదటిమార్గం మత సంబంధమయిన కర్మకాండలకు సంబంధించినది. రెండవది మత కర్మకాండలతో జతపడిన మంత్రోచ్చారణకు సంబంధించినది. మూడవది పురోహితుని స్థానానికి సంబంధించినది.

అగ్ర స్థానానికి సంబంధించిన కర్మకాండలతో ప్రారంభిద్దాం. హిందూ ధర్మ శాస్త్రాలు 16 మతపరమయిన కర్మకాండల్ని నిర్దేశించాయి. ఆ పదహారూ హిందూమత సంబంధి కర్మ కాండలే అయినప్పటికీ ప్రతి హిందువూ ఆ పదహారింటినీ ఆచరించడానికి హక్కును కోరలేదు. కొద్ది మందికి మాత్రమే వాటిని నిర్వహించగల హక్కు వుంది. కొంతమందికి కొన్ని ప్రత్యేకమైన కర్మకాండలను నిర్వహించడానికి అనుమతించడం జరిగింది. కొంతమందికి కొన్ని ప్రత్యేకమైన కర్మకాండల్ని నిర్వహించడానికి అవకాశం లేదు. ఉదాహరణకు ఉపనయనం లేక జందెం వేసుకుంటారు. కొన్ని కులాలకు ఈ హక్కు లేదు. ఈ కర్మకాండలను నిర్వహించే హక్కుకి సంబంధించిన ప్రమాణాలే ఈ విభేదాల్ని ఏర్పరిచాయి. కొన్ని కర్మకాండల్ని ఆచరించడానికి అర్హతఉన్న కులం, కొన్నిటిని మాత్రమే ఆచరించటానికి అర్హతవున్న కులం కంటే స్థాయిలో ఉన్నతమవుతుంది.

కులాలు హెచ్చు తగ్గులు నిర్ణయించడానికి మరొక ప్రధాన ఆధారం మంత్రాలు. వీటి విషయం చూద్దాం. హిందూమతం ప్రకారం ఒకే కర్మకాండ రెండు రకాలుగా ఆచరించడం కవిపిస్తుంది. 1. వేదంలో చెప్పిన విధంగా ఆచరించడం. 2. పురాణంలో చెప్పినవిధంగా ఆచరించడం. వేదంలో చెప్పిన విధానంలో కర్మకాండల్ని నిర్వహించడమంటే వేద మంత్రాలతో నిర్వహించడమనే అర్థం. పురాణంలో చెప్పిన విధంగా కర్మకాండలు నిర్వహించడమంటే పురాణాల్లోని మంత్రాలతో కర్మకాండల్ని నిర్వహించటమనే అర్థం. హిందూమత గ్రంథాలు రెండు రకాలు. 1. నాలుగు వేదాలు, 2. పద్దెనిమిది పురాణాలు. ఇవన్నీ కూడా పవిత్ర మత గ్రంథాలుగా గౌరవాన్ని పొందుతున్నా, అన్నిటికీ సమానమైన పవిత్రతలేదు. వేదాలకు అత్యంత ఉన్నతమయిన

పవిత్రత వుంది. పురాణాలకు అతి తక్కువ పవిత్రత వుంది. ఈ మంత్రాలు ఈవిధంగా సాంఘిక ప్రామాణికతకు అవకాశం యిచ్చాయనేది స్పష్టం. వేదంలో చెప్పిన విధంగా కర్మకాండల్ని నిర్వహించడం అనేది ప్రతి కులానికీ ఉన్నహక్కు అనే విషయం గుర్తించ తగింది. మూడు కులాలకు పదహారు కర్మకాండల్లో ఒకటిని నిర్వహించటానికి హక్కు వుంది. అయితే ఆనిర్వహణలో ఒక కులానికి వేదంలో చెప్పినవిధంగా, మరొక కులానికి పురాణంలో చెప్పిన విధంగా మాత్రమే నిర్వహించే అధికారం వుంది. తమ కర్మకాండల్లో ఒక కులం ప్రయోగించదగిన మంత్ర విషయంలో పూర్వ రివాజు అలాగే కొనసాగుతుంది. వేద మంత్రాలను ఉపయోగించే కులం ఉన్నతమైన కులంగాను, పురాణంలో చెప్పిన మంత్రాలు ఉపయోగించే కులం దానికంటే తక్కువదిగానూ నిర్ణయించడం జరిగింది.

మతంతో ముడివడిన పురోహితుణ్ణి రెండవ ఆధారంగా తీసుకుందాం. తమ కర్మకాండలను నిర్వహించి వాటి పూర్తి ప్రయోజనాల్ని పొందాలంటే హిందూమతం ప్రధాన సాధనం పురోహితుడే. మత గ్రంథాల చేత నియమితుడైన పురోహితుడు బ్రాహ్మణుడు. కాబట్టి బ్రాహ్మణుడు తప్పనిసరైనవాడు. కానీ మత కర్మకాండలను నిర్వహించడానికి కులంతో సంబంధం లేకుండా బ్రాహ్మణుడు పాల్గొనటాన్ని పవిత్ర గ్రంథాలు అంగీకరించలేదు. ఏకుల ఆహ్వానాన్ని అంగీకరించాలి, ఏకుల ఆహ్వానాన్ని తిరస్కరించాలి అన్న విషయం బ్రాహ్మణుని నిర్ణయానికి సంబంధించినదే. అతడు ఏ కుల కర్మకాండలను పర్యవేక్షించాలి. వేటిని మానాలి. ఎప్పుడో స్థిరపడిన ఆచారానికి సంబంధించినది ఈ వాస్తవమే-కులాల మధ్య ఏది ముందు ఏది వెనుక అనే విషయాన్ని నిర్ణయించడానికి ఆధారమౌతుంది. బ్రాహ్మణుడు మతోత్సవాలను నిర్వహించని కులం కంటే నిర్వహించే కులం ఉన్నతమైనదిగా గుర్తించడం జరిగింది.

కులాల హెచ్చుతగ్గుల విషయంలో రెండవ ఆధారం సహపంక్తి భోజనానికి సంబంధించినది. వివాహ నియమాలు సహపంక్తి భోజనాల నియమాలంతగా అంతరాల వ్యవస్థకు తావివ్వలేదు. కులాంతర వివాహం కులాంతర భోజనం- వీటి నిషేధించే నియమాల మధ్య తేడా ఉండటమే దీనికి కారణం. ఆ వ్యత్యాసం స్పష్టమైనదే. కులాంతర వివాహానికి నిషేధం గౌరవించతగిందే కాదు తప్పనిసరిగా పాటించవలసింది కూడా. కానీ కులాంతర సహపంక్తి భోజనాలు నిషేధించడం వల్ల అనేక కష్టాలు మొదలయ్యాయి. అన్ని పరిస్థితుల్లోను, అన్ని ప్రదేశాల్లోను దీన్ని ఖచ్చితంగా పాటించడం కుదరదు. మనిషి ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వలస వెళ్ళడం సహజం. వెళ్ళిన ప్రతి ప్రదేశంలోను తన కులంవార్ని వెతికి పట్టుకోవడం సాధ్యం కాకపోవచ్చు. ఒక్కో పర్యాయం కొత్త వ్యక్తుల మధ్య అతడు గడపవలసిన పరిస్థితి ఎదురవ్వవచ్చు. వివాహం అనేది తొందర తొందరగా చేసేదికాదు. కాని ఆహార విషయం అలా కాదు. వెంటనే గ్రహించక (తినక) తప్పదు. తన కులం వ్యక్తి దొరికేవరకు వివాహం చేసుకోనని ఎవరైనా నిరీక్షించవచ్చు. కానీ భోజనం విషయంలో అలా సాధ్యం కాదు గదా. అతడు తప్పకుండా ఎక్కడో ఒకచోట, ఎవరో ఒకరి ద్వారా ఆహారాన్ని స్వీకరించాల్సిందే. అలా ఆహారాన్ని స్వీకరిస్తే ఏ కులం నుంచి ఆహారాన్ని స్వీకరించాలనే ప్రశ్న తలెత్తుతుంది. తన కులం కంటే తక్కువ కులం నుంచి స్వీకరించకూడదు అన్నది నియమం. ఇలా ఒక కులం

నుంచి మాత్రమే ఆహారాన్ని స్వీకరించవచ్చునని, మరొక కులం నుంచి స్వీకరించకూడదని నిర్ణయించే ఈనియమం ఎలా వచ్చిందో కనుక్కునే మార్గం ఏదీ లేదు. ఎంతోకాలం నుంచి ఆచరణలో వున్న రివాజు కారణంగా ప్రతి హిందువుకి తాను ఏ కులం నుంచి ఆహారం స్వీకరించవచ్చు, ఏ కులం నుంచి స్వీకరించగూడదు అన్న విషయం తెలుసు. బ్రాహ్మణుడు అనుసరించిన నియమాన్నిబట్టి ప్రధానంగా ఈ విషయం నిర్ణయింపబడింది. బ్రాహ్మణుడు ఆహారాన్నిస్వీకరించడం లేక మానివేయడం అనేదాన్నిబట్టి కులాల హెచ్చుతగ్గుల్ని నిర్ణయించడం జరిగింది. బ్రాహ్మణుడు ఆహారాన్ని, నీటిని స్వీకరించే విషయమై ఎన్నో నియమాలున్నాయి. ఈ సందర్భంగా వాటిని చూద్దాం. 1. అతడు కొంతమంది నుంచి నీరు మాత్రమే స్వీకరించవచ్చు. ఇతరుల నుంచి తీసుకోకూడదు. 2. నీటితో వండిన ఆహారాన్ని ఏకులం ఇచ్చినా బ్రాహ్మణుడు తీసుకోకూడదు. 3. నూనెతో చేసిన ఆహార పదార్థాలను బ్రాహ్మణుడు కొన్ని కులాల నుంచి స్వీకరించవచ్చు. అంతేకాదు ఆ ఆహారం, నీరు తీసుకోటానికి ఉపయోగించే పాత్రల విషయంలో ఎన్నో నియమాలున్నాయి. బ్రాహ్మణుడు ఆహారాన్నిగాని, నీటిని గానీ మట్టితో చేసిన పాత్రద్వారా కొన్ని కులాల నుంచి స్వీకరించవచ్చు. కొన్ని కులాల నుంచి కేవలం లోహపాత్రలద్వారానో, మిగిలిన వారి నుంచి గాజు పాత్రల ద్వారానో ఆహారాన్ని స్వీకరించవచ్చు. అతడు ఆహారాన్ని స్వీకరించని కులం కంటే నూనెతో వంటకాలను స్వీకరించే కులం ఉన్నతమైనది. అలాగే మట్టి పాత్రలో తీసుకున్న కులం ఉన్నతమైనది. వీటిని తీసుకోని కులం కంటే తీసుకున్న కులం ఉన్నతమైనది. అలాగే మట్టిపాత్రలో వీటిని తీసుకున్న కులం కంటే పాత్రలో తీసుకున్న కులం ఉన్నతమైంది. ఈ రెండు కులాలు కూడా గాజు పాత్రతో తీసుకున్న కులం కంటే ఉన్నతమైనవి. గాజు కళంకంలేని పదార్థం (నిక్షేపం) కాబట్టి బ్రాహ్మణుడు తక్కువ కులాల నుంచి కూడా గాజుపాత్రల్లో నీటిని స్వీకరించవచ్చు. కానీ ఇతర లోహాలు కళంకాన్ని కలుగజేస్తాయి. పాత్ర అంటు లేక శుద్ధి– ఆ పాత్రను ఉపయోగించే వ్యక్తి స్థాయికి సంబంధించినటువంటిది. ఆ స్థాయి నీటిని పాత్రద్వారా స్వీకరించే బ్రాహ్మణుని యిష్టాయిష్టాలమీద ఆధారపడి ఉంటుంది.

హిందూమతంలోని కులాల అగ్రపీఠాధిపత్య వ్యవస్థలో కులం స్థానాన్ని, స్థాయిని నిర్ణయించే కొన్ని అంశాలు ఇవి.

కుల వ్యవస్థలోని ఆంతరిక వ్యవస్థ ఒకానొక సామాజిక మనస్తత్వం ఏర్పడటానికి కారణమయింది అనే విషయం గుర్తించతగినటువంటిది. సాంఘిక హోదాకి సంబంధించి వివిధకులాల మధ్య శత్రుత్వ భావనను కలుగజేయడం దానిలోని మొదటి విషయం. కులాల మధ్య అసహ్యకరయిన ఆరోహణా క్రమాన్ని (క్రిందనుంచిపైకి) అవమానకరమైన అవరోహణా క్రమాన్ని (పైనుంచి క్రిందికి) కల్గించడం రెండో విషయం.

పరస్పరం అసహ్యించుకునే, అవమానపర్చుకునే ఈ విధమయిన సామాజిక మనస్తత్వాన్ని భారతదేశంలో వాడుకలో వున్న అసంఖ్యాకమైన సామెతలతో ఉదాహరణ పూర్వకముగా నిరూపించవచ్చు. అలాంటి ఉదాహరణలకు పనికివచ్చేవి నేను సేకరించినది. కొన్ని సామెతలు ఇవి

(ఈ సామెతలు రాత ప్రతిలో లేవు. సం..)

ఈవిధమైన అసహ్యాం, అవమానం కేవలం సామెతల్లోనే కాదు, హిందూ సాహిత్యంలో కూడా వీటిని చూడొచ్చు. సహ్యాద్రి ఖండం అనుపేరుగల ధర్మ గ్రంథాన్ని ఈ సందర్భంలో నేను ఉదహరిస్తాను.

హిందూ పవిత్ర వాఙ్మయంలో భాగమైన పురాణాల్లో ఇది ఒకటి. కానీ ఇతర పురాణాల్లోని విషయం కంటే దీనిలో విషయం పూర్తిగా భిన్నమైంది. ఇది వివిధ కులాల పుట్టు పూర్వోత్తరాలను గురించి చర్చిస్తుంది. ఆ విధంగా నిరూపించేటప్పుడు ఇతర కులాలకు ఉన్నత మూలాల్ని, బ్రాహ్మణ కులానికి అసహ్యకరమైన పుట్టుకను కట్టబెట్టింది. ఇది మనువుపై తీర్చు కున్న ప్రతీకారమే. ఒక జాతిగా బ్రాహ్మణులను నీచంగా అధిక్షేపించిన రచన యిది. దీన్ని (సహ్యాద్రి ఖండాన్ని) నాశనం చేయ్యమని సహజంగానే పీష్వాలు ఆదేశించారు. ఆ సర్వనాశనం నుంచి కొన్ని ప్రతులు బతికి బయటపడ్డాయి. నేను వేయబోయే ప్రశ్నకు ముందుగా ఇంకొక్క వాస్తవాన్ని మీముందుంచుతాను.

ఈనాటి హిందువులు సాధారణంగా మార్క్సిజానికి బద్ధ వ్యతిరేకులు. వర్గపోరాట సిద్ధాంతాన్నిచూసి వారు భయభ్రాంతులవుతున్నారు. కానీ భారతదేశం వర్గ సంఘర్షణల నిలయమే కాదు, పోరాటాల భూమి కూడా.

అలాంటి వర్గపోరాటాల్లో అత్యంత తీవ్రమైనది బ్రాహ్మణులకు క్షత్రియులకు మధ్య జరిగినటువంటిది. ఈ రెండు వర్ణాల మధ్య జరిగిన వర్గ పోరాటాన్ని ప్రాచీన భారతీయ సారస్వతం చక్కగా చిత్రించింది.

మొట్టమొదట నమోదయిన సంఘర్షణ బ్రాహ్మణులకు, (క్షత్రియులకు) క్షత్రియుడైన వేనుడికి మధ్య జరిగినటువంటిది. అత్రి వంశానికి చెందిన అంగుడికీ, మృత్యువు కుమార్తె అయిన సునీతకు పుట్టిన వాడు వేనుడు. తాత అయిన కాలుని (మృత్యువు) వల్ల సంక్రమించిన అవగుణాలతో వేనుడు తన విధులను తోసిరాజని, కామ ప్రభావంతో మోహావేశుడై జీవించాడు. వేదవిహిత కర్మల్ని నిరాకరించి అరాచకత్వాన్ని ఆశ్రయించి, మతాతీతమైన జీవన విధానాన్ని నెలకొల్పాడు వేనుడు. అతని పాలనలో వేదాధ్యయనం వషట్కారం లోపించాయి. యజ్ఞాలు మొదలైన కర్మల వల్ల లభించే హవిస్సులు గ్రోలటానికి దేవతలకు అవకాశం లేకపోయింది. "నేనే హోతను! నేనే భోక్తను! ఈ బలులు, హవిస్సులు నాకే చెందాలి" అని వేనుడు ఆజ్ఞాపించాడు. తనకులేని అధికారాలను తానే ప్రకటించుకొని ధర్మాన్ని అతిక్రమించి ప్రవర్తిస్తున్న వేనుని దగ్గరకు మరీచి నాయకత్వంలో ఋషులంతా వెళ్ళారు. వేనునితో మరీచి "ఓ వేనా! అధర్మాన్ని ఆచరించకు. కొన్నేళ్ళు పట్టే యజ్ఞాన్నొకదాన్ని నిర్వహించ తలపెట్టాం. నువ్వు ప్రజాపతి అత్రి వంశంలో పుట్టిన వాడివి. ప్రజా సంరక్షణకోసం జీవితం వినియోగం కావాలి. ఈ కార్య నిర్వహణలో

నీవూ పాలు పంచుకోవాలి" అన్నాడు. ఏది మంచో ఏది చెడో గ్రహించలేని మూర్ఖుడైన వేనుడు హేళనగా వారితో "ధర్మ నిర్దేశం చేయగలవాడు నాకంటే మరొకడు ఎవడున్నాడు? ఎవడి ఆజ్ఞల్నో నేనెందుకు పాటించాలి? జ్ఞాన సంపత్తిలో, సంసార నిర్వహణల్లో, శమదమాదుల్లో, దృఢత్వంలో, సత్యపాలనలో నాతో సమానమైన వాడు భూమ్మీద వేరొకడు ఉన్నాడా? సర్వసృష్టి చైతన్యానికీ, సమస్త ధర్మాలకీ మూలకారకుణ్ణి నేనే నన్న విషయం తెలుసుకోలేకపోతున్నారు. నేనే గనక తలచుకుంటే 'భూమిని తలక్రిందులు చేయగలను. జలప్రళయాన్ని కల్పించగలను. భూమ్యాకాశాలను మూసివేయగలను'– అని అన్నాడు. అహంకారంతో కన్నుమిన్నుగానకుండా విర్రవీగే వేనుని మాటలకు కోపగించుకున్న తపస్సంపన్నులైన ఆ మహర్షులు అతణ్ణి పట్టుకుని అతని ఎడమ తొడపై రుద్దారు. అప్పుడు ఆ తొడలోంచి నల్లని శరీర వర్ణంతో ఒక పొట్టివాడు పుట్టాడు. వాడు భయంభయంగా చేతులు జోడించి నిలబడ్డాడు. అప్పుడు అత్రి వాడితో 'కూర్చో' (నిషాదా) వేనుని కల్మషంలోంచి పుట్టిన నీవు నిషాద జాతికి మూలపురుషుడివి అవుతావు. అంతేకాదు "ధీవర" (జాలరు)లకు మూలపురుషుడివి అవుతావు. అదే విధంగా వింధ్య పర్వతప్రాంతాల్లో నివసించే అధర్మాభిమానులైన "తుఖారులు" తుంబురులు వేనుని నుంచి పుట్టారు. ఆ తర్వాత శక్తి సామర్థ్యాలున్న ఆ ఋషులు ఆగ్రహావేశాలతో నిప్పు పుట్టించటానికి అరణి చెక్కను రుద్దినట్లుగా వేనుని కుడిచేతిని రుద్దారు. వేనుని శరీరం నుంచి ప్రతిస్పర్థిగా అగ్ని తేజస్సుతో పృథువు జన్మించాడు."

"వేనుని కొడుకు (పృథువు) చేతులు జోడించి మహర్షులతో ఇలా అన్నాడు. మహర్షులారా! ప్రకృతి సిద్ధంగా విధినిర్వహణకు సంబంధించిన నియమాల గురించి నాకు తెలిసింది చాలా స్వల్పం. నేను వాటిని ఎలా అమలు చేయాలో వాస్తవంగా చెప్పండి. సందేహించకండి! మీరు నేను ఆచరించవలసిన విధులుగా వేటిని నిర్దేశిస్తారో తు.చ తప్పకుండా ఆచరిస్తాను" అప్పుడు దేవతలు, మహర్షులు ఇలా అన్నారు. "ఏ విధి అయితే ఆజ్ఞాపించడం జరిగిందో నీ యిష్టానిష్టాలతో సంబంధం లేకుండా దానిని సంకోచం లేకుండా నిర్వహించు. అన్ని ప్రాణుల్నీ సమానంగా చూడు. కామం, క్రోధం, తృష్ణ, అహంకారం వీటికి దూరంగా వుండు. ధర్మ మార్గం నుంచి ఎవడైతే భ్రష్టుడౌతాడో వాణ్ని నీ విధినిర్వహణలో భాగంగా భుజబలంతో అణచివేయి. మనో వాక్కాయ కర్మలతో నీ రాజ్యంలోని బ్రాహ్మణులను (వేదాల్ని) అనుక్షణం కాపాడు. శిక్షల నుంచి బ్రాహ్మణుల్ని మినహాయిస్తానని ప్రమాణం చేయి. అలాగే వర్ణ సంకరం కాకుండా చూస్తానని ఒట్టుపెట్టు" ఋషుల నేతృత్వంలోని దేవతలతో అప్పుడు వేనుని పుత్రుడు ఇలా అన్నాడు. "మహర్షులారా! దేవతలారా! నా గౌరవాన్ని అందుకోండి. వేదంలో చెప్పిన విధంగానే నేను ఆచరిస్తాను" జ్ఞానవిధి శుక్రుడు అతని పురోహితుడు అయ్యాడు. వాలఖిల్యులు, సారస్వత్యులు అతని అమాత్యులయ్యారు. మహర్షి, పూజ్యుడు అగు గార్గుడు అతని ఆస్థాన కార్తాంతికుడు (జ్యోతిష్కుడు) అయ్యాడు."

బ్రాహ్మణులకు, క్షత్రియరాజు పురూరవుడికి మధ్య జరిగిన పోరాటం– నమోదైన రెండవ వృత్తాంతం. మహాభారతంలో ఆదిపర్వంలో దీని సంగ్రహ ప్రస్తావన కన్పిస్తోంది.

"ఇళకు పుట్టిన రాజు పురూరవుడు. ఆ చక్రవర్తి భూమండలం మొత్తాన్ని, పదమూడు ద్వీపాలను, తన శౌర్యశక్తితో జయించి పాలించాడు. ఆ పురూరవ చక్రవర్తి మదంతో కన్నుకానని వాడై, బ్రాహ్మణులతో సంఘర్షణకు దిగాడు. బ్రాహ్మణులు అరచిగీపెట్టినా మానక వారి ధనాన్ని కొల్లగొట్టాడు. నగానట్రా దోచుకున్నాడు. అప్పుడు సకత్కుమారుడు బ్రహ్మలోకం నుంచి వచ్చి పురూరవునికి హితబోధ చేశాడు. అయితే పురూరవుడు దానిని ఖాతరు చేయలేదు. అప్పుడు మునులకు తీవ్ర ఆగ్రహం కలిగి, రాజు ఉన్మత్తుడైపోగలడని శపించారు. ఈ విరాట్పురుషుడు (పురూరవుడు) ఊర్వశితో కలిసి అప్పటి వరకు గంధర్వలోకంలో వున్న అగ్నిని పవిత్ర కర్మకాండలు నిర్వహించడానికి భూమికి తీసుకొని వచ్చాడు. అతడు (పురూరవుడు) దానిని మూడు భాగాలుగా చేశాడు. అవే త్రేతాగ్నులు"

నమోదైన మూడవ సంఘర్షణ బ్రాహ్మణులకు, నహుష మహారాజుకు మధ్య జరిగిన సంఘర్షణకు సంబంధించినటువంటిది. మహాభారతం ఉద్యోగపర్వంలో ఈ కథ పూర్తి వివరములతో ఉంది. ఆ కథ ఇది.

"ఆవిధంగా దేవతల రాజైన ఇంద్రుడు- వృత్తాసురుని సంహరించిన తర్వాత (వృత్తుడు బ్రాహ్మణుడుగా పరిగణింపబడడం చేత) బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందేమోనని భయపడి దూరంగా పారిపోయి, ఒక నీటి మడుగులో దాక్కున్నాడు. అర్థాంతరంగా ఇంద్రుడు మాయం కావడంతో క్రతుకృత్యాలకు తీవ్ర విఘాతమేర్పడింది. అధికార కార్యకలాపాలు స్తంభించిపోయాయి. తీవ్ర సందిగ్ధంలో పడిన ఋషులు, దేవతలు మానవుడైన నహుషుని ఇంద్ర సింహాసనం అధిష్టించాల్సిందిగా కోరారు. మొదట్లో ఇష్టపడకపోయినప్పటికీ, అధికారమనేసరికి ఆశపడి వదలలేక మనసు మార్చుకున్నాడు. ఇంద్రపదవి చేపట్టాడు. అప్పటిదాకా ఎంతో గౌరవంతో మంచిగా బ్రతికిన నహుషుడికి అనుకోకుండా లభించిన ఈ అధికారం అహంకారాన్ని పెంచింది. విలాసాలు పెరిగిపోయాయి. యాదృచ్ఛికంగా ఒకసారి ఇంద్రుని భార్య అయిన ఇంద్రాణిని చూడడంతో నహుషుని కన్ను ఆమెమీద పడింది. ఎలాగైనా ఆమెను అనుభవించాలన్న కోరిక పెరిగింది. దీనికి భయపడిన ఇంద్రాణి దేవతా సంరక్షకుడైన అంగిరస బృహస్పతిని శరణు కోరింది. పర పురుషుని భార్యను కోరడం మహా పాతకమని నహుషునికి బృహస్పతి నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. దానిని పెడచెవిని పెట్టి నహుషుడు 'ఈ విషయంలో నేను ఇంద్రుడంత నీచుణ్ణి కాను' అని తన చర్యను సమర్ధించుకున్నాడు"

బృహస్పతితో నహుషుని వాదన ఇంకా ఈ విధంగా సాగింది. "పరమ పవిత్రుడైన గౌతముని భార్య అహల్యను ఇంద్రుడు చెరచినపుడు ఇంద్రుణ్ణి మీరెందుకు వారించలేకపోయారు. తాను చూచిన ఏ స్త్రీని అయినా ఇంద్రుడు వదిలాడా? ఈ విషయంలో ఇంద్రుడంతటి ఆటరికాడు మరొకడు వున్నాడా? మోసాలు చేయడంలోను, ఎత్తులు వేయుడంలోను ఇంద్రుడు వంటి జిత్తులమారి ఇంకొకడున్నాడా? ఎందుకు దేవతలు ఇంద్రుడి ఆగడాలను సహించారు?" అని నహుషుడు అడిగాడు. దానితో దేవతలు ఇంద్రాణిని తీసుకు రావడానికి వెళ్ళారు. బృహస్పతి

మాత్రం పట్టు విడువలేదు. అతని సలహాతో ఇంద్రాణి తను భర్తను వెతకడానికి వెళుతున్నానని, నహుషుని కొంత గడువు అడిగింది. ఆమె అభ్యర్ధనను నహుషుడు అంగీకరించాడు. నిశాదేవి సహాయంతో తన భర్తను వెదకడానికి ఇంద్రాణి బయలుదేరింది. హిమాలయాల సమీపంలోని ఒక సరోవరంలో పద్మాలమాటున జిత్తులమారి ఇంద్రుడు దాక్కొని ఉండటం ఇంద్రాణి చూసింది. నహుషుని కోర్కె గురించి భర్తకు వివరించింది. అతని శక్తియుక్తులు ఉపయోగించి నహుషుని బారి నుంచి తనను రక్షించమని భర్తయైన ఇంద్రుడ్ని ఇంద్రాణి అర్ధించింది. అయితే ఇంద్రునినుంచి ఎలాంటి అనుకూల ప్రతిస్పందన లభించలేదు. తొలుత కొంతసేపు ఆలోచించిన తర్వాత ఇంద్రుడు నహుషుని బారి నుంచి ఇంద్రాణి బయటపడేందుకు ఒక పరోక్ష వ్యూహానికి సంబంధించిన సలహా ఇచ్చాడు. ఋషులు మోస్తుండగా దేవతావాహనమైన పల్లకిలో తనను చేరితే సంగమానికి ఏవిధమైన అభ్యంతరం వుండదని నహుషునికి ఇంద్రాణి చెప్పటం ఈ వ్యూహం. దీనికంగీకరించిన ఇంద్రాణి నహుషునితో–సర్వేశ్వరా! మీ మీద నాకున్న ప్రేమను మాటల్లో వర్ణించలేను. ఇంతవరకు ఇతరులెవ్వరికీ లభించని మహాదవకాశం మీకు లభించబోతుంది. సప్త ఋషులే పల్లకీలో మిమ్మల్ని మోసుకొచ్చి నాకు జతచేయడం.... ఓ ఆ ఊహే నాకు అమితానందాన్ని కలిగిస్తుంది.... ఇలా సాగుతున్న ఇంద్రాణి పలుకులు నహుషుని మైమరపించాయి. తన కోరిక ఫలిస్తున్నందుకు తనను తాను అభినందించుకొని నహుషుడు స్వగతంలో ఇలా అనుకున్నాడు. మహర్షుల చేతనే పల్లకీ మోయించబోయే పరాక్రమశాలి, నహుషా! నీ ధీరత్వం ఎంత గొప్పది. గతం, వర్తమానం, భవిష్యత్తు అంతా నీదే ప్రపంచమంతా నీమీదే ఆధారపడి వుంది. నువ్వు ఆగ్రహిస్తే ప్రపంచమే లేదు. దేవి ఇంద్రాణీ! సందేహం లేకుండా నీ కోరిక తీరుస్తాను. సప్త ఋషులు బ్రహ్మర్షులు పల్లకీలో నన్ను మోసుకొస్తారు. వేచి ఉండు. అందాల రాశీ! అదృష్టదేవతా! నా భాగ్యరాశీ!" ఈ కథ ఇంకా ఇలా కొనసాగింది. మదాంధుడు, దుండగుడు కామంతో కళ్ళు మూసుకుపోయిన వాడు, గుణహీనుడు అయిన నహుషుడు మహాత్ములైన మునీశ్వరుల్ని తన పల్లకీ మోయవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఇంద్రాణి తిరిగి బృహస్పతి వద్దకుపోయి తన ఆందోళన వ్యక్తం చేయగా, బృహస్పతి ఆమెతో నహుషునికి తగిన శాస్తి తప్పక జరుగుతుందని హామీ ఇచ్చాడు. అహంకారంతో విర్రవీగిన నహుషుని పతనం తప్పదని అందుకు తాను ఎలాంటి త్యాగానికైనా సిద్ధపడతాననీ చెప్పడంతోపాటు ఇంద్రుడు దాగి ఉన్న రహస్య స్థావరాన్ని కూడా త్వరలో తెలుసుకోగలుగుతానని ఇంద్రాణికి ఊరడింపుగా బృహస్పతి చెప్పాడు. తరువాత ఇంద్రుని జాడ తెలుసుకోవడం కోసం అగ్నిని పంపించడం, అగ్నితో కలిసి ఇంద్రుడురావడం జరిగాయి. ఇంద్రుడొచ్చాక అతనులేని సమయంలో ఏయే సంఘటనలు జరిగాయో, ముఖ్యంగా నహుషుని వృత్తాంతం వగైరాలను– దేవతలు ఇలా వివరించారు. నహుషుని ఎలా పతనమొందించాలా అని కుబేరుడు, యముడు, సోముడు వరుణులతో ఇంద్రుడు మంత్రాలోచన చేస్తూ ఉండగా అగస్త్య మహాముని అక్కడకు వచ్చాడు. శత్రువైన నహుషుడు పతనం చెందాడని చెప్పి ఇంద్రుణ్ణి అభినందించాడు. నహుషుడు చివరకు ఎలా పదవీభ్రష్టుడై పతనం చెందాడో ఈవిధంగా తెలిపాడు.

"మదాంధుడు, మహాపాపి అయిన నహుషుని దివ్యర్షులూ, బ్రహ్మర్షులూ పల్లకీమీద మోసుకెళుతున్న సందర్భంలో వారు నహుషుని ఒక ధర్మ సందేహాన్ని తీర్చమని ఇలా అడిగారు

"వాసవా (నహుషా)! అసుర విజేతా! రాజును ఆహుతి చేసినపుడు పఠించే బ్రాహ్మణాలు నీ అభిప్రాయంలో ప్రామాణికమైనవి అవునా? కాదా?" గర్వాంధుడైన నహుషుడు 'కాదు' అని సమాధానమిచ్చాడు. అప్పుడు ఋషీశ్వరులు 'ఓయీ! అధర్మపరుడా! నీవు ధర్మాన్ని సాధించలేవు. మహర్షుల దివ్యవాణి నుండి వెలువడిన ఆ పాఠాలను మునీశ్వరులమైన మేము ప్రామాణికాలుగా గ్రహిస్తాము" అని అన్నారు. ఈ విషయమై నహుషుడికీ ఋషులకూ తీవ్ర వివాదం జరిగింది. ఆగ్రహించిన నహుషుడు నన్ను (అగస్త్యుని) తలపై కాలితో తన్నాడు. దానితో నహుషుడి యశస్సు, పుణ్యము తత్ఫలితంగా అభ్యుదయం నశించిపోయాయి. దానితో అతడు భయకం పితుడై ఉండగా నేను కోపంతో ఇలా అన్నాను 'నీవు మూఢుడవై పూర్వ మహర్షులు కూర్చిన పవిత్ర గ్రంథాలను అగౌరవపరిచావు. నీ పాదంతో తాడించావు. బ్రహ్మ సన్నిభులైన మహర్షులను వాహకులుగా చేశావు. కనుక కాంతి విహీనుడవై పుణ్యం కోల్పోయి దివి నుంచి భువిమీద పడి– పదివేల సంవత్సరాలు ఘోర సర్పమై పడివుండు. ఆ తరువాత మరల నీకు స్వర్గ ప్రాప్తి కలుగుతుంది.' అలా ఆ మూర్ఖ నహుషుడు స్వర్గలోకం నుంచీ, దేవతాధిపత్యం నుంచీ భ్రష్టుడై భూమిమీద కూలిపోయాడు. బ్రాహ్మణ శత్రువు పరాభూతుడైనాడు. 'కనుక ఇంద్రా! ఇక అభ్యుదయం పొందగలము. ముల్లోకాలను స్వాధీనపరచుకొని లోకులను కాపాడు. శచీపతీ! ఇంద్రియ నిగ్రహం సాధించి శత్రుజయం పొంది మహర్షుల దీవెనలతో లోకపాలనచేయి."

ఇక నాల్గవ వృత్తాంతం నిమిరాజుకు, బ్రాహ్మణులకు మధ్య జరిగినటువంటిది. ఆ సంఘర్షణకు సంబంధించిన కథనాన్ని విష్ణు పురాణం ఈ విధంగా వివరించింది.

వేల సంవత్సరాలు కొనసాగే ఒక యజ్ఞాన్ని చేయటానికి పదార్థాలన్నీ సమకూర్చుకొని బ్రహ్మర్షి వశిష్ఠుని 'హోత' (యజ్ఞ నిర్వాహకుడు)గా పిలిచాడు నిమి. అంతకు పూర్వమే ఐదువందల సంవత్సరాలు పట్టే యజ్ఞాన్ని ఇంద్రునికి నిర్వహించడానికి ఒప్పుకున్నాననీ, అందువల్ల ముందుగా దానిని పూర్తిచేసి తర్వాత వస్తానని వశిష్ఠుడు చెప్పాడు. దానికి నిమి ఏమీ బదులి వ్వలేదు. వశిష్ఠుడు దానిని అంగీకారంగా భావించి వెళ్ళిపోయాడు. అతను తిరిగి వచ్చేటప్పటికి నిమి గౌతముడు మొదలైన వాళ్ళతో యాగకార్యం చేయించుకోవడం వశిష్ఠుడు చూశాడు. (గౌతముడు కూడా వశిష్ఠునివలె ఒక బ్రాహ్మణ ఋషి) తాను తిరిగి వచ్చిన తరువాత యజ్ఞాన్ని పూర్తిచేస్తానని మాట ఇచ్చినప్పటికీ దానిని త్రోసివేసి గౌతముడు హోతగా యజ్ఞాన్ని నిర్వహించడం వశిష్ఠునికి తీవ్రమైన ఆగ్రహం కలిగించింది. ఆ సమయంలో నిమి నిద్రిస్తున్నాడు. దీన్ని అవమానంగా భావించిన వశిష్ఠుడు నిమిని 'అశరీరుడు' (విదేహుడు)వు కమ్మని శపించాడు. ఈలోపు నిద్రనుంచి మేల్కొన్న నిమి వశిష్ఠుని శాపం గురించి తెలుసుకొని ఎలాంటి హెచ్చరిక చేయకుండానే శపించడాన్ని తీవ్రంగా పరిగణించి అలాంటి శాపాన్ని తాను వశిష్ఠునికి ఇచ్చి మరణించాడు. గౌతముడు నిమి శరీరాన్ని (మానెలో) చెడకుండా భద్రపరిచి యజ్ఞాన్ని పూర్తికావించాడు. యజ్ఞం నిరంతరం హవిర్భాగాన్ని అందుకోవడానికి వచ్చిన దేవతలు నిమిని తిరిగి బ్రతికించడానికి ముక్కువచూపారు. కాని నిమి అందుకు అంగీకరించలేదు. అయితే అతని కోరిక మేరకు దేవతలు అతని ప్రాణం కన్నులలో నిలిపారు. ఫలితంగా అప్పటి నుంచి ప్రాణులు ఎప్పుడు కళ్ళుమూసి తెరవడం సంభవించింది." (నిమిషము–రెప్పపాటు)

బ్రాహ్మణులకు సుముఖ మహారాజుకు మధ్య జరిగిన సంఘర్షణను మనువు పేర్కొన్నాడు. కాని దీనికి సంబంధించిన వివరాలేమీ లభించడంలేదు.

బ్రాహ్మణులకు క్షత్రియులైన రాజులకు మధ్య జరిగిన సంఘర్షణలకు సంబంధించిన వృత్తాంతాలు ఇవి. బ్రాహ్మణులు-క్షత్రియులు రెండు జాతులుగా పోరాడుకోలేదని వీటినిబట్టి ఊహించకూడదు. ఎందుకంటే రాజులతో జరిగిన పోరాటంకంటే భిన్నమైన ఈ రెండు వర్గాల సంఘర్షణను సందేహానికి ఆస్కారం లేని విస్తారమైన చారిత్రక ఆధారాతో నిరూపించడం జరిగింది. దీనికి సంబంధించిన మూడు ఉదాహరణలు ఇస్తున్నాను.

మొదటిది ఇద్దరు వ్యక్తుల మధ్య అంటే క్షత్రియుడయిన విశ్వామిత్రునికి బ్రాహ్మణుడైన వశిష్ఠునికి మధ్య జరిగినటువంటిది. క్షత్రియుడు బ్రహ్మర్షి పదవిని పొందాలని ఆశించటంలో వీరిద్దరిమధ్య సంఘర్షణ తలయెత్తింది. ఈ కథ రామాయణంలో ఈ క్రింది విధంగా కన్పిస్తోంది:

"విశ్వామిత్రుని వంశవృక్షం చాలా పెద్దది. ప్రజాపతి కొడుకు కుశుడు. అతని కుమారుడు కుశనాభుడు. ఇతని కొడుకు గాధి. గాధి కొడుకే విశ్వామిత్రుడు. ఆ విశ్వామిత్రుడు వేలకువేల సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలించాడు. ఒకసారి అతను భూ ప్రదక్షిణ చేస్తుండగా వశిష్ఠుని ఆశ్రమం కన్పించింది. ప్రశాంత వాతావరణం, శాంతం మూర్తీభవించిన మహర్షులు, సన్యాసులు భక్తులతో కళకళలాడుతున్న ఆశ్రమ ప్రాంగణంలో విశ్వామిత్రుడు అడుగుపెట్టాడు. వశిష్టుడు అతని పరివారం విశ్వామిత్రుణ్ణి ఎంతో సాదరంగా ఆహ్వానించారు. బ్రహ్మపుత్రుడైన వశిష్టుడు విశ్వామిత్రునికి ప్రత్యేక మర్యాదలు చేయించాడు. మృష్టాన్న భోజనానికి అవసరమైన అన్ని తిను బండారాలను సమకూర్చిన కామధేనువు (ఆవు)పై విశ్వామిత్రుని కన్ను పడింది. లక్ష (మామూలు) ఆవులను యిస్తానన్నప్పటికి వశిష్టుడు కామధేనువును ఇవ్వడానికి అంగీకరించలేదు. దానికి విశ్వామిత్రుడు కామధేనువు రత్నంలాంటిది. రత్నాలన్నీ రాజులసొత్తు కనుక ధేనువును పొందే హక్కు తనకుందని వాదనకు దిగాడు. కామధేనువుకు ఖరీదు కట్టడం వశిష్టుణ్ణి బాధించింది. విశ్వామిత్రుడు ఎన్నో రకాలుగా బేరసారాలు చేసాడు. అయితే అవేమీ ఫలించలేదు. అతనికి కోపం తారాస్థాయికి చేరింది. కృతఘ్నుడుగా వ్యవహరించాడు. బలవంతంగా కామధేనువును తోలుకు పోయాడు. కానీ కామధేనువు కట్లు తెంచుకొని పారిపోయి తిరిగి వశిష్టుని ఆశ్రమానికి చేరింది. తనను త్యజించడానికే పూనుకొన్నాడనీ (ఆకామధేనువు) వశిష్టుణ్ణి నిందించింది. "నిన్ను వదిలించుకోవాలన్న ఉద్దేశం నాలో ఏమాత్రం లేదు. కానీ ఏం చేయను. విశ్వామిత్రుడు క్షత్రియుడు. కనుక నాకంటే శక్తిమంతుడు" అని వశిష్ఠుడు ధేనువుతో చెప్పాడు. అపుడు కామధేనువు కల్పించుకుని "బ్రాహ్మణులకంటే శక్తిమంతులెవ్వరూ లేరు. వారి శక్తి అనంతమైనది. దైవజ్ఞమయింది. క్షత్రియులు వీరి ముందు దిగదుడుపు. ఇంత అని చెప్పలేనట్టిది బ్రాహ్మణుల బలం. విశ్వామిత్రుడు వీరుడు కావచ్చు. కానీ మీకంటే గొప్పవాడేమీ కాదు. మీ శక్తి అపూర్వమైంది. నన్ను ఉపయోగించండి. బ్రాహ్మణీక సర్వశక్తుల్నీ ఆవహింపజేసుకుని విశ్వామిత్రుణ్ణి పీచమణిపిస్తాను" అని శపథంచేసి తన (కామధేనువు) శక్తిని

వినియోగించడం ప్రారంభించింది. అది తన శరీరం నుంచి వందమంది మల్లులను సృష్టించి విశ్వామిత్రునిపైకే ఉసిగొల్పింది. వారు విశ్వామిత్రుని దుంపనాశనానికి ఒడికట్టారు. అయితే అతని ధాటికి నిలువలేక మరణించారు. వివిధ ఆయుధాలను ధరించిన శకులను, యవనులను, కామధేనువు ఆ తరువాత సృష్టించి విశ్వామిత్రునిపైకి పంపింది. విశ్వామిత్రుని సైన్యాన్ని వారు తుదముట్టించారు. వారిని కూడా విశ్వామిత్రుడు మట్టికరిపించాడు. ఈసారి యుద్ధకళలో ఆరి తేరిన వివిధ తెగల బలశాలురను కామధేనువు సృష్టించింది. వారంతా మూకుమ్మడిగా దాడిచేసి విశ్వామిత్రుని సర్వసైన్యాలయిన కాల్బలం, అశ్వబలం, గజబలం మొదలైన వాటిని నాశనం చేశారు. విశ్వామిత్రుని సంతతి అయిన వందమంది వశిష్ఠుని ఆశ్రమంపై దాడిచేసి హింసకు పూనుకున్నారు. వశిష్ఠుని మహిమతో వారంతా మాడి మసైపోయారు. దీంతో చలించిన విశ్వామిత్రుడు మిగిలిన తన కుమారుల్లో ఒకనికి రాజ్యభారం అప్పగించి హిమాలయాలకు తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు. మహాదేవుని అనుగ్రహం వలన ఎలాంటి వాడినైనా జయిం చగలిగిన శస్త్ర, అస్త్ర విద్యలను నేర్చుకోవడంతోపాటు మహాదేవుని నుండి అపూర్వ శక్తికలిగిన ఆయుధాలను పొందాడు. నేరుగా వశిష్ఠుని ఆశ్రమానికి వచ్చి దానిని సర్వనాశనం చేశాడు. అక్కడ జీవిస్తున్న వారిని పారద్రోలాడు. తీవ్ర ఆగ్రహం చెందిన వశిష్ఠుడు తన బ్రాహ్మణీక శక్తితో విశ్వామిత్రుణ్ణి శపించబోయాడు. విశ్వామిత్రుడు కూడా తన ఆయుధాన్ని వేశాడు. బ్రాహ్మణశక్తి ముందు ఎలాంటి ఆయుధం పనిచేయదని వశిష్ఠుడు చెప్పడం, దానిని విశ్వామిత్రుడు హేళన చేయడం, వారిరువురు తమ తమ బలాబలాలు ప్రదర్శించడం అనివార్యమయ్యింది. నిప్పును నీరు ఆర్పినట్లు క్షత్రియ శక్తిని బ్రాహ్మణ మహిమ ఓడిస్తుందని వశిష్ఠుడు అన్నాడు. తపస్సు ఫలితంగా తనకు లభించిన శక్తి ఆధారంగా శివుడు, విష్ణువు, కాలము, వరుణుడు, బ్రహ్మ మొదలగు శక్తుల్ని విశ్వామిత్రుడు వశిష్ఠునిపైకి వదిలాడు. అయితే అత్యంత మహిమోపేతము, శక్తిసంపన్నము అయిన బ్రహ్మాస్త్రాన్ని వశిష్ఠుని పైకి వదిలాడు. దాన్ని కూడా వశిష్ఠుడు ఎదు ర్కొన్నాడు. అంతే కాదు తన విశ్వరూపంతో వశిష్ఠుడు విశ్వామిత్రుని గడగడలాడించాడు. యముని వజ్రాయుధాన్ని సృష్టించి విశ్వామిత్రునిపైకి విసిరాడు వశిష్ఠుడు. గగ్గోలు పెట్టాడు విశ్వామిత్రుడు. బ్రాహ్మణ శక్తిముందు క్షత్రియ శక్తి దిగదుడుపేనని అంగీకరించే స్థితికి వచ్చాడు. బ్రాహ్మణ్య మహిమ ధాటికి ఎంతో శక్తివంతమైన ఆయుధాలు కూడా నాశనమయ్యాయి కదా! అని ఆశ్చర్యపోయాడు.

విశ్వామిత్రునికి ఏమీ పాలుపోలేదు. ప్రత్యామ్నాయాలుగా, రెండు మార్గాలు కనిపిం చాయి. ఓటమిని అంగీకరించడం ఒకటి, తనదైన బ్రాహ్మణీక శైలిని అభివృద్ధిచేయడం మరొటి. రెండో మార్గమే ఎన్నుకోక తప్పింది కాదు. ఈ స్థితికి కారకుడైన వశిష్ఠునిపై కారాలు నూరాడు. తన విస్పహాయతను విందించుకున్నాడు. తాను తీసుకున్న నిర్ణయాన్ని అమలు పరిచే కార్యంలో భాగంగా పతీసమేతుడై దక్షిణాదిని పర్యటించాడు. వెయ్యేళ్ళు గడిచాక బ్రహ్మ ప్రత్యక్షమై రాజర్షి హోదాను అతనికి ప్రసాదించాడు. తాను ఇంతవరకు కఠోరంగా చేసిన తపస్సుకు ఇదేనా ఫలం అని విశ్వామిత్రుడు నిరుత్సాహుడయ్యాడు. ఎంతో దుఃఖించాడు."

ఈ వ్యక్తుల మధ్య లేదా వీరి పేర్లనే కలిగిన మరొకరి మధ్య వేరొక విషయమై జరిగిన

సంఘర్షణ వమోదై కన్పిస్తోంది.

"ఇక్ష్వాకు వంశంలో పుట్టిన త్రిశంకుడనే రాజుకు బొందితో స్వర్గానికి పోవాలనే కోరిక పుట్టింది. అందుకోసం ఏదైనా యజ్ఞం చేయాలని అనుకొని, వశిష్ఠ మునిని పిలిపించి తన కోరిక తెలిపాడు. వశిష్టుడు అది శక్యం కాదని చెప్పి మందలించాడు. వశిష్టమహర్షి నిరాకరించి నందువల్ల త్రిశంకుడు బయలుదేరి దక్షిణదిక్కుగా ప్రయాణించి తపోదీప్తులతో వెలుగొందుతున్న వశిష్టుని కుమారులు నూర్గురను చూశాడు. అత్యంత వినయ విధేయతలతో వారికి నమస్కారములు చేసి" మా ఇక్ష్వాకు వంశీయులందరికి పురోహితులు మీరే " నేనొక యజ్ఞాన్ని తలపెట్టాను. మీ తండ్రి వశిష్టుడు అది శక్యం కాదన్నారు. మీరు గురుపుత్రులు. నాయజ్ఞాన్ని మీరే చేయించాలి. నన్ను అనుగ్రహించండి. నేను బొందితో స్వర్గానికి పోతే చాలు" అని అన్నాడు. వారి నుంచి కూడా త్రిశంకుడు అదేవిధమైన ప్రతిఘటనను ఎదుర్కొన్నాడు. "మూర్ఖుడా! ఇక్ష్వాకులకు వశిష్ట మహర్షి పురోహితుడు.మీకు ఆయన పరమ గురువు. ఆయన సత్య ప్రతిశ్రవుడు. ముల్లోకాల్లోను యజ్ఞాలు చేయించటానికి ఆయన ఒక్కడే సమర్థుడు. ఆయన 'కాదు' అన్న తరువాత మరొకరిని నీవు ఆశ్రయించడం ఏమిటి? ఆయన మాటలకు నీవు కాదుగదా మేము కూడా అతిక్రమించకూడదు. ఆయన అశక్యం అన్న తరువాత యజ్ఞాన్ని మేము చేయించగలమని ఎలా అనుకున్నావు? మేము ఆయనను అవమానిస్తామా? రాజా! నీకు మతి పోయింది. వెంటనే తిరిగి ఇంటికి వెళ్ళిపో" అని అన్నారు వశిష్టుని కుమారులు. వాళ్ళ మందలింపులకు త్రిశంకుడు–గురువులు నన్ను తిరస్కరించారు. గురుపుత్రులు మీరు కూడా తిరస్కరిస్తున్నారు. ఇక మీ పెద్దరికానికి ఇంతటితో స్వస్తి నేను ఇక మరో పురోహితుణ్ణి చూసుకొంటాను–అని ధిక్కరించాడు. ఇది అవమానంగా తోచింది. వశిష్టుని కుమారులకు ఘోరంగా తోచింది. అందులోను వశిష్ట మహర్షి అంతటివాణ్ణి వదులుకుంటాను అని అనటంతో కోపంతో మండిపడి త్రిశంకును ఛండాలుడవు కమ్మని శపించారు. తెల్లవారేసరికి త్రిశంకువునికి ఛండాల రూపం వచ్చింది.

ఎంతో బాధతో త్రిశంకుడు (దక్షిణ దిశలో నివశిస్తున్న) విశ్వామిత్రుడి దగ్గరకు వెళ్ళాడు. సదాచార సంపన్నుడైన త్రిశంకుని స్థితికి జాలిపడి విశ్వామిత్రుడు "నేను నిన్ను కాపాడుతాను యజ్ఞం చేయిస్తాను. నీ గురువులు నిన్ను ఏ ఛండాల రూపం పొందమని శపించారో ఆ ఛండాల రూపంతోనే నీవు స్వర్గానికి పోయేటట్లు చేస్తాను. శరణం ఇవ్వగల విశ్వామిత్రుడి దగ్గరకు చేరావు కాబట్టి స్వర్గం నీచెంత చిక్కింది అనే అనుకోవచ్చు" అన్నాడు. యజ్ఞ నిర్వహణానికి అవసరమయ్యే సకల సంభారాలను సమకూర్చమని ఆజ్ఞాపించాడు. యజ్ఞానికి విశ్వామిత్రుడు తనకుటుంబ సభ్యులతో పాటు మహర్షులందరినీ ఆహ్వానించాడు. ఋషులను ఆహ్వానించటానికి వెళ్ళిన విశ్వామిత్రుని శిష్యుడు తిరిగి వచ్చి తమగురువుతో ఇలా అన్నాడు. "స్వామీ మీ ఆజ్ఞ ప్రకారం సమస్త దేశాల బ్రాహ్మణులు వచ్చి వున్నారు. మహోదయుడి (వశిష్టుడు)ని అతని నూరుగురు కొడుకులు మాత్రం మేము పిలువగానే కోపంతో మండిపడి 'యజ్ఞం చేసేవాడు ఛండాలుడు. చేయించేవాడు క్షత్రియుడు. ఆ యజ్ఞ హవిస్సును దేవతలు ఎలా భక్షిస్తారు? విశ్వామిత్రుడి మాట విని ఛండాలాన్నం భుజించే బ్రాహ్మణోత్తములు స్వర్గానికి ఎలా వెళ్ళ గలు

గుతారు' అని కళ్ళు ఎర్ర చేస్తూ నిష్టూరోక్తులు ఆడారు" అని చెప్పారు. విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. "వశిష్టుని కుమారులు బూడిదైపోవాలి. హీన కులస్తులుగా ఏడు వందల జన్మలెత్తాలి. మహోదయుడు (వశిష్టుడు) నిషాదుడు (కిరాతకుడు)గా మారాలి" అని శపించాడు. ఈ విధంగా విశ్వామిత్రుడు వాశిష్టులను శపించి తన శాపం అప్పడే ఫలితాన్నిచ్చిందని తెలిసికొని అక్కడ అప్పడు సమావేశమైన మహర్షులతో త్రిశంకుడి వృత్తాంతం చెప్పి దాని కోసం నేను యజ్ఞం చేయదలచానని చెప్పాడు. కోపంలో అగ్నిహోత్రుని వంటివాడు అయిన విశ్వామిత్రునికి ఋషులందరూ భయపడి అతను చెప్పినట్లు చేయటానికి తీర్మానించు కున్నారు. ఆ మహా యజ్ఞానికి విశ్వామిత్రుడు యాజకుడు, మంత్ర కోవిదులు అయిన వారంతా ఋత్విజులు, అందరూ కలసి యజ్ఞాన్ని యథావిధంగా నిర్వహించారు. వారి వారి హవిర్భాగాలను తీసుకొని పోవడానికి విశ్వామిత్రుడు దేవతలనందర్నీ చాలాసేపు ఆహ్వానించాడు.కాని ఒక్కరూ రాలేదు. అప్పడు విశ్వామిత్రుడు కోపావేశంతో స్రవము (హోమంచేసేచెట్టు) చేత్తో పట్టుకొని ఓ త్రిశంకా! ఈ యజ్ఞం నిష్ఫలం అయిపోతే పోనీ! ఇక నా ప్రభావాన్ని చూపిస్తాను. బొందితో పోవడానికి ఎవ్వరికీ వీలుకాని స్వర్గానికి నిన్ను ఇప్పడే పంపిస్తాను అంటూ "నాస్వార్జిత తపస్సుకు ప్రభావం ఉన్నట్లయితే ఈ త్రిశంకు మహారాజు ఇప్పడే స్వర్గానికి వెళ్ళిపోవాలి" అని ప్రతిజ్ఞ చేశాడు. అప్పడు అక్కడ ఉన్న వాళ్ళందరూ చూస్తుండగానే త్రిశంకు మహారాజు స్వర్గానికి వెళ్ళిపోయాడు.

స్వర్గానికి చేరిన త్రిశంకువుతో దేవేంద్రుడు 'త్రిశంకూ! నీవు గురుశాపోపహతుడవు. నీవు ఈ దేవలోకంలో ఉండటానికి వీలులేదు. మళ్ళీ భూమి మీద తల కిందులుగా పడిపో, అని ఆజ్ఞాపించాడు. అపుడు త్రిశంకుడు భూమి మీద తలకిందులుగా పడిపోతూ 'మహా మునీ! రక్షించు, రక్షించు' అంటూ కేకలు పెట్టాడు. ఆ కేకలు విశ్వామిత్రుడు విన్నాడు. అతనికి కోపం కట్టలు తెంచుకుంది. 'నిలు అక్కడే నిలు!' అని అంటూ తన తపోబలంతో ఆ త్రిశంకువును నేలమీద పడకుండా అంతరిక్షంలోనే నిలిపివేశాడు. మహర్షుల మధ్యలో ఉన్న విశ్వామిత్రుడు అప్పడు రెండవ బ్రహ్మ వలె అంతరిక్షంలో త్రిశంకువు ఉన్న దిక్కులో మరో స్వర్గాన్ని సృష్టించటానికి పూనుకున్నాడు. అప్పటికప్పడే దక్షిణ దిక్కున వేరే సప్తర్షులనూ, నక్షత్రాలనూ సృష్టించాడు. ఆయన కోపం అంతటితో ఆగలేదు. మరొక ఇంద్రుణ్ణి సృష్టించడమా లేక ఇంద్రుణ్ణే లేకుండా చేయటమా అని ఆలోచిస్తూ తక్కిన దేవతలను సృష్టించడానికి పూను కొన్నాడు. దాంతో రుషులు, దేవతలు అసురులందరూ భయభ్రాంతులై విశ్వామిత్రుడి దగ్గరకు పరిగెత్తుకు వచ్చారు. అతనికోపాన్ని ఉపశమింప జేస్తూ "ఓ మహానుభావా! తమకు తెలియంది ఏమీలేదు. త్రిశంకు మహారాజు గురుశాప గతుడు. కాబట్టి దేవలోకంలోనికి రాదగిన వాడు కాడు" అని చెప్పారు. ఓ దేవతలారా! నేను ఈ త్రిశంకువును దేహంతో స్వర్గానికి పంపిస్తాను,అని ప్రతిజ్ఞ చేశాను. నా ప్రతిజ్ఞ వ్యర్థంకారాదు. మీరు ఉంటూ ఉన్న స్వర్గంలో ఈ త్రిశంకువు ఉండటానికి మీరు వీలు కాదు అని అంటున్నారు. కనుక ఇపుడు ఈయన ఉన్న ప్రదేశం స్వర్గం కావాలి. నేను సృష్టించిన ఈ నక్షత్రాలు మొదలైనవన్నీ సుస్థిరంగా ఉండాలి. ఇందుకు మీరు ఒప్పకోవాలి అని అన్నాడు. అందుకు దేవతలందరూ అంగీకరించి "మహామునీ మీరు సృష్టించిన నక్షత్రాలు అన్నీ జ్యోతిర్మండలానికి వెలుపల శాశ్వతంగా ప్రకాశిస్తూ ఉంటాయి. త్రిశంకుడు గురు శాపోపహతుడు కనుక వీటి నడుమ తలక్రిందులుగా ఉంటాడు. అయినప్పటికీ దేవ

సమానుడుగా తేజరిల్లుతూ ఉంటాడు. ఈ ఇక్ష్వాకువు కృతార్థుడయి స్వర్గలోకంలో ఉన్నవాడివలె కీర్తితో ప్రకాశిస్తూ ఉంటే ఈ జ్యోతులు అన్నీ ఆయనను అనుసరించుకొని ఉంటాయి" అని చెప్పి విశ్వామిత్రుణ్ణి స్తోత్రించారు. అందుకు విశ్వామిత్రుడు అంగీకరించాడు.[21]

ఆ యజ్ఞం పరిసమాప్తమయి పోయింది. దేవతలూ, మహర్షులూ ఎవరి దోవన వాళ్ళు వెళ్ళి పోయారు. తర్వాత విశ్వామిత్రుడు, ఆ తపోవనంలో ఉన్నవారు అందరితోనూ తాను దక్షిణ దిశకు వచ్చిన తరువాత తన తపస్సుకు గొప్ప విఘ్నమేర్పడిందనీ, ఇంకొక దిక్కుకు పోయి తపస్సు చేసుకోవడం మంచిది అనీ పడమటి దిక్కున విశాలమయిన తపోవనాలున్నాయనీ అక్కడ పుష్కర తీర్థాన సుఖంగా తపస్సు చేసుకోవచ్చుననీ చెప్పి అనుచరులు అందరితోనూ ప్రయాణమయి పడమటి దిక్కుగా సాగిపోయినాడు. ఫలమూలాలను మాత్రమే ఆహారంగా చేసుకొని మహోగ్రంగానూ అనివార్యంగానూ విశ్వామిత్రుడు తిరిగి తపస్సు ప్రారంభించాడు. ఇక్కడ మరలా కథనానికి అడ్డంకి వచ్చింది. మరొక కథ మొదలైంది. అది అంబరీషుడి కథ. అంబరీషుడు అయోధ్య రాజు. రామాయణం ప్రకారం అతను ఇక్ష్వాకునికి ఇరవై ఎనిమిదో తరం వాడు. త్రిశంకుడు ఇరవైరెండో తరంవాడు. త్రిశంకుడికీ, అంబరీషుడికీ ఇద్దరికీ కూడా సమ కాలికుడై విశ్వామిత్రుడు ఎప్పుడూలేనంతగా దేదీప్యమానంగా వెలుగొందాడు. ఆ కథ ప్రకారం- అంబరీషుడు ఒక యజ్ఞం చేయడం ఆరంభించాడు. ఆ యజ్ఞం జరుగుతుండగా దేవేంద్రుడు యజ్ఞపశువును దొంగిలించుకునిపోయాడు. ఆ పశువు కనబడకుండా పోయినందువల్ల పురోహితుడు 'ఓరాజా! నీవు పరాకుగా ఉన్నందువల్ల నీ యజ్ఞ పశువును ఎవరో ఎత్తుకొనిపోయారు. ఈ దోషం నిన్ను నాశనం చేసివేస్తుంది. ఇందుకు ప్రాయశ్చిత్తం చాలా కష్టమయింది. కాబట్టి యజ్ఞకర్మను ఆరంభంచేసేలోపల యజ్ఞ పశువుని కానీ, ఆ పశువు దొరక్కపోయినట్లైతే ఒక నార పశువును కానీ వెంటనే పట్టుకొనిరా' అన్నాడు ఆ రాజర్షి. అంబరీషుడు యజ్ఞ పశువుకోసం ఎంతగా వెతికినా ఫలితంలేకపోయింది. చివరకు అతడు భృగతుంగము అనే పర్వత ప్రదేశంలో భార్యాపుత్రులతో ఉంటున్న భృగు వంశజుడు, బ్రాహ్మణుడైన ఋచీక మహర్షిని చూశాడు. అంబరీషుడు ఋచీకుని అతని ముగ్గురు కుమారుల్లో ఒకరిని యజ్ఞపశువుగా తనకు విక్రయించమని అడిగాడు. ఇందుకు ఒక లక్షగోవులను ఇస్తాను అన్నారు. 'రాజా నీవు ఏమి ఇచ్చినా నా పెద్ద కుమారుణ్ణి అమ్మను' అన్నాడు ఋచీకుడు. అతని భార్య అది విని 'ఓ రాజా! మహాభాగుడు నా పెనిమిటి. పెద్ద పిల్లవాణ్ణి అమ్మను అన్నాడు. కడగొట్టువాణ్ణి అమ్మటానికి నేను ఒప్పకోను. ఎందుకంటే సాధారణంగా తండ్రికి పెద్దపిల్లవాడంటే ఇష్టముంటుంది. తల్లికి కడపటివాడిమీద మోజు ఉంటుంది. అందువల్ల పసివాణ్ణి నేను అట్టిపెట్టుకుంటాను' అంది. తల్లిదండ్రులు చెప్తున్న వానిని వింటూ ఉన్న నడిమి వాడు శునశ్శేపుడు "రాజా! అట్లయితే మధ్యవాణ్ణి నన్ను వారు అమ్మినట్లే ఎంచుకోవచ్చు. కాబట్టి లక్షగోవులను నా తండ్రికి ఇచ్చివేసి తాము నన్ను తీసుకువెళ్ళవచ్చు" అన్నాడు. అందుకు అంబరీషుడు ఎంతో సంతోషించి లక్ష గోవులు, కోటి బంగారు రత్న ఆభరణాలు, ఇంకా అసంఖ్యాకంగా ధనరాశులు ఋచీకుడికి ఇచ్చి తక్షణమే శునశ్శేపునితో తన యజ్ఞానికి బయలుదేరాడు. అలా వెళుతూ వారు పుష్కరతీరం చేరారు. అక్కడ ఇతర ఋషులతో కలిపి తపస్సు చేస్తున్న విశ్వామిత్రుణ్ణి చూసి శునశ్శేపుడు అతనిని

శరణుజొచ్చాడు. తన నిస్సహాయ స్థితిని తెలిపి రక్షించమని కోరాడు. విశ్వామిత్రుడు అతన్ని ఆదరంగా ఓదార్చి అతనిని బదులుగా తన కుమారుల్లో ఒకరిని బలిపశువుగా పోవలసిందని ఆదేశించాడు. అందుకు మధుష్యంధుడు మొదలైన ఆ రాజర్షి కుమారులు నిరాకరించి సాభిమానంగానూ, పరిహాసంగానూ 'ప్రభూ! తమ స్వంత బిడ్డలను వదలిపెట్టి పరాయి పిల్లవాణ్ణి కాపాడటానికి ప్రయత్నించడం– మధురమైన ఆహారాన్ని వదిలి స్వీయ మాంసాన్ని ఆహారంగా పొందడానికి తాపత్రయపడడంలాగా అనిపిస్తోంది. ఇది మాకు అధర్మంగా తోస్తోంది' అన్నారు.

కొడుకులు అన్న మాటలకు విశ్వామిత్రునికి కోపం వచ్చింది. కళ్ళు ఎర్రజేసి 'తండ్రికి ఎదురు చెప్పకూడదు అనే భయం లేకపోవడమేకాకుండా ధర్మరహితంగానూ, దయాహీనంగానూ మాట్లాడారు. మీరు కూడా వాశిష్టుల వలె ముష్టికులు అయిపోయి కుక్కమాంసం తింటూ ఈ భూమిమీద వేల ఏళ్ళు జీవించండి' అని శపించాడు. అప్పుడు విశ్వామిత్రుడు శునశ్శేపుణ్ణి ఉద్దేశించి 'ఓ శునశ్శేపా! నిన్ను పవిత్ర రజ్జువుతో కట్టివేసి రక్తమాల్యాను లేపనాలతో అలంకరించి క్రతువులో యూపస్తంభానికి కట్టివేసినపుడు అగ్నిని ఉద్దేశించి ఈ గాథలను పఠించు. నీ కోరిక నెరవేరుతుంది' అని చెప్పి ఆ రెండు దివ్యమంత్రాలు (గాథలు) శునశ్శేపుడికి ఉపదేశించాడు. తరువాత శునశ్శేపుడు అంబరీషునితో గమ్యం చేరుకున్నాడు. శునశ్శేపునికి ఒంటినిండా గంధం పూశారు. రక్తమాల్యాంబరాలతో అలంకరించారు. అచల నిష్ఠతో శునశ్శేపుడు విశ్వామిత్రుడు ఉపదేశించిన రెండు మంత్రాలూ జపించడం మొదలుపెట్టాడు. ఇంద్రోపేంద్రులు ఆ సూక్తులతో సంతృప్తులయ్యారు. సహస్రాక్షుడు (ఇంద్రుడు) శునశ్శేపుడికి దీర్ఘాయువుని ప్రసాదించాడు. అంబరీషుడు కూడా యజ్ఞఫలంగా ఎంతో ఫలితాన్ని పొందాడు. పుష్కర తీరంలోనే ఈలోపు విశ్వామిత్రుడు వేల సంవత్సరములు తపసు చేశాడు. తపోవ్రతం అయిపోతున్న సమయంలో బ్రహ్మదేవుడు దేవతలను వెంటబెట్టుకుని వచ్చి విశ్వామిత్రుణ్ణి చూచి 'నీకు శుభం కలుగుతుంది. ఇంతవరకూ నీవుచేసిన శుభకర్మలకు నిన్ను ఒక ఋషిగా పరిగణిస్తున్నాను' అంటూ పరివారంతో అంతర్ధానమయ్యాడు. విశ్వామిత్రుడు అసంతృప్తుడయ్యాడు. మళ్ళీ తపస్సు చేయడం ప్రారంభించాడు. ఎంతోకాలం అలా గడిచిపోయింది. ఒకనాడు ఆ పుష్కర తీర్థంలో మేనక అనే అప్సరస జలకమాడడానికి వచ్చింది. మేఘంలో మెరుపు మాదిరిగా ఆమె విశ్వామిత్రుడు కన్నులలో మెరిసింది. ముగ్ధుడైన విశ్వామిత్రుడు ఆమె అప్రతిమాన సౌందర్యానికి పరవశుడయిపోయాడు. ఆమెను తన సహచరిణిగా ఉండడానికి తన ఆశ్రమానికి ఆహ్వానించాడు. ఇట్టే పది సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ పది సంవత్సరాలు విశ్వామిత్రుడు తపస్సు వదిలిపెట్టి ఆమె సౌందర్యానికి దాస్యం చేశాడు. విశ్వామిత్రుడికి సిగ్గువేసింది. ఆలోచించ సాగాడు. అది అంతా దేవతలు తన తపస్సు చెడగొట్టడానికి పన్నిన పన్నాగం అని తెలుసుకున్నాడు. మోహానికి లొంగిపోయినందువల్ల పది సంవత్సరాలూ ఒక అహోరాత్రంగా గడిచిపోయాయి కదా అని విచారించాడు. నా కామాతురత వలన అంతటి విఘ్నం జరిగిపోయిందే అని పశ్చాత్తాపపడ్డాడు. దుఃఖంతో కుమిలిపోతూ నిట్టూర్పులు విడస్తూ మేనకవంక చూచాడు. మేనక భయంతో గడగడ వణికిపోయింది. విశ్వామిత్రుడు ఆమెకు తియ్యటి మాటలు చెప్పి ఇక అక్కడ ఉండకుండా ఉత్తర దిక్కుగా బయలుదేరి సాగిపోయాడు. ఆవిధంగా మేనకను వదిలించుకొని విశ్వామిత్రుడు హిమవత్పర్వత పార్శ్వములో కౌశికీనదీ తీరానికి వెళ్ళాడు. ఇంద్రియాలను

జయించాలనే దృఢసంకల్పంతో దారుణమైన తపస్సు ప్రారంభించాడు. వేల సంవత్సరాలు గడిచి పోయాయి. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. అతనితో ఇలా అన్నాడు 'నీ తపస్సుకు మెచ్చుకున్నాను. ఇక ఇంతటి నుంచీ నిన్ను మహర్షిగా భావిస్తాను' అన్నాడు. విశ్వామిత్రుడు అననత వదనుడై నమస్కరించి 'స్వామీ! నేను మహర్షిని అయినాను అని తాము అంటున్నారు. అయితే నేను జితేంద్రియుణ్ని అయినట్లు తాము అంగీకరిస్తారా?' అని బ్రహ్మ దేవుణ్ని ప్రశ్నించాడు. "నీవు జితేంద్రియుడవు కాలేదు. ఇంకా సాధనచేయాలి" అంటూ బ్రహ్మదేవుడు దేవతలందరితో కలిసి అంతర్ధానమయ్యాడు. విశ్వామిత్రుడు అంతట మళ్ళీ తపస్సు చేయటం ఆరంభించాడు. ఈసారి అతడు రెండు చేతులూ పైకిఎత్తి ఏ ఊతం లేకుండా నిలుచుని వాయుభక్షణ చేస్తూ వేసవి ఎండలో నాలుగుదిక్కులా అగ్నిహోత్రాలుంచుకుని, వానాకాలంలో అనాచ్ఛాదిత ప్రదేశంలో ఉండీ, చలికాలంలో జలమధ్యంలో వుండీ మహాతీవ్రంగా తపస్సు చేయసాగాడు. చాలాకాలం అలా జరిగిపోయింది. విశ్వామిత్రుడి ఈ మహోగ్ర తపస్సుకీ, అతడు సాధిస్తున్న శక్తి సామర్థ్యాలకూ దేవతలు, దేవేంద్రుడు కలవరపడిపోయారు. వారు సరాసరి రంభను రావించారు. దేవేంద్రుడు రంభతో 'నీ సౌందర్యంతో విశ్వామిత్రుణ్ని వ్యామోహంలో ముంచు. అతడు నీ వలలో తగుల్కొనేటట్లు చేయి. నీ అధీనుణ్ని చేసుకో' అని అన్నాడు. రంభ 'విశ్వామిత్రుడు మహా కోపిష్ఠి. నేను ఏమీ చేయకపోయినా ఘోరంగా శపిస్తాడు. నాకు భయం వేస్తుంది. నన్ను అనుగ్రహించండి' అని గజగజా వణికిపోతూ ప్రాధేయపడింది. కానీ ఇంద్రుడు 'ఓ రంభా! భయపడవద్దు. నీకు మేలు జరుగుతుంది. నేను చెప్పినట్లు చేయి. నేనూ, మన్మథుడు నీవెంట వస్తాము. నీవు చక్కగా సింగారించుకొని నీ శృంగార చేష్టలతో విశ్వామిత్రుడి తపస్సు చెడగొట్టవచ్చు. నీవు ఈ పని ఇట్టే సాధించగలవు' అని అనేక పర్యాయాలుచెప్పి రంభను సమా ధాన పరిచాడు. రంభ విశ్వామిత్రుణ్ని మరులు కొలపడానికి జగన్మోహినిగా అలంకరించుకొని చిరుదరహాసంతో బయలుదేరింది.

విశ్వామిత్రుడు రంభను చూడానే క్రోధ పరవశుడయిపోయి "ఓసి దౌర్భాగ్యురాలా! నేను క్రోధాధులు జయించవలెననుకుంటున్న నన్ను మరులుకొల్పడానికి వచ్చావా! నీవు శిలవు అయిపో! వేయి సంవత్సరాలు శిలవయి పడివుండు" అని శపించాడు. విశ్వామిత్రుడి శాప వాక్కులు చెవుల పడగానే దేవేంద్రుడు, మన్మథుడు అక్కడనుండి పారిపోయారు. రంభ అప్పటిక ప్పుడే రాయి అయిపోయింది. కామాన్ని జయించినా, క్రోధాన్ని జయించలేనందుకు విశ్వామిత్రుడు ఎంతో విచారించాడు. ఆలోపం వల్ల తపోబలం కొంత తగ్గిపోతూ ఉంది అని గమనించాడు. అరిషడ్వర్గాన్ని జయించలేకపోయినందుకు వ్యధ చెందాడు. ఎవరు ఏమిచేసినా కోపపడకూడదు అనీ, ఎవరు ఏమి మాట్లాడినా మెదలకుండా ఊరుకోవాలి అనీ మనసులో నిశ్చయించుకున్నాడు. అంతేకాదు జితేంద్రియుడు అయ్యేటంతవరకున్నూ దేహాన్ని ఎండకట్టాలి అనీ, తపస్సుకు ప్రభావం ఉంటే దేహము క్షయమయిపోదనీ, బ్రహ్మర్షి అయ్యేటంత వరకున్నూ అన్నం తినకుండా, నీళ్ళు తాగకుండా, చివరకు ఊపిరి అయినా విడువకుండా తపస్సు చేయాలి అని సంకల్పిం చుకున్నాడు. ఇక ఆ హిమవత్పర్వత ప్రాంతాన్ని వదిలి తూర్పు దిక్కుగా బయలుదేరివెళ్ళాడు. అక్కడ నిరుపమానమైన మౌన వ్రతాన్ని అవలంబించాడు. అప్రతిమానము, పరమ దుష్కరము, మహోగ్రము అయిన తపస్సు చేయడం ప్రారంభించాడు. తపస్వీకుల చరిత్రలోనే అరుదైన

తపస్సు అది. కోపాన్ని దరిచేరనీయకుండా ఎన్ని విఘ్నాలు వచ్చినా ఏమాత్రం చలించకుండా మానుమాదిరిగా పాతుకొనిపోయాడు. ఈవిధంగా నియమబద్ధుడయి ఏ అంతరాయానికీ లొంగ కుండా బహుకాలం తపస్సు చేశాడు. సంపూర్ణత్వాన్ని సాధించాడు. కోపాన్ని జయించాడు. అతని తపోవ్రతం పూర్తి అయింది! ఆ సమయంలో ఒకరోజు విశ్వామిత్రుడు భోజనం చేయబోతుం డగా దేవేంద్రుడు బ్రాహ్మణవేషంతో వచ్చి అన్నం పెట్టమని యాచించాడు. కిక్కురుమనకుండా నిస్సంకోచంగా ఆ బ్రాహ్మణుడికి సిద్ధాన్నం పెట్టాడు విశ్వామిత్రుడు. ఆ బ్రాహ్మణుడు ఆ అన్నం ఏ కొంచెం కూడా మిగల్చకుండా అంతా తినివేశాడు. విశ్వామిత్రుడు తాను పెట్టుకున్న ఒట్టువల్ల ఈషణ్మాత్రం కూడా చలించలేదు. విశ్వామిత్రుడు మళ్ళీ ఊపిరి బిగబట్టి మహోగ్రంగా తపస్సు చేయటం ప్రారంభించాడు. చాలాకాలం గతించింది. అయినా తపస్సు చాలించలేదు. అప్పుడు అతని శిరస్సులోంచి పొగలూ, మంటలూ బయలుదేరాయి. అవి ముల్లోకాల్లో వ్యాపిం చాయి. జగత్తంతా దగ్ధమయిపోయేటట్లు తోచింది. ఆయన తపోగ్నికి దేవ, దానవ, యక్ష, రాక్షస, గరుడ, గంధర్వులు అందరూ విశ్లేష్టులయిపోయారు. దేవతలందరూ బ్రహ్మదేవుడితో "ఓ దేవా! మేము విశ్వామిత్రుణ్ణి అనేక విధాల ప్రలోభపెట్టాము. కోపం తెప్పించడానికి ఎన్నో ప్రయత్నాలుచేశాము. ఇంకా ఏమేమో చేశాము. ఏమి చేసినప్పటికీ ఆయన తపస్సు తరిగిపోలేదు. పైగా వృద్ధిపొందింది. ఇప్పుడు ఆయనలో ఏ దోషమూ కన్పించటంలేదు. అందువల్ల ఆయన మనసారా కోరుతున్న కోరికను తాము చెల్లించి తీరాలి. అలా చేయకపోతే విశ్వామిత్రుడి తపోగ్నికి ముల్లోకాలు భస్మీపటలం అయిపోతాయి. ఇప్పటికే దిక్కులన్నీ కలవరపడిపోయాయి. సముద్రాలన్నీ అల్లకల్లోలం అయ్యాయి. పర్వతాలు అన్నీ కదలిపోతున్నాయి. భూమి అంతా వణికి పోతుంది. గాలి ఎడాపెడా కొడుతూ ఉంది. సూర్యరశ్మి మందగించింది. జనులు కర్మశూ న్యులు అయిపోయారు. ఏంచేయాలో ఎవరికీ తోచటంలేదు. అందరికీ మౌఢ్యం వచ్చినట్లుగా ఉంది. ఓ దేవా! విశ్వామిత్రుడు అమిత తేజోవంతుడు. ఇప్పుడు అగ్నిహోత్రుడులా ఉన్నాడు. ఈ లోకాలను నాశనం చేయాలి అనే బుద్ధి ఆయనకు ఇంకా పుట్టలేదు. తాము ఉపేక్షించేట్లయితే ఆయన ప్రళయ కాలాగ్నితో ముల్లోకాలనూ దహించివేస్తాడు. దేవరాజ్యం ఏలవలెను అని కూడా అనుకుంటాడు. అందువల్ల తాము ఇప్పుడు ఆయన కోరికను చెల్లించటమే తరుణో పాయం" అన్నారు. అంతట బ్రహ్మదేవుడు దేవతలు అందరితోనూ కలిసి విశ్వామిత్రుని దగ్గరకు పోయి "ఓ బ్రహ్మర్షి" అని మనసారా సంబోధించి 'నీకు స్వాగతం' నీ తపస్సుకు మేము అందరము సంతోషించాము. నీవు ఇప్పుడు బ్రాహ్మణుడవు అయ్యావు. "ఓ బ్రహ్మర్షీ! నీకు నేనూ మరుద్గణాలు దీర్ఘాయుష్షు ఇస్తున్నాం. ఇక నీవు స్వస్థచిత్తుడవు కా! సుఖంగా ఉండు" అన్నాడు. విశ్వామిత్రుడు సంతోషంతో బ్రహ్మదేవుడికీ, మిగతా దేవతలకూ నమస్కారం చేసి "ఓ దేవా! నాకు బ్రహ్మణత్వమూ, దీర్ఘాయుర్దాయమూ అనుగ్రహించినందుకు కృతజ్ఞుడను. అయితే ఓంకారమూ, వషట్కారమూ, వేదాలూ నా స్వాధీనం కావడమే కాకుండా నేను వాటిని ఇతరులకు ఉపదేశం చేసే అధికారము నాకు దయచేయండి. ఓ దేవా! ఇంతకన్నా ముఖ్యం అయిన కోరిక మరి ఒకటి వుంది. వశిష్ఠ మహర్షి క్షత్రవేదవిధులలోనూ, బ్రహ్మవేద విధులలోనూ మహామహుడు. ఆయన నన్ను 'బ్రహ్మర్షి' అనాలి ఇదే నా ప్రధానమయిన కోరిక. తాము ఈ కోరికను నెరవేర్చకపోతే నేను తృప్తిపడను" అన్నాడు. అంతట దేవతలు అందరూ పోయి వశిష్ఠ మహర్షిని తీసుకొని వచ్చారు. ఆయన విశ్వామిత్రుడితో సఖ్యపడి "బ్రహ్మదేవుడూ, దేవతలూ

చెప్పినట్లు నీవు బ్రహ్మర్షివి. బ్రహ్మర్షికి ఉండే అధికారాలు అన్నీ నీకూ ఉంటాయి" అని చెప్పాడు. బ్రహ్మదేవుడూ, దేవతలూ వెళ్ళిపోయారు. విశ్వామిత్రుడు వశిష్ఠ మహర్షిని పూజించి, సత్కరించి వీడ్కోలు చెప్పి పంపాడు.

క్షత్రియులు బ్రాహ్మణుని వధించిన వృత్తాంతానికి సంబంధించినది రెండో సంఘటన. మహాభారతం ఆదిపర్వంలో ఈ వృత్తాంతం ఈ క్రిందివిధంగా వుంది.

"పూర్వం కృతవీర్యుడనే రాజు ఉండేవాడు. వేదవిదులైన భృగువంశీయులు అతని పురోహితులు. రాజు వీరికి ఉదారంగా గో, ధన సంపదలను ఇచ్చాడు. ఆ రాజు స్వర్గస్థుడైన తరువాత అతని వంశజులకు ధనం కావలసి వచ్చింది. భృగువుల సంపన్నత వారు ఎరిగినదే కనుక వెళ్ళి వారిని ధనం అడిగారు రాజులకు భయపడి కొందరు భృగువులు తమ ధనాన్ని భూమిలో పాతిపెట్టారు. కొందరు బ్రాహ్మణులకు పంచి ఇచ్చారు. కొందరు ఆ రాజులకు అడగగానే ధనం ఇచ్చివేశారు. అయితే ఒక క్షత్రియుడు భూమి తవ్వుతుండగా ఒకానొక భృగుని ఇంట్లో ధనం పాతర కనబడింది. తమకు అడిగినప్పుడు ఇవ్వకుండా ధనం దాచిపెట్టారని రాజులకు ఆగ్రహం వచ్చి భృగువులనందరినీ– గర్భస్థ శిశువులతో సహా సంహరించారు. పతులను కోల్పోయిన స్త్రీలు హిమవత్పర్వత సీమకు పారిపోయారు. వారిలో ఒక స్త్రీ తన గర్భస్థ శిశువును తన తొడలో దాచి సంరక్షించినది. ఈ విషయం తెలుసుకున్న క్షత్రియులు వెంటాడి ఆ శిశువును సంహరించే ప్రయత్నం చేశారు. ఆ శిశువు కాంతివిరజిమ్మి ఆ క్షత్రియులను అంధులను చేసింది. కొంతకాలం పాటు అంధులై ఆ పర్వత సీమలో దిక్కుమొక్కులేకుండా సంచరించి, వారు ఆ తల్లి శిశువు వద్దకు వెళ్ళి శరణు వేడుకొని తమకు తిరిగి చూపు ప్రసాదించమని ప్రార్థించారు. వేదవేదాంగాలను తనలో నిక్షిప్తం చేసుకొని తమకు ఆ శక్తితో వారిని అంధులు గావించిన తన బిడ్డ ఔర్వునికే ఆ సామర్థ్యం వున్నదని ఆ తల్లి చెప్పింది. వారు ఔర్వునే ప్రార్థించి చూపు పొందారు. అయితే ఔర్వుడు తన బంధువర్గాన్ని సంహరించిన క్షత్రియులపై ప్రతీకారం తీర్చుకోవడానికి సంకల్పించి తపశ్చర్యకు పూనుకున్నాడు. ఆ తపస్సుకు దేవతలు, రాక్షసులు, మునులు అంతా భీతచిత్తులైనారు. అప్పుడు అతనికి అతని పితృదేవతలు ప్రత్యక్షమై తమకు క్షత్రియులపై కక్ష తీర్చుకునే కోరిక లేదని, తమ దౌర్బల్యం చేతకాక వృద్ధాప్యంలో క్షత్రియుల చేత మరణం పొందాలని తాము కోరుకోవడంచేతనే అట్లా జరిగిందని స్పష్టం చేశారు. క్షత్రియులకు కోపం తెప్పించడం కోసమే అట్లా నిధులు దాచిపెట్టామని వారు నచ్చజెప్పారు. ఆత్మహత్య మహాపాతకం గనుక తాము చావు నిమిత్తం క్షత్రియులను ప్రేరేపించామని వారు వివరించారు. అందుచేత కోపం నిగ్రహించుకోమని వారు ఔర్వుని కోరారు. "క్షత్రియులనుగాని, ఏడు లోకాలనుగాని నాశనం చేసే ప్రయత్నం మానుకో. నీ తపశ్చర్యను వమ్ముగావించే ప్రయత్నాన్ని నిగ్రహించుకోమని వారు చెప్పారు. కాని ఔర్వుడు 'ఏమీ లేకుండా తన కోపాన్ని మరల్చుకోలేనని చెప్పాడు. ఏదో ఒకచోటికి ఆ కోపం ప్రసరించకపోతే అది తన్నే నాశనంచేస్తుందని అంటూ తమ పూర్వీకులు పెట్టమన్న క్షమాభిక్ష న్యాయవిరుద్ధము, అకర్తవ్యము' అని వాదించాడు. ఎట్లాగైతేనేం పితరులు అతనికి నచ్చజెప్పి అతని కోపాన్ని సముద్రంలోకి విసరివేయమని సూచించారు. అక్కడ అది జలాన్ని సంఘర్షిస్తూ ఉంటుందని, ఆవిధంగా అతని కోరిక నెరవేరగలదని వారు చెప్పారు.

ఆ కోపాగ్ని వేదవిదులు ఎరిగిన హయ శిరస్సు. నిత్యమూ అది జలాన్ని త్రాగివేస్తూ ఉంటుంది"

మూడవ వృత్తాంతం బ్రాహ్మణులచేత క్షత్రియులు వధింపబడిన సంఘటనకు సంబంధించినది. మహాభారతంలో ఈ కథ అనేక స్థలాలలో కనిపిస్తుంది.

"వేయి బాహువులు కలిగి దేదీప్యమానంగా వెలుగొందే బలవంతుడైన కృతవీర్యుడు మహిష్మతీ నగరంలో నివసిస్తూ ప్రపంచ మంతటికీ ప్రభువై పరిపాలిస్తున్నాడు. అవక్ర పరాక్రమ శాలియైన ఈ హైహయుడు ఖండాలు సముద్రాలతో కూడిన చోట సముద్ర పరివేష్టితమైన భూమి నంతటినీ తిరుగు లేకుండా పాలిస్తున్నాడు. మహర్షి దత్తాత్రేయుని ద్వారా అతడు అనేక వరాలు పొందాడు. తన వేయి బాహువులతో భూమి మొత్తాన్ని జయించటానికి యుద్ధాలు చేశాడు. ఆరాజ్య గర్వంతో, మదంతో, నీతి, న్యాయ, ధర్మ మార్గాలను విసర్జించాడు. మహాత్ముల ప్రవచనాల్ని తిరస్కరించాడు" అప్పుడు దేదీప్యమానంగా వెలుగొందుతున్న సూర్యునిలా దివ్య రథాన్ని అధిరోహించి బలగర్వంతో అర్జునుడు ఇలా అన్నాడు. శౌర్యంలోనూ, వీర్యంలోనూ ధైర్యసాహసాల్లోనూ, శక్తి సామర్థ్యాల్లోనూ నన్ను మించిన వారెవ్వరున్నారు.... ఇలా అర్జునుని ప్రసంగం కొనసాగుతుండగా ఆకాశం నుండి ఆకాశవాణి "ఓ మూర్ఖుడా! క్షత్రియుల కంటే బ్రాహ్మణులు ఎప్పుడూ అధికులే, బ్రాహ్మణుల సహాయం లేకుండానే క్షత్రియులు రాజ్యాన్నేలుతున్నారా!" దానికి అర్జునుడు "నేను అనుగ్రహిస్తే భూలోక కోటిని సృష్టించగలను. ఆగ్రహిస్తే వాటిని సంహరించగలను. బ్రాహ్మణులు క్షత్రియులను ఆశ్రయిస్తూ జీవిస్తున్నారు. కానీ క్షత్రియులు బ్రాహ్మణులను ఆశ్రయిస్తూ జీవిస్తున్నారా? అలా బ్రతకటం లేదు. కాబట్టి బ్రాహ్మణుడు నాకంటే అధికుడు కాదు. బ్రాహ్మణులందర్నీ నాశనం చేయాలనుకుంటున్నాను. వేదాలను సాకుగా చూపి క్షత్రియులను బ్రాహ్మణులు కాల్చుకు తింటున్నారు. ప్రజలను రక్షించాల్సిన బాధ్యత రాజులది. కానీ బ్రాహ్మణులది కాదు కదా! క్షత్రయులు లేనపుడు బ్రాహ్మణులకు జీవాధారమే లేనపుడు వాళ్ళు గొప్పవాళ్ళు ఎలా అవుతారు. ఈముల్లోకాల్లో మనిషిగానీ దేవుడుగానీ నన్నెదరించలేడు. నా రాజ్యాధికారాన్ని ప్రశ్నించేవాడు లేడు. అందుకే బ్రాహ్మణులందరి కంటే నేనే గొప్పవాణ్ణి అంటూ దుయ్యబట్టసాగాడు. ఆవేశంతో ఉబికి వచ్చే అర్జునుని మాటల్ని విన్న వాయువు వచ్చి యిలా అన్నాడు. రాజా! ఇలాంటి పాపపు ఆలోచనల్ని మానివేయి. బ్రాహ్మణులను పూజించు. వాళ్ళపట్ల తప్పలు చేసిన వాళ్ళు రాజ్యాన్ని కోల్పోతారు. వాళ్ళెంతో శక్తివంతులు. వాళ్ళు నిన్ను జయిస్తారు. దేశం నుంచి భ్రష్టులను చేయగలరని అనగా ఇంతకీ నీవెవరివని అర్జునుడడిగాడు. నేను దేవతను. . . నాపేరు వాయువు. నీ క్షేమం కోరి వచ్చాను, అని చెప్పాడు. అర్జునునకు కోపం ముంచుకొచ్చింది. మళ్ళీ బ్రాహ్మణులను నిందించటం మొదలు పెట్టాడు. బ్రాహ్మణుల పట్ల నీ విశ్వాసానికి నా జోహార్లు, బ్రాహ్మణులు కూడా అన్ని జీవరాసుల్లాగానే జన్మించలేదా? వాళ్ళ గొప్పతనం ఏమిటో చెప్ప వాళ్ళేమైనా నిప్ప నీరు, గాలి, సూర్యుడు, ఆకాశం లాంటి అతీత శక్తులా" అంటూ ఆగ్రహంతో పలికాడు.

బ్రాహ్మణ ఋషి అయిన జమదగ్ని కుమారుడు పరశురామునితో ఈ రాజు సంఘర్షిం

చాడు. ఈ సంఘర్షణ వృత్తాంతం ఈ క్రింది విధంగా కన్పిస్తోంది.

"ఆ కాలంలో కన్యాకుబ్జాన్ని పరిపాలిస్తున్న గాధికి సత్యవతి అనే కుమార్తె ఉన్నది. ఆమెను బుచికుడనే బుషి పెండ్లాడటం వారికి జమదగ్ని పుట్టడం అదంతా కూడా పైన చెప్పిన విధంగా సమానంగానే ఉన్నది. రేణుక, జమదగ్నులకు ఐదుగురు కుమారులు. వారిలో చిన్నవాడైన పరశురాముడు జగత్ప్రసిద్ధుడు. తండ్రి ఆదేశాన్ని అనుసరించి అతడు అపవిత్ర వాంఛ వలన పాతివ్రత్య మహిమ కోల్పోయిన తల్లిని సంహరించాడు. అంతకు ముందు అతని అన్నలు తండ్రి ఆనతిని కాదని బుద్ధిహీనులుగా శప్తులైనారు. పరశురాముని అభ్యర్థనపై అతని తండ్రి తల్లిని పునర్జీవితురాలిని చేశాడు. అతని అన్నలను తిరిగి యథా ప్రకారంగా మార్చాడు. పరశురామునికి మాతృహత్యా పాతకం అంటకుండాను అవక్ర పరాక్రమంతో దీర్ఘకాలం జీవించేటట్లుగాను తండ్రి వరమిచ్చాడు. ఈ ఘట్టం నుంచి పరశురాముని కథ అర్జునునితో (కార్తవీర్యుని) ముడి పడుతుంది. ఓసారి అర్జునుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చి జమదగ్ని పత్నిచేత అతిథి సత్కారం పొందాడు. అయితే అతడు జమదగ్ని హోమధేనువు దూడను బలత్కారంగా గ్రహించి ఆశ్రమ వృక్షాలను నరికివేసి అపాత్రను నిరూపించు కొన్నాడు. ఈ సంగతి తెలిసి పరశురాముడు అగ్రహోదగ్రుడై అర్జునుని వేయి హస్తములను నరికి సంహరించాడు. అర్జునుని కుమారుడు ప్రతీకారంగా పరశురాముడు దగ్గర లేనపుడు జమదగ్నిని సంహరించాడు.

ఆశ్రమానికి తిరిగి వచ్చిన పరశురాముడు తండ్రి అంత్యక్రియలు ముగించి, భూమిపై క్షత్రియ జాతి అనేది లేకుండా నాశనం చేస్తానని ప్రతిజ్ఞ పూనాడు. దానికనుగుణంగానే తన ఆయుధాలతో అర్జునుని కుమారులను, మనుమలను, అందరినీ సంహరించాడు. ఆ విధంగా ఇరవై ఒక్క పర్యాయాలు దండెత్తి భూమిపైన క్షత్రియుడనే వాడు లేకుండా చేసి వారి రక్తంతో శమంత పంచకమనే ఐదు రక్తపుటేర్లను నిర్మించాడు. ఆ విధంగా పరశురాముడు భృగు వంశజులైన పితృ దేవతలను సంతృప్తిపరచగా అతని మాతా మహులైన రిచకుడు ప్రత్యక్షమై తనంత తాను పరశురాముణ్ణి సంభోదించి చెప్పాడు. ఈ పరశురాముడు ఒక గొప్ప యాగం చేసి ఇంద్రుణ్ణి సంతృప్తి పరచటమే కాకుండా రాజ్యాన్నంతటినీ యజ్ఞ నిర్వాహకులైన పురోహితులకు దానం చేశాడు. ఆ బలవంతుడైన కౌశ్యపుడనే పదిచారల పొడవు, తొమ్మిది బారల ఎత్తు కలిగిన ఒక దైవ పీఠాన్ని కూడా అతడు ఇచ్చి వేశాడు. అతని అనుమతితో దీన్ని బ్రాహ్మణులు తమలో తాము పంచుకొన్నారు. ఖాండవ వనాలు అనేపేరు అప్పటినుంచే పుట్టింది. కాశ్యపుడికి భూమి అంతటినీ దానం చేసిన తర్వాత పరశురాముడు మహేంద్రగిరికి వెళ్ళి పోయాడు. పరశురాముడికి క్షత్రియులకు మధ్య ఏర్పడిన వైరం పరశురాముడు తన బలపరాక్రమాలతో భూమి నంతటినీ జయించేటట్లుచేసింది".

వేర్వేరు ప్రాంతాలను పరిపాలిస్తున్న– కాశ్మీరీయులు, దరదులు, కుంతీయులు, క్షుద్రకులు, మాళవులు, అంగులు, వంగులు, కళింగులు, వైదేహులలో తామ్రలిప్తులు, మార్తికవతులు, శివులు–ఇంకా ఇతర రాజన్యులు అయిన క్షత్రియులు పరశురామునిచే హతులైనట్లు మహాభా

రతాంతర్గత ద్రోణ పర్వం పేర్కొన్నది.

బ్రాహ్మణుల చేత క్షత్రియ వంశ నిర్మూలనం జరిగిన తరువాత, తిరిగి క్షత్రియ జాతి ఎలా పునరుద్ధరించబడినది ఈ కథలో భాగంగానే వివరించటం జరిగింది. దాని ప్రకారం—

"ఇరవై ఒక్కసార్లు క్షత్రియుల్ని భూమి మీద తుడిచి పెట్టిన తరువాత జమదగ్ని కుమారుడైన పరశురాముడు కులపర్వతమైన మహేంద్రగిరి మీద తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు. పరశురామునిచే చంపబడిన క్షత్రియ రాజుల వితంతువులైన భార్యలు బ్రాహ్మణులను ఆశ్రయించి సంతానం కోసం ప్రార్థించారు. కుల పురోహితులు, నిష్కాముకులై (వారి కోర్కె తీర్చటానికి మాత్రమే) ఋతు సమయాల్లో ఆక్షత్రియ స్త్రీలతో కలిశారు. వారు గర్భవతులయ్యారు. ధైర్య సాహసోపేతులైన క్షత్రియ బాలురు, బాలికలు పుట్టారు. ఈ విధంగా క్షత్రియ స్త్రీల కారణంగా తిరిగి అభివృద్ధి చెందింది. అప్పటి నుంచి బ్రాహ్మణేతర కులాలు నాలుగు బ్రాహ్మణుల కన్నాతక్కువ స్థానాన్ని పొందాయి."

హిందూదేశంలో తప్ప మరే దేశంలోను యింతటి భయంకరమైన వర్గ యుద్ధాలు జరిగిన దాఖలాలు లేవు. ఇరవై ఒక్కసార్లు క్షత్రియులను చంపి క్షత్రియ వితంతువులకు బ్రాహ్మణుల ద్వారానే తిరిగి సంతానం కల్పించి, ఆ విధంగా భారతదేశంలో క్షత్రియ కులాన్ని పునః సృష్టించినట్లు చెప్పిన యీ కథంతా బ్రాహ్మణుడైన పరశురాముని గర్వాన్ని కీర్తించే ప్రయత్నమే.

ఈ వర్గ పోరాటం కేవలం ప్రాచీన చరిత్రకు సంబంధించిన విషయం మాత్రమే కాదు. ఇది అప్పటి నుంచీ యిప్పటి దాకా కొనసాగుతూ వస్తున్నదే. మహారాష్ట్రలో మరాఠీ రాజు పరిపాలనా కాలంలో దీని ఉనికిని ఎంతో చక్కగా గుర్తించవచ్చు. మరాఠీ సామ్రాజ్యాన్ని అది (వర్గపోరాటం) నాశనం చేసింది. అప్పుడప్పుడే పుట్టి వెంటనే అంతరించిపోతూ, తాత్కాలిక ప్రభావాన్ని చూపించే, భిన్న జాతుల ప్రజల మధ్య శాశ్వత అఘాతాన్ని ఏర్పరచలేనటువంటి సామాన్య యుద్ధం వంటిది కానేకావు ఈ వర్గపోరాటాలు. భారతదేశంలో సంభవించిన ఈ వర్గ పోరాటాలు ఒక ప్రత్యేక లక్షణాన్ని కలిగినటువంటివి. ఇవి మెల్లమెల్లగా చాపక్రింద నీరులా తమ పని తాము కొనసాగించాయి. జీవితంలో చిన్న మొలకలాంటివయిన యివి, హిందువులకు బుద్ధి కుశలతగా రూపొందాయి.

అవి ఆరోగ్యాన్నీ, నడవడినీ సూచన ప్రాయంగా తెలియజేసేవి అనే అర్థంలో ఈ వాస్తవాలను నిరాకరించలేము. ఇవి హిందువుల మధ్య సౌభ్రాతృత్వం వుందని సూచిస్తున్నాయా? ఈ వాస్తవాల వెలుగులో నిర్ధారకమైన సమాధానాన్ని ఇవ్వటం అసాధ్యమని నేను గాఢంగా నమ్ముతున్నాను. హిందువులలో సౌభ్రాతృత్వం లోపించడానికి కారణం ఏమిటని వ్యాఖ్యానింపగలం? దీనికి హిందూమతం, దాని తత్వం కారణాలు. మిల్ పేర్కొన్నట్లు సౌభ్రాతృత్వం సహజమైనటువంటిది. కానీ ఈ మొక్క సారవంతమైన నేల, పెరగటానికి అవసరమైన

పరిస్థితులు ఉన్నపుడు మాత్రమే పెరుగుతుంది. మనమందరం దేవుని బిడ్డలమనో, ప్రతి వ్యక్తి జీవితమూ ఇతరులతో ముడిపడి వుందనో బోధించడం ద్వారా సౌభ్రాతృత్వ భావన ఏర్పడదు. అటువంటి సెంటిమెంటు కలిగించడం కష్టం. సౌభ్రాతృత్వభావన పెంపొందే అవకాశం కీలక జీవిత రంగాలలో భాగస్వాములుగా వుండడంలో ఉంటుంది. జననాలు, మరణాలు, పెళ్ళిళ్ళు ఆహార వ్యవహారాల సుఖదుఃఖాలను పంచుకోగలిగి వుండాలి. పై రకమైన సహజీవనం సౌభ్రాతృత్వ భావనను పెంచుతుంది. సామూహిక భావనను కలిగించే ప్రధాన అంశం సహభోజనమేనని ప్రొఫెసర్ స్మిత్ చెప్పింది నిజం.

"మత జీవితానికే పురాతన ఆదర్శం- త్యాగాల నుంచి సమకూర్చుకున్న ఆహారం అన్నది సరైన వ్యక్తీకరణం. కారణం- అది కేవలం సాంఘిక చర్యే కాదు. దేవుడు, అతని ఆరాధకులు కూడా సంయుక్తంగా దీనిలో భాగస్వాములు. కానీ ఇంతకు ముందే చెప్పినట్టుగా దీనివలన ఒక మనిషితో కలిసి భుజించడం, తాగడం అనేవి సోదర భావాల్ని నిర్ధారించడానికీ, పరస్పరం సామాజిక బాధ్యతలను నిర్వర్తించటానికీ ఒక గుర్తు. దేవునికి నైవేద్యం పెట్టిన ఆహార సేవనం ప్రత్యక్షంగా ఒక అంశాన్ని వ్యక్తీకరిస్తుంది. భగవంతుడు, అతని ఆరాధకులు- ఇరువురూ కూడా ఒక కంచంలోనే భుజించే భోక్తలు అనేది ఆ విషయం. వారికున్న పరస్పర బాంధవ్యంలోని ప్రతి విషయంలోనూ యిది కలగలిసిపోయి కనిపిస్తుంది. ఎవరైతే భోజనం దగ్గర కలిసి కూర్చుంటారో, సాంఘిక విషయాల్లో వారంతా కలిసి మెలసే యుంటారు. అలా కలిసి భుజించనటువంటి వాళ్ళు ఒకరితోనొకరు అలీనంగా వుంటారు. వీరి మధ్య మత సహభావంగానీ, సాంఘిక బాధ్యతలపట్ల పరస్పర సహకారంగానీ వుండవు."[22]

కీలక జీవన రంగాలతో ముడివడివున్న సంతోష, విషాదాలను హిందువులు పంచుకోవడంలేదు. ప్రతిదీ విడివిడిగా జరుపుకునేదే, కొందరికే ప్రత్యేకమైనదే తన జీవిత కాలమంతా కూడా హిందువు ఎవరినీ కలుపుకోకుండా ప్రత్యేకంగానే వుంటాడు. భారతదేశానికొచ్చిన ఏ విదేశీయుడూ హిందూ పానీ (హిందువులకోసం వున్న నీరు), ముసల్మాన్ పానీ అని అరవటం వినడు. కానీ బ్రాహ్మణుల కాఫీ హోటళ్ళు, బ్రాహ్మణుల భోజన శాలలూ మాత్రం చూస్తాడు. వీటిల్లోకి బ్రాహ్మణేతరులైన హిందువులు ప్రవేశించడానికి అవకాశం లేదు. అంతేకాదు అతడు (ఆ విదేశీయుడు) బ్రాహ్మణ ప్రసూతి గృహాలు, మరాఠీల ప్రసూతి గృహాలు, భాటియాల ప్రసూతి గృహాలు చూస్తాడు. కానీ ఈ ముగ్గురూ హిందువులే. బ్రాహ్మణుడి ఇంట్లో ఎవరైనా పుట్టినపుడు బ్రాహ్మణేతరులెవరినీ ఆహ్వానించరు. ఆహ్వానించాలనే ఆలోచన కూడా వుండదు. బ్రాహ్మణుడి ఇంట్లో వివాహం ఏదైనా జరిగినా బ్రాహ్మణేతరుడెవ్వరూ ఆహ్వానించబడడు. అంతేకాదు. అతను ఆ కార్యక్రమంలో పాలుపంచుకోవాలని కూడా అనుకోడు. అలాగే బ్రాహ్మణుడు ఎవరైనా చనిపోయినపుడు బ్రాహ్మణేతరుడెవరూ శవయాత్రలోగానీ, శ్రాద్ధకర్మల్లోగానీ పాలు పంచుకుంటానికి ఆహ్వానించబడరు. అలా పాల్గొనడానికి వీళ్ళు (బ్రాహ్మణేతరులు) యిష్టపడరు కూడా. బ్రాహ్మణుని ఇంట్లో ఉత్సవం ఏదైనా జరిగినపుడు బ్రాహ్మణేతరుడు దానిలో పాల్గొనడానికి ఆహ్వానించబడడు. అలా తమను పిలవకపోవటం తప్పని బ్రాహ్మణేతరుడు భావించడు కూడా. ఒక కులానికి మరొక కులంతో ప్రమేయం లేదు. చివరికి దాతృత్వం కూడా

కులపరమైనదే. ప్రజలందరికీ ప్రయోజనకరమైనది– అనే అర్థంలో 'సార్వజనీన దాతృత్వం' అనేది హిందువుల్లో లేదు. బ్రాహ్మణ దాతృత్వం బ్రాహ్మణుల కోసమే. ఆ బ్రాహ్మణుల్లో కూడా యిది శాఖా పరిమితమే. ఉదాహరణకి చిత్పవన బ్రాహ్మణ దాతృత్వం చిత్పవన బ్రాహ్మణుల కోసమే. దేశాష్ట బ్రాహ్మణ దాతృత్వం కేవలం దేశాష్ట బ్రాహ్మణులకు మాత్రమే చెందింది. కర్హాడ బ్రాహ్మణ దాతృత్వం కర్హాడ బ్రాహ్మణులకు మాత్రమే చెందింది. అలాగే సారస్వత బ్రాహ్మణ దాతృత్వం వుంది. దానిలో కుదాల్ దేశ్‌కార్ బ్రాహ్మణ దాతృత్వం ఒక భాగం. హిందూ దాతృత్వంలో అందర్నీ కలుపుకోలేని అసహ్యాన్ని కలిగించే ఈ విడి విడితనాన్ని ఎవరైనా గమనించవచ్చు. హిందు దాతృత్వం లేక హిందువుల మధ్య దాతృత్వం అనేది వాస్తవంగా లేనేలేదు. బ్రతికున్నప్పుడు ఎప్పుడూ కూడా ఒక హిందువు మరొక హిందువుతో పంచుకునేది ఏమీ లేదు. చివరికి చనిపోయినపుడు కూడా హిందువులు ఎవరికి వారు ప్రత్యేకమైనవారే. మరొకరిలో కలవని వారే. చనిపోయిన వారి శవాలను కొందరు పూడ్చి పెడ్తారు. మరికొందరు దహనం చేస్తారు. కానీ పూడ్చిపెట్టేవాళ్లు కూడా ఒకే స్మశానాన్ని పంచుకోరు. ప్రతి వాళ్ళూ పూడ్చిపెట్టే తమవాళ్ళ కోసం స్మశానంలో తగిన ప్రదేశాన్ని ఎంచుకుంటారు. తగులబెట్టే వాళ్ళు అందరూ ఒకేచోట తగులబెట్టరు. ఆవిధంగా గనుక వారు చేయవలసి వస్తే, ప్రతి వాళ్లకూ ఒక ప్రత్యేకమైన దహనవాటిక వుంటుంది.

హిందువులకు ఈ సౌభాతృత్వ భావన పరాయిది అనటంలో ఆశ్చర్యం ఏమైనా వుందా? జీవితానికి సంబంధించిన ఆనంద, విషాదాలను పంచుకోవటాన్ని హిందువులు ఎందుకు నిరాకరించారు? అన్నది అన్నింటికంటే పెద్ద ప్రశ్న. దీనికి వేరేగా ఏమీ చెప్పవలసింది లేదు. కేవలం అతని మతం పంచుకోవద్దని చెప్పింది. అందువల్లనే అతను నిరాకరించాడు. ఈ అంతిమ నిర్ణయం ఆశ్చర్యాన్ని ఏమీ కలిగించదు. మరి హిందూమతం దేన్ని బోధించింది? అది వర్ణాంతర భోజనాల్ని వద్దని చెప్పింది. వర్ణాంతర వివాహాన్ని చేసుకోవద్దంది. కలిసి మెలసి ఉండవద్దని కూడా చెప్పింది. దాని బోధనల సారాంశం మొత్తం యిదే కాదు. హిందువులలో వేర్పాటుతనాన్నీ, వేరెవ్వరితోనూ కలియని లక్షణం నిరూపించటానికి యిప్పటివరకు నేను పేర్కొన్న అంశాలన్నీ పిగ్గుచేటు కలిగించేవి. ఇవన్నీ హిందూమతం తాలూకు తత్వం నుంచి ప్రత్యక్షంగా బయటపడినటువంటిది. సౌభ్రాతృత్వాన్ని సరాసరి నిరాకరించుటకు హిందూమత తత్వం.

న్యాయ నిర్ణయం కోణం నుంచి హిందూమత తత్వానికి సంబంధించిన ఈ సంగ్రహ విశ్లేషణ వల్ల హిందూమతం ఏవిధంగా సమానత్వానికి శత్రువో, స్వేచ్ఛకు విరోధి, సౌభాతృత్వానికి ప్రత్యర్థో స్పష్టంగా అర్థమవుతుంది.

సౌభ్రాతృత్వం, స్వేచ్ఛ అనేవి వాస్తవికంగా ఉత్పన్న భావాలు. సమానత్వం, మనిషి వ్యక్తిత్వాన్ని గౌరవించడం యివి రెండూ ప్రాథమికమైన, మౌలికమైన భావాలు. ఈ రెండు మౌలిక భావాల నుంచే సౌభ్రాతృత్వం, స్వేచ్ఛలు పునాదులు కలిగియున్నాయి. ఇంకా లోతుకు వెళ్ళి చూస్తే సమానత్వం అన్నది మూల భావన అనీ, మానవ వ్యక్తిత్వాన్ని గౌరవించడం అనేది దాని ప్రతిబింబమనీ చెప్పవచ్చు. కాబట్టి ఎక్కడైతే సమానత్వం నిరాకరించబడుతుందో అక్కడ

ప్రతిదీ నిరాకరణకు గురవుతుందని మనం తెలుసుకోవచ్చు. ఇంకో మాటలో చెప్పాలంటే హిందూమతంలో సమానత్వం లేదని చెప్పటమే నావరకు నాకు చాలు. ఇప్పటివరకు నేను నిరూపించిన పద్ధతిలో ఎవరూ హిందూమతాన్ని విశ్లేషించలేదు. హిందూమతం, సౌభ్రాతృత్వాన్ని, దీనితోపాటు స్వేచ్ఛకు బద్ధ వ్యతిరేకి అనే ఊహకు వదిలివేయడం సహజమైన పని అని నేను భావించడంలేదు.

లార్డ్ ఆక్టన్ లోతుగా చేసిన పరిశీలనతో మరొక చివరి పరిశీలనాంశంతో ఈ చర్చను నేను ముగించదలచుకున్నాను. ఆక్టన్ మహాశయుడు చారిత్రక పరిస్థితుల కారణంగా అసమానత్వం పెరిగిందని అన్నాడు. లార్డ్ ఆక్టన్ తన పరిశీలనా సమయంలో హిందూ మతాన్ని పరిగణనలోకి తీసుకోలేదనుకోవాలి. అసమానత అదేది ఒక మత సిద్ధాంతంగా స్వీకరించబడింది. ఒక పవిత్రమైన పిడివాదంగా బోధించబడింది. ఇది ఒక అధికారిక మత విశ్వాసం. దీన్ని బహిరంగంగా పాటించడానికి ఎవరూ సిగ్గుపడలేదు. అసమానత్వం అనేది హిందువులకు ఒక జీవితమార్గం. మత సిద్ధాంతంగా దైవదత్తమైనది. జీవిత మార్గానికి సంబంధించిందిగా ఈ నిర్దేశం హిందూ సమాజంలో ఒక అవతార తత్వాన్ని సంతరించుకుంది. అది హిందూ సమాజంలో ప్రజల ఆలోచనలకూ, కార్యకలాపాలకూ ఆకారమివ్వటమే గాకుండా రూపుదిద్దింది. వాస్తవంగా హిందూ మతానికి అసమానత ఆత్మ.

హిందూమత తత్వాన్ని ప్రయోజనాంశం దృష్ట్యా యిక పరిశీలిస్తాను.

హిందూమతాన్ని ఈ కోణం నుంచి పరిశీలించటంలో యింతటిదీర్ఘతా, విపులతా అవసరం లేదు. మిల్ సూచించినట్లుగా "న్యాయమూ, ప్రయోజనమూ– వీటి మధ్య శతృత్వానికి ఆవశ్యకత లేదు. మరొకవిధంగా చెప్పాలంటే– వ్యక్తిపట్ల ఏదైతే న్యాయబద్ధంకాదో, అది సమాజానికి ప్రయోజనకారి కానేకాదు. దాన్ని అలా వుంచితే కుల పర్యవసానాలు మన ముందు ప్రకాశిస్తూ కనిపిస్తాయి."

మతాదర్శం అనేది వాస్తవంగా ఆదర్శం కాదు. ఆ ఆదర్శం అభ్యాసంలో ఉండాలి. అంటే ఏ కొంత మేరకయినా వాస్తవం కావాలి. కాబట్టి హిందువులు చాతుర్వర్ణ వ్యవస్థను అత్యంత భక్తిశ్రద్ధలతో పాటించారు. జర్మన్ తత్వవేత్త అయిన నీషే "ఆదర్శాన్ని వాస్తవీకరించు. వాస్తవాన్ని ఆదర్శీకరించు" అన్న మాటలను హిందువులు చక్కగా పాటించారు.

ఆదర్శం తాలూకు విలువ, దాని ఫలితాన్నిబట్టి పరీక్షించబడుతుంది. అనుభవమేగనక గీటురాయి అయ్యేటట్టయితే చాతుర్వర్ణ సిద్ధాంతానికి సంబంధించిన ఆదర్శం మూడు రకాలుగా ఖండించదగినదౌతుంది. కేవలం సాంఘిక సంస్థకు చెందిన రూపంగా యిది మొదట ఖండనకు లోనవుతుంది. ఇది వుత్పాదకుల సంస్థగా అపఖ్యాతిని పొందుతుంది. పంపిణీ వ్యవస్థకు సంబంధించిన ఆదర్శ విధానంగా ఇది దారుణంగా విఫలమయింది. సంస్థకు సంబంధించిన ఆదర్శ విధానమే గనక అయ్యేటట్లయితే, హిందూమతం ఒక ఉమ్మడి ఐక్య సంఘటనను

ఎందుకు రూపొందించలేకపోయింది? ఇది గనక ఉత్పత్తి విధానానికి సంబంధించిన ఆదర్శ రూపమేగనక అయ్యేటట్లయితే ఈసాంకేతిక విధానం ఆది మానవుని స్థాయి నుంచి ఎందుకు ముందడుగు వేయలేదు? పంపిణీ విధానానికి సంబంధించిన ఆదర్శవంతమైన వ్యాకులపరచే అసమానత్వాన్ని ఎలా సృష్టించింది? అంతులేని సంపద, దుర్భర దారిద్ర్యం ఎలా ప్రక్క ప్రక్కనే ఉండగలిగేయి?

కానీ ఈ విషయాన్ని సంక్షిప్తంగా కొట్టి పారవేయాలని నేను అనుకోవడం లేదు. ఎందుకంటే చాలామంది హిందువులు తమ సంస్థకు గొప్ప సాంఘిక ప్రయోజనం వుండాలని కోరుకుంటారని నాకు తెలుసు. అంతేకాదు ఆ మత వ్యవస్థను ముక్కలు చేయటమే కాకుండా, దానికి దైవిక ఆమోద ముద్రను కల్పించిన మనువు ఆలోచనా శీలతను, తెలివితేటల్నీ ప్రశంసిస్తారనీ కూడా తెలుసు.

మతానికి సంబంధించి ఈ అభిప్రాయం మతంలోని వేర్వేరు అంశాలను ప్రత్యేకంగా తీసు కోవడం వల్ల ఏర్పడినటువంటిది. అలాకాకుండా ఎవరైనా ఆ విషయాలన్నింటినీ ఒక సమూహంగా తీసుకోవలసిన అవసరం వుంది. మతం తాలూకు ఫలితమైన సాంఘిక ప్రయోజనం, లేక అప్రయోజనం మతం యొక్క వేర్వేరు అంశాలను కలిపి నిర్ధారించుకొని వాటి సంయోగంలోనే వాటిని విమర్శించవలసి వుంటుంది. సమస్యను ఎదుర్కొనే ఈ పద్ధతిని అనుసరించే ఈ క్రింది నిర్ధారణలు చేయవచ్చు.

1. శ్రమించే వాళ్ళను కులం వేరు చేసింది. 2. కులం– శ్రమ నుంచి అభీష్టాన్ని విడగొట్టింది. 3. కులం– శారీరక శ్రమకు, తెలివితేటలకూ సంబంధాన్ని రూపుమాపింది. 4. కులం– వ్యక్తి బలమైన అభీష్టాన్ని నెరవేర్చుకొనే, హక్కుని నిరాకరించడంద్వారా బలహీనపర్చింది. 5. కులం– సమీకరణను అడ్డుకుంది. కుల వ్యవస్థ కేవలం శ్రమ విభజనే కాదు. అది శ్రామికుల విభజన కూడా. నాగరిక సమాజం నిస్సందేహంగా శ్రమ విభజనను ఆశించేదే. కానీ ఏ నాగరిక సమాజంలో కూడా శ్రమ విభజనతో పాటు ఇంతటి అడ్డుగోడల అసహజ శ్రామిక విభజన కనిపించదు. కుల వ్యవస్థ కేవలం శ్రామికుల విభజన మాత్రమే కాదు – శ్రామికుల విభజన, శ్రమ విభజన పూర్తిగా భిన్నమైనది – అది శ్రామికుల విభజనను హెచ్చుతగ్గులలో చేసే విభజన కనిపించదు. శ్రమ విభజనతో పూర్తిగా వ్యతిరేకించేటటువంటిదైనా శ్రమజీవుల విభజన–కులవి ధానం– ఎప్పుడూ కాజాలదు. శ్రామిక జీవులవిభజన అనేది వారిని ఒకరిమీద ఒకరిని ఉంచే శ్రామిక విధానానికి సంబంధించిన వంశపారంపర్య లక్షణానికి చెందింది. ఈ దేశంలో తప్ప మరే దేశంలోనూ ఒకరిమీద ఒకరు నిలచే శ్రేణీ విధానానికి సంబంధించిన శ్రామికుల విభజన పద్ధతిలేదు. కుల వ్యవస్థపైని ఈ దృష్టి గురించి విమర్శలో మూడో అంశం–ఈ శ్రమ విభజన అప్రయత్నంగా జరిగిందీ కాదు, సహజ అభిరుచులపై ఆధారపడిందీ కాదు. సాంఘిక, వ్యక్తిగత సామర్థ్యాలు వ్యక్తి తన శక్తి సామర్థ్యాలను పెంచుకుని, తాను ఎంచుకున్న పద్ధతిలో జీవితాన్ని గడపడానికి వ్యక్తికి అవకాశం కలిగిస్తాయి. ఈ సూత్రాన్ని కులవ్యవస్థలో అతిక్రమించడం జరిగింది.

సహజ సామర్థ్యం మూలంగా వ్యక్తి వృత్తిని ఎంచుకోవటం కాకుండా ముందే నిర్ణయించబడిన పద్ధతిలో వ్యక్తులకు ఆయా వృత్తులు నిర్దేశించడం జరిగింది. ఈ నిర్ణయం తల్లిదండ్రుల సామాజిక స్థానాన్నిబట్టి, నిర్దేశించడం ద్వారా కులవ్యవస్థ ఈ సూత్రాన్ని అతిక్రమించింది. కుల వ్యవస్థ ఫలితంగా వ్యక్తులు వృత్తులను స్వీకరించడంలో అంతరాలను కల్పించే ఈ విధానాన్ని మరొక దృష్టితో చూస్తే అది హానికరమైనదిగా స్పష్టంగా తెలుస్తుంది. పరిశ్రమ రంగం అనేది ఎప్పుడూ స్థిరమైంది కాదు. అదివేగంగా, ఆశ్చర్యకరంగా మార్పును పొందుతుంది. ఆ మార్పుల్నిబట్టి ప్రతివ్యక్తి తన వృత్తుల్ని మార్చుకోటానికి స్వేచ్ఛ లేకపోతే అతడిక బతుకుతెరువు సాధించుకోవడం అసాధ్యం. వంశపారంపర్యంగా చేపట్టవలసిన వృత్తులు తప్ప, మరే ఇతర వృత్తిని హిందువు చేపట్టడానికి కుల వ్యవస్థ అంగీకరించదు. ఆకలితో మలమల మాడి చావనైనా చావాలేగాని, హిందువు ఎప్పుడూ కులపరంగా తన కులానికి నిర్దేశించిన వృత్తిని తప్ప మరో వృత్తిని చేపట్టటానికి లేక పోవటమే, ఈ దేశంలో నిరుద్యోగ సమస్య తీవ్రంగా ప్రబలటానికి ప్రత్యక్ష కారణం. శ్రమ విభజన రూపాన్ని బట్టి కులవ్యవస్థ మరో లోపానికి గురిఅయింది. కులవ్యవస్థ ప్రతిపాదించిన శ్రమ విభజన వ్యక్తి ఇష్టానికి సంబంధించిన వృత్తిని స్వీకరించటం అనే దానిమీద ఆధారపడినటువంటిది కాదు. వ్యక్తి గతమైన అభిరుచి, అభిరుచిని బట్టి చేపట్టాల్సిన వృత్తికి దీనితో సంబంధం లేదు. అదిముందే నిర్ణయం జరిగిపోయేటటువంటి అంధవిశ్వాసం మీద ఆధారపడినటువంటిది. సామాజిక సామర్థ్యాన్ని పరిగణనలోనికి తీసుకొని చూస్తే ఒక విషయం మనం గుర్తించక తప్పదు. పారిశ్రామిక వ్యవస్థకు సంబంధించిన అతి పెద్ద దుర్మార్గం పేదరికమూ కాదూ, దానికి అనుబంధంగా వచ్చే కష్టాలూ కావు, చాలామంది మానసిక అనుబంధం లేని వృత్తులలో కొనసాగడమే. అటువంటి వృత్తులు ఎప్పుడూ ఏహ్యాభావాన్ని, దురాలోచనలను, పని ఎగవేత ధోరణిని కలిగిస్తాయి. హిందువుల చేత హీన వృత్తులుగా పరిగణింపబడుతున్న కారణాన అనేక వృత్తుల్లో వున్నవారికి విరక్తి కలుగుతుంది. హిందూమతం తమపై వేసిన ముద్రకు లోబడి ఆయా కులవృత్తుల్లో కొనసాగుతున్నవారికి వాటి నుంచి తప్పించుకుపోవాలని నిరంతరం అనిపిస్తుంటుంది.

ఇక అది చేసిన రెండవ మోసం ఏమిటంటే శ్రమ నుంచి ప్రతిభను వేరు చేసింది. శ్రమ పట్లతిరస్కారాన్ని సృష్టించింది. కుల వ్యవస్థా సిద్ధాంతం బ్రాహ్మణుడికి తన తెలివి తేటల్ని అభివృద్ధి చేసుకోటానికి అంగీకారాన్ని తెలిపిందే కాని, అతను శ్రమించటానికి ఆమోదాన్ని తెలుపలేదు. పని చేయటానికే నిర్దేశించబడిన శూద్రుడు, తన తెలివితేటల్ని అభివృద్ధి చేసుకోవటానికి ఆమోదించబడలేదు. దీని భయంకర పరిణామాల్ని ఆర్.సి దత్తాగారు చాలా చక్కగా ప్రదర్శించారు. (రాత ప్రతిలో ఉటంకింపు లేదు. సం..)

కులం మనుషుల్ని నిర్వీర్యుల్ని చేసింది. అది ఒక నిర్జీవం చేసే ప్రక్రియ. విద్య, సంపద, శ్రమ అనేవి ప్రతివ్యక్తి స్వేచ్ఛ సంపన్నునిగా, సంపూర్ణ మానవుడిగా ఎదగటానికి అవసరమైనవే. సంపదలేని కేవలం చదువు, శ్రమ వ్యర్థం. చదువు లేకుండా సంపద వుంటే, ఆసంపద క్రూరమైనది అవుతుంది. ప్రతిదీ ప్రతి ఒక్కరికీ అవసరం. మనిషి ఎదుగుదలకు అవి ఆవశ్యకం.

బ్రాహ్మణుడు జ్ఞానసముపార్జన చేయాలి, క్షత్రియుడు ఆయుధాలు ధరించాలి, వైశ్యులు వ్యాపారం చేయాలి, శూద్రుడు సేవ చేయాలి–అన్న దాన్ని కుటుంబంలో మాదిరి పరస్పరం ఆధారపడడంగా చెబుతుంటారు. మూడు వర్ణాలు శూద్రునికి సాయం చేస్తుండగా అతను సంపదను ఆర్జించడానికి చదువుతో రాతతో పని పడినప్పుడు బ్రాహ్మణుని వద్దకు వెళ్ళే వీలుండగా శూద్రుడు చదువుకోవాల్సిన బాధ ఏముంది? రక్షించడానికి క్షత్రియుడుండగా శూద్రుడు సాయుధుడు కావడానికి ఎందుకు ప్రయత్నించాలి. ఈ ప్రశ్నలు అడిగేవారి ప్రకారం చాతుర్వర్ణ సిద్ధాంతం అంటే శూద్రుడికి తక్కిన మూడు వర్ణాలవారూ రక్షకులు. చాతుర్వర్ణం ఒక సీదాసాదా, ఆకర్షణీయమైన సిద్ధాంతం. చాతుర్వర్ణంలో అంతరార్థం అదే అని ఒప్పుకున్నా, ఆ వ్యవస్థ లోపరహితమూ కాదు, కుట్ర స్వభావం లేనిదీ కాదని తెలుస్తుంది.

బ్రాహ్మణులు జ్ఞాన సముపార్జనలోనూ, వైశ్యులు ఆర్థిక సంస్థల నిర్వహణలోనూ, క్షత్రియులు సమర్థులైన సైనికులు అవటం అనే తమకు నిర్దేశించిన విధుల్లో విఫలమై వుంటే ఏమి జరిగివుండేది? వారు తమ విధుల్ని సక్రమంగా నిర్వర్తించారు అనుకుందాం. కాని దానికి పూర్తి విరుద్ధంగా పరస్పరంగానీ, లేక శూద్రుడికి గానీ, తమ బాధ్యతలను అంటగడితే? ఈ మూడు వర్ణాల వాళ్ళూ శూద్రుడికి సహకారాన్ని, న్యాయమైన పద్ధతిలో అందించటానికి నిరాకరించినా, లేక మూడు వర్ణాలవాళ్ళూ కలిసికట్టుగా అతణ్ణి అధఃపాతాళానికి తొక్కితే ఏమవుతుంది? అప్పుడు శూద్రుడి ప్రయోజనాలను రక్షించే నాథుడెవ్వరు? ఈ విషయానికి సంబంధించి వైశ్యుడు, క్షత్రియుడు, శూద్రుని అజ్ఞానాన్ని అసరాగా తీసుకొని లబ్ధి పొందుతుంటే జ్ఞానబోధ చేయవలసిన బ్రాహ్మణుడు ఏం చేస్తాడు? బ్రాహ్మణుడు గానీ, వైశ్యుడుగానీ వీరిలో ఎవరైనా శూద్రుణ్ణి దోచుకుంటూ వున్నప్పుడు అతన్ని రక్షించవలసిన వాడు క్షత్రియుడేనా? శూద్రుని స్వేచ్ఛను పరిరక్షించే వాడెవరు? ఒక వర్గం మీద మరొక వర్గం పరస్పరం ఆధారపడి జీవించటం అనేది తప్పనిసరి. కనీసం కొన్ని సందర్భాల్లో అయినా పరస్పరం కాని పద్ధతిలో ఒక వర్గం మీద మరొక వర్గం ఆధారపడి జీవించటం సమ్మతించవచ్చు. అయినా జీవనాధారమైన అవసరాల కోసం ఒక వ్యక్తి మరొక వ్యక్తి మీద ఆధారపడేటట్లు ఎందుకు చేయాలి? చదువు అందరికీ అవసరమే. రక్షణ, సాధనాలు ప్రతివాడికీ అవసరమే. ప్రతివ్యక్తి ఆత్మరక్షణానికి ఇవి తిరుగులేని అవసరాలు. చదువు, సంధ్యలు లేనివాడూ, నిరాయుధుడు అయిన పొరుగు వ్యక్తికి సాయుధుడు, విద్యావంతుడూ సాయం చేస్తాడని ఏలా అనుకోగలం? అసలు మొత్తం సిద్ధాంతమే అర్థరహితమైంది. తమను ఇబ్బంది పెట్టే యిలాంటి ప్రశ్నలను చాతుర్వర్ణ్యాన్ని సమర్థించే ఏ వ్యక్తీ పట్టించుకోదు. అయినాఈ ప్రశ్నలు అత్యంత సందర్భోచితమైనవే. చారుత్వర్ణ వ్యవస్థ అంతరార్థం, వివిధ వర్ణాల మధ్య సంరక్షక సంరక్ష్య భావం అని ఒప్పుకుని చూస్తే, సంరక్షించవలసిన వాడు సంరక్షితుని పట్ల ఆచరించే దుష్కృత్యాల నుంచి కాపాడటానికి ఎలాంటి అవకాశమూ లేదని అంగీకరించక తప్పదు.చాతుర్వర్ణ్య వ్యవస్థకు మూలాధారమైన పోష్య, పోషక భావమే నిజమైన అంతరార్థం గనక అయ్యేటట్లయితే, అది ఆచరణలో యజమాని –సేవకుడు సంబంధంకంటే భిన్నమయినది కాదు. వారి పరస్పర సంబంధాల్లో సంతృప్తి లేకపోయినప్పటికీ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలు మూడూ కార్య నిర్వహణలో రాజీ పడి, పనులు సాధించుకుంటాయి. బ్రాహ్మణుడు క్షత్రియుణ్ణి పొగుడుతాడు.వీళ్ళిద్దరూ కలిసి,

వైశ్యుణ్ని తన కాళ్ళమీద తాను విలబడేటట్లు చేస్తారు. కానీ, ఆ ముగ్గురు కలిసి శూద్రుణ్ని అధఃపాతాళానికి త్రొక్కటానికి నిర్ణయించుకుంటారు. శూద్రుడు సంపాదించటానికి గానీ, సంపాదించి కూడబెట్టడానికి గానీ, అంగీకరించబడలేదు. కారణం మిగిలిన మూడు వర్ణాల వారికంటే స్వతంత్రతను పొందుతాడనే భయం. అతడు జ్ఞానం సముపార్జించడం నిషేధించారు. కారణం జ్ఞానవంతుడు గనక అయ్యేటట్లయితే తన ప్రయోజనాలను పరిరక్షించుకొనే విషయంలో అత్యంత జాగరూకుడై వుంటాడనే భయం. ఈ కారణం చేత శూద్రులు త్రైవర్ణకుల చేత ఎలా చూడబడ్డారో మనుధర్మ సూత్రాలు సాక్ష్యమిస్తాయి. సాంఘిక హక్కులను గురించి చేసిన ధర్మసూత్ర గ్రంథాల్లో మనుధర్మ సూత్రాన్ని మించిన సూత్ర గ్రంథం మరొకటి లేదు. సాంఘిక దురన్యాయానికి సంబంధించిన ఏ వుదాహరణయినా ఈ మనుధర్మశాస్త్రం ముందు వెలవెల పోతుంది. తమని బాధలకు గురిచేసిన ఈ సాంఘిక దురన్యాయాన్ని యింతకాలం అశేష ప్రజానీకం ఎలా ఓర్చుకోగలిగింది? ప్రపంచంలోని ఎన్నో యితర దేశాల్లో సాంఘిక విప్లవాలు జరిగాయి. మరి భారతదేశంలో అటువంటి సాంఘిక విప్లవం ఎందుకు రాలేదన్న ప్రశ్న నన్నెప్పుడూ బాధిస్తుంటుంది. దీనికి ఒకే ఒక్క జవాబును నేను ఇవ్వగలను. క్రూరమైన విధానమైన చాతుర్వర్ణ్య వ్యవస్థ హిందువులలోని క్రింది తరగతి ప్రజలు ఏవిధమైన ప్రత్యక్ష చర్య తీసుకోటానికి వీలు లేకుండా చేసింది. వాళ్లు ఆయుధాలు ధరించడానికి వీలులేదు. ఆయుధం ధరించలేని వాడు ఎలా తిరగబడగలడు? వాళ్లందరూ వ్యవసాయదార్లు లేక వ్యవసాయదార్లుగా చేయబడినవాళ్ళు. వారు తమ నాగలి కర్రులను కత్తులుగా చేసుకోటానికి అనుమతించబడింది. వాళ్ళకు బాయ్‌నెట్లు లేవు. అందువల్ల వ్యవసాయాన్ని వృత్తిగా ఎంచుకొన్న ప్రతివానిమీద పెత్తనాన్ని మిగలిన వాళ్ళు చెలాయించారు. చాతుర్వర్ణ వ్యవస్థ కారణంగా వాళ్ళు విద్యావంతులు కాలేకపోయారు. వాళ్ల విముక్తి మార్గాన్ని గురించి ఆలోచించడం గానీ, లేక తెలుసుకోవటం కానీ, వాళ్ళు చేయలేదు. వాళ్ళు అధములుగా నిరసనకు గురి అయ్యారు. విముక్తి మార్గం వాళ్ళకు తెలియకపోవటం చేత, తప్పించుకోటానికి సాధనాలు దొరక్క, తప్పించుకోటానికి వీలులేని విధివిజితంగా శాశ్వత బానిసత్వంతో సమాధాన పడ్డారు. ఆఖరికి యూరప్‌లో కూడా బలవంతులు దోపిడితో బలహీనుల్ని పీల్చిపిప్పిచేయలేదు. నాశనం చేయలేదు. భారతదేశంలో హిందువులు విస్సిగ్గుగా ఆచరించినంతగా, యూరప్‌లో దోపిడీలో బలహీనుల్ని నిస్సహాయుల్ని చేయటానికి బలవంతులు ఎప్పుడూ ప్రయత్నించక పోవటం విశేషం. అయినా ఇండియాలో ఎప్పుడూ లేనంతగా, యూరప్‌లో బలవంతుల, బలహీనుల మధ్య సామాజిక సమరం అత్యంత హింసాత్మకంగా పెచ్చరిల్లుతోంది. అయినా బలహీనవర్గాలకి యూరప్‌లో మిలటరీ సేవకు స్వేచ్ఛ వుంది. అదే వారి శారీరక ఆయుధం. ఓటు హక్కు వుంది. అదే వారి రాజకీయ ఆయుధం. చదువుకొనే సదుపాయం వుంది. ఆదే వారి నైతిక ఆయుధం. బలహీనవర్గాల విముక్తికి అవసరమైన ఈ మూడు ఆయుధాలను యూరప్‌లో బలవంతులు బలహీనులకు ఎప్పుడూ కూడా దక్కకుండా చేయక పోవడం గమనించదగ్గ విశేషం. ఈ ఆయుధాల్ని భారతదేశం సామాన్య జనానీకానికి దక్కకుండా చాతుర్వర్ణ వ్యవస్థ చేసింది. చాతుర్వర్ణ్య వ్యవస్థలో మినహా మరే సాంఘిక వ్యవస్థలోనూ ఇటువంటి శ్రేణీకృత అసమానతా విధానాల్ని మనం చూడం. ప్రజల్లోని అర్థవంతమైన క్రియాశీలతను మొద్దుపరిచింది. స్తంభింపచేసింది. అంతేకాదు అంగవైకల్యానికి గురిచేసింది, ఈ చాతుర్వర్ణ వ్యవస్థ. నేను చెప్పే

ఈ విషయం అతిశయోక్తి కాదు. చరిత్రలో దీనికి ఎంతో గొప్ప సాక్ష్యం ఉంది. భారతదేశ చరిత్రలో ఒకేఒక్క సమయంలో స్వేచ్ఛ, గొప్పతనం, తేజస్సు ఉన్నాయి. ఆ సమయం మౌర్యుల పరిపాలనా కాలం. ఇక మిగిలిన కాలమంతా దేశం అపజయాలతో బాధపడుతూ, అంధకారంలో మునిగిపోయింది. కానీ చాతుర్వర్ణ్య వ్యవస్థ సంపూర్ణంగా నిర్మూలించబడినటువంటి, జనసామాన్యం సమీకృతమై దేశానికి శూద్రులే పాలకులయినటువంటి సమయం మౌర్యుల పరిపాలనా కాలం. అపజయాలతోను, అంధకారంలోనూ మునిగిపోయన కాలమంతా చాతుర్వర్ణ్య వ్యవస్థ దేదీప్యమానంగా వెలుగొందిన కాలం. భారతదేశంలో అత్యధిక ప్రజానీకం మీద తన ప్రభావాన్ని నెరపిన కాలం అది.

వర్ణం ప్రజల ఏకీకరణాన్ని నివారించింది. ఏదైనా విపత్తు వచ్చినపుడు దాన్నుంచి రక్షించుకోవటానికి సమాజ సభ్యులంతా ఒకటవటానికి దానికున్న సర్వావకాశాన్ని వినియోగించుకోవలసిన అవసరం వుంటుంది. ప్రతి ఒక్కడు యుద్ధం చేయాలి. ప్రతి వ్యక్తి సైనికుడు కావాలి. వర్ణవ్యవస్థ సిద్ధాంతం మూలంగా ఇది సాధ్యమయ్యే విషయమేనా? కాదు అని స్పష్టం. భారతదేశ చరిత్రలో నిరంతరాయంగా అపజయాల దురదృష్టానికి కారణం వర్ణం(వర్ణవ్యవస్థ). వర్ణం ప్రజలు మొత్తం సమైక్యంగా నిలవటాన్ని నివారించింది. లేకపోతే ప్రజల సమైక్యతా పరిధి చాలా పరిమిత లక్షణం కలది. కేవలం క్షత్రియులు మాత్రమే పోరాడాలని భావించారు. మిగిలిన బ్రాహ్మణులు, వైశ్యులు ఆయుధాలు చేపట్టవీలులేదు. సమాజంలో అత్యధిక సంఖ్యాకులైన శూద్రులు ఆయుధ రహితులు. దాని ఫలితంగా విదేశీయులైన శత్రువులు అల్పసంఖ్యాకులైన క్షత్రియుల్ని సులభంగా జయించటం, దేశం యావత్తూ వారికి పాదాక్రాంతం కావటం జరిగిపోయింది. దానికి ప్రతిఘటన ఏర్పడలేదు. అసలు ప్రతిఘటించటానికి తగిన సామర్ధ్యం కూడా లేదు. భారతదేశంలో జరిగిన యుద్ధాలన్నీ అధిక భాగం కేవలం ఒక ప్రదేశంలో మాత్రమే జరిగినటువంటివి. లేక ఒక సైనిక పటాలం పోరాడినటువంటివి. దీనికి కారణం ఏమిటంటే వాస్తవంగా ఒక ప్రదేశంలో క్షత్రియులు ఓడిపోతే ఇక సమస్తం కోల్పోయినట్లే. ఎందువల్ల? ఏముంది దీనికి సమాధానం చాలా సులభమైంది. భారతదేశంలో ప్రజలంతా సమైక్యమయ్యే అవకాశం లేకపోవటమే! ప్రజల మనఃప్రవృత్తిలో (వర్ణవ్యవస్థ) సిద్ధాంతం బలంగా వేరూని నిలిచిపోవటమే.

ఈ నిర్ణయాలు సరైనవైనప్పుడు సమాజాన్ని ముక్కలు చెక్కలుగా చేసిందీ, ఇష్టమైన పనిచేయటాన్ని నివారించిందీ, శ్రమనుంచి తెలివితేటల్ని వేరు చేసిందీ, జీవితానికి ప్రాణతుల్యమైన అభీష్ట హక్కుల్నుంచి పరిహరించిందీ, విపత్కర సమయాల్లో ఒకే తాటిమీద సమాజం నిలబడేటట్టు చేసే సమైక్య భావాన్ని అడ్డుకుందీ, అయినా (హిందూమత) ఈ తత్వం సామాజిక ప్రయోజన పరీక్షను సంతృప్తి పరచగలిగింది అని ఎలా అనగలం?

# IV

కాబట్టి హిందూమత తత్వం అటు సామాజిక ప్రయోజన పరీక్షనుగాని, ఇటు వ్యక్తిగతమైన న్యాయం అనే పరీక్షనుగానీ– మొత్తంమీద రెండింటిని సంతృప్తి పరచలేకపోయింది.

నా విశ్లేషణా ఫలితం విపరీతమైంది. అందువల్ల అది చాలామందిని ఆశ్చర్యానికి గురి చేయవచ్చు. ఆశ్చర్యపోయిన కొంతమంది, నా నిర్ణయాలు చాలావరకు విపరీతమైనవి కాబట్టి, నేను చేసిన హిందూమత తత్వ విశ్లేషణలో ఏదో లోపం ఉందని కూడా అనవచ్చు. ఈ ఆక్షేపణాన్ని నేను ఎదుర్కోక తప్పదు. నా విశ్లేషణను ఎవరైతే తిరస్కరిస్తున్నారో, వాళ్ళు నా విశ్లేషణ విపరీతమైందని ఎందుకనుకుంటున్నారంటే, హిందూమత తత్వంలో గర్భితమైన ప్రధాన భావాన్ని వాళ్ళు గ్రహించలేకపోవటం మూలంగానే. ఆ వాస్తవాన్ని వాళ్ళు గ్రహించగలిగితే నా ప్రతిపాదనలకు వాళ్ళేమీ ఆశ్చర్యపోరు.

ఇది చాలా ముఖ్యమైన విషయం. ఇక ఉపోద్ఘాతం ఆపేస్తాను. ఇంతకు ముందుచేసిన మత విప్లవ విశ్లేషణ వల్ల మనకొక విషయం స్పష్టంగా తెలుస్తుంది. మానవ సమాజానికి సంబంధించిన దైవిక ఆధిపత్య రూపాలైన మతాదర్శాలు రెండు రకాలు. మొదటి దానిలో సమాజం కేంద్రమైతే రెండవదానిలో వ్యక్తి కేంద్ర బిందువుగా వుంటాడు. మొదటి దానికి ఏది మంచి ఏది చెడు అనేదే సరియైన పరీక్షగా మొదటి విశ్లేషణ చూపుతోంది. అంటే మొదటిదైన ప్రయోజనానికి పరీక్ష నైతిక విధానం. రెండవదానికి పరీక్ష న్యాయం. ఇక ఇప్పుడు హిందూమత తత్వం అటు ప్రయోజనానికి సంబంధించిన పరీక్షకుగానీ, ఇటు న్యాయానికి సంబంధించిన పరీక్షకుగానీ సమాధానం ఈయలేక పోవటానికి కారణం ఏమిటంటే – మానవ సమాజంపై దైవిక ఆధిపత్యానికి సంబంధించిన హిందూమత ఆదర్శం ప్రత్యేకమైనది, దేనితోనూ పోల్చడానికి వీలులేనిది. అది ఒకే ఒక ప్రత్యేకమైన వర్గానికి మాత్రమే పరిమిత మైనటువంటిది. వ్యక్తి కేంద్రంగా లేనటువంటి ఆదర్శం అది. వ్యక్తిగాని, సంఘంకానీ కేంద్రం కానటువంటి ఆదర్శం అది. కేంద్రమైన ఆవర్గం బ్రాహ్మణులుగా పిలవబడే అధిమానవులకు చెందినటువంటిది. ప్రబల మైన, వినాశనకరమైన ఆ వాస్తవాన్ని మనసులో పెట్టుకున్న ఎవరికైనా – హిందూమత తత్వంలో వ్యక్తిగత న్యాయం సాంఘిక ప్రయోజనం ఎందుకు కన్పించదో తేలిగ్గా అర్థంకాగలదు. హిందూ మత తత్వం మొత్తంగా ఒక విభిన్నమైన సిద్ధాంతాన్ని కలిగినటువంటిదిగా కన్పిస్తోంది. ఏది మంచి, ఏదిచెడు అనే ప్రశ్నకి హిందూమతం ఇచ్చే జవాబు గమనించదగినటువంటిది. ఆ మంచి అన్నదిగానీ, సరైనది అన్నదిగాని అధిమానవులు అనబడే బ్రాహ్మణుల ప్రయోజనాలను కాపాడేట టువంటిది మాత్రమే. ఏదైనా విషయం అర్థమవడం అంటే కనుగొనబడడమేనని ఆస్కార్‌వైల్డ్ అంటాడు. అయితే తన ఆంతర్యం కనుక్కోబడుతున్నదని మనువు భయపడటంగానీ, సిగ్గు పడటంగానీ చేయలేదు. వాస్తవానికి అది కనుగొనబడుతుందిలెమ్మని మనువు వూరుకోలేదు. అధిమానవులు ఎవరో, ఆ అధిమానవుల ప్రయోజనాలను కాపాడేది ఏదైతే వుందో అది మాత్రమే మంచిది అనీ అదే సరైనది అనీ మనువు ఎంతో దర్పంగా, తిరిగితిరిగి నొక్కి వక్కాణిస్తాడు. మనువు చెప్పిన ఆమాటలివిగో ఉదహరిస్తున్నాను చూడండి:

"వర్ణం చేత అధికుడవటం వల్లనూ, బ్రహ్మ (శ్రేష్టావయవమైన) ముఖం నుంచి పుట్టటం వల్లనూ, వేదపఠనాది సంస్కార విశేషం వల్లనూ, తత్తద్వర్ణాను సారంగా కర్మలూ, వృత్తులూ ఉపదేశించటానికి బ్రాహ్మణుడే ప్రభువగుచున్నాడు". (10–3)

తాను చెప్పిన హేతువుల్ని ఇంకా స్పష్టంగా విశదీకరిస్తూ, విలక్షణమైన పద్ధతిలో మనువు ఇంకా ఈ విధంగా చెప్పాడు.

"బ్రహ్మ (ప్రజాపతి భగవంతుడు) ముఖం నుంచి పుట్టటం వల్లనూ, క్షత్రియాదుల కంటె ముందు పుట్టటం వల్లనూ, వేదాన్ని ధరించటం వల్లనూ, యీజగత్తు కంతటికీ ధర్మానుశాసనం వల్ల బ్రాహ్మణుడు ప్రభువు." (1–93)

"స్వాయంభువు (భగవంతుడు–బ్రహ్మ) తపస్సు చేసి, బ్రాహ్మణుడి ద్వారా దేవతలకు, పితృదేవతలకు హవ్యకవ్యాలను నడపటానికీ, ఈ సమస్త విశ్వం యొక్క రక్షణకోసం బ్రాహ్మ ణుణ్ణి ముందుగా సృజించాడు"(1–94)

"ఏ బ్రాహ్మణుని యొక్క ముఖం ద్వారా హవ్యాలను దేవతలూ, కవ్యాలను పితృదే వతలూ ఎల్లప్పుడును భక్షింతురో ఆ బ్రాహ్మణుని కంటే అధికమైన భూతం మరేది ఉంది? బ్రాహ్మణుడందరి కంటే అధికుడని అర్థం." (1–95)

"స్థావర జంగమ భూతాలలో ప్రాణులు శ్రేష్ఠాలు. ప్రాణులలో బుద్ధిచేత జీవించునవి అనగా అనుకూలమైన స్థలాలకు పోవడము, ప్రతికూలమైన స్థలాలను విడవడము అనే లక్ష ణాలున్న పశువులు మొదలైనవి శ్రేష్ఠములు. వాటికంటే మనుష్యులు శ్రేష్ఠులు. మనుష్యులలో బ్రాహ్మణులు స్వర్గాప వర్గాధికార యోగ్యులగుట వల్ల ఉత్తములని చెప్పబడిరి." (1–96)

మనువు పేర్కొన్న కారణాలను అలా వుంచగా, బ్రహ్మముఖం నుంచి పుట్టాడు కాబట్టి బ్రాహ్మణుడు మొదటి తరగతికి చెందుతాడు. ఆక్రమం కారణంగానే అతడి ద్వారానే దేవతలకు, పితృదేవతలకు హవ్యకవ్యాలు అందించ బడతాయి. బ్రాహ్మణుల ఆధిక్యానికి మనువు మరొక కారణాన్ని పేర్కొన్నాడు. అతని మాటలివి.

"బ్రాహ్మణుని పుట్టుకే నాశరహితమగు ధర్మం యొక్క (వేదము యొక్క) మూర్తి. ఎందుకంటే అతడు పవిత్ర ధర్మాన్ని పరిపూర్తి చేయుటకే పుట్టినాడు. అందువలన అతడు బ్రహ్మ ( భగవంతుని) లాంటి వాడవుతున్నాడు." (1–98)

"సర్వ భూతముల ధర్మమును ధనరాశిని రక్షించటానికి ఈశ్వరుడు భూమిలో బ్రాహ్మ ణుడై జన్మిస్తున్నాడు."(1–99)

మనువు ఈ క్రింది విధంగా చెప్పి తన మాటను పూర్తి చేస్తున్నాడు.

"ప్రపంచంలో ఏదయితే ఉందో అది అంతా బ్రాహ్మణుని ఆస్తే. బ్రహ్మముఖం నుంచి

పుట్టటం వలనను, శ్రేష్టత్వం వలననూ సర్వం గ్రహించటానికి అతడు వాస్తవంగా అర్హుడవుచు న్నాడు." (1–100)

మనువు ఇలా నిర్దేశించాడు.

"రాజు ప్రొద్దుటే లేచి మూడు వేదాలలోను, నీతి శాస్త్రంలోనుపండితులైన వృద్ధులైన విద్వాంసులను పూజించాలి. వారి ప్రజ్ఞలకు లోబడి ప్రవర్తించాలి. (7–37)

"ప్రతి రోజూ వేదార్థ వేత్తలును, వయస్సుచేతను, తపస్సుచేతను వృద్ధులును, శౌచా చార సంపన్నులు అయిన బ్రాహ్మణులను సేవించాలి. ఆవిధంగా వృద్ధులను సేవించు వానిని రాక్షసులు కూడా ఎల్లప్పుడూ పూజిస్తారు." (7–38)

"ధనాగారం వట్టిపోవటం చేత గొప్ప ఆపద పొందినప్పటికీ, రాజు బ్రాహ్మణులకు కోపం తెప్పించకూడదు. ఆ బ్రాహ్మణులు కోపించినట్లైతే శాపాభిచారాలతో సబలవాహనుడయిన రాజును నశింపజేస్తారు. అది యుక్తమే కదా!" (9–313)

చివరగా మనువు ఇంకా ఇలా చెప్పాడు.

"బ్రాహ్మణుదు (ఇక్కడనుంచి) (ఈ ప్రపంచానికి) సృష్టికర్తగా ప్రకటింపబడినాడు. అతడు శిక్షకుడు, అతడు గురువు, (అంతేకాదు) సకల భూతములకు మేలును కలుగ చేయువాడు. అతనికి అనిష్టంగ ఎవరూ ఏమీ పలుకరాదు. అతని పట్ల ఎవరూ నిందా వాక్యములు పలుకరాదు." (11–35)

ఏది సరైనదీ, ఏది మంచిది అనే విషయమై అధిమానవ సిద్ధాంతాన్ని ముగించి, పూర్తి చేయటానికి ముందు మనువు పేర్కొన్న రెండు విషయాల్ని నేను ఉదాహరిస్తున్నాను.

"ఆ శూద్రుడు స్వర్గ ప్రాప్తికిగాని, ఇహపరములు రెంటికి గానీ బ్రాహ్మణుని సేవించాలి. దానివల్ల అతడు బ్రాహ్మణ సేవకుడని పిలువబడతాడు. దానివల్ల అతడు తన జీవిత లక్ష్యాలను సాధించు కుంటాడు." (10–122)

"శూద్రునకు ఇతర కర్మం కంటే బ్రాహ్మణ సేవ ప్రకృష్టమని కర్మ శాస్త్రంలో చెప్పబడింది. దీనికంటే వేరు విధంగా ఏమిచేసినా అతనికది నిష్ఫలమవుతుంది." (10–123)

మనువు ఇంకా ఇలా చెప్పాడు

"శూద్రుడు ధనాన్ని కూడబెట్టటానికి సమర్థుడైనప్పటికీ, అతడు కూడబెట్టగూడదు. ఆ

విధంగా అతడు డబ్బును కూడబెట్టినట్లైతే, దాని మూలంగా బ్రాహ్మణుడికి బాధ కలిగిస్తాడు." (10–129)

మనువు పైన పేర్కొన్న రెండు విషయాలు హిందూమత తత్వ సారాన్ని, హృదయాన్ని ఆవిష్కరిస్తాయి. అధిమానవునికి హిందూమతం పరమ ప్రామాణిక గ్రంథం (Gospel). అది అధిమానవునికి మాత్రమే ఏది మంచో బోధిస్తుంది. ఆ అధిమానవుడికి సంబంధించి దాన్నిమాత్రము నైతికంగా సరైందనీ, నైతికంగా శ్రేష్టమయిందనీ చెబుతుంది.

దీనితో సమాంతరమయిన తత్వం మరెక్కడయినా ఉందా? దాన్ని సూచించటానికి నేను అసహ్యించు కుంటాను. కానీ అది చాలా స్పష్టమయింది. హిందూమత తత్వంతో సమాంతరమైన దాన్ని మనం నీషేలో చూడగలం. ఈ విధమైన సూచనపట్ల హిందువులు ఆగ్రహోదగ్రులు కావచ్చు. అది సహజం కూడా! ఎందుకంటే నీషే తత్వం గొప్ప అపవాదుకు గురయింది కాబట్టి. అదెప్పుడూ వేరులు నాటుకోలేదు. నీషే మాటల్లోనే అతను "రాజవంశ భూస్వామ్య తత్వవేత్తగాను, ఒక్కోసారి విదూషకుడిగాను, ఒక్కొక్కప్పుడు జాలి పడవలసిన వాడిగాను, మరొకప్పుడు మానవత్వం లేని మనిషిగా సమాజం నుంచి బహిష్కృతుడయ్యేవాడు." అధికారవాంఛ, హింస, ఆధ్యాత్మిక విలువల నిరాకరణ, అధిమానవుడు, యజ్ఞం, బానిసత్వం, సామాన్యుణ్ణి తక్కువ చేసి చూడటం అనేవి నీషే దార్శనికతలోని విషయాలుగా గుర్తించవచ్చు. ఈ విధమైన తన ఉన్నత లక్షణాలతో కూడిన తత్వబోధనల ద్వారా నీషే తన తరం నాటి ప్రజల్లో అసహ్యభావం, భయానక వాతావరణాన్ని సృష్టించాడు. ప్రజలు అతని బోధనల నుంచి తప్పించుకోలేక పోయినా, అతణ్ణి పూర్తిగా నిరాదరించేవారు. ఆ పరిస్థితులలో నీషే తనకు తానుగా తనను చనిపోయిన వ్యక్తులలో కలుపుకొని ఎంతో తృప్తిని పొందాడు. శతాబ్దాల తర్వాతనైనా తనని, తన ఔన్నత్యాన్ని ప్రశంసించే ప్రజలు తప్పక ఉంటారని నీషే భవిష్యద్దర్శనం చేశాడు. అయితే ఈ విషయంలో కూడా దురదృష్ట వశాత్తు నీషే తీవ్ర ఆశాభంగానికి గురి అయ్యాడు. నీషే అనంతర కాలంలో అతని దార్శనికత ప్రజల్లో గుర్తింపు పొందటానికి బదులుగా, అతని సమకాలీన ప్రజలలో ఏవిధంగా భయాన్ని, అసహ్యాన్ని కలిగించిందో అలాంటి భావాన్నే పెంపొందించింది. నీషే దార్శనికత నాజిజాన్ని సృష్టించగల సామర్థ్యం గలదన్న కళ్ళు తెరిపించే మాటే దీనికి మూలకారణం. అటువంటి దార్శనిక నిర్మాణాన్ని నీషే స్నేహితులే తీవ్రంగా వ్యతిరేకించారు.[23] అధిమానవుడిని ఉన్నతస్థితి కల్పించే విషయాన్ని అనువర్తింపచేసే నీషే దార్శనికతను గుర్తించటం అంత కష్టమైన విషయం ఏమీకాదు. నాజీలు చేసింది కూడా ఇదే – ఏది ఏమైనా నాజీలు తమ మూలాన్ని నీషేలో చూడగలిగారు. అతణ్ణి తమ ఆధ్యాత్మికపితగా గౌరవించారు. నీషే బస్ట్ సైజు ఫోటోగ్రాఫ్‌ని పక్కన పెట్టుకుని హిట్లర్ తనంతతాను ఒక ఫోటో తీయించుకున్నాడు. తాను గురువుగా భావించే నీషే రాత ప్రతులనన్నింటిని స్వాధీనం చేసికొని, తన అధీనంలో పెట్టుకున్నాడు. నాజీజమ్ ఉత్సవాల్లో, 'నూతన జర్మనీ విశ్వాసం'గా నీషే రచనల్లో నుంచి ఏరితీసిన భాగాలను ఉద్ఘోషించేవారు. నీషే సమీప బంధువులు కూడా నీషేను నాజీలు తమ ఆధ్యాత్మిక వంశపారంపర్య కర్తగా ప్రకటించు కోవటాన్ని నిరాకరించలేదు. నీషే

దగ్గర బంధువైన రిచర్డ్ డిహ్లర్ నీషే ఆలోచనలకు క్రియారూపం హిట్లరని ఆమోదయోగ్యంగా పలికాడు. అంతే కాదు నాజీలు గద్దె ఎక్కటానికి అవసరమైన భావజాలాన్ని అందించిన అత్యున్నత మార్గదర్శి నీషేనే. జరాతుష్ట్రుడు ముందే పేర్కొన్న "అధిమానవుని" అవతరణాన్ని తాను తన సోదరునిలో చూడగలిగాననీ, ఫ్యూర్‌హర్ తన సోదరుడికి సన్మానాన్ని దయతో ప్రసాదించినందుకు సంతసిస్తూ, తన మరణానికి కొద్దిరోజుల ముందు నీషే చెల్లెలు అతణ్ణి (ఫ్యూర్‌హర్)ని అభినందించింది.

ఎవరి పేరు, ఎవరి దార్శనికత ప్రజల్లో భయాన్ని, అసహ్యాన్ని కలిగించి ఉద్రేకపరచాయో, ఆ నీషేని మనువుతో సమానంగా గుర్తించటం హిందువుల మనసుల్లో ఆశ్చర్యానికి, ఆగ్రహాన్ని కలిగించటానికి కారణమవుతుందనటంలో సందేహం లేదు. తన దార్శనిక సిద్ధాంతంలో మనువు ప్రణాళికను మాత్రమే తాను అనుసరిస్తున్నానని నీషే తనంత తానుగా బహిరంగంగా ప్రకటించుకున్నాడు. తన 'యాంటిక్రైస్ట్' అన్న గ్రంథంలో నీషే ఏమీ చెప్పాడో గమనించండి.

"అసలు విషయం ఏమిటంటే అసత్యాలు ఏస్థాయి దాటి దుష్కార్యాలు చేస్తాయన్నది సమస్య. వాస్తవానికి, క్రైస్తవంలో 'పవిత్ర' లక్ష్యాలు పూర్తిగా లోపించాయి. అది ఉపయోగించే సాధనాలను గురించే నా వ్యతిరేకత అంతా. దీని లక్ష్యాలన్నీ కేవలం చెడ్డ లక్ష్యాలే. జీవితాన్ని విషమయం చేయడం, త్యజించడం, శరీరాన్ని దూషించడం వగైరాలు ఇందులో ఉన్నాయి. తనకు తాను తనను తక్కువగా చూసుకోవడం, పాపం చేస్తానేమో నన్న భయంతో మనిషి తనను తాను మలినం కావడం క్రైస్తవంలో ఉంది. అందుకే దానిలో పేర్కొన్న సాధనాలను (మార్గాలను) చెడ్డవిగా నేను పేర్కొన్నాను. అయితే మనుధర్మ శాస్త్రం చదివినప్పుడు నా ఆలోచనలు దీనికి విరుద్ధంగా ఉన్నాయి. అంతటి గొప్ప గ్రంథాన్ని, మేధలోంచి పుట్టుకొచ్చిన మహా ప్రభంజనాన్ని బైబిల్‌తో సమానంగా పరిపోల్చడం ఆత్మవంచనే అవుతుంది. అయితే అందులో తాత్త్విక భావన ఎందుకు దాగివుందో ప్రతి ఒక్కరూ గ్రహించి చెప్పవచ్చు. యూదు వాసన గల 'రాబినిజం', అంధ విశ్వాసాల వడపోత కార్యక్రమంతో పాటు, మనస్తత్వ శాస్త్రజ్ఞులకు సహితం అంతు చిక్కని చెడును పసిగట్టడం వంటి ఎన్నో విషయాలు దానిలో ఉన్నాయి. మరచిపోలేని మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే – ఇది బైబిల్‌కంటే మౌలికంగా భిన్నమైనటువంటిది. దీనిద్వారా కులీనవర్గం, తత్వవేత్తలు, యుద్ధవీరులు ప్రజాసమూహాల్ని రక్షించి పర్యవేక్షిస్తుంటారు. ఇది గొప్ప విలువలకు ప్రతిరూపం. ఇది జీవితం పట్ల గొప్ప ఆనందాతిరేకమైన భావాన్ని కలిగిస్తుంది. గ్రంథం అంతటా మేధ సూర్యకాంతిలా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. క్రైస్తవం హేయమైన రీతిలో దూషించిన సంతానోత్పత్తి, స్త్రీలు, పెళ్ళి వంటి విషయాలపై ఈ గ్రంథం ఆరాధనాభావాన్నీ, ప్రేమను, నమ్మకాన్నీ ప్రదర్శించింది. "విశృంఖలతను నివారించడానికి ప్రతి పురుషునికీ సొంత భార్య వుండాలి, ప్రతి స్త్రీకీ సొంత భర్త వుండాలి. దహించుకుపోవడం కంటె పెళ్ళి నయం" వంటి అవినీతికరమైన మాటలున్న పుస్తకాన్ని ఎవరైనా పిల్లలకూ, స్త్రీలకూ ఎలా అందివ్వగలరు? మనిషి మూలమే క్రైస్తవీకరణం చెందినప్పుడు, అంటే కన్యా మాతృత్వం అన్న దశకు గురి అవుతున్నప్పుడు క్రైస్తవులుగా వుండడం సబబేనా?... మనుస్మృతిలో వలె స్త్రీల గురించి సున్నితంగా, కరుణాపూరితంగా చెప్పిన గ్రంథం మరొకటి నాకు తెలియదు; ఈ వృద్ధ మునులకు,

పన్యాసులకు స్త్రీలంటే అమితమైన ధీరోదాత్త ప్రేమ. "స్త్రీల నోరూ, కన్య వక్షస్థలం, శిశువుల ప్రార్థన, యజ్ఞధూమం ఎల్లప్పుడూ స్వచ్ఛమైనవి" అని మనువు ఒక సందర్భంలో అంటాడు. సూర్యకాంతి, గోఛాయ, ఆకాశగంగ, అగ్ని, కన్యశ్వాస వంటి స్వచ్ఛమైనవి ఏవీలేవని మనువు మరో సందర్భంలో అంటాడు. "మానవ శరీరంలో నాభికి ఎగువన ఉన్నవన్నీ స్వచ్ఛమైనవి, నాభికి దిగువవన్నీ మలినమైనవి. కన్య విషయంలో మాత్రమే శరీరమంతా స్వచ్ఛమైనది"–బహుశా అంతిమంగా ఇదొక పవిత్ర అబద్ధం కావచ్చు.

జరాతుష్ట్రుడు అనేది మనువుకు మరో (కొత్త) పేరు అనడంలో సందేహం ఏమైనా ఉందా? "జరాతుష్ట్ర ఉవాచ" (Thus Speake Zarathrustra) అనేది మను స్మృతికి పాతాం తరం అని అనడంలో సందేహం ఏమైనా ఉందా?

ఒకవేళ మనువు నీషేల మధ్య వ్యత్యాసం ఏదేనా ఉంటే అది ఇది–ఇప్పుడున్న మానవ జాతితో పోల్చిచూస్తే (అంతకంటె ఉన్నతమైన) అధిమానవజాతికి చెందిన ఒక నూతన జాతిని రూపొందించాలనేది నీషే అభీష్టం. నీషే ఇలా చెప్తే, దీనికి వ్యతిరేకంగా మనువు అధిమానవుల మనుకునే ఒక వర్గం అక్రమ హోదాను కాపాడే విషయంలో ఎన్నో జాగరూకతలు తీసుకున్నాడు. నీషే పేర్కొన్న అధిమానవులు వారి యోగ్యత వల్ల అధిమానవులు అయినవారు. కానీ మనువు పేర్కొన్న అధిమానవులు వారి పుట్టుక కారణంగా అధిమానవులు. నీషే యదార్థంగా నిరాసక్త తత్వవేత్త. దీనికి విరుద్ధంగా – ఏ వర్గమైతే యోగ్యతను కోల్పోయినప్పటికీ 'అధిమానవ' బిరుదాన్ని కోల్పోదో అలాంటి సమూహంలో పుట్టిన వర్గం వారి ప్రయోజనాల్ని కాపాడటమనే తత్వాన్నే ప్రధాన ధ్యేయంగా పెట్టుకుని వారి తరఫున 'గుత్తకు తీసుకొని కూలిపనిచేసే' కూలీ లాంటివాడు మనువు.

మనుధర్మ శాస్త్రంలోని సూత్రాలను పోల్చి చూడండి

"బ్రాహ్మణుడు పైన పేర్కొన్న విధుల ప్రకారం జీవించలేకపోతే అతడు సైనికునిగా జీవించవచ్చు. ఎందుకంటే ఆ వృత్తి తరువాత శ్రేణిది కనుక" (10–81)

"ఒకవేళ అతడు పురోహితుడుగా, సైనికుడుగా (అంటేపైన చెప్పిన రెండు వృత్తుల ద్వారా) జీవించలేని పక్షాన, వ్యాపారస్తునిగా (వ్యాపారిగా) జీవించవచ్చు. అతడే భూమిని దున్ని, పశువులను కాయవచ్చు." (10–82)

మనువు దీన్ని ఇంకా ఇలా చెప్పాడు.

"వేదిక యందు ఆహితమైన, అనాహితమైన అగ్నియెట్లు మహాదేవతో అట్లే మూర్ఖుడైనా విద్వాంసుడైనా బ్రాహ్మణుడు ప్రకృష్టమైన దేవత అని తెలుసుకోవాలి." (9–317)

"ఈ విధంగా, బ్రాహ్మణుడు తనంతట తాను ఎంతటి నీచమైన వృత్తిని చేపట్టినను, అతడు అన్ని రకాలా పూజ్యుడే. ఎందువల్ల నంటే వారిలో ప్రతివాడు ఒక దేవతే కాబట్టి." (9-318)

నీషేతో సరిపోల్చి చూసినప్పుడు అధిమానవుని విషయంలో మనువు తత్వం భ్రష్టమైన, హీనమైనదీను. అందువల్ల నీషే దార్శనికత కంటే కూడా మనువు తాత్వికత మరింత అసహ్యమైంది. సిగ్గుచేటు కలిగించేది.

హిందూమత తత్వం ఎందుకు అటు న్యాయ సంబంధమైన పరీక్షనుగాని, ప్రయోజన సంబంధమైన పరీక్షను గాని సంతృప్తి పరచ లేక పోయిందో ఇది వివరిస్తుంది. హిందూమతం సామాన్యుడి పట్ల ఏవిధమైన ఆసక్తిని ప్రదర్శించలేదు. అది సమాజం మొత్తాన్ని కూడా దృష్టిలో పెట్టుకోలేదు. దాని కేంద్ర బిందువు ఒక వర్గ ప్రయోజనమే. దాని తత్వానికి సంబంధించినంత వరకు అది ఆ వర్గం వారి హక్కులకు అండగా నిలిచి, అది కాపాడటానికి కంకణం కట్టుకుంది. ఈ కారణం చేతనే హిందు మతతత్వంలో సామాన్య ప్రజల ప్రయోజనాలు గాని, సంఘ ప్రయోజనాలు గాని నిరాకరింప బడటం జరిగింది. అది అధిమానవుల ప్రయోజనాన్ని కాపాడటానికి జన, సంఘ ప్రయోజనాన్ని కాలరాసింది. బలిపెట్టింది.

ఇలాంటి మతంతో మనిషికి పనేమిటి?

మతంగా పాజిటివిజమ్ యోగ్యతలను గురించి మాట్లాడుతూ బల్‌ఫోర్ ప్రత్యక్షయిక దర్శనవాదుల్ని కొన్ని ప్రశ్నలడిగాడు. ఆ ప్రశ్నలకున్న విశిష్టత దృష్టిలో పెట్టుకొని వీటిని మరలా మనం వేసుకుందాం. ఎంతో సందర్భోచితంగా అతడిలా అడుగుతాడు.

"నిత్యజీవన అవసరాల కోసం, చిన్నచిన్న ప్రయోజనాల కోసం తలమునకలై నిరంతర పోరాటం చేసే జనావళి హెచ్చు అంధకారంలో వుంది. ప్రత్యక్షయిక దర్శనవాదం (POSITIVISM) వారికేం చెబుతుంది? "మానవత" అనే మహా నాటకంలో తాము ధరించవలసిన పాత్రల గురించి పట్టించుకునే విరామం కానీ తీరికగానీ లేని వారికి, 'మానవత' ప్రయోజనాలేమిటో, ప్రాముఖ్యం ఏమిటో తెలుసుకోలేని వారికి పాజిటివిజమ్ ఏం చెబుతుంది? స్వర్గలోకాలను సృష్టించిన భగవంతుని దృష్టిలో ఏ మానవుడూ అప్రధానుడు కాదనీ, అపార శక్తి సామర్ధ్యాలు లేనివాడు కాదనీ, బలహీనుడు కాదనీ, మానవుని చర్యలకు భౌతిక ప్రపంచం వినాశనానంతరం కూడా పర్యవసానాలుంటాయనీ చెప్పగలరా? అణగారినవారికి ఓదార్పునూ, బలహీనులకు బలాన్నీ, పాపులకు క్షమాపణలనూ, అలసిసొలసిన వారికి విశ్రాంతినీ పాజిటివిజమ్ ఇవ్వగలదా?"

ఇదే ప్రశ్న మనువు విషయంలో కూడా అడుగవచ్చు.

ప్రతి ప్రశ్నకూ అవుననే సమాధానం రావాలి.

సూక్ష్మంగా చెప్పాలంటే హిందూమత తత్వం ఎలాంటిదంటే దాన్నెప్పుడూ మానవత్వంగల మతంగా పిలవ లేనటువంటిది. బెల్‌ఫోర్ మాటల్ని వాడటానికి కారణం ఇదే. హిందూమతం అదెంతగా (జనంలోకి) చొచ్చుకు పోయినప్పటికీ, మామూలు మానవత్వ అంతరాంతర జీవితాన్ని చిట్టెం కట్టించ లేక పోయింది. వాస్తవంగా అది ఏమైనా చేసిందంటే – దాన్ని స్తంభింప చేసింది. హిందూమతంలో సాధారణ మానవ హృదయాలకు పుష్టి (జవసత్వాలు) లేదు. (లేవు) మామూలు మానవుడి బాధలకు ఏమాత్రం పరిష్కారం (సుఖం) లేదు. సాధారణ మానవ బలహీనతలకు ఆసరా లేదు. అది మనుషులను అంధకారంలో, అంధకారం నుంచే పుట్టిన మొరటు ప్రాకృతిక శక్తులకు ముఖాముఖీగా విలబెట్టింది. ఆ శక్తులతో వారు ఎన్నో విరర్థక పోరాటాలు చేశారు. బలి అయ్యారు. అత్యంత మొరటు మతరాహిత్యం కంటె ఇది తక్కువ క్రూరత్వం కాదు. హిందూమతం భగవంతునితో మనుషుల సమస్త సంబంధాలను తెంచివేసింది.

హిందూమత తత్వం అలాంటిది. అది అధిమానవుల స్వర్గం. సామాన్యమానవునికి అధోలోకం.

హిందూమత తత్వంపై నేను వెలిబుచ్చిన అభిప్రాయాలపై వేర్వేరు కోణాల నుంచి ఆక్షేపణలు వస్తాయని నాకు తెలుసు. ఇవి ప్రస్తుతం చెలామణీలో ఉన్న అభిప్రాయాలకు విరుద్ధంగా ఉన్నందున విమర్శ తప్పదు. అనేక వైపులనుంచి ఆ దాడి జరుగవచ్చు.

హిందూమత (ప్రామాణిక) గ్రంథంగా మనస్మృతిని గ్రహించటం నేను చేసిన తప్పని కొందరు అంటారు. హిందూమతానికి వాస్తవంగా పరమ ప్రామాణిక గ్రంథాలు వేదాలు, భగవద్గీత అని వారి అభిప్రాయం.

ఏ సనాతన హిందువుకు కూడా హిందూ మత ప్రామాణిక గ్రంథంగా మనుస్మృతిని తోసిరాజనే ధైర్యం ఉందని నేననుకోను. ఆర్య సామాజికుల లాంటి కొందరు హిందూ సంస్కరణవాద తెగలు మాత్రమే అలాంటి అభిప్రాయాన్ని ప్రకటించటం జరిగింది. కానీ ఈ అభిప్రాయం వాస్తవాన్ని దర్శించినటువంటిది కాదు. ఈ అభిప్రాయాన్ని ఖండించాలంటే, హిందువులలో స్మృతులు ఎలా స్థానాన్ని, స్థాయిని సంపాదించాయో బహుశా వివరించవలసిన[24] అవసరం ఉందనుకుంటాను.

అసలు స్మృతులు వాస్తవంగా వేద వేత్తలైన పండితులచే ఆమోదించబడి, సిఫార్సు చేయబడిన సామాజిక సంప్రదాయాలు, ఆచారాలు, మత సంప్రదాయాలకు చెందిన సూత్రాల సంగ్రహం. ఈ వేద విద్వాంసుల జ్ఞాపకంలోనే ఈ సూత్రాలు చాలా కాలం ఉండి పోయాయి. అందువలననే అవి స్మృతులని పిలువబడినవి. అనగా గుర్తుంచుకొను విషయాలు. దీనికి

విరుద్ధమైనవి శ్రుతులు. అనగా వేదసూత్రాలు, వినదగిన విషయాలు. స్మృతులలోని సూత్రాలు కూర్చబడిన తొలిదశలో వేదాల సూత్రాలతో పోల్చి చూస్తే అవి తక్కువ విలువగలవే.

వినికిడివి, కేవలం గుర్తుంచుకోటాన్నీ రెండింటిని పోల్చి చూస్తే వాటి వాటి శ్రేష్టత్వం, వాటికున్న అధికారం, అవి మానవుల్ని నిబద్ధుల్ని చేసే విధానం వీటినిబట్టి ఏర్పడిన సహజ ఫలితమని తెలుస్తోంది. ఈ రెండు రకాలైన ధర్మశాస్త్ర వాఙ్మయంలో ఈవిధమైన విభేదం ఏర్పడటానికి మరో కారణం కూడా వుంది. ఇది ఆయా గ్రంథాల రచయితల హోదా మీద ఆధారపడినటువంటిది. వేదాల కర్తలు ఋషులు. స్మృతికర్తలు కేవలం విద్వాంసులు. కేవల విద్వాంసులకంటే ఋషులు హోదాలోను, పావిత్ర్యంలోను ఉన్నతులు. దీని ఫలితంగా స్మృతులకంటే వేదాలు అధికారికాలు, ప్రామాణికాలు అయ్యాయి.

దీనినుంచి ఏర్పడ్డ పర్యవసానం హిందూ ధర్మశాస్త్ర ప్రణాళికలో చక్కగావ్యక్తం చేయబడింది. దానిప్రకారం ఒకే విషయం మీద రెండువేదాలలోని సూత్రాలకు వైరుధ్యం ఏర్పడితే ఒక దానిలోవి సూత్రాన్ని ప్రామాణికంగా గ్రహించడానికి అనుమతించబడింది. అంతేకాని వేదాలు వర్తించడం లేదు అని భావించకూడదు. దానికి బదులుగా స్మృతి శ్రుతులలోని సూత్రాల మధ్య వైరుధ్యమేర్పడితే స్మృతిసూత్రాలు శ్రుతి సూత్రాలకంటే ప్రామాణికంగా తక్కువైనవి కాబట్టి శ్రుతి మాత్రమే నిలుస్తుంది. కానీ ప్రొఫెసర్ ఆల్టేకర్ పేర్కొన్నట్లుగా "కాలాంతరంలోవేదాలకు ఎలాంటి ప్రామాణికత ఉందో, అలాంటి ప్రాముఖ్యత స్మృతులకు కూడా కల్పించబడింది. ఈ ప్రయోజనాన్ని సాధించడానికి అనేక రకాలైన పద్ధతులు అవలంభింపబడినవి. వానిలో మొదటగా స్మృతికర్తల స్థాయి ఋషుల స్థాయికి ఉన్నతీకరించబడింది. తొలితరం ధర్మశాస్త్రకర్తలైన గౌతమ, బోధాయనులకు ఋషుల హోదా ఇవ్వడం ఎన్నడూ జరగలేదు. కానీ మనువు, యాజ్ఞవల్క్యులు ఋషులుగా పరిగణింపబడ్డారు. ఈ ప్రక్రియ వల్ల స్మృతుల స్థాయిని వేదాల స్థాయితో సమానం చేయటం జరిగింది. స్మృతులను శ్రుతుల జ్ఞాపకాల రికార్డుగా పరిగణించడం రెండవ ప్రక్రియ. ఈ విధంగా స్మృతి – శ్రుతి కంటే పూర్తిగా భిన్నమైంది అనే విషయానికి బదులుగా, శ్రుతి నుంచి అది విడదీయరానిది, దీనిలోని భాగమైన సన్నిహిత సంబంధం కలదిగా గుర్తించబడింది. దీని ఫలితంగా శ్రుతి, స్మృతి సూత్రాల ప్రామాణికత విషయంలో సంపూర్ణమైన మార్పు వచ్చింది. వాస్తవంగా మొదట్లో శ్రుతి, స్మృతి సూత్రాల విషయంలో వివాదం ఏర్పడితే శ్రుతి సూత్రాలకు చెల్లుబాటు వుండేది. ఇప్పుడు స్మృతి సూత్రాలకు కూడా సమాన విలువ ఏర్పడింది. ఈ కొత్త నిబంధన కుమారిలభట్టు ప్రతిపాదించింది. అతడు తన పూర్వ మీమాంసా సూత్ర వ్యాఖ్యానంలో శ్రుతులు ఎంతటి ప్రామాణికాలో, స్మృతులు కూడా అంతటి ప్రామాణికాలే అనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

హిందూ సమాజం వేదసూత్రాలకే వాస్తవంగా మొదట్లో నిబద్ధమై వున్నప్పుడు, వేదాలకు వ్యతిరేకమైన మరే సూత్రాన్ని అనుసరించటం, ఆచరించటం జరగలేదు. కానీ ఈ కొత్త నిబంధన ఆ పాత సూత్రాన్ని మార్చివేసింది. దీని ప్రకారం సమాజం అటు శ్రుతి గాని ఇటు స్మృతిగానీ

దేన్నైనా అనుసరించ వచ్చు. రెండింటిలో ఏ ఒక్కదాని ప్రకారం అయినా ఆచరించవచ్చు. కానీ తర్వాత కాలంలో రెండింటిలో ఒకదాన్ని ఎంచుకునే ఈ విధానానికి కూడా తిలోదకాలివ్వబడ్డాయి. శ్రుతుల అధ్యయనం ఎంత తప్పనిసరో, అలాగే స్మృతులను చదవటం కూడా అంతటి తప్పనిసరి స్థితి ఎప్పుడైతే చేయబడిందో, దాని ఫలితంగా ఈ పరిస్థితి ఏర్పడింది.

ఈ ప్రక్రియంతా క్రమక్రమంగా జరిగింది. మొదటగా, బ్రాహ్మణునకు శ్రుతులు స్మృతులు రెండూ రెండు కళ్ళుగా చెప్పబడినవి. ఈ రెండింటిలో దేన్ని నిరాకరించినా అతడు 'ఏకాక్షి' (ఒంటి కంటివాడు) అవుతాడు. ఆ తర్వాత శ్రుతి, స్మృతి రెండింటిని కలిపి చదవటం వల్లే బ్రాహ్మణ్యం సాధ్యమనే సిద్ధాంతం వ్యాప్తిలోకి వచ్చింది. చివరగా కేవలం స్మృత్యధ్యయనమే గుర్తింపబడినది. స్మృతిని ధిక్కరించటం పాపం గాను, అలా చేసిన వాడు దోషిగాను ప్రకటించ బడటమే కాదు ఆ పాప ఫలితంగా ఇరవై ఒక్క పర్యాయాలు పశుజన్మ ఎత్తుతాడని నిరసించారు.

హిందూమతానికి స్మృతులు ఎలా మూలాధారాలుగా గుర్తించబడినవో ఈ క్రమం తెలియచేస్తుంది. స్మృతులను గురించి ప్రొఫెసర్ ఆల్టేకర్ చెప్పినదాన్ని ఉటంకించడంలో సందేహం అక్కరలేదు. "ఆధునిక హిందూమతాభివృద్ధిని రూపు దిద్దటంలో – ముఖ్యంగా అనేకానేక సామాజిక, మతసంస్థల ఆచారాల లక్షణాలను నిర్ణయించటంలో స్మృతులు నిర్వహించిన పాత్ర మహత్తరమైంది."

కాబట్టి మనుస్మృతి హిందూ మత తాత్వికతను కలిగివుంది అని నేను గ్రహించటంలో తప్పు ఏమీ లేదు.

స్మృతులకు వేదాల స్థాయి కల్పించే పనిని స్వీకరించటానికి నూటికి నూరుపాళ్ళు బ్రాహ్మణుల స్వార్థమే కారణం. వర్ణసిద్ధాంతం, బ్రాహ్మణుల ఆధిక్యతా సిద్ధాంతం, వాళ్ళ హక్కులు, వాళ్ళ విశేషాధికారాలు, వైశ్యులు, క్షత్రియులు బ్రాహ్మణులకు లోబడినవారు అనే సిద్ధాంతం, శూద్రులకు అధమస్థాయిని నిర్దేశించిన సిద్ధాంతం మొదలైన వన్నీ స్మృతుల విశృంఖలమైన, విలాసవంతమైన పెరుగుదలలో ఒదిగిపోయాయి. స్మృతుల తత్వం ఇది ఎప్పుడైతే అయిందో, బ్రాహ్మణులు స్మృతులకు వేదాలకున్న అధికారాన్ని స్థాయిని కల్పించటానికి సహజంగానే అత్యధి కాసక్తిని ప్రదర్శించటం జరిగింది. దాని వల్ల కలిగిన అంతిమ ఫలితం ఏమిటంటే బ్రాహ్మణుల ప్రయోజనాలు సొంతంగా నెరవేరటం, దీనితో దేశం యావత్తు పతనమవటం సంభవించింది. సనాతన, పవిత్ర హిందువు ఆచరించే దాన్ని సమ్మతిస్తూ – స్మృతులు హిందూమత తత్వాన్ని కలిగిలేవనే అనుకుందాం. కానీ అదే (పైన స్మృతులు ఏమి చెబుతున్నాయని అనుకున్నామో అదే) వేదాలు, భగవద్గీతలలో కూడా అదే మనం చూడగలం. అలాంటప్పుడు అవి కలిగించేప్రయోజనంలో తేడా ఏముందనేది ప్రశ్న.

స్మృతుల్ని కాక వేదాల్ని లేక భగవద్గీతను పరిశీలిస్తే ఎవరికైనా పై విషయంలో అభిప్రాయభేదం కలుగుతుందని నేను అనుకోను.

మౌలికంగా స్మృతులు ఏమి చెప్పాయో, వాటి కంటే వేదాలు ఏమైనా భిన్నంగా బోధించాయా? స్మృతి నిర్దేశాల కంటే భగవద్గీత నిర్దేశాలు వ్యతిరేకంగా ఏమైనా ఉన్నాయా? కొన్ని ఉదాహరణలు పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్ల మవుతుంది.

పురుష సూక్తంగా గుర్తింపబడిన వేద భాగంలో చాతుర్వర్ణ్య సిద్ధాంతానికి ప్రాణ ప్రతిష్ట జరిగిందనేది నిర్వివాదమైన అంశం. ఈ పురుష సూక్తం మౌలికంగా రెండు ఆదర్శాలను గుర్తించింది. ఒక ఆదర్శంగా సమాజాన్ని నాలుగు వర్ణాలుగా విభజించటాన్ని అది ప్రతిపాదించింది. అంతే కాదు ఈ నాలుగు వర్ణాల మధ్య సంబంధం సమానత్వంతో కూడింది కాదని కూడా అది గుర్తించింది.

భగవద్గీత ఏమి బోధించింది అనే దాంట్లో కూడా ఏవిధమైన వాద వివాదాలు లేవు. భగవద్గీతలో కృష్ణుడు (అర్జునునికి) బోధించిన ఈ నాలుగు శ్లోకాలలో దాని సారాంశమంతా ఇమిడి వున్నది.

1. "నాచేత చాతుర్వర్ణ్య వ్యవస్థ (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలనే నాలుగు వర్ణాలతో సమాజం నాలుగు వర్గాలుగా విభజింప బడిన విధానము) – గుణకర్మ విభాగాలచొప్పున సృజింపబడినది. వారికి పుట్టుకను బట్టి ఆయా వృత్తులు నిర్దేశింప బడినవి. ఈ చాతుర్వర్ణాలకు కర్తను నేనే." (భగవద్గీత – అధ్యా.4 శ్లో.13)

2. " ఇతర వర్ణం యొక్క వృత్తిని ఆచరించటం తేలిక అయిననూ, తన వర్ణం వృత్తిని ఆచరించటంలో సామర్థ్యం లేకపోయినప్పటికీ,దాన్నే ఆచరించటం శ్రేష్ఠమైనటువంటిది. తన వృత్తినే ఆచరించేటప్పుడు మరణమైనా మేలే. స్వస్వ వర్ణాశ్రమ వ్యతిరిక్త పరధర్మము నరకపతనాది భయాన్ని పొందించునటువంటిది.(భగవద్గీత – 6.3 – శ్లో35)

3. "కర్మనందు ఆసక్తులైన చదువుకోని వారికి, చదువుకున్నవాడు బుద్ధిభేదము కలిగింపకూడదు. మరి ఏమిచేయాలంటే తాను పూనికతో తన వర్ణమునకు నిర్దిష్టమైన వృత్తిని చేస్తూ, వారిచేత కూడా వారి వారి వృత్తులను చేయించవలెను." (భవగద్గీత–3–26)

"ఎవరు ప్రకృతి గుణంచేత మోహమునొందినవారై ఫలం కోసం ఆ గుణాల యొక్క కర్మలందాసక్తుగులవుతారో అట్టి అవిద్యావంతులైన మందబుద్ధులకు చదువుకున్నవాడు బుద్ధి భేదం చేయరాదు. అంటే వారి వారి వృత్తులనుంచి వైదొలగించి వేరొక వృత్తులు ఆచరించేటట్లు చేయరాదు." (భగవద్గీత అధ్యా–3–శ్లో–29)

4. "ఓ అర్జునా! ఎప్పుడైతే మతవిధులకు, వృత్తులకు (అంటే చాతుర్వర్ణ మతానికి) పతనం ఏర్పడుతుందో, అప్పుడు నన్ను నేను సృష్టించుకుంటాను. దాని పతనానికి ఎవరు కారకులో వారిని శిక్షించి దానిని పునరుద్ధరిస్తాను." (భగవద్గీత అధ్యా–4 శ్లో–7,8)

భగవద్గీత పరిస్థితి ఇది. మనుస్మృతికి దీనికి వున్న భేదం ఏమిటి? సారాంశంలో గీత మనుధర్మశాస్త్రమే. ఎవరైతే మనుధర్మశాస్త్రానికి దూరంగా పోరిపోయి గీత దగ్గర ఆశ్రయం పొందుతారో, వారికి గీతను గురించి తెలియదనే అర్థం. అంతేకాదు మనుస్మృతి గీతతో ఆత్మీయ సంబంధం కలదనీ, గీత హృదయం అదే అని వీళ్ళు పరిగణించడానికి సిద్ధంగా లేరన్న మాట.

వేదాలు, భగవద్గీత చెప్పినవాటిని, హిందూ మతతాత్వికతను వివరించడానికి నేను పార్శ్య ప్రమాణంగా గ్రహించిన మనుస్మృతిలోని అంశాలను పోల్చి చూడండి. ఏమి తేడా కనిపిస్తుంది. ఒకే ఒక తేడా ఏమిటంటే, వేదాలు, భగవద్గీత స్థూల సిద్ధాంతాన్ని చెబితే, స్మృతులు ఆ సిద్ధాంతానికి ప్రత్యేక వివరణలు ఇచ్చాయి. సారాంశంలో మాత్రం స్మృతులు, వేదాలు, భగవద్గీత ఒకే అల్లికలోనివి. వాటిలోని అంతస్సూత్రం ఒకటే. అన్నీ ఒకే వస్త్రంలోని దారాలు.

ఇందుకు కారణం స్పష్టమే. ఉపనిషత్తులు మినహా తక్కిన హిందూ మత సాహిత్య సర్వస్వానికి రచయితలైన బ్రాహ్మణులు స్మృతులలో రూపొందించిన స్వీయ సిద్ధాంతాలను గీతలో వేదాలలో చొప్పించడానికి శ్రద్ధాసక్తులు ప్రదర్శించారు. కాబట్టి, వాటిలో ఏదో ఒకదానిని ఎత్తిచూపడం, వంచుకోవడంలో ప్రయోజనం ఏమీలేదు. హిందూమత ప్రమాణ గ్రంథంగా మనుస్మృతిని తీసుకున్నా, వేదాలను తీసుకున్నా, భగవద్గీతను తీసుకున్నా మతతాత్వికత ఒకటే అవుతుంది.

ఇక రెండవ అభ్యంతరం ఏమిటంటే మనుస్మృతి నీతి సూత్రాలను ప్రబోధించే గ్రంధమే కాని, నైతిక నియమాల అనుశాసనం కాదనీ, అందువల్ల హిందూ మతతత్వం మీద నేను ప్రకటించిన విషయంలో కేవలం న్యాయపరమైన (legal)తాత్విక విషయమేకానీ, హిందూ మత నైతికతత్వ విషయం లేదనేది.

ఈ అభ్యంతరానికి నా సమాధానం చాలా తేలికైనది. హిందూ మతంలో న్యాయపరమైన తత్వానికీ, నైతిక తత్వ విషయానికి మధ్య ఏ విధమైన భేదం లేదనేది నాకున్న అభిప్రాయం. అది ఎందువల్లనంటే హిందూమతంలో న్యాయబద్ధతకీ, నీతికి మధ్య భేదం ఏమీ లేదు. ఏదైతే న్యాయబద్ధమైనదో అది తప్పకుండా నీతి అవుతుంది (హిందూమతంలో).

నా వాదనకి సహాయంగా సాక్ష్యాన్ని ఎంతో ప్రదర్శించవలసిన అవసరం ఏమాత్రం లేదు. ఋగ్వేదంలోని'ధర్మ' శబ్దానికున్న అర్థాన్నే తీసుకుందాం.[25] ఈ ధర్మశబ్దం ఋగ్వేదంలో యాభై

ఎనిమిదిసార్లు ప్రయోగించబడింది. ఇది ఆరు వేర్వేరు అర్థాల్లో ప్రయుక్తమైంది. 1. ప్రాచీన ఆచారం. 2. నియమాలు. 3. సమాజంలో శాంతి భద్రతలను పరిరక్షించటానికి చేసే అన్ని రకాలైన ఏర్పాట్లు. 4. ప్రకృతి ధర్మం. 5. పదార్థ గుణం. 6. మంచి చెడుల కర్తవ్యం- అనేవి ఆరు ఆరు రకాలైన అర్థాలు. ఈ విధంగా మొత్తంమీద ధర్మ శబ్దం మొదటినుంచి హిందూ మతంలో రెండురకాల అర్థాలను సూచిస్తోంది. దీని ప్రకారం ధర్మ శబ్దానికి నియమం (law), నీతి (moral), అనే అర్థాలు రెండూ వున్నాయి. హిందూ మత తత్వంలో న్యాయపరమైన తత్వానికీ, నైతిక తత్వానికీ మధ్య భేదం లేకుండా పోవటానికి ఇది ఒక కారణం.

ఇది హిందువులకు నైతిక అనుశాసన గ్రంథం లేదని చెప్పటం కాదు. వాళ్ళకు అలాంటి దున్నదనేది ఖచ్చితం. కానీ, ప్రవర్తనకు సంబంధించిన ఏ ధోరణిని, స్వభావాన్ని హిందూ స్మృతి ధార్మికశాస్త్రం నీతిగా పరిగణిస్తుందో ప్రశ్నించడం అత్యంత సముచితం.

హిందువు దేన్ని నీతిగా భావిస్తాడో దానితాలుకా (వ్యక్తి)నడవడికి సంబంధించిన [26] ఒక భావం ఏర్పడటానికి ముందు అసలు మూడు స్థాయిలకు చెందిన (వ్యక్తి)నడవడిక ఉందనీ ఈ మూడు అత్యంత విశిష్టమైనవనీ గుర్తించి, ఆ గుర్తింపుతో నా వివరణ ప్రారంభిస్తాను. 1. స్వాభావిక ప్రవృత్తి వలన నడవడిక. 2. సామాజిక నియమాల వల్ల నియంత్రించబడిన నడవడిక. 3. వ్యక్తి ఆత్మవివేకం వల్ల రూపుదిద్దుకున్న నడవడిక- అనేవి ఆమూడో స్థాయిలలోని ప్రవర్తనా విధానాలు. మొదటిస్థాయిలోని నడవడిని-నైతిక నడవడిక (ప్రవర్తన)అని మనం పిలవం. అది అనైతికం కాకపోయినా, అది కేవలం నీతితో సంబంధం లేనటువంటిది. ఆ నడవడి ప్రయోజనరీత్యా నైతికం కాని, ఫలితంలో మాత్రం విలువైన శక్తుల అదుపులో ఉంటుంది. ఆ శక్తులు జీవసంబంధమైనవి కావచ్చు. సామాజిక పరమైనవి కావచ్చు. లేక మానసికమైనది కావచ్చు. వీటికి ఒక ప్రయోజనం ఉంటుంది. ఆ ప్రయోజనం ఆకలి తీర్చుకోవటం కావచ్చు. శత్రువు మీద ఆయుధాన్ని సృష్టించడం (ప్రయోగించడం) కావచ్చు. కానీ వీటి అంతిమ లక్ష్యం మాత్రం మన శారీరక లేక స్వాభావిక ప్రవృత్తి వల్ల సాధించుకున్నదే అయివుంటుంది. కానీ ఇది ఎంతకాలం అనివార్యమైన లక్ష్యంగా అంగీకరించబడుతుందో, ఇతరులతో పోల్చబడదో, వెలకట్టబడదో, సంబంధించదో- అంతకాలం దీన్ని ఖచ్చితంగా నీతిబద్ధమైందేనని చెప్పలేం. ఇక నడవడికి సంబంధించిన రెండవస్థాయి విస్పందేహంగా సామాజికమైందే. ఎక్కడైతే మనుషులు సమూహాలుగా నివసిస్తారో, అక్కడల్లా ఆయా సమూహాల్లో అందరికీ సమానమయినటువంటి కొన్ని జనజీవిత పద్ధతులకు (folk ways)అనుగుణంగా ప్రవర్తించక తప్పదు. అక్కడ ఆమోదించబడిన జీవిత ప్రవర్తనా పద్ధతులుంటాయి. అవి ఆ సమూహానికంతటికీ సమానం. ఇవన్నీ ఒకతరం నుంచి మరో తరానికి సంక్రమించేటటువంటివి. ఇలా అందరూ ఆమోదించిన ప్రవర్తనా పద్ధతుల్నే ఆ సమూహానికి సంబంధించిన 'నీతులు' అంటారు. వీటిని పాటించే సమూహానికీ సంబంధించిన సంక్షేమం వీటిని ఆచరించడంలోనే వుందని భావిస్తారు. ఆ సమూహంలోని ప్రతివ్యక్తి వీటిని విధిగా పాటించాలి. వీటికి విరుద్ధంగా ఎవరైనా ప్రవర్తిస్తే, అతడు ఆ సమూహం ఆమోదాన్ని కోల్పోయినట్టుగా భావించబడతాడు. ఖచ్చితంగా చెప్పాలంటే ఈ నడవడిని మనం నీతి అవలేం. ఎందువల్లనంటే సమాజం చేత నిర్దేశించబడిన 'మంచే' అంతిమ లక్ష్యం. ఆదే

ప్రమాణం కాబట్టి. దాన్నే నైతిక నడవడిక (ప్రవర్తన) అంటున్నామంటే, దానికి కారణం అది సమాజానికి సంబంధించిన నీతులతో రూఢి చెందింది కనుక. దీన్ని నైతిక ఆచారాత్మకత (Customary morality) అనవచ్చు. ఇక మూడవస్థాయికి చెందిన నడవడి– ఇది ఒక్కటే వాస్తవంగా సంపూర్ణంగా నైతికమయినటువంటిది. ఎందుకనంటే దీనిలో మాత్రమే వ్యక్తి సరైన పద్ధతిని గుర్తిస్తాడు. మంచిని 'ఎంచుకుంటాడు'. దాన్ని నెరవేర్చటానికి హృదయపూర్వకంగా తనంతటతాను స్వేచ్ఛగా అంకితమవుతాడు. సమాజంచేత ఆమోదించబడిన దాన్ని అవివార్యంగా తానూ ఆమోదించి, ప్రవర్తించడు. అతడు అంతిమ లక్ష్యాన్ని గుర్తించి, ఎంచుకుంటాడు. వ్యక్తిగతంగా తను దానికి బాధ్యుడు అవుతాడు. అతనిది "ఆలోచనాత్మక నైతికత" (reflective morality).

హిందూ నైతికత (ఈ మూడుస్థాయిల్లో) ఏస్థాయిలో కనబడుతుంది? మూడవ స్థాయిలో లేదనేది స్పష్టం. దీనర్థం ఏమంటే హిందువు సామాజికుడే. కానీ నైతిక శబ్దానికున్న ఖచ్చితమైన అర్థంలో నైతికుడు కాడు. అతనే సమాజంలో నివసిస్తున్నాడో, ఆ సమాజ అభీష్టం ప్రకారం నడిచే ఒక పరికరం మాత్రమే అతడు. ఆ సమాజంతో విభేదించడానికి భయపడని స్వేచ్ఛా ప్రతినిధి కాడు అతడు. ఆ నడవడి ప్రయోజనరీత్యా నైతికం కాని, ఫలితంలో మాత్రం విలువైన శక్తుల అదుపులో ఉంటుంది. పాపం పట్ల అతనికున్న అభిప్రాయాలు అతని నైతికరహిత నడవడికి తిరుగులేని సాక్ష్యాలు. వైష్ణవ కూటాలు తొమ్మిది రకాలుగా పాపాల్ని విభజించి, వాటి పట్టికల్ని పొందుపరిచాయి.

1. **ఘోర పాపాలు:** అతిపాతక– వావి(వరుస)కాని వారితో చేసే ఒక రకమైన వ్యభిచార రూపాలివి. వీటి ప్రాయశ్చిత్తం అగ్నికి ఆహుతి చేయటమే(తగులబెట్టటమే).

2. **గొప్ప పాపాలు:** మహాపాతక– బ్రాహ్మణుని వధించడం, మత్తుపానీయాలను తాగటం, బ్రాహ్మణుని బంగారం అపహరించటం, గురుపత్నితో లైంగిక సంబంధం, ఇలాంటి పాపాలు చేసిన వారితో సంబంధం పెట్టుకోవడం మొదలైనవి.

3. **ఒకే రకమైన అల్పపాపాలు:** అనుపాతక– ఇతర తరగతులకు చెందిన కొంతమందిని చంపటం, అబద్ధపు సాక్ష్యం ఇవ్వటం, స్నేహితుని చంపటం, బ్రాహ్మణుని భూముల్ని, ఆస్తుల్ని కాజేయటం, కొన్ని రకాలైన వావి తప్పిన వ్యభిచారాలు, దీనితోపాటు పరస్త్రీ సంగమం మొదలైనవన్నీ దీనిలోకి వస్తాయి.

4. **అల్పపాపాలు:** ఉపపాతక– అసత్య ప్రకటన, కొన్ని ప్రత్యేకమైన మత విధుల్ని నిర్వర్తించకపోవటం, పరస్త్రీ సంగమం, చట్టసమ్మతం కాని వృత్తులు స్వీకరించటం, జ్యేష్టుడికి పెళ్ళి కాకుండానే సోదరుడు పెళ్ళి చేసుకోవటం మొదలైనవి నేరాలు, భగవంతుడికి, పితృ దేవతలకు

హవ్యకవ్యాలు సమర్పించకపోవటం, నాస్తికత మొదలైనవి.

5. **వర్ణాన్నికోల్పేయే పాపాలు:** జాతిభ్రంశకార- బ్రాహ్మణునికి శారీరక వేదన కలిగించడం, వాసన చూడగూడని వాటిని వాసన చూడటం, కపట ప్రవర్తన,కొన్ని అస్వాభావిక నేరాలు.

6. **వర్ణసంకరానికి తోసివేసే పాపాలు:** సంకరీకరణ- పెంపుడు జంతువుల్ని లేక క్రూర జంతువుల్ని చంపటం.

7. **భిక్షా స్వీకరణకు ఆయోగ్యుణ్ణి చేసే పాపాలు:** అపాత్రీకరణ- నింద్యులైన(హేయమైన) వ్యక్తుల్నుంచి బహుమానాల్ని, భిక్షను స్వీకరించటం, వ్యాపారం , వడ్డీకి డబ్బులివ్వడం, అబద్ధమాడటం, శూద్రుడికి సేవచేయడం.

8. **అపవిత్రతను కలుగచేసే దోషాలు:** మలవాహ- పక్షుల్ని చంపటం, ఉభయచర( భూమిమీద, నీళ్లలోనూ, ఉండే)జీవుల్ని చంపటం, జలచరాల్ని, క్రిమి కీటకాదుల్ని వధించడం, జాజికాయల్ని తినడం లేక మత్తు పానీయాల ప్రభావాన్ని చూపే వృక్షాల ఫలాల్ని తినడం.

9. **ఇతర పాపాలు:** ప్రకీర్ణక- పైన పేర్కొన్నవి కానివి మిగిలినవి.

పాపాలకు సంబంధించిన ఈ పట్టిక సమగ్రం కాదు. అయినా సుదీర్ఘమైన, వివరణాత్మకమైన ఈ పట్టికలో పాపానికి సంబంధించి హిందూ దృక్పథాన్ని ప్రదర్శించడం సమర్థమైనదనే చెప్పవచ్చు. తనకు నిర్దేశించిన ప్రవర్తనా విధానం నుంచి వ్యక్తి పతనమవటాన్ని మొదట ఇది సూచిస్తుంది. ఇక రెండో విషయం. అతడు ఏవిధంగా భ్రష్టుపడతాడో, అపవిత్రుడు అవుతాడో ఇది తెలియజేస్తుంది. పాతక శబ్ద ధాతువుకున్న అర్థం ఇదే. దీని అర్థం 'పతనం'(పడిపోవుట) అంటే అశౌచము (అపవిత్రుడగుట)ఈ రెండు అర్థాల్లో దేంట్లోనైనా హిందూ అభిప్రాయంతో పాపమంటే అదొక ఆత్మ సంబంధమైన వ్యాధి. మొదటి అర్థంలో బహిరంగ ప్రవర్తనకు (నడవడి) సంబంధించిన నియమాన్ని అతిక్రమించటం. ఇక రెండవ అర్థంలో అపవిత్రమైన శరీరాన్ని శుద్ధి చేయటం, లేక పవిత్రీకరించడం. అది తీర్థయాత్రల ద్వారాగానీ లేక యజ్ఞయాగాది క్రతువుల ద్వారాగాని, దేనికదికాని, రెండింటినీ కలిపి కానీ చేయవచ్చు. కానీ ఆ పవిత్రత ఎప్పుడూ చెడు ఆలోచనలకు, ప్రయోజనాలకు సంబంధించిన ఆధ్యాత్మిక అపవిత్రత మాత్రం కాదు.

హిందువుయొక్క నైతికత అనేది కేవలం సామాజికమని ఇది నిరూపిస్తోంది. అంటే అతని నైతిక స్థాయి కేవలం సంప్రదాయ బద్ధమైనదీ, ఆచరణాత్మకమైనదీ అని అర్థం. ఆనైతిక సదాచారంతో రెండు దుర్గుణాలు ఉన్నాయి. ఉద్దేశం పట్ల చిత్తశుద్ధి, పవిత్రతతో అది ఎల్లప్పుడూ

కూడి ఉంటుందని హామీ లేకపోవటం మొదటిది. దీనికి ఒకే ఒక్క కారణం ఉంది. అది ఏమిటంటే ఎప్పుడైతే నైతికత వ్యక్తి భావనలోకి, ప్రయోజనం యొక్క అంతరాంతాల్లోకి చొచ్చుకొని పోతుందో అప్పుడు మానవ ప్రవర్తనలో స్థానం లేకుండా కపటం అంతరించిపోతుంది. ఇక రెండవది – నైతిక సదాచారత అనేది ఒక లంగరు. ఒక గాలం. అది సగటు మానవుని గట్టిగా పట్టుకొంటుంది. ముందుకెళుతున్న మనిషిని పట్టి వెనక్కి లాగుతుంది. నైతిక స్తబ్ధతకున్న ఒకే ఒక్క మారుపేరు నైతిక సదాచారత. ఎక్కడైతే నైతికత కేవలం నైతిక సదాచారంగా వుంటుందో, అక్కడ సమస్త విషయాల్లోనూ ఇది వాస్తవం. కానీ హిందువుల నైతిక సదాచారతలో దేనికదే ఒక ప్రత్యేకమైనటువంటి దుర్లక్షణం వుంది. నైతిక సదాచారం అనేది సత్ప్రవర్తనకు సంబంధించినటువంటిది. సత్ప్రవర్తన అంటే మరేమిటో కాదు. సాధారణ లేక ప్రజాసామాన్య దృష్టితో చూచినపుడు ఏదైతే మంచి అనిపించుకుంటుందో అదే. కానీ హిందూ మతంలో సత్ప్రవర్తన బ్రాహ్మణులను గౌరవించడంతోను, వాళ్లకు మంచి చేయటంతోను, వాళ్ళకు సంభావనలు ఇవ్వటంతోనూ ముడిపడినటువంటిది. హైందవనీతి శాస్త్రం అంటే అధిమానవ ఆరాధనే.

హిందూమత తత్వాన్ని గ్రహించటానికి మూలంగా హైందవ నీతి శాస్త్రాన్ని నేను తీసుకుంటే అది ఏవిధమైన తేడాను కలిగిస్తుంది? హిందూ మతానికి సంబంధించిన విద్యార్థులు అనేక మంది ఒక విషయాన్ని మరచిపోతున్నారు. అదేమిటంటే హిందూమతంలోని ధర్మ శాస్త్రానికి (law) మతానికి మధ్య భేదం లేదు కాబట్టి ధర్మ శాస్త్రానికీ , నీతిశాస్త్రానికి మధ్య భేదం లేదనుకుంటారు. ఇవి రెండూ కూడా ఒకే విషయానికి సంబంధించినటువంటివి. అవేమిటంటే అగ్రవర్ణాల హిందువుల ప్రయోజనాలను నెరవేర్చడానికి నిమ్న తరగతులకు చెందిన హిందువుల ప్రవర్తనా విధానాన్ని నియంత్రించటమే.

హైందవ తత్వానికి వాస్తవ మూలాలైన ఉపనిషత్తులను పరిగణనలోకి తీసుకోకుండా,మొత్తంమీద హిందూ మతానికి సంబంధించిన అసత్య చిత్రాన్ని ప్రదర్శిస్తున్నారనేది నామీద వాళ్ళు చేసే మూడో ఆక్షేపణ.

నేను ఉపనిషత్తులను పరిగణనలోకి తీసుకోకపోవటమనేది వాస్తవం. దాన్ని అంగీకరిస్తున్నాను. కానీ అలాతీసుకోకపోవటానికి కారణముంది. అది చాలామంచి కారణమని నేను నమ్మటంచేత ఆ విధంగా చేశాను. హిందూమత తత్వంతోటి నాకు ప్రమేయముంది. హైందవ వేదాంతం తోటి నాకు సంబంధం లేదు. అదే గనక నావిషయమై ఉంటే ఉపనిషత్తులను పరిశీలించ వలసిన అవసరం తప్పని సరిగా కలిగేది. అయినా ఉపనిషత్తులను విడిచిపెట్టకుండా వీటిని కూడా పరిశీలించటం చేస్తున్నాను. ఎందుకంటే నేను హిందూ మతతత్వం ఏదని ఇప్పటి వరకూ నిరూపించానో ఉపనిషత్తుల తత్వం కూడా అదే కాబట్టి.

ఉపనిషత్తుల తత్వాన్ని చాలా కొద్ది మాటల్లో పేర్కొనవచ్చు. హక్స్లీ ఉపనిషత్తుల

తత్వాన్ని మొత్తాన్ని చాలా సంగ్రహంగా చెప్పాడు.[27] అతను ఆవిషయాన్ని చెప్పేటప్పడు ఉపని షత్వం అంగీకరించిన విషయాన్ని ఇలా చెప్పాడు. "పదార్థానికి కానీ మనస్సుకి గానీ సంబంధించిన అనిత్య ధోరణులలో ఒక 'శాశ్వత సత్యం', సారమూ వుంటాయి. విశ్వసారమే బ్రహ్మ, వ్యక్తిసారం ఆత్మ. అనుభూతులు, ఆలోచనలు, ఆకాంక్షలు, సుఖ దుఃఖాల వంటి మాయలో బ్రహ్మ నుంచి ఆత్మ వేరయింది. అదే జీవితం పట్ల భ్రమను సృష్టిస్తున్నది. ఆ భ్రమనే సత్యమనుకుని ఆత్మ ఎప్పుడూ కోర్కెల సంకెళ్ళలో మగ్గుతూ వుంటుంది, వేదనల కొరడా దెబ్బలు తింటుంటుంది."

ఉపనిషత్తుల ఈ తత్వంతో ఏమిటి ప్రయోజనం? బ్రతకటం కోసం చేసే పోరాటా న్నుంచి విరమించుకొని, ఆత్మహననంతో కోరికలను నశింపచేసికొని, భోగపరాఙ్ముఖుడై కఠోర నియమాలతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించమంటుంది ఉపనిషతత్వం. ఒకానొక జీవన పద్ధతిగా ఆ ఉపనిషతత్వం హక్స్లీ ఖండనకు గురయింది. తీవ్రమైన పదజాలంతో అతడిలా ఖండించాడు.[28]

"శరీరాన్ని మరణకారకం చేసుకోవటంలో తపస్వులైన భారతీయసన్యాసులు ఎక్కినన్ని శిఖరాలు, సాధించటానికి మరెవరూ కూడా ప్రయత్నించలేక పోయారు. అనంతర కాలంలో ఏ సన్యాసిత్వం కూడా మనిషి మనసును చైతన్య రహితమైన ఇంచుమించు నిద్రలో నడిచే స్థితికి కుదించడంతో వాళ్ళను చేరుకోలేక పోయింది. దానికంటుగట్టబడిన పవిత్రతతో , పిచ్చితో కలల్లో తేలిపోయే ప్రమాదకర స్థితిలోనే వాళ్లు జీవించారు".

కానీ హరదయాళ్ ఉపనిషతత్వాన్ని తిరస్కరించిన విధానం సరిపోల్చి చూస్తే పై ఖండన ఏమంత గొప్పది కాదనిపిస్తుది.[29]

"దేన్ని తెలుసుకోవటం ద్వారా సమస్తం తెలుస్తుందో దాన్ని విశదపరచడం జరుగుతుందని మన ఉపనిషత్తులు ప్రకటించుకుంటాయి. ఆ సంపూర్ణత్వాన్ని గురించిన అన్వేషణ అంతటికీ మూలం కృత్రిమమైన భారతీయ ఆధ్యాత్మిక విద్యే. ఆ సిద్ధాంత గ్రంథాలన్నీ పూర్తిగా అసం గతమైన ఊహలతో, ఆశ్చర్యకరమైన కల్పనలతో, అధ్వాన్నమైన ఆలోచనలతో నిండి వున్నాయి. అవి నిరర్థకమైనటువంటివి కాబట్టి వాటినుంచి నేర్చుకునే దేమీ లేదు. మనం పాత జాడల్లోనే సంచరిస్తున్నాం. ఆ పాత గ్రంధాల్నే పరిష్కరిస్తున్నాం, పునఃపరిష్కస్తున్నామేకాని ఐరోపా సామాజిక ఆలోచనా విధానాన్ని తెలియజేసే ప్రామాణిక గ్రంథాలను మన భాషలోనికి అనువదించకోలేక పోతున్నాం. ఫ్రెడరిక్ హారిసన్, బ్రూయెక్స్, బేబిల్, అనతోల్ ఫ్రాన్స్, హార్వే, హాకెల్, గిడ్డింగ్స్, మార్షల్ మొదలైన వారు తమ జీవితకాలాన్ని వెచ్చించి డన్స్, స్కాటస్, థామస్ ఎక్వినాస్ విషయాలపై సిద్ధాంత గ్రంథాల్ని రూపు దిద్దించుకున్నా, లేక బియోవుల్ఫ్ కవిత్వం, పాంటాటచ్ సూత్రాలలోని గొప్పతనాన్ని చర్చించుకున్నా యూరప్ ఎలా ఉండేది? హైందవ పండితులు, పట్టభద్రులు, జీర్ణమైన, శిథిలమైన,పురాతనమైన వాటిపట్ల మక్కువ ప్రదర్శించే ఒకానొక'చాదస్తం' (Mania)తో బాధపడుతున్నారు. ఇదేవిధంగా అభ్యుదయవాదుల చేత స్థాపించబడిన ఒక విద్యా సంస్థ, సంస్కృత వ్యాకరణం ద్వారా వేదాలు, షడ్దర్శనాలు బోధించడం ద్వారా ఉన్నత స్థితికి

తీసుకెళ్ళడానికి ప్రయత్నించడమా! జ్ఞానాన్వేషణలో ఎంతటి మిధ్యాప్రయత్నం! ఇది ఎలాంటిదంటే ఒకానొక బాటసారి మంచినీటికోసం వెతుకుతూ ఎడారిగుండా మరణ సముద్రపు తీరానికి ప్రయాణించడంవంటిదేకదా! భారతదేశ యువకులారా! జ్ఞానంకోసం దుర్గంధపూరిత తోలుకాగితాల్లోని మీ ఆధ్యాత్మిక గ్రంథాల్లోకి చూడవద్దు. అక్కడ ఏమీలేదు. ఉన్నదంతా అంతులేని మాటల గారడీల వర్తులాలే. జీవితాన్ని గురించిగానీ, దానిసమస్యల గురించిగానీ మీరు అర్థం చేసుకోవాలంటే రూసో, వాల్టేర్లను, ప్లేటో, అరిస్టాటిల్‌లను, హెకెల్, స్పెన్సర్లను, మార్క్స్, టాల్‌స్టాయ్‌లను, రస్కిన్, కామ్టేలను ఇంకా ఇతర ఐరోపా మేధావుల్ని చదవండి."

కానీ ఈ తిరస్కారాన్ని అలా పక్కన పెడతాం. ఒక సామాజిక, రాజకీయ విధానంగా ఉపనిషతత్త్వం హిందూమతం మీద ఏమైనా ప్రభావాన్ని ప్రసరింపచేసిందా? అది ప్రభావశూన్య ప్రయోజన రహితమైన కల్పనా శకలంగా మారిపోయి హిందువుల నైతిక, సామాజిక వ్యవస్థల మీద ఏవిధమైన ప్రభావాన్ని ప్రసరింపచేయలేదనేదాంట్లో సందేహం ఏమాత్రం లేదు.

దురదృష్టకరమైన ఈ ఫలితానికి కారణాన్ని వెతకటం ఇక్కడ అసంగతం కాదనుకుంటాను. ఒక కారణం మాత్రం చాలా స్పష్టమైంది. ఉపనిషతత్వం అసంపూర్ణంగా మిగిలిపోయింది. అందువల్ల అది ఇవ్వవలసిన ఫలితాన్ని అందించలేకపోయింది. ఉపనిషత్తుల కీలక సూత్రం ఏమిటని ఎవరైనా అడిగితే ఈవిధంగా స్పష్టంగా చెప్పవచ్చు. ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ మాటల్లో[30] ఉపనిషత్తుల కీలక సూత్రం "నిన్ను నీవు తెలుసుకో" అనేది. 'నిన్ను నీవు తెలుసుకో' అనే ఉపనిషస్సూత్రానికి అర్థం 'సత్యాన్ని నీవు తెలుసుకో' అనేది. అంటే అర్థం- "నీలో అడుగున దాగివున్న నీదైన అహంకారాన్ని కనుక్కో. శాశ్వతమైనది, అద్వితీయమైనదీ, సమస్త విశ్వంలో అంతర్గతంగా ఉన్నదీ ఏదయితే ఉందో దాన్ని కనుక్కో. దానిగురించి సంపూర్ణంగా తెలుసుకో."

అవే ఆత్మ, బ్రహ్మలు. అవి రెండూ ఒక్కటేనన్నది సత్యం. అదే గొప్ప సత్యం. ఆ సత్యాన్ని ఉపనిషత్తులు తాము కనుగొన్నామని చెబుతున్నాయి. అవి మనిషిని ఆ సత్యాన్ని తెలుసుకోమంటున్నాయి. ఉపనిషత్తుల తత్వం నిష్ప్రయోజనం ఎందుకైందనే దానికి కారణాలు అనేకం వున్నాయి. వాటిని ఇంకోచోట చర్చిస్తాను. ఇక్కడ వాటిల్లోని ఒకే ఒక్క కారణాన్ని వివరిస్తాను. ఉపనిషత్తులను కూర్చిన తాత్వికులు కేవలం సత్యాన్ని తెలుసుకోవడంతో సరిపోదు అని గుర్తించలేకపోయారు. ప్రతి ఒక్కడూ సత్యాన్ని ప్రేమించడం నేర్చుకోవాలి. మతానికి తత్వశాస్త్రానికి మధ్య వున్న తేడా రెండు రకాలు. తత్వం అనేది సత్యాన్ని తెలుసుకోవడానికి సంబంధించినది. మతం సత్యాన్ని ప్రేమించటంతో సంబంధం కలిగినటువంటిది. తత్వం స్థిరమైంది. మతం గతిశీలకమైంది. ఈ తేడాలు ఒకే విషయంయొక్క రెండు అంశాలకు సంబంధించినటువంటివి. తత్వం ఎందుకు స్థిరమైనది అయిదంటే అది కేవలం సత్యాన్ని తెలుసుకోవడంతో మాత్రమే సంబంధం కలిగివుంది కాబట్టి మతం ఎందుకు గతిశీలత కలిగినది అయిందంటే సత్యాన్ని ప్రేమించడం దాని విషయమయింది కాబట్టి. మాన్స్ ప్లామెన్ దీన్ని ఎంతో చక్కగా ఇలా చెప్పాడు.[31] "....మతమేగనుక గతిశీలం కాకపోయి, అది మనలో ఒక విషయా...

సంబంధించిన ప్రేమ భావాన్నే గనక పెంచకపోతే గనుక మతం అనే ఒకానొక విషయం లేకుంటేనే బాగుండేది. ఎందుకంటే మతం సత్యంయొక్క జ్ఞానాన్ని కలుగజేస్తుంది. ఆ సత్యానికి సంబంధించిన జ్ఞానమే గనుక మతంతో మన ప్రేమ భావంతో కలిసి వుండకపోతే అసలు జ్ఞానం చూడలేని స్థితి ఏర్పడి వుండేదేమో! ఒక్క రాక్షసుడే సత్యాన్ని కేవలం అసహ్యించుకుంటానికి చూస్తాడు. 'మనం శిఖర స్థానాన్ని వీలయినంత అధికంగా ప్రేమించాలి. ఎప్పుడంటే దాన్ని మనం చూసినప్పుడు' అన్నాడు టెన్నిసన్. అది ఆచరణీయం కాదు. పూర్తిగా వస్తుగతంగా చూస్తే దాన్ని చూసి అసహ్యించుకోవడం ప్రారంభిస్తాం..." మనం దానికి భయపడతాం. ఉన్నత స్థానం దాని దూరం వల్లా, భిన్నత్వం వల్లా భయపెడుతుంది.

సర్వోత్కృష్టమైన వేదాంతాలన్నింటి గతీ ఇదే. జీవిత విధానం మీద వీటి ప్రభావం ఏమీ వుండదు. బ్లేక్ చెప్పినట్టు "మతం రాజకీయం. రాజకీయమంటే సోదరభావం. తత్వం తప్పకుండా మతంగా మారాలి. అదొక వ్యవహార నీతి కావాలి. అది కేవలం ఆధ్యాత్మిక విద్యగా మిగిలిపోకూడదు." ప్లామెన్ చెప్పినట్లుగా– "మతం ఆధ్యాత్మిక విద్య అయి, మరేంకాకుండా పోతే, ఒక్క విషయం మాత్రం ఖచ్చితంగా చెప్పగలిగేవాళ్ళం. అది ఎప్పుడూ సామాన్యుడూ, వినమ్రుడూ అయిన మనిషితో సంబంధం కలిగి వుండేది కాదు."

మతాన్ని పూర్తిగా ఆధ్యాత్మిక పరిధిలో ఉంచడం అర్ధరహితం. రాజకీయాలతో నేరుగా, మౌలికంగా ప్రభావం చూపని మతవిశ్వాసం ఖచ్చితంగా మూర్ఖత్వం. అటువంటి విశ్వాసం వల్ల యథాస్థితిలో మార్పు కాల, స్థల ప్రపంచంలో యథాస్థితి అంటూ వుండదు."

ఈ ప్రధాన కారణాల చేత ఉపనిషత్ తత్వం నిష్ప్రయోజనమని నిరూపితమైంది.

హైందవ నీతి శాస్త్రమూ, ఉపనిషత్ తత్వమూ మనువు ప్రవచించిన హిందూమతతత్వాన్ని ఆవగింజంత కూడా సాధువును చేయలేవన్నది నిర్వివాదమైంది. అవి మతం పేరిట మనువు చెప్పిన దాన్ని తుడిచివేయడంలో అసమర్థమూ, నిస్సహాయమూ అయ్యాయి. వాటి నిమిత్తం లేకుండానే "హిందూ మతమా! అసమానత్వమే నీ పేరు" అని అనవచ్చు.

# V

అసమానత్వం హిందూమతం ఆత్మ. హిందూమతం నీతి సామాజికమైనది మాత్రమే. అది అనైతికమూ, అమానుషమూ అని కనీసంగా చెప్పవచ్చు. ఈ నీతి లేకపోవడం, మానవత్వం లేకపోవడం, నీతిబాహ్యంగాను, అమానుషం అయినదిగాను, అపఖ్యాతి పరమైనదిగాను చెప్పవచ్చు. ఈ విధంగానే హిందూమతం మారింది. వీటిపట్ల అనుమానం వ్యక్తంచేసేవారు కాని హిందూసమాజంలోని సాంఘిక సమ్మిశ్రితాన్ని ఖచ్చితంగా పరిశీలించి పరీక్షచేసి అందులోని కొన్ని అంశాలను గురించి పర్యాలోచించాలి. కొన్ని వివరాలను తెలుసుకుందాము:

మొదటిది– ఆదిమ తెగల గురించి. వారు ఏవిధంగా నాగరికతను కలిగియున్నారనేది.

ఆదిమ మానవ నాగరికతనుంచి, ఆటవిక నాగరికతదాకా, ఆటవిక నాగరికతనుంచి ఆధునిక నాగరికతదాకా మానవుని పురోగతి అంతా మానవ నాగరికతా చరిత్రలో విభాగమే. అంతేగాక నూతన విషయాలను కనుక్కోవడం, ఏదైనా కళలో విజ్ఞానం సంపాదించాలనే తాపత్రయం మొదలైనవి మానవుడు ఒక దశనుండి వేరొకదశకు మార్పుచెందుతున్న స్థితిని తెలియజేస్తాయి. ఇవి మనిషిని తన అభివృద్ధి పథంలో ఉన్నతశిఖరాలు అధిరోహింపజేస్తాయి.

మానవ పురోభివృద్ధి దృష్ట్యా చూచినట్లైతే మనిషిని జంతువు నుండి వేరుచేసింది చక్కగా మాట్లాడగలగడం అనే కళ అని చెప్పవచ్చు. ఇది ఆదిమ మానవుని మొదటిదశని తెలియచేస్తుంది. ఆదిమ మానవుని మధ్యకాలము అతను నిప్పను తయారుచేయడం. దానిని ఉపయోగించుకోవడం తెలిసిన నాటితో ప్రారంభమవుతుంది. ఈ అద్భుతమైన విషయాన్ని కనుక్కోవడం మనిషిని తన అలవాట్లలోను,నియమాలలోను ఒక నూతన పంథా త్రొక్కడానికి సహకరించింది. మనిషి తన అడవి నివాసాన్ని విడిచి వివిధ ప్రదేశాలలో సంచరించడమే కాక, శీతల ప్రదేశాలలోకి వెళ్ళి, మాంసం, చేపలు మొదలైన వాటితో కూడిన అనేక ఆహార పదార్థాలను సేకరించుకోగలిగాడు. ఆ తరువాత అతడు విల్లుని, విల్లంబులను కనుగొన్నాడు. ఇది ఆదిమానవుని గొప్పసాధనే కాకుండా అది ఆదిమానవ నాగరికత అత్యధిక స్థాయిని తెలియజేస్తుంది. ఇది నిజంగా మానవుని ఒక అద్భుతమైన సాధన. ఈ ఆయుధంతో వారు వేగంగా పరుగెత్తే జంతువులను సైతం చంపి వశం చేసుకోవడమేకాకుండా, దాన్ని ఆత్మరక్షణార్థం కూడా ఉపయోగించుకున్నారు.

ఇక మట్టిపాత్రను కనుక్కోవడమనేది ఆదిమమానవ నాగరికతనుంచి ఆటవిక నాగరికత దశకు మనిషి పరిణామాన్ని తెలియజేస్తుంది. అప్పటివరకు అగ్నిశక్తిని తట్టుకునే పాత్రలను తయారుచేసుకోలేకపోయాడు మానవుడు. పాత్రలు లేకుండా అతడు వండుకోవడంగానీ, నిలువచేయడంగానీ చేయలేడు. అందువల్ల ఈ మట్టిపాత్రలు కనుక్కోవడమనేది నాగరికతను గొప్పగా ప్రభావితంచేసే అంశం. ఈ ఆటవిక నాగరికతా మధ్యకాలం మనిషి క్రూర జంతువులను మచ్చిక చేయడంతో ప్రారంభమైంది. అతడు ఈ జంతువులను తన అవసరాలకు ఉపయోగించుకోవడం తెలుసుకున్నాడు. ఇపుడు మనిషి మందల కాపరిగా మారాడు. గతంలో అతడు జంతువులను వేటాడి ఆహారం సముపార్జన చేయవలసి వచ్చేది. ఇపుడు ఆ అవసరం లేకపోయింది. సర్వకాలాలలోనూ పాలను పొందడం వల్ల ఇవి అతని ఆహార పదార్థాలలో ఒక ముఖ్యమైన భాగమైనాయి. అంతేగాక గతంలో అతను ప్రవేశించలేని ప్రదేశాలలో ఇపుడు గుర్రాలు, ఒంటెల సహాయంతో సునాయాసంగా సంచరించడమేగాక సుదూర ప్రాంతాలకు పయనించగలుగుతున్నాడు. ఈ జంతువులు వాణిజ్య వ్యాపారాలకు ఉపయోగపడ్డాయి. వీటిద్వారా సరుకులను సరఫరా చేయడమేగాకుండా, ఆలోచనలను సుదూర ప్రాంతాలకు (వార్తలను) చేరవేయడానికి ఉపయోగపడ్డాయి.

ఆ తరవాత ఇనుమును మలచడం అనే కళను కనుక్కోవడం జరిగింది. ఇది ఆటవిక నాగరికత. అత్యధిక అభివృద్ధి స్థాయిని సూచిస్తుంది. దీనితో మనిషి 'పరికరాలను తయారుచేసే ప్రాణి'గా మారాడు. దీనితో అతడు చెక్కలను, రాళ్ళను నునుపుచేసి, నగిషీలు చెక్కడమే గాక, గృహనిర్మాణంలోను, వంతెనల నిర్మాణంలోను ఉపయోగించాడు. దీనితో ఆటవిక మానవ నాగరికత అభివృద్ధి ముగిసింది.

ఆటవిక మానవ నాగరికతను ఆధునిక నాగరికత మధ్య భేదాన్ని మనుషులు ఒకరి భావాలను ఒకరు స్పష్టంగా బొమ్మ గుర్తుల ద్వారా సూచించడం అనే కళను కనుక్కోవడంతో గుర్తించవచ్చు. ఇదే రాసే కళ అని చెప్పవచ్చు. తద్వారా మనిషి గతంలో దూరాన్ని పొందినట్లుగా ఇపుడు ఈ కళద్వారా కాలాన్ని జయించాడు. ఇపుడు అతడు తన ఆలోచనలను, కార్యకలాపాలను చక్కగా లిఖితరూపంలో పొందుపరచగలుగుతున్నాడు. అందువల్ల అతని విజ్ఞానము, అతని ఆశయాలు, అతనిలో దాగివున్న కళలు, నైతికపరమైన భావాలు, తనతరంవారేగాక, భావితరాల వారు కూడా చదువుకునేందుకు వీలుగా పొందుపరచగలిగాడు. నేడుమానవ చరిత్ర చాలాభద్రంగానూ, జాగ్రత్తగానూ వున్నది. ఇది అతని పురోగతిలో అత్యున్నత స్థాయి. ఈ స్థాయిని చేరుకోవడంతోనే నాగరికత ప్రారంభమయింది.

ఇక్కడ ఒక క్షణం ఆగి ఆదిమ తెగలవారు ఏవిధమైన నాగరికతలో ఉన్నారో ప్రశ్నించుకుందాం.

'ఆదిమ తెగలు' అన్న మాట ఆ పేరుతో పిలువబడున్న ప్రజల స్థితిగతులను వ్యక్తం చేసేది.32 వారు విడివిడిగా ఉన్న పూరిగుడిసెలలో నివసించేవారు. అడవి ఫలాలను, విత్తనాలను, కందమూలాలను ఆహారంగా సేకరిస్తారు. చేపలను పట్టడం, వేటాడటం మొదలగునవి కూడా తనుఆహార సేకరణలో అనుకరిస్తారు. దాని సాంఘిక, ఆర్థిక వ్యవస్థలో వ్యయసాయానికున్న ప్రాముఖ్యము తక్కువ. వారి ఆహార పదార్థాల పంపిణీ చాలా అనిశ్చితంగాను, అస్థిరంగాను ఉండటం వల్ల గత్యంతరంలేని పరిస్థితుల్లో వారు అర్ధాకలితో జీవనాన్ని గడుపుతారు. వస్త్రధారణ విషయంలో వారు ఎంతో పొదుపును పాటిస్తారు. ఆ పొదుపు ఎంతవరకంటే దాదాపు నగ్నంగా ఉండే పరిస్థితిలో వారు ఉంటారు. ఉదాహరణకు "బొండాపారజా" అనే తెగ ఉంది. వారిలో స్త్రీలు చిన్న పీలికలను ధరించేవారు. ఇది చిన్న పరికిణీగా ఉపయోగపడుతుంది. ఈ వస్త్రధారణ అస్సాంలోని మామ్‌జాక్ నాగా జాతి వారు ధరించే వస్త్రధారణను పోలి ఉంటుంది. ఈ పరికిణీ చివరకు ఎడమవైపు తొడపైభాగంపై కలిసీ కలవకుండా వుంటుంది. ఈ పరికిణీలు అడవినుంచి (చెట్లనుండి) తీసిన ఒక రకమైన నాలుతో తయారుచేస్తారు. వాటిని వారే ఇండ్లలో తామే నేసుకుంటారు. అవేగాక బాలికలు పూసలతోను, తాటి ఆకులతోను చేసిన జడ పిన్నులను ధరిస్తారు. అంతేగాక వివిధ రకాలైన పూసలతో చేసిన కంఠాభరణాలను ధరిస్తారు. ఈ విధమైన అలంకరణ కోమేజన్ తెగల స్త్రీల అలంకరణను పోలి ఉంటుంది. లేకపోతే స్త్రీలు ఏమి ధరించరు. స్త్రీలు తమ శిరోజాలను పూర్తిగా తీసివేస్తారు. వీరిలో శిజామ్

సంస్థానంలోని, ఫరీదాబాద్ ప్రాంతంలో నివసించే చెంచుతెగలవారి గృహాలు శంఖు ఆకారంలో ఉంటాయి. వెదురు బొంగులను ఏటవాలుగా చేర్చి వాటిపైన చొప్పను పలుచని పొరగా కప్పి చిన్న చిన్న గుడిసెలను నిర్మించుకుంటారు. వాస్తవానికి భౌతికపరమైన విషయాలలో వారిది పరిమిత జీవనం. చాలీచాలని దుస్తులు ధరిస్తారు. పురుషులు సాధారణంగా ఒక లంగోటా, చిన్నవస్త్రాన్ని ధరించేవారు. ఇక స్త్రీలు చిన్న రవికెను, పరికిణీని వాడతారు. అవిగాక కొన్ని వంటపాత్రలు, ఆహారపదార్థాలు ఉంచుకునే ఒకటి రెండు బుట్టలు కలిగి ఉంటారు. వారు నివసించే గ్రామంలోనే కొద్దిపాటి వ్యవసాయం చేస్తూ పశువులను, మేకలను కలిగి వుంటారు. అంతేగాక, మొరియా అనే మరొక తెగవారు సాధారణంగా నడుమునుంచి క్రిందకు వేళ్ళాడే ఒకే ఒక వస్త్రాన్ని ధరిస్తారు. వారు పూసలతో చేసిన నెక్లెస్‌లను ధరిస్తారు. అంతేగాక నృత్యం చేసే సమయంలో కోడిపుంజు ఈకలను, నెమలి పింఛాలను ధరిస్తారు. చాలామంది బాలికలు తమశరీరంపై రకరకాల రంగులతో పచ్చబొట్లు పెట్టుకుని, వింతైన వేషధారణ చేసుకుంటారు. ప్రత్యేకంగా వారి ముఖాలపై రకరకాల డిజైన్లలో ఈ పచ్చబొట్లు పెట్టుకుంటారు. ఈవిధమైన వేషధారణ వారి వారి అభిరుచులపై ఆధారపడివుంటుంది. ఈ రంగులను ముళ్ళతోను, సూదులతోను చేసుకుంటారు. వారు జడలలో అడవికోడిపుంజు ఈకలను పెట్టుకునేవారు. ఇంకా చెక్కలతోను, తగరంతోను, ఇత్తడితోను చేసిన దువ్వెనలను వారు తలపై ధరిస్తారు.

ఈ ఆదిమ తెగలవారికి ఏవిధమైన ఆహారం తీసుకోవడానికి సంశయం లేదు. చివరికి క్రిమి కీటకాదులను కూడా భుజిస్తారు. వాస్తవానికి వారు ఆహారంగా స్వీకరించని జంతుమాంసం లేదని చెప్పవచ్చు. మాంసాహారం వీరికి ఎంత ప్రీతి అంటే– ఏదైనా మృగం సహజంగా మరణించినా లేదా నాలుగు అయిదు రోజుల క్రితం పులి తిని విడిచిన జంతుమాంసాన్ని కూడా వారునిస్సందేహంగా స్వీకరించేవారు.

ఆ తరువాత ప్రజలు ఎవరంటే నేరాలు చేసే తెగలు. ఈ నేరాలు చేసే తెగలవారు ఆదిమతెగవారివలె అరణ్యాలలో నివసించకుండా, మైదానాలలోను, ప్రపంచం మధ్యలోను, లేదా కొద్దిగా దగ్గరలోను నివసించేవారు. హోలియాస్ తన 'ది క్రిమినల్ ట్రైబ్స్ ఆఫ్ ది యునైటెడ్ ప్రొవిన్సెస్' అనే గ్రంథంలో వారి కార్యకలాపాలను గురించి చక్కటి వివరణ ఇచ్చాడు. వారు తమ జీవనోపాధికి నేరాలపైన మాత్రమే ఆధారపడేవారు. కాకపోతే కొద్దిమంది వ్యవసాయం చేపట్టినా, ఇది వారి వాస్తవ కార్యకలాపాలను కప్పిపుచ్చుకోవడానికి వాడుకునే సాధనమే. వీరి అకృత్యాలన్నీ సాధారణంగా హింసతో కూడిన దొంగతనాలు, దోపిడీలు ముఖ్యమైనవి. అయితే వీరు సంస్థాగతంగా ఈ పనులు చేయడం వలన వారి పరిధిలోకి రాని తప్పంటూ ఉంటేది కాదు. ఏదైనా దోపిడీ చేయాలని నిశ్చయించుకున్నపుడు ముందుగా కొంతమంది గూఢచారుల లాంటి వారెళ్ళి ముందుగా దోపిడీకి అనుకూలమైన గ్రామాన్ని, అందులో ఒకటి రెండు ఇళ్ళను ఎంపికచేసేవారు. అంతేగాక ఆ గ్రామంలోని ప్రజల అలవాట్లు, ఆచార వ్యవహారాలు పరిశీలించి ఒకవేళ దోపిడీ సమయంలో వారికి సహాయం అవసరమైతే అవి ఎంతదూరం నుండి అందడానికి ఆస్కారం ఉన్నదీ, అసలు గ్రామంలో ఎంతమంది ప్రజలు ఉన్నారు, ఎన్ని మారణాయుధాలు ఉన్నాయి అనేవి లెక్కలు వేస్తారు. సాధారణంగా దోపిడీ అర్ధరాత్రి జరుగుతూ ఉంటుంది. ఈ

విధంగా గూఢచారులు అందజేసిన సమాచారం ఆధారంగా ఆ గ్రామంలో కొన్ని ప్రదేశాలలో అక్కడక్కడ తమ మనుషులను తుపాకులతో ఉంచేవారు. వీరు సమయంచూసి తుపాకి పేల్చ డంతో ప్రధాన సమూహం ఒకటి హఠాత్తుగా గ్రామంలోని ముందుగా ఎంచుకున్న గృహాన్ని లేదా గృహాలను దోచుకునేవారు. ఈ సమూహంలో సాధారణంగా 30 లేదా 40మంది ఉంటారు.

అయితే ఈ నేరాలు వారి సాధారణ జీవితంలో ఏవిధంగా ప్రముఖపాత్ర నిర్వహిస్తు న్నాయో పరిశీలించవలసిన ఆవశ్యకత ఉన్నది. వారు వారి పిల్లలకు నడవటం, మాట్లాడటం, వచ్చిన వెంటనే ఈ నేరవృత్తిలో ప్రవేశపెడతారు. ఈవిధంగా బాలురని ప్రవేశపెట్టడం ఒక తెలివైనచర్య. కారణం ఏదైనా చిన్న దొంగతనంతో ఆ బాలుడు పట్టుపడితే శారీరక బాధలకు గురి అవుతాడు కానీ, పెద్దవారిలా పోలీస్ నిర్బంధంలోకి వెళ్లటం జరుగదు. వారి స్త్రీలు కూడా ఇందులో ప్రముఖ పాత్ర నిర్వహిస్తారు. వారు ఈ నేరాలలో ప్రత్యక్షంగా పాలు పంచుకోకపో యినా వారికి కూడా రకరకాల బాధ్యతలు ఉంటాయి. సాధారణంగా ఈ స్త్రీలు దోపిడి ధనాన్ని అమ్మటంలోను, సరైన పద్ధతిలో ఉపయోగించడంలోను ఎంతో యుక్తిగా వ్యవహరించడంలోను పాలుపంచుకుంటారు.

ఒక్కొక్కసారి పిండారీలు, ఠగ్గులవలె వీరుకూడా క్రమబద్ధమైన సమాఖ్యలుగా ఏర్పడ తారు. పిండారీలు సాయుధులైన దారిదోపిడీదారులు. వీరిది 20,000 అంతకు పైచిలుకు చక్కని గుర్రాలను కలిగివున్న ఒక బహిరంగ సాయుధ సంస్థ. వీరందరూ ఒక దోపిడీ నాయ కుని ఆధ్వర్యంలో వుండేవారు. ఇలాంటి వారిలో చిట్టూ ఒకడు. ఇతనొక్కడి ఆధ్వర్యంలోనే మంచి కాల్బలం, తుపాకీ సైన్యమేగాక అయిదువేల దాకా సమర్థమైన గుర్రాలున్న పదివేల గుర్రపుదండు ఉండేది. క్రమబద్ధంకాని సైనిక వ్యవస్థ కావటంచేత నష్టపోయిన సైనికులను పునర్నియమించుకోడానికి పిండారీలకు ఏవిధమైన మిలటరీ పథకాలుగానీ కార్యక్రమాలుగానీ లేవు. పిండారీలకు అధికార సంబంధ విషయాలపై ఆసక్తి లేదు. వారి ప్రధాన ఉద్దేశం ధనాన్ని కొల్లగొట్టడం, లేదా ధనాన్ని సంపాదించటం మాత్రమే. సాధారణంగా దోపిడీ కొల్లగొట్టడం అనేది వారి వృత్తి. వారు ఏ పాలకులని గుర్తించేవారు కాదు. వారు ఎవరికీ బాధ్యత వహించరు. వారు ఎవరికీ విధేయులు కారు. ఎవరినీ గౌరవించేవారు కారు. చిన్న, పెద్ద, ధనిక, పేద తారతమ్య బేధం లేకుండా నిర్భయంగానూ, పశ్చాత్తాపరహితంగానూ దోచుకునేవారు.

ఠగ్గులు[33] సంస్థాగతమైన, వృత్తిపరమైన హంతకులు. వీరు 10 నుంచి 100 మంది దాకా మారువేషాలలో మొత్తం దేశంలో సంచరించేవారు. వారు ధనికవర్గాల వారికి పథికులుగా పనిచేస్తూ వారితో కలిపి పనిచేస్తూ వారితో కలసి ప్రయాణం చేసి చక్కని అవకాశం వచ్చినపుదు జేబురుమాలుతోగాని, ఉరి తాడుతోగాని మెడచుట్టూ బిగించి చంపి వారి ధనాన్ని దోచుకుని శవాన్ని పాతిపెట్టేవారు. ఈ విధానం అంతా ప్రాచీన కాలంలో పటిష్టంగా నిర్ణయింపబడినట్లుగానే కొన్ని ప్రత్యేకమైన మత కర్మకాండలు జరిపిన పిదప చేసేవారు. ఈ కర్మకాండలో వారు వారి సంపాద్దనని భగవంతునికి అంకితమిచ్చి, చక్కెరను నైవేద్యం పెట్టేవారు. హిందూ విలయదేవత

అయిన కాళిమాత వారి ప్రధాన ఆరాధ్య దేవత. ఈ ధనసంపాదన కోసం చేసిన హత్యను వారు తమ మత ధర్మంగా భావించేవారు. మరియు పవిత్రమై, గౌరవప్రదమైన వృత్తిగా పరిగణించేవారు. వాస్తవానికి వారికి ఏవిధమైన తప్పు చేస్తున్నామనే భావంగానీ, నైతిక విలువలు దెబ్బతింటాయనే భయంకానీ కలిగేవి కావు. అంతేగాక వారు ఎవరి ఆజ్ఞ మేరకు ఎవరి గౌరవార్థం అయితే ఈ కార్యక్రమాలు చేస్తున్నారో ఆ దేవతయొక్క ఉద్దేశాన్ని లేక ఇష్టాన్ని కొన్ని క్లిష్టమైన శకునాల ద్వారా సూచించేవారు. ఈ శకునాల ఆధారంగా లేదా ఈ ఆజ్ఞల మేలకు వారు ఒక్కొక్కసారి కొన్ని వందలమైళ్ళు వారు ఎంచుకున్న ప్రయాణీకునితో సహా ప్రయాణంచేసి, అవకాశం రాగానే కార్యక్రమాన్ని ముగించి, ఆ ధనాన్ని దోచుకుని, ఇష్టదేవతకు కర్మకాండలు చేసి, వారి ధనంలో కొంతభాగాన్ని దేవతకు సమర్పించేవారు. ధగ్గులకు కూడా అపభ్రంశమైన సొంత భాష వుండేది. అంతేగాక వారి బృందసభ్యుల్ని గుర్తుపట్టేవిధంగా కొన్ని చిహ్నాలను కలిగివుండేవారు. వారిలో కొందరు అశక్తతవల్లగానీ, వయసుమీరటంవల్లగానీ నేర కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనలేనిపక్షంలో వారు కాపలాదారులుగా, గూఢచారులుగా, వైద్యులుగా, ఆహారపదార్థాలు అందించేవారుగా పనిచేసేవారు. వారు కొన్ని శతాబ్దాలుగా తమ వృత్తిని నిర్వహించడానికి గల కారణం వారి పటిష్టమైన సంస్థాగతమైన కార్యనిర్వహణ, గూఢచారి వ్యవస్థ, ఆయుధాలతోకూడిన భద్రత కలిగి వుండటం. అన్నిటినీ మించి వారు చేసే హత్యలను మతం ముసుగులో కప్పకోవడం మొదలగు కారణాల వల్ల నిరాటంకంగా చేయగలుగుతున్నారు. అయితే అసాధారణమైన విజం ఏమంటే ఆనాటి హిందూ, ముస్లిం పాలకులిరువురూ ఈ ధగ్గుల వృత్తిని సామాన్య వృత్తిగా పరిగణించారు. ఈ ధగ్గులు ప్రభుత్వానికి పన్ను చెల్లించేవారు. ప్రభుత్వం కూడా వీరిపట్ల శ్రద్ధ వహించేది.

బ్రిటిష్‌వారు వచ్చేవరకు కూడా వీరిని అణచడానికి ఏవిధమైన చర్యలు తీసుకోబడలేదు. కానీ 1835 నాటికి 382 మంది ఉరితీయబడ్డారు. 986 మంది యావజ్జీవ కారాగారశిక్షకు గురయ్యారు. ఆ తరువాత 1879 నాటికి 344 మంది ధగ్గులు నమోదు చేయబడ్డారు. అంతేగాక 1904లో కేంద్ర నేరపరిశోధక శాఖవారు చేపట్టేవరకు భారత ప్రభుత్వ ధగ్గు మరియు దోపిడిదొంగల విచారణ శాఖ పనిచేసింది. అయితే సంస్థాగతమైన తెగలుగా లేకుండా నేరం చేయడం అసాధ్యమైనా, నేరమే వారి ప్రధాన వృత్తి అయింది.

ఈ రెండు తరగతులతోపాటు మూడవ తరగతి కూడా ఉన్నారు. వారే అస్పృశ్యులు లేదా అంటరానివారు.

అస్పృశ్యుల క్రింద మరికొందరు ఉన్నారు. 'వారు దగ్గరకు చేరకూడని వారు'. అస్పృశ్యులు తాకితేనే అది కాలుష్యానికి కారణమవుతుంది. కానీ దగ్గరకు చేరకూడనివారు కొద్ది దూరంలోనికి వస్తేనే కాలుష్యాన్ని, మలినాన్ని కలుగచేస్తారు. ఉదాహరణకు నయదిస్ అనే జాతివారు. వీరు హిందువులలో అట్టడుగు కులానికి చెందిన వారు. వీరు శునక భక్షకులు. వీరు దానం అడిగే విషయంలో చాలా పట్టుదలతో వుంటారు. ఎవరైనా నడుస్తున్నా, పడవ

ప్రయాణం చేస్తున్నా వీలైనంత దూరంలో వుండేవారు. ఏదైనా వారికి ఇవ్వాలంటే ఆ వస్తువు క్రిందపడవేసి ఆ వేసిన వ్యక్తి కొద్దిదూరం వెళ్ళాక, ఇతడు భయంతో దానిని గ్రహించేవాడు. థర్‌స్టన్ వీరిగురించి చెబుతూ "నేను ఎవరినైతే (నయాదిస్) పరీక్షించానో వారు వంతెనలకు 3, 4 మైళ్ళ దూరంలో నివసిస్తున్నా, వారి అపవిత్రత కారణంగా, వారు సాంప్రదాయకంగా మోసుకొస్తున్న కాలుష్యం కారణంగా నదిపై నిర్మించబడిన వంతెనలపై నడవకుండా చుట్టు తిరిగి వారు తమ ప్రదేశాలకు చేరుకునేవారు" ఈ విషయాన్ని థర్‌స్టన్ ఫోరనాస్‌లో పరిశీలించడం జరిగింది.

ఈ దగ్గరకు చేరకూడని వారి క్రింద 'చూడకూడని వారు' కొందరున్నారు.

మద్రాస్ ప్రెసిడెన్సీలోని తిరునల్వేలి జిల్లాలో 'పురదావన్నన్' అనే 'చూడకూడని' వారు (జాతి) ఉన్నారు. "వారు పగలుపూట బయటతిరగరాదు. ఎందుకంటే వారిని చూడటమే అపవిత్రత. కాలుష్య హేతువు. ఈ దురదృష్టవంతులైన ప్రజలు తప్పనిసరి పరిస్థితులలో రాత్రి పూట చేసే కార్యక్రమాలనుచేపట్టవలసి వచ్చింది. వారు చీకటిపడిన తర్వాత తమ గృహం విడిచిపెట్టి, దొడ్డిదారివెంట వెళ్ళేవారు. రాత్రివేళ సంచరించే నీటి కుక్కలవలె, దుమ్మలగొండివలె వీరు గబగబ వెళ్ళవలసిన దుర్గతి పట్టింది."

మొత్తం ఈ తరగతుల జనాభాను లెక్కిద్దాం. ఆదిమ తెగలు 2 కోట్ల 50 లక్షలు, నేరాలు చేసే తెగలు 45 లక్షలు, అస్పృశ్యులు 5 కోట్లు. ఇవి మొత్తం కలిపితే 7 కోట్ల 95 లక్షలు. ఇపుడు ఒక ప్రశ్న ద్దాం! ఇంతమంది ప్రజలు ఏవిధంగా హిందూమతంలో సామాజికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా, భౌతికంగా దిగజారిన వాతావరణంలో ఉంచబడ్డారు. హిందువులు తమ నాగరికత అన్ని నాగరికతలకన్నా ప్రాచీనమైనదనీ, తమ మతం అన్ని మతాలలోనికి గొప్పదని చెబుతారు. అదేగనుక నిజమైతే హిందూమతం ఎలా వర్గాల అభివృద్ధిలో, వారిలో మానసిక వికాసం తీసుకురావడంలో, వారికి ఆశలు పురికొల్పడంలో విఫలమైంది? లక్షలకు లక్షలు ప్రజలు తమ జీవనోపాధికై అవమానకరమైన నేరాలు చేస్తూ ఉంటే ఎలా చేతులు ముడుచుకొని నిలబడగలిగింది? ఏమిటి దీనికి సమాధానం? దీనికి సమాధానం ఒక్కటే. అదేమంటే– హిందూమతం కాలుష్యం అనే భయంలో మునిగిపోయింది. దీనిని శుభ్రపరిచి పవిత్రపరిచే శక్తిలేదు. దీనికి సేవచేయాలనే ప్రేరేపణ కూడాలేదు. ఎందుకంటే దీని నైజమే అమానుషమైనది. నీతి బాహ్యమైనది. దీనిని ఒక మతంగా పిలవడం తప్పుడు భావన. ఎందుకంటే దీని తత్వం మతం ప్రాతినిధ్యం వహించే ప్రతి దానికీ వ్యతిరేకమైనది.

అనువాదం: డాక్టర్ కలెవరపు వెంకట్రామయ్య

డా. పి.ఆపదరావు

## అధఃసూచికలు

1. మన్రో 'ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ ఇద్యుకేషన్'లో 'ఫిలాసఫీ' అన్న వ్యాసం చూడండి.

2. ది ఫిలాసఫీ ఆఫ్ రిలిజియన్, ఆక్స్‌ఫర్ట్ ప్రచురణ, 1–2 పేజీలు.

3. సహజ దేంతశాస్త్రం (Natural Tehology) ఒక ప్రత్యేక అధ్యయన విభాగం. ప్లేటోలోనే దానికి మూలాలున్నాయి. చూడండి – ప్లేటో న్యాయసూత్రాలు.

4. ఎ.ఇ.టేలర్ "ది ఫెయిత్ ఆఫ్ ఏ మోరలిస్ట్" పేజి. 19.

5. "ది రిలిజియన్ ఆఫ్ ది సెమైట్స్" (1927)

6. మత తాత్వికతకు సంబంధించిన విద్యార్థులు మొదటి రెండు కోణాల అధ్యయనాన్ని మాత్రమే మతతాత్విక రంగంలో చేర్చాలని భావిస్తున్నట్టున్నారు. మత తాత్వికత రంగ అధ్యయనంలో మూడో కోణం అధ్యయనం కూడా అవసరమా? వారు గుర్తిస్తున్నట్టు లేదు. డి.ఎస్.ఆడమ్స్ "హేస్టింగ్స్ ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ రిలిజియన్ అండ్ ఎథిక్స్" (సం. 12, పే. 393)లో దేంతశాస్త్రంపై రాసిన వ్యాసం చూడండి. ఈ అభిప్రాయంతో నాకు ఏకీభావం లేదు. నేను మతతాత్వికతను ప్రామాణిక అధ్యయనంగాను వర్ణనాత్మక అధ్యయనంగాను పరిగణించడం ఇందుకు కారణం కావచ్చు. సాధారణ మతతాత్వికత అంటూ ఉంటుందని నేను అనుకోను. ప్రతి మతానికీ ఓ విశిష్ట తాత్వికత ఉంటుందని నా విశ్వాసం. నా వరకు నాకు మత తాత్వికత అంటూ ఏదీ లేదు. ఒక మతానికి చెందిన తాత్వికత మాత్రమే వుంది.



7. ఈ రెండు దిశల నుంచి దైవభావన రూపొందిందని హిందూ మతం చక్కగా చూపింది. దేవుడిగా ఇంద్రుడు, దేవుడిగా బ్రహ్మ అనే భావనలను పోల్చి చూడండి.



8. స్మిత్, ది రిలిజియన్ ఆఫ్ సెమైట్స్.

9. స్మిత్, – పైదే –

10. స్మిత్, – పైదే –

11. స్మిత్, – పైదే –

12. క్రోచీ ఉటంకించినది. ట్రీ ఆఫ్ లైఫ్, పేజి 5.

13. టు మొరాలిటీస్.

14. న్యాయభావనకు మంచి వివరణ కోసం చూడండి. జె.ఎస్.మిల్ – యుటిలిటేరియలిజమ్.

15. మనువు ఏడు రకాల బానిసలను గుర్తించాడు. (8–415). నారదుడు 15 రకాల బానిసలను గుర్తించాడు. (5–25)

16. మనువుతో సమానాధికారం కలిగిన యజ్ఞవల్క్యుడు కూడా ఇదే నియమం విధించాడు. (2–183)

17. ఈ కిందివి పదహారు సంస్కారాలు:

18. అలాగే, స్త్రీలు కూడా.

19. 'కులంపై మనువు – ఒక ప్రవేశిక' అన్న నా వ్యాసం చూడండి. (మాకు లభించిన కాయితాలలో ఈ వ్యాసం లేదు. సం..)

20. లస్కీ – లిబర్టీ ఇన్ మోడర్న్ స్టేట్ – చూడండి.

21. ఇది త్రిశంకుని కథ. పైన హరి వంశం నుంచి ఉటంకించిన దాని కంటె ఇది భిన్నంగా కనిపిస్తుంది. అయితే, వశిష్ట విశ్వామిత్రుల ఘర్షణ స్వభావాన్ని ఇది మరింత నిశితంగా చూపిస్తుంది.

22. ది రిలిజియన్ ఆఫ్ సెమైట్స్ –పే. 269.

23. ఎ.పి. నికోలస్ "ఫ్రమ్ నీషే డౌన్ టు హిట్లర్" 1938.

24. "ది పొజిషన్ ఆఫ్ స్మృతిస్ యాజ్ ఎ సోర్స్ ఆఫ్ ధర్మ" కాణే స్మారక సంచికలో ప్రొఫెసర్ అల్టేకర్ రాసిన ఆసక్తిదాయకమైన వ్యాసం చూడండి. పే. 18–25.

25. తరువాత చెప్పబోయేదంతా ఈ విషయంపై యశ్వంత్ రామకృష్ణ దాతే 'స్వాధ్యాయ' అనే మరాఠీ సంచిక (నె 7–8 ప్రథమ సంవత్సరం పేజీలు 18–21) రాసిన వ్యాసం నుంచి గ్రహించినవి.

26. నైతిక సూత్రాలపై తమ సంపుటలలోని క్రాలీ, టుఫ్ట్స్‌ల విశ్లేషణలకు కనిక్కర్ పూర్తిగా అనుసరిస్తున్నాడు.

27. ఎవల్యూషన్ అండ్ ఎథిక్స్ పే–63.

28. – పైదే – పే–64.

29. మోడర్న్ రివ్యూ జులై, 1912.

30. హిబ్బర్ట్ లెక్చర్స్ 1878, పే – 317.

31. "ది నెమిసిస్ ఆఫ్ ఇన్‌ఫెక్చువల్ రిలిజియన్–అదెల్ఫి, జనవరి 1941.

32. ఈ సమాచారం, ఇతర సమాచారం 1931 జనాభా లెక్కల సంపుటి మొదటి భాగం నుంచి తీసుకొన్నవి.

33. ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా, 11వ ఎడిషన్, సం. 26, పే. 896.

# రెండవ భాగం

## భారతదేశం–కమ్యూనిజానికి ముందు కావలసినవి

[హిందూ సామాజిక వ్యవస్థ నుండి ఒకటవ రెండవ అధ్యాయాలను ఇక్కడ తిరిగి ఇస్తున్నాం. ఇది 'భారతదేశం – కమ్యూనిజం' అన్న గ్రంథంలో భాగంగా కనబడుతున్నది. టైప్‌చేసిన ప్రతిలో తొలి పుటలో విషయసూచిక ఉంది. అందులో డా. అంబేద్కర్ 'భారతదేశం – కమ్యూనిజం' అనే గ్రంథాన్ని మూడు భాగాలు చేసినట్లుంది. మొదటి భాగం పేరు "కమ్యూనిజానికి ముందు కావలసినవి". ఈ భాగంలో మూడు అధ్యాయాలు ఉండవలసింది. అయితే డా. అంబేద్కర్ కాగితాలలో అవి కనిపించలేదు. రెండో భాగానికి సంబంధించిన నాలుగో అధ్యాయానికి శీర్షిక ఉంది – 'హిందూ సామాజిక వ్యవస్థ' – గట్టి బౌండ్‌వేసి ఉంది. ఈ అధ్యాయంలో రెండు ఉప శీర్షికలున్నాయి.

I. హిందూ సామాజిక వ్యవస్థ – దాని ముఖ్యమైన సిద్ధాంతాలు

II. హిందూ సామాజిక వ్యవస్థ – దాని ప్రత్యేక ధోరణులు

ఈ పుస్తకంలో విషయ సూచికలో పేర్కొన్నట్లు ఇతర అధ్యాయాలు లభించలేదు. మొత్తంమీద టైప్ చేసిన 63 కాగితాలు ఫుల్‌స్కేప్ సైజులో లభించాయి.

–సంపాదకులు]

# అధ్యాయం – 2

# హిందూసామాజిక వ్యవస్థ మూలసూత్రాలు

హిందూ సామాజిక వ్యవస్థ లక్షణం ఏమిటి? అది స్వేచ్ఛా సామాజిక వ్యవస్థా? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే స్వేచ్ఛా సామాజిక వ్యవస్థ అంటే ఏమిటో తెలుసుకోవడం అవసరం. ఫ్రెంచి విప్లవకాలం నుంచి స్వేచ్ఛా సామాజిక వ్యవస్థ యొక్క సారభూత గుణాల మీద అభిప్రాయ భేదాలు లేవు. ఆ గుణాలు ఎన్నో ఉండొచ్చు, కాని ప్రాథమికమైనవి మాత్రం రెండు. స్థూలంగా అవి రెండు. మొదటిది వ్యక్తి వ్యక్తి కోసమే, సమాజ లక్ష్యం–గమ్యం వ్యక్తి అభివృద్ధి, వ్యక్తిత్వ వికాసం. సమాజం వ్యక్తికన్నా మించింది కాదు. వ్యక్తి సమాజానికి ఒదిగి ఉండవలసి వస్తే, అది అతని మంచికి, అవసరానికి మాత్రమే.

రెండోది సామాజికుల మధ్య సహజీవన నియమాలను స్వేచ్ఛ సమానత్వం సౌభ్రాతృత్వం అనే వాటి మీద దృష్టి పెట్టుకొని చూడాలి.

స్వేచ్ఛా సామాజక వ్యవస్థకు ఈ రెండూ ఎందుకు అవసరమైన ప్రాథమిక విషయాలయ్యాయి?

అన్ని సామాజిక అవసరాలకు వ్యక్తి మార్గం కాకుండా లక్ష్యం ఎందుకయ్యాడు? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పకోడానికి, మానవ వ్యక్తి అంటే ఏమిటో క్లుప్తంగా తెలుసుండడం అవసరం. మానవ వ్యక్తి హక్కుల్ని కాపాడడానికి మనం మన విలువైన సంపదలను, జీవితాలను ఎందుకు త్యాగం చెయ్యాలి? ఈ ప్రశ్నకు ప్రొఫెసర్ జాక్వ్యూస్ మారిటైన్ చెప్పిన సమాధానం కన్నా మంచి సమాధానం లేదు. 'స్వతంత్ర సాధన'[1] అనే వ్యాసంలో ప్రొఫెసర్ మారిటైన్ ఇలా అన్నారు: "మానవుడు అంటే ఖచ్చితంగా మన ఉద్దేశం ఏమిటి? మానవుడు ఒక మనిషి (పర్సన్) అనుకున్నప్పుడు, అతడు ఒక అణువు, ఒక గడ్డిపోచ, ఒక పక్షి లేక ఒక ఏనుగు లాగా, కేవలం ఒక విడి ప్రాణి (ఇండివిజువల్) మాత్రమే కాదు. మనిషి తన మేధతో తన సంకల్పంతో తనంతతాను నిలబడే వ్యక్తి. అతడు కేవలం భౌతికరూపంలో మాత్రమే ఉండడు. అతడు జ్ఞానం ద్వారా ప్రేమ ద్వారా ఆధ్యాత్మికోన్నత ఉనికిని సంపాదించాడు. అందువల్ల, ఒకరకంగా, అతడు తనలో తానే ఒక విశ్వం, ఒక సూక్ష్మ ప్రపంచం. అందులో ఈ మహా విశ్వం జ్ఞానం చేత ఆవరింపబడి తన సమగ్రతను సంతరించుకొంది. ప్రేమ ద్వారా అతడు తనను తాను ఇతరులకు ఇచ్చుకోగలడు. ఈ సంబంధానికి భౌతిక ప్రపంచంలో సమానమైనది లేదు.

మానవ వ్యక్తికి ఈ విశిష్టతలుండటానికి కారణం ఆత్మ (స్పిరిట్): అంతిమ విశ్లేషణలో మనిషి అంటే దివ్యాగ్ని చేత చలనం చైతన్యం పొందిన ఈ నశ్వర మాంస రూపం, ఈ ఎముకల గూడు మాతృ గర్భం నుంచి మట్టిలో కలిసేదాకా జీవించడానికి, కాలాతీతంగా మరణరహితంగా మనగలిగే ఆత్మే మూలాధారం. ఆత్మ (స్పిరిట్) వ్యక్తిత్వానికి మూలం. వ్యక్తిత్వ భావన అలా సంపూర్ణతను, స్వతంత్రతను కలుపుకుంటుంది. ఒక వ్యక్తి ఎంత దరిద్రుడైనా, చితికిపోయినా, అతడొక సంపూర్ణుడు. స్వతంత్రంగా మనగలిగే వ్యక్తి. మనిషి ఒక వ్యక్తి అనడం అతడు ఒక అంశం కాదు, అంతకుమించిన సంపూర్ణుడు అనడమే, దాసునికన్నా మించిన స్వతంత్రుడు అనడమే. అతడు పదార్థంలో అతి సూక్ష్మమైన భాగం. అదే సమయంలో ఒక విశ్వం, పరమ సృష్టి ముందు ఒక బిక్షువు పరమ సృష్టి ముందు విలువగల నశ్వరమాంసం, స్వర్గం ప్రవేశించే పూచికపుల్ల. వ్యక్తి దేవుని స్వరూపం అన్నపుడు అక్కడ మతభావనలోని అర్థం ఇదే. ఇది ఆధ్యాత్మిక మర్మం. వ్యక్తి విలువ, అతని ఔన్నత్యం, గౌరవం, హక్కులు అనేవి సృష్టికర్త ముద్రాంకితాలైన పవిత్ర క్రమానికి చెందినవి.

సమానత్వం ఎందుకు తప్పనిసరి అంశం? "రాజకీయ భావన యొక్క స్వాతంత్ర్యం" అనే వ్యాసంలో ఆచార్య బియర్ ఈ విషయాన్ని బాగా చర్చించారు. అతని వాక్యాలను ఉదహరించడం కన్నా నేనేమీ చెయ్యను. ఆయన ఇలా అన్నారు.

"సమానత్వం (ఈక్వాలిటీ) అనే పదం దురదృష్టకరం, దాని కన్నా మంచి పదం లేదు. సమానత్వం అంటే 'పరిమాణంలో, మొత్తంలో, సంఖ్యలో, స్థాయిలో, విలువలో, గుణంలో అలాంటిదే" అని అర్థం. భౌతిక, గణిత శాస్త్రాలలో ఈ పదం సరిపోతుంది. కాని మనుషుల విషయంలో సరిపోదు. ఈ విషయంలో లోతులకు వెళ్ళినవాళ్ళు మానవులకు సమానమైన ప్రాథమిక లక్షణాలను వ్యక్తులు విభిన్న స్థాయిల్లో కలిగుంటారని చెప్తారు. ఈ రచయితలు, దేశ కాలాలకు చెందిన బాహిరమైన ఆచారాలను మానవజాతి నుంచి విడదీసినప్పుడు విశ్వజనీన లక్షణాలు బహిర్గతం అవుతాయంటారు. ఈ లక్షణాలు ఆదిమ గుణాల నండి, జీవపరమైన అవసరాల నండి, ఏమన్నా అనండి ఫరవాలేదు – అవి ఉంటాయన్న విషయాన్ని మాత్రం ఎవరూ కాదనలేరు. భౌతిక శక్తిలో, కళా నైపుణ్యంలో, సంపదలో, మానసిక శక్తిలో అసమానతల్ని పేర్కొనడం చాలా సులభం, కాని ఇది కూడా మనమిచ్చే ప్రాధాన్యాన్ని బట్టి ఉంటుంది. చివరగా మనుషులందరిలోనూ ప్రాథమిక లక్షణాలున్నాయన్న సత్యం నిలుస్తుంది. వాటి స్వభావం, స్వరూపం 'నైతిక సమానత' అనే మాటలో చెప్పబడ్డాయి."

నీతి (మోరల్) శబ్దానికి ఎక్కువ ప్రాముఖ్యముంది. అనాది కాలం నుంచీ, భౌతికశక్తిలో, సామర్థ్యాలలో, సంపదలో మనుషులు సమానం కాదన్న సర్వసామాన్య వాస్తవాన్ని వల్లించడం విమర్శకులకు ఫాషన్‌గా ఉంది. వారి విమర్శ నిర్హేతుకమూ, అసంబద్ధమూ. నైతిక సమానతకు చెందిన హేతుబద్ధ ప్రతిపాదకులెవరూ మానవుల మధ్య అసమానత ఉండడాన్ని కాదనలేదు. అయితే వారు ఆ అసమానతలకు నియంతృత్వమో, వ్యవస్థాగత విధులో కారణంగా చెప్పి

వుండవచ్చు. స్వాతంత్ర్య ప్రకటన మనుషులంతా సమానులని చెప్పదు. వారు సమానంగా పుట్టారని మాత్రమే చెబుతుంది.

సారాంశంలో 'నైతిక సమానత' అనే ప్రయోగం నైతిక విలువల్ని, నిలుపుకోవలసిన నమ్మకాన్ని గౌరవించాల్సిన హక్కులకు గుర్తింపును సూచిస్తుంది. దీని విలువను గణితశాస్త్రంలో సమస్యను ఆవిష్కరించినట్లు ఆవిష్కరించలేము. భౌతిక శక్తిలో, సామర్థ్యాలలో, కృషిలో, సంపదలో అసమానతలను వ్యతిరేకించాలి. గొప్ప భౌతికశక్తి, అది గొప్పది కాబట్టి, అది మనుషుల్ని చంపే, తినే, అణిచివేసే హక్కు గలదనే వాదం తిరస్కరింపబడింది. సామర్థ్యాలకు సంపదకు నైతిక సమానతాదర్శం హక్కును నిరాకరిస్తుంది. కొందరు తమను తాము అధిక బలశాలురమనీ, ప్రతిభావంతులమనీ, సంపన్నులమనీ అనుకుని బలహీనులకు అన్ని నైతిక హక్కులను నిరాకరించవచ్చు. అటువంటి సందర్భాలలో ప్రభుత్వమూ, సంపదా అధిక బలశాలుర చేతికి పోతుంది. నీతీ, ప్రతిభ అప్పుడు క్రూరులను సేవించాల్సి వస్తుంది; గ్రీకు బానిసలు రోమన్ ఆక్రమణదారులను సేవించినట్టుగా. నైతిక సమానతా దర్శం గురించి వ్యతిరేకంగా చిట్టచివరి మాట వెలువడినప్పుడు, ఇంకా అందులో ఏదో వుందని అంతా ఒప్పుకుంటారు, పైకి నిరసించినా ఆచరణలో పాటిస్తారు. మానవ వ్యక్తిత్వాలకు గౌరవం లేని సమాజం బందిపోటు ముఠా లాంటిది."

## సౌభ్రాతృత్వం ఎందుకు తప్పనిసరి?

సౌభ్రాతృత్వం మనుషుల్ని గౌరవించడానికి ప్రేమించడానికి, ఇతరులతో కలిసి ఉందామన్న కోరికకు వ్యక్తి చేసుకున్న రూపకల్పనకు పేరు. దానిని పాల్ బాగా చెప్పాడు. 'మానవ జాతులన్నిటిదీ ఒకటే రక్తం. యూదులూ లేదు గ్రీకు లేదు, సంకెల లేదు, స్వతంత్రం లేదు, ఆడ లేదు మగలేదు, జీసస్ క్రీస్తుకు అందరూ ఒక్కటే' ప్లైమౌత్‌లో ప్రవేశిస్తూ పిలగ్రిం ఫాదర్స్ కూడా ఇలాగే చెప్పారు. "మేమందరమూ పవిత్ర దేవుని ఒప్పందంలోఒక శరీరంగా కుట్టబడినాం.... ఒకరి మంచికోసం ఇంకొకరు పెంచుకున్న ఆదరణ గుణం ఇందుకాధారం." సౌభ్రాతృత్వం అంటే పై మాటల సారాంశం. సౌభ్రాతృత్వం సామాజికాంశాలను గట్టిపరుస్తుంది. ప్రతి వ్యక్తికీ ఇతరుల సంక్షేమాన్ని గురించి ఆలోచించే వ్యక్తిగత ఆసక్తిని పెంచుతుంది. అతని అనుభూతులు వారి శ్రేయస్సులో ఏకీభవం పొందేట్టు, కనీసం దాని గురించి అధికంగా శ్రద్ధ కనబరచేట్టు చేస్తుంది. సౌభ్రాతృత్వ భావనతో నిండిన వాడికి ఇతరుల శ్రేయస్సు తాను శ్రద్ధ తీసుకోవలసిందిగా కనిపిస్తుంది. ఇతరుల శ్రేయస్సును పట్టించుకోవడం మన భౌతిక ఉనికికి సంబంధించిన ఇతర పరిస్థితులలాగే అత్యంత సహజంగా, అవసరంగా కనిపిస్తుంది. ఇతరులతో సంపూర్ణ సహానుభూతి పొందలేనిచోట వారి సాధారణ ప్రవర్తనలో ఏకత కనిపించడం అసాధ్యం. సామాజిక భావనలు పెంపొందని మనిషి తోటివారిని ప్రత్యర్థులుగా చూస్తాడు. ఇతరులను జయించి తనకోసం తాను గెలుపొందాలనుకుంటాడు.

స్వేచ్ఛ అంటే ఏమిటి? స్వేచ్ఛా సామాజిక వ్యవస్థలో అదెందుకు అవసరం?

స్వేచ్ఛ రెండు రకాలు. 1. సాంఘిక స్వేచ్ఛ, 2. రాజకీయ స్వేచ్ఛ. సాంఘికస్వేచ్ఛ అంటే 1. కదలిక స్వేచ్ఛ. సరైన చట్ట పద్ధతి లేకుండా అరెస్ట్ కావడం నుంచి స్వేచ్ఛకు ఇది మరో పేరు. 2. వాక్స్వాతంత్ర్యం (ఆలోచనలో, అధ్యయనంలో, రచనలో, చర్యలో స్వేచ్ఛ.) 3. ఆచరణ స్వేచ్ఛ.

మొదటి రకం స్వేచ్ఛ ప్రాథమికమైనది. ప్రాథమికం మాత్రమే కాదు, అత్యవసరం కూడా. దాని విలువను గురించి ఎలాంటి సందేహమూ అక్కరలేదు. రెండో రకం స్వేచ్ఛ భావ స్వాతంత్ర్యం. ఇది అనేక కారణాల వల్ల ముఖ్యమైంది. సాంఘిక రాజకీయ నైతిక మేధోభివృద్ధికి ఇది అవసరమైన నియమం. ఇది ఎక్కడ ఉండదో అక్కడ అంతా యాంత్రికం అవుతుంది. సృజనాత్మక నీరుగారిపోతుంది. అవుతుంది. ఆచరణ స్వాతంత్ర్యం అంటే ఒక వ్యక్తి తనకు వచ్చిన పనిచేయటం. ఇది కేవలం సంప్రదాయం కాదు. అది వాస్తవంగా ఉండాలి. నిర్దిష్టమైన పనులు చెయ్యడానికి గట్టి అధికారం ఉండడం అని దాని అర్థం. స్వతంత్రం ఉపయోగపడనప్పుడు స్వతంత్రం రానట్టే లెక్క. నిజమైన ఆచరణ స్వాతంత్ర్యం దోపిడి నిర్మూలించబడిన చోట, ఒక వర్గం మరో వర్గాన్ని అణచివేయని చోట, నిరుద్యోగం లేనిచోట, దారిద్ర్యం లేనిచోట, వ్యక్త ఆచరణల వల్ల ఉద్యోగ భద్రత ఉన్నచోట, ఇంటి భద్రత, ఆహార భద్రత ఉన్నచోట ఉంటుంది.

చట్ట నిర్మాణంలో, ప్రభుత్వ స్థాపనలో, నిర్మూలనలో వ్యక్తికి భాగస్వామ్యం ఉండడమే రాజకీయ స్వేచ్ఛ. మనుషులకు జీవించే హక్కు, స్వేచ్ఛకలిగి వుండే హక్కు, సంతోషించే హక్కు వంటి పరాధీనం కాని హక్కులు పొందడం కోసమే ప్రభుత్వాలు స్థాపించబడ్డాయి. అందువల్ల ఎవరి హక్కుల్ని తాను రక్షించవలసి ఉన్నదో వాళ్ళలోంచి అధికారం పొందాలి. ప్రభుత్వాధికారం, పాలితుల ఆమోదం పొందాలన్నప్పుడు అర్థం ఇదే. రాజకీయ స్వాతంత్ర్యం మానవ వ్యక్తిత్వం సమానత్వం అనే సూత్రం నుంచి కోత వేయడమే. అంటే అర్థం మొత్తం రాజకీయాధికారం ప్రజల నుంచే సమకూరుతుంది కనుక, ప్రజలు వారే నిర్ణయించుకున్న లక్ష్య సాధనల కోసం సమష్టి స్వంత జీవితాలను నిర్దేశించి, నియంత్రించగలరు.

స్వేచ్ఛా సామాజిక వ్యవస్థ యొక్క ఈ రెండు సూత్రాలు పరస్పరం సంబంధం గలవి. విడదీయడానికి సాధ్యం కానివి. ఒకసారి మొదటి దానిని ఆమోదించామంటే రెండోది సహజం గానే దానిననుసరిస్తుంది. ఒకసారి మానవ వ్యక్తిత్వం యొక్క పవిత్రతను ఆమోదించామంటే, ఆ వ్యక్తిత్వాభివృద్ధికి తగిన వాతావరణంగా స్వేచ్ఛ సమానత్వం సౌభ్రాతృత్వం అనే సూత్రాన్ని కూడా ఆమోదించి తీరాలి.

# II

హిందూ సామాజిక వ్యవస్థ ఈ సూత్రాలను ఎంతవరకు గుర్తిస్తుంది? లోతుగా పరిశీలించడం అవసరం. ఎందుకంటే ఈ అంశాలను అది గుర్తించినప్పుడే అది స్వేచ్ఛా సామాజిక వ్యవస్థ అనే పేరుకు పాత్రమౌతుంది.

హిందూ సామాజిక వ్యవస్థ వ్యక్తిని గుర్తిస్తుందా? అది వ్యక్తి ప్రత్యేకతను–విశిష్టతను, అతని నైతిక బాధ్యతను గుర్తిస్తుందా? అది వ్యక్తి యొక్క స్వతంత్రమైన ఉనికిని, అశక్తతలకు మాత్రమే గాక రాజ్యాన్ని ప్రశ్నించే హక్కులు గలవానిగా గుర్తిస్తుందా! ఈ అంశం మీద చర్చను యహోవా ఎజెకిల్‌కు చెప్పిన వాక్యాలతో ప్రారంభించవచ్చు.

"చూడండి! అన్ని ఆత్మలూ నావే. తండ్రి ఆత్మలాగే కుమారుని ఆత్మ కూడా నాదే. పాపాత్మ నశిస్తుంది..... తండ్రి చేసిన పాపాన్ని కొడుకు మొయ్యడు, కొడుకు చేసిన పాపాన్ని తండ్రి మొయ్యడు. పుణ్యాత్ముల పుణ్యం అతనిమీద ఉంటుంది; పాపాత్ముల పాపం కూడా అలాగే."

ఇక్కడ వ్యక్తి, అతని నైతిక బాధ్యతల విశిష్టత ప్రశంసింపబడింది. హిందూ సామాజిక వ్యవస్థ వ్యక్తిని సాంఘిక ప్రయోజనానికి కేంద్రంగా గుర్తించదు. అందుక్కారణం, హిందూ సామాజిక వ్యవస్థ ప్రధానంగా వ్యక్తుల మీద కాక వర్గం లేక వర్ణం మీద ఆధారపడటమే. ఈ వ్యవస్థ మౌలికంగా నాలుగు వర్ణాలను గుర్తించింది. 1. బ్రాహ్మణులు 2. క్షత్రియులు 3. వైశ్యులు 4. శూద్రులు. ఇప్పుడు ఈ వ్యవస్థలో నాలుగు వర్ణాలున్నాయి. అయిదో వర్ణం వాళ్ళు పంచములు లేక అస్పృశ్యులు అని పిలవబడుతున్నారు. హిందూ సమాజంలో వ్యక్తిగా బ్రాహ్మణుడు, వ్యక్తిగా క్షత్రియుడు, వ్యక్తిగా వైశ్యుడు, వ్యక్తిగా శూద్రులు, వ్యక్తిగా పంచముడు ఒక విభాగం – యూనిట్ – కాదు. వివాహానికి వారసత్వానికి తప్ప ఇంక దేనికీ కుటుంబం కూడా హిందూ సామాజిక వ్యవస్థలో ఒక విభాగంగా గుర్తింపబడలేదు. ఈ సమాజంలో విభాగం – యూనిట్ వర్గమే లేక వర్ణమే. వర్గానికి హిందూ సాంకేతికపదం వర్ణం. హిందూ సామాజిక వ్యవస్థలో వ్యక్తిగత ప్రతిభకు గాని వ్యక్తిగత న్యాయానికి గాని స్థానం లేదు, అవకాశం లేదు. ఒక వ్యక్తికి ఒక గౌరవం ఉందంటే అది అతనివల్ల రాలేదు, అతని వర్ణం వల్లనే. ఆ గౌరవాన్ని అతడు అనుభవిస్తున్నాడంటే అతడు ఆ వర్ణానికి చెందడం వల్లనే. ఇందుకు భిన్నంగా ఒకడు కష్టాల్లో వున్నాడంటే కారణం అతని ప్రవర్తనకు తగిన శాస్తి జరగడం వల్ల కాదు. అశక్తత అనేది అతని కులం మీద రుద్దబడిన అశక్తత. అతడు అందులో ఉన్నాడంటే, అతను ఆ కులానికి చెందినవాడు కాబట్టే.

హిందూ సామాజిక వ్యవస్థ సౌభ్రాతృత్వాన్ని గుర్తిస్తుందా? హిందువుల క్రైస్తవులలాగే,

మహమ్మదీయులలాగే తాము దేవుని చేత సృష్టింపబడ్డామని నమ్ముతారు. అయితే క్రైస్తవులు, మహమ్మదీయులు దీనిని సమగ్రమైన సత్యంగా ఒప్పుకుంటుండగా హిందువులు దీనిని సత్యంలో ఒక భాగంగా మాత్రమే నమ్ముతారు. మానవులు దేవునిచేత సృష్టింపబడ్డారనేది ఒకటో భాగం. దేవుడు తన దివ్య శరీరంలోని విభిన్న భాగాల నుంచి విభిన్న రకాల మనుషులను సృష్టించా డన్నది రెండో భాగం. హిందువులు ఒకటో భాగం కన్నా రెండో భాగం అతి ముఖ్యమైందిగా, అతి ప్రాథమికమైందిగా భావిస్తారు.

భగవంతుని శరీరంలో విభిన్న భాగాల నుంచి మనుషులు సృష్టింపబడ్డారనే సిద్ధాంతం మీద హిందూ సామాజిక వ్యవస్థ ఆధారపడింది కాబట్టి, అందులో పాల్, పిలిగ్రిం ఫాదర్స్‌ల అభిప్రాయాలకు స్థానం లేదు. బ్రాహ్మణుడు ముఖం నుంచి, క్షత్రియుడు భుజం నుంచి పుట్టారు గాబట్టి బ్రాహ్మణుడు క్షత్రియునికి సోదరుడు కాదు. క్షత్రియుడు చేతుల లోంచి, వైశ్యుడు తొడలలోంచి పుట్టారు గనక క్షత్రియుడు వైశ్యునికి సోదరుడు కాదు. ఎవడూ ఎవడికీ సోదరుడు కాదు కాబట్టి, ఎవడూ ఇంకొకడిని భరించడు.

భగవంతుని శరీరంలోని విభిన్న భాగాలలోంచి విభిన్న వర్ణాలు పుట్టాయనే సిద్ధాంతం ఆయా వర్ణాల వాళ్ళు విడిగా ప్రత్యేకంగా ఉండాలనే విశ్వాసాన్ని కలిగించింది. ఈ విశ్వాసమే హిందువులో తాను సాటి హిందువుల నుంచి భిన్నంగా విడిగా ప్రత్యేకంగా ఉండాలనే స్పృహను కలిగించింది. విభిన్న వర్ణాల వాళ్ళు జరుపుకొనే ఉపనయనోత్సవానికి సంబంధించి మనువు చెప్పిన నియమాలను పోల్చి చూడండి.

2–36: బ్రాహ్మణునికి ఏడోయేట, క్షత్రియునికి పదోయేట, వైశ్యునికి పదకొండో యేట ఉపనయనం చెయ్యాలి.

2–41: బ్రాహ్మణ బ్రహ్మచారులు జింక తోలును, క్షత్రియ బ్రహ్మచారులు రురుమృగ చర్మాన్ని, వైశ్య బ్రహ్మచారులు గొర్రె తోలును ఉత్తరీయాలుగా ధరించాలి. అలాగే వాళ్ళు క్రమంగా నారబట్టలను, పట్టుబట్టలను, ఉన్ని బట్టలను కట్టుకోవాలి.

2–42: బ్రాహ్మణ బ్రహ్మచారి ముంజ కసువుతో పేనిన, నున్నగా ఉన్న, మూడు పేనికలు గల మొలతాడును, క్షత్రియ బ్రహ్మచారి మూర్వ గడ్డితో పేనిన మొలతాడును, వైశ్య బ్రహ్మచారి జనపనారతో పేనిన మొలతాడును కట్టుకోవాలి.

2–43: ముంజ కసువు మొదలైనవి దొరకనప్పుడు కుశ, రెల్లు, తుంగలతో పేనిన మూడుముళ్ళ మొలతాడును పై క్రమంలోనే ధరించాలి.

2-44: బ్రాహ్మణులు ప్రత్తి నూలుతో పేనిన యజ్ఞోపవీతాన్ని ధరించాలి. క్షత్రియులు జనపనారతోను, వైశ్యులు ఊలుతోను పేనిన యజ్ఞోపవీతాలను ధరించాలి. యజ్ఞోపవీతాన్ని మూడు పేటలతో కుడివైపుగా చుట్టాలి.

2-45: బ్రాహ్మణుడు మారేడు వేప మోదుగు కొయ్యను దండంగా ధరించాలి. క్షత్రియుడు మర్రి వేప చంద్ర కొయ్యను, వైశ్యుడు జువ్వి లేక మేడి కొయ్యను దండంగా ధరించాలి.

2-46: వీళ్ళు వరుసగా తమ దండాలను తల వెంట్రుకల దాకా, నొసటి దాకా, ముక్కు వరకు ఉండేట్లు ధరించాలి.

2-48: ఆ దండాన్ని ధరించి సూర్యుని ఆరాధించి అగ్నికి ప్రదక్షిణం చేసి భిక్షాటన చెయ్యాలి.

2-49: ఉపనీతుడైన బ్రాహ్మణుడు 'భవతి భిక్షాందేహి' అని 'భవతి' శబ్దాన్ని ముందు పలికి భిక్షాటన చెయ్యాలి. క్షత్రియుడు 'భిక్షాం భవతి దేహి' అని 'భవతి' శబ్దాన్ని మధ్యలో పలికి, వైశ్యుడు 'భిక్షాం దేహి భవతి' అని 'భవతి' శబ్దాన్ని చివరలో పలికి భిక్షాటన చెయ్యాలి.

ఇవి చదివిన తర్వాత ఈ భేదాలకు కారణమేమిటి అని ఎవరైనా అడగవచ్చు. ఈ నియమాలు విద్యార్థులకు లేక బ్రహ్మచారులనబడుతూ వేధ్యయనంలోకి ప్రవేశించే వాళ్ళకు వర్తిస్తాయి. ఇక్కడ ఈ భేదాలెందుకు? బ్రాహ్మణ బాలుని ఉపనయనం వయస్సు క్షత్రియ వైశ్య బాలుర ఉపనయనం వయస్సుకన్నా భిన్నంగా ఎందుకుండాలి? వాళ్ళు ధరించే బట్టల్లో ఎందుకు తేడాలుండాలి? యజ్ఞోపవీతాలు నేసే పదార్థంలో సైతం ఎందుకు భేదముండాలి? వాళ్ళు ధరించే దండాల కొయ్యలు వివిధ రకాల చెట్లకు చెందినవిగా ఎందుకుండాలి? అవి రకరకాల పొడవుల్లో ఎందుకుండాలి? భిక్షం అడిగే క్రమంలో 'భవతి' శబ్దం ఒక్కొక్కరు ఒక్కొక్కచోట పెట్టి ఎందుకు పలకాలి? ఈ భేదాలు అవసరం లేనివి, అనుకూలమైనవి కూడా కాదు. సమాధానం ఒక్కటే: తాను తనసాటి వాళ్ళ నుండి భిన్నంగా ఉండాలనే హిందూ స్పృహే. ఈ స్పృహ తాము దేవుని శరీరంలోని విభిన్న భాగాల నుంచి సృష్టింపబడ్డామనే ప్రజల విశ్వాసం ఫలితమే.

ఏదైనా భేదం కనిపిస్తే దానిని తొలగించుకోకుండా పెంచుకోవడం, దానిని గుర్తించడం, పెద్దది చేసుకోవడం కూడా ఈ విశ్వాసం ఫలితంగా కలిగిన స్పృహే. ఒక కులం ఉంటే దానిని ఒక ప్రత్యేకమైన తలపాగా ద్వారా ఒక ప్రత్యేకమైన పేరుతో సూచించాలి.ఒక తెగ ఉంటే, దానికి దాని శిరోవస్త్రముండాలి. భారతదేశంలో 92 తెగలున్నాయి. ప్రతిదీ తనదైన గుర్తు కలిగుంది. 92 తెగలలో ఒక్కోదానికి – ఇంకో దానికన్నా భిన్నమైన గుర్తును కనిపెట్టడం

పెద్ద వ్యవహారం. ఇది అసాధ్యం గనక ఎంత నేర్పు గలవాడినైనా ఈ పని నుండి విరమింపజేసి ఉంటుంది. అయినప్పటికీ హిందువులు ఈ భేదాలను ఎలా ఏర్పరచుకున్నారో ఎంతగా వాటిని పాటించారో 'హిందూ దేవతావళి' అనే మూర్ గ్రంథంలోని చిత్రాలను చూస్తే తెలుస్తుంది.

ఈ ఏకాంత స్పృహకు, వేర్పాటు స్పృహకు విస్తారమైన రూపకల్పనే వర్ణ - కుల - వ్యవస్థ. ఒకే కులం ఎప్పుడూ ఉండజాలదని అర్థం చేసుకోవచ్చు. కులం ఎప్పుడూ బహువచనంలో ఉంటుంది. కులాలు ఉంటాయి. ఒక కులం అనేది ఉండదు. కులాలు ఒకటికన్నా ఎక్కువ ఉండాలని సూత్రప్రాయంగా అంగీకరించినా అవి ఎన్ని ఉండాలి? మొదట అవి నాలుగే. ఈరోజు ఎన్ని ఉన్నాయి? 2000 కన్నా తక్కువ ఉండవని అంచనా. బహుశా 3000 ఉంటాయి. దాంట్లో ఆందోళన కలిగించే అంశం ఇదొక్కటే కాదు. ఇంకా వేరే ఉన్నాయి. కులాలు ఉప కులాలుగా విభజింపబడ్డాయి. అవి లెక్కలేనన్ని. బ్రాహ్మణుల జనాభా సుమారు ఒక కోటిన్నర. అయితే బ్రాహ్మణుల్లో 1886 ఉప కులాలున్నాయి. ఒక్క పంజాబులోనే సారస్వత బ్రాహ్మణులు 469 ఉప కులాలుగా విడిపోయారు. పంజాబ్ కాయస్థులు 890 ఉప కులాలుగా విడిపోయారు. సామాజిక జీవితం ఇలా అసంఖ్యాకమైన చిన్న చిన్న చీలికలయ్యే క్రమం ఇంకా చూపవచ్చు. ఈ చీలిక విధానం సామాజిక జీవితాన్ని అసాధ్యం చేసింది. ఈ విభజన క్రమం ఒక చిన్న విభాగం విధి విషేధాలు పాటిస్తూ వివాహ సంబంధాలు చేసుకోవడాన్ని అసాధ్యం చేసింది. బనియాల్లో 100 కుటుంబాలకు మించని ఉప కులాలున్నాయి. వాటి మధ్య చాలా ఆంతర సంబంధముంది. కాని జ్ఞాతి నియమాలను అతిక్రమించకుండా వాళ్ళు పరస్పరం పెళ్ళి జరుపుకోవడం కష్టం.

కులాలను ఉప కులాలుగా విభజించడానికి చిన్న సాకు చాలు అన్నది గుర్తుంచుకోవాలి. స్థలం మారడం, వృత్తి మారడం, సాంఘికాచారాలు మారడం, అపవిత్రత వల్ల మారడం, సంపద పెరగడం వల్ల మారడం, గొడవ వల్ల వచ్చిన మార్పులు, మతం మారడం వల్ల వచ్చిన మార్పులు - ఇవి కులాల్ని ఉప కులాలుగా విభాగించాయి. హిందువుల్లోని ఈ ధోరణిని వివరించడానికి బ్లంట్ అనేక సందర్భాలు ఉదహరించాడు. అన్నిటినీ ఇక్కడ పేర్కొనడం సాధ్యంకాదు. చిన్న గొడవలు ఒక కులాన్ని ఉప కులాలుగా ఎలా చీల్చాయో చూపించే అంశాన్ని ఉదహరిస్తాను. బ్లంట్ ఇచ్చిన ఉదాహరణ! "లక్నోలో 'ఖటిక' అనే ఒక ఉపకులం ఉంది. అందులో మూడు గ్రూపులు ఉన్నాయి. అవి మానిక్‌పూర్, జైస్వాల, దల్మన్‌లు. వాళ్ళు అంతర్ వివాహాలు చేసుకున్నారు, సహ భోజనాలు చేశారు. వాళ్ళ నాయకులైన చౌధరిల అధ్యక్షతలో పంచాయతీలు చేసుకున్నారు. ఇరవైయ్యేళ్ళ క్రితం ఒక్కో గ్రూప్‌కి ఒక్కో చౌధరి ఉండేవాడు. ఇప్పుడు జైస్వాలకు ముగ్గురు, మానిక్‌పూర్‌కు ఇద్దరు ఉన్నారు. గొడవ ఇలా వచ్చింది. మొదట ఒకామె వీధిలో పండ్లు అమ్ముతుండేది. ఆమె సోదరులు ఆ పని మానుకోమని చెప్పారు, అది వాళ్ళ కుల గౌరవానికి అవమానం తెస్తుందన్న ఉద్దేశంతో. అంగట్లో మాత్రమే అమ్ముకోమన్నారు. ఆమె, ఆమె భర్త ససేమిరా అన్నారు. చివరికి వాళ్ళ గ్రూపు వాళ్ళు ఏకపక్షంగా ఆమె భర్తను కులం నుంచి బహిష్కరించారు. దాల్మ గ్రూపు వాళ్ళు, దానిని వ్యతిరేకిస్తూ ఆ భర్తను కులంలో కలుపుకున్నారు. కుల బహిష్కారానికి విరుగుడుగా ఎనభై రూపాయిలు కట్టించుకున్నారు.

తర్వాత ఒకాయన్ని ఆయన గ్రూపు వాళ్లే కుల బహిష్కారం చేశారు. కేసు విచారణలో ఉండగా, జైస్వాల చౌధురి పొరపాటున అతనిని భోజనానికి పిలిచారు. అప్పుడు, మూడు గ్రూపుల వాళ్ళు మాట్లాడుకొని చౌధురికి 30 రూపాయిలు అపరాధం వేశారు. చివరికి అపరాధాలు పోగైనాయి. ఒక 'కథ' నిర్వహించాలని తీర్మానించారు. దాల్మ చౌధురి తనవంతు డబ్బు ఇస్తానన్నాడు. కాని మణిపూర్ చౌధురి (ఉమ్మడిగా నిధి పెట్టుకొన్న వ్యక్తి) ఇందుకు నిరాకరించాడు. ఆ కథా కార్యక్రమానికి దాల్మ గ్రూపు వాళ్ళు వస్తారని ఆయన అలా చేశారు. ఈ దశలో ఈ అంశం కోర్టుకెక్కింది. ఈలోపల మూడు గ్రూపులు తమలో తాము వివాహాలు చేసుకోవడం మానేశాయి. ఒక ఉప కులం మూడు విభాగాలైంది. ఒకదానికొకటి ప్రత్యర్థులైనాయి.

ఒక కులంలో, కొంతమంది కలిపి ఏదైనా ఒక కొత్త పూజా విధానాన్ని, ఇతరులు ఆమోదించని దానిని, అనుసరించారంటే వాళ్ళు ఒక ప్రత్యేకమైన ఉప కులంగా విడిపోతున్నారని అనుకుంటాం. అలాంటి ఉప కులాలు అరుదు. ఇది అతడు ఎవరితో కూర్చొని ఏమి తింటాడు, ఎవరిని పెళ్ళాడతాడు అనే దానిమీద చూపించే సహనంపై ఆధారపడి ఉంటుంది. తెలి కులంలో మహావీరులు, పాంచి ప్రియులు అనే ఉప కులాలను, బర్హై, భంగి, కధేరలలో కొరి, నామక్షలిలను మనం చూడవచ్చు.

ఈ కులాలు ఒకదాని పట్ల ఇంకొకటి ఎలా ప్రవర్తిస్తాయి? వాళ్ళను నడిపించే సూత్రం 'దూరంగా ఉండు', 'వాళ్ళను పెళ్ళి చేసుకోవద్దు', 'వాళ్ళతో కలిసి తినొద్దు', 'తాకవద్దు'. బ్లంట్ దానిని చక్కగా వివరించాడు.

"ఒక హిందువు తనొక్కడే గాని, తన కులం వాళ్ళతో కలిసిగాని అన్నం తినడానికి కూర్చుంటాడు. స్త్రీలు మగవాళ్ళతో కలిసి తినకూడదు. వాళ్ల యజమానులు తిండి పూర్తి చేసేదాకా వాళ్ళు ఆగుతారు. భోజనంగాని అందులో భాగంగాని కచ్చాగా ఉంటే (సామాన్యంగా అలాగే ఉంటుంది, భోజనంలో ఎక్కువగా చపాతీ ఉంటుంది) ఆమంత్రణరక్షా విధులు నిర్వ హించి అతను భోజనం చెయ్యాలి. వంట చేసుకునేచోట – చుల్లాలో నలుచదరంగా గుర్తు వేయబడ్డ 'చౌకా'లో అతడు కూర్చోవాలి.ఎవరైనా కొత్తవారి నీడ ఆ చౌకం మీద పడితే అందులో వండిన భోజనమంతా కలుషితమైనట్లే. దాన్ని విధిగా పారెయ్యాలి. ప్రయాణపు విడిదిలో హిందూ సేవకులు ప్రతి ఒక్కరు విడివిడిగా ఇతరులతో కలవకుండా తన చౌకాలోనే తానేర్పరచుకున్న పొయ్యి మీదే వండుకుంటూ విడిగా తింటూ ఉండడాన్ని చూడవచ్చు.....

"మొత్తంమీద నీళ్ళను తీసుకోడానికి కూడా, పక్కా భోజనం తీసుకోడానికి సంబంధిం చిన నియమాలే వర్తిస్తాయి. అయితే మరికొంత సడలింపునకు ఎక్కువ అవకాశం ఉంటుంది. సమస్య అంతా నీళ్ళు పట్టుకునే పాత్రకు సంబంధించిందే. ఒక అగ్రవర్ణస్థుడు తనకోసం తన లోటాలో ఒక నిమ్న వర్ణస్థుడు నీళ్ళు తీసుకొనిరావడాన్ని అంగీకరిస్తాడు గాని ఆ నిమ్నవర్ణం వాని లోటాలోనీళ్ళు తాగడానికి మాత్రం అంగీకరించడు; లేదా అగ్రవర్ణంవారు అస్పృశ్యులకు

తప్ప ఎవరికైనా తన లోటాతో నీళ్ళుపోస్తాడు. అయితే రైల్వే స్టేషన్లలో ప్రయాణికులకు నీళ్ళు అందించడానికి నియమించబడ్డ వాళ్ళందరూ బర్హాయి, బరి, బర్గుంజ, హల్వాయి, కహార్, నాయీ కులాల వాళ్ళే; ఇంకా పై కులాల నుంచి కూడా ఉన్నారు.

ఇంకా పొగ తాగడానికి సంబంధించిన నియమాలు కఠినంగా ఉన్నాయి. సాధారణంగా ఒకడు ఇంకొకరితో కలిసి హుక్కా పీల్చడం అలవాటు, అయితే తన కులం వాడితోనే కలిసి పీల్చాలి. కారణం సామాన్యమే. ఇతరులతో కలిసి పొగ పీల్చడమంటే, తన హుక్కాను ఇతరులకివ్వడమనే. ఈ నియమం చాలా కఠినమైంది. జాట్‌లు, అహిర్‌లు, గుజార్‌లు కలిసి కూర్చొని పొగతాగడం వల్ల వాళ్ళందరూ దగ్గర సంబంధం కలవారే అనే అభిప్రాయానికి అవకాశం వచ్చింది. కొన్ని కులాలు, ఉదాహరణకు కాయస్థులు, మరో విధంగా హుక్కా పీలుస్తారు. గొట్టాన్ని నోట్లో పెట్టుకోకుండానే హుక్కా గొట్టం చుట్టూ చేతులు మూసి పట్టుకుని మామూలుగా పొగ తాగుతున్నట్లే తాగుతారు. ఈ రెంటికి మధ్య తేడా పాటిస్తారు. పాత్రల్ని గురించి చెప్పాల్సిన పనిలేదు. ఎలాంటి పాత్రలు తయారు చెయ్యాలి అన్న విషయాన్ని గురించి, నియమాలు ఉన్నాయి. అవి ఎక్కువ మత సంబంధమైనవి. సామాజికాలు కావు. హిందువులు ఇత్తడి, కంచు పాత్రలు వాడాలి. కంచు పాత్రలకు ఎక్కువగా చిన్నచిన్న మాట్లు వేసి ఉంటారు. (ఒకవేళ అవి వాడడానికి వీల్లేకుండా మైల అయితే వాటిని కరిగించి మార్పు చేసుకోవడమే మార్గాంతరం) ఈ శుద్ధతకు సంబంధించిన భావనే ప్రతి వాడూ తనకంటూ కొన్ని పాత్రలను ప్రత్యేకంగా పెట్టుకునే స్థితిని కల్పించింది. కనీస పక్షంగా తాగడానికి ఒక లోటా, వండుకోడానికి ఒక బట్నా, తినడానికి ఒక కంచం ఉండాలి. ఇంకాస్త పై వాళ్ళయితే ఒక చెంచా, ఒక చెంబు పెట్టుకుంటారు. ఏవైనా విశేష సందర్భాల్లో అయితే కులస్థులు తాము సేకరించుకున్న అన్నిరకాల పెద్ద పాత్రల్ని ఆ గృహస్థుకిస్తారు. ఈ పాత్రల్ని అపరాధ దండాల మీద వచ్చే డబ్బుతోనో, అందరికీ చెందిన ఆస్తి మీద వచ్చే ఆదాయంతోనో సంపాదిస్తారు."[3]

ఇలాంటి సెంటిమెంట్ల మీద ఆధారపడిన సామాజిక వ్యవస్థలో ఏమి సౌభ్రాతృత్వం ఉంటుంది? సౌభ్రాతృత్వ స్ఫూర్తితో పని చెయ్యడం కాక, కులాల మధ్య సంబంధాలు సోదర హత్యా రూపంలో ఉన్నాయి. వర్గ స్పృహ, వర్గ సంఘర్షణ, వర్గ పోరాటం కార్ల్ మార్క్స్ రచనల ద్వారా వెల్లడైన సిద్ధాంతాలనుకుంటాం. కానీ అది పూర్తిగా పొరపాటు. వర్గ చైతన్యాన్నీ, వర్గ పోరాటాన్నీ, చవిచూసిన నేల భారతదేశం. నిజానికి భారతదేశం, బ్రాహ్మణులకు క్షత్రియులకు[4] మధ్య వర్గ పోరాటం జరిగిన నేల! ఈ పోరాటం కొన్ని తరాల కాలం కొనసాగింది. చాలా ఘోరంగా జరిగింది. అది తీవ్రమై పరస్పరం సమూలంగా నాశనం చేసుకునేదాకా పోయింది.

సోదర హత్యా స్ఫూర్తి సౌభ్రాతృత్వ స్ఫూర్తికి స్థానమిచ్చిందని భావించలేం. అదే వేర్పాటు స్పృహ హిందూ సామాజిక వ్యవస్థలో కొనసాగుతున్నది. క్రింది విషయాన్ని చూడండి.

ప్రతి కులమూ ఒక ప్రత్యేక మూలాన్ని పేర్కొంటుంది. కొందరు ఒక ఋషినో లేక ఒక

నాయకునో తమ మూల పురుషుడుగా పేర్కొంటారు. అయితే ఒక్కో దాంట్లో ఒక్కో ఋషి, ఒక్కో నాయకుడు ఉంటారు. ఇతరులు తమ మూల పురుషులుగా పేర్కొన్న ఋషులతో నాయకులతో వీళ్ళకు సంబంధముండదు. ప్రతి కులమూ మరో కులంకన్నా ఉన్నతమైన స్థానాన్ని స్థాపించుకోవడంలో నిమగ్నమై ఉంటుంది. సహపంక్తి, వివాహ బంధ నియమాలు దానిని బాగా వివరిస్తాయి. బ్లంట్ ఇలా చెప్పాడు.[5]

"వంట చేయడంలో, భోజనం పెట్టేవాడి కులంకన్నా, వంట చేసే వాడి కులం ఏదన్నదే ప్రమాణం కావడం గమనించదగ్గ విషయం. అగ్ర కుల హిందువు ఏ కులానికి చెందిన వ్యక్తి ఇంటిలోనైనా సరే, అతడెంత తక్కువ కులం వాడైనాసరే, భోజనం చేస్తాడు – అయితే ఆ వంట చేసినవాడు తగిన కులం వాడు కావాలి. హిందువు నీళ్ళతో వండిన కచ్చా తిండికి, నెయ్యితో చేసిన పక్కా తిండికి మధ్య భేదం చూస్తాడు. ఈ భేద దృష్టి, నెయ్యి అపవిత్రత నుండి కాపాడుతుందనే సూత్రం మీద ఏర్పడుతుంది. అన్ని ఆహార పదార్థాల లక్ష్యమూ ఆ రక్షణే కాబట్టి, ఈ కల్పన ఒక హిందువు కచ్చా తిండి పట్ల కన్నా పక్కా తిండి పట్ల తక్కువ జాగ్రత్తగా ఉండగలడు. నియమాలను సడలించుకోగలడు. సమాన కులాలతో, అధిక కులాలతో వివాహ బంధ నియమం (హైపర్‌గమీ) గురించి చెబుతూ బ్లంట్ ఇలా అంటాడు.[6]

"హైపర్‌గమీ అనే ఆచారం చాలా కులాల వివాహాల నియమాల్లో ముఖ్యమైన మార్పులు తీసుకొస్తుంది. అది అమల్లో ఉన్నప్పుడు తెగకు వెలుపల వివాహాలు చేసుకునే గ్రూపులు వాటి సాంఘిక హోదాకు అనుగుణంగా విశ్లేషింపబడ్డాయి. ఒకసారి ఉన్నత స్థాయి గల గ్రూపు ఒక తెగ అమ్మాయిని స్వీకరిస్తే, ఆ తెగవారు తర్వాత తక్కువ స్థాయిగల గ్రూపుల వాళ్ళకు అమ్మాయిని ఇవ్వరు. ఈ నియమం రాజపుత్రులలో బలంగా ఉంది. అనేక ఇతర కులాలు కూడా దాన్ని పాటిస్తాయి. హిందువులందరిలోనూ హైపర్ గమీ కనిపిస్తుంది."

సమానులతో, అధికులతో మాత్రమే సహపంక్తి భోజనం చేయాలని, వివాహ బంధం ఏర్పరచుకోవాలన్న నియమాల వెనుక ఉద్దేశం ఏమిటి? ఎక్కువ తక్కువ అనే స్పృహ తప్ప మరేమీ కాదు. ఈ స్పృహతో అన్ని కులాలూ పీడింపబడ్డాయి. దీని నుంచి తప్పించుకున్న కులం లేదు. హిందూ సామాజిక వ్యవస్థ ఒక నిచ్చెనలాంటిది. ఒక కులం మీద మరో కులం ఉంటూ కులద్వేషంలో ఆరోహణ, తిరస్కారంలో అవరోహణ ప్రతిబింబిస్తుంటుంది.

ఈ స్ఫూర్తి ఒక కులం వాళ్ళు మరో కులం వాళ్ళను ఎగతాళి చేయడం కోసం కల్పించిన సామెతలలో కనబడుతుంది. నిమ్న కుల రచయితలు అగ్ర కులాలకు బూతు మూలాన్ని పేర్కొంటూ రచనలు చెయ్యడానికి దారి తీయించింది. ఇందుకు సహ్యాద్రి ఖండం మంచి ఉదాహరణ. హిందూ మత సాహిత్యంలో ఇది ఒకానొక పురాణం. ఇది సంప్రదాయ పురాణాలకన్నా భిన్నమైన శైలిలో రాయబడింది. ఇది విభిన్న కులాల మూలాన్ని గురించి చర్చిస్తుంది. ఇది బ్రాహ్మణులకు రోతగా ఉండే మూలాన్ని చెబుతుంది. ఇతర కులాలకు ఉన్నతమైన మూలాలను

పేర్కొంటుంది.

హిందూ సామాజిక వ్యవస్థ సమానత్వాన్ని గుర్తిస్తుందా? లేదనే సమాధానం. హిందూ సామాజిక వ్యవస్థకు మానవులందరూ సమానంగా పుట్టారనే సిద్ధాంతం నచ్చదు. ఆధ్యాత్మిక దృష్టితో ఈ సిద్ధాంతం తప్పదు సిద్ధాంతమంటుంది. హిందూ సామాజిక వ్యవస్థ ప్రకారం మానవులందరూ ప్రజాపతిసంతానమే అయినప్పటికీ, అందరూ సమానులు మాత్రం కారు. బ్రాహ్మణులు ముఖం నుండి పుట్టారు. క్షత్రియులు భుజం నుండి పుట్టారు. వైశ్యులు తొడల నుండి పుట్టారు. శూద్రులు పాదాల నుండి పుట్టారు. వాళ్ళు పుట్టిన అవయవాలకు సమాన విలువ లేదు కాబట్టి, వాటిలోంచి పుట్టినవాళ్ళు సమానం కాదు. జీవశాస్త్ర దృష్ట్యా హిందూ సామాజిక వ్యవస్థ ఈ సిద్ధాంతాన్ని వాస్తవ దృక్పథంతో నిర్మించబడిందా అని పరిశీలించడానికి పూనుకోలేదనిపిస్తుంది. ఇది వాస్తవం కాకపోతే; అంటే మనుషులు ప్రవర్తనలో సమానం కారు – అంటే మేలు. మరో రకంగా ఇది వాస్తవమైతే అంటే మనుషులందరూ సమానమే అంటే ఆ సిద్ధాంతం ఘోరమైంది. హిందూ సామాజిక వ్యవస్థ ఆ సిద్ధాంతాన్ని వాస్తవంగా చూడడంలో నిర్లక్ష్యంగా ఉంది. దానిని నైతికసూత్రంగా చూడడంలో కూడా నిర్లక్ష్యంగానే ఉంది. వ్యక్తులు శక్తిలో, ప్రవర్తనలో ఎంత విభిన్నంగా ఉన్నప్పటికీ మనుషులు అనబడతారు, గౌరవానికి తగినవారు, సామాజిక క్షేమం అందరి శక్తుల్నీ సమానంగా వాడుకునే రీతిలో వ్యవస్థను నిర్మించినప్పుడే సాధ్యమౌతుంది అన్న అంశాన్ని గుర్తించడానికి తిరస్కరిస్తుంది. పరిస్థితుల సమానత్వాన్ని, సంస్థల సమానత్వాన్ని జీవన విధాన సమానత్వాన్ని అది అనుమతించదు. సమానత్వ భావనకే అది వ్యతిరేకం.

# III

హిందూ సామాజిక వ్యవస్థ సమానత్వ సౌభ్రాతృత్వాల మీద ఆధారపడలేదు గనక, దానికి ఆధారభూతమైన సూత్రాలేవి? ఈ ప్రశ్నకు ఒకేఒక్క సమాధానముంది. వాటిని కొందరు మాత్రమే అర్థం చేసుకోవచ్చు గాక; హిందూ సమాజంపై వాటి ప్రభావం, వాటి స్వభావం నిస్సందేహమైనవి. హిందూ సామాజిక వ్యవస్థ మూడు సూత్రాల మీద నిలుస్తుంది. వాటిలో మొదటిదీ ముఖ్యమైనది అంతరాలతో కూడిన అసమానత.

అంతరాలతో కూడిన అసమానత అన్నది ప్రాథమిక సూత్రం – ఇది నిర్వివాదం. నాలుగు వర్ణాలూ సమాన స్థాయిలో ఉండవు. విభిన్న స్థాయిల్లో ఉంటాయి. విభిన్న స్థాయిల్లో ఉండటమే కాదు, అవి అసమాన స్థాయిల్లో కూడా ఉన్నాయి. మనువు ప్రణాళికలో బ్రాహ్మణుడు మొదటి వరసలో ఉంటాడు. అతని కింద క్షత్రియుడు, క్షత్రియుని కింద వైశ్యుడు, వైశ్యుని కింద శూద్రుడు, శూద్రుని కింద అతి శూద్రుడు లేక అస్పృశ్యుడు నిలుస్తారు. వర్ణాలలో ఈ అగ్రగామి క్రమం కేవలం పరంపరాగతం కాదు. ఇది ఆధ్యాత్మికం, నైతికం, చట్ట సమ్మతం. అంతరాలతో కూడిన అసమానతా సూత్రానికి వర్తించని జీవిత పార్శ్వం లేదు.

దీనికి సంబంధించి మనుస్మృతిలో కుప్పలుతెప్పలుగా వివరణలువ్నాయి. నేను వాటి గింటిని తీసుకొని దీనిని రుజువు చేస్తాను. అవి బానిసస్మృతి, వివాహస్మృతి, శిక్షాస్మృతి, సంస్కారాల స్మృతి, సన్యాసి స్మృతి. హిందూస్మృతి బానిసత్వాన్ని చట్ట సమ్మతమైన అంశంగా గుర్తించింది. మనుస్మృతి ఏడు రకాల బానిసల్ని గుర్తించింది. సంఖ్యకు సంబంధించిన భేదాలు, వాళ్ళు ఏ వర్ణంలోకి వస్తారు అన్నది ప్రధానం కాదు. ముఖ్యమైంది ఎవరు ఎవరిని బానిసగా చేస్తారో తెలుసుకోవడం. దానిని గురించి నారదస్మృతి, యజ్ఞవల్క్య స్మృతి వివరిస్తాయి.

నారదస్మృతి 5.39. "చాతుర్వర్ణ్య వ్యవస్థకు భిన్నంగా బానిసత్వం ఉండదు, ఒక వ్యక్తి తన కుల ధర్మాన్ని అతిక్రమిస్తే తప్ప, బానిసత్వం (ఆ దృష్టితో) భార్యాస్థితికి సమానం."

యాజ్ఞవల్క్య స్మృతి 6.183(2): బానిసత్వం వర్ణాల అవరోహణ క్రమంలో ఉంటుంది. ఆరోహణ క్రమంలో కాదు.

బానిసత్వాన్ని గుర్తించడమే ఘోరం. అయితే ఆ బానిసత్వ నియమాన్నైనా దానంతట అది రూపాన్ని తీసుకునేట్లు వదిలిపెట్టి ఉంటే, దానివల్ల ఒక ప్రయోజనం ఒనగూడి ఉండేది. అది బలమైన శక్తిగా ఉండేది. కులం పునాది నాశనమయ్యుండేది. దీని ద్వారా, బ్రాహ్మణుడు అస్పృశ్యునికి బానిస అయ్యేవాడు, అస్పృశ్యుడు బ్రాహ్మణునికి యజమాని అయ్యేవాడు. సార్వత్రిక బానిసత్వం ఒక సమానత్వ సూత్రంగా ఉండేది. దానిని రద్దు చేయడానికి ప్రయత్నం జరిగింది. అందుకే మనువు, అతని వారసులు బానిసత్వాన్ని సక్రమమైందిగా గుర్తిస్తూనే, వర్ణ వ్యవస్థలో అది విలోమ పద్ధతిలో వుండరాదని శాసించారు. అంటే ఒక బ్రాహ్మణుడు మరో బ్రాహ్మణుడికి బానిస కావచ్చు. కాని అతడు మరో వర్ణానికి చెందిన వ్యక్తిని అంటే క్షత్రియ, వైశ్య, శూద్ర, అతి శూద్రులకు - బానిస కాకూడదని అర్థం. బ్రాహ్మణుడు మాత్రం నాలుగు వర్ణాలలో ఎవరినైనా బానిసగా చేసుకోవచ్చు. క్షత్రియుడు బ్రాహ్మణుని తప్ప, క్షత్రియ వైశ్య శూద్ర అతి శూద్రులలో ఎవరినైనా బానిసగా చేసుకోవచ్చు. వైశ్యుడు వైశ్య శూద్ర అతిశూద్రులలో ఎవరినైనా బానిసగా చేసుకోవచ్చు, బ్రాహ్మణ, క్షత్రియులను మాత్రం చేసుకోరాదు. ఒక శూద్రుడు మరో శూద్రుని, మరో అతిశూద్రుని బానిసగా చేసుకోవచ్చు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను మాత్రం చేసుకోరాదు. అతిశూద్రుడు పై నాలుగు వర్ణాలను వదిలేసి, తనలాంటి మరో అతి శూద్రుని బానిసగా చేసుకోవచ్చు.

వివాహ స్మృతిలో కూడా ఇలాంటి అంతరంతో కూడిన అసమానతా సూత్రం ఉంది. మనువు అంటాడు:

3-12: ద్విజన్ములు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు - మొదటి పెళ్ళి చేసుకునేటప్పుడు తమతమ వర్ణంలోని కన్యనే చేసుకోవాలి. మళ్ళీ పెళ్ళి చేసుకోవలసి వస్తే ఈ క్రింది విధంగా అనులోమ వివాహం చేసుకోవాలి.

3–13: శూద్రునికి శూద్ర కన్యయే తగింది. వైశ్యునికి శూద్ర కన్య, వైశ్య కన్య తగిన వాళ్ళు. క్షత్రియునికి ఆ యిద్దరూ, క్షత్రియ కన్య తగిన వారు. బ్రాహ్మణునికి ఆ ముగ్గురూ, బ్రాహ్మణ కన్య తగినవాళ్ళు.

మనువు వర్ణాంతర వివాహానికి వ్యతిరేకే. ఏ వర్ణంవాళ్ళు ఆ వర్ణంలోనే పెళ్ళి చేసుకోవాలి అన్నది ఆయన మతం. అయితే నిర్దిష్ట వర్ణానికి వెలిగా జరిగే పెళ్ళిని ఆయన గుర్తిస్తారు. దాంట్లో కూడా ఆయన వర్ణాల అసమానతకు భంగం కలక్కుండా జాగ్రత్తపడతాడు. బానిసత్వంలాగే అంతర వివాహాన్ని అనుమతించినా అది విలోమ క్రమంలో కాదు. బ్రాహ్మణుడు ఇతర వర్ణాల వారిని పెళ్ళాడదల్చుకుంటే క్రింది వర్గాలలో ఏ వర్గంలోనైనా పెళ్ళాడవచ్చు. క్షత్రియుడు తన క్రింది రెండు వర్ణాలలో స్త్రీలను పెళ్ళాడవచ్చు, కాని తనకన్నా పైన ఉన్న బ్రాహ్మణ స్త్రీని మాత్రం పెళ్ళాడరాదు. వైశ్యుడు తన క్రింది వర్ణానికి చెందిన శూద్ర స్త్రీని పెళ్ళాడవచ్చు, తన పై వర్ణాలకు చెందిన బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలను పెళ్ళడకూడదు.

మూడోది శిక్షాస్మృతికి సంబంధించి మనువు ఇచ్చిన వివరణ. మొదట సాక్షులకు సంబంధించినది. మనువు ప్రకారం సాక్షులు ఇలా ప్రమాణం చెయ్యాలి.

8–87: న్యాయమూర్తి తాను పరిశుద్ధుడై దేవ బ్రాహ్మణుల సమక్షంలో సాక్షులను తూర్పుముఖంగా గాని, ఉత్తర ముఖంగా గాని నిలబెట్టి ఉదయం పూట విచారించాలి.

8–88: బ్రాహ్మణుని 'చెప్పు' అంటూ మొదలుబెట్టాలి. క్షత్రియుని 'సత్యం చెప్పు', అంటూ మొదలుబెట్టాలి. వైశ్యుని 'అబద్ధాలాడితే గోవులు, విత్తనాలు, బంగారు దొంగిలించిన పాపం చుట్టుకుంటుంది' అని అంటూ, శూద్రుని 'అబద్ధాలాడితే కులభ్రష్టత్వం కలిగించే సకల పాపాలూ చుట్టుకుంటా'యని బెదిరిస్తూ మొదలుబెట్టాలి.

మనువు నేరాలకు చెప్పిన శిక్షలను చూడండి. పరువు నష్టానికి వేసే శిక్షతో ప్రారంభిద్దాం.

8–267: బ్రాహ్మణుని అపఖ్యాతి పాల్జేసిన క్షత్రియునికి నూరు రూకల శిక్ష వెయ్యాలి. అలాగే బ్రాహ్మణుని అపఖ్యాతి పాల్జేసిన వైశ్యునికి నూట యభై రూకలుగాని రెండు వందల రూకలు గాని జరిమానా వేయాలి. శూద్రునికి దేహశుద్ధి చెయ్యాలి.

8–268: క్షత్రియుని అపఖ్యాతిపాల్జేసిన బ్రాహ్మణుని యాభై రూకలు, వైశ్యునికి ఇరవై అయిదు రూకలు, శూద్రునికి పన్నెండు రూకలు శిక్ష విధించాలి.

అవమానానికి మనువు చెప్పిన శిక్షల్ని చూద్దాం:

8-270: శూద్రుడు ద్విజులను దారుణంగా నిందిస్తే అతని నాలుక తెగకొయ్యాలి.

8-271: వ్యక్తిపేరు, వర్గం పేరు పెట్టి నీచంగా ఓ దేవదత్తా! నీచ బ్రాహ్మణా! అని దూషిస్తే దూషించిన వ్యక్తి నాలుక మీద పది అంగుళాల పొడవుండి ఎర్రగా కాగిన ఇనప కమ్మిని పెట్టి కాల్చాలి.

8-272: ఎలాగో కొంత ధర్మం నేర్చుకుని బ్రాహ్మణులకు ధర్మాలను బోధించడం మొదలుబెట్టే శూద్రునికి రాజు అతని చెవిలో నోట్లో బాగా కాచిన నూనె పోయించాలి.

8-276: బ్రాహ్మణులు, క్షత్రియులు పరస్పరం తిట్టుకున్నప్పుడు రాజు బ్రాహ్మణునికి తక్కువ రకం శిక్ష, క్షత్రియునికి మధ్య రకం శిక్ష వెయ్యాలి.

8-277: వైశ్యులు శూద్రులు పరస్పరం తిట్టుకున్నప్పుడు కూడా రాజు వాళ్ళ వర్ణక్రమాన్ని బట్టి శిక్ష విధించాలి. శూద్రునికి నాలుక కోసే శిక్షకు ఇక్కడ మినహాయింపు. ఇది నిశ్చిత నియమం.

దాడి నేరానికి మనువు విధిస్తున్న శిక్షలు ఇవి:

8-279: శూద్రుడు ఏ అవయవంతో ద్విజులను తాకుతాడో ఆ అవయవాన్ని ఛేదించాలని మనువు చెప్పాడు.

అహంకారానికి మనువు విధించే శిక్షలు:

8-281: బ్రాహ్మణునితో సమానంగా ఆసనం మీద కూర్చున్న శూద్రుని నడుముమీద కర్రుతో వాతవేసి తరమాలి. లేదా ప్రాణం పోకుండా పిరుదును గాయం చెయ్యాలి.

8-282: గర్వంతో బ్రాహ్మణుని ముఖం మీద ఉమ్మివేసిన శూద్రుని రెండు పెదాలను రాజు కత్తిరించాలి. అతడు బ్రాహ్మణుని మీద మూత్ర విసర్జన చేస్తే అతని పురుషాంగాన్ని, తెలియకుండా గాని, గర్వంతో గాని బ్రాహ్మణుని మీదికి అపాన వాయువును వదిలితే అతని గుదాన్ని కోసివెయ్యాలి.

8-283: గర్వంతో బ్రాహ్మణుని జుట్టు పట్టుకున్న శూద్రుని చేతులను నరికివెయ్యాలి. అలాగే కాళ్ళు పట్టుకున్నా, గడ్డం పట్టుకున్నా, మెడ పట్టుకున్నా, వృషణం పట్టుకున్నా రెండు చేతులను నరికెయ్యాలి.

వ్యభిచారానికి మనువు విధించిన శిక్షలు:

8-359: బ్రాహ్మణుడు కానివాడు వ్యభిచారానికి పూనుకుంటే అతడు మరణదండనకు అర్హుడు. చతుర్వర్ణాల వాళ్ళు తమ భార్యలను జాగ్రత్తగా కాపాడుకోవాలి.

8-366: శూద్రుడు ఉన్నత జాతి స్త్రీని అనుభవిస్తే అతడు చంపదగినవాడు. అతడు తన కులం స్త్రీని అనుభవిస్తే ఆమె తండ్రి అనుమతి మీద, ఓలిని ఇచ్చి, ఆమెను పెళ్ళి చేసుకోవాలి.

8-374: భర్త చేత రక్షింపబడుతున్న బ్రాహ్మణ స్త్రీని గాని, రక్షింపబడని స్త్రీని గాని శూద్రుడు అనుభవిస్తే శిక్ష ఇలా ఉంటుంది. రక్షిత అయిన స్త్రీని అనుభవిస్తే శరీరాన్ని నరికి ధనమంతటినీ తీసుకోవాలి. అరక్షితను అనుభవిస్తే అంగచ్ఛేదం చేసి ధనాన్ని తీసేసుకోవాలి.

8-375: రక్షిత అయిన బ్రాహ్మణ స్త్రీని వైశ్యుడు అనుభవిస్తే అతనిని ఒక సంవత్సరం కారాగారంలో పెట్టి, అతని ధనాన్ని తీసుకోవాలి. అదే పని క్షత్రియుడు చేస్తే వెయ్యి రూకలు అపరాధం వేసి, గాడద మూత్రంతో తలగొరిగించాలి.

8-376: రక్షణలో లేని బ్రాహ్మణ స్త్రీని వైశ్యుడు అనుభవిస్తే అయిదు వందల రూకలు, క్షత్రియులు వెయ్యి రూకలు చెల్లించాలి.

8-377: భర్త సంరక్షణలో ఉన్న బ్రాహ్మణి మాత్రమే గాక, ఆమె ఒక మహానుభావుని భార్య అయితే ఆమెను అనుభవించిన వైశ్య క్షత్రియులను శూద్రునిలాగే శిక్షించాలి లేదా ఎండు గడ్డితో కాల్చి చంపాలి.

8-382: రక్షణలో ఉన్న క్షత్రియ స్త్రీని వైశ్యుడు అనుభవించినా రక్షణలో ఉన్న వైశ్య స్త్రీని క్షత్రియుడు అనుభవించినా రక్షణలో లేని బ్రాహ్మణ స్త్రీని అనుభవించినపుడు వేసే శిక్షను ఆ యిద్దరికీ వెయ్యాలి.

8-383: అయితే రక్షణలో ఉన్న క్షత్రియ వైశ్య స్త్రీలను బ్రాహ్మణుడు అనుభవిస్తే అతనికి వెయ్యి రూకల శిక్ష వెయ్యాలి. రక్షణలో ఉన్న శూద్ర స్త్రీని క్షత్రియ వైశ్యులు అనుభవించినప్పుడు వెయ్యి రూకలు శిక్ష వెయ్యాలి.

8-384: రక్షణలో లేని క్షత్రియ స్త్రీని అనుభవించిన వైశ్యునికి అయిదు వందల రూకలు. రక్షణలో లేని వైశ్య స్త్రీని అనుభవించిన క్షత్రియునికి గాడిద మూత్రం పోసి ముండనం

చెయ్యించాలి. లేదా అయిదు వందల రూకలు శిక్ష వెయ్యాలి.

హిందూ హైందవేతర నేర శిక్షా విధానాల మధ్య గల భేదం ఎంత విచిత్రమైంది! శిక్షా విధానాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే హిందూ మతంలో ఎంత అసమానత రాజ్యమేలుతున్నదో! శిక్షాస్మృతిలో న్యాయదృష్టితో చూచినప్పుడు రెండంశాలు కనిపిస్తాయి. 1. నేరాన్ని నిర్వచించే భాగం. 2. అందుకు తగిన శిక్షను చెప్పే భాగం – నేరస్తులందరూ సమాన శిక్షకు పాత్రులని చెప్పే నియమం. మనుస్మృతిలో మనం చూసేదేమిటి? మొదటిది, హేతుబద్ధం కాని శిక్ష. నేరానికి శిక్షగా కడుపు, నాలుక, ముక్కు వంటి అవయవాల మీద దృష్టి కేంద్రీకరింపబడింది. అప్పటికి ఆ అవయవానికే ఏదో అలాంటి అభిప్రాయమున్నట్లు. మనువు శిక్షాస్మృతిలో రెండో లక్షణం శిక్ష నేరానికి తగినట్లుగా గాక, అమానుషంగా ఉండడం. అయితే ఆ స్మృతిలో కొట్టొచ్చినట్టు నగ్నంగా కనిపించే లక్షణం ఒకే నేరానికి వేసే శిక్షలో అసమానత్వం. నేరస్థుని శిక్షించడానికే గాక మర్యాదను రక్షించడానికీ, న్యాయం కోసం న్యాయస్థానానికి వచ్చే వాళ్ళ నీచత్వాన్ని కాపాడడానికి కూడా అసమానత్వం రూపొందించబడింది. మరో రకంగా తన ప్రణాళికకు పునాది అయిన సాంఘిక అసమానతను కాపాడడమే ఆయన లక్ష్యం.

అంతరాలతో కూడిన అసమానత్వ సిద్ధాంతం ఆర్థిక రంగంలోకి కూడా తీసుకొని పోబడింది. "సామర్థ్యానికి తగిన పని, అవసరాలకు తగిన ప్రతిఫలం" అన్నది హిందూ సామాజిక వ్యవస్థ సూత్రం కాదు. హిందూ సామాజిక వ్యవస్థ సూత్రం ఇందుకు విరుద్ధం – "ఒకని అవసరానికి తగిన పని; అంతస్థుకు తగిన ప్రతిఫలం" అన్నది. ఉదాహరణకు ఒక అధికారి కరువుపీడిత ప్రజలకు తిండి గింజలు పంచుతున్నాడనుకుందాం. అతడు ఉన్నత కులంలో పుట్టిన వానికి, అధమ కులంలో పుట్టిన వానికన్నా ఎక్కువ పెడతాడు. అలాగే ఒక అధికారి పన్నులు విధిస్తున్నాడనుకుందాం; అతను అగ్రవర్ణంలో పుట్టినవారికి నిమ్న వర్గాల వారి కంటె తక్కువ పన్ను విధించవలసి వస్తుంది. హిందూ సామాజిక వ్యవస్థ సమాన అవసరం, సమాన కృషి, సమాన నైపుణ్యం అన్నవి శ్రమ ఫలితానికి ఆధారం కావాలని గుర్తించదు. జీవిత సంక్షేమ వినిమయంలో ఉన్నతులుగా పరిగణింపబడే వాళ్ళు, ఉత్తమమైన వాటిని, అధిక సంఖ్యలో పొందాలి, అధములనబడే వాళ్ళు తక్కువగా పనికిమాలిన వాటిని స్వీకరించాలి అన్నది హిందూ సామాజిక వ్యవస్థ యొక్క ఉద్దేశం.

హిందూ సామాజిక వ్యవస్థ అంతరాలతో కూడిన అసమానతా సూత్రం మీద నిర్మించబడిందనడానికి ఇంక ఎక్కువ ఆధారాలు చూపనక్కర లేదు. ఇది అన్ని సామాజిక రంగాలలోనూ వ్యాపించింది. సాంఘిక జీవితంలోని ప్రతి పార్శ్వమూ సమానత్వం అనే అపాయం నుంచి తప్పించబడింది.

హిందూ సామాజిక వ్యవస్థ ఆధారపడిన రెండో సూత్రం ఒక్కో వర్ణానికీ/కులానికీ వృత్తిని స్థిరీకరించడం, దానిని అలాగే కొనసాగించి వంశపారంపర్య లక్షణాన్ని పెంచడం, చతుర్వర్ణాల

వారి వృత్తులను గురించి మనువు చెప్పింది ఇది:

1–87: తేజోవంతుడైన బ్రహ్మ విశ్వ సంరక్షణ కోసం వేర్వేరు వృత్తులను ముఖం, భుజాలు, తొడలు, పాదాల నుండి పుట్టిన వాళ్ళకు (వరసగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు) ఏర్పరిచారు.

1–88: బ్రాహ్మణులు వేదాలను అధ్యయనం చెయ్యడం, బోధించడం; తమ కోసమూ, ఇతరుల కోసమూ యజ్ఞం చెయ్యడం. ఇతరులకు భిక్ష పెట్టడం, తాము స్వీకరించడం చెయ్యాలి.

1–89: ప్రజా సంరక్షణం, దానం చెయ్యడం, యాగాలు చెయ్యడం, వేదాధ్యయనం చెయ్యడం, విషయాసక్తికి దూరంగా ఉండడం క్షత్రియుని వృత్తి.

1–90: గోసంరక్షణం, యాగ నిర్వహణ, వేదాధ్యయనం, విషయాసక్తికి దూరంగా ఉండడం వైశ్యుని వృత్తి.

1–91: శూద్రునికి దేవుడు ఒకే వృత్తి నియమించాడు. అది పై మూడు వర్ణాల వారికీ సేవ చెయ్యడం.

ఈ వృత్తులకు సంబంధించిన నియమాలను మనువు విస్తరించి చెప్పాడు.

1–88: స్వయంభువ మనువు బ్రాహ్మణులకు పెట్టిన విధులు – వేదాధ్యయనం, బోధన, యజ్ఞ నిర్వహణ, ఇతరులకు యజ్ఞ నిర్వహణలో సహాయపడటం, కలిగిన వాళ్ళైతే భిక్ష పెట్టడం, లేని వాళ్ళైతే భిక్ష స్వీకరించడం.

1–89: ప్రజా సంరక్షణం, దానం, యాగ నిర్వహణం, వేదాధ్యయనం, విషయాసక్తికి దూరం కావడం, ఇవి స్థూలంగా క్షత్రియుని విధులు.

1–90: గో సంరక్షణం, యాగ నిర్వహణం, వేదాధ్యయనం, వ్యాపారం, వడ్డీ వ్యాపారం, వ్యవసాయం వైశ్యుని విధులు.

1–91: శూద్రునికి దేవుడు ఒక్కడే విధిని నియమించాడు. అది పై మూడు వర్గాల వారికి సేవ చెయ్యడం.

10–74: బ్రాహ్మణులు బ్రహ్మప్రాప్తి కోసం అనుష్ఠాన నిరతులై షట్కర్మలను శాస్త్రోక్తంగా

నిర్వహిస్తారు. అవి

10–75: వేదాధ్యయనం, వాటిని ఇతరులకు బోధించడం, యజ్ఞం చెయ్యడం, ఇందులో ఇతరులకు సహాయం చెయ్యడం, చాలినంత ఉంటే ఇతరులకు దానం చెయ్యడం, పేదలైతే దానాన్ని స్వీకరించడం, ఇవి ఆరు ప్రథమ జన్మల కర్తవ్యాలు.

10–76: ఈ ఆరింటిలో మూడు బ్రాహ్మణులకు జీవనాధారాలు. అవి ఇతరులకు యజ్ఞ నిర్వహణలో సహాయం చెయ్యడం, వేదాలను బోధించడం, స్వచ్ఛమైన వారి నుండి దానం తీసుకోవడం.

10–77: పై ఆరింటిలో మూడు బ్రాహ్మణుని నుండి క్షత్రియుని దగ్గరకి పోవు – అవి వేదబోధన, యాగ నిర్వహణలో సహాయం, దాన స్వీకరణం.

10–78: పై మూడూ వైశ్యునికి కూడా చెందవు. వాటిని మనువు అతనికి కూడా నియమించలేదు.

10–79: క్షత్రియుని జీవికకు అస్త్ర శస్త్రధారణలను నియమించాడు. వైశ్యునికి వర్తకం, సేద్యం, పశుపాలన – ఇవ జీవనధర్మాలు. వచ్చే జన్మకోసం దానం అధ్యయనం, యాగం ధర్మాలు.

ప్రతి వ్యక్తీ తనకు నియమించిన విధిని తన వర్గానికి తగినట్లు నిర్వహించాలి. ఇందులో వ్యక్తికి వృత్తిని ఎన్నుకునే అవకాశం లేదు, వ్యక్తిగత అభిరుచికి స్థానం లేదు. హిందూ సామాజిక వ్యవస్థలో వ్యక్తి పూర్వీకుల వృత్తికి కట్టుబడి ఉండవలసిందే. ఇది అతిక్రమించలేని కఠిన నియమం, తప్పించుకోలేరు.

వృత్తిని నియమించడంతో ఈ సూత్రం ఆగదు. గౌరవ దృష్టితో అనేక వృత్తులకు స్థాయిని నిర్ణయిస్తుంది. మనువు ఇలా చెబుతాడు:

10–80: "జీవిక కోసం చెప్పే అనేక వృత్తుల్లో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు క్రమంగా వేదబోధన, ప్రజా సంరక్షణ, వర్తకం ప్రశంసాత్మమైనవి."

హిందూ సామాజిక వ్యవస్థ ఆధారపడిన మూడో సూత్రం ప్రజలను వారివారి వర్గాలలో ఇరికించటం. హిందూ సామాజిక వ్యవస్థ వర్గాలను/కులాలను గుర్తిస్తుందనడంలో విచిత్రంగాని ప్రత్యేకతగావీ లేవు. ప్రతిచోటా వర్గాలు ఉన్నాయి, అవి లేకుండా ఏ సమాజమూ లేదు.

కుటుంబాలు, కూటములు, సమూహాలు, రాజకీయ పార్టీలు, జాతులు, నేర కార్యక్రమాల్లో మునిగే ముఠాలు, వ్యాపార సంస్థలు ప్రపంచంలో అన్ని సమాజాల్లోనూ ఉన్నాయి. స్వేచ్ఛా సాంఘిక వ్యవస్థ కూడా ఇవి లేకుండా ఉండదు. స్వేచ్ఛా సాంఘిక వ్యవస్థ లక్ష్యం ఏమిటంటే, ఏకాకితనాన్ని, వేర్పాటుతనాన్ని – వర్గాల చేత ఆదర్శంగా భావిపంబడినదానిని – విరోధిస్తుంది. వర్గాలు ఏకాకితనాన్ని, వేర్పాటుతనాన్ని ఆచరించకపోతే అవి పరస్పరం అసామాజికంగా మాత్రమే ఉన్నట్లు లెక్క. ఏకాకితనం, వేర్పాటుతనం అనేవి వాటిని సంఘ వ్యతిరేకమూ, పరస్పర ప్రతి కూలమూ చేస్తాయి. ఏకాకితనం వర్గ ప్రవృహలో మూర్ఖత్వం పెంచుతుంది. సంఘ జీవితాన్ని పంస్థీకరిస్తుంది. వర్గాలలో స్వార్థ ఆదర్శాలను పైచేయి చేస్తుంది. ఏకాకితనం జీవితాన్ని స్తబ్దంగా చేస్తుంది. కలిగిన వారికి, లేని వారికి; యజమానుల సేవకులకు అగాధం పెంచుతుంది. ఏకాకితనం వేర్పాటుతనం అనేవి స్వేచ్ఛా సాంఘిక వ్యవస్థకు ప్రతికూలం గనక అందులో వర్గాలకు అంతగా తావు ఉండదు. స్వేచ్ఛా సాంఘిక వ్యవస్థ సామాజిక రంగంలోని అన్ని రంగాలనూ నిర్వహించడానికి ప్రయత్నిస్తుంది. ఇది ఎప్పుడు సాధ్యమౌతుందంటే వర్గాలు సార్వజనీన ప్రయోజనాలను బాధ్యతలను వ్యయాలకు విస్తారంగా పంచుకొనే స్వేచ్ఛ ఉన్నప్పుడు, ఉమ్మడి విలువలు అధికంగా ఉన్నప్పుడు, స్వీకరించడానికీ, ఇవ్వడానికి సమానావకాశం ఉన్నప్పుడు మాత్రమే. అలాంటి సాంఘిక ఒప్పందం ఆచారాన్ని రద్దు చేస్తుంది, చెయ్యాలి. చురుకైన విస్తారమైన మానసిక జీవితాన్నిస్తుంది. మానసిక దృక్పథాల పునర్నిర్మాణాన్ని డిమాండ్ చేస్తుంది. హిందూ సామాజిక వ్యవస్థలో కొట్టొచ్చినట్లు కనిపించేదేమిటంటే, హిందూ సమాజంలోని భిన్న వర్గాలు స్వేచ్ఛగా పరస్పరం ఇచ్చిపుచ్చుకోవడాన్ని, పరస్పరం కలిసిమెలిసి ఉండడాన్ని నిషేధించడం, సహపంక్తి భోజనాల మీద, భిన్న వర్గాల మధ్య వివాహాల మీద ఆంక్ష ఉంది. అయితే మనువు సామాన్య సామాజిక సహ జీవనాన్ని నిషేధించే దాకా పోతాడు. ఆయన ఇలా అన్నాడు.

4–244: అగ్రస్థానాన్ని కాపాడుకోవాలనుకునే వ్యక్తి అలాటి ఉత్తములతోనే సంబంధం పెట్టుకోవాలి, అధములతో కాదు.

4–245: బ్రాహ్మణుడు ఉత్తమోత్తములతో సంబంధం పెట్టుకోవడం వల్ల ఉత్తమత్వాన్ని పొందుతాడు. అలాకాక అధములతో సంబంధం పెట్టుకుంటే శూద్రత్వాన్ని పొందుతాడు.

4–79: ఘోర నేరాలకు పాల్పడిన కుల భ్రష్టులతో, చండాలురతో, బానిసలతో, మూర్ఖులతో, ధన మదాంధులతో, చాకలి వారితో, నీచజాతులతో అంత్యవాసులతో అతడు ఒకేచోట ఒకే చెట్టు నీడలో కూడా కలిసి ఉండరాదు.

హిందూ సామాజిక వ్యవస్థ సౌభ్రాతృత్వాన్ని వ్యతిరేకిస్తుంది. సమానత్వ సూత్రాన్ని అది అంగీకరించదు. సమానత్వాన్ని గుర్తించకపోవడమే గాక, అసమానత్వాన్ని అధికార సిద్ధాంతం చేస్తుంది. స్వేచ్ఛ సంగతి? వృత్తి స్వేచ్ఛ లేనేలేదు. ప్రతి ఒక్కడికీ ముందే నిర్ణయించబడిన వృత్తి ఉంది. అందరూ చెయ్యవలసిందల్లా దానిని కొనసాగించడమే. వాక్స్వాతంత్ర్యం ఉంది.

అయితే సామాజిక వ్యవస్థకు అనుకూలంగా ఉన్న వాళ్ళకే ఉంది. ఆ స్వాతంత్ర్యం వోల్టేర్ చెప్పిన స్వాతంత్ర్యం కాదు. "నువ్వు చెప్పేదానిని నేను పూర్తిగా వ్యతిరేకిస్తాను. అయితే నీకున్న చెప్పే హక్కును ఊపిరి ఉన్నంతవరకు సమర్థిస్తాను" అని వోల్టేర్ అంటాడు.

తర్కం, గతితర్కం గురించి మనువు చెప్పే దాంట్లో ఆయన అభిప్రాయాలు స్పష్టంగా ఉన్నాయి.

4.29–30: మంచి ఆసనం, శయ్యలతో కందమూల ఫలాలతో తన ఇంటికి వచ్చిన అతిథిని శక్తికొలది గౌరవించలేని గృహస్థుని ఇంటిలో అతిథి ఉండరాదు. శాస్త్ర విరుద్ధంగా వృత్తులను చేపట్టిన వారిని, పిల్లి కొంగలలాగా జీవించే వాళ్ళను; వేదాలకు వ్యతిరేకంగా వాదించేవాళ్ళను గౌరవించరాదు.

2–10: శ్రుతి అంటే వేదం. స్మృతి అంటే ధర్మశాస్త్రం. ఆ రెంటిచేత ధర్మం వెలుగొందుతుంది కాబట్టి వాటిలోని విషయాన్ని గురించి ప్రశ్నించరాదు.

2–11: ప్రమాణాలైన శ్రుతి స్మృతులను హేతువుతో తర్కవాదంతో చర్చించి విమర్శించిన ద్విజుని నాస్తికుడుగా, వేద దూషకుడుగా లెక్కగట్టి బహిష్కరించాలి.

2–12: వేదం, స్మృతి, సదాచారం, ఆత్మానందం – ఇవి నాలుగు ధర్మానికి లక్షణాలుగా చెప్పబడ్డాయి.

ఇందుకు కారణాలను కూడా మనువు పేర్కొన్నాడు:

2–6: ధర్మానికి మూలం వేదం. తర్వాత ఆచారాలు, వేద పండితుల ధర్మవర్తన, మహాత్ముల వాడుకలు, చివరగా ఆత్మసంతృప్తి పవిత్ర ధర్మానికి మూలాధారాలు.

2–7: మనువు ఎవరికి ఏ ధర్మం చెప్పినా, అదంతా వేదంలో చెప్పబడిందే, మనువు సర్వజ్ఞాన స్వరూపుడు.

ఈ స్వతంత్రంలో గతి తార్కికులకు, తార్కికులకు సాంఘిక ధర్మాన్ని విమర్శించే స్వతంత్రం లేదు. అంటే స్వతంత్రమే లేదని అర్థం.

కార్యాచరణ సంగతి ఏమిటి? హిందూ సామాజిక వ్యవస్థలో ఆ స్వేచ్ఛ లేదు. వ్యక్తికి స్వతంత్రాన్ని ఇవ్వదు ఆ వ్యవస్థ. అదే వృత్తిని నిర్ణయిస్తుంది. అదే అతని హోదాను నిర్ణయి

స్తుంది. వ్యక్తికి మిగిలిందల్లా ఈ నియమాలలో స్థిరపడటమే.

రాజకీయ స్వేచ్ఛ కూడా ఇంతే. హిందూ సామాజిక వ్యవస్థ ప్రజలు ఎన్నుకున్న ప్రతి నిధుల చేత ఏర్పాటు చేయబడ్డ ప్రాతినిధ్య ప్రభుత్వం ఉండవలసిన అవసరాన్ని గుర్తించదు. ప్రజలు చట్టంచేత పాలింపబడాలని, చట్టాన్ని ప్రజా ప్రతినిధులు నిర్మిస్తారని ప్రాతినిధ్య ప్రభుత్వం విశ్వసిస్తుంది. హిందూ సామాజిక వ్యవస్థ ఈ సిద్ధాంతంలోని మొదటి భాగమైన - ప్రజలు చట్టంచేత పాలింపబడాలి అన్న దాన్ని గుర్తిస్తుంది. రెండో భాగమైన చట్టాన్ని ప్రజా ప్రతినిధులు నిర్మిస్తారన్న దాన్ని తిరస్కరిస్తుంది. హిందూ సామాజిక వ్యవస్థ సిద్ధాంతం ఏమిటంటే, ప్రజలను పాలించే చట్టం, ఇదివరకే తయారు చెయ్యబడింది. అది వేదాల్లో ఉంది, అన్నది. దానికి కొంత కలపడానికి గాని తీసివేయడానికి గాని ఎవరికీ హక్కు లేదు. చట్టాన్ని నిర్మించే స్వేచ్ఛ, ప్రభుత్వాన్ని నిర్మించే, నిర్మూలించే స్వేచ్ఛ రాజకీయ స్వేచ్ఛ అనబడుతుంది. అది హిందూ సామాజిక వ్యవస్థలో లేదు.

తాత్పర్యం ఏమిటంటే, హిందూ సామాజిక వ్యవస్థ వర్గాల మీద ఆధారపడిన వ్యవస్థ. వ్యక్తి మీద ఆధారపడిన వ్యవస్థ కాదు. ఇందులో వర్గాల మధ్య స్థాయీ భేదం - ఎక్కువ తక్కువ ఉంటుంది. విధులు, హోదాలు ముందే నిర్ణయించబడి ఉంటాయి. ఇదొక మార్పుకు అవకాశం లేని వ్యవస్థ. వ్యక్తి స్థానంలో ఎన్ని మార్పులు వచ్చినా అతడి వర్గం ద్వారా వచ్చిన సాంఘిక హోదా ఏ విధంగానూ మారదు. ఏ పరిస్థితిలోనూ మొదటివాడు చివరివాడు కాదు, చివరివాడు మొదటివాడూ కాదు.

అనువాదం: రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి

## :అధస్సూచికలు:

1. రూల్‌నందకిషన్ - స్వాతంత్ర్యమూ దాని అర్థమూ - పు. 214.
2. ఉత్తర భారతదేశంలో కుల వ్యవస్థ. పు. 51-56.
3. ఉత్తర భారతదేశంలో పంక్తి భోజన వషయంగా కచ్చా ఆహారంలోనే నిషేధం ఉంటుంది. దక్షిణదేశంలో పక్కా భోజనంతో కలిపి పూర్తి నిషేధాన్ని పాటిస్తారు. కచ్చా అంటే నీటితో వండింది. పక్కా అంటే నేతితో వండింది.
4. ఉత్తర భారతదేశంలో కుల వ్యవస్థ. పు 89-90.
5. -పైదే-
6. -పైదే-

## అధ్యాయం – 3

# హిందూ సామాజిక వ్యవస్థ: దాని ప్రత్యేక లక్షణాలు:

ఇప్పటిదాకా సాగిన చర్చలన్నీ హిందూ సామాజిక వ్యవస్థ మూలసూత్రాలను వర్ణించడం వరకే పరిమితమయ్యాయి. దాని మూలసూత్రాలను అటుంచితే, హిందూ సామాజిక వ్యవస్థ కొన్ని ప్రత్యేక లక్షణాలను కలిగి ఉంది. వీటికి కూడా మూలసూత్రాలంత ప్రాముఖ్యం ఉంది. హిందూ సామాజిక వ్యవస్థ గురించి జరిగే ఏ అధ్యయనం అయినా దాని ప్రత్యేక లక్షణాల ప్రస్తావన లేకుంటే అది సమగ్రమయిన అధ్యయనం అనిపించుకోదు. దాన్ని సరయినదనీ అనలేం.

అసలీ ప్రత్యేక లక్షణాలు ఏమిటి? హిందూ సామాజిక వ్యవస్థకున్న ప్రత్యేక లక్షణాలు మూడు. ఈ మూడింటిలో మొదటిదీ, అతి ముఖ్యమైందీ 'అధిమానవుణ్ణి' (Superman) ఆరాధించడం: 'నీషే' (Nietzche) సువార్త (ప్రబోధాన్ని) కార్యరూపంలో పెట్టడం మినహా, ఈ విషయంలో హిందూ సామాజిక వ్యవస్థ ప్రత్యేకత ఏమీ లేదు. నీషే కూడా తాను ప్రతిపాదించిన 'అధిమానవారాధన సిద్ధాంతం' తన స్వంతమని ఎక్కడా చెప్పుకోలేదు. దాన్ని తాను "మనుస్మృతి" నుంచి స్వీకరించినట్లుగా నీషే ఒప్పుకున్నాడు. 'యాంటీ క్రైస్ట్' అనే తన సిద్ధాంత గ్రంథంలో నీషే యిలా వివరించాడు.

"ఏ లక్ష్య సాధన కోసం అసత్యాలను ప్రచారం చేస్తారన్నది అసలు ప్రశ్న. వాస్తవమేమిటంటే–క్రైస్తవంలో–పవిత్ర లక్ష్యాలు అనేవి పూర్తిగా లుప్తాలు. అది అనుసరించే సాధనాల మీదే నా అసమ్మతంతా. దాని లక్ష్యాలు అత్యంత చెడ్డవి–జీవితాన్ని విషమయం చేయడం, త్యజించడం, శరీరాన్ని దూషించడం మొదలైనవి ఇందులో ఉన్నాయి. తనను తాను తక్కువగా చూసుకోవటం, ఆత్మనింద, పాపం చేస్తానేమోనన్న భయంతో మనిషి తనకు తానే మలినం కావడం–క్రైస్తవంలో ఉంది. అందుకే దీనిలో పేర్కొన్న మార్గాలు (సాధనాలు) కూడా చెడ్డవని నేను పేర్కోవటం జరిగింది. అయితే మనుధర్మశాస్త్రం చదివినప్పుడు నా ఆలోచనలు దీనికి విరుద్ధంగా ఉన్నాయి. అంతటి గొప్ప గ్రంథాన్ని, రచనని బైబిలుతో సరిసమానంగా పోల్చడం ఆత్మవంచనే అవుతుంది. అయితే అందులో నిఖార్సయిన తాత్వికచింతన ఎందుకు దాగి వుందో ప్రతి ఒక్కరు ఇట్టే గ్రహించి చెప్పొచ్చు. పాపదుర్గంధ భూయిష్టమైన యూదు 'రాబినిజం'–అంధ విశ్వాసాల వడపోత కార్యక్రమంతో పాటు–మనస్తత్వ శాస్త్రజ్ఞులకు కూడా ఆసక్తికరమైన ఎన్నో విషయాలు దాన్లో ఉన్నాయి. ఇక మరచిపోలేని మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే–మౌలికంగా ఇది బైబిల్ కంటె భిన్నమైనటువంటిది. దీని (మనుస్మృతి) ద్వారా కులీనవర్గాలు, తత్వవేత్తలు, యుద్ధవీ

రులు, జన సామాన్యాన్ని రక్షిస్తుంటారు. మార్గదర్శకం వహిస్తుంటారు. ఇది గొప్ప విలువలకు ప్రతిరూపం. ఇది జీవితం పట్ల గొప్ప ఆనందాతిరేకమైన భావాన్ని కలిగిస్తుంది. ఈ గ్రంథంలో తన గురించిన విజయోత్సాహం, జీవితం గురించిన విజయోత్సాహం నిండి వున్నాయి. పుస్తకమంతటా సూర్యకాంతి ధగధగమంటుంది. క్రైస్తవంలో చెప్పలేనంతగా వెకిలిగా ప్రస్తావించే సంతోనత్పత్తి, మగువ, వివాహం మొదలైన విషయాలను ఇక్కడ చిత్తశుద్ధితోను, అత్యంత గౌరవంతోను, ఆత్మవిశ్వాసంతోను చిత్రించడం జరిగింది. "వ్యభిచారం నుంచి బయటపడటానికి మగాడికి భార్య అవసరం. ప్రతి స్త్రీకి సొంత భర్త ఉండటం సమంజసం వంటి దుష్టోక్తులున్న గ్రంథాన్ని స్త్రీల చేతిలో, పిల్లల చేతిలో ఎలా ఉంచడం? దహించుకుపోవడం కంటె పెళ్ళి మేలు కదా! కన్యామాత అనే భావనతో దగాపడ్డ తరువాత, అంటే మనిషి మూలమే క్రైస్తవీకరణం చెందిన తరువాత క్రైస్తవుడిగా వుండడం మర్యాదైన పనేనా?"

నీషే పట్ల అతని దేశ ప్రజలకే ఏమాత్రం గౌరవం కానీ, అతని పట్ల ఏ విధమైన నమ్మకం కానీ లేవు. అయితే ఆయన తన మాటల్లోనే "అప్పడప్పుడు రాజవంశ భూస్వామ్యతత్వవేత్తగాను, కొన్ని సందర్భాల్లో విదూషకుడుగాను, ఒక్కోసారి తనమీద తానే జాలిపడుతూ మానవత్వం లేని మనిషిగాను, మరొకప్పుడు సమాజం నుంచి బహిష్కృతుడైన వ్యక్తిగాను" జీవించాడు. శక్తికి మూలం దృఢచిత్తం-అనేదాన్ని నీషే తత్వంగా అభివర్ణించవచ్చు. తద్వారా అధి మానవుణ్ణి లక్ష్యంగా పెట్టుకొని తదనుగుణంగా విశృంఖలత సృష్టించడం, ఆధ్యాత్మిక విలువల్ని బానిసత్వాన్ని నిరాకరించడం, సామాన్యుణ్ణి తక్కువచేసి చూపడం అనేవి తర్వాత సంభవించే విషయాలు. ఈ విధమైన తన విలక్షణ లక్షణాలతో కూడిన తత్వబోధనల ద్వారా తన కాలంనాటి ప్రజల్లో అసహ్యభావం, భయానక వాతావరణాన్ని సృష్టించాడు. అంతేకాదు తన అనంతరకాల ప్రజల మనసుల్లో కూడా అలాంటి భావాన్నే రగుల్కొల్పాడు. ప్రజలు అతణ్నుంచి తప్పించుకోలేకపోయినా, అతణ్ని పూర్తిగా నిరాదరించేవారు. ఆ పరిస్థితుల్లో నీషే తనకు తానుగా-తనను చనిపోయిన వ్యక్తుల్లో కలిపి ప్రకటించుకొని, ఎంతో తృప్తిని పొందాడు. శతాబ్దాల తర్వాతైనా తనను, తన ఔన్నత్యాన్ని గుర్తించి, ప్రశంసించే ప్రజలు తప్పక ఉంటారని (పుడ్తారని) నీషే భవిష్యద్దర్శనం చేశాడు. కానీ నీషే అనంతర కాలంలో అతని 'దార్శనికత' ప్రజల్లో గుర్తింపు పొందటానికి బదులుగా; సమకాలీన ప్రజల్లో ఓ విధమైన భయాన్ని, అసహ్యభావాన్ని కలిగించిందో, (ఆయన అనంతరకాల ప్రజల్లో) అదే రకమైన భయాన్ని, అసహ్యభావాన్ని కలిగించింది. క్షుద్ర స్వభావం కలిగిన నీషే దార్శనికతను గుర్తించిన కొందరు, హిందూ సామాజిక వ్యవస్థ అధిమానవ ఆరాధన మీద ఆధారపడి వుందన్న విషయాన్ని నమ్మటానికి ఏమాత్రం సంసిద్ధులు కాలేకపోతున్నారు.

అసలు ఈ విషయంలో మనుస్మృతి ఏమి చెబుతుందో చూద్దాం. హిందూ సామాజిక వ్యవస్థలో బ్రాహ్మణుని స్థానం గురించి మనుస్మృతి చెప్పిన మాటల్ని గమనించండి.

"బ్రాహ్మణుడు ప్రజాపతి (బ్రహ్మ) నోట (ముఖం) నుంచి పుట్టటం వల్లను, ముందుగా

పుట్టడం వల్లను, వేద జ్ఞానం పుష్కలంగా ఉండటం చేతను ఈ సృష్టికంతటికీ తానే (బ్రాహ్మణుడు) దేవుడయ్యే హక్కును పొందాడు." (1-93)

"ఈ ప్రపంచాన్నంతా రక్షించడం కోసమూ; దేవతలకీ, పితృదేవతలకీ సంధానకర్తగా వుండడానికీ బ్రహ్మ ఎంతో తపస్సు చేసి ఆ బ్రాహ్మణుణ్ణి ముందుగా తన ముఖం నుంచి సృష్టించాడు." (1-94)

"దేవతలు, పితృదేవతలు సంతృప్తి చెందే విధంగా ఏ బ్రాహ్మణుడైతే యజ్ఞయాగాది క్రతువులు నిర్వహిస్తాడో, ఆ బ్రాహ్మణుని కంటె గొప్పదైన జీవి సృష్టిలో మరొకటి లేదు.' (అంటే బ్రాహ్మణుడు అందరికంటె గొప్పవాడని అర్థం.) (1-95)

"సృష్టించిన జీవులలో అన్నింటికంటే గొప్పవి చరాలు అని చెప్పకోవచ్చు. చరాలు తెలివి తేటల ద్వారా జీవించేవని చెప్పవచ్చు. వీటిలో మానవజాతి తెలివైనది. ఆ మానవ జాతిలో తెలివైన వాళ్ళు బ్రాహ్మణులు." (1-96)

మనువు చెప్పిన ఈ కారణాలే కాకుండా, బ్రాహ్మణుడు ప్రథమ శ్రేణికి చెందినవాడు. ఎందుకంటే అతడు దేవుని ముఖం నుంచి ఉద్భవించాడు. అతని ముఖతః దేవునికి, పితృదేవతలకు హవ్య కవ్యాలు అందుతాయి. బ్రాహ్మణుని గొప్పతనానికి ఇంకో కారణాన్ని మనువు ఇలా చెబుతాడు.

"బ్రాహ్మణుల పుట్టుకే పవిత్ర న్యాయం (వేదం) ద్వారా జరిగింది. అతడు ఆ పవిత్ర న్యాయ ఉద్ధరణకై శాశ్వత అవతారంగా నిలిచి బ్రహ్మ (దైవ) స్వరూపుడవుతున్నాడు." (1-98)

"బ్రాహ్మణుడు భూమి మీద అందరికంటె గొప్పవాడుగా, జీవరాశులన్నిటికీ యజమానిగా, న్యాయరక్షకుడిగా పుడతాడు." (1-99)

ఈ విషయాన్నే ముగింపుగా ఇలా చెప్పాడు మనువు:

"బ్రాహ్మణుడు తన సొంత ఆహారాన్ని భుజిస్తూ, తన సొంత బట్టలే కట్టుకుంటూ, తన సొంత ధనాన్నే దానం చేస్తాడు. మిగిలిన వారంతా అతని దానగుణం ఆసరాతో జీవిస్తారు." (1-106)

ఎందుకంటే మనువు ఉద్దేశం ప్రకారం:

"ప్రపంచంలో ఏది ఉన్నా అదంతా బ్రాహ్మణుని ఆస్తే. వాస్తవానికి తన పుట్టుక గొప్పతనం వల్ల అతడు వీటన్నిటికీ అర్హుడవుతున్నాడు." (1-100)

దేవుడు కావటం వల్ల బ్రాహ్మణుడు న్యాయానికీ, రాజుకీ అతీతుడు. మనువు నిర్దేశించిన ప్రకారం:

"రాజు ఉదయాన్నే లేచి మూడు పవిత్ర జ్ఞానాలలో (వేదాలలో), రాజనీతి శాస్త్రంలో పండితులైన బ్రాహ్మణులను పూజించి వారి సలహాలను పాటించాలి." (7-37)

"వేదవేత్తలైన, పవిత్రులైన వృద్ధ బ్రాహ్మణుల్ని ప్రతిరోజూ పూజించాలి." (7-38)

చివరకు మనువు ఏమంటాడంటే:

"(ఇందుమూలంగా) బ్రాహ్మణుడు (ప్రపంచ) సృష్టికర్త. శిక్షించేవాడు. గురువు. అందు వల్లనే సమస్త జీవరాశులకు అతడొక పోషకుడు. (కాబట్టి) అతనిని ఏ వ్యక్తీ అమంగళమైన దురుసు పదజాలంతో దూషించరాదు." (11-35)

మనువు యీ విధంగా శాసించాడు.

"పుట్టుకలో అగ్రగణ్యుడు, సృష్టిలో గొప్పవాడు, శాస్త్రాలలో క్షుణ్ణజ్ఞానం కలవాడు. మహి మోపేతమైన జంధ్యం ధరించేవాడు అయిన బ్రాహ్మణుడు అన్ని వర్గాల ప్రజలకు ప్రభువు." (10-3)

బ్రాహ్మణుడు లేదా అధిమానవుడు హిందూ సామాజిక వ్యవస్థలో కొన్ని మినహా యింపులకు హక్కుదారుడు. వాటిల్లో మొదటిది: అతడు ఒకవేళ హత్యచేసినా, అతన్ని ఉరితీయకూడదు.[1] ఈ విషయానికి సంబంధించి మనువు ఇలా అంటాడు:

"ఇతర వర్గాలకు వ్యభిచారం నేరానికి శిక్ష ఉరితీయటమే అయినప్పటికీ, ఆ నేరమే బ్రాహ్మణుడు గనుక చేస్తే, అతనికి గుండు గీయించి (తలనీలాలు తీయించి) పరాభవించాలి." (8-379)

"బ్రాహ్మణుడు ఎన్ని నేరాలు చేసినా సరే రాజు అతడిని చంపకూడదు. రాజు బ్రాహ్మణుని ఆస్తికి, శరీరానికి ఎటువంటి హానీ తలపెట్టకుండా అతనిని రాజ్య బహిష్కరణ చేయవచ్చు." (8-380)

"బ్రాహ్మణుడు కావాలనే ఒక ఉత్తముడయిన క్షత్రియుణ్ణి చంపితే, ఒక పూజారిని చంపితే ఎంత భరణం చెల్లించాలో, అందులో నాల్గవ వంతు ప్రాయశ్చిత్తంగా చెల్లించాలి. అదే వైశ్యుని చంపితే ఎనిమిదవ వంతు, శ్రమజీవి అయిన శూద్రుని చంపితే పదహారవ వంతు భరణం చెల్లించాలి." (10-127)

"బ్రాహ్మణుడు క్షత్రియుణ్ణి అనుకోకుండా చంపితే, అతడు తన మతాచార విధుల్ని

సర్వం పాటించిన తర్వాత, పూజారులకు ఒక ఎద్దును, వెయ్యి గోవులను దానంగా ఇవ్వాలి." (11–128)

"లేదా, బ్రాహ్మణుడు బ్రాహ్మణుణ్ణి చంపితే అతడు తన పంచేంద్రియాలను, కార్య నిర్వహణేంద్రియాలను కష్టపెడుతూ, మూడు సంవత్సరాలు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఆ కాలంలో అతడు క్షురకర్మను చేయించుకోకుండా, ఊరికి దూరంగా మర్రి చెట్టు కింద, ఆ చెట్టు వూడలనే ఇల్లుగా భావించి నివసించాలి."(1–129)

"అతను అనుకోకుండా ఒక వైశ్యోత్తముణ్ణి గనక చంపితే ఒక సంవత్సరం ప్రాయశ్చిత్తం అనుభవించాలి. లేదా పూజారులకు వంద గోవులను, ఒక ఎద్దును దానంగా ఇవ్వాలి." (11–130)

"అతను అనుకోకుండా ఒక శూద్రుని గనక చంపితే, ఆరు నెలలు ప్రాయశ్చిత్తం అనుభవించాలి. లేదా పూజారులకు పది తెల్ల గోవులను, ఒక ఎద్దును దానంగా ఇవ్వాలి." (11–131)

"బ్రాహ్మణుని చంపటం కంటె ఘోరమైన నేరం ఈ భూమి మీద లేదు. కనుకనే రాజు ఒక పురోహితుని చంపాలనే ఆలోచనైనా కనీసం తన మనసులోనికి రానివ్వకూడదు." (8–131)

"రాజు ఒకే రకమైన నేరాన్ని పరిశీలించి, స్థలం, సమయం, నేరస్థునికి భరణం చెల్లించే స్థోమత లేదా శిక్షననుభవించే ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకొని శిక్షార్హులను మాత్రమే శిక్షించాలి." (8–126)

"స్వయంభువు మనువు (మానవుని శరీరంలో) పది శిక్షా–స్థలాలను పేర్కొన్నాడు. అవి మూడు దిగువ తరగతుల వారికే కాని బ్రాహ్మణుడు ఏ స్థలంలోను తన దేహానికి హాని కలగకుండా రాజ్యం నుంచి వెళ్ళిపోవచ్చును." (8–124)

మనుస్మృతి బ్రాహ్మణునికి మరికొన్ని మినహాయింపులను ఇచ్చింది. వివాహం విషయంలో అతడు తన తరగతి స్త్రీని వివాహం ఆడటమే కాకుండా దిగువ తరగతులలో ఏ వర్ణానికి చెందిన స్త్రీనైనా వివాహం చేసుకోవచ్చు.[2] దిగువ వర్ణం స్త్రీకి కానీ, ఆమె వల్ల కలిగిన సంతానానికి కానీ అతడు తన ప్రతిష్ఠనూ, ఆస్తినీ ఇవ్వవలసిన బాధ్యత లేదు. నేరస్థుణ్ణి న్యాయస్థానంతో పని లేకుండా అతడు శిక్షించవచ్చు.[3] అతడు మత కార్య నిర్వహణకు సంబంధించి, భరణము చెల్లించకుండా, న్యాయస్థానంతో పని లేకుండా సామాన్య వ్యక్తి (శూద్రుని) ఆస్తిని తీసేసుకోవచ్చు.[4] అతడు నిక్షిప్తమై వున్న ధనాన్ని (సంపదని) కనిపెడితే రాజుకి వాటా ఇవ్వకుండా మొత్తం వుంచేసుకోవచ్చు.[5] ఎందుకంటె అతడు అందరికీ యజమాని కాబట్టి. ఇంకెవ్వరైనా నిక్షిప్తమై వున్న ధనాన్ని (సంపదని) కనిపెడితే బ్రాహ్మణుడు సగం వాటాకు అర్హుడు.[6] దీర్ఘ రోగంతో మృతి చెందిన రాజు ఖజానాలో చట్టపరమైన జరిమానాల ద్వారా, కూడిన సొమ్ముకు బ్రాహ్మణుడు అర్హుడు.[7] పన్ను చెల్లింపుల నుంచి అతన్ని మినహాయించారు.[8]

అతడు తనను అనుదిన ఆహార, క్షుద్బాధలకూ దూరంగా వుంచమని రాజుని కోరవచ్చు.[9] అతని ఆస్తి చట్టానికి అతీతం.[10] కనుక వారసులు లేకపోయినా అతని ఆస్తి ప్రభుత్వపరం కాదు. హిందూ సాంఘిక వ్యవస్థలో బాధల్లో వున్న అధిమానవుడు ఉద్యోగ నియమనిబంధనలకు బద్ధుడు కాడు.

మనువు ఇంకా ఇలా అంటాడు.

"బ్రాహ్మణుడు పైన చెప్పిన విధుల ప్రకారం జీవించలేకపోతే అతడు (క్షత్రియుడుగా) సైనికుడుగా జీవించవచ్చు. ఎందుకంటే ఆ వృత్తి తరవాతి శ్రేణిది." (10–81)

"ఒకవేళ అతడు పురోహితుడుగా, సైనికుడుగా కూడా జీవించలేని పక్షాన వ్యాపారస్తుడుగా జీవించవచ్చు. అతడే భూమిని దున్ని, పశువులను కాయవచ్చు." (10–82)

"కానీ బ్రాహ్మణ, క్షత్రియులు, వైశ్యుని కార్యాలు నిర్వర్తిస్తూ జీవిస్తే వీలైనంతవరకు పశువులను కాయడంతో జీవనం సాగించాలి, భూమిని దున్నటానికి దూరంగా ఉండాలి. ఎందుకంటే ఈ పని బాధాకరమైనది, ఎద్దులు మొదలైన ఇతర ప్రాణుల శ్రమపై ఆధారపడినది కాబట్టి." (10–83)

"కొందరి ఉద్దేశంలో వ్యవసాయం చాలా గొప్పది. కానీ ప్రాజ్ఞుల దృష్టిలో అది నిందించదగింది. ఎందుచేతనంటే ఇనుము, చెక్కలతో చేసిన గొడ్డలి, నాగలి వంటి పరికరములు భూమినే కాదు, అందులో నివసించే జీవులను కూడా గాయపరుస్తాయి." (10–84)

"హర్షించదగ్గ జీవనోపాధి లేని పక్షాన, ప్రశంసార్హమైన ఉద్యోగాలు చెయ్యలేని పక్షాన వారు వ్యాపారస్తులు అమ్మే సరుకులు అమ్మి ధనార్జన చేయవచ్చు, పరిహార్యమైనదాన్ని పరిహరించవచ్చు." (10–85)

"ఆపదల్లో ఉన్న బ్రాహ్మణుడు ఎవరినుంచైనా ఎలాంటి బహుమతినైనా స్వీకరించవచ్చు. ఎందుకంటే ఏ పవిత్ర చట్టం కూడా సంపూర్ణ పవిత్రతను మలినపరచటం చూడం" (10–102)

"వేదాలను బోధించి, బలి పూజలు చేసి, బహుమతులు స్వీకరించి జీవించలేని పురోహితులు సాధారణంగా వ్యతిరేక పద్ధతుల్లో ఆపద్ధర్మం పాటించినా వారు ఏ పాపమూ చెయ్యనట్లే. ఎందుకంటే వారు అగ్ని, నీరంత పవిత్రులు." (10–103)

అధిమానవుని హక్కులకు, సామాన్య వ్యక్తి పట్ల అతడికుండే బాధ్యతలకు సామ్యం లేదు. అధిమానవునికి సామాన్య వ్యక్తి పట్ల అసలు బాధ్యతే లేదు. అతడికి సామాన్య వ్యక్తి

బాగు కోసం దానం చేసే అవసరం లేదు. దానం పొందటం కేవలం అధిమానవుని హక్కు. ఇంకే వ్యక్తికైనా దానం పొందటం పాపం. తన వద్ద చాకిరి చెయ్యటానికే జన్మించిన సామాన్య వ్యక్తి (శూద్రుడు)కి మంచి యజమానిగా వుండాల్సిన బాధ్యత అధిమానవునికి లేదు. సరికదా మంచి భోజనం, వస్త్రాలు, వసతి కల్పించాల్సిన అవసరం కూడా లేదు. ఈ విషయంలో అతని విధులు మనువు ఈ విధంగా పేర్కొన్నాడు.

"శూద్రుని పనితనాన్ని బట్టి, కష్టపడే గుణాన్ని బట్టి అతడి కుటుంబ సంఖ్యను బట్టి బ్రాహ్మణులు వారి కుటుంబ ఆస్తిలోంచి ఆ శూద్రునికి సరైన మనోవర్తిని కేటాయించాలి." (10–124)

"మిగిలిపోయిన ఆహారం, పాత దుస్తులు, తాలూ తప్పా ధాన్యం, పాత గృహోపకరణాలు అతనికి ఇవ్వాలి." (10–125)

సామాన్య వ్యక్తి పైకి రావటమనేది అధిమానవుడి గొప్పతనానికి విరుద్ధం. అధిమానవుణ్ణి సంతోషంగా, క్షేమంగా ఉంచటం కోసం హిందూ సాంఘిక వ్యవస్థ ప్రత్యేకమైన శ్రద్ధ వహించి సామాన్య వ్యక్తిని నిరంతరం అధోగతిలో ఉంచింది.

మనువు శూద్రుణ్ణి సేవ తప్ప ఇంకేమీ చేయవద్దంటాడు.

"శూద్రుడు బ్రాహ్మణునికి సేవ చెయ్యాలి." (10–122)

"బ్రాహ్మణుని సేవించటం వల్ల శూద్రునికి జీవనోపాధి లభించకపోతే అతడు క్షత్రియులకు లేదా ధనవంతులైన వైశ్యులకు సేవ చెయ్యాలి." (10–121)

"దేవుడు శూద్రునికి ఒకే ఒక వృత్తి చేయటానికి అర్హత కల్పించాడు. అదేమంటే పై మూడు కులాలకు వినమ్రతతో సేవలు చెయ్యటమే." (1–91)

అదే ఎందుకు? కారణం చెప్పడానికి మనువు వెనుకాడలేదు. (అతడు ఇచ్చిన వివరణ ఇది.)

"శక్తి ఉన్నప్పటికీ శూద్రుడు అతిగా ధనార్జన చెయ్యకూడదు. ఎందుకంటే అతడు ధనవంతుడైతే గర్విష్టిగా మారి, తన బలం వల్ల, నిర్లక్ష్యం వల్ల బ్రాహ్మణులకు సైతం బాధ కలిగిస్తాడు." (10–129)

సామాన్య వ్యక్తి జ్ఞాన సముపార్జన చేయటానికి అర్హుడు గాదు. దీనికి సంబంధించి మనువు నిర్దేశం ఇలా ఉంది.

"బ్రాహ్మణులకు అతడు (సృష్టికర్త) వేద బోధన, వేదాధ్యయనం అనే బాధ్యతలను అప్పగించాడు." (1-88)

"క్షత్రియునికి అతడు (సృష్టికర్త) వేదాధ్యయనం చేయమని శాసించాడు." (1-89)

"వేద విజ్ఞానాన్ని గురువు అనుమతి లేకుండా ఎవరైనా ఆర్జిస్తే, వారు ధర్మశాస్త్రాలు దొంగిలించిన నేరస్తులై బాధల కొలిమిలో మునిగిపోతారు." (2-116)

"అతను (ద్విజుడు) శూద్రుల సమక్షంలో ఎప్పుడూ వేదాన్ని చదువకూడదు." (4-99)

"స్త్రీలకు వేదంతో ఎలాంటి సంబంధమూ లేదు." (9-18)

"ఎవరైనా (ద్విజుడు) బ్రాహ్మణుడు (పొరపాటున) వేదం ఎవరికైనా (అంటే శూద్రులకు, స్త్రీలకు) వివిపిస్తే అతడు పాపం చేసినట్టు. అతడు ఈ నేరానికి ప్రాయశ్చితంగా సంవత్సరం పాటు బార్లీ తాగి బతకాలి." (9-199)

"గ్రంథాలలో మూడు వేర్వేరు విషయాలున్నాయి. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు - వీరికి వేదాల్ని చదివే హక్కు ఉంది. కాని శూద్రుని విషయంలో అతడు వేదాలు చదువనూకూడదు, చదువుతుండగా విననూకూడదు." (9-199)

మనువు వారసులు శూద్రుడు వేదాధ్యయనం చేస్తే దాన్ని ఒక నేరంగా గుర్తించి కఠిన మైన జరిమానా విధించారు. ఉదాహరణకి గౌతముడు ఇలా అన్నాడు.

"శూద్రుడు మననం (నేర్చుకునే) చేసే ఉద్దేశంతో వేదం వింటే అతడి చెవిలో సీసం పొయ్యాలి, అతడు వేదాన్ని ఉచ్చరిస్తే (పలికితే) అతడి నాలుక కత్తిరించేయాలి, అతడు వేదంలో పాండిత్యం సంపాదిస్తే అతడి దేహాన్ని ముక్క ముక్కలుగా నరికేయాలి." (3-4)

కాత్యాయనుడు కూడా ఇదే ధోరణిలో ఉన్నాడు.

సామాన్య వ్యక్తి (శూద్రుడి)కి ఉపనయనం చేసుకునే అర్హత లేదు. ద్వితీయ జన్మే వ్యక్తి ధర్మార్థ స్ఫూర్తికి ప్రతీక.

సామాన్య వ్యక్తికి హుందాతనం ఉట్టిపడే పేరు పెట్టుకొనే హక్కు కూడా లేదు. మనువు ఇలా అంటాడు.

"నామకరణ మహోత్సవం (బిడ్డకు పేరుపెట్టే ఆచారం) పదవ రోజునో పన్నెండో రోజునో (పుట్టిన తరువాత) అదృష్టకరమైన తిథిన మంచి ముహూర్తంలో శుభలగ్నం చూసి తండ్రి చెయ్యాలి. లేదా జరిపించాలి." (2-30)

"బ్రాహ్మణుని పేరులో (మొదటి భాగం) శుభాన్ని సూచించాలి. క్షత్రియుని పేరు అధికారానికి సంబంధించిందై వుండాలి. వైశ్యుని పేరు ధనాన్ని సూచించితే శూద్రుని పేరు విరసనను సూచించాలి. (కలిగించాలి.)" (2-31)

"బ్రాహ్మణుని పేరులో (రెండవ భాగం) ఆనందాన్ని, క్షత్రియుని పేరులో రెండవ భాగం రక్షకత్వ (పదాన్ని), వైశ్యుని పేరులో రెండవ భాగం సంపన్నతను, శూద్రుని పేరులో రెండవ భాగం సేవను సూచించేదిగా ఉండాలి" (2-32)

శూద్రుడు మహత్తరమైన పేరు పెట్టుకోవడం అధిమానవుడు (బ్రాహ్మణుడు) సహించలేడు. వాస్తవ జీవితంలోనూ, పేరులోను కూడా అసహ్యానికి గురి కావాలన్నది మనువు అభీష్టం.

హిందువు జీవితాన్ని కొన్ని దశలుగా విభజించడం జరిగింది. మొదటి దశ బ్రహ్మచర్యం, అంటే విద్యార్థి దశ. రెండో దశ గృహస్థాశ్రమం, అంటే వైవాహిక జీవితం. మూడోది వానప్రస్థం, అంటే ప్రాపంచిక (భౌతిక) జీవితం పట్ల నిర్లిప్తంగా, నిరాసక్తంగా వుండడం. నాల్గవది సన్యాసం, అంటే సమస్త ప్రాపంచిక విషయాల నుండీ, వేరుపడిపోవడం అంటే ఒక విధంగా పౌరమృతికి దగ్గరగా వుండటం, సామాన్య వ్యక్తికి సన్యాసం పుచ్చుకొనే హక్కు నిరాకరించబడింది. కారణాన్ని అర్థం చేసుకోవడం పెద్ద కష్టమేం కాదు. ఇది ఖచ్చితంగా అధిమానవుని బాగు కోసమేను. శూద్రుడు సన్యాసైతే అధిమానవునికి సేవలు చేయడం మానుకుంటాడు. అంతేకాదు, సన్యాసైన శూద్రుడు దేవుడి వద్దకు లేదా బ్రహ్మ వద్దకు చేరితే, అది అధిమానవుని ప్రత్యేకాధికారం మీద దండెత్తినట్టే గదా!

మనువు ప్రస్తావనలను బట్టి చూస్తే హిందూ సామాజిక వ్యవస్థ బాహాటంగా, స్పష్టంగా అధిమానవుని బాగు కోసమే ఉన్నది అన్న విషయం స్పష్టం. ప్రతిదీ అధిమానవుని కోసమే నిర్దేశింపబడింది. అధిమానవుడు బ్రాహ్మణుడు. సామాన్యుడు శూద్రుడు. అధిమానవునికి హక్కులే కాని విధులు లేవు. అన్నీ అధిమానవుని చెప్పుచేతల్లోనే వుంటాయి. ప్రతీది అతని బాగును దృష్టిలో పెట్టుకొనే చేయాలి. మరో కోణంలో సామాన్య వ్యక్తికి పతనం కనిపిస్తోంది. అధిమానవునితో పోలిస్తే సామాన్య వ్యక్తికి ప్రాణ, స్వేచ్ఛ, ఆస్తి సుఖసౌఖ్యాలకు సంబంధించిన హక్కులు లేవు. అధిమానవుని మానప్రాణాలను కాపాడటానికి శూద్రుడు సర్వం త్యాగం చేయడానికి సంసిద్ధంగా ఉండాలి. హిందూ సామాజిక వ్యవస్థ ప్రకారం అటువంటి త్యాగం సామాన్య వ్యక్తి స్వచ్ఛందంగా చేయాలి. నిజానికి, హిందూ సామాజిక వ్యవస్థ శూద్రుడిని అధిమానవుని పట్ల త్యాగపూరితంగా వుండేటట్లు తీర్చిదిద్దుతుంది.

జరాతుష్ట్రుడు అనేది మనువుకు మరో (క్రొత్త) పేరు అనడంలో సందేహం ఏమైనా ఉందా? "జరాతుష్ట్రుడు ఉవాచ" (Thus Spake Zarathustra) అనేది మనుస్మృతికి పాఠాంతరం అని అనడంలో అనుమానం ఏమైనా వుందా?

ఒకవేళ మనువు నీషేల మధ్య వ్యత్యాసం ఏదైనా వుంటే అది ఇది. ఇప్పుడున్న మానవ జాతితో పోల్చిచూస్తే (అంతకంటే ఉన్నతమైన) అధిమానవ జాతికి చెందిన ఒక నూతన జాతిని రూపొందించాలని నీషే నిజంగా కాంక్షించాడు. నీషే అలా చెప్తే, దానికి వ్యతిరేకంగా

మనువు అధిమానవులమనుకొని విర్రవీగే వర్గం వారి హోదాకు సంబంధించిన దురహంకారాన్ని కాపాడే విషయంలో జాగ్రత్తలు తీసుకొన్నాడు. నీషే అన్న 'అధిమానవుడు'–అతని యోగ్యత కారణంగా అధిమానవుడైనటువంటివాడు. మనువు పేర్కొన్న అధిమానవుడు అతని పుట్టుక కారణంగా అధిమానవుడు అయినటువంటివాడు. నీషే చిత్తశుద్ధిగల నిరాసక్త వేదాంతి. కాగా దీనికి భిన్నంగా, ఏ వర్గమైతే యోగ్యతను కోల్పోయినప్పటికీ 'అధిమానవ' బిరుదాన్ని కోల్పోదో, అలాంటి సమూహంలో పుట్టిన వర్గం వారి ప్రయోజనాల్ని కాపాడటమనే తత్వాన్నే ప్రధానంగా పెట్టుకొని వారి తరపున పనిచేసిన కూలీ లాంటివాడు–మనువు. మను ధర్మశాస్త్రంలోని ఈ మాటల్ని పోల్చి చూడండి.[11]

"బ్రాహ్మణుడు పైన పేర్కొన్న విధుల ప్రకారం జీవించలేకపోతే అతడు సైనికుడిగా (క్షత్రియుడిగా) జీవించవచ్చు. ఎందుకంటే ఆ వృత్తి (తన వృత్తి కంటే) తర్వాత శ్రేణిలోది కాబట్టి." (10–81)

"ఒకవేళ అతడు పురోహితుడుగా, సైనికుడుగా–జీవించలేని పక్షాన వ్యాపారస్తునిగా జీవించవచ్చు. అతడే భూమిని దున్ని, పశువులను కాయవచ్చు." (10–82)

"మూర్ఖుడైనా, విద్వాంసుడైనా బ్రాహ్మణుడు–వేదికయందు ఆహితమైన అగ్ని ఏవిధంగా మహాదేవతో ఆవిధంగా ప్రకృష్టమైన దేవతే" (9–317)

"ఆ బ్రాహ్మణులు తమకుద్దిష్టాలైన కార్యాలే కాక, ఇతర తక్కువ కార్యాలు కూడా చేస్తుంటారు. అయినప్పటికీ పరదేవతారూపులు కాబట్టి వాళ్ళు మిక్కిలి పూజ్యులే! ఏవిధంగా అంటే తేజస్వి అయిన అగ్ని శ్మశానంలో శవాన్ని దహిస్తున్నప్పటికీ, పవిత్ర యజ్ఞయాగాదులకు ఉపయుక్తమౌతున్నట్లే." (9–319)

**నీషే పొగడ్తకు మనుస్మృతి అనర్హమైనది. ఎందుకంటే నీషే ఉద్దేశంలో "కులీనులు, తత్వవేత్తలు, సైనికులు ఈ ముగ్గురు సామాన్య ప్రజానీకాన్ని కాపాడుతూ, మార్గదర్శకులుగా వ్యవహరిస్తారు." కాబట్టి నీషే మనుస్మృతి పట్ల ప్రకటించిన అభిప్రాయం నిస్సందేహంగా తప్పుడు అభిప్రాయమే. లేదా అతడు మనుస్మృతిని సరిగా చదవనైనా చదివి వుండకపోవచ్చు. ఎందుకంటే మనుస్మృతిలో అధిమానవుడికి సామాన్య మానవుడిపై హక్కులు మాత్రమే ఉన్నాయి. కానీ ఆ సామాన్యుని పట్ల ఏ విధమైన విధులూ లేవు.**

**అధిమానవుని విషయంలో మనువు హీనమైన, నీచమైన దృక్పథాన్ని నీషే తత్వంతో పోల్చిచూస్తే మనువు దృక్పథం మరింతఅసహ్యమైందని, నీచమైందని అర్థమౌతుంది. ఈ సామాజిక వ్యవస్థనే హిందువులు వెలకట్టలేని ముత్యంగా పరిగణిస్తే, శ్రీ గాంధీ దీన్ని ప్రపంచానికి హిందువులిచ్చిన బహుమానంగా సమర్థించడానికి గర్విస్తున్నారు.**

**హిందూ సామాజిక వ్యవస్థను కొనసాగించడానికి ఉపయోగించిన ప్రక్రియ ప్రత్యేకంగా**

పేర్కోవలసిన మరో అంశం. ఈ ప్రక్రియ రెండంచెలది.

ఈ సామాజిక వ్యవస్థను కొనసాగించే బాధ్యత రాజు భుజస్కంధాలపై వుంచడమే దీనిలో మొదటి అంశం. మనువు ఈ విషయాన్ని చాలా సూటిగా చెప్తాడు.

రాజు ప్రతి వైశ్యుడినీ వ్యాపారం, లేదా వడ్డీ వ్యాపారం చేయమని లేదా వ్యవసాయం చేయమని, లేదా పశువులను పెంచమని ఆజ్ఞాపించాలి. అలానే సేవకుల తరగతికి చెందిన ప్రతీ వ్యక్తినీ (శూద్రునీ) ద్విజులకు సేవ చెయ్యమని ఆజ్ఞాపించాలి." (8–410)

"రాజు పరిశీలనాత్మక దృక్పథంతో వ్యాపారుల్ని, కార్మికుల్ని, వారివారి వృత్తి ధర్మాల్ని పాటించేటట్టు చెయ్యాలి. ఎందుకంటే అటువంటి వ్యక్తులు తమ పనులను విస్మరిస్తే ప్రపంచం గందరగోళంలో పడిపోతుంది." (8–418)

ఈ విషయంలో రాజుకి బాధ్యత అప్పచెప్పడంతోనే మనువు ఆగలేదు. వ్యవస్థను నిర్వహించి, కాపాడడంలో రాజు తన విధిని నిరంతరం నెరవేర్చాలని అతను ఆశించాడు. అందుకే రాజు విషయమై మనువు మరో రెండు నియమాలు చేశాడు. మొదటిది–కొనసాగుతున్న వ్యవస్థను అలాగే నడపడంలో రాజు విఫలమైతే, అతడ్ని సామాన్యుడిలానే శిక్షించాలి. ఇది మనువు చెప్పిన క్రింది ఉదాహరణల ద్వారా సులువుగా అర్థమవుతోంది.

"తండ్రైనా, తల్లైనా, స్నేహితుడైనా, భార్య అయినా, కొడుకైనా, ఇంటి పూజారైనా వారి విధుల్ని ఖచ్చితంగా నిర్వర్తించకపోతే వారిని రాజు శిక్షించాలి." (8–335)

"క్రింది తరగతి వ్యక్తి తప్పు చేస్తే ఒక పణం జరిమానా వేస్తే, అదే రాజు చేస్తే అతనికి వెయ్యి పణాలు జరిమానా విధించాలి. ఇవి అతను పురోహితులకైనా ఇవ్వవచ్చు లేదా నదిలో పారేయవచ్చు. ఇది పవిత్ర నియమం." (8–336)

రాజు విషయంలో మనువు విధించిన రెండో నియమం:

"కొనసాగుతున్న వ్యవస్థను రాజు పట్టించుకోకపోయినా లేదా వ్యవస్థకు వ్యతిరేకంగా వున్నా, ఆ రాజు మీద బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులకు ఆయుధ విప్లవం జరిపే హక్కు ఉంది" అన్నాడు.

"విధి నిర్వహణను ఎవరైనా బలవంతంగా ఆపుచేసినా, కష్టకాలంలోనూ, విపత్తు సంభవించినప్పుడును ద్విజులు ఆయుధాలు చేపట్టవచ్చు." (8–348)

తిరుగుబాటు చేసే హక్కు పైతరగతులు మూడింటికే తప్ప శూద్రునికి ఇవ్వలేదు మనువు. ఇది చాలా సహజం. ఎందుకంటె పైనున్న మూడు తరగతుల వారే ఈ వ్యవస్థ కొనసాగింపు వల్ల లాభం పొందుతారు. ఒకవేళ క్షత్రియులు రాజుతో కుమ్మక్కయి వ్యవస్థను నాశనం చేస్తే ఏం చేయాలి? అప్పుడు అందరినీ, ప్రత్యేకించి క్షత్రియుల్ని శిక్షించే అధికారం మనువు బ్రాహ్మణులకు ఇచ్చాడు.

"చట్టం చక్కగా తెలిసిన బ్రాహ్మణుడు ఏ గాయం తగిలినా రాజుకి ఫిర్యాదు చెయ్యవలసిన పనిలేదు. ఎందుకంటె అతడు స్వశక్తితోనే అతనికి గాయం చేసిన వారికి బుద్ధి చెప్పగలడు." (11–31)

"తన మీద తాను ఆధారపడే ఆ బ్రాహ్మణుని స్వశక్తి రాజ్యాధికారం కంటె గొప్పది. ఎందుకంటె రాజ్యాధికారం ఇతర వ్యక్తులపై ఆధారపడి చెలాయించేది. అందుచేతనే స్వశక్తితోనే బ్రాహ్మణుడు తన శత్రువులను నిర్బంధించగలడు." (11–32)

"అధర్వణుని ద్వారా అంగీరసునికి బోధించబడిన శక్తివంతమైన మంత్రాల్ని బ్రాహ్మణుడు నిస్సంకోచంగా ప్రయోగించవచ్చు. ఎందుకంటె వాక్కే అతని ఆయుధం. దానితోనే అతను తనను అణగదొక్కే వారిని నాశనం చెయ్యగలడు. (11–33)

"బ్రాహ్మణ వర్గంపై కఠినంగా చెయ్యెత్తే సైనికుణ్ని పురోహితుడు తనకు తానే శిక్షించాలి. ఎందుకంటే నిజానికి బ్రాహ్మణుని నుంచే సైనికుడు ఉద్భవిస్తాడు కనుక.." (11–320)

ఆయుధాలు చేపట్టనిదే బ్రాహ్మణులు క్షత్రియుల్ని ఎలా శిక్షిస్తారు? మనువుకిది తెలుసు, అందుకే క్షత్రియుల్ని శిక్షించడానికి బ్రాహ్మణులకు ఆయుధాలు చేపట్టే హక్కు కల్పించాడు.

"సైన్యాన్ని ఆదేశించడానికి, రాజ్యాధికారాన్ని చెలాయించడానికి శిక్షించే అధికారం కోసం అన్ని దేశాల (జాతులపై) మీద సార్వభౌమాధికారానికి వేదశాస్త్రం క్షుణ్ణంగా అవగాహన చేసుకున్న వాడే అర్హుడు. అంటే బ్రాహ్మణుడు మాత్రమే అర్హుడు." (12–100)

ఆచరణలో వున్న సామాజిక వ్యవస్థ కొనసాగింపునకు రెండవ ప్రక్రియ మొదటిదానికంటె భిన్నమైనటువంటిది. నిజం చెప్పాలంటే హిందూ సామాజిక వ్యవస్థలో ఇది ఒక ప్రత్యేకాంశం.

ఆచరణలో వున్న సామాజిక వ్యవస్థకు వ్యతిరేకంగా దాడి జరుగకుండా, దాన్నే కాపాడుకుంటానికి చేసిన ప్రయత్నం సందర్భంగా మనం మూడు విషయాలు గుర్తుంచుకోవాలి. విప్లవం ఒక్కసారి పెల్లుబుకటానికి కారణాలు ఇవి. 1. అక్రమం జరుగుతోందన్న తెలివిడి. 2. అక్రమం వల్ల దుఃఖపడుతున్నామని తెలుసుకొనే సామర్థ్యం. 3. ఆయుధాల లభ్యత.

ఇక విప్లవాన్ని అణచివేయడానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి అసలు విప్లవం తలెత్తకుండా చూడటం. రెండు ఒకవేళ వచ్చినా దాన్ని అణచివేయడం. ఈ రెండు విషయాలు అంటే విప్లవం రాకుండా చూడటం సాధ్యమా లేక దాన్ని అణచివేయడం మాత్రమే ఏకైక మార్గమా అనేది విప్లవం పెల్లుబుకటానికి కారణమైన పైన పేర్కొన్న మూడు అంశాల నియంత్రణ మీద ఆధారపడి వుంటుంది.

ఎప్పుడైతే సామాజిక వ్యవస్థ సామాన్య వ్యక్తికి అభివృద్ధి చెందే అవకాశాన్నీ, విద్యా హక్కునూ, ఆయుధాలు చేపట్టే హక్కునూ ఇవ్వదో, అప్పుడు ఆ సామాజిక వ్యవస్థ మీద విప్లవం వచ్చే అవకాశం ఉండదు. అందువల్ల సామాన్య జనులకు అవి అందకుండా చేసి, విప్లవం వచ్చే స్థితి లేని స్థాయిని కల్పించి, తన్నుతాను పరిరక్షించుకుంటుంది. అదే సామాజిక వ్యవస్థ విద్యా హక్కునూ, ఆయుధాలు చేపట్టే హక్కునూ కల్పిస్తే బాధలకు గురైన వారి నుంచి విప్లవాన్ని ఆపడం సాధ్యం కాదు. ఒకవేళ విప్లవమే గనుక సంభవిస్తే, ఆ విప్లవాన్ని బలంతో, బీభత్సంతో అణిచివేయడం ఒక్కటే మిగిలిన మార్గం. హిందూ సాంఘిక వ్యవస్థ మొదటి పద్ధతిని అవలంబించింది. కింది తరగతుల సామాజిక స్థాయిని, రానున్న అన్ని తరాలకు ఖరారు చేసింది. వారి ఆర్థిక స్థాయిని కూడా స్థిరంగా నిర్ధారించింది. రెండింటి మధ్య పెద్ద వ్యత్యాసం లేకపోవడంతో ఫిర్యాదు తలెత్తే అవకాశం లేదు. కింది తరగతులకు విద్యార్హతను కల్పించలేదు. ఫలితంగా కింది స్థాయి వర్గంలో తమకు అన్యాయం జరుగుతోందనే కారణంతో ఫిర్యాదు చేయగల చైతన్యం వారిలో లేదు. ఒకవేళ వారిలో ఆ చైతన్యం వున్నా, తమ ఆ నిమ్న స్థాయికి ఎవ్వరూ బాధ్యులు కారనే ఆలోచన పాతుకొనిపోయి ఉంది. అది తలరాత ఫలితమని అనుకొన్నారు. ఉపద్రవం కలుగుతోందని ఊహించినా, ఆ ఉపద్రవానికి కారణమైన దాన్ని గుర్తించే చైతన్యం కలిగినా కింద తరగతుల వారు హిందూ సామాజిక వ్యవస్థపై తిరుగుబాటు చేయలేదు. ఎందుకంటే ఆ వ్యవస్థ వారికి ఆయుధాలు పట్టే హక్కు ఇవ్వలేదు. ఆఖరికి మహమ్మదీయులు, నాజీలు వంటివారి సామాజిక వ్యవస్థలు కూడా దీనికి విరుద్ధంగా ప్రవర్తించాయి. వారు అందరికీ సమాన అవకాశాలు కల్పించారు. విద్యను పొందే స్వేచ్ఛను ఇచ్చారు. ఆయుధాలు పట్టే హక్కుని కూడా ఇచ్చారు. అయితే విప్లవం ఏదైనా వస్తే మాత్రం బలం ద్వారా, హింసాయుత పద్ధతుల ద్వారా అణచివేసే మార్గానికి పూనుకొన్నారు. అవకాశాన్ని వినియోగించుకొనే స్వేచ్ఛ, విజ్ఞానాన్ని ఆర్జించే స్వేచ్ఛ, ఆయుధాల్ని పట్టే స్వేచ్ఛలను నిరాకరించటం చాలా క్రూరాతిక్రూరమైన అక్రమం. దీని ఫలితాలు మనువు మనిషిని విచ్ఛిత్తికి, నిర్వీర్యతకు గురిచేశాడు. హిందూ సామాజిక వ్యవస్థ ఇలా చేయటాన్ని సిగ్గుగా ఏనాడూ భావించలేదు. ఏది ఏమైనప్పటికీ హిందూ సామాజిక వ్యవస్థ దీని ద్వారా రెండు విషయాల్ని సాధించింది. ఆచరణలోని ఆ సామాజిక వ్యవస్థ అత్యంత సిగ్గుచేటు పద్ధతులే అయిన, సమర్థమైన పద్ధతుల్ని కనుగొన్నది. ఇది మొదటి అంశం. పౌరుషాన్ని అతి ఘోరంగా ధ్వంసం చేసే మార్గాలు ఉపయోగించినప్పటికీ; ఆ వ్యవస్థ హిందువుల్ని ఎంతో గొప్ప శాంతస్వరూపులు అని కీర్తించేటట్టు చేయటం రెండో అంశం. నాజీలు హిందువుల వద్ద నేర్చుకోవలసింది చాలా ఉంది. సామాన్య ప్రజానీకాన్ని అణచివేసే నైపుణ్యం నాజీలు హిందువుల దగ్గర పుణికిపుచ్చుకొని ఉండి వుంటే; వారు 'జూస్' (JEWS) మీద క్రూరంగా వ్యవహరించి వారిని మసిచేసి వుండేవారు కారు. హిందువుల దగ్గరే గనుక వారు నేర్చుకొని

ఉంటే ఆ పద్ధతుల్తో 'జ్యూస్'లను తేలిగ్గా నాశనం చేయటమే కాదు; ప్రపంచమంతటిలోనూ పరమశాంతమూర్తులు తామేనని వెల్లడించుకొనేవారు.

ఇక హిందూ సామాజిక వ్యవస్థలో మూడో ప్రత్యేకాంశం ఏమిటంటే–ఆ వ్యవస్థను దేవుడే నిర్మించి ఇచ్చాడనేది. అందువల్లే అది పవిత్రం; ఇతరులెవ్వరూ దాని సమీపానికి కూడా చేరరానిదీ; మార్పుకు, విమర్శకు అతీతమయింది అనే భావనను కల్పించిందది. హిందూ సామాజిక వ్యవస్థ తాలూకు దైవత్వ లక్షణాలపై ఎవరి మనసులోనైనా అనుమానం ఉంటే; ఆ అనుమానాన్ని భగవద్గీత, మనస్మృతులలోని ఈ దిగువ శ్లోక భాగాలు నివృత్తి చేస్తాయి. హిందూ దేవుళ్ళలో ఒకడైన శ్రీకృష్ణుడు పలికిన (భగవత్) గీతాసారం ఇదీ:

"నాకై నేనే గుణాల్ని బట్టి, కార్య నిర్వహణను బట్టి ఈ చతుర్వర్ణములను (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలను) సృష్టించాను. దీన్ని తయారుచేసిన వాడను నేనే." (4–13)

"ఓ పరాంతపా! ప్రకృతిగతమైన వ్యక్తి గుణాల్ని బట్టి బ్రాహ్మణులకు (పురోహితులు), క్షత్రియులకు (యోధులు), వైశ్యులకు (వ్యాపారులు). శూద్రులకు (సేవకులు) విధులు నిర్ణయించడం జరిగింది. బ్రాహ్మణునికి సహజమైన విధులు శాంతి, ఆత్మ నిగ్రహం, మతాచార నిరాడంబరత, శుభ్రత, వినమ్రత, ముక్కుసూటిగా పోవడం (మానవత్వం), జ్ఞానం (ఆధ్యాత్మిక జ్ఞానం), విజ్ఞానం (రాజనీతి), ఆస్తిక్య–బుద్ధి (రేపటిపై నమ్మకం) మొదలైనవి. ఇక క్షత్రియుని సహజమైన విధులు (కర్మలు) ఏవంటే శౌర్యం, తేజస్సు, ధైర్యం, ఏకాగ్రత, వెన్ను చూపనితత్వం, ఔదార్యం, అధికార నిర్వహణం (ప్రజల మీద), గోరక్ష (గోవులను కాపాడటం) మొదలైనవి. 'వాణిజ్యం' (అంటే వ్యాపారం) వైశ్యుని సహజ విధి. అలాగే శూద్రుడి సహజ విధి సేవ." (18: 44–44)

కృష్ణుడు హిందూ సమాజ వ్యవస్థపై విమర్శలను అనుమతించలేదు. అతనిలా అన్నాడు:

"జ్ఞాని (పండితుడు) అయినవాడు కర్మలలో ఆసక్తులైన అజ్ఞానులకు ఆ కర్మల పట్ల వైముఖ్యాన్ని కలిగించకూడదు. మరేం చెయ్యాలంటే తాను పూనికతో ఆయా కర్మలను ఆచరిస్తూ, వారిచేత కూడా (వారివారికి నిర్దేశింపబడిన) కర్మలను చేయిస్తుండాలి. ...పరిపూర్ణ జ్ఞానవంతుడు అజ్ఞానుల విశ్వాసాలను చెదరగొట్టకూడదు." (3–26)

ఒకవేళ హిందూ సామాజిక వ్యవస్థ గనక కుప్పకూలిపోతే, దాన్ని సంస్కరించే బాధ్యతను కృష్ణుడు ప్రజలకు ఇవ్వదలచుకోలేదు. ఆ పనిని తనకే వదలిపెట్టమన్నాడు. భగవద్గీతలో–కృష్ణుని హితబోధలో దీనికి చక్కని సాక్ష్యం లభిస్తోంది. కృష్ణుని మాటలివి:

"ఓ భరతా! ఎప్పుడైతే ధర్మానికి హాని కలుగుతుందో, అధర్మానికి వృద్ధి ఏర్పడుతుందో

అప్పుడల్లా నన్ను నేను సృష్టించుకుంటాను. (నా అంతట నేనే పుడతాను.) దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం ప్రతి యుగంలోను నేను అవతరిస్తున్నాను." (4-7, 8)

ఇది హిందూ సామాజిక వ్యవస్థలోని విశేషాంశమే కాదు. విలక్షణమైన అంశం కూడా! దైవ నివేదనాల్ని పరిశీలిస్తే-సమాజం విశ్వల పదార్థాలకు కూడా పట్టాభిషేకం చేసి, అవి పవిత్ర మని ప్రజలలో మతపరమైన నమ్మకం కలిగించిన ఉదాహరణలు ఉన్నాయి. రాళ్ళను, నదులను, చెట్లను-దేవుళ్ళుగాను, దేవతలుగాను మలచిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. అలాగే సంఘం జీవరాశులకూ పట్టం కట్టి అవి పవిత్రమని ప్రజలలో మతపరమైన నమ్మకం కలిగించిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. కానీ ఒక ప్రత్యేకమైన సామాజిక వ్యవస్థకు మతం ద్వారా పట్టం గట్టి దాన్ని పవిత్రం చేసిన ఉదాహరణలు మాత్రం మచ్చుకైనా లేవు. ఆటవిక (పురాతన) ప్రపంచానికి తెగల సంబంధమైన వ్యవస్థ, గిరిజన వ్యవస్థ ఉండేవి. కానీ తెగల సంబంధమైన వ్యవస్థ, గిరిజన వ్యవస్థలు కేవలం సమాజ వ్యవస్థలు మాత్రమే. కానీ అవి ఎప్పుడూ మతం చేత భగవత్కార్యానికై నివేదింపబడలేదు. పవిత్రం చేయబడలేదు. మార్పుకి అతీతంగా ఉండలేదు. ఈజిప్టు, పెర్షియా, రోమ్, గ్రీసు వంటి ప్రాచీన దేశాల్లో ప్రతిదానికీ దానిదైన సామాజిక వ్యవస్థ ఉండేది. ఆ వ్యవస్థలో కొందరు స్వతంత్రులు. కొందరు బానిసలు. కొందరు పౌరులు. కొందరు పరాయిలు. కొందరు స్వజాతీయులు. మరికొందరు తదితరులు. ఈ భిన్న తరగతుల ప్రజలతో కూడిన వ్యవస్థ కూడా సామాజిక వ్యవస్థ మాత్రమే! అయినా అది మతంచేత భగవంతునికి నివేదించబడలేదు. పవిత్రీకృతం చేయబడలేదు. మార్పుకి అతీతంగా ఉండలేదు. ఆధునిక ప్రపంచ దేశాల్లో కూడా వాటివాటికి సంబంధించిన వ్యవస్థలు ఉన్నాయి. కొన్నిట్లో ప్రజాస్వామ్యం, కొన్నిట్లో ఫాసిజమ్. కొన్నిట్లో నాజిజమ్, ఇంకొన్నిట్లో బోల్షివిజం ఉన్నాయి. కానీ వీటిల్లో కూడా వ్యవస్థలు కేవలం సామాజిక వ్యవస్థలే. అయినా అవి మతంచేత భగవత్కార్యానికి నివేదించటం గాని, పవిత్రీకృతం చేయబడటం కాని జరుగలేదు. అంతేకాదు మార్పుకి అతీతమైనవి ఏమీ కావు అవి.

ఏ దేశంలో కూడా సమాజం బ్రతుకుతెరువైన తన వృత్తుల్ని మతపరంగా పవిత్రీకృతం చేయలేదు. ఆర్థిక వ్యవహారం మతానికి దూరంగానే తన ఉనికిని కాపాడుకుంది. ఆటవిక సమాజానికీ మతం లేకపోలేదు. కానీ అక్కడ వేట ఒక వృత్తిగా మతంచేత పవిత్రీకృతం చేయబడలేదు. అలాగే వ్యవసాయాన్ని ఒక వృత్తిగా ఎప్పుడూ, ఎక్కడా మతపరంగా పవిత్రీకృతం చేయటం జరగలేదు. లార్డ్స్, విలన్స్, సర్ఫ్‌ల వంటి శ్రేణులుగా విభజితమైన ఫ్యూడలిజం కూడా సమాజపరమైనదే. కానీ దానిలో పవిత్రత ఏదీ లేదు.

మనిషికీ, మనిషికీ మధ్య సంబంధాలను సామాజిక వ్యవస్థలో మతపరంగా పవిత్రీకృతం చేయటం; మార్పులకు అతీతం చేయటం చేసినవారు ప్రపంచం మొత్తంమీద హిందువులు ఒక్కరే. శ్రామికునికీ, శ్రామికునికీ మధ్య సంబంధాలను ఆర్థిక వ్యవస్థలో మతపరంగా పునీతం చేయటం; శాశ్వతంగా మార్పుకి అతీతం చేయటం చేసిన వారు కూడా ప్రపంచం మొత్తం మీద హిందువులు ఒక్కరే!

కాబట్టి హిందువులకు పవిత్రమైన, మతపరమైన నియమావళి ఉందంటే సరిపోదు. పార్శీయులకు, యూదులకు, క్రైస్తవులకు, మహమ్మదీయులకు కూడా పవిత్రమైన నియమావళి ఉంది. వారు నమ్మకాలనీ, ఆచారాలనీ మతపరంగా పవిత్రం చేస్తారు. కానీ వారో ప్రత్యేకమైన సామాజిక చట్రాన్ని గానీ, ఏ ఇద్దరి వ్యక్తుల నడుమ సంబంధాలను గానీ మతపరంగా పవిత్రం చేయలేదు. మార్పుకి అతీతమైనదిగా కూడా చేయలేదు. ఈ విషయంలోనూ హిందువులు ఒంటరులే! ఇదే హిందూ సామాజిక వ్యవస్థకి కట్టివేసే శక్తిని, కాలం ఆటుపోట్లకి లొంగకుండా అతీతంగా నిలబడే మహత్తర శక్తిని ఇచ్చింది.

సనాతన హిందువులు దీన్ని (ఇప్పటివరకు చేసినదాన్ని) హిందూ సామాజిక వ్యవస్థకి ఒప్పే చక్కని, సరైన వర్ణన అని అంగీకరించి తీరుతారు. అయితే సంస్కర్త మాత్రమే దీన్ని వ్యతిరేకించే అవకాశం ఉంది. బ్రిటిషు వారి రాకతో ఇప్పుడిక అది గత చరిత్రగా మారిపోయిందని అతను అనచ్చు. ఆ అభిప్రాయానికి కలవరపడవలసిన పనిలేదు. ఎందుకంటే, అందులో అతను 'పప్పులో కాలు' వేస్తున్నాడు. సమూహాలుగా అంతరించిపోయిన వ్యవస్థలు అలవాట్ల రూపంలో బతికే వుంటాయని ఆ అభిప్రాయం విస్మరిస్తోంది. హిందూ సామాజిక వ్యవస్థ హిందువులకు అలవాటుగా మారిందన్న, ఆ వ్యవస్థ నూటికి నూరు పాళ్ళు అమలులో ఉన్నంత అలవాటుగా మారిందన్న – వాస్తవాన్ని ఎవరూ కాదనలేరు.

అనువాదకులు: బాబి వర్ధన్
డా. పి.ఆపదరావు

## :అధస్సూచికలు:

1. ఈ మినహాయింపు బ్రిటిష్ ప్రభుత్వంచేత 1837 వరకు కొనసాగించబడింది. 1837లో 'పీనల్ లా' సవరించబడింది. దాని ప్రకారం హత్య చేసిన బ్రాహ్మణునకు మొట్టమొదటగా మరణశిక్ష విధించటం జరిగింది. 'ఇండియన్ స్టేట్స్'లో ఇంకా ఈ మినహాయింపు ఉంది. ట్రావెన్‌కోర్ (త్రివేండ్రం)లో దివానుగా ఉన్న బ్రాహ్మణుడొకడు ఈ ప్రత్యేకాధికారం కొనసాగించనందుకు–అంటే ఉరిశిక్షకు వ్యతిరేకంగా–అనుచితమైన బహిరంగ విమర్శ చేశాడు. బ్రాహ్మణులను ఉరితీయటానికి బదులుగా (ఆ రాజ్యంలో) అసలు ఉరిశిక్షనే రద్దు చేశాడు అతడు.

2. మనుధర్మ శాస్త్రం: 3–12, 13 శ్లో. ఈ విశేషాధికారం భారతదేశంలో కోర్టులచేత గుర్తింపబడింది.

3. మను. 11–31. ఈ విశేషాధికారం రద్దు చేయబడింది.

4. మను. 11–32. ఈ విశేషాధికారం ఇప్పుడు లేదు.

5. మను. 8–37

6. మను. 8–38

7. మను. 9–323

8. మను. 7–133

9. మను. 7–134

10. మను. 9–189

11. బ్రాహ్మణుణ్ణి ఖచ్చితంగా వర్ణించాలంటే అధిమానవుడు కంటే కూడా అతడు అతి గొప్పవాడు. అతనికంటే దిగువున, అట్టడుగువాడైన సామాన్యుని (శూద్రుని) పైన క్షత్రియులు, వైశ్యులు ఉన్నారు. క్షత్రియులు, వైశ్యులు అధికులే కాని అధిమానవులు కారు. అందువల్ల. 'అధిమానవు'డన్న ఈ పరిభాషను మార్చవలసిన ఆవశ్యకత లేదు.

# అధ్యాయం - 4

# హిందూ మత చిహ్నాలు

[ఈ శీర్షికతో 37 పేజీలున్నాయి. ఈ అధ్యాయం అసంపూర్ణంగా కనిపిస్తోంది. అయితే ఇది మౌలిక ప్రణాళికలోని ఏడవ టాపిక్‌కు సంబంధించినదిగా తెలుస్తోంది. "భారతదేశం-కమ్యూనిజం" అన్న వ్యాసం కాయితాలకు కలిపి ఈ పేజీలు ఒక రిజిష్టర్‌గా జతచేసి వున్నాయి. టైప్ చేసిన ఈ ప్రతిని డాక్టర్ అంబేద్కర్ రాసిన విషయసూచికతో సహా ఇక్కడ పొందుపరుస్తున్నాము.

"నేను హిందువును కాగలనా?" అన్న శీర్షికతో రాయదలచిన పుస్తకానికి సంబంధించిన ప్రణాళిక ఫోటో కాపీని మూల ప్రతి (చిరుగు పట్టినది) నుంచి ముద్రిస్తున్నాము. -సంపాదకులు]

హిందూ సామాజిక వ్యవస్థలో ప్రత్యేకత ఏదయినా వున్నదా? పరిశోధకులు జరిపిన పరిశోధనల గురించి అవగాహన లేని; వాస్తవాన్ని గుర్తించలేని హిందూ మతస్థుడు, హిందూ సమాజంలో యే విధమైన ప్రత్యేకత, అసహజత గల అంశాలు లేవని చెబుతాడు. అలా చెప్పడం సహజమే! బయటి ప్రపంచాన్ని పట్టించుకోకుండా గిరిగీసుకొని బ్రతికే మనుష్యులు వారవలంబించే పద్ధతుల ప్రత్యేకతలను గుర్తించి చైతన్యాన్ని కలిగి వుండటం చాలా అరుదు. తరతరాల నుండి కూడా వ్యక్తులు తమకంటూ ఒక పేరును పెట్టుకోవడం నిరంతరాయంగా చేస్తూనే వున్నారు. కానీ హిందూ సామాజిక వ్యవస్థ హైందవేతరుల చేత, విదేశీయుల చేత ఎలా చూడబడింది? హైందవ విధానం హిందువులకు కన్పించినట్టుగా ఒక సహజమైనదిగా, ప్రకృతిసిద్ధమైనదిగా యితరులకు కన్పించిందా?

క్రీ. పూ. సుమారు 305 సం. కాలంలో చంద్రగుప్త మౌర్యుని ఆస్థానానికి విచ్చేసిన గ్రీకు రాజు సెల్యూకసు నికేటరు తాలూకు భారత రాయబారి మెగస్తనీసు హిందూ సామాజిక వ్యవస్థను సాధారణత లోపించిన ఒక విచిత్రమైన పద్ధతిగా భావించాడు. అందుకే అతడు హిందూ సామాజిక వ్యవస్థ తాలూకు ప్రత్యేక లక్షణాలను వర్ణించటానికి అంతటి శ్రద్ధను కనబరిచినాడు. అతడు తన గ్రంధంలో ఆనాటి స్థితిని యీ విధంగా పొందుపరిచాడు.

"భారతదేశ జనాభా ఏడు భాగాలుగా విభజింపబడింది. తత్వవేత్తలు మొదటి తరగతికి చెందుతారు. వీరు సంఖ్యాపరంగా సమాజంలో చాలా తక్కువగా వున్నారు. పూజా పునస్కారాలు, ఇతర ఆధ్యాత్మిక తంతులు చేసే వ్యక్తులు వీరు. వీరి సేవలను వినియోగించుకోవాలంటే కొంత మూల్యాన్ని చెల్లించాలి. రాజులు బహిరంగంగా వీరి సేవలను తమ కొలువులో ఒక విలక్షణమైన పద్ధతిలో వుపయోగించుకొంటారు. నూతన సంవత్సరం మొదటిలో యీ తత్వవేత్తలు సామూహికంగా ప్రధాన ద్వారాల వద్ద రాజుకు ఎదురుగా గుమిగూడి సాహిత్య

రచనల గురించి, పాడి పంటల అభివృద్ధి గురించి ఉపయోగకరమైన సలహాలను ప్రకటిస్తారు. వీరిలో యెవరైనా మూడుసార్లు తప్పడు సమాచారం యిచ్చినట్టుగా కనుగొనబడితే అతడు తన శేష జీవిత పర్యంతం యెటువంటి సలహాలూ యివ్వరాదనే నిషేధం విధించబడుతుంది. శ్రేష్ఠమైన సలహాలు యిచ్చినవారు శిస్తులు, తదితర చెల్లింపుల నుండి మినహాయింపబడతారు. రెండవ తరగతికి చెందినవారు వ్యవసాయదార్లు, మొత్తం జనాభాలో వీరు ఎక్కువ సంఖ్యలో ఉంటారు. సాధు స్వభావులైన వీరు యుద్ధాలు చేసే శాఖ నుండి మినహాయింపబడి వుంటారు. ఎటువంటి భయభీతులు లేకుండా భూములను నిరంతరాయంగా సాగుచేస్తూ ఉంటారు. అల జడులు, ఆందోళనల్లో పాలుపంచుకోవడానికి గాని, మరియే యితర ప్రయోజనార్థం గాని వీరు పట్టణాలకు వెళ్ళరు. అందువలన దేశంలో ఒకే ప్రాంతంలో ఒకే సమయంలో కొంతమంది వ్యక్తులు అస్త్రశస్త్రాలు చేతబూని తమ ప్రాణాలు యెదురొడ్డి యుద్ధాలు చేస్తూ వుండగా వారి సమీపంలో గల మరికొందరు వ్యక్తులు పూర్తి రక్షణతో భూమిని సాగు చేసుకొనడం జరుగుతూ వుంటుంది. భూమి మొత్తం రాజు సొత్తు కాగా, కర్షకులు ఉత్పత్తిలో నాలుగవ వంతును తాము పొందే షరతుమీద యీ భూమిని సాగు చేస్తుంటారు.

పశువుల కాపరులూ, వేటగాళ్ళూ మూడవ తరగతికి చెందినవారు. వేటాడడానికి, పశువులను పెంచడానికి, ఒట్టిపోయిన పశువులను అమ్మడానికి, కిరాయికి యివ్వడానికి గాని యీ తరగతి వారు మాత్రమే అనుమతింపబడతారు. క్రూరమృగాల నుండి, పొలాల్లో నాటిన విత్తనాలను నాశనం చేసే పశు పక్ష్యాదుల నుండి భూమిని పరిరక్షించి దానికి పరిహారంగా కొంత ధాన్యాన్ని రాజు నుండి వీరు పొందుతారు. వీళ్ళు సంచార జీవనాన్ని గడుపుతూ గుడారాల్లో నివసిస్తుంటారు.

వర్తక పనులు చేసేవారూ, వస్తువులనమ్ముకొనే వారు, శారీరక శ్రమ చేసే పనివారు వీరితో కూడుకొన్నదే నాలుగవ తరగతి. వీరు ప్రభుత్వానికి శిస్తులు చెల్లిస్తూ, కొన్నిప్రత్యేకమైన సేవలు చేస్తూ వుంటారు వీరు. అస్త్ర శస్త్రాలను తయారు చేసేవారుగా, ఓడలను తయారు చేసేవారుగా కేవలం రాజు కోసం మాత్రమే పనులు చేసేవారుగా వీరి జీతాలను, ఆహార పదార్థాలను రాజు నెలవు నుండే సరఫరా చేస్తారు. సైనికులకు ఆయుధాలను సైన్యాధికారి అందజేస్తాడు. నావికాధిపతి ప్రయాణీకులకు వాణిజ్యవేత్తలకు ఓడలను అద్దెకు సరఫరా చేస్తాడు.

పోరు సలిపేవారు ఐదవ తరగతికి చెందినవారు. వీరు యుద్ధావసరాలు లేనపుడు త్రాగుడుకు, సోమరితనానికీ తమ సమయాన్నంతా వినియోగిస్తారు. వీరి పోషణ ఖర్చునంతటినీ రాజే భరిస్తాడు కాబట్టి వీరు యెప్పుడు పిలుపు వస్తే అప్పుడు యుద్ధ భూమికి తరలి వెళ్ళడానికి సర్వదా సిద్ధంగా వుంటారు.

ఆరవ తరగతికి చెందినవారు సంచాలకులు లేదా పర్యవేక్షకులు. వీరు దేశంలో జరుగు తున్నదంతా తనిఖీ చేస్తూ రాజుకు రహస్య నివేదికలను సమర్పిస్తుంటారు. వీరిలో కొందరికి నగర

పర్యవేక్షణ అప్పగించబడితే, మరికొంత మందికి సైనిక పర్యవేక్షణాభారం అప్పగించబడుతుంది. నగర రహస్య తనిఖీదారులు తమ అనుచరులుగా నగరంలో ఉన్న వారిని నియమించుకోగా, సైనిక రహస్య తనిఖీదారులు తమ అనుచరులుగా సైన్యంలో వున్న వారినే నియమించుకొంటారు. అత్యధిక సామర్థ్యం గలవారు విశ్వాసపాత్రులైన వారు మాత్రమే యీ నియమకాలకు అర్హులు.

పాలనాధికారులు, న్యాయాధీశులు ఏడవ తరగతి చెందినవారు. ప్రభుత్వంలోని న్యాయ స్థానాలూ, ప్రజా పరిపాలనకు సంబంధించిన అత్యున్నత పదవులు వీరి హస్తగతమై వుంటాయి.

ఒక కులం వారు యింకొక కులం వారిని వివాహమాడటానికి, ఒకరి వృత్తిని లేదా వ్యాపారాన్ని యింకొకరితో బదలాయించుకోవడానికి, ఒకటికి మించి యెక్కువ వ్యాపారాలను చేయడానికి వీలులేదు. కేవలం తత్వవేత్తలు మాత్రమే వారి యొక్క విశిష్టత వలన యీ ఆంక్షల నుండి మినహాయింపు పొందుతారు."

క్రీ. శ. సుమారు 1030 కాలంలో తన భారతదేశ పర్యటనా విశేషాలతో అల్బెరూనీ అనే చరిత్రకారుడిని సైతం హిందూ సామాజిక వ్యవస్థలోని అసాధారణత ఆకట్టుకుని ఉంటుంది. అందుకే ఆయన కూడా తన పరిశీలనలలో దాని గురించి విస్మరించలేదు. ఆయన చెప్పింది ఇది:

హిందువులు తమ కులాలను వర్ణాలుగా పిలుచుకొంటారు. అంటే రంగులు, వంశపారంపర్యరీత్యా వాటిని జాతకాలు లేదా జన్మలు అని పిలుచుకుంటారు. తొలుత యీ కులాలు కేవలం నాలుగు మాత్రమే. అవి–

I మొదటి ఉన్నత కులం బ్రాహ్మణులు. వారు బ్రహ్మముఖం నుండి పుట్టారని హిందూ గ్రంథాలు చెపుతున్నాయి. ప్రకృతి శక్తికి ఒక ప్రతినామమే బ్రహ్మ. శరీరంలో ముఖం ఉన్నత భాగం. బ్రాహ్మణులు మొత్తం మానవులలో ఉన్నతులు, కాబట్టే వారిది ఉత్తమ జన్మగా హిందువులు పరిగణిస్తున్నారు.

II తరువాతి కులం క్షత్రియులు. వీరు బ్రహ్మ భుజాలు చేతుల నుండి సృష్టింపబడిన వారుగా చెప్పకొంటున్నారు. వీరి స్థాయి బ్రాహ్మణునికంటె చెప్పకోతగినంత తక్కువేమీ కాదు.

III బ్రహ్మ తొడల నుండి సృష్టింపబడిన వైశ్యులు మూడవ కోవకు చెందుతారు.

IV బ్రహ్మ పాదాల నుండి సృష్టింపబడిన శూద్రులు నాలుగవ కులం.

ఈ చివరి రెండు కులాల మధ్యా చెప్పుకోదగినంత అంతరమేమీ లేదు. వీరు ఒకే నగరాలలో, గ్రామాలలో, యిండ్లలో కలిసిమెలసి జీవనం సాగిస్తుంటారు.

శూద్రుల తరువాత అంత్యజులు అనబడే వారున్నారు. వీరు ఏ కులంతోనూ కలువకుండా, పలు రకాలైన సేవలు చేస్తూ, కేవలం కొన్ని వృత్తులకూ పనులకూ మాత్రమే పరిమితమై వున్నారు. వారిలో చాకలి, చెప్పులు కుట్టేవాడు, నేత పనిగాడు మినహా మిగిలిన వారు స్వేచ్ఛగా పరస్పరం యిచ్చిపుచ్చుకుని వివాహాలు చేసుకొనే ఎనిమిది తరగతుల వారు సమాజంలో వున్నారు. ఈ ఎనిమిది శ్రేణులూ ఎవరంటే–బట్టలుతికే వారు, చెప్పులు కుట్టేవారు, బుట్టలు, కవచాలు తయారు చేసేవారు, నావికులు, జాలర్లు, క్రూర మృగాలను పక్షులను వేటాడే కిరాతకులు మరియు నేతగాళ్ళు. మొదట చెప్పబడిన నాలుగు అగ్రకులాల వారూ యీ ఎనిమిది శ్రేణుల వారితో కలిసి ఒకే ప్రదేశంలో వయితం నివసించరు. ఈ శ్రేణులలోని వారు పై నాలుగు కులాల వారు నివసించే గ్రామాలకూ పట్టణాలకు దగ్గరగా నివసిస్తుంటారు గాని, వాటికి వెలుపల మాత్రమే నివసిస్తుంటారు.

హాదీ, డోమా లేక డొంబా, కండాల, బధ్ధతావు అనబడే వారు ఏ కులానికీ శ్రేణికీ చెందకుండా విడిగా వుంచబడ్డారు. గ్రామాలను శుభ్రంగా వుంచడం లాంటి నీచమైన పనులు వారికి అప్పగించబడినాయి. వీరంతా వేర్వేరు వృత్తుల నవలంబించినప్పటికీ, ఒకే తరగతికి చెందినవారుగా పరిగణింపబడ్డారు. వాస్తవానికి వారు అధర్మబద్ధంగా జన్మించిన సంతానంగా పరిగణింపబడ్డారు. వారు శూద్రకులానికి చెందిన తండ్రికి, బ్రాహ్మణ కులానికి చెందిన తల్లికి పుట్టిన సంకర జాతివారుగా వెలివేయబడి కించపరచబడ్డారు.

జీవన విధానాన్ని బట్టి, వృత్తిని బట్టి, అగ్ర కులాలకు చెందిన ప్రతి వ్యక్తికీ హిందువులు నామధేయాలను పేర్కొనడం జరిగింది. ఇంటి పట్టునే వుండి, తన పనిని చేసినంత వరకు మాత్రమే బ్రాహ్మణుడు బ్రాహ్మణుడుగా పిలువబడ్డాడు. ఒక అగ్నిహోత్రాన్ని సేవించినవాడు "ఇష్టిన్"గా పిలువబడ్డాడు. మూడు అగ్నిహోత్రాలను సేవిస్తే "అగ్నిహోత్రిన్"గా, అగ్నిహోత్రంతో పాటుగా యితర రకమైన అర్చన కూడా చేసేవాడైతే "దీక్షిత్"గా పిలువబడ్డాడు. ఈ విధానం కేవలం బ్రాహ్మణ కులంలోనే గాకుండా మిగతా కులాలకు కూడా అన్వయించబడింది. ఈ చతుర్వర్ణాల అడుగున వున్న తరగతులలో "హాది" తరగతికి చెందినవారు అపరిశుభ్రమైన వాటికి దూరంగా వుండడం వల్ల వారు కాస్త మెరుగైన వారుగా చూడబడేవారు. తరువాత బూర వూదుతూ పాటలు పాడే "డోమా (డొంబా)" తరగతికి చెందినవారు. తరువాతి రెండు తరగతుల వారు వధకులు (మనుష్యులను చంపేవారు) గాను మరియు న్యాయస్థానాలు విధించిన మరణ శిక్షలను అమలుచేసే కసాయివారుగానూ ఉంచబడ్డారు. అందరికంటే నీచమైన "బధ్ధన్తన్" అనబడే వారు చనిపోయిన పశు మాంసాన్నీ, కుక్కతో సహా యితర నీచ మృగాల మాంసాన్నీ భక్షిస్తారు.

నాలుగు అగ్రకులాలవారు భోజన సమయంలో మాత్రం ఒక కులపు వారితో మరొక కులపు వ్యక్తి సహపంక్తిని కూర్చోవడం నిషిద్ధం. అంతేగాకుండా బ్రాహ్మణవర్గంలో పరస్పర విరోధులుగా వున్న యిద్దరు వ్యక్తులు ప్రక్కప్రక్కనే ఆసనాలను కలిగి వుంటే వారిరువురి మధ్య చెక్కతో గాని, గుడ్డతో గాని యితర పద్ధతిలో గాని విభజన చేసుకొంటారు. వారిరువురి మధ్య ఒక రేఖ (గీత) గీయబడితే వారు విభక్తమైనట్లుగా పరిగణింపబడతారు. ఒకరు తిని విడిచిన భోజనాన్ని మరొకరు తినడం నిషిద్ధం కాబట్టి ప్రతి వ్యక్తీ యెవరి భోజనాన్ని వారు కలిగి వుండాలి. ఒకవేళ ఒకే బృందంలోని వేర్వేరు వ్యక్తులు ఒకే పళ్ళెంలో భుజించవలసి వస్తే ముందు తిన్నవాడి పళ్ళెంలో మిగిలిన అన్నం తరువాతి వాడికి నిషిద్ధం."

హిందూ సామాజిక వ్యవస్థలోని అసహజమైన అంశాలను కేవలం పొందుపరచడంలోనే ఆల్బెరూనీ చరిత్రకారుడు సంతృప్తి చెందలేదు. అతడు ఇంకా ఇలా కూడా చెప్పాడు.

"హిందువులలో యీ రకమైన అసాధారణతలు పెచ్చుపెరిగిపోయి వున్నాయి కాని మరొకవైపు మన మహమ్మదీయులలో మనుషులందరూ సమానంగా పరిగణింపబడతారు. కేవలం పవిత్ర కార్య నిర్వహణలో మాత్రమే విభజన వుంటుంది. హిందూ మహమ్మదీయుల మధ్య ఒక అవగాహన కుదరడానికి, ఒకే పద్ధతికి వారు రావడానికి యివి అడ్డంకులుగా వున్నాయి."

1500 సం. నుండి 1571 సం. వరకు భారతదేశంలోని పోర్చుగీసు ప్రభుత్వంలో అధికారిగా పనిచేసిన పోర్చుగల్ దేశీయుడైన "దూర్ టే బార్బోసా" హిందూ సమాజంపై తన పరిశీలనలను నమోదు చేశాడు. ఆయనను ఆకట్టుకున్న అంశాలు ఇవి. గుజరాత్ రాజ్యం గురించి చెబుతూ ఆయన ఇలా అన్నాడు:

"ఇంతకు ముందు గుజరాతు "మూరుల" హస్తగతమైంది. 'హీదెన్' కులానికి చెందిన వారు అక్కడ నివసించే వారు. వారిని మూరులు "రెప్ బుటోలు" (Rajputs)గా పిలిచేవారు. వారు ఆ రోజుల్లో యోధులుగా, భూమి పరిరక్షకులుగా వుండి యుద్ధాలు చేస్తూ వుండేవారు. వీరు గొర్రెలను, చేపలను చంపి తినడమే కాక, అన్ని రకాలైన ఆహారాన్ని భుజించేవారు. పర్వతాలపై గల గ్రామాల్లో నివసిస్తూ, గుజరాతు రాజుకు విధేయత చూపించకుండా రాజుకు వ్యతిరేకంగా పోరాడడం దినచర్యగా పెట్టుకునేవారు. మంచి గుఱ్ఱపు రౌతులు, విలుకాండ్లు మరియు యితర ఆయుధాలను వుపయోగించడంలో ఆరితేరిన వారవడంతో వారికి ప్రత్యర్థిగా రాజు కొనసాగలేకపోయాడు. మూరులపై కూడా వారు నిరంతరం పోరాడేవారు. వారికి ఏ రాజూ లేదు, ఏ ప్రభువూ లేడు. హీదెన్లలో "బనియనీలు"గా పిలువబడే వర్తక వ్యాపారాల్లో ఆరితేరిన వారు గుజరాతు రాజ్యంలో ఉన్నారు. వీరు మూరులతో కలిసి నివసిస్తూ వారితో వర్తక వ్యాపార సంబంధాలు పెట్టుకొన్నారు. వీరు మాంసాన్ని గాని, చేపలను గాని, ఏ యితర జీవమున్న పదార్థాన్ని గాని భుజించరు. వారు దేనినీ వధించరు. జంతువధను చూడడానికి సహితం

యిష్టపడరు. ఈ విధంగా వారు దాన్ని కఠినంగా పాటిస్తూ భగవతారాధనను కొనసాగిస్తూ వున్నారు. మూరులు చాలా తరచుగా ప్రాణంతో వున్న క్రిమి కీటకాలను, పక్షులను, బనియనీల వద్దకు తేవడం, వారి ఎదుటే వాటిని చంపబోతున్నట్టు చేయడం, బనియనీలు వాటిని చంప కుండా వుండేందుకై అధిక ధరకు కొనుగోలు చేసి, పిమ్మట వాటిని స్వేచ్ఛగా వదిలివేయడము జరుగుతుండేది. రాజుగానీ, గవర్నరుగానీ యే వ్యక్తికైనా మరణ శిక్ష విధిస్తే అపరాధ రుసుమును కట్టి ఆ వ్యక్తిని విడిపించే పద్ధతి గనక వుంటే, బనియనీలు చాలామంది కూడి, డబ్బు వసూలు చేసుకొని, ఆ అపరాధిని మరణశిక్ష నుండి తప్పించి విడుదల చేయించడం జరిగేది. చాలామంది బిక్షగాళ్లైన మూరులు రాళ్ళతో తమను తాము గాయపరచుకొని వస్తే బనియనీలు వారికి చాలా యెక్కువగా బిక్షలు వేసి, శాంతిగా బ్రతకమని కోరేవారు. మరికొంతమంది కత్తులతో తమను తాముగా గాయపరచుకొని వస్తే వారికి వీరు పెద్ద యెత్తున బిక్షలు వేసి, చంపుకోకుండా వుండమని కోరేవారు. ఇంకొందరు బనియనీల వాకిలి వద్దకు వెళ్ళి, ఎలుకలనూ పాములనూ చంపుతామని చెప్తే, అలా చేయకుండా వుండానికై వారికి యెక్కువ డబ్బును ముట్టజెప్పేవారు. ఈ విధంగా మూరుల చేత బనియనీలు ఎంతో స్తుతింపబడ్డారు. వారు నడిచే దారిలో చీమలబారు కన్పించినా, వెనుదిరిగి యింకొక దారి నుండి వెళ్ళిపోయేవారు. వారి యింటిలో ఉదయసూర్యుని వెలుతురు తప్పించి, రాత్రి సమయాలలో సైతం దీపాలను కూడా వెలిగించేవారు కారు. చిన్న ఈగలు, దోమల వంటివి ఆ దీపాలవద్ద మాడిపోతాయేమోనని వారి భయం. అత్యవసరాన్ని బట్టి దీపాన్ని వెలిగించవలసి వస్తే, యే పురుగూ అందులో చొరబడటానికి వీలు లేకుండా గుడ్డతో గాని, కాగితంతో గాని దాన్ని కప్పేసేవారు. వారికి పేలు పడితే వాటిని చంపే వారుకాదు. వాటి వల్ల బాధ యెక్కువైతే తమ హీదెన్‌లలోనే వియమని ష్టలతో పవిత్ర జీవితం గడుపుతున్న సన్యాసుల వంటి కొంతమంది వ్యక్తులను రప్పించేవారు. ఆ భక్తులు ఈ పేలన్నీ యేరి తమ తలల్లో వేసుకొని, తద్వారా తాము దేవుని సేవ చేస్తున్నట్లుగా భావించేవారు. ఈ విధంగా ప్రతి బనియనీయుడూ జీవహింస చేయరాదనే సూత్రాన్ని చాలా ఆత్మనిగ్రహంతో పాటించేవారు. గాని వీరు మరొకప్రక్క అధిక వడ్డీ వ్యాపారస్తులుగాను, తప్పుడు తూనికలు కొలతల వస్తువులు, నాణెములు చేసే వారుగాను, పెద్ద అబద్ధాలకోరులు గాను వుండేవారు. హీదెన్లు గోధుమ రంగు శరీర ఛాయతో యెత్తరులుగా, చూపరులుగా, నాజూకు గల వారిగా వుండి మితాహారులై వుండే వారు. పాలు, వెన్న, పంచదార, వరి మరియు బహు విధానాలైన ఆహార పదార్థాల్ని భుజించేవారు. పండ్లు, కూరగాయలు, ఆకుకూరలను యెక్కువగా వాడేవారు. వారెక్కడ నివసిస్తే అక్కడ పళ్ళ తోటలు, నీళ్ళ చెరువులు యేర్పాటు చేసుకొని, స్త్రీ పురుషులందరూ రోజుకు రెండుసార్లు స్నానం చేసేవారు. స్నానం చేస్తే, ఆ గంట వరకూ చేసిన పాపాలన్నటికీ ప్రక్షాళన జరిగినట్టుగా వారు చెప్తుతారు. ఈ బనియనీలు స్త్రీలవలె పొడవైన జుట్టును పెంచుకొని దానిని దువ్వి, నెత్తిపై ముడివేసి, దానిపై తలపాగా చుట్టి, జుట్టులో పువ్వులను యితర సువాసనలు కలిగిన వస్తువులను అలంకరించుకొంటూ తలపాగా యెప్పుడూ వుండేటట్టు చూసుకొంటారు.

వారు తెల్ల చందనం, కుంకుమ పువ్వు, యితర సుగంధ లేపనాలను వంటికి రాసుకు

నేవారు. వారు చాలా శృంగారప్రియులు. చాలా ఆకర్షణీయంగా పొడవైన నేత, పట్టు అంగీలు, ఆడంబరంగా కనిపించే పవితనంతో కూడిన వాడియైన బూట్లు ధరించేవారు; కొందరు పట్టుతో నేసిన షార్ట్‌కోట్‌లు, బంగారు వెండి దారాల కలనేత వస్త్రాలు ధరించేవారు. బంగారు, వెండి అలంకారాలున్న చిన్న కత్తులు తప్ప మరే ఆయుధం ధరించేవారు కాదు. ఎందుకంటే వారు ఆయుధాలను ఉపయోగించేవారు కాదు. రెండో కారణం, మూరులే వారిని రక్షిస్తారు.

"హీదెన్లలో బ్రాహ్మణీయులుగా పిలువబడే యింకొక తరగతి వారున్నారు. వారు పురోహితులుగా వుంటూ, ఎంతో ఆదాయాన్ని తెచ్చిపెట్టే తమ ప్రార్థనా గృహాలనూ, పెద్ద సైజులో వుండే విగ్రహాల ఆరాధననూ నిర్వహిస్తుండేవారు. వీరిలో చాలామంది యాచకవృత్తి ద్వారా కూడా జీవించేవారు. వారి గృహాలలో చెక్కతో, రాళ్ళతో, రాగితో చేసిన భగవంతుని విగ్రహాలుంటాయి. ఈ గృహాలలోనూ, సన్యాసుల ఆశ్రమాలలోనూ విగ్రహ పూజా పునస్కారాలను చాలా పెద్ద యెత్తున జరిపేవారు. క్రొవ్వొత్తులు, నూనె దీపాలూ, గంటలతో అలంకరించుతారు. ఈ బ్రాహ్మణులకు, హీదెన్లకు క్రైస్తవ త్రిమూర్తి (Holy Trinity) భావనతో పోలికలున్నాయి. పవిత్రత్రయం మధ్య సంబంధాన్ని వారెంతో గౌరవిస్తారు. నిజమైన దేవునిగా భావించి ఎవరిని క్షమాపణ కోరతారో ఆ దేవునికి ప్రార్థనలు చేస్తారు. అతడే సమస్త సృష్టికర్త. అతడే ముగ్గురు, అతడే ఏకైక దేవుడు. అతనికింద ఇంకా అనేక మంది దేవుళ్ళున్నారని వాళ్ళంటారు. ఆ దేవుళ్ళని కూడా వారు నమ్ముతారు. ఈ బ్రాహ్మణులు, హీదెన్లు, మన చర్చిలను యెక్కడ చూస్తే అక్కడ వాటిలో ప్రవేశించి, ప్రార్థనలు చేసి మన విగ్రహాలను పూజించి ఈ విషయాల గురించి తమకు తెలిసినట్లు, శాంతా, మరియల గురించి ప్రశ్నిస్తుంటారు. చర్చి అంటే మన వలెనే గౌరవిస్తారు. మనకూ వారికీ మధ్య చాలా తక్కువ బేధాలున్నట్లు వారు చెబుతారు. వీరు చంపబడిన దానిని తినరు, దేనినీ చంపరు. స్నానము చేయడమే పెద్ద సంస్కారంగా భావిస్తారు. ఆ స్నాన కార్యక్రమం వల్లే వారు పరిరక్షింపబడుతున్నట్లుగా వారి అభిప్రాయం."

కాలికట్ రాజ్యం గురించి మాట్లాడుతూ బార్బోసా యీ క్రింది విధంగా చెబుతాడు-

"ఈ కాలికట్ రాజ్యంలో బ్రాహ్మణీయులుగా పిలువబడే ఒక కులస్థులున్నారు. మనలో క్లెర్జీలున్నట్లుగా వీరు పురోహితులు."

"వారందరూ ఒకే భాష మాట్లాడతారు. బ్రాహ్మణునికి జన్మించని వాడు బ్రాహ్మణుడు కాదు-వారికి యేడేళ్ళ వయసులో వారి భుజాల మీదుగా రెండు వేళ్ళ వెడల్పు గల వెంట్రుకలతో కూడుకొన్న, పూర్తిగా శుద్ధి చేయబడని ఒక అడవి మృగం చర్మాన్ని శరీరంపై ధరిస్తారు. దానినే "క్రివమెర్గమ్" అంటారు. అది అడవి గాడిదలా కన్పిస్తుంది. అవి ధరించిన తర్వాత యేడేళ్ళపాటు తాంబూల సేవనం చేయరు. అతనికి పద్నాలుగేళ్ళు నిండిన తర్వాత బ్రాహ్మణుడిగా చేస్తారు. అప్పుడు యీ చర్మపు పట్టీని తీసివేసి దాని స్థానంలో మూడు వరుసల దారాన్ని ధరింపజేస్తారు. దానినతను జీవితాంతం, బ్రాహ్మణగుర్తుగా ధరించే వుంటాడు. ఈ కార్యక్రమాన్ని మనం మతాధికారి మొదటి ప్రవచనం సందర్భంగా చేసినట్టు ఒక పవిత్ర సంస్కారంగా నిర్వర్తిస్తారు.

ఆతర్వాత అతను తాంబూలసేవనం చేయవచ్చు గాని, మాంసం, చేపలను తినరాదు. వీరు భారతీయులలో చాలా గౌరవపాత్రులు. ఏ కారణానికి గూడా వారికి మరణశిక్ష వుండదు. వీరి కుటుంబ పెద్దకు మాత్రమే కొద్దిగా శిక్షించే అధికారం వుంటుంది. వీరూ మనలాగే ఒకేసారి వివాహం చేసుకొంటారు. పెద్ద కుమారుడిని మాత్రమే వివాహం చేసుకోగా, మిగతా సోదరులంతా జీవితాంతం అవివాహితులుగా వుండపోవలసిందే. పెద్ద కుమారుడు కుటుంబ ఆస్తికి అధికారిగా పరిగణిస్తారు. ఈ బ్రాహ్మణుడు తన భార్యను చక్కగా రక్షించుకొంటూ, గౌరవప్రదంగా చూస్తూ వారితో యితర పురుషులు శయనించకుండా చూస్తాడు. భార్య చనిపోతే మరల వివాహం చేసుకోరు. భర్తకు భార్య ద్రోహం చేస్తే విషాన్నిచ్చి చంపుతారు. బ్రహ్మచారులుగా మిగిలిన సోదరులు నాయర్ స్త్రీలతో శయనిస్తారు. ఆ స్త్రీలు బ్రాహ్మణుల సంపర్కాన్ని గౌరవప్రదంగా భావిస్తారు. ఏ స్త్రీ కూడా వారిని తిరస్కరించదు. తమకన్న పెద్ద వయసు స్త్రీతో వారు శయనించరు. వీరు తమ స్వగృహాలలో పట్టణాలలో నివసిస్తూ ప్రార్ధనా గృహాల్లో పౌరోహిత్యం చేస్తూ, రోజుకు కొన్ని గంటలు భగవత్ ధ్యానంలో గడుపుతారు."

"కొంతమంది బ్రాహ్మణులు ఒక ఆయుధ ప్రయోగంలో తప్పించి, మిగతా అన్ని రకాలుగా రాజును సేవిస్తారు. స్వంత బంధువర్గమో బ్రాహ్మణులో తప్ప రాజుకు భోజనం తయారు చేసేందుకు ఇతరులు అర్హులు కారు. ఇతర దేశాలకు వస్తువులు, ఉత్తరాలూ, డబ్బూ అందించే దూతలుగా వీరు పంపబడతారు. వీరెక్కడికి వెళ్ళినా యెవరూ ఎట్టి హానీ చేయరు. రాజులు యుద్ధాలలో ఉన్నప్పుడు కూడా వీరికి ప్రమాదం లేదు. పూజా పునస్కారాలలో విద్వాంసులైన యీ బ్రాహ్మణులు పలు గ్రంథాలను కలిగి వుండి, రాజుల నుండి గౌరవాన్ని పొందుతారు."

"నేను చాలాచోట్ల నాయర్ల గురించి మాట్లాడినప్పటికీ, వారెటువంటి మనుషులో యింత వరకు చెప్పలేదు. మీరు తెలుసుకోవలసిందేమిటంటే నాయర్లనబడే కులం మలబారు ప్రాంతంలో వుంది. వీరు శీలవంతులు. యుద్ధాలలో పాల్గొనడం తప్పించివీరికి వేరే విధులు లేవు. వీరెక్కడికి వెళ్ళినా ఆయుధాలను వెంట తీసుకుపోతారు. కొందరు కత్తులు, డాలులు, మరికొందరు విల్లంబులు, యింకొందరు యీటెలు ధరిస్తారు. వీరు రాజుతోను, యితర గొప్ప ప్రభువులతోను కలిసి జీవిస్తూ, వారి నుండి భృతిని పొందుతుంటారు. నాయర్ల వంశస్తుడైతే తప్ప నాయరు కాలేదు. మచ్చలేని శీలాన్ని కలిగి వున్న వీరు తక్కువ కులం వారిని తాకరు. నాయర్లు కానివారి యిండ్లలో తినరు, తాగరు. వీరు జీవితాంతం వివాహం చేసుకోకుండా వుంటారు. వారి అక్కచెల్లెళ్ళ కుమారులే (మేనల్లుళ్ళు) వారికి వారసులు, నాయరు స్త్రీలు చాలా స్వతంత్రులుగా వుంటారు. తమకు నచ్చిన నాయరులతో గాని, బ్రాహ్మణునితో గాని వివాహం చేసుకుంటారు. ప్రాణాంతకమైన పరిస్థితిలో సైతం తక్కువ కుల పురుషునితో శయనించరు. వీరికి 12 సంవత్సరాల వయసు వచ్చినప్పుడు వారి తల్లులు పెద్ద సంబరాన్ని చేస్తారు. కుమార్తెకు ఆ వయసు వచ్చినదని గ్రహించిన వెంటనే తల్లి తన కుమార్తెను గౌరవప్రదమైనదిగా గుర్తించమని తమ బంధుమిత్రులను కోరుతుంది. బంధుమిత్రులలో ఒక వ్యక్తిని తమ కుమార్తెకు వివాహమాడమని అడుగుతుంది. ఆ వ్యక్తి దానికి ఇష్టపడి, వాగ్దానం చేసి, అరకాసు బంగారంతో ఓ పొడవైన వగ తయారు చేసి దాని మధ్య రంధ్రం గుండా తెల్ల పట్టుదారాన్ని కడతారు. ఒక నిర్ణీత

దినాన బంగారు ఆభరణాలతో అలంకరింపబడిన కుమార్తెతో సంగీత గానాల ఆనందోత్సాహాల సమావేశాన్ని తల్లి ఏర్పాటు చేయిస్తుంది. అప్పుడు ఆ బంధుమిత్ర వర్గానికి చెందిన వ్యక్తి వచ్చి కొంత తంతు తరువాత తాను తయారు చేయించిన ఆభరణాన్ని తెచ్చి బాలిక మెడలో పడేటట్లుగా విసురుతాడు. అప్పుడామె తన జీవితాంతం దానిని భరిస్తుంది లేదా తన ఇష్టప్రకారం తన నిర్ణయాన్ని తెలియజేస్తుంది. ఆమె బంధువర్గంలోని వాడయితే ఆమెతో శయనించకుండానే నిష్క్రమిస్తాడు. అతను బంధువర్గంలోని వాడు కాకపోతే ఇష్టపడితే ఆమెతో శయనించవచ్చు. తప్పనిసరిగా శయనించాలని లేదు. అప్పటి నుండి తల్లి నాయరు యువకులను వెదుక్కుంటూ వెళ్ళి తన కుమార్తె కన్యత్వాన్ని తీసుకోవలసిందిగా కోరుతుంది. ఒక స్త్రీ కన్యత్వాన్ని తీసుకోవడం అవమానంగా, తప్పిదంగా వారు భావిస్తారు. ఒకసారి ఒక వ్యక్తితో శయనించిన స్త్రీ మాత్రం పురుషుని సాంగత్యానికి సరిపడినదిగా భావిస్తారు. ఆ తరువాత తల్లి మళ్ళీ బయలుదేరి మిగతా నాయరు యువకులను తన కుమార్తెను ఉంపుడుకత్తెగా తీసుకోమని కోరుతుంది. అప్పుడు ముగ్గురు నలుగురు నాయకులు ఆమెతో శారీరక సంబంధం పెట్టుకోవడానికి ఒప్పుకుని ఆమెతో శయనించినందుకు గాను ప్రతి ఒక్కరు రోజుకు కొంత చొప్పున చెల్లిస్తారు. ఆమెకు ఎంత ఎక్కువ మంది ప్రియులు ఉంటే అంత ఎక్కువ గౌరవం దక్కుతుంది. వారిలో ప్రతి ఒక్కరు ఒక్కొక్కరోజు ఒకరోజు మధ్యాహ్నం నుండి రెండవరోజు మధ్యాహ్నం వరకు ఆమెతో కలిసి ఉంటారు. ఆ విధంగా వారి మధ్య ఎటువంటి తగాదాలు, గొడవలు లేకుండా నివసిస్తుంటారు. అందులో ఎవ్వరైనా ఆమెను విడిచిపెట్టి ఇంకొకరిని స్వీకరించాలంటే లేదా ఆమె అతనిని విడిచిపెట్టాలంటే ఆలాగునే చేయవచ్చు. అతను వెళ్ళిపోవచ్చు లేదా రాజీ చేసుకోవచ్చు. వారికి గనుక సంతానం గలిగితే వారు ఏ పురుషుని పిల్లలుగాను గుర్తింపబడరు. తమ పోలికలున్నప్పటికీ పురుషులు వారిని తమ సంతానంగా పరిగణించరు. వారి ఆస్తిపాస్తులకు వారసులు కారు. నేను ముందుగా చెప్పినట్లుగా అక్కచెల్లెళ్ళ కుమారులు (మేనల్లుళ్ళు) నాయర్ల ఆస్తులకు వారసులు. ఎందుకంటే, పిల్లలను పెంచి పోషించే బాధ్యతతో సేవా కార్యక్రమాలలో వెనుకబడరాదు అనే ఉద్దేశంతోనే నాయరు రాజులు ఈ పద్ధతిని ప్రవేశపెట్టారని చెబుతారు."

"ఈ మలబారు రాజ్యంలో "బియాబేరులు"గా పిలువబడే అక్కడి వాస్తవ్యులు అయిన భారతీయ వర్తకులున్నారు. సముద్ర నౌకా కేంద్రాలలో రహదారులలో ఎక్కడైతే వర్తకం లాభ సాటిగా ఉంటుందో అక్కడ వారు ఉంటారు. మొత్తం మిరియాలు, అల్లం నాయర్లు నుండి, వ్యవసాయదారుల నుండి వీరు పోగు చేసుకుంటారు. అప్పుడప్పుడు కొత్త పంటలను తమ దగ్గర గల ప్రత్తి ఉత్పత్తులను ఇచ్చి మార్పిడి పద్ధతి ద్వారా కొనుగోలు చేసి సముద్ర నౌకా కేంద్రాలలో ఉంచుతారు. తరువాత అదే సరుకును ఎక్కువ డబ్బుకు అమ్ముకొని లాభాలు సంపాదిస్తారు. వీరు నివసించే ప్రాంతంలో వీరిని ఆ దేశపు రాజు సైతం విచారించడానికి వీలులేదు."

"ఈ గడ్డపైనే 'కుయావెమ్' అనే మరొక కులం వుంది. వారు నాయర్ల నుండి వేరు కాదు గానీ వీరు చేసిన ఒక తప్పువల్ల వారికి వేరు కావల్సి వచ్చింది. కుండలు చేయడం మరియు రాజుల గృహాలకు దేవాలాయల పైకప్పుకు పెంకుల బదులుగా ఇటుకలు తయారు చేయడం వీరి వృత్తి. ఇవి తప్పించి మిగిలిన ఇండ్లన్నీ కొమ్మలతో కప్పబడి వుంటాయి. వారికి

దేవతా విగ్రహాలు, ఆరాధనాలయాలు విడిగా వుంటాయి.

"హిదెన్లలో 'మెయవటోలు'గా పిలువబడే ఇంకొక కులముంది. రాజుల, బ్రాహ్మణుల, నాయర్ల బట్టలు వుతకడం వీరి వృత్తి. అదే వారి జీవిక. ఇంకొక వృత్తిని వీరు చేపట్టరు."

"వీరికంటే 'కేలటిస్' అనబడే తక్కువ కులముంది. వీరు నేత పని చేస్తారు. నూలు, పట్టు వస్త్రాలను నేయడం తప్ప వీరికి ఇంకొక ఆదాయమార్గం లేదు. వీరు తక్కువ కులానికి చెందినవారు కావడం వల్ల, ఆర్థిక స్తోమత తక్కువగా వుండడం వల్లా, వీరు నిమ్న కులాలవారి వస్త్రాలనే తయారుచేస్తారు. వీరు మిగిలిన కులాల నుండి విడిగా వుంటూ ప్రత్యేక ఆరాధనాలయాలను కలిగి వుంటారు."

"పైన పేర్కొన్న కులాలు మాత్రమేగాక పదకొండు మంది ఇతరులున్నారు. వీరితో అన్యకులాల వారు కలువరు. ప్రాణం పోతున్నా సరే, వీరిని ఎవ్వరూ కనీసం తాకరు. వారిలో వారికి కూడా సంకరం లేకుండా అనేక తేడాలున్నాయి. వారిలో శ్రేష్ఠులైన వారిని 'తుయూలు' అంటారు. తాటి తోపులకు కాపలా కాసి, వాటి పండ్లను సేకరించి, వాటిని తమ మూపులపై మోసి జీవిక సంపాదిస్తారు. ఎందుకంటే ఇక్కడ బరువులు మోసే జంతువులు లేవు.

"ఇంతకంటే ఇంకా అధమంగా పరిగణింపబడే 'మానెన్' లేదా 'మంకు' అని పిలువబడే కులం ఇంకొకటుంది. వీరు ఎవరితోనూ కలిసి జీవించరు. వీరెవరినీ తాకరు, వీరినెవరూ తాకరు. సామాన్య ప్రజల బట్టలు వుతకడం – చాపలు తయారు చేయడం వీరి వృత్తి. ఇతరులు ఆ వృత్తుల నుంచి నిషేధించబడ్డారు. వీరికి పుట్టిన మగ సంతానం తప్పకుండా వీరి వృత్తినే అవలంబించాలి. వీరి ఆరాధనా పద్ధతులు వేరుగా వుంటాయి.

వీరికంటే యింకా అట్టడుగున 'కేనాక్యాలు' అనే ఇంకొక కులముంది. బకిల్స్, గొడుగులు తయారు చేయడం వీరి వృత్తి. ఖగోళ అధ్యయనం కోసం వీరు చదువుకుంటారు. వీరు గొప్ప జ్యోతిష్కులు కూడా. వీరు జరుగబోయే విషయాలను చెప్పగలగడం వల్ల కొందరు రాజులు వీరిని తమ సంరక్షణలో ఉంచుకుంటారు."

"'అగెరలు' అనబడే మరొక తక్కువ కులం యీ హిదెన్లలో వుంది. వీరు వడ్రంగులు, తాపీ పనివాళ్ళు, ఆభరణాలు, లోహపు పనిముట్లు, బంగారు నగలు చేసేవారుగా ఉంటారు. వీరంతా ఒకే వంశ వృక్షానికి చెంది వుంటారు. కానీ కులాలు వేరు. వీరు కొలిచే దేవుళ్ళు, దేవతల బొమ్మలు మిగిలిన కులాలకంటే వేరుగా ఉంటాయి. వీరు వివాహాలు చేసుకుంటారు. వీరి మగ సంతతి ఆస్తికి వారసులై తండ్రి చేసే పనిని నేర్చుకుంటారు."

"ఈ దేశంలో యింకా నీచమైన దశలో వున్నది 'మొగెరలు' అనే కులం. ఇది దాదాపు

'తుయాల' వలెనే ఉంటుంది. కానీ వారు పరస్పరం ఒక తాకరు. వీరు ప్రభుత్వా చెందిన బరువుల మోతపని చేస్తారు. రాజుల రవాణాకు వీరే మోతగాళ్ళు. జనాభారీత్యా చా తక్కువ సంఖ్యలో ఉన్న ప్రత్యేక కులం ఇది. వీరికి వివాహ చట్టమంటూ ఏదీ లేదు. వీరి ఎక్కువ మంది సముద్రంపై తమ జీవనోపాధిని పొందుతుంటారు. కొంతమంది నావికులు మరికొంత మంది జాలర్లుగా ఉంటారు. వీరికి విగ్రహాలు ఉండవు. వీరు నాయర్లకు బానిస కూడా."

"'మూంకర్లు'గా పిలువబడే ఇంకొక అధమ కులం వుంది. చేపలు పట్టడం తప్ప యింకో పని చేయని జాలర్లుగాను, సముద్రంపై మూరుతి మరియు యితర హిదెన్ల నౌకలలో ప చేయువారుగాను వుండే నిపుణులైన సముద్రికులు వీరు. వీరు చాలా మొరటువాళ్ళు, సిగ్గు లజ్జా లేని దొంగలు. వీరిలో వివాహ వ్యవస్థ ఉంది. వీరికి వీరి మగ సంతానం వా సులు. వీరి స్త్రీలు సచ్ఛీలములేని వారై వుండి, ఎవరితోనైనా తప్పులేనట్లుగానే శయనిస్తారు. వీర ఆరాధనాలయాలను ప్రత్యేకంగా కలిగి ఉంటారు."

"ఈ మలబారు ప్రాంతంలోనే 'బెటూనులు'గా పిలువబడే ఇంకొక తక్కువ కులముంది ఉప్పును తయారు చేస్తారు. వరి పంట పండిస్తారు. ఇవి తప్ప వీరికి వేరే జీవనాధారం లేదు."

"మర్యాదస్థులు నడవని చోట్ల రహదారికి దూరంగా ఉన్న పొలాల్లో వీరి ఇండ్లుంటాయి వీరికి తమ స్వంత దేవాలయాలుంటాయి. రాజుకు, నాయర్లకు బానిసలుగా వుంటూ, పేదరి కంలో మగ్గుతూంటారు. వీరు నాయర్లకు దూరంగా నడవాలి, దూరంగా నిలబడి మాట్లాడాలి. వీరు ఏ యితర కులంతోనూ కలిసి వుండడానికి అవకాశం లేదు."

"హిదెన్లలో ఇంకా నిమ్న స్థానంలో 'పానీనులు' అని పిలువబడే మోటు మనుషులతో కూడిన కులం ఒకటుంది. వీరు మంత్రగాళ్ళుగా వుంటారు. వీరికి ఏ జీవనాధారమూ లేదు."

"'రెవొలీనులు' అనబడే యింకొక నిమ్న కులం మిక్కిలి బీద దశలో వుంది. వీరు వంట చెరకును, గడ్డిని పట్టణాలకు తీసుకుని వెళతారు. వీరు ఎవరినీ తాకరాదు. ఎంతటి ప్రాణాంతకమైన పరిస్థితుల్లోనూ వీరిని ఎవరూ తాకరు. వీరు మర్మాంగాలను చాలీచాలని మురికి గుడ్డలతోను, శరీరంలో ఎక్కువ భాగాన్ని చెట్ల ఆకులతోను కప్పుకుని అర్ధనగ్నంగా సంచరి స్తుంటారు. వీరి స్త్రీలు తలకు, మెడకు, చేతులకు, కాళ్ళకు ఆభరణాలను ధరిస్తారు. చెవులకు ఇత్తడి రింగులు ధరిస్తారు."

"హిదెన్లలో మరొక నీచకులంగా, సంఘ బహిష్కృతులుగా శాపగ్రస్తులుగా బ్రతికే "పోలి యస్" అనే కులం ఉంది. పొలాల్లోను, ఇతర ఖాళీ ప్రదేశాల్లోను ఇతర కులాల వారు నివసించడానికి అసహ్యపడే స్థలాలలోను వీళ్ళు మరుగునపడి గుడారాలు వేసుకుని నివసిస్తుం

టారు. గేదెలు, ఎడ్లతోను భూమిని దున్నుతారు. నాయర్లతోను చాలా దూరం నుంచి తప్ప మాట్లాడే అర్హత లేదు. దారుల వెంట నడిచేటప్పుడు తాము వస్తున్నట్లుగా సంకేతాలు ఇస్తూ, తమను వెళ్ళిపోనివ్వవలసిందిగా పెద్దగా కేకలు వేస్తుంటారు. ఆ కేకలు విని దారిపై నడిచే ఇతరులు ఆ దారిని విడిచిపెట్టి మరలిపోతారు. ఏ స్త్రీ గానీ, పురుషుడుగానీ వీరిని తాకితే ఆ స్త్రీ, పురుషుల బంధువర్గం వెనువెంటనే వారిని చంపేస్తుంది. ప్రతీకారంగా వారు పోలియస్ వారిని ఊచకోత కోస్తారు."

"'పరీనులు'గా పిలువబడే ఇంకా అట్టడుగున గల కులం ఒకటుంది. వీరు మిగతా కులాల వారికందరికీ దూరంగా ఎడారి ప్రదేశాలలో నివసిస్తుంటారు. వారు ఇతరులతో గాని, ఇతరులు వారితోగాని కలిసి ఉండరు. వీరు దయ్యాలకంటే చెడ్డవారుగా, శిక్షార్హులుగా పరిగణించబడతారు. వీరిని చూడడమే చాలా అపరిశుభ్రమైన పనిగా, వెలివేయబడదగిన పనిగా లెక్కిస్తారు. వీరు చెట్ల బెరడులను, వేర్లను భుజిస్తారు. తమ శరీర మధ్య భాగాన్ని ఆకులతో కప్పుకుంటారు. వీరు అడవి జంతువుల మాంసం సైతం తింటారు."

"దీనితో "హీదెన్ల"లో గల మొత్తం పద్దెనిమిది కులాలకు గల వ్యత్యాసం ముగుస్తుంది. ప్రతి కులం ఇతర కులానికి వేరుగా, ఒకరినొకరు తాకడానికి వీలు కాకుండా, వారి మధ్య వైవాహిక సంబంధ, బాంధవ్యాలు లేకుండా ఉంటారు. ఈ పద్దెనిమిది కులాల వారు కూడా, మలబారు వాస్తవ్యులే. వీరుకాక, మలబారు ప్రాంతానికి బయట ప్రదేశాల నుండి వచ్చిన వర్తక వాణిజ్యదారులు సొంత వాస్తవ్యులు వలెనే గృహాలను, ఆస్తిపాస్తులను సంపాదించుకొని, తమ స్వంత ఆచారాలను పాటిస్తు నివసిస్తుంటారు."

ఈ విదేశీయులు ఎవరూ కులం గురించిన పూర్తి వివరణతో కూడిన చిత్రాన్ని అందించలేకపోయారు. ఎందుకనేది మనం అవగతం చేసుకోవచ్చు. విదేశీయునికి హిందూ మతస్తుని స్వంత జీవితం చొరరానిది. అతను అందులోకి వెళ్ళలేదు. భారతదేశపు సామాజిక చలన ప్రక్రియ, దాని ప్రేరక శక్తుల పాత్ర న్యాయశాస్త్ర గ్రంథంలోని ఏదో న్యాయసూత్రం ద్వారా కాకుండా, స్థానికత, సంక్లిష్టతతో కూడిన సాంప్రదాయం ద్వారానే అధికంగానే సాగుతుంది. కాకపోతే కులం అనేది విదేశీయునికి హిందూ సమాజంలోని ఏకైక అసాధారణ లక్షణంగా గోచరిస్తున్నది. లేకపోతే వీరు తాము భారతదేశాన్ని సందర్శించినప్పుడు దాని ఉనికిని గ్రంథస్తం చేసేవారు కారు.

ఈ విధంగా కులం, హిందూ సామాజిక వ్యవస్థలో ఒక ప్రత్యేక అంశంగా ఉంటూ, హిందువులను మిగిలిన వారి నుండి వేరు చేస్తున్నది. కులం అనేది పెరిగే వ్యవస్థగా ఉంటూ వచ్చింది. అన్ని సమయాల్లోను ఇది ఒక్కలాగే వుండదు. మెగస్తనీసు వ్రాతలలో ఉన్న కులం తాలూకు రూపురేఖలు, పోర్చుగీసు ఆల్‌బెరూనికి కనిపించే కులం పోకడలు, "ఆల్‌బెరూని" పోర్చుగీసు వారికి వివరించిన హిందూ కుల పద్ధతులు–ఒకే రకంగా లేవు. కాని కులాన్ని అర్థం

చేసుకోవాలంటే కుల స్వభావాన్ని గురించి ఈ విదేశీయులు చెప్పేదానికంటే మరింత ఖచ్చితమైన అవగాహన కలిగి వుండవలసిన అవసరం ఉంది.

కులం గురించిన చర్చలో ముందుకు పోవాలంటే ముందు మనకు హిందూ సామాజిక వ్యవస్థ గురించి కొంత ప్రాథమిక అవగాహన ఉండాలి. హిందూ సమాజంలో నాలుగు తరగతులు లేదా వర్ణాలున్నాయన్న అంశంతో హిందూ సామాజిక వ్యవస్థ తాలూకు ప్రాథమిక అవగాహన మొదలగుతుంది. ఈ నాలుగు తరగతులు– 1) విద్యావంతులు, పురోహితులు అయిన బ్రాహ్మణులు. 2) సైనికవర్గంగా యుండే క్షత్రియులు. 3) వ్యాపారవేత్తలయిన వైశ్యులు. 4) సేవకవర్గం అయిన శూద్రులు. కొంతకాలం వరకు వీరు తరగతులు (Classes)గా ఉండేవారు. కాలక్రమంలో ఈ తరగతులు (వర్ణాలు) కులాలుగా (జాతులు) మారి నాలుగు కులాలు క్రమేపి నాలుగు వేల కులాలయ్యాయి. ఈ విధంగా ఆధునిక కుల వ్యవస్థ ఆవిర్భావం ప్రాచీన కాలపు వర్ణ వ్యవస్థ తాలూకు పరిణామమే!

కుల వ్యవస్థ, వర్ణ వ్యవస్థ యొక్క పరిణామ రూపం అనడం నిస్సందేహం. కానీ వర్ణ వ్యవస్థను అధ్యయనం చేయడం ద్వారా కుల వ్యవస్థను గురించి తెలుసుకోలేము. కులం అనేదాన్ని వర్ణం కంటే వేరుగా అధ్యయనం చేయాలి.

# II

ఒక పురాతన అజ్ఞేయవాది తన సిద్ధాంతాన్ని ఈ క్రింది మాటలలో క్లుప్తంగా చెప్పాడు–

"నాకు తెలిసిన ఒకేఒక విషయమేమిటంటే నాకేమి తెలియదని. అది కూడా నాకు తెలుసునని నేను నిక్కచ్చిగా చెప్పలేను."

పంజాబులోని కులం గురించి సర్ డెన్జిల్ ఇబ్బెట్‌సన్ మాట్లాడుతూ పైన పేర్కొన్న అజ్ఞేయవాది భావాలు ఖచ్చితంగా కులం గురించిన తన మనోభావాలకు సరిపోతాయి అని అన్నాడు. స్థానిక పరిస్థితులు బట్టే కుల విషయాలలో వైవిధ్యం కనబడుతూ వుంటుంది. కులం గురించి ఏ రకమైన విషయ ప్రకటన చేయాలన్న అది మిక్కిలి కష్టతరమైన పని అనేది నిజమే! ఒక ప్రాంతంలోని ఒక కులానికి చెందిన విషయం మరొక ప్రాంతంలో గల అదే కులానికి అన్వయించడం పొరబాటు అవుతుంది.

కులానికి చెందిన సారభూతమైన, ప్రాథమికమైన లక్షణాలను; మౌలికం కాని, బాహ్య లక్షణాలు నుండి వేరు చేయడం పెద్ద కష్టమేమి కాదనేది నిజం. దీనిని నిర్ధారించుకొనే సులభ మార్గమేమిటంటే–ఒక వ్యక్తిని ఒక కులానికి చెందకుండా వెలివేయడానికి గల కారణాలు ఏమిటి అని ప్రశ్నించుకుంటే సరిపోతుంది. ఒక వ్యక్తి కులం నుండి బహిష్కృతం కావడానికి ఈ

క్రింది కారణాలను "భట్టాచార్య" వివరించాడు. అవి– 1) క్రైస్తవ మతాన్ని లేదా ఇస్లాం మతాన్ని స్వీకరించడం. 2) అమెరికా లేదా ఐరోపా వెళ్లడం. 3) వితంతువును వివాహమాడటం. 4) పవిత్ర యజ్ఞోపవీతాన్ని బహిరంగంగా విసిరివేయటం. 5) ఎద్దు మాంసం, పంది మాంసం, ఇతర హీన మృగాల మాంసం భుజించడం. 6) మహమ్మదీయులు, క్రైస్తవులు, అధమ కులస్తులయిన హిందువులు వండిన భోజనాన్ని ఆరగించడం. 7) తక్కువ కులాలకు చెందిన శూద్రుల గృహాలలో పని చేయడం. 8) అవినీతికర కారణాలకు స్త్రీ ఇల్లు విడిచివెళ్ళడం. 9) వితంతువు గర్భవతి కావడం. ఇంతేకాదు, ఇంకా అతి ముఖ్యమైన మూడు కారణాల వల్ల కుల బహిష్కరణకుగురి కావడం జరుగుతుంది. అవి– 10) ఇతర కులస్తులను వివాహమాడటం. 11) ఇతర కులస్తులతో కలిసి భోజనం చేయడం. 12) కులవృత్తిని మార్చుకోవడం. భట్టాచార్య చెప్పిన విషయాలలో గల లోపమేమిటంటే అతి మౌలిక అంశాలకు, మౌలికం కాని అంశాలకు తేడా గుర్తించకపోవడం.

ఒక వ్యక్తి కుల బహిష్కరణకు గురి అయితే అతనికి శిక్ష ఏమిటంటే? బంధుమిత్రులు, సహచరులు అతని ఆతిథ్యాన్ని స్వీకరించడానికి తిరస్కరిస్తారు. వారి ఇండ్లలో జరిగే విందు వినోదాలకు ఇతడిని ఆహ్వానించరు. అతని సంతానంతో వైవాహిక బాంధవ్యాలు ఎవరూ పెట్టుకోరు. అతని వివాహిత కుమార్తెలు సహితం అతనితో తెగతెంపులు చేసుకోకపోతే వారు కూడా బహిష్కరణకు గురి అవుతారు. పురోహితులు, మంగలి, చాకలి సేవలు చేయడానికి నిరాకరిస్తారు. సహచరులందరు అన్ని సంబంధ బాంధవ్యాలను తెంచుకుంటారు. కనీసం ఈ గృహస్తు ఇంటిలో జరిగే అంత్యక్రియలకు సైతం ఎవరూ హాజరు కారు. కొన్ని సందర్భాలలో దేవాలయ ప్రవేశాన్ని, స్మశానాలలో దహన సంస్కార అనుమతిని కూడా ఈ బహిష్కృతులకు నిషేధించడం జరుగుతంది.

ఈ కుల బహిష్కారానికి చూపే కారణాలు కులం యొక్క నియమనిబంధనలు తెలియచేస్తున్నాయి. ఈ నిబంధనలన్నీ ప్రాథమిక నిబంధనలేమీ కావు. మౌలికం కాని నిబంధనలు కూడా వీటిలో వున్నాయి. ఆ నిబంధనలు లేకుండా కూడా కులం మనుగడ సాగించగలదు. ఒక ప్రశ్న ద్వారా ఏ నిబంధనలు మౌలికమో ఏవి కావో మనం నిర్ధారించవచ్చు. కులాన్ని కోల్పోయిన హిందువు మళ్లీ తిరిగి ఎప్పుడు ఆ కులాన్ని పొందగలుగుతాడు? అనేదే ఆ ప్రశ్న. కులం నుండి బహిష్కృతుడు అయిన హిందువు ప్రాయశ్చిత్త కర్మ ద్వారా తాను చేసిన చెడులన్నింటిని ప్రక్షాళనం చేసుకొని తిరిగి తనసాటి హిందువులలో కలవడం వీలుపడుతుంది. ఈ ప్రాయశ్చిత్తం గురించి కొన్ని అంశాలను మనం గుర్తుంచుకోవాలి. మొదటిదేమిటంటే– ప్రాయశ్చిత్తానికి నోచుకోని కొన్ని కులతప్పులు ఉన్నాయి. రెండవది–ఈ ప్రాయశ్చిత్తం ఒక్కొక్క నేరానికి ఒక్కొక్క విధంగా వుంటుంది. కొన్ని నేరాలకు ఇది చాలా చిన్న శిక్షలను విధిస్తూ, మరికొన్ని నేరాలకు కఠిన శిక్షలను విధిస్తుంది.

ప్రాయశ్చిత్తం ఉందా? లేదా? అనేది ప్రాధాన్యత గల అంశం కాబట్టి దాన్ని ముందుగా

క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి. ప్రాయశ్చిత్తం లేదు అంటే ఎవరైనా, ఏ తప్పనైనా చేసి తప్పించు కోవచ్చు అని అర్థం కాదు. అతడు చేసిన నేరానికి శిక్ష అనేది కొలబద్ద కాదనీ, ఆ నేరానికి ఒకసారి బహిష్కృతుడయ్యే వ్యక్తి తిరిగి కులంతో కలవడానికి వీలు లేని నేరస్తుడు అనే అర్థం వస్తుంది. అతనికి కులంలోనికి పునః ప్రవేశం అసంభవం. ఒక నేరానికి ప్రాయశ్చిత్తం ఉందంటే ఆ నేరం క్షమించదగిన నేరం అని అర్థం. ఆ నేరస్తుడు నిర్ధారించబడిన ప్రాయశ్చిత్త కర్మ చేసి తన కులంలోనికి పునః ప్రవేశిస్తాడు.

రెండు రకాలైన నేరాలు క్షమార్హం కానివిగా చెప్పబడ్డాయి. అవి– 1) హిందూమతం నుండి ఇతర మతంలోనికి మారడం. 2) వేరే కులానికి గాని, మతానికి గాని చెందిన వ్యక్తిని వివాహమాడటం, ఈ రెండు కారణాల వలన కులం నుండి బహిష్కరింపబడిన వ్యక్తి శాశ్వతంగా తన కులాన్ని కోల్పోతాడు.

ఇతర అపరాధాలన్నిటిలోను కఠిన ప్రాయశ్చిత్తం గల నేరాలు రెండు. 1) ఇతర కులానికి చెందిన లేదా ఇతర మతానికి చెందిన వారితో సహపంక్తి భోజనం చేయడం. 2) తమ కులవృత్తి కాని ఇతర వృత్తిని స్వీకరించడం. ఇవిగాక మిగిలిన అపరాధాలకు ప్రాయశ్చిత్తం అనేది, అతి తేలికగా, నామమాత్రమైన జరిమానా రూపంలో వుంటుంది.

ప్రాథమిక కుల నిబంధనలేమిటి? కులమంటే ఏఏ అంశాలు చోటు చేసుకుంటాయి. అనే ప్రశ్నలకు ఖచ్చితమైన జవాబులు, ప్రాయశ్చిత్తానికి చెందిన నియమ నిబంధనలలోనే లభ్యమవుతాయి. ఏఏ అపరాధాలకు ప్రాయశ్చిత్తం కఠినంగా ఉంటుందో అవి కులానికి ఆత్మ (Soul) వంటివి. అంతేకాదు, ఏఏ అపరాధాలకు ప్రాయశ్చిత్తం, తేలికగా, నామమాత్రంగా ఉంటుందో అవి కులం తాలూకు దేహం (Body) వంటివి. కాబట్టి కులానికి నాలుగు ప్రాథమిక నిబంధనలు ఉన్నాయని మనం నిస్సందేహంగా చెప్పవచ్చు. 1) హిందూమతం మీద నమ్మకం. 2) వివాహం. 3) ఆహారం. 4) వృత్తి. వీటికి సంబంధించిన నిబంధనలను పాటించే సామాజికులయిన వ్యక్తుల సమూహమే కులం అని కులాన్ని నిర్వచించవచ్చు. ఈ కుల నిర్వచనానికి ఒకే పేరుతో గుర్తింపు పొందిన సామాజిక సమూహం అనే మరొక లక్షణాన్ని కూడా మనం చేర్చుకోవచ్చు.

వివాహానికి సంబంధించిన నిబంధనలు, కుల సంకరం కారాదని నొక్కి వక్కాణిస్తున్నాయి. అన్య కులాల మధ్య వివాహాలు జరుగరాదు అనే భావమే కులమనే భవన నిర్మాణానికి పునాది.

ఆహార నియమాలను చూస్తే ఒక కులానికి చెందినవారు ఇతర కులస్తుల నుండి ఆహారాన్ని తీసుకోరాదు, సహపంక్తిలో భుజించరాదు. దీని అర్థమేమిటంటే–పరస్పర వివాహ బాంధవ్యాలు కలవారు మాత్రమే కలిసి భుజించడానికి వీలుంటుంది. పరస్పర వైవాహిక సంబంధాలు లేనివారు కలిసి భోజనం చేయడానికి వీలులేదు. మరోవిధంగా చెప్పాలంటే కులం

అనేది సంకరం కాని ఒక స్వచ్ఛమైన సమూహ ప్రమాణం (Communal Unit)గా ఉండాలి.

వృత్తికి సంబంధించిన రంగాన్ని చూస్తే ప్రతి వ్యక్తి తన కుల పూర్వీకులు ఏ వృత్తినైతే స్వీకరించారో దానినే స్వీకరించడం ఆచారం. ఒకవేళ వారి కులానికి వృత్తే లేకపోతే తన తండ్రి స్వీకరించిన వృత్తిని స్వీకరించి తీరాలి.

ఒక వ్యక్తి తాలూకు అంతస్తు (హోదా) అతనికి వంశపారంపర్యంగా వస్తుంది. ఇది మార్చడానికి వీలు కానిది. ఎందుకంటే వ్యక్తి హోదా అతను జన్మించిన కులాన్ని బట్టి ఉంటుంది. తన తల్లితండ్రుల కులంతోనే ప్రతి వ్యక్తి ముద్ర వేయబడతారు. ఏ హిందువూ తన కులాన్ని మార్చుకోలేదు కాబట్టి అతని హోదాను కూడా మార్చుకోలేడు. ప్రతి హిందువు, ఒక కులంలో పుట్టి, ఆ కుల సభ్యుడిగానే తనువు చాలిస్తాడు. హిందువు కులాన్ని కోల్పోతే హోదాను కూడా కోల్పోతాడు. ఒక కొత్త లేదా భిన్నమైన లేదా మెరుగైన హోదాను హిందూ మతస్తుడు ఆర్జించలేడు.

కులమంతటికి కలసి ఒకే పేరు ఉండడానికి గల ప్రాధాన్యం ఏమిటి? సమాజంలో ఉండే వ్యక్తుల సమూహాలు కొన్ని వ్యవస్థీకృతం అయినవి గాను, మరికొన్ని వ్యవస్థీకృతం కాని విగాను ఉంటాయి. ఎప్పుడైనా ఒక గుంపు లేదా సమూహంలోకి ఇతర గుంపుల సభ్యులు ప్రవేశించడానికి, దానిని వదిలివెళ్ళిపోవడానికి కొన్ని సాంఘిక కట్టుబాట్లు నియమనిబంధనలు, హక్కులు, విధులు వుంటే, అప్పుడా గుంపు లేదా సమూహాన్ని వ్యవస్థీకృతమైనవిగా గ్రహించాలి. ఈ సమూహం లేదా గుంపులోనికి ప్రవేశించేవారు దాని తాలూకు ఆశయాలేమిటి అనేదాని మీద పూర్తి అవగాహన కలిగి వుంటారు. కొన్ని గుంపులు లేదా సమూహాలలోనికి వ్యక్తులు వారి యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ప్రవేశించి, ఆ ఆచార కట్టుబాట్లకు తమ నియంత్రణ లేకుండానే బద్ధులైపోతూ వుంటారు.

కులం అనేది కట్టుదిట్టంగా వ్యవస్థీకృతం చేయబడిన సామాజికుల గుంపు లేదా సమూహమని నిర్వచించక తప్పదు. ఇది ఎటుపడితే అటు కొట్టుకుపోయే నియంత్రణ లేనిదికాదు. కులం వ్యక్తుల యిష్టంతో నిమిత్తం లేకుండా ఏర్పడే సమూహం. హిందువు కులంలో పుట్టి కులంలోనే చనిపోతాడు. హిందువు కులం లేకుండా ఉండడు. తన నియంత్రణ ఏమాత్రం లేకుండా, పుట్టుక నుండి చావు వరకూ సాంఘిక నియమాలతో కట్టిపడేసినా అతడు కులం నుండి తప్పించుకోలేడు.

ప్రతి కులానికీ వేర్వేరు పేర్లు ఉండడం అనేదాని ప్రాముఖ్యం ఏమిటంటే తద్వారా కులం వ్యవస్థీకృతంగాను, వ్యక్తుల యిష్టానికి అతీతంగాను తయారవుతుంది. ప్రతి కులానికీ ప్రత్యేకమైన, విశిష్టమైన పేరు ఉండడం వల్ల ఆ కులం నిరంతరమైన ఉనికి గల సమూహం గానూ, ప్రత్యేక అస్తిత్వం గల దానిగానూ గుర్తింపును కోరుతుంది. వేర్వేరు కులాలకు వేర్వేరు

పేర్లుండడానికి గల ప్రాధాన్యాన్ని గురించి కులం గురించి రాసే రచయితలు సరిగా అవగాహన లేదు. ఈ అవగాహనా లోపంవల్ల కులం తాలూకు విలక్షణమైన లక్షణాలను వారు సరిగా చూడలేకపోతున్నారు. ప్రతి సమాజంలోనూ కొన్ని సామాజిక గుంపులు లేదా సమూహాలు తప్పక వుంటూనే వుంటాయి. చాలా దేశాల్లో గల చాలా సమూహాలు భారతదేశంలో గల వివిధ కులాలతో సారూప్యం గలవిగా, వాటితో సమానమైనదిగా చెప్పకోవచ్చు. కుమ్మర్లు, చాకళ్ళు, పండితుల వంటి సమూహాలు అన్నిచోట్ల ఉన్నాయి. కాకపోతే ఇతర దేశాల్లో ఆ గుంపులు వ్యవస్థీకృతం కాకుండా, వ్యక్తుల ఇచ్ఛపై ఆధారపడి వున్నాయి. కానీ, భారతదేశంలో ఇవి వ్యవస్థీకృతం అయి, వ్యక్తుల ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ఉన్నాయి. ఇతర దేశాల్లో వాటికి పేర్లు లేవు, భారతదేశంలో వాటికి పేర్లు పెట్టబడి వున్నాయి. కులానికి పెట్టబడిన ఆ పేరు వల్లనే దానికి స్థిరత్వం, శాశ్వతత్వం, వ్యక్తిత్వం అలవడినాయి. ఆ పేరువలనే ఏ వ్యక్తి ఏ సమూహానికి చెందినవాడో తెలుస్తుంది. కొన్ని సందర్భాలలో కులం పేరు అందులో జన్మించిన వ్యక్తుల ఇంటి పేరుగా వుంటుంది. ఆ పేరు వల్లనే తన నియమనిబంధనలను అమలులో పెట్టుకోవడం కులానికి సులభతరమవుతుంది. రెండు రకాలుగా ఇది సులభతరమవుతుంది. కులం పేరు ఇంటి పేరుగా ఉండడం వల్ల వారికి వ్యతిరేకంగా పొరపాటున ఇతర కులాలకు చెందినవారిగా భావించి నేరాలు జరుగవు. రెండవది, కులం పేరు తెలియడం వల్ల అపరాధి కులం గుర్తింపబడి, ఆ కుల నియమాల ప్రకారం శిక్షింపబడడం సులువుగా జరుగుతుంది.

కులమంటే ఇదీ అర్థం. ఇక కుల వ్యవస్థ విషయానికొద్దాం. కుల వ్యవస్థ గురించి తెలుసుకోవడమంటే వివిధ కులాల మధ్య వున్న సంబంధాలను తెలుసుకోవడం. కుల సమాహారంగా చూస్తే కుల వ్యవస్థ చూసేవారికి ఒక్కసారిగా అనేక లక్షణాలను ప్రదర్శిస్తుంది. ఆ వ్యవస్థను ఏర్పరచిన విభిన్న కులాల మధ్య సన్నిహిత సంబంధం లేదన్నది మొదటి అంశం. (కులాల సమాహారంగా చూస్తు, కులవ్యవస్థ ప్రకటించే లక్షణాలు పరిశీలకులను దిగ్భ్రాంతులను చేస్తాయి. వ్యవస్థ ఏర్పడడానికి అవసరమైన అంతస్సంబంధాలు వివిధ కులాల మధ్య లేవనేది ప్రథమ అంశం. కుల వ్యవస్థ గురించి ఇంతకు ముందు చెప్పని లక్షణాన్ని వక్కాణించడం ప్రస్తుతానికి అవసరం. అదేమిటంటే- కులం అనేది వర్గ భావనకు భిన్నమైనదీ, వ్యతిరేకమైనదీ అయినప్పటికీ కుల వ్యవస్థ - కులం కంటె వేరుగా - పైన చెప్పిన అంచెల స్థాయికి వర్గ వ్యవస్థ భిన్నమైనదని గుర్తిస్తుంది. హిందువులు అనేక కులాలుగా విభజించబడ్డట్టే, కులాలు కూడా వివిధ వర్గాల కులాలుగా విభజించబడ్డాయి. హిందువు కుల స్పృహ కలవాడు. వర్గ స్పృహ కూడా కలవాడు. అతను కుల స్పృహ కలవాడా? వర్గ స్పృహ కలవాడా? అనేది అతనికి దేనితో ఘర్షణ ఏర్పడుతుంది అనే దానిపై ఆధారపడి ఉంటుంది. అతను తలపడవలసి వచ్చే కులం తన వర్గానికే చెందినది అయితే అతను కుల స్పృహ కలిగి ఉంటాడు. ఒకవేళ ఆ కులం తన వర్గానికి వెలుపలిది అయితే వర్గ స్పృహ కలిగి ఉంటాడు. ఈ అంశానికి సాక్ష్యాధారాలు కావలసిన వారు మద్రాసులోనూ, బొంబాయి ప్రెసిడెన్సీలోనూ జరిగిన బ్రాహ్మణేతర ఉద్యమాలను అధ్యయనం చేయవచ్చు. హిందూ కుల పరిహద్దు, వర్గ హద్దులంత నిజమనీ, కుల స్పృహ కూడా వర్గ స్పృహ అంత వాస్తవమనీ నిస్సందేహంగా అవగతమవుతుంది.) ప్రతి కులం విభిన్నంగా, ప్రత్యేకంగా ఉంటుంది. తన ఆంతరంగిక విషయాలను నిర్ణయించుకోవడంలోను, కుల నిబంధనలను

అమలు పెట్టడంలోను సర్వ స్వతంత్రమయిన సార్వభౌమాధికారాన్ని కులం కల్గి వుంటుంది. కులాలలో సామీప్యం ఉన్నా, పరస్పరం చొచ్చుకుపోవడానికి వీలులేదు. ఇక రెండవ అంశం. ఒక కులం ఇంకొక కులంతో ఎటువంటి సంబంధం పెట్టుకుంటూ వుంటుంది అనేది. కులాల క్రమం నిట్టనిలువుగా ఎగుడుదిగుడులతో వుండేదే కానీ సమతలంలో పక్కపక్కన ఉండేది కాదు.

కులం, కుల వ్యవస్థ అంటే ఇది; హిందూ సామాజిక వ్యవస్థ గూర్చి తెల్సుకోవాలంటే ఈ విషయ జ్ఞానమే సరిపోతుందా అనేది ప్రశ్న. హిందూ సామాజిక వ్యవస్థ గురించి ఒక జడ అవగాహన సరిపోతుందంటే ఈ విధంగానే కులం కుల వ్యవస్థ గూర్చి తెలుసుకుని ఊరుకుంటే చాలు. హిందువులు కులాలవారిగా విభజింపబడ్డారని, కులాలు ఒక వ్యవస్థను తయారు చేశాయని, అందులో హెచ్చుతగ్గులతో అగ్ర, నీచ స్థాయిలలో అంతరాల మెట్ల మీద కులాలు అమర్చబడినాయి అనీ వాటన్నిటి మధ్య నిట్టనిలువు టెన్నిస్ బంతుల మాలలో దారం వలె వ్యవస్థ అనే అంతస్సూత్రం ఉన్నదని తెలుసుకుని, గుర్తుంచుకొని బాధపడవలసిన అవసరం లేదు. కాని, కులాన్ని ఒక లక్షణం కల చలనశీలమైన ధోరణిగా చూడాలనుకుంటే మాత్రం ఈ అధ్యయనం మాత్రం సరిపోదు. ఆచరణలో కులం చేస్తున్న పనులను విశితంగా తెలుసుకోవాలంటే కుల వ్యవస్థతో పాటు “వర్గ – కులవ్యవస్థ” అనే అంశాన్ని అధ్యయనం చేయడం అవసరం.

కులానికి, వర్గానికి (Caste and Class) మధ్య గల సంబంధం ఏమిటన్నది ప్రస్తుతం వివాదాంశం. కొంత మంది కులానికి వర్గానికి తేడా లేదని, రెండూ ఒకటేనని చెబుతారు. మరి కొంతమంది కులం–వర్గం భావనలు ప్రాథమికంగా పరస్పరం వ్యతిరేకం అయినవని చెబుతారు. కులం అనే అంశాన్ని ఈ కోణం నుండి పరిశీలించడం ముందుముందు జరుగుతుంది.

ఈ అధ్యయనం వలన వర్గ సరిహద్దుల వలెనే కులానికి సయితం కొన్ని సరిహద్దులున్నాయని, వర్గ చైతన్యంలానే, కుల చైతన్యం అనేది ఉందనే వాస్తవాలు తెలుస్తాయి. వర్ణ వ్యవస్థ పరిణామమే కులం అని చెప్పబడింది. ఇది అర్థరహితమని తరువాత వివరిస్తాను. వర్ణం యొక్క విస్తితరూపమే కులం. వర్ణానికి వ్యతిరేక మార్గంలో వచ్చిన పరిణామం కులం. ఎప్పుడయితే కులం పూర్తిగా వికృతమైందో పట్టిందో అప్పుడు వర్ణ వ్యవస్థ నుంచి వర్గ వ్యవస్థను అరువుకు తెచ్చుకుంది. విజానికి కులవ్యవస్థ వర్ణ వ్యవస్థలోని వర్గ– విభజనను చాలా దగ్గరిగా అనుసరించింది.

ఈ దృక్కోణం నుంచి కులవ్యవస్థను చూస్తే కులాల దిమ్మలతో ఏర్పడిన కుల పిరమిడ్‌ను వర్గ అంతరాలు ఎలా చీలికలతో విభజించాయో అర్థమవుతుంది. ప్రాచీన చతుర్వర్ణనా వ్యవస్థలో కనిపించే విభజన రేఖ మొదటి చీలికలో గోచరమవుతుంది. పురాతన చతుర్వర్ణాల పద్ధతి మొదటి మూడు వర్ణాలయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు, నాలుగవ వర్ణమయిన శూద్రులకు మధ్య ఒక భేదాన్ని సృష్టించింది. మొదట ముగ్గురు కూడా రెండు జన్మలు గల వర్గాలు

వచ్చిన అసంఖ్యాకమైన కులాలను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్గం నుండి వచ్చిన కులాలకు భిన్నంగా నిలబెట్టారు. అదే నేటి వర్గ విభజనకు పునాది అయ్యింది. ఈ విభజన రేఖే ఉన్నత కులాలు, అధమ కులాలు అనే మాటలుగా వ్యక్తం చేయబడుతుంది. ఉన్నత వర్గానికి చెందిన కులాలు, అధమ వర్గానికి చెందిన కులాలు అనే పదాలే ఈ విధంగా కుదించబడినాయని చెప్పొచ్చు.

ఈ మొదటి విభజన రేఖ తరువాత, రెండవ విభజన రేఖ ఉంది. ఇది అధమ వర్గాల కులాలకు అడుగున ప్రయాణం చేస్తుంది. ఈ రేఖ చతుర్వర్ణాల నుండి పుట్టిన కులాలన్నింటిని పైనపెట్టి మిగిలిపోయిన కొన్ని కులాలను అట్టడుగున చూపిస్తుంది. వాటిని 'తక్కిన కులాలు' అని పేర్కొంటాము. ఈ వర్గ విభజన రేఖ కూడా వాస్తవమైనదే, ఇది చతుర్వర్ణ వ్యవస్థ తాలూకు ప్రాథమిక సూత్రాన్ని పాటిస్తుంది. చతుర్వర్ణ వ్యవస్థ పైన పేర్కొన్న విధంగా మొదటి మూడు వర్ణాలను ఉన్నతంగా వుంచి మొత్తం నాలుగు వర్ణాల మధ్య ఒక విభజన చేసింది. కాని ఈ రెండవ విభజన రేఖ నాలుగు వర్ణాలలో ఉన్న వారికి, వారికి చెందకుండా బయట ఉన్నవారికి స్పష్టమయిన అంతరాన్ని చూపించింది. ఈ భేదాన్ని వెలిబుచ్చడానికి ఒక పరిభాష ఉంది. చతుర్వర్ణాల లోపల గల ఉన్నతులయినా, అధములయినా, బ్రాహ్మణులయినా, శూద్రులయినా వర్ణమున్న "సవర్ణలు"గా పిలువబడ్డారు. చతుర్వర్ణాలకు చెందనివారు వర్ణము లేని "అవర్ణులు"గా చెప్పబడ్డారు. ఈ విధంగా చతుర్వర్ణాల వారు "సవర్ణ హిందువులు" అని ఇంగ్లీషులో "కులీన హిందువులు" (Caste Hindus)గా పిలువబడ్డారు. మిగిలిన వారు "అవర్ణులు"గా, ఇంగ్లీషులో "కులీనేతర హిందువులు" (Non-Caste Hindus)గా పిలువబడ్డారు.

కుల వ్యవస్థను గురించి వ్రాయబడినదంతా సవర్ణ హిందువుల మధ్య గల కుల వ్యవస్థ సారాంశమే. అవర్ణుల గురించి చెప్పబడింది చాలా తక్కువ. అవర్ణ హిందువులంతా ఎవరు? హిందూ సమాజంలో వారి పరిస్థితి ఏమిటి? వారు సవర్ణ హిందువులతో ఏ విధమయిన సంబంధం కలిగి వున్నారు? అనే ప్రశ్నలకు ఇంతవరకు ఎటువంటి ప్రాధాన్యం ఇవ్వబడలేదు. ఈ ప్రశ్నలకు జవాబు లేనిదే హిందువులు నిర్మించిన, సామాజిక చిత్రం యొక్క యదార్థ రూపాన్ని చూడలేమని నేను ఖచ్చితంగా చెప్పగలను. సవర్ణ హిందువులకు మధ్య ఉన్న వర్గ అగాధాన్ని వదిలివేయటం అంటే మంత్రగత్తెలు మరుగుజ్జులు లేకుండా గ్రిమ్ ఫెయిరీ కథ చెప్పినట్టే అవుతుంది.

అవర్ణ హిందువులు మూడు....

అసంపూర్ణం

అనువాదం: శ్రీ విజయలక్ష్మి పరమేశ్వరరావ్

# మూడో భాగం

# ప్రాచీన భారతదేశంలో విప్లవం–ప్రతివిప్లవం

"ప్రాచీన భారతదేశంలో విప్లవం – ప్రతివిప్లవం" అన్న పేరుతో సమగ్ర గ్రంథాన్నే రాయాలని డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ అనుకున్నారు. ఆ పుస్తకంలోని విషయాల పట్టికను పుస్తకాల ప్రణాళిక అధ్యాయంలో అచ్చయినాయి. ఈ విస్తృత శీర్షిక కింద మొత్తం ఏడు పుస్తకాలు రాయాలని ఆయన మొదట సంకల్పించారు. కొన్ని అధ్యాయాలను, కొన్ని పేజీలను మాత్రమే కమిటీ కనుగొనగలిగింది. ఆ అధ్యాయాలు కూడా అసంపూర్ణం. అసంపూర్ణమే అయినప్పటికీ లభ్యమవుతున్న భాగాల "ప్రాచీన భారతదేశంలో విప్లవం – ప్రతివిప్లవం"ను ఈ సంపుటంలో భాగంగా అందించాలని కమిటీ నిర్ణయించింది. బౌద్ధం అవతరణను డాక్టర్ అంబేద్కర్ విప్లవంగా పరిగణించారు. బ్రాహ్మణులు నిర్వహించిన ప్రతివిప్లవం బౌద్ధమత క్షీణతకు – పతనానికీ కారణమైంది.

ఈ శీర్షిక కింద ఈ కింది అధ్యాయాలను చేర్చాము.

1. *తవ్వి తీసిన ప్రాచీన భారతం*
2. *ప్రాచీన శకం – ఆర్యుల సమాజం స్థితిగతులు*
3. *పౌరోహిత్య పతనం*
4. *సంస్కర్తలు – వారి భవితవ్యం*
5. *బౌద్ధమత క్షీణత, పతనం*
6. *బ్రాహ్మణమత సాహిత్యం*
7. *బ్రాహ్మణమత విజయం*
8. *గృహధర్మసూత్రాలు – మనుస్మృతి లేదా ప్రతివిప్లవ పవిత్ర గ్రంథం*
9. *ప్రతివిప్లవానికి తాత్విక సమర్థన (కృష్ణుడు, అతని గీత)*
10. *విరాట ఉద్యోగ పర్వాల విశ్లేషణ*
11. *బ్రాహ్మణులు క్షత్రియుల పోరాటాలు*
12. *శూద్రులు – ప్రతివిప్లవం*
13. *స్త్రీలు – ప్రతివిప్లవం*

పుస్తకాల ప్రణాళికలో అన్న ఆఖరి అధ్యాయంలోని ప్రతిపాదిత ప్రణాళికతో ఈ అధ్యాయాలను పాఠకులు పోల్చి చూడవచ్చు.

–సంపాదకులు

## అధ్యాయం - 5

# తప్వి వెలికితీసిన ప్రాచీన భారతదేశచరిత్ర

(ఈ అధ్యాయానికి సంబంధించి రెండు టైపు చేసిన కాపీలు మాకు లభించాయి. ఆ రెండింటిలో కూడా డా. బాబాసాహెబ్ అంబేద్కర్ తన స్వదస్తూరితో కొన్ని మార్పులూ, చేర్పులు చేశారు. వాటిని ఆద్యంతం పరిశీలించిన మీదట, రెండో పాఠాంతరాన్ని ఈ సంకలనంలో చేర్చాలని ఒక నిర్ణయానికి వచ్చాము. మాకు లభ్యమయిన వ్యాసం మూడు పేజీలే వుంది. డా. అంబేద్కర్ రాయతలపెట్టిన పెద్ద వ్యాసానికిది బహుశా ఉపోద్ఘాతం కావచ్చు. -సంపాదకులు)

భారతదేశ ప్రాచీన చరిత్రలో అధిక భాగం అసలు చరిత్రే అనిపించుకోదు. అలాగని ప్రాచీన భారతానికి చరిత్రే లేదని కాదు. చాలా వుంది. కానీ అది తన స్వభావాన్ని కోల్పోయింది. దాన్ని ఆడవాళ్ళు పిల్లలూ ఆనందించే పుక్కిటి పురాణంగా మార్చివేశారు. ఇది ఉద్దేశపూర్వకంగా బ్రాహ్మణీయ రచయితలు చేసిన పనే. ఉదాహరణకి 'దేవ' అనే పదాన్నే తీసుకుందాం. ఆ పదానికి అర్థం ఏమిటి? 'జనవిశేష' అనే పదం మానవ సమాజంలోని ఓ వ్యక్తి అనే భావాన్ని సూచిస్తుందా? అదేదో మానవతాతీత శక్తి అనిపించేలా చేస్తుంది. ఈ విధంగా కొద్దో గొప్పో ఉన్న సారగర్భిత చరిత్రని కాస్తా పిండి పారవేయడం జరిగింది.

'దేవ' అనే పదంతో పాటుగా స్మరణకు వచ్చేవే యక్ష, గణ, గంధర్వ, కిన్నెర అనే పదాలు కూడా. ఇంతకీ వీళ్లెవరు? రామాయణ, మహాభారతాలను చదివిన మీదట ఆ గ్రంథాల్లో చిత్రించిన పాత్రలు దిగంత పర్యంతం వ్యాపించిన కాల్పనిక వ్యక్తులనీ, నిజ జీవితంలో యిలాంటి వ్యక్తులు అసలు లేరని మనకి అనిపిస్తుంది.

కాని వాస్తవానికి, యక్షులు, గణులు, గంధర్వులు, కిన్నెరలు కూడా మానవ సంతతికి చెందినవారు. వీరంతా దేవతలకు సేవ చేస్తూ వచ్చారు. యక్షులు దేవతల ప్రాసాదాలకు కాపలా కాసేవారు. గణులు దేవతల అంగరక్షకులు. గంధర్వులు ఆటలతో, పాటలతో దేవతల మనసులు రంజింపజేసేవారు. కిన్నెరలు కూడా దైవసేవ చేసేవారు. నేటికీ కిన్నెర సంతతి వారు హిమాచలప్రదేశ్‌లో నివసిస్తున్నారు.

"అసుర" అనే పదాన్నే తీసుకుందాం. రామాయణ మహాభారతాల్లో యిచ్చిన వర్ణనలు బట్టి అసురులు మానవ జాతికి చెందినవారు కారనిపిస్తుంది. ఒక అసురుడు పది బళ్ల ఆహారాన్ని తినేస్తాడు. వారిది భయంకరమైన రూపం. ఇక నిద్రపోతే, ఆరు నెలలకి గాని లేవడు. పది నోర్లుంటాయి. రాక్షసుడెవరు? అతను కూడా మానవ సంతతి వాడు కాడనట్టు చిత్రీకరించారు. ఆకారంలో, ఆహారం తీసుకొనే సామర్థ్యంలో, తదితర అలవాట్లను బట్టి

కూడా అతను అసురుల కోవకు చెందుతాడు.

నాగులను గురించి కూడా ఎన్నో ఉదాహరణలు యివ్వబడ్డాయి. ఇంతకీ నాగా అంటే ఎవరు? నాగా అంటే సర్పానికి గానీ, పాముకి గానీ ప్రాతినిధ్యం వహించేవాడు. ఇది వాస్తవమా? ఔనో, కాదోగాని అలానే చెప్పారు. 'నిజమే కాబోలు' అని హిందువులు నమ్మారు. అందువల్ల ప్రాచీన భారతదేశ చరిత్రను తవ్వి వెలికి తీయక తప్పదు. అలా చేయకపోతే ప్రాచీన భారతానికి అసలు చరిత్రే మిగలదు. బ్రాహ్మణ రచయితలు వీరావేశంతో గుట్టగా పోసి వుంచిన చరిత్ర శిధిలాల నుంచి బౌద్ధ వాఙ్మయ సహాయంతో ఈ చరిత్రను వెలికి తీయవచ్చును.

ఆ శిధిలాలను తొలగించి, వాటి క్రింద అణగిపడి వున్న పదార్థాన్ని చాలా స్పష్టంగా, సలక్షణంగా చూడడానికి బౌద్ధ సాహిత్యం చాలావరకు సాయపడుతుంది.

చాలామంది దేవతలు బుద్ధుని వద్దకు వెళ్ళి, తమ అనుమానాలను నివృత్తి చెయ్యమనీ, తమని కష్టాల నుంచి గట్టెక్కించమని ఆయనను వేడుకుంటారు. దేవతలు మానవమాత్రులు కాకపోతే, ఇదంతా ఎలా సాధ్యపడుతుంది.?

చిక్కుముడి లాంటి నాగాల సమస్యపై బౌద్ధమత వాఙ్మయం విస్తృతంగా వెలుగుని ప్రసరిస్తుంది. యోనిజులైన నాగులకూ, గుడ్డు నుంచి జన్మించిన నాగులకూ మధ్య గల తేడాను గుర్తింపజేయడం ద్వారా బౌద్ధ వాఙ్మయం స్పష్టం చేస్తోంది. మౌలికంగా మానవ సమాజానికి చెందిన వారన్న అర్థంలో నిలుస్తుంది.

అసురులు భయంకర స్వరూపం గలవారు కారు. వారు కూడా 'జన విశేష' మానవమాత్రులే. అసురులు, సృష్టికర్త ప్రజాపతి సంతతికి చెందిన వారని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. అలాంటి వారు దుష్టశక్తులుగా ఎలా మార్పు చెందారో మనకు తెలియదు. ధరిత్రిపై పట్టు సాధించడం కోసం అసురులు దేవతలతో యుద్ధానికి తలపడ్డారనీ, ఆ యుద్ధంలో సురులు విజయులై అసురులు ప్రాణాలు కోల్పోయారనే వాస్తవం రికార్డు చేయబడుతుంది. అందువల్ల అసురులు దైత్యాకారులు కారని, మానవులేనని స్పష్టమవుతోంది.

ఈ విధంగా చరిత్ర శిథిలాలను తొలగించి చూడడం వల్ల, ప్రాచీన భారతదేశ చరిత్రను మనం సరికొత్త వెలుగులో దర్శించగలం.

అనువాదం: నిర్మలానంద

# అధ్యాయం - 6

# ప్రాచీనయుగం-ఆర్యుల సమాజ స్థితిగతులు

[11 టైపు చేసిన పూర్తి పేజీలకి ఓ టాగ్ తగిలించి, ఫైలులో గుత్తనం గుచ్చి వుందీ వ్యాసం. చివర రాసిన వాక్యాన్ని బట్టి ఈ అధ్యాయం సంపూర్ణం కాదని అర్ధమవుతోంది. -సంపాదకులు]

బౌద్ధమతం ఒక విప్లవం. ఫ్రెంచి విప్లవమంతటి మహత్తరమైనది. మత విప్లవంగా ప్రారంభమయినా, ఆ స్థాయిని అధిగమించి, సాంఘిక, రాజకీయ విప్లవంగా అది అభివృద్ధి చెందినది. స్వభావరీత్యా ఈ విప్లవం ఎంత లోతైనదో, ఎంత గంభీరమయినదో తెలుసుకోవాలంటే, విప్లవానికి పూర్వం నెలకొని వున్న సాంఘిక పరిస్థితులను తెలుసుకోవడం అవసరం. ఫ్రెంచి విప్లవ పరిభాషలో చెప్పాలంటే-భారతదేశంలో ప్రాచీన పరిపాలనా వ్యవస్థ చిత్రాన్ని కరతలామలకం చేసుకోవాలి.

తన ప్రబోధాల ద్వారా బుద్ధుడు ఆనాటి సమాజంలో తెచ్చిన మహత్తర సంస్కరణ ఎలాంటిదో అర్థం కావాలంటే, ముందుగా బుద్ధుడు తన జీవిత లక్ష్యాన్ని ప్రారంభించిన నాటి ఆర్య నాగరికత ఎంత పతనావస్థలో వుందో తెలుసుకోవడం చాలా అవసరం.

బుద్ధుని కాలంలో ఆర్యుల సమాజం సాంఘిక, మత, ఆధ్యాత్మిక జారత్వంలో తలమునకలై వుంది.

ఆనాడు నెలకొని వున్న సాంఘిక దురాచారాలలో జూదం గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి. తాగుడుకి మల్లెనే జూదం కూడా ఆర్యుల్లోకి విస్తృతంగా వ్యాపించి వుంది.

ప్రతి రాజ్యంలోను రాజ ప్రసాదానికి అనుకొని ఒక జూద గృహం కూడా వుండేది. తనతో ఆడటానికి ప్రతిరోజు ఒక గజ జూదగాణ్ణి రాజు తన కొలువులో నియమించేవాడు. విరాటరాజు కొలువులో జూద నిపుణునిగా కంకుభట్టు వుండేవాడు. రాజులకు జూదం కేవలం వినోదం కోసం కాదు. ఎక్కువ మొత్తాలను పందెంగా కాసేవారు. తమ రాజ్యాలనూ, ఆశ్రితులనూ, బంధువులనూ, బానిసలనూ, సేవకులనూ[1] సయితం పణంగా పెట్టేవారు. నల మహారాజు పుష్కరునితో ఆడిన జూదంలో-తననీ, తన భార్య దమయంతినీ మినహాయించి-మిగతా సర్వస్వమూ ఒడ్డి, ఓడిపోయాడు. చివరకి నలుడు భార్యతో అడవికేగి, బిచ్చమెత్తుకొని

బతికాడు. కొందరు రాజులు జూదం ఆడటంలో నలుణ్ణీ తలదన్నేశారు.[2] పాండవ ప్రథముడు ధర్మరాజు కౌరవులతో జూదం ఆడి, అందులో తమ సర్వస్వాన్నీ–తమ్ముళ్లనీ, తననీ, తమ భార్య ద్రౌపదినీ పణంగా పెట్టిన విషయం మహాభారతం చెబుతోంది. జూదం ఆడటాన్ని ఆర్యులు గౌరవసూచకమైనదిగా భావించేవారు. ఎవరి నుంచైనా జూదానికి ఆహ్వానం వస్తే దాన్ని తమ గౌరవానికీ, హోదాకీ ఒక సవాలుగా తీసుకొనేవారు. ముందుగానే ఎంత హెచ్చరించినప్పటికీ, ధర్మరాజు జూదంలో అతి ఘోరమైన పరిస్థితుల్ని ఎదుర్కొన్నాడు. దీనికి ఆయన చెప్పిన సాకు ఏమిటంటే–జూదం ఆడటానికి రమ్మని తనకి ఆహ్వానం వచ్చిందనీ, గౌరవ వ్యక్తిగా తాను ఆ ఆహ్వానాన్ని నిరాకరించలేకపోయాననీ.

జూదమనే యీ వ్యసనం ఒక్క రాజులకే పరిమితం కాకుండా, సామాన్యుల్లోకి సయితం అంటువ్యాధిలా వ్యాపించిపోయింది. ఒక నిరుపేద ఆర్యుడు జూదంలో ఎలా సర్వనాశనమయిందీ ఋగ్వేదం వివరంగా వర్ణిస్తుంది. కౌటిల్యుని కాలంలో జూదం బాగా ప్రాచుర్యం పొందిన ఒక అలవాటు. రాజు నుంచి లైసెన్సు పొంది నెలకొల్పబడిన జూదగృహాల నుంచి ఖజానాకి సాలీనా పెద్ద మొత్తంలో ఆదాయం లభిస్తుండేది.

తాగుడు మరొక దురాచారం. ఆర్యుల్లో ఈ వ్యామోహం మోతాదుని మించి వుండేది. మద్యం రెండు రకాలు సోమ, సుర. సోమరసం యజ్ఞకాలంలో సేవించేది. ఆదిలో బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ, వైశ్యులకు మాత్రమే సోమపానం అనుమతింపబడింది. కాలక్రమంలో బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ పరిమితం చేయబడింది. వైశ్యులు ఈ అనుమతి నుంచి తప్పించబడ్డారు. శూద్రులు అసలు రుచి చూసే ప్రసక్తే లేదు. ఈ రసం ఎలా తయారు చేస్తారో అన్నది ఒక రహస్యం. ఆ రహస్యం బ్రాహ్మణులకే తెలుసుండేది. సుర అందరి కోసమూ. అన్నివర్గాల వారూ దాన్ని తాగేవారు. బ్రాహ్మణులు సయితం మినహాయింపు కాదు. అసురుల పురోహితుడు–శుక్రాచార్యుడు ఒకసారి సురని చిత్తుగా తాగేశాడు. దేవతలు చంపిన అసురులను బతికించడానికి ఉద్దేశించబడిన మృత సంజీవనీ అనే మంత్రాన్ని ఆ తాగిన మైకంలో శుక్రాచార్యుడు కచునికి ఉపదేశించాడు. కచుడు దేవ పురోహితుడు బృహస్పతి కొడుకు. ఒక సందర్భంలో కృష్ణుడూ, అర్జునుడూ చిత్తుగా సుర సేవించారని మహాభారతం చెబుతోంది. పై ఉదాహరణలను బట్టి, ఆర్యోత్తములు సయితం ఈ తాగుడు వ్యసనానికి అతీతులు కారనీ, వారు తాగడం మొదలుపెడితే, పీకల దాకా తాగేస్తారనీ మనకి అర్థమవుతోంది. అన్నిటికన్నా సిగ్గుతో తలవంచుకోవలసిన విషయమేమిటంటే–ఆర్య స్త్రీలు కూడా ఈ తాగుడు వ్యసనానికి బాగా అలవాటు పడిపోవడం. ఒక ఉదాహరణ యిస్తాను. విరాట రాజు భార్య సుధేష్ణ[3] తన పరిచారిక సైరంధ్రితో యిలా అంటుంది–"కాళ్ళూ చేతులూ తెగ పీక్కుపోతున్నాయి. నువ్వు తమ్ముడు కీచకుని రాజ ప్రసాదానికి వెళ్ళి తొందరగా సురని తీసుకురా" అంటూ ...రమాయిస్తుంది. ఈ దురలవాటు రాణులకే పరిమితం కాదు. అన్ని వర్గాల స్త్రీలలోనూ ...ధారణమైన అలవాటయిపోయింది. బ్రాహ్మణ స్త్రీలు సయితం యిందుకు మినహాయింపు ...దు. మద్యం అన్నా, నృత్యం అన్నా ఆర్య స్త్రీలకెంత ఆపేక్షో కౌశీతకి గృహ్యసూత్రం (I-11-12) ...యిలా చెబుతుంది: "వివాహాల నాటి ముందురోజు రాత్రి వైధవ్యం ప్రాప్తించని స్త్రీలు బాగా

మద్యం సేవించి, సుష్టిగా విందు ఆరగించి–నలుగురు గానీ, ఎనమందుగురు గానీ నాలుగు పర్యాయాలు నృత్యం చేయాలి."

ఆర్యావర్తంలోని మధ్య ప్రాంతంలో క్రీ. శ. ఏడు, ఎనిమిది శతాబ్దాల పర్యంతం మత్తెక్కించే మద్యాన్ని పానంచేసి, నిమ్నవర్గాల స్త్రీలే కాకుండా, బ్రాహ్మణ స్త్రీలు కూడా బాగా వ్యసనానికి లోనవుతుండేవారన్న విషయాన్ని కుమారిల భట్టు వ్రాసిన "తంత్ర వార్తికం" [I (iii), 4] యిలా తెలియజేస్తోంది. "ఆధునిక కాల వ్యక్తుల్లో అహిచ్ఛత్ర, మధుర దేశాల బ్రాహ్మణ స్త్రీలు తాగుడు వ్యసనానికి బానిసలు కావడం మేం గమనించాం." పండ్ల నుంచి గాని, పూల నుంచి గాని (మాధవి) మురిగిన బెల్లం నుంచిగాని (గౌడి)–ధాన్యం (సుర) నుంచిగాని–తయారు చేసిన సురను బ్రాహ్మణులు సేవించడాన్ని కుమారిలుడు ఖండించాడు. ఆయన క్షత్రియ, వైశ్య స్త్రీ పురుషుల విషయం పట్టించుకోలేదు.

నేటి ఆర్య సంతతి వారసులు, ఆనాటి ఆర్యుల సమాజంలో నెలకొని వున్న నీతి బాహ్యమయిన లైంగిక అనాచారాలను గురించి తెలుసుకొని దిగ్భ్రమ చెంది వుంటారు. బుద్ధుని కాలానికి ముందునాటి ఆర్యులలో–నేడు మనకి మల్లెనే లైంగిక వాంఛల్నీ, వైవాహిక సంబంధాలను నియంత్రించే నైతిక సూత్రాలు వుండేవి కావు.

"ఆర్యుల పౌరాణిక కథల ప్రకారం బ్రహ్మ సృష్టికర్త. ఆయనకు ముగ్గురు కొడుకులూ, ఒక కుమార్తె. వారిలో ఒక కొడుకు పేరు దక్షుడు. తన చెల్లెలినే అతను వివాహం చేసుకున్నాడు. వారిద్దరికీ ఆడ సంతతి కలిగింది. వారిలో కొందర్ని దక్షుడు బ్రహ్మకుమారుడైన మరీచి కొడుకు కాశ్యపునికీ, మరికొందరు కన్యల్ని బ్రహ్మ మూడో కొడుకు ధర్మునికీ యిచ్చి పెళ్లి చేశాడు."[4]

ఋగ్వేదంలో అన్నాచెల్లెళ్ళకి సంబంధించిన ఒక ఉపాఖ్యానం వుంది. అన్న పేరు యమ, చెల్లెలు యమి. యమి, యముని తన శరీర వాంఛ తీర్చమని అడుగుతుంది. అందుకు యముడు నిరాకరిస్తాడు. యమి మండిపడుతుంది.[5]

తండ్రే కూతుర్ని చేసుకునే ఆచారం వుంది. ఈడొచ్చిన తన కూతురు సుత్రుపని, తండ్రి వశిష్టుడు వివాహం చేసుకుంటాడు[6]. మనువు కూతురు 'ఇలనూ'[7], జహ్ను తన కూతురు 'జహ్నవి'[8]ని, సూర్యుడు తన కూతురు 'ఉష'[9]ని వివాహం చేసుకుంటారు.

ఆర్యుల్లో బహు భర్తృత్వం వుండేది. అదీ సాధారణమైనది కాదు. దగ్గర రక్త సంబంధీకులే ఒకే స్త్రీతో సంగమించే అలవాటు వుంది. దహ్రప్రచేతని, అతని కుమారుడు సోముడూ, ఇరువురూ సోముని కుమార్తె మరీషతో శరీర వాంఛ తీర్చుకుంటారు.[10]

మనుమరాలిని తాత కళ్యాణం చేసుకునే సందర్భాలు కూడా కద్దు. తండ్రి బ్రహ్మకి[11] దక్షుడు తన కుమార్తెనిచ్చి వివాహం జరిపించాడు. వారికి పుట్టిన వాడే నారదుడు. దౌహిత్రుడు తన 27 మంది కుమార్తెలనూ తండ్రి సోమునికి సమాగమం ప్రజననం కోసం కట్టబెట్టాడు.[12]

నలుగురు చూస్తుండగానే, ఆరుబయట ఆర్యులు స్త్రీలతో సమాగమం చేయడానికి వెనకాడేవారు కారు. ఋషులు చేసే మతపరమయిన కొన్ని కర్మకాండలను 'వందేవ్యవ్రతా'లు అంటారు. ఈ కర్మకాండలను యజ్ఞభూమిలోనే నిర్వర్తిస్తూ ఉండాలి. ఎవరైనా స్త్రీ యజ్ఞవేదిక దగ్గరకు వచ్చి, తన లైంగిక కోర్కె తీర్చమని ఋషిని కోరితే, ఆయన అదే సమయంలో, అదేచోట ఆరుబయట ఆమె కోర్కెను తీర్చేవాడు. ఇలాంటి సంఘటనలెన్నో చూపించవచ్చు. ఋషి పరాశరుడు, సత్యవతితో జరిపిన తంతు అదే. అలాగే దీర్ఘతాప విషయం కూడా. ఇలాంటి ఆచారం వుందని చెప్పడానికి 'అయోని' అనే పదాన్నే వుదాహరణగా చూపించవచ్చు. 'అయోని' అనే పదానికి 'పాపం కాని గర్భధారణ' అనే అర్థం వున్నట్టు చెప్పబడుతోంది. నిజానికి ఆ పదానికి అసలు అర్థం వేరు. అదేమిటంటే-యోని అంటే ఇల్లు అని అర్థం. అలాగే అయోనిజ అంటే ఇంటి వెలుపల గర్భంలో పడింది అని అర్థం. అంటే ఆరుబయట జీవం పోసుకున్నదని. ఈ పని తప్పేమీ కాదని చెప్పడానికి సీత, ద్రౌపది-ఇద్దరూ అయోనిజలు అనే వాస్తవాన్ని మనం ఇక్కడ గుర్తు చేసుకోవాలి. ఇవి (ఆరుబయట సంగమాలు) ఎంత సర్వసాధారణమయినవో తెలియజెప్పడానికి మతపరమయిన ఆదేశాలు జారీ చేయక తప్పని పరిస్థితి ఎదురు కావడం మనం గమనిస్తాం.[13]

తమ స్త్రీలను కొంతకాలంపాటు యితరులకు అద్దెకిచ్చుకోవడం ఆర్యుల్లో వాడుకలో వుండేది. మాధవి కథ ఇందుకొక ఉదాహరణ.[14] యయాతిరాజు తన కూతురు మాధవిని గురువు గాలవునికి సమర్పిస్తాడు. గాలవుడు మాధవిని ముగ్గురు వేర్వేరు రాజులకు నిర్ణీత కాలంపాటు అద్దెకిస్తాడు. ఆ కాల వ్యవధి ముగిశాక, గాలవుడు తిరిగి ఆమెను విశ్వామిత్రుని కిచ్చి వివాహం చేస్తాడు. విశ్వామిత్రుని ద్వారా ఒక కొడుకు పుట్టేదాకా మాధవి అతని వద్దనే వుంటుంది. ఆతర్వాత గాలవుడు ఆమెను, యయాతికి తిరిగి యిచ్చివేస్తాడు.

ఈ విధంగా ఆర్యుల్లో తమ స్త్రీలను తాత్కాలికంగా మరొకరికి అద్దెకిచ్చే ఆచారంతో పాటుగానే, మరొక ఆచారం కూడా వుంది. అది-సంతానోత్పత్తి కోసం కూడా శ్రేష్ఠులయిన ఆర్యులకు తమ స్త్రీలను యివ్వడం. కుటుంబాన్ని వృద్ధి చేయడమంటే-ఆర్యుల దృష్టిలో పిల్లల్ని కని, వంశాన్ని ఉద్ధరించడం. ఆర్యుల్లో ఒక ప్రత్యేక వర్గం దేవతలు. వారు సయితం ఆర్యులే. అయితే వారు శ్రేష్ఠమయిన హోదా కలిగిన పరాక్రమవంతులు. ఉత్తమ సంతానం పొందడం కోసం ఆర్యులు తమ భార్యలను దేవవర్గానికి చెందిన ఎవరితోనైనా లైంగిక సంబంధం పెట్టుకోవడాన్ని ప్రోత్సహించేవారు. ఈ ఆచారం ఎంత విస్తృతంగా సాగుతుండేదంటే-ఆర్య స్త్రీలను ఉమ్మడిగా పొందడం దేవతలు తమ స్వతస్సిద్ధమైన హక్కుగా భావించసాగారు. తాము దేవతలకు అర్ఘ్యంగా సమర్పించడం మంచి విముక్తి పొందే పర్యంతం ఆర్య స్త్రీలకు వివాహాలు

జరిగేవి కావు. ఆ ప్రక్రియని అవధానం అనేవారు. ప్రతి హిందూ వివాహంలోనూ 'లజ హూమం' చేస్తూ వుంటారు. అశ్వలాయనుని గృహ్యసూత్రాల్లో దీని గురించి చాలా వివరంగా చెప్పబడింది. ఇది దేవతలు లైంగిక పట్టు నుంచీ, హక్కు నుంచీ ఆర్య స్త్రీలు విముక్తి పొంద డానికి సంబంధించిన చర్య యొక్క అవశేషం. లజహోమంలో చేసే అవధానం మరేమీ కాదు. వధువుపై దేవతల హక్కుకి తాజాగా వెలకట్టి దాన్ని దేవతలకి సమర్పించుకోవడం. హిందూ వివాహాల్లో నిర్వర్తించే 'సప్తపది'ని ప్రధానమయిన కర్మకాండగా గుర్తిస్తారు. ఇది చెయ్యకుండా ఆ వివాహం న్యాయసమ్మతమైనదని అనిపించుకోదు. కారణం ఈ ప్రక్రియ ద్వారా ఆర్య స్త్రీలపై దేవతలకి వున్న లైంగిక హక్కుని పరిసమాప్తి చేయడం. సప్తపది అంటే వధువుతో కలిసి వరుడు ఏడడుగులు వేయడం. ఇంతకీ వివాహంలో దీని అవసరం ఏమొచ్చింది? వివాహంలో తమకి సమర్పించే నష్టపరిహారం వల్ల ఒకవేళ తాము సంతృప్తి చెందకపోతే, వధూవరులు ఏడో అడుగు వేసేలోగానే దేవతలు ఆమెపై హక్కుని పునరుద్ధరించుకోవచ్చు. ఇది దీని అంతరార్థం. ఏడో అడుగు వేసేసిన తర్వాత, ఆమెపై గల దేవతల హక్కు పరిసమాప్తమవుతుంది. అంతట వరుడు వధువుని తనతో తీసుకొనివెళ్లి భార్యాభర్తలుగా చక్కగా కాపురం చేసుకుంటారు. ఆతర్వాత దేవతలు ఆ కాపురంలో విఘాతం కల్గించడం గానీ, ఆ భార్యపై అత్యాచారం జరపడం గానీ చేయరు.

పవిత్రత, సచ్ఛీలత అనేవి కన్యలకి వుండాలనే నియమం లేదు. ఎలాంటి వివాహ బంధమూ లేకుండా కూడా కన్య ఎవరితోనైనా శరీర సంబంధం పెట్టుకోవచ్చు. పిల్లల్ని కనవచ్చు. దీనికి ఆధారం కన్య అనే పదమే. దాని మూలార్థం బాలిక అని. 'కామ్' అనే మూలపదం నుంచి కన్య అనే పదం వచ్చింది. కన్య అంటే యథేచ్ఛగా ఏ మగాడికైనా తనను తాను సమర్పించుకునేది అని అర్థం. క్రమబద్ధమైన ఏ వివాహమూ లేకుండా తమని తాము ఏ పురుషునికైనా అర్పించుకొని, పిల్లల్ని కనవచ్చును. కుంతి, మత్స్యగంధుల గాథలు ఇందుకు ఉదాహరణలుగా చెప్పకోవచ్చును. పాండురాజుతో వివాహానికి ముందే కుంతికి వివిధ పురుషుల నుంచి సంతానం కలిగింది. మత్స్యగంధి, భీష్ముని తండ్రి శంతనునితో పెళ్ళికాక ముందే పరాశరునితో శరీర సంబంధం పెట్టుకుంది.

ఆర్యుల్లో పశుప్రవృత్తి ప్రబలంగానే వుండేది. దాముడనే ఋషి ఆడలేడితో శరీర సుఖం అనుభవించడం కథగా ప్రసిద్ధం. సూర్యుడు ఆడ గుర్రంతో మదనకేళి జరపడమూ మనకి తెలిసినదే. అన్నిటికన్నా నికృష్టమైనది అశ్వమేధయాగంలో పట్టపురాణితో మగ గుర్రం చేసే లైంగిక క్రియ.

(అసంపూర్ణం)

అనువాదం – నిర్మలానంద

:అథస్సూచికలు:

1. మహాభారతం-అరణ్యపర్వం.

2. మహాభారతం-సభాపర్వం.

3. మహాభారతం-అరణ్యపర్వం 15వ అధ్యాయం.

4. మహాభారతం-ఆదిపర్వం. ఆది. 66

5. ఋగ్వేదం.

6. హరివంశం. అధ్యా... II

7. అదే, అధ్యా... X

8. అదే, అధ్యా... XXVII

9. యాస్కుని నిరుక్తము-అధ్యా... V, ఖండం VI

10. హరివంశం, అధ్యా... II

11. అదే. అధ్యా... III

12. అదే.

13. మహాభారతం, ఆదిపర్వం అధ్యా... 193

14. అదే, ఉద్యోగపర్వం అధ్యాయం 106-123

# అధ్యాయం – 7

# పౌరోహిత్య పతనం

['ప్రాచీన యుగం–పరిపాలన' అనే ఫైలులో మూడవ అధ్యాయంగా నమోదు అయిన ఈ వ్యాసం టైపు చేసిన 16 ఫుల్‌స్కేప్ పేజీల్లో వుంది. ఈ అధ్యాయం కూడా అసంపూర్తిగా కనిపిస్తోంది. –సంపాదకులు]

ప్రాచీనాచార్యుల సమాజంలో బ్రాహ్మణులు పౌరోహిత్య వృత్తిని గుత్తాధిపత్యం చేసుకున్నారు. బ్రాహ్మణుడు తప్ప మరొకరెవరూ పురోహితుడు కావడానికి అర్హుడు కాడు. మతరక్షకులైన బ్రాహ్మణులు నైతిక, ధార్మిక విషయాల్లో ప్రజలకు దారి చూపేవారు. తమ ప్రవర్తన ద్వారా వారు ప్రజలకు ఉన్నత ప్రమాణాలు సృష్టించాల్సి వుంది. అయితే వాస్తవానికి ఆ ప్రమాణాలకి అనుగుణంగా బ్రాహ్మణులు జీవించారా? దురదృష్టవశాత్తూ మనకి లభించిన ఆధారాలన్నీ కూడా నైతిక పతనంలో బ్రాహ్మణులు పరాకాష్టకు చేరుకున్నట్టు నిరూపిస్తున్నాయి.

ఒక శ్రోత్రియ బ్రాహ్మణుడు వారానికి సరిపడా సంభారాలూ, ఆహార సామాగ్రికన్నా ఎక్కువ తన దగ్గర నిలువ వుంచుకోరాదనేది ఒక నియమం. కాని ఒక పథకం ప్రకారం ఈ నియమాన్ని ఉల్లంఘిస్తూ వస్తూ ఇబ్బడిముబ్బడిగా సరుకులనూ, సంభారాలనూ–అనగా తినుబండారాలనూ, మద్యాలనూ, వస్త్రాలనూ, వంట పాత్రలనూ, పరుచుకొనే పక్కలనూ, సుగంధ ద్రవ్యాలనూ మొదలైన వాటిని నిలువ చేసుకొని, ఉపయోగించే దురలవాటు శ్రోత్రియ బ్రాహ్మణులకు వుండేది.

(1) వేశ్యా నృత్యాలు (నక్కమ్)

(2) పాటలు పాడడం (గీతమ్)

(3) వాద్య సంగీతం (వాదితమ్)

(4) తిరునాళ్ళలో వినోద ప్రదర్శన (పెఖ్కమ్)

(5) వీరగాథల గానం (అక్ఖనమ్)

(6) చేతి సంగీతం (పాణిసరమ్)

(7) కావ్యగానం (వేతల్స్)

(8) టముకు కొట్టడం (కుంభతూనమ్)

(9) తిరణాల వేషాలు (శోభనగర్కమ్)

(10) కాండలవాళ్ల విన్యాస ప్రదర్శన (కండల–వంశ–ధోపనమ్)

(11) ఏనుగుల, ఎద్దుల, మేకల పొట్టేళ్ళ, పుంజుల, కోలంకి పిట్టల పందాలు.

(12) బాణాకర్రలూ, ముష్టి, మల్ల యుద్ధాల పోటీలు.

(13–16) ఉత్తుత్తి పోరాటాలు, హాజరు పట్టీలూ, సైనిక విన్యాసాలూ, సమీక్షలూ.

బ్రాహ్మణులు క్రీడలూ, వినోద ప్రదర్శనలూ చూడ్డానికి బాగా అలవాటు పడిపోయారు. అవేమిటంటే:

(1) బోర్డుల మీద ఎనిమిదిగాని, పదిగాని చతురస్రాకారపు వరుసల్లో క్రీడలు.

(2) అవే క్రీడలను గాలిలో బోర్డులున్నట్టుగా వూహించుకొని ఆడేది.

(3) నేల మీద గీసిన గుండ్రని చక్రాల మీద నుంచి ముందుకి సాగిపోవడం–ఒక్కొక్క అడుగే జరుపుకుంటూ ముందుకు నడవడం.

(4) ఒక పోగు నుంచి గాని లేక గుంపు నుంచి గాని ఒక్కొక్క వస్తువునో, మనిషినో గోటితో వేరు చేయడం, తిరిగి యథాస్థానంలో చేర్చడం. ఈ పనిని పోగుని/గుంపుని కదపకుండానే చేయాలి. అలా కదిపితే ఆట ఓడినట్టే లెక్క.

(5) పాచికల ఆట.

(6) పెద్ద కర్రతో చిన్న కర్రని కొట్టడం (గోటీ బిళ్ళ)

(7) చాచిన వేళ్లని లక్కలోగాని, ఎరుపు అద్దకం రంగులో గాని, పిండి కలిపిన నీళ్ళలో గాని ముంచుతూ, చేతిని నేలమీద, లేదా గోడమీద చరుస్తూ, 'ఇదేమి అవుతుంది?' అంటూ కేకలు వేస్తూ, కావలసిన ఏనుగులూ, గుర్రాలూ మొదలయిన వాటి ఆకారాలను చూపించడం.

(8) బంతుల ఆటలు.

(9) ఆకులతో చేసిన బొమ్మ పిల్లన గ్రోవిని ఊదడం.

(10) బొమ్మనాగళ్లతో భూమిని దున్నడం.

(11) గాలిలోకి ఎగిరి పిల్లిమొగ్గలు వేయడం.

(12) తాటి ఆకులతో రూపొందించిన బొమ్మ గాలి యంత్రాలతో ఆడుకోవడం.

(13) కమ్మ రేకులతో చేసిన కొలపాత్రలతో వినోదించడం.

(14–15) బుల్లి, బుల్లి బళ్ళతో, విల్లులతో ఆడుకోవడం.

(16) గాలిలోగాని, నేస్తగాని వీపు మీదగాని వేలితో రాసే పదాలను చటుక్కున పోల్చుకోవడం.

(17) స్నేహితుడి మనసుల్లో మదిలో ఆలోచనలేమిటో ఇట్టే పసికట్టెయ్యడం.

(18) అంగ విహీనులను అనుకరిస్తూ ధ్వన్యనుకరణం చేయడం.

బ్రాహ్మణులు ఎత్తయిన, పొడవైన మంచాల మీద పడుకోవడానికి అలవాటు పడిపోయారు. అవి:

(1) అటూ ఇటూ కదిలించడానికి అనువయిన మంచాలు–ఎత్తయినవీ, ఆరడుగులు పొడవు గలవీను. (అసంది)

(2) ఆనుకొనే పక్కల మీద జంతువుల బొమ్మ చెక్కడాలతో ఆసనాలు (పల్లంకొ)

(3) పొడుగుపాటి గొర్రె బొచ్చు మీద మేక వెంట్రుకలతో దిండ్లు (గొనకొ)

(4) వివిధ రంగుల గుడ్డలు అతికించి పగటిపూట మంచాలమీద పరచే దుప్పట్లు (కిత్తక)

(5) తెల్ల దుప్పట్లు (పటిక)

(6) పువ్వులు ఎంబ్రాయిడరీ చేసిన పలంగు పోషులు (పాటలిక)

(7) కాటన్ పూలుతో నింపిన జమిలి దుప్పట్లు (తూలిక)

(8) పులులు, సింహాలు మొదలయిన బొమ్మలు ఎంబ్రాయిడరీ చేసిన పలంగుపోషులు (వికటిక)

(9) రెండువైపులా మృదువైన బొచ్చుతోగల చర్మం (ఫర్) అమర్చిన రగ్గులు (ఉద్దాలొం)

(10) ఒకేవైపు మృదువైన బొచ్చు చర్మంతో (ఫర్) అమర్చిన రగ్గులు (ఏకాంతలోమి)

(11) రత్నాలు ఎంబ్రాయిడరీ చేసిన పలంగుపోషులు (కర్తిస్సమ్)

(12) సిల్కు పలంగు పోషులు (కోసెయ్యమ్)

(13) పదహారుగురు నర్తకులు నృత్యం చేయడానికి అనువుగా పెద్దపెద్ద రత్న కంబళులు (కుట్టకమ్)

(14–16) ఏనుగుల, గుర్రాల, రథాల రగ్గులు.

(17) జింక చర్మాలు కట్టిన రగ్గులు (అగినపావేని)

(18) సాదా జింక చర్మాల రగ్గులు.

(19) పై ఆచ్ఛాదనాలు గల రత్న కంబళులు (సొత్తరక్కడమ్)

(20) కాళ్ళూ, తలా ఆనించే దగ్గర ఎర్రగుడ్డ తలగడలతో సోఫాలు.

బ్రాహ్మణులు అందంగా అలంకరించుకోవడానికి అలవాటు పడిపోయారు. అదెలా అంటే–

సుగంధపు పొడులను ఒంటికి పూసుకొని, ఒళ్ళంతా రుద్ది స్నానం చేయడం. మల్లయోధునికి మల్లేనే శరీర అవయవాలను దుడ్డు కర్రలతో మోదుకొనడం. అద్దాలూ, అంజనాలూ, గులాబీ పొడి, పరిమళ ద్రవ్యాలూ, కంకణాలూ, నెక్లెసులూ, చేతి కర్రలూ, ఔషధాలు నిలువ చేసుకొనేందుకు వేరుగా గొట్టాల ఆకారాల్లో డబ్బాలూ, పొడుగుపాటి సన్నని కత్తులూ, ఎండ పొడ తగలకుండా టోపీలూ, బుటాలు కుట్టిన కాలి చెప్పులూ, తలపాగాలూ, తలకు మాలలూ,

అడవి ఎద్దు తోకలతో చేసిన వింజామరలూ, జాలరులు అమర్చిన పొడుగుపాటి ధవళ వస్త్రాలూ.

బ్రాహ్మణులు చౌకబారు సంభాషణలకి అలవాటు పడిపోయారనడానికి ఈ క్రింది ఉదాహరణలు చాలు.

రాజుల, దొంగల, మంత్రుల కథలూ, యుద్ధాల, బీభత్సాల, పోరాటాల కథలూ, తిండి, మందులూ, వస్త్రాలూ, పక్కలూ, పోరాటాలు, సుగంధ ద్రవ్యాలు గురించిన చర్చలూ, సంబంధాలూ, వాహనాలూ, గ్రామాలూ పట్టణాలూ, నగరాలూ, దేశాల గురించి, స్త్రీలను గురించి, వీరులను గురించి, వీధి మొగని లేక నీళ్లాటి రేవు దగ్గర నిలబడి చెప్పే పోచికోలు కబుర్లూ, దెయ్యాల కథలూ, కుచ్చుటప్పాలు కొట్టడం, సముద్రం, నేలల సృష్టి గురించి గాలి పోగుచేసి మాట్లాడడం, దేవుడు ఉన్నదీ, లేనిదీ చర్చ-అస్తినాస్తి విచికిత్స చేయడం.

బ్రాహ్మణులు వాగ్వివాదానికి దారితీసే పదజాలం అలవాటు చేసుకున్నారు:

"నాకు మల్లేనే నువ్వు ఈ సిద్ధాంతాన్నీ, క్రమశిక్షణనీ అర్థం చేసుకోవు."
"ఈ సిద్ధాంతాలూ, క్రమశిక్షణా నీకెలా అర్థమవుతాయి?"
"నీవన్నీ తప్పుడు అభిప్రాయాలే. నేను మాత్రం సరైన త్రోవలో వున్నాను."
"నేను విషయాన్ని సూటిగా చెబుతాను. నువ్వలా చెప్పలేవు."
"నీవు వెనకది ముందూ, ముందుది వెనకా చేస్తూ వుంటావు."
"ఇన్నాళ్లుగా నీవు ఆలోచిస్తున్నదంతా తల్లక్రిందులయ్యింది."
"నీవు విసిరిన సవాలుని అందుకున్నాం."
"నీవు చేసింది తప్పని తేలిపోయింది."
"నీ అభిప్రాయాలను తేటతెల్లం చేసుకోవడానికి పని ప్రారంభించు."
"వీలయితే దూరంగా వుండు."

"బ్రాహ్మణులు సందేశవాహకులుగా కార్యార్థమై చిన్నచిన్న ప్రయాణాలు చేయడానికీ, మధ్యవర్తిత్వం నెరపడానికీ అక్కడకెళ్ళు. ఇక్కడకిరా. ఇది నీతో తీసుకెళ్ళు. అక్కణ్ణించి దాన్ని తీసుకెళ్ళు" అంటూ యువకులతో పరాచికాలు ఆడడానికీ, రాజులపై, మంత్రులపై, క్షత్రియులపై, బ్రాహ్మణులపై వేళాకోళం ఆడడానికీ అలవాటు పడిపోయారు.

'బ్రాహ్మణులు, మోసగాళ్లూ, సోమరిపోతుల్లా, డబ్బుకి మంత్రాలు చదివేవారు, పవిత్రమయిన మాటలతో ప్రార్థన చేసేవారు. జ్యోతిష్యం చెప్పేవారు. దయ్యాలను వదిలించే మంత్రగాళ్లు,

తిండిగింజలను పోగు చేయాలని చేసేవారు.'

ఈ దిగువ క్షుద్ర కళల ద్వారా, తప్పుడు పద్ధతుల ద్వారా బ్రాహ్మణులు బతుకుతెరువు చూసుకొనేవారు. భుక్తి గడుపుకొనేవారు.

(1) జ్యోతిషం చెప్పడం–ఎక్కువ కాలం బతుకుతారనీ, మంచి భవిష్యత్తు వుందనీ చెప్పడం (పిల్లాడి చేతి రేఖలు చూచి, కాళ్లు చూసి చెప్పడం)

(2) శకునాలూ, లక్షణాల గురించి చెప్పడం.

(3) పిడుగుపాటు గురించీ, ఆకాశానికి సంబంధించిన ప్రమాదాలను గురించి శకునం చెప్పడం.

(4) కలలను విశ్లేషించి, జరగబోయేదాన్ని చెప్పడం.

(5) శరీరం మీది పుట్టుమచ్చలను చూసి జరగబోయే మంచి చెడ్డలను గురించి చెప్పడం.

(6) చిట్టెలుకలు గుడ్డని కొరికి చేసిన గుర్తులను చూసి శకునాలు చెప్పడం.

(7) అగ్నిలో ఆజ్యం పోయడం.

(8) తెడ్డుతో నైవేద్యం సమర్పించడం.

(9–13) దేవునికి పొట్టు గింజలనీ, పొట్టుకీ ధాన్యానికీ మధ్య సింధూరం, ఉడికించడానికి సిద్ధంగా వున్న పొట్టునీ బియ్యం, నెయ్యినీ, నూనెనీ సమర్పించడం.

(14) ఆవగింజల్ని నోటిలో వేసుకొని, అగ్నిలో వూసెయ్యడం ద్వారా బలి సమర్పించడం.

(15) కుడి మోకాలి నుంచి రక్తం తీసి దేవునికి బలి యివ్వడం.

(16) వేళ్ల కణుపులు చూసి మంత్రం చదువుతూ, దైవ ప్రార్థన చేస్తూ ఒక మనిషి అదృష్ట వంతునిగా పుట్టిందీ, లేనిదీ చెప్పడం.

(17) గృహ నిర్మాణానికీ, విహార స్థలానికీ స్థలం మంచిదో, కాదో నిర్ణయించడం.

(18) వాడుకలో వున్న ధర్మసూత్రం గురించి సలహా యివ్వడం.

(19) స్మశానంలో పిశాచాల్ని గొయ్యి తీసి పాతి పెట్టడం.

(20) దయ్యాలను భూస్థాపితం చెయ్యడం.

(21) మట్టి యింట్లో నివసిస్తున్నపుడు, దానికి సంబంధించిన మంత్రాలు తెలిసి వుండటం.

(22) పాముల మంత్రాలు తెలిసి వుండటం.

(23) విషం పిండడంలో నేర్పు కలిగి వుండడం.

(24) తేళ్ల వృత్తి.

(25) ఎలుకలను పట్టే నేర్పు కలిగి వుండడం.

(26) పక్షుల వృత్తి.

(27) కోళ్ల వృత్తి.

(28) మనిషి యింకా ఎంత కాలం (ఎన్ని.సం.రాలు) బతికి వుండేదీ జ్యోతిష్యం చెప్పడం.

(29) బాణం ములుకుల గాయాలకు మంత్రాలు వేయడం.

(30) జంతు చక్రం.

బ్రాహ్మణులు క్షుద్ర కళల ద్వరా తప్పుడు పద్ధతుల ద్వారా బతుకుతెరువు చూసుకొని, భుక్తి గడిపేవారు. అదేమిటంటే- ఈ క్రింది విషయాలను గురించి మంచి చెడ్డలు తెలుసుకొనే జ్ఞానం, వాటిని కలిగి వున్న వారికి వాటి మూలంగా కలిగే అదృష్టం. పొందే ఆరోగ్యం గురించి చెప్పే జ్ఞానం కలిగి వుండడం.

మణులూ, కర్రలూ, దుస్తులూ, కత్తులూ, కటారులూ, బాణాలూ, విల్లూ, ఇతర ఆయుధాలూ, స్త్రీలూ, పురుషులూ, మగపిల్లలూ, ఆడపిల్లలూ, మగ బానిసలూ, ఆడ బానిసలూ, ఏనుగులూ, గుర్రాలూ, గేదెలూ, ఎద్దులూ, మేకలూ, గొర్రెలూ, కోళ్లూ, కోలంకి పిట్టలూ, చేప పిల్లలూ, తాబేళ్లూ తదితర జంతువులు.

క్షుద్ర కళల ద్వారానూ, జ్యోతిష్యం, సోది వంటి తప్పుడు పద్ధతుల ద్వారానూ బ్రాహ్మణులు బ్రతుకు తెరువు చూసుకొనేవారు. భుక్తి గడుపుకొనేవారు. అదేమిటంటే-

సేనా నాయకులు సాగిపోతారు.

స్థానిక నాయకులు దాడి చేస్తారు, శత్రువులు వెనక్కి తిరుగుతారు.

శత్రు సేనా నాయకులు దాడి చేస్తారు, మన సైన్యాలు వెనక్కి తగ్గుతాయి.

స్థానిక నాయకులు యుద్ధంలో విజయం సాధిస్తారు. మనం ఓటమి చవిచూస్తాం.

విదేశీ సేనా నాయకులు గెలుస్తారు, మనం ఓడిపోతాం.

ఆ విధంగా విజయం యిటువైపూ, ఓటమి అటువైపూ.

విశ్వాసపాత్రులు ఏర్పాటు చేసిన ఆహారం తింటూ బ్రాహ్మణులు తప్పుడు పద్ధతుల ద్వారా ధనార్జన చేస్తారు. క్షుద్ర కళల ఆలంబనగా-భవిష్యత్తు గురించి జ్యోతిష్యం చెబుతూ-

(1) చంద్ర గ్రహణం గురించి చెప్పడం.

(2) సూర్య గ్రహణం గురించి చెప్పడం.

(3) నక్షత్ర గ్రహణం గురించి చెప్పడం.

(4) సూర్యుడు గాని, చంద్రుడుగాని గతి తప్పారని చెప్పడం.

(5) సూర్యుడు గాని, చంద్రుడుగాని తమతమ గతిలోకి తిరిగివచ్చి చేరడం గురించి చెప్పడం.

(6) నక్షత్రాలు గతి తప్పుతాయని చెప్పడం.

(7) గతితప్పిన నక్షత్రాలు తిరిగి గతిలోకి చేరడం గురించి తెలియజేయడం.

(8) అడవి అంటుకుపోతుందని చెప్పడం.

(9) ఉల్కా పతనం గురించి చెప్పడం.

(10) భూకంపం గురించి చెప్పడం.

(11) భగవంతుడు పిడుగులు కురిపిస్తాడని చెప్పడం.

(12–15) సూర్యుని–చంద్రుని నక్షత్రాల, ఉదయం, ప్రకాశం, అభివృద్ధి, కాంతి తగ్గడం.

ఈ ప్రతి ఒక్కదాని గురించి పదిహేను ద్రిగ్విషయాలూ, ఫలానా ఫలానా వాటి ఫలితమని జోస్యం చెప్పడం.

బ్రాహ్మణులు తప్పడు త్రోవలను అనుసరించి క్షుద్రకళలను ఆరాధించి జీవితాన్ని వెళ్ల మార్చుకోసాగారు. ఉదాహరణకి–

- కుంభవృష్టి కురుస్తుందని జ్యోతిష్యం చెప్పడం.
- వర్షం తక్కువ పడుతుందని జ్యోతిష్యం చెప్పడం.
- పంటలు బాగా పండుతాయని జ్యోతిష్యం చెప్పడం.
- ఆహార కొరత ఏర్పడుతుందని జోతిష్యం చెప్పడం.
- సుఖశాంతులను గురించి జ్యోతిష్యం చెప్పడం.
- అరాచకత్వం ఏర్పడుతుందని జ్యోతిష్యం చెప్పడం.
- అంటురోగాలు చెలరేగుతాయని జ్యోతిష్యం చెప్పడం.
- ఆరోగ్యకరమయిన ఋతువు గురించి చెప్పడం.
- వేళ్లమీద లెక్కకట్టి చెప్పడం.
- వేళ్ళు ఉపయోగించకుండా లెక్కగట్టడం.
- పెద్దపెద్ద సంఖ్యలను కూడిక చేయడం.
- వీరగాధల్నీ, కవితల్నీ రచించడం.

– తర్కించడం, కుతర్కం చేయడం.

విశ్వాసపాత్రులు ఏర్పాటు చేసిన తిండి తింటూ కూడా, తప్పుడు త్రోవలో క్షుద్రకళల సహాయంతో డబ్బు గడించడం. అదెలాగంటే:

(1) పెళ్లి కోసం పెళ్లికూతురుని గానీ, పెళ్లి కొడుకును గానీ యింటికి తీసుకురావడానికి మంచి ముహూర్తం చూడడం.

(2) పెళ్లి కూతురునిగానీ, పెళ్లి కొడుకునుగానీ యింట్లోంచి తీసుకువెళ్లడానికి మంచి ముహూర్తం చూడడం.

(3) శాంతి ఒప్పందం చేసుకోవడానికి మంచి ముహూర్తం నిర్ణయించడం (లేదా శాంతిని వెలకొల్పడానికి మంత్రాలు ఉపయోగించడం.)

(4) దండయాత్ర చేయడానికి మంచి ముహూర్తం నిర్ణయించడం (లేదా విభేదాలు సృష్టించడానికి మంత్రాలు చదవడం.)

(5) అప్పులు తీసుకోవడానికి మంచి రోజులు చూడడం. (పాచికలను విజయవంతంగా వేయడానికి మంత్రాలు చదవడం.)

(6) డబ్బును ఖర్చు పెట్టడానికి మంచి ముహూర్తం చూడడం. (పాచికలు వేసే ప్రత్యర్థికి దురదృష్టం వెంటాడడం కోసం మంత్రాలు చదవడం.)

(7) అదృష్టవంతులు కావడానికి మంత్రాలు చదవడం.

(8) దురదృష్టవంతుల్ని చేయడానికి మంత్రాలు జపించడం.

(9) కడుపు తీసేయడానికి మంత్రాలు చదవడం.

(10) మనిషి దవడలు కట్టిపడేయడానికి మంత్రం చదవడం.

(11) మనిషి చేతుల్ని కట్టిపడెయ్యడానికి మంత్రం ప్రయోగించడం.

(12) మూగతనం తెప్పించడానికి మంత్రం ప్రయోగించడం.

(13) చెవుడు తెప్పించడానికి మంత్రం ప్రయోగించడం.

(14) అంజనం వేసి దేవుడు మాట్లాడుతున్నట్లుగా సమాధానాలు చెప్పించడం.

(15) ఆడపిల్ల సహాయంతో దేవుడు మాట్లాడుతున్నట్లుగా సమాధానాలు చెప్పించడం.

(16) దేవుణ్ణించి నేరుగా సమాధానాలు చెప్పించడం.

(17) సూర్యుణ్ణి ఆరాధించడం.

(18) దైవాన్ని పూజించడం.

(19) మనిషి నోట్లోంచి మంటలు పుట్టించడం.

(20) అదృష్ట దేవతని–సిరిని ఆవాహన చేయడం.

బ్రాహ్మణులు తప్పుడు తోవలు తొక్కి, క్షుద్ర కళల ద్వారా బతుకు తెరువు సంపాయించుకునేవారు. అవి ఎలాంటివంటే–

(1) 'నాకీ పని చేసి పెడితే', 'నీకీ ముడుపులు చెల్లించుకుంటా'నని దేవునికి మొక్కుకోవడం.

(2) అలాంటి ముడుపు చెల్లించుకోవడం.

(3) శవాన్ని పాతిపెడుతున్నపుడు మంత్రాలను పదేపదే ఉచ్చరించడం.

(4) పుంసత్వం కలిగించడం.

(5) ఓ మనిషిని నపుంసకుడుగా శపించడం.

(6) నివాసాలకు అదృష్టం కలిగించే స్థలాలను నిర్ణయించడం.

(7) స్థలాలను పవిత్రం చేయడం.

(8) పూజా విధానంలో నోటిని కడుగుకోవడం.

(9) పూజ కోసం స్నానం చేయడం.

(10) బలులు యివ్వడం.

(11–14) వాంతులకూ, విరేచనాలకూ మందులు యివ్వడం.

(15) తలభారం తగ్గడానికి సాధనం చేయించడం. (మందులిచ్చి తుమ్ములు తెప్పించడం.)

(16) చెవుల్లో నూనె పోయడం. (పెరగడానికి గానీ, చెవి కురుపులు మానడానికిగానీ)

(17) కళ్లను తృప్తిపరచడానికి (మందు నూనె చుక్కను కళ్లలో వేసి), కళ్లకి ఉపశమనం కలిగించడం.

(18) ముక్కు పుటాల ద్వారా మందుని లోపలికి ఎక్కించడం.

(19) కళ్లకి అంజనం పెట్టడం.

(20) కళ్లకి లేపనం పెట్టడం.

(21) కళ్ల వైద్యునిగా ప్రాక్టీసు చేయడం.

(22) శల్య చికిత్సకునిగా ప్రాక్టీసు చేయడం.

(23) పిల్లల వైద్యునిగా ప్రాక్టీసు చేయడం.

(24) మూలికలనూ, ఔషధాలనూ యివ్వడం.

(25) మందులను మార్చిమార్చి యివ్వడం.

(అసంపూర్ణం)

అనువాదం: నిర్మలానంద, డా. పి.ఆపదరావు

# అధ్యాయం – 8

# సంస్కర్తలూ – వారి భవితవ్యం

[ఇది టైపు చేసి, బైండు చేసిన 87 పేజీల వ్యాసం. 'అంబత్త సుత్త' వ్రాతప్రతిలో 69వ పేజీతో మొదలవుతుంది. 70వ పేజీ తర్వాత పేజీలకు 'ఎ' నుంచి 'జడ్' వరకు నెంబర్లకి బదులు అక్షరాలు వేసి వున్నాయి. తిరిగి 71వ పేజీ నుంచి 'లోహిక్క సుత్త' మొదలవుతుంది. –సంపాదకులు]

I ఆర్యుల సమాజం, II బుద్ధుడు–సంఘ సంస్కరణ III

## I

తన కాలంనాటి హిందూ సమాజం గురించి ముచ్చటిస్తూ, సర్ టి.మాధవరావు యిలా అన్నారు: "రాజకీయ అనాచారాల వల్ల స్వల్పంగా మాత్రమే కష్టపడుతూ; స్వయంకృత, స్వయం ఆమోదిత, నివారణీయ దురాచారాల వల్ల అధికంగా దెబ్బతిన్న సమాజం హిందూ సమాజం. హిందూ సమాజం తప్ప అన్యం లేదని ఆలోచిస్తున్న కొద్దీ, పరిశీలిస్తున్న కొద్దీ, జీవిస్తున్న కొద్దీ ప్రతి ఒక్కరూ అభిప్రాయపడతారు."

ఈః వ్యక్తం చేసిన అభిప్రాయం ఎలాంటి అతిశయోక్తీ లేకుండా, నిర్దుష్టంగా వుండి, హిందూ సమాజంలో సాంఘిక సంస్కరణలు చేయాల్సిన ఆవశ్యకతను ఎత్తి చూపుతోంది.

తొలి సంఘ సంస్కర్త, సంస్కర్తలందరిలోనూ అత్యుత్తముడు గౌతమ బుద్ధుడు. భారతదేశంలో ఏ సాంఘిక చరిత్ర అయినా ఆయనతో ప్రారంభించాల్సిందే. అలాగే సంస్కరణోద్యమంలో ఆయన సాధించిన ఘన విజయాలను గుర్తించ నిరాకరిస్తే, ఆ చరిత్ర పరిపూర్తి కాదు.

'గౌతమ' యింటి పేరుగల సిద్ధార్థుడు, క్రీ.పూ. 563లో ఉత్తర భారతంలో, నేపాలుకి పరిహద్దులో వున్న కపిల వస్తులో శాక్య తెగలో పుట్టాడు. బుద్ధుడు రాకుమారుడని సాంప్రదాయం చెబుతోంది. అతను రాకుమారునికి అవసరమయిన విద్యను అభ్యసించి, వివాహం చేసుకొని, ఒక కొడుకుని కన్నాడు. నాడు ఆర్యుల సమాజంలో నెలకొని వున్న క్రౌర్యాన్నీ, గొప్ప దుఃఖాన్నీ చూసి భరించలేక తన ఇరవై తొమ్మిదో ఏట సంసారాన్ని పరిత్యజించి, సత్యాన్వేషణ,

విముక్తి సాధన కోసం యింటి నుంచి బయలుదేరాడు. తాను సన్యాసిగా మారి, ఇద్దరు ఉత్తమ ఆచార్యుల వద్ద అధ్యయనానికి చేరి, వారి బోధనలు తనకి సంతృప్తి కలిగించకపోవడం వల్ల, వారిని విడచి తాపసిగా మారిపోయాడు. అది కూడా వ్యర్థమని గ్రహించి, దాన్నీ విడచిపెట్టేశాడు. తీవ్రంగా ఆలోచించగా, ఆలోచించగా తనకి కలిగిన జ్ఞానోదయం వల్ల సూత్రీకరించి, తనదైన ఒక 'ధమ్మా'ని (ధర్మాన్ని) కనుగొన్నాడు. ఇది జరిగింది ముప్పయ్ ఐదో ఏట. ఎనభై ఏళ్ల జీవితంలో మిగిలిన కాలాన్ని తన ధమ్మాన్ని వ్యాపింపజేయడానికీ, బౌద్ధ భిక్షువులకు ఒక సంఘాన్ని నిర్మించి, వ్యవస్థను కల్పించడానికీ కృషి చేశాడు. క్రీ.పూ. 483 సం.రంలో కుసినారా అనేచోట విశ్వాసపాత్రులయిన అనుచరులు చుట్టూ వుండగా బుద్ధుడు చనిపోయాడు.

జ్ఞానోదయం కలిగిన తర్వాత, తన సందేశాన్ని ప్రజల్లో వ్యాపింపజేసేందుకు, బుద్ధుడు తన యావత్ కాలాన్నీ వినియోగించాడు. ఏసుక్రీస్తు ఏ విధంగా అయితే గంటల తరబడి ఒంటరిగా ప్రార్థన చేసేవాడో, అదేవిధంగా బుద్ధుడు తాను కూడా ఒంటరి ధ్యానంలో ఒకవేపు కాలం గడుపుతూ, స్వీయ ఆధ్యాత్మిక చైతన్య దీపానికి చమురు అందిస్తూనే వేరొక వంక అధిక సంఖ్యలో గుమిగూడే బౌద్ధ భిక్షువులకు వుపదేశాలు యిస్తూ, బాగా పరిణతి చెందిన వారికి ఆంతరిక అభివృద్ధి కోసం సూక్ష్మాంశాల మీద సూచనలిస్తూ, సంఘ కార్యకలాపాలను నిర్దేశిస్తూనే, క్రమశిక్షణను భంగం కలిగించిన భిక్షువులను చీవాట్లు వేస్తూ, విశ్వాసపాత్రుల ప్రతిభను స్థిరీకరిస్తూ, ప్రతివిధి వర్గాలకు సాదరంగా ఆహ్వానం పలుకుతూ, ప్రత్యర్థి మేధోజీవులతో శాస్త్రి చర్చలు సాగిస్తూ, బాధాతప్తుల్ని ఓదార్చి, ఊరడింపజేస్తూ, రాజులను, రైతులను, బ్రాహ్మణులను, వెలివేయబడ్డ వారినీ, ధనికులను, పేదలను–అన్ని రకాల వారినీ సమానంగా కలుస్తూ రెండు విధాల తన కాలాన్ని వినియోగించేవాడు. సత్రాల నిర్వాహకులూ, పాపులు ఇరువురకూ ఆయన మిత్రుడే. ఎంతోమంది వేశ్యలు ఆయనను దర్శించి, ఆయన నుంచి జాలినీ, సానుభూతినీ పొంది, తమ వృత్తిలోని నైచ్యాన్ని గుర్తించి, అంతిమంగా ఆ 'భగవాన్'ని శరణుజొచ్చేవారు. అలాంటి జీవితం నుండి వైవిధ్యపూరితమయిన నైతిక విలువలూ, సామాజిక గుణాలూ, ప్రజాస్వామిక భావాలూ, కులీన కలుపుగోరుతనమూ సంయోగం కావడం అరుదైన విషయం. ఆయన ప్రవచనాలను చదువుతున్న వారెవరూ గౌతముడు ఒక కులీన కుటుంబంలో పుట్టి, పెరిగాడనే విషయాన్ని ఎన్నటికీ మరచిపోలేరు. ఆయన బ్రాహ్మణులతో, పురోహితులతోనే గాకుండా యువ రాజులతో, మంత్రులతో, రాజులతో సమానస్థాయిలో ధారాళంగా సంభాషించేవాడు. ఆయన యట విందులారగించేవాడు. ఎన్నో ఐతిహ్యాలు ఎరిగినవాడు. సరసోక్తులు విసరడంలో దుదిట్ట. ప్రతి ఇల్లూ, ప్రతి గుమ్మం ఆయన రాకకోసం ఆత్రంగా ఎదురుచూసేవి. ఒక విశిష్ట బ్రాహ్మణుడు యీ కింది పదాల్లో బుద్ధుని వ్యక్తి చిత్రాన్ని బొమ్మ కట్టించాడు:

"ఇరు వంశాలవేపు నుంచి చూసినా పూజ్య గౌతమునిది ఉత్తమమైన పుట్టుక. విశుద్ధమైన వంశానుక్రమం... ఎంతో సొగసరి. చూపరులకు కనువిందు కలిగించే సుందరరూపి. ప్రేరణ, విశ్వాసం కలిగించే స్వభావం. గొప్ప అందంతో కూడిన వర్చస్సు. చక్కని శరీర ఛాయ. అందమైన సాన్నిధ్యం. రాజసం ఉట్టిపడే ఆ చూపులు. ఎన్నో అర్హతలను సంతరించుకున్న

యదార్థమూర్తిత్వం. మూర్తీభవించిన మంచితనం. సద్గుణరాశి. వీనులవిందు చేసే కంఠస్వరం. నాగరకమైన సంబోధన. ఆవేశంగానీ, లాలసగానీ లవలేశమయినా కానరాని వ్యక్తిత్వం. చపలత్వం ఆయన మనసుకు అంటదు. వచ్చిన వారందరికీ చిరునవ్వుతో స్వాగతం పలుకుతాడు. అనుకూల స్వభావం, ఎంత తీవ్ర విమర్శనయినా తేలికగా తీసుకోగలగడం, సమదృష్టి, ఏమాత్రం అహంకారం లేకపోవడం—ఆయన లక్షణాలు."

కానీ తన కాలంనాటి ఇండియాలో ఏదయితే అత్యధికులకు నచ్చిందో, యుగయుగాలుగా ఇండియాలో కూడా అదే అత్యధికులకు నచ్చిన విషయాన్ని ఆ బ్రాహ్మణుడు యీ దిగువ మాటల్లో బొమ్మ కట్టించాడు:

"గొప్ప వంశానికి చెందిన తన బంధువులనూ, దగ్గర వారినీ విడచి, భూమ్మీదనూ, భూమి లోపలనూ పాతిపెట్టిన అపారమయిన ధనరాశుల్నీ, బంగారాన్నీ విడచి, భిక్షువు గౌతముడు మతపరమైన జీవితంలోకి వెళ్లిపోయాడు. వాస్తవానికి తాను యువకునిగా వుండగానే, తలమీద ఒక వెంట్రుకయినా తెల్లపడకుండానే, అందాలు సంతరించుకుంటున్న ఆరంభ వయస్కతలోనే, ఆయన గృహస్తు జీవితం నుంచి గృహరహిత (సంఘ జీవనం) స్థితిలోకి వెళ్లిపోయాడు."

"ఆయనలాంటి జీవితం గడిపే వారికి మనసుకి హత్తుకుపోయే సుగుణాలూ, సానుభూతీ, దయార్ద్ర హృదయంతో పాటుగానే దృఢచిత్తం, గుండె నిబ్బరం కూడా అవసరమే. అవసరం వస్తే, బౌద్ధ సంఘానికి హాని కలిగించే వారితో చాలా నెమ్మదిగా, నిదానంగా సంబంధాలు తెంచేసుకోవాలి. ఒకవేపు తాను భౌతిక వ్యధను సమదృష్టితో అనుభవిస్తూనే, వేరొకవేపు ఆధ్యాత్మిక ఆనందాన్ని వదులుకోరాదు. దానికి ఎంతయినా గుండె ధైర్యం అవసరం. ఆయనలో అది పుష్కలంగానే వుంది. ఉదాహరణకి—దేవదత్తుడు ఎన్నో ప్రయత్నాలు చేసి, బుద్ధుణ్ణి హత మార్చాలని చూసినపుడు బుద్ధుడు అవలంబించిన ప్రశాంత వైఖరి, 'నిన్ను చంపేస్తా'నని చేసిన బెదిరింపు హెచ్చరికలను లెక్కచేయకుండా కోసల రాజ్యంలో క్రూరుడైన బందిపోటు దొంగతో ఆయన సంభాషణ జరిపిన తీరు, ఆ బందిపోటు అంటేనే ఆ గ్రామీణ ప్రాంతమంతా గజగజ వణికిపోతూంటే, అతణ్ణి నిరాయుధుడై, బుద్ధుడు ఒంటరిగా గుహలో కలియడం, రాజ్యంలో ఒక ప్రమాదకారిగా తయారైన ఆ బందిపోటును చివరికి బౌద్ధ సంఘంలో ప్రశాంతమయిన ఓ సభ్యునిగా మార్చివేయడం—ఇవన్నీ బుద్ధుడు చేసిన పనులు. బాధగానీ, ప్రమాదంగానీ, అవమానంగానీ ఆయన్ని తన ఆధ్యాత్మిక ప్రశాంతి నుంచి వైదొలగించలేవు. తనని నిందించినవాణ్ణి, తాను తిరిగి అతణ్ణి అలా చేయలేదు. తన ఓదార్పూ, సహాయ సహకారాలూ, ఊరడింపు కావలసిన వారికి, వాటిని అందించడంలో ఆయనలో ఆర్ద్రత లోపించలేదు."

బుద్ధుడు అందరికీ ప్రీతిపాత్రుడు. ప్రజలు అదేపనిగా ఆయన గురించి చెప్పడం గానీ, తనంత తాను చెప్పడం గానీ ఏమిటంటే—'అనేకమంది మంచి కోసం, అనేకమంది ఆనందం కోసం, దేవతల, మానవుల ప్రయోజనం కోసం, వారి మంచికోసం, వారి ఆనందం కోసం,

ప్రపంచం మీద వుండే సంవేదనతో తాను ఈ ప్రపంచంలో అడుగుపెట్టా'డని.

ఆయన ఆర్యుల సమాజంపై చెరగని ముద్రవేశాడు. ఆయన పేరుప్రఖ్యాతులు భారత దేశం ఎల్లలుదాటినా, ఇతర దేశాలకు వెళ్ళిపోయినా ఆయన బోధనల ముద్ర ఇంకా భారతదేశం మీద మిగిలే వుంది.

ఆయన మతం (బౌద్ధం) దశదిశలా దావాగ్నిలా వ్యాపించింది. అతి శీఘ్రంగానే ఆ మతం యావత్ భారతదేశపు మతంగా మారిపోయింది. అది ఒక్క భారతదేశానికి మాత్రమే పరిమితమయిపోలేదు. ఆనాటి పరిచిత ప్రపంచపు నలుమూలలకీ ఆ మతం చేరిపోయింది. అన్ని జాతులూ ఆ మతాన్ని ఆమోదించాయి. ఆఫ్ఘన్లు సయితం ఒకనాటి బౌద్ధాన్ని అవలంబించిన వారేను. ఆసియా దేశాలకే అది పరిమితం కాలేదు. బౌద్ధం 'సెల్టిక్' (CELTIC) బ్రిటన్ దేశపు మతమని విరూపించేందుకు ఆధారాలున్నాయి. [Dr. Donald A.Mackenzie, 'BUDDHISM IN PRE-CHRISTIAN BRITAIN', Blackie & Son, London, 1928. -EDITORS.] బౌద్ధ మతం ఈ విధంగా వేగవంతంగా వ్యాపించడానికి కారణం ఏమిటి? ఈ అంశంమీద ప్రొ. హాప్కిన్స్ చెప్పింది ఉదహరించదగ్గది. ఆయన యిలా చెప్పాడు:

"బౌద్ధ మతం తన జీవన గమనాన్ని ఆరంభించిన ఆదిలోనే, అది త్వరితగతిని వ్యాప్తి చెందడానికి కారణం–ఆ బోధనలు చేసిన పరిస్థితులూ, శక్తివంతమయిన స్థాపకుని ప్రాపకం దానికి లభించడం. కేవలం వ్యక్తిగానే బుద్ధుడు మానవుల్ని వశపర్చుకున్నాడు; ఆయన ప్రబోధం ప్రజల్లో ఉత్సకతను రగిలించింది. కులీనవర్గం బుద్ధుణ్ణి ఆమోదించడానికి అతను కులీనుడు కావడమే మూల కారణం; ఆయనలోని ఆకర్షణ శక్తి ప్రజలకు ఆయన్ని ఓ ఆరాధనా చిహ్నం చేసింది. (బౌద్ధం) ప్రతి పేజీ నుంచీ, ఆ మత బోధకుని, హృదయ విజేత యొక్క శక్తివంతమయిన, ఆకర్షణీయమయిన వ్యక్తిత్వం లేచి నిలబడింది. ఏ వ్యక్తీ ఏ కాలంలోనూ అలా దైవరహితునిగా జీవించనూ లేదు, దైవ సమానునిగా బతకనూ లేదు. తనకి తానుగా దైవత్వమేదీ ఆపాదించుకోకుండానే, భవిష్యత్ బ్రహ్మానందాన్ని తృణీకరిస్తూ, అయినా ఎలాంటి ఆశగానీ, భయం గానీ లేకుండా ఆ ప్రబోధ నాయకుడు ఈ మూర్ఖ ప్రపంచాన్ని ఒకవేపు ప్రేమిస్తూ, వేరొక వంక అలక్ష్యం చేస్తూ, ప్రశంసిస్తూ, దాన్ని ఆరాధిస్తూ ఆ విశ్వభ్రాత ప్రజల మధ్య ఏ డాంబికాలూ లేకుండా, ప్రశాంతంగా తిరుగసాగాడు; తనని వ్యతిరేకించే వారిని సున్నితమయిన వక్రోక్తితో జయిస్తూనే, ప్రతి వారికీ యజమానిగా, అందరికీ సన్నిహిత మిత్రునిగా, గాంభీర్యమైన, మధురమైన కంఠంతో జన సమూహాల ఎదుట, సమావేశాల్లో, సభల్లో మాట్లాడేవాడు. ఆయన గొంతు ఒక వైశిష్ట్యాన్ని ప్రతిధ్వనిస్తూ, వాగ్ధాటి గలది; ఆయన విషయాన్ని వివరించే పద్ధతి శ్రోతని నమ్మిస్తుంది. ఆయన దృక్కులు చూపరుల హృదయాలను యిట్టే జయిస్తాయి. పరంపరాగతంగా చూస్తే ఒక వ్యక్తిని (మత) నాయకునిగా చేయడమే గాకుండా, తన అనుచరుల హృదయాల్లో ఆయన్ని ఒక దేవునిగా కొలవటానికి ఆ వ్యక్తిత్వం ప్రధాన కారణం–అనిపిస్తుంది. అలాంటి వ్యక్తి ఉపదేశిస్తున్నపుడు, అతనికి ఎక్కడికక్కడ శ్రోతలు ఏర్పడిపోతారు. ఆయన ఏం

చెప్పాడన్నది ప్రధానం కాదు. కారణం–ఆయన గతిశీలతను ప్రభావితం చేస్తాడు; వినేవాణ్ణి యిట్టే ఆకర్షించుకొని, తనవేపుకి తిప్పుకుంటాడు. కానీ, ఆ వ్యక్తిత్వానికి అదనంగా, దాన్ని చుట్టు ముట్టి ఇతరుల మనసుల్లో సంచరించే, సంచలించే భావాలేమిటంటే–ఈ మనిషి చేసిన ప్రబోధం వైవిధ్యపూరితమైనదే గాకుండా, తమ విముక్తి మార్గానికి యితను ఆశాజ్యోతి కూడాను; అతని మాటల్లో వారు మొదటిసారిగా సత్యాన్ని కనుగొంటారు. ఆ సత్యం బానిసలను, స్వేచ్ఛా జీవులుగా మారుస్తుంది; వర్గాల మధ్య సోదరభావాన్ని నెలకొల్పుతుంది; వాటి నుంచి హృదయం నుంచి హృదయానికి మెరుపు సదృశవేగంతో విద్యుత్తు ప్రవహించడం చూడగలగడం కష్టమేమీ కాదు. అలాంటి ఒక వ్యక్తి బుద్ధుడు; అలాంటిది అతని బోధనల సారాంశం; అలాంటి అనివార్యమయిన వేగంతో బౌద్ధమత విస్తరణ సాగి, బౌద్ధ ప్రజల పురాతన నైతిక చైతన్యంపై నూతన మత విశ్వాసం గంభీరమైన ప్రభావాన్ని పడవేసింది."

తన ఉపదేశాల ద్వారా ఆయన సమాజంలో తీసుకువచ్చిన గొప్ప సంస్కరణని అర్థం చేసుకోవాలంటే, ముందుగా–బుద్ధుడు తన జీవిత ఆశయాన్ని ప్రచారంలో పెట్టిన కాలంలో భ్రష్టుపట్టిన ఆర్యుల నాగరికత గురించి కొంత తెలుసుకోవడం ఎంతయినా అవసరం.

బుద్ధుని కాలంనాటి ఆర్యుల సమాజం–సాంఘికంగా, మతపరంగా, ఆధ్యాత్మికంగా నికృష్టమైన జారత్వంలోకి పీకల దాకా కూరుకుపోయి వుంది.

కొన్ని సాంఘిక దురాచారాలను ఉదహరించే సందర్భంలో జూదం మీదికి దృష్టిని నిలుపుదాం. తాగుడు వ్యసనంగా ఎలాగో, అలాగే జూదం కూడా ఆర్యుల్లో విస్తృతంగా వ్యాప్తిలో వుంది.

ప్రతి రాజ్యంలోనూ రాజ ప్రాసాదానికి ఆనుకొని ఒక జూదగృహం, తనతో ఆడటానికి ఒక గజ జూదగాణ్ణి రాజు తన కొలువులో నియమించడం–ఇవీ ఆనాటి అలవాట్లు. కంకుభట్టు, విరాటరాజు కొలువులో జూదనిపుణుడుగా వుండేవాడు. జూదం రాజులకు వినోదం కోసమే కాదు. ఎక్కువ మొత్తాలలో పందెం కాసేవారు. తమ రాజ్యాలనూ, ఆశ్రితులనూ, బంధువులనూ, బానిసలనూ, సేవకులను సైతం పణంగా పెట్టేవారు.[1] నలమహారాజు పుష్కరునితో ఆడిన జూదంలో–తననీ, తన భార్య దమయంతినీ మినహా–మిగతా సర్వస్వాన్నీ ఒడ్డి, ఓడిపోయాడు. చివరికి నలుడు (భార్యతో) అడవికేగి, బిచ్చమెత్తుకొని బతికాడు. కొందరు రాజులు జూదంలో నలుణ్ణే తలదన్నేరు. పాండవ ప్రథముడు, ధర్మజుడు (కౌరవులతో) ఆడిన జూదంలో తమ్ముళ్లనీ, తననీ, తమ భార్య ద్రౌపదినీ–తమ సర్వస్వాన్నీ పణంగా పెట్టిన విషయం మహాభారతం చెబుతోంది.[2] జూదం ఆడటాన్ని ఆర్యులు గౌరవసూచికమైనదిగా భావించేవారు. ఎవరినుంచయినా జూదానికి ఆహ్వానం వస్తే, దాన్ని వారు తమ గౌరవానికీ, హోదాకి ఒక సవాలుగా తీసుకొనేవారు. ముందుగా ఆడవద్దని ఎంత హెచ్చరించినప్పటికీ, ధర్మరాజు జూదంలో అతి ఘోరమైన పరిస్థితుల్ని ఎదుర్కొన్నాడు. దానికి ఆయన చెప్పిన సాకు–'జూదం ఆడటా

నికి తనని రమ్మని ఆహ్వానం వచ్చిం'దనీ, 'గౌరవనీయుడైన వ్యక్తిగా ఆ ఆహ్వానాన్ని తాను నిరాకరించలేకపోయా'ననీ.

జూదమనే యీ వ్యసనం ఒక్క రాజులకే పరిమితం కాదు. సామాన్యుల్లోకి సయితం యిది అంటువ్యాధిలా వ్యాపించిపోయింది. ఒక పేద ఆర్యుడు జూదంలో ఎలా తను సర్వనాశనమయిందీ ఋగ్వేదం సవివరంగా వర్ణిస్తోంది. కౌటిల్యుని కాలంలో జూదం బాగా ప్రాచుర్యం పొందిన ఒక అలవాటు. రాజు నుంచి లైసెన్సు పొంది నెలకొల్పిన జూదగృహాల నుంచి రాజు కోశానికి సాలీనా పెద్ద మొత్తంలో ఆదాయం లభిస్తూ వుండేది.

తాగుడు మరొక దుర్వ్యసనం. ఆర్యుల్లో యిది మోతాదుని మించి వుండేది. మద్యం రెండు రకాలు–సోమ, సుర. సోమరసం యజ్ఞం సమయంలో సేవించేది. ఆదిలో బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ, వైశ్యులకు మాత్రమే అనుమతింపబడిన సోమరసం, కాలక్రమేణా వైశ్యులను మినహాయించి, బ్రాహ్మణులకూ, క్షత్రియులకు పరిమితం చేయబడింది. శూద్రులు సోమరసాన్ని అసలు రుచి చూసే ప్రసక్తే లేదు. ఈ రసం తయారీ ఒక రహస్యం. అది బ్రాహ్మణులకే తెలుసుండేది. సుర అందరి కోసమూను. దాన్ని అన్నివర్గాల వారూ తాగేవారు. బ్రాహ్మణులు సయితం ఇందుకు మినహాయింపు కాదు. అసురుల పురోహితుడు శుక్రాచార్యుడు[3] ఒకసారి చిత్తుగా సురను సేవించాడు. దేవతలు చంపే అసురులను బతికించడం కోసం ఉద్దేశించబడిన 'మృత సంజీవిని' మంత్రాన్ని ఆ తాగిన మైకంలో శుక్రాచార్యుడు కచునికి ఉపదేశించాడు. కచుడు దేవ పురోహితుడు బృహస్పతి కొడుకు. ఒకానొక సందర్భంలో కృష్ణుడు, అర్జునుడు చిత్తుగా సురాపానం చేసేరని మహాభారతం చెబుతోంది. పై ఉదాహరణలను బట్టి మనకి అర్థమయేదేమిటంటే–ఆర్యుల్లో ఉత్తములు సయితం ఈ తాగుడు వ్యసనానికి అతీతులు కారనీ, తాగడం మొదలుపెడితే, వారు పీకలదాకా తాగేసే వారనీను. ఆర్య స్త్రీలు కూడా ఈ వ్యసనానికి బాగా అలవాటుపడిపోవడం, అన్నిటికన్నా సిగ్గుతో తలవంచుకోవలసిన విషయం. ఒక ఉదాహరణ యిస్తాను. విరాట రాజు భార్య సుధేష్ణ[4] తన పరిచారిక సైరంధ్రితో– "కాళ్లు చేతులూ తెగ పీకుతున్నాయి. తమ్ముడు కీచకుని రాజ ప్రాసాదానికి వెళ్ళి, తొందరగా సురని తీసుకురా" అని పురమాయిస్తుంది. ఈ దురలవాటు కేవలం రాణుల వరకే పరిమితం కాదు. అన్ని వర్గాల స్త్రీలలోనూ ఇది సర్వసాధారణమైన అలవాటు అయిపోయింది[5]. బ్రాహ్మణ స్త్రీలు సయితం యిందుకు మినహాయింపు కాదు. ఆర్యావర్తంలోని మధ్య ప్రాంతంలో క్రీ.శ. ఏడు, ఎనిమిది శతాబ్దాల పర్యంతం మత్తెక్కించే మద్యాన్ని నిమ్నవర్ణాల స్త్రీలే కాకుండా, బ్రాహ్మణ స్త్రీలు కూడా సేవిస్తూ వుండేవారన్న విషయాన్ని కుమారిలభట్టు రాసిన 'తంత్రవార్తిక' [1. (iii) 4] అనే గ్రంథం యిలా చెబుతోంది: "ఆధునిక కాలపు వ్యక్తుల్లో అహిచ్ఛత్ర, మధుర దేశాల బ్రాహ్మణ స్త్రీలు తాగుడు వ్యసనానికి బానిసలు కావడం మేం గమనించాం." పండ్ల నుంచి గానీ, పూల నుంచి గానీ (మాధవి), మురిగిన బెల్లం నుంచి గానీ (గౌడి), ధాన్యం (సుర) నుంచి తయారుచేసిన సురను గానీ బ్రాహ్మణులు సేవించడాన్ని మాత్రమే కుమారిలభట్టు ఖండించాడు. ఆయన క్షత్రియ, వైశ్య స్త్రీ పురుషుల విషయం గురించి పట్టించుకోలేదు.

మద్యం అన్నా, నృత్యం అన్నా ఆర్య స్త్రీలకు ఎంత ఆపేక్షో, కౌశితకి గృహ్యసూత్రం 1. 11-12, యిలా చెబుతోంది: "వివాహాల ముందురోజు రాత్రి మద్యం తాగి, విందు ఆరగించి-నలుగురు గానీ, ఎనిమిది మంది గానీ పునిస్త్రీలు నాలుగు పర్యాయాలు నృత్యం చేయాలి."

ఇహ ఆర్యుల సమాజం విషయానికి వస్తే, అది స్పష్టంగా వర్గపోరాటం, వర్గన్యూనత్వం. ఆర్యుల సమాజం నాలుగు వర్గాలను గుర్తించింది-అవి: బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. ఈ వర్గీకరణ కింది నుంచి మీది వరకూ దొంతర్లుగా సాగడమే గాకుండా, సాంఘిక సంబంధాలకి సంబంధించి, ఇవి వేటికవే సమానంగా వున్నాయి. ఈ వర్గీకరణ నిలువుగా ఒక దానిమీద వేరొకటి వుంది. ఒకదాని మీద వేరొకటి గానీ, ఒకదాని కింద మరొకటి గానీ వుండటం వల్ల ఈ నాలుగు వర్గాల మధ్య ఈర్ష్యాసూయలు శత్రుత్వానికి కూడా దారితీశాయి. ఈ శత్రుత్వం, ప్రత్యేకించి- వున్నత వర్గాలయిన బ్రాహ్మణ, క్షత్రియుల మధ్య మనకి మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఆ రెండు వర్గాల మధ్య తరచూ తీవ్రమైన వర్గ పోరాటాలు సాగేవి. ఏ మార్క్సిస్టయినా ఆ వర్ణనని చదవడానికి ఆనందపడతాడు. దురదృష్టవశాత్తూ బ్రాహ్మణ, క్షత్రియుల మధ్య సాగిన ఈ వర్గ పోరాటాల వివరణాత్మక చరిత్ర ఎక్కడా (రాసి) లేదు. ఏవో కొన్ని సంఘటనలు మాత్రమే నమోదు అయ్యాయి. వేనుడూ, పురూరవుడూ, నహుషుడూ, సుదాసుడూ, సుముఖుడూ, నిమి-వీరు బ్రాహ్మణులతో పోరాటం చేసిన కొంతమంది క్షత్రియ రాజులు. ఈ సంఘర్షణలకు దారితీసిన కారణాలు వేర్వేరు.

వేనుడికీ, బ్రాహ్మణులకూ వచ్చిన తగాదా ఏమిటంటే-రాజు ఆదేశించి బ్రాహ్మణులను భగవంతునికి బదులుగా తననే పూజించమని చెప్పవచ్చా? లేదా? అలాగే యజ్ఞయాగాదుల విషయంలో కూడాను. పురూరవునికీ, బ్రాహ్మణులకీ మధ్య జరిగిన గొడవకి కారణం ఏమి టంటే-క్షత్రియ రాజు బ్రాహ్మణుని ఆస్తిని జప్తు చేయవచ్చునా? కూడదా? అని. ఇహ నహుషునికీ, బ్రాహ్మణులకీ మధ్య సమస్య-క్షత్రియరాజు బ్రాహ్మణున్ని సేవకునిగా పని చేయమ నవచ్చా? కూడదా? నిమికీ, బ్రాహ్మణులకీ మధ్య లేచిన జగడం-రాజు యజ్ఞం చేస్తున్నపుడు తమ వంశ పురోహితుణ్నే పెట్టుకోవాలా? అలా అవసరం లేదా? అని. అలాగే సుదాసునికీ, బ్రాహ్మణులకీ మధ్య సంఘర్షణకి మూల కారణం-రాజు యజ్ఞానికి కేవలం బ్రాహ్మణున్నే పురోహితునిగా పెట్టుకోవాలా? అక్కర్లేదా? అని.

రెండు వర్గాల మధ్య తలెత్తిన ఈ సమస్యలు ఎంత కీలకమైనవో మనకి అర్థమవుతుంది. అందువల్ల వీరి మధ్య రగిలిన పోరాటం హోరాహోరీగా సాగిందంటే ఆశ్చర్యపోవలసిన పనిలేదు. ఈ పోరాటాలు అడపాతడపా సాగే మత కలహాలు వంటివి కానేకావు. ఇవి వర్గాలను నిర్మూలించడానికి ఉద్దేశించబడ్డ యుద్ధాలు. పరశురాముడు ఇరవై ఒక్కసార్లు దండెత్తివెళ్లి, ప్రతి క్షత్రియుణ్ణీ వూచకోత కోసి వచ్చాడు.

ఒకవేపున ఈ రెండు వర్గాలూ ఒకరిమీద ఒకరి ఆధిపత్యం కోసం తమలో తామే

కొట్లాడుకుంటూనే, అదే సమయంలో ఇద్దరూ ఏకమై వైశ్యుల్నీ, శూద్రుల్నీ అణిచిపెట్టి వుంచసాగారు. వైశ్యులు పాడి ఆవులాంటి వారు. వారు పన్నులు కట్టడానికే వున్నారు. ఇహ శూద్రులు కాయకష్టం చేసే మృగాలు. ఈ ఇరువర్గాల వారూ బ్రాహ్మణ, క్షత్రియుల జీవితాలను సుఖమయం చేయడానికీ, వారికి పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టడానికీ నిర్దేశింపబడ్డారు. అంతేకాని, శూద్రులకు ఎలాంటి హక్కూ లేదు. తమపై వర్ణాల వారి జీవితాలను సుగమం చేయడానికే వారు ఉద్దేశింపబడ్డారు.

చివరి రెండు వర్ణాల క్రింద కూడా మరికొన్ని వర్ణాల వారు వున్నారు. వారు–చండాలురూ, శ్వపచులు. వారు అస్పృశ్యులు కాకపోయినా వర్ణభ్రష్టులేను. వారు సామాజిక, ధర్మసూత్రాల పరిధుల్లోకి రారు. వారికి హక్కులు లేవు; అవకాశాలు అంతకన్నా లేవు. ఆర్యుల సమాజం ద్వారా తిరస్కృతులు.

ఆనాటి ఆర్యుల సమాజంలో నెలకొని వుండిన నీతిబాహ్యమైన లైంగిక అనాచారాలను గురించి తెలుసుకొని, నేటి ఆర్య సంతతి వారు దిగ్భ్రమ చెందవచ్చు. బుద్ధుని కాలానికి ముందు నాటి ఆర్యుల సమాజంలో నేటి మనకి మల్లేనే లైంగిక వాంఛల్నీ, వైవాహిక సంబంధాలను నియంత్రించే నైతిక సూత్రాలు లేవు.

ఆర్యుల పౌరాణిక కథల ప్రకారం సృష్టికి కర్త బ్రహ్మ. ఆయనకి ముగ్గురు కొడుకులూ, ఒక కుమార్తె. వారిలో ఒక కొడుకు పేరు దక్షుడు. అతను స్వయాన తన చెల్లెలినే వివాహం చేసుకుంటాడు. వారిద్దరికీ ఆడ సంతానం కలిగింది. ఆ ఆడ సంతానంలో కొందర్ని దక్షుడు (బ్రహ్మ మరొక కొడుకు), మరీచి కొడుకు కాశ్యపునికీ, మరికొందర్ని బ్రహ్మ మూడో కొడుకు ధర్మునికి[6] యిచ్చి పెళ్లి చేశాడు.

ఋగ్వేదంలో అన్నాచెల్లెళ్ళకి సంబంధించిన ఒక ఉపాఖ్యానం వుంది. అన్న పేరు యమ, చెల్లెలు యమి. యమి యమని తన శరీరవాంఛ తీర్చమని అడుగుతుంది. అందుకు యమ నిరాకరిస్తాడు. యమి అతనిపై మండిపడుతుంది.[7]

తండ్రే తన కూతుర్ని పెళ్లి చేసుకొనే ఆచారం వుంది. ఈడొచ్చిన తన కూతురు శత్రుపని, తండ్రి వశిష్టుడు వివాహం చేసుకుంటాడు.[8] మనువు తన కూతురు ఇలనూ,[9] జాహ్ను తన కూతురు జాహ్నవినీ,[10] సూర్యుడు తన కూతురు ఉషనీ[11] వివాహాలు చేసుకుంటారు. ఆర్యుల్లో బహు భర్తృత్వం ప్రచలితమై ఉండేది. అదీ సాధారణమైన బహు భర్తృత్వం కాదు. దగ్గర రక్త సంబంధీకులే ఒకే స్త్రీతో సంగమించే ఆచారం వుంది. దశప్రచేతనీ, అతని కొడుకు సోముడు–ఇరువురూ సోముని కుమార్తె మారీష[12]తో శరీరవాంఛలు తీర్చుకున్నారు.

మనుమరాలితో, తాత కళ్యాణం చేసుకొనే ఆచారం కద్దు. తండ్రి బ్రహ్మకి[13] దక్షుడు తన కూతురునిచ్చి వివాహం చేస్తాడు. వారికి పుట్టినవాడే నారదుడు. దౌహిత్రుడు తన 27 మంది కుమార్తెలనూ తండ్రి సోమునికిచ్చి సంగమం కోసం, ప్రజననం కోసం కట్టబెడతాడు.[14]

ఆరుబయటను బాహాటంగా నలుగురూ చూస్తూండగానే ఆర్యులు స్త్రీలతో సంగమించడానికి వెనకాడేవారు కారు. ఋషులు చేసే కొన్ని మతపరమైన కర్మకాండల్ని యజ్ఞ భూమిలోనే నిర్వహిస్తూ వుండాలి. అలాంటపుడు ఎవరైనా స్త్రీ యజ్ఞవేదిక దగ్గరకు వచ్చి, తన లైంగిక వాంఛను తీర్చమని ఋషిని కోరితే, ఆయన అదే సమయంలో, అదేచోట ఆరుబయట ఆమె కోర్కెను తీర్చేవాడు. ఇలాంటి సంఘటనలను ఎన్నయినా చూపించవచ్చు. ఋషి పరాశరుడు, సత్యవతితో జరిపిన తంతు అదే. అలాగే దీర్ఘతపుని వ్యవహారం కూడా. ఇలాంటి ఆచారం సర్వసాధారణం అని చెప్పడానికి 'అయోనిజ' అనే పదాన్ని ఉదాహరణగా మనం తీసుకోవచ్చు. 'అయోనిజ' అనే పదానికి 'పాపం కాని గర్భధారణ' అనే అర్థం వున్నట్టు చెప్పడం జరుగుతోంది. నిజానికి ఆ పదానికి అసలు అర్థం వేరే వుంది. అదేమిటంటే–'యోని' అంటే ఇల్లు అని ఒక అర్థం వుంది. అలాగే 'అయోనిజ' అంటే 'ఇంటి బయట గర్భప్రవేశం చేసినది' అని అర్థం. అంటే ఆరుబయట కడుపులో పడిందని అర్థం. ఈ పని తప్పేమీ కాదని చెప్పడానికి సీత, ద్రౌపది–ఇద్దరూ అయోనిజలే అనే వాస్తవాన్ని మనం ఇక్కడ గుర్తుంచుకోవాలి. ఇవి (ఆరుబయట సంగమాలు) ఎంత సర్వసాధారణమయినవో మతపరమయిన ఆదేశాలు జారీ చేయక తప్పని పరిస్థితి రావడమే తెలియజెబుతోంది.[15]

తమ స్త్రీలను కొంతకాలంపాటు ఇతరులకు అద్దెకు ఇచ్చుకోవడం ఆర్యుల్లో వున్న ఆచారం. మాధవి కథ[16] ఇందుకొక ఉదాహరణ. యయాతి రాజు తన కూతురు మాధవిని ఆచార్య గాలవునికి సమర్పిస్తాడు. గాలవుడు మాధవిని ముగ్గురు వేర్వేరు రాజులకు నిర్ణీత కాలంపాటు అద్దెకు ఇచ్చివేస్తాడు. ఆ కాల వ్యవధి ముగిసిన వెంటనే, గాలవుడు తిరిగి విశ్వామిత్రునికిచ్చి వివాహం జరిపిస్తాడు. విశ్వామిత్రుని ద్వారా తనకి ఒక కొడుకు పుట్టేదాకా మాధవి అతని వద్దనే వుంటుంది. ఆతర్వాత గాలవుడు ఆమెను, యయాతి రాజుకి తిరిగి యిచ్చివేస్తాడు.

ఈవిధంగా ఆర్యుల్లో తమ స్త్రీలను తాత్కాలికంగా మరొకరికి అద్దెకిచ్చే ఆచారంతో పాటుగానే, మరొక ఆచారం కూడా వుంది. అది–సంతానోత్పత్తి కోసం కూడా శ్రేష్ఠులయిన ఆర్యులకు తమ స్త్రీలను అప్పగించడం. కుటుంబాన్ని అభివృద్ధి చేయడమంటే–ఆర్యుల దృష్టిలో పిల్లల్ని కని పెంచి, వంశాన్ని ఉద్ధరించడమే. ఆర్యుల్లో ఒక ప్రత్యేక వర్గమే దేవతలు. వారు సయితం ఆర్యులే. అయితే వారు శ్రేష్ఠమైన హోదా కలిగిన పరాక్రమవంతులు. ఉత్తమ సంతానం పొందడం కోసం ఆర్యులు తమ భార్యలను దేవవర్గానికి చెందిన పురుషులతో లైంగిక సంబంధం పెట్టుకోవడాన్ని ప్రోత్సహించేవారు. ఈ ఆచారం ఎంత విస్తృతంగా సాగుతూండేదంటే–ఆర్య స్త్రీలను వివాహానికి ముందుగా అనుభవించడం దేవతలు తమ చిరానుభవ హక్కుగా భావించే

వారు. దేవతలు ఈ హక్కు నుంచి తాము విముక్తి పొందే పర్యంతం, అసలు ఆర్య స్త్రీలకు వివాహాలు జరిగేవి కావు. ఆ ప్రక్రియను 'అవధానం' అనేవారు. ప్రతి హిందూ వివాహంలోనూ 'లజహోమం' చేస్తూ వుంటారు. అశ్వలాయనుని గృహ్య సూత్రాల్లో ఈ లజహోమం గురించి చాలా వివరంగా చెప్పడం జరిగింది. ఇది దేవతల లైంగిక పట్టు నుంచీ, హక్కు నుంచీ ఆర్య స్త్రీలు విముక్తి పొందడానికి సంబంధించిన చర్య యొక్క అవశేషం. ఈ అవధానం మరేమీ కాదు. వధువుపై దేవతలకి తాజాగా వెలకట్టి, దాన్ని వారికి సమర్పించుకోవడం. హిందూ వివాహాల్లో నిర్వహించే 'సప్తపది'ని ప్రధానమయిన కర్మకాండగా గుర్తిస్తారు ఆర్యులు. ఇది చెయ్యకుండా ఆ వివాహం న్యాయసమ్మతమైనది అనిపించుకోదు. కారణం–ఈ ప్రక్రియ ద్వారా ఆర్య స్త్రీలపై దేవతలకి వున్న లైంగిక హక్కుని పరిసమాప్తి చేయడం జరుగుతుంది. సప్తపది అంటే వధువుతో కలిసి వరుడు ఏడడుగులు వేయడం. ఇంతకీ వివాహంలో దీని అవసరం ఏమొచ్చింది? వివాహంలో తమకి సమర్పించే నష్ట పరిహారం వల్ల ఒకవేళ తాము సంతృప్తి చెందకపోతే, దేవతలు వధూవరులు ఏడో అడుగు వేసేలోగానే పెళ్లికూతురుపై తమ హక్కును పునరుద్ధరించుకోవచ్చు. ఇది దీని అంతరార్థం. ఏడో అడుగువేసిన తర్వాత దేవతలకు ఆమెపై గల హక్కు పరిసమాప్తమవుతుంది. తర్వాత వరుడు వధువుని తనతో తీసుకువెళ్లి, ఆమెతో చక్కగా కాపురం చేసుకోవచ్చు. ఆతర్వాత దేవతలు ఆ కాపురంలో విఘాతం కలిగించడం గానీ, ఆ భార్యపై అత్యాచారం జరుపడం గానీ చేయరాదు.

కన్యలకి శీలం, పవిత్రత వుండాలనే నియమం ఎక్కడా లేదు. ఎలాంటి వివాహ సంబంధమూ లేకుండా కూడా కన్య ఎవరితోనైనా శరీర సంబంధం పెట్టుకోవచ్చు; అలాగే ఆ వ్యక్తితో ఆమె పిల్లల్ని కూడా కనవచ్చు. దీనికి ఆధారం 'కన్య' అనే పదమే. 'కామ్' అనే మూలపదం నుంచి 'కన్య' అనే పదం వచ్చింది. కన్య అంటే యధేచ్ఛగా ఏ మగాడికైనా తనని తాను సమర్పించుకొనేది అని. వారు సక్రమమయిన వివాహం అవసరం లేకుండా తముని తాము ఏ పురుషునికైనా అర్పించుకొని, పిల్లల్ని కనవచ్చు. కుంతి, మత్స్యగంధుల గాథలు ఇందుకు ఉదాహరణలు. పాండు రాజుతో వివాహానికి ముందుగానే కుంతికి వివిధ పురుషుల నుంచి సంతానం కలిగింది. భీష్ముని తండ్రి శంతనునితో పెళ్లి కాకముందే మత్స్య గంధి పరాశరునితో శరీర సంబంధం పెట్టుకుంది.

ఆర్యుల్లో పశు ప్రవృత్తి ప్రబలంగానే వుండేది. దాముడనే ఋషి ఆడలేడితో[17] శరీర సుఖం అనుభవించడం కథగా ప్రసిద్ధం. సూర్యుడు ఆడ గుర్రంతో మదనకేళి జరపడమూ మనకు తెలిసిందే.[18] అన్నిటికన్నా వికృతమైనది అశ్వమేధయాగంలో పట్టపురాణితో మగ గుర్రం చేసే లైంగిక క్రియ.

ఆర్యుల మత విధానంలో యజ్ఞం లేక బలిహోమం ఒక భాగం. ఈ యజ్ఞయాగాదుల ప్రయోజనం దేవతల దృష్టిలో ప్రవేశించడానికే కాకుండా, దేవతలను తమ కనుసన్నల్లో వుంచుకోవడానికి ఒక మార్గం. సాంప్రదాయకంగా యజ్ఞాలు మొత్తం ఇరవై ఒక్కటి. వాటిని

మళ్లీ మూడు వర్గాలుగా, ఒక్కో వర్గం క్రింద ఏడేసి యజ్ఞాలు చొప్పున విభజించుకోవచ్చు. మొదటి వర్గం యజ్ఞాల్లో వెన్న, పాలు, ధాన్యం; రెండో వర్గం యజ్ఞాల్లో సోమరసం, మూడో వర్గం యజ్ఞాల్లో పశువులను బలి యిస్తారు. మళ్లీ యజ్ఞం రెండేసి రకాలుగా వుంటుంది. ఒకటి: తక్కువ కాల వ్యవధిలో చేసేది; రెండోది ఏడాదిపాటో, యింకా ఎక్కువ కాలంపాటో చేసేది. రెండోదాన్ని 'సత్రా' అని పిలుస్తారు. ఈ యజ్ఞం చేసేవాడు శాశ్వతంగా పుణ్యాన్ని పొందుతాడని ఒక వాదం వుంది. ఈ యజ్ఞం చేయడం వల్ల వ్యక్తి స్వత్వమే కాదు, పితృదేవతలు సయితం ప్రయోజనం పొందుతారు. ఈ యజ్ఞంలో సమర్పించే హవ్యకవ్యాల వల్ల పితృదేవతలు సంతోషించడమే గాకుండా, వారి భూవసతి పెరిగి, వారిని ఉత్తమ లోకాలకి పంపడం జరుగుతుంది.[19]

ఈ యజ్ఞం చేయడం వల్ల ప్రయోజనం కేవలం స్వర్గసుఖం ప్రాప్తించడం మాత్రమే కాదు, గొప్ప యజ్ఞాల్లో ఎక్కువ భాగం ఈ భూమ్మీదే మంచి ఫలితాల్ని పొందడం కోసం, అంతిమ ఫలం పొందకుండానే యజ్ఞం చేయాలనడం వూహాకందని విషయం. బ్రాహ్మణీయ భారతదేశానికి కృతజ్ఞతలు చెప్పుకొనే అలవాటు లేదు. సాధారణంగా ఏ లబ్ధిని ఆశించి, దేవత్వాన్ని ఉద్దేశించి యజ్ఞం చేస్తారో, ఆ లబ్ధే యజ్ఞపరిహార బహుమతి. యజ్ఞం యీ దిగువ మాటలతో ప్రారంభమవుతుంది. "తాను యీ శ్లోకంతో దేవునికి యజ్ఞం చేస్తున్నాడు: 'నీవు నాకు యిస్తే, (అప్పుడు) నేను నీకు సమర్పిస్తాను; నీవు నాకు ప్రసాదిస్తే, నేను నీకు ప్రసాదిస్తాను."

యజ్ఞ తంతంతా భక్తిపూరిత భయప్రేరకం. అందులో ఉచ్చరించే ప్రతి పదంలోనూ పర్యవసానం నుంచి రాబోయే ఫలితం వుట్టిపడుతుంది. అంతేకాదు. మాటల వుచ్చారణ లేక స్వరం సయితం విధి వశమయినది. యజ్ఞ తంతులో ఎక్కువ భాగం కేవలం 'హూ! యాయా మంత్రకాళీ!' వంటిదేగాని, ప్రాముఖ్యత వున్నదని చెబుతున్నట్టుగా ఏమీ కాదన్న విషయం యజ్ఞం నిర్వహించే పురోహితులకి తెలుసన్న స్పష్టమయిన సూచనలున్నాయి.

చేయించే ప్రతి యజ్ఞానికీ పురోహితునికి సంభావన లభిస్తుంది. సంభావనకి సంబంధించి నిబంధనలు చాలా ఖచ్చితంగా వుంటాయి. వాటిని యజ్ఞం చేసేవాని ముందు పెట్టేవారు సయితం నిస్సిగ్గుగానే వ్యవహరిస్తారు. పురోహితుడు యజ్ఞాన్ని సంభావన కోసమే చేయిస్తాడు. ఆ సంభావనలో తనకి ఏమేమే లభించాలో చాలా జాగ్రత్తగానే రూపొందిస్తాడు. విలువయిన హారాలూ, ఆవులూ, గుర్రాలూ లేక బంగారం–ఇవీ సంభావనలో భాగంగా వుంటాయి. యజ్ఞం రూపాన్ని పురోహితులు చాలా పకడ్బందీగానే రూపొందిస్తారు. యజ్ఞం తంతు జరిగే క్రమంలో ప్రతి సందర్భలోనూ ఏ సంభావన ఎంత కావాలో అడిగి తీసుకుంటారు పురోహితులు. ఎవరి ప్రయోజనం కోసమయితే ఈ యజ్ఞం జరుగుతుందో, అతనికి యీ యజ్ఞం ఖర్చు తలకి మించిన బరువే అవుతుంది. ఈ యజ్ఞం ఎంత ఎక్కువ ఖర్చుతో కూడుకున్నదో చెప్పడానికి ఒక ఉదాహరణ యిస్తాను. ఒక సందర్భంలో యజ్ఞం సంభావన వెయ్యి ఆవులని చెప్పారు. ఈ పేరాసతో, పురోహితుడెంత వరకూ వెళ్తాడంటే, తనకి వెయ్యి అవులు సంభావనగా యిచ్చి

వందువల్ల యజ్ఞకర్త స్వర్గంలో సుఖాలన్నీ పొందుతాడని ఘోషిస్తాడు. తమ యిరుగుపొరుగు స్వర్లోక దేవుళ్లకి చేసిన సహాయానికి దేవుళ్ళు ప్రతిఫలాన్ని కోరతారని ప్రతి కథలోనూ చెప్పే పురోహితునికి కూడా ఆ పని చేయడానికి హక్కుంది గదా.

యజ్ఞంలో ప్రధానంగా యిచ్చేది జంతు బలి. అది ఖర్చుతో కూడుకున్నదే గాకుండా ఆటవికమయినది కూడా. ఆర్యుల మతంలో యజ్ఞబలులు యివ్వడానికి ఐదు రకాల పేర్లు చెప్పారు. ఆ జాబితాలో మనిషి మొట్టమొదటివాడు. నరబలి అన్నిటికన్నా ఎక్కువ ఖర్చుతో కూడుకున్నది. ఈ బలికి సంబంధించిన నిబంధనేమిటంటే–యజ్ఞంలో సంహరించాల్సిన వ్యక్తి పురోహితుడు గానీ, బానిసగానీ కారాదు. అతను విధిగా క్షత్రియుడో, వైశ్యుడో అయి వుండాలి. ఆ కాలాన్ననుసరించి యజ్ఞంలో బలి యిచ్చే మనిషికి కట్టిన ఖరీదు వెయ్యి ఆవులు. వెయ్యి ఆవులిచ్చి ఆ మనిషిని కొనాలి. ఈ నరమేధం ఎక్కువ ఖర్చుతో కూడుకున్నదీ, అనాగరికమయినదే కాకుండా, (రాజ్యంలో ప్రజలు) తిరుగుబాటు చేసే అవకాశం కూడా వుంది. ఎందుకంటే–నరబలి యిచ్చేవారు యజ్ఞంలో భాగంగా తాను అతణ్ణి చంపడమే కాకుండా, ఆ చంపిన వాని మాంసం కూడా తినాలి. మనిషి తర్వాత రెండో ప్రాధాన్యం గుర్రంది. ఇది కూడా ఖరీదయిన యజ్ఞమే. కారణం–భారతదేశాన్ని జయించడానికి ఆర్యులకు గుర్రాల ఆవశ్యకత ఎంతయినా వుంది. అందువల్ల గుర్రం అరుదయిన జంతువే కాకుండా, ఎంతో అవసరమయినది కూడా. పైగా, సైనిక ప్రాధాన్యం గల శక్తివంతమయిన జంతువుని యజ్ఞ బలి పశువుగా వుపయోగించడానికి ఆర్యులుయిష్టపడరు. యిందులోనూ తిరుగుబాటు చేయడానికి ఆస్కారమున్న అంశం ఒకటి వుంది. అశ్వాన్ని యజ్ఞంలో బలి యిచ్చే ముందు, ఆ గుర్రం, యజ్ఞం చేసే వ్యక్తి భార్యతో సంభోగం చేయడం ఒక నియమం.

ఇహ యజ్ఞంలో సాధారణంగా బలి యిచ్చేవి పశువులు. వీటిని ప్రజలు వ్యవసాయపు పనిలో వుపయోగిస్తూ వుంటారు. అవి ప్రధానంగా ఆవులూ, ఎద్దులూను.

యజ్ఞాలు ఖర్చుతో కూడుకున్నవి. వాటిని నిర్వహించడానికి అయ్యే ఖర్చును దృష్టిలో వుంచుకుంటే, అవి ఏనాడో మూతబడేవి. కాని అలా జరగలేదు. దానికి కారణం–యజ్ఞాలు చేయడం పూర్తిగా మానెయ్యడమంటే అర్థం, బ్రాహ్మణునికి సంభావన లభించే మార్గం మూసుకుపోవడమే. అది బ్రాహ్మణునికి నష్టమే కదా! యజ్ఞం ఆపేస్తే, బ్రాహ్మణునికి యజ్ఞ సంభావన దొరకదు. అతను ఆకలితో అలమటిస్తాడు. అందువల్ల ఖరీదయిన యజ్ఞ పశువులకి ప్రత్యామ్నాయాన్ని బ్రాహ్మణులు ఆలోచించారు. నరమేధంలో బ్రాహ్మణులు మనిషిని బలి పెట్టడానికి బదులుగా ఎండుగడ్డి, లోహం, మట్టితో చేసిన మనిషి బొమ్మ దేన్నయినా వుపయోగించవచ్చునని సవరణని పెట్టారు. అంతేగాని, నరమేధాన్ని పూర్తిగా ఎత్తివేయలేదు వారు. కారణం–వారికి వచ్చే యజ్ఞ సంభావన పోతుంది గనుక. ఎప్పుడో గాని నరమేధం చేస్తూ వుండటం వల్ల, దానికి ప్రత్యామ్నాయంగా యజ్ఞంలో జంతుబలి ముందుకొచ్చింది. జన సామాన్యానికి జంతుబలి కూడా ఖర్చుతో కూడుకున్నదే. ఇక్కడ కూడా జంతుబలితో కూడిన యజ్ఞాన్ని ఆపివేయడానికి

బ్రాహ్మణులు పాడి పశువులకు బదులుగా చిన్నచిన్న జంతువులను సూచించారు. మనిషి, గుర్రం తర్వాత పాడి పశువులే ప్రాధాన్యాన్ని సంతరించుకోవడం వల్లనే ఈ సూచన. అంతేకాదు- ఈ ప్రతిపాదనలన్నీ యజ్ఞాన్ని కొనసాగించడం కోసం, తద్వారా బ్రాహ్మణుడు యజ్ఞ సంభావన పొందడం కోసం. ఆ సంభావన అతనికి బతుకు తెరువుకి మార్గం గనుక. యజ్ఞాలను కొనసాగించేందుకు మార్గాన్ని సుగమం చేసి, యజ్ఞంలో కేవలం అన్నం సమర్పించడానికి కూడా బ్రాహ్మణులు అంగీకరించారు.

ఆర్యుల యజ్ఞాల్లో ప్రత్యామ్నాయాలను అమలుచేసి, యజ్ఞం తక్కువ భీతి గొల్పేదిగా తయారు చేయబడిందని ఎవరూ వూహించరాదు. ప్రత్యామ్నాయాలను ప్రవేశపెట్టడం వల్ల ఎక్కువ ఖరీదు, ఎక్కువ పైశాచికమయిన వాటికి బదులుగా తక్కువ ఖరీదు, సాధు జంతువుల బలి ఏర్పాటయిందని అనుకోరాదు. జరిగిందంతా ఏమిటంటే-యజ్ఞకర్త శక్తి సామర్థ్యాల మేరకు యజ్ఞంలో దేవతలకు సమర్పించేవి మారాయి. యజ్ఞకర్త పేదవాడయితే అతను యజ్ఞంలో సమర్పించేది వండిన అన్నమే. అదే అతను ధనికుడయితే ఆ సమర్పించేవి మనిషి, గుర్రం, ఆవు, లేక ఎద్దు–ఏదైనాను. ప్రత్యామ్నాయ పద్ధతి వల్ల ప్రయోజనం ఏమిటంటే-యజ్ఞం చేయడం అందరికీ, అన్నివర్గాల వారికీ అందుబాటులోకి వచ్చింది. తద్వారా బ్రాహ్మణులు ఎక్కువ ప్రయోజనం పొందడానికి వుపయోగింపబడింది. ఇంత జరిగినా యజ్ఞ పశువుని చంపే పద్ధతికి చరమగీతం పాడటం జరగలేదు. వాస్తవానికి యజ్ఞంలో జంతు బలులు వేలాది యజ్ఞకర్తలు చేస్తూనే వచ్చారు.

యజ్ఞం క్రమంగా పశువుల మారణహోమంగా తయారయింది. యిందులో కసాయివాని పాత్ర బ్రాహ్మణుడు నిర్వర్తించేవాడు. బౌద్ధవాఙ్మయంలో ఎదురయ్యే యజ్ఞాలకు సంబంధించిన ఉల్లేఖలను బట్టి అమాయక జంతువుల వధ ఏ స్థాయిలో జరిగేదీ మనకి ఒక అవగాహన కలుగుతుంది. 'సుత్తానిపత్' అనే బౌద్ధ గ్రంథంలో కోసలరాజు పసేనది నిర్వహించిన యజ్ఞం గురించిన వివరం వుంది. యజ్ఞవేదిక దగ్గర ఐదు వందలు దుక్కిటెద్దులూ, ఐదు వందల వృషభాలూ, ఐదు వందలు ఆవులూ, ఐదు వందలు గొర్రె పిల్లలూ, ఐదు వందలు మేకలూ గుంజలకి కట్టేసి వున్నాయి. యజ్ఞవేదిక దగ్గర పని పురమాయించిన రాజభటులూ, సేవకులూ యజ్ఞం చేయిస్తున్న బ్రాహ్మణ పురోహితుల ఆదేశాల ప్రకారం కళ్ళలో నీళ్ళు కుక్కుకుంటూ తమకి చెప్పిన పనిని చేస్తూ పోతున్నారు.

యజ్ఞం చేయడంలో భయంకరమయిన మారణహోమం, రక్తపాతమూ వుంటాయి. వాటితో పాటుగా అదొక ఆనందోత్సవం కూడాను. వేపుడు మాంసంతో పాటు రకరకాల మద్యాలు. బ్రాహ్మణులకు సోమంతో పాటు సుర కూడా. మిగతా వారికి కావలసినంత సురాపానీయం. ప్రతి యజ్ఞంలోనూ విధిగా జూదం వుండాల్సిందేను. అన్నిటికన్నా అసాధారణమయిన విషయం ఏమిటంటే–జూదంతో పాటు పక్కపక్కనే బాహాటంగా రతికేళి జరపడం. యజ్ఞం ఒక విధంగా వ్యభిచారానికి ఆటపట్టయింది. అందులో మత అంశమేదీ మిగలలేదు.

ఆర్యుల మత విధానంలో పాటించాల్సిన విధి పరంపర ఎంతో వుంది. అయితే ఈ విధుల ఆంతర్యం వుత్తమమయిన, వాస్తవ జీవితాన్ని పొందాలనే తపన ఎంతమాత్రమూ కాదు. ధర్మం గురించిన ఆరాటం అంతకన్నా లేదు. వారి మతంలో ఎటువంటి ఆధ్యాత్మిక అంశమూ లేదు. వేయేల–ఋగ్వేద సూక్తాలను తీసుకున్నా–ఆర్యుల మతంలో ధార్మిక ప్రాతిపదిక లోపించడం మనం స్పష్టంగా చూస్తాం. ఆర్యులు తమ దేవుళ్ళని ఉద్దేశించి చేసిన ప్రార్థనలు సూక్తాలు. ఆ సూక్తాల్లో దేవుళ్ళని ఏం అడుగుతారు ఆర్యులు? చెడు ఆకర్షణల నుంచి తమని తప్పించమని కోరుతారా? లేక దుర్బుద్ధి నుంచి తమకి విమోచనం ప్రసాదించమని దేవుణ్ణి ప్రార్థిస్తారా? పాపాలను క్షమించమని అడుగుతారా? ఋగ్వేదంలోని అధిక భాగం సూక్తాలు ఇంద్రుణ్ణి ప్రశంపిస్తూ చెప్పినవి. తమ శత్రువుల్ని నాశనం చేసినందుకు ఆర్యులు ఇంద్రుణ్ణి ప్రశంపించారు. అసురుడయిన కృష్ణుని (భగవద్గీత కృష్ణుడు కాదు) గర్భిణీ భార్యలందర్నీ చంపివేసినందుకు ఇంద్రుణ్ణి పొగిడారు. అసురుల వందలాది గ్రామాలను సర్వనాశనం చేసినందుకు, వారు ఇంద్రుణ్ణి పొగిడారు. లక్షల సంఖ్యలో దస్యుల్ని వూచకోత కోసినందుకు ఇంద్రుణ్ణి వారు మెచ్చుకున్నారు. అనార్యుల ఆహార పదార్థాలనూ, వారి సిరిసంపద తాము అనుభవించడం కోసం అనార్యుల్ని సర్వనాశనం చేసెయ్యమని వారు ఇంద్రుణ్ణి ప్రార్థించారు. వాటిలో ధార్మిక, ఉన్నత స్థాయి భావాలు వుండకపోవడం అటుంచండి. ఋగ్వేద సూక్తాలలో దుష్టభావాలూ, దుర్మార్గ ప్రయోజనాలు నిండి వున్నాయి. ఆర్యుల మతం ఎన్నడూ సదాచార జీవితం గురించి పట్టించుకున్న దాఖలాలు లేవు.

# II

ఇవీ బుద్ధుడు పుట్టేనాటి ఆర్యుల సమాజ స్థితిగతులు. ఆర్యుల సమాజాన్ని మార్చ డానికి శ్రమించడంలో సంఘ సంస్కర్తగా బుద్ధునికి సంబంధించి రెండు ప్రాసంగిక ప్రశ్నలు ఉదయిస్తాయి. ఒకటి–బుద్ధున్ని సంఘ సంస్కరణలో ప్రధాన లక్ష్యాలేమిటి? రెండు–సంఘ సంస్కరణోద్యమంలో ఆయన ఏమేరకు విజయం సాధించాడు?

మొదటి ప్రశ్ననే తీసుకుందాం.

ప్రజలచేత వుత్తమమయిన, పరిశుద్ధమయిన జీవితాన్ని ఆచరింపజేయడానికి, కేవలం ఉపదేశం యివ్వడమే సరిపోదనీ, ఆ విధమయిన జీవితాన్ని తాను ఆచరించి చూపడమే వుత్తమ మని బుద్ధుడు భావించాడు. అందువల్ల ఆయన చేసిన అతి ముఖ్యమైన పని ఏమిటంటే–తాను ఆ జీవితాన్ని గడిపి, దాన్ని అందరికీ ఒక నమూనాగా వుపయోగపడేలా చేశాడు. 'బ్రహ్మజల సుత్త' చదివితే, ఆయన గడిపిన నిష్కళంకమైన జీవితం ఎంతటిదో మనకి అర్థమవుతుంది. యీ కింద యిస్తున్న సూత్రంలో బుద్ధుడు గడిపిన పరిశుద్ధ జీవితంతో పాటు, ఆర్యుల్లో అత్యుత్తములయిన బ్రాహ్మణులు ఎంతటి భ్రష్టుపట్టిన జీవితం గడిపిందీ మనకి తెలుస్తుంది:

## 'బ్రహ్మ జలసుత్త'

1. ఈ విధంగా నేను విన్నాను. ఒకనాడు భగవానుడు రాజగృహం, నలందాల మధ్య వున్న రాజమార్గంలో సుమారు ఐదు వందల మంది బౌద్ధ భిక్షువులతో కలిసి బయలుదేరాడు. అదే మార్గం వెంట సుప్పియ అనే సన్యాసి, తన యువ శిష్యుడు బ్రహ్మదత్తునితో కలిసి అదే మార్గం వెంట వెళ్తున్నాడు. సుప్పియ ఎన్నో విధాలుగా బుద్ధుణ్నీ, బౌద్ధ ధర్మాన్నీ, బౌద్ధ సంఘాన్నీ నిందిస్తూ మాట్లాడాడు. అయితే అతని శిష్యుడు బ్రహ్మదత్తుడు మాత్రం బుద్ధుణ్నీ, ధర్మాన్నీ, సంఘాన్నీ ప్రశంసిస్తూ పరిపరి విధాల మాట్లాడాడు. ఈ విధంగా ఆ గురుశిష్యులిద్దరి మధ్యా అభిప్రాయాలు వైరుధ్యపూరితంగా వుంటూ, ఒక దాన్నొకటి విబేధిస్తున్నాయి. బుద్ధుడూ, అతని అనుచరగణం ముందు సాగిపోతుంటే, ఆ గురుశిష్యులిద్దరూ వారిని అనుసరించారు.

2. భగవానుడూ, ఆయన అనుచర భిక్షుగణమూ ఆ రాత్రికి అంబలత్థికలోని రాజ విశ్రాంతి గృహంలో విడిది చేశారు. అదేవిధంగా సన్యాసి సుప్పియా, ఆయన శిష్యుడు బ్రహ్మదత్తుడూ అదే విశ్రాంతి గృహంలో విశ్రమించారు. ఇహ అక్కడ సయితం వీరిద్దరూ (సుప్పియా, బ్రహ్మదత్తుడూ) గతంలాగే అదే చర్యను మళ్లీ కొనసాగించారు.

3. తెల్లవారుతూండగా నిద్రలేచిన బౌద్ధ భిక్షువులు చాలామంది మండపంలో జమయ్యారు. వారి మధ్య సంభాషణ యిలా జరిగింది: "ఎంత అద్భుతమైన విషయం యిది, సోదరులారా!

ఎంత వింత! అన్నీ తెలిసిన, దర్శిస్తున్న భగవానుడు, అర్హతుడు, బుద్ధుడు, అత్యుత్తముడు–మనుష్యుల అభిప్రాయాలు ఎన్ని రకాలుగా వున్నాయో చాలా స్పష్టంగా అర్థం చేసుకొని వుంటాడు! చూశారా? సన్యాసి సుప్పియ ఎన్నెన్ని విధాలుగా బుద్ధుణ్నీ, ధర్మాన్నీ, సంఘాన్నీ నిందించిందీ, ఆయన శిష్యుడు బ్రహ్మదత్తుడు వారినీ, వాటినీ ఏ విధంగా పరిపరివిధాల ప్రశంసిస్తూ మాట్లాడిందీ చూశారు గదా! ఈ విధంగా గురుశిష్యులయిన వారిద్దరి మధ్యా అభిప్రాయాలు ఒకదాన్నొకటి విభేదించుకొంటూ, వైరుధ్యపూరితంగా వున్నాయి. భగవానుణ్నీ, ఆయన భిక్షుగణాన్నీ అనుసరిస్తూ, వారిద్దరూ ఒక్కొక్క అడుగే ముందుకు సాగారు."

4. ఇహ ఇప్పుడు సుప్పియ, బ్రహ్మదత్తుల వాదవివాదాల్లోని వైరుధ్యాన్ని గుర్తించిన భగవానుడు మండపంలోకి వెళ్లి, తన కోసం నేలమీద పరచి వుంచిన చాపమీద సుఖాసీనుడయ్యాడు. అలా కూచున్నాక, ఆయనిలా అడిగాడు–"ఇక్కడ కూచుని మీరు మాట్లాడుతున్నదేమిటి? మీ ఇద్దరి మధ్యా సాగుతున్న సంభాషణ ఏ అంశం మీద?" అని. ఆయనకి వారంతా వివరం చెప్పారు. ఆయన మళ్ళీ యిలా అన్నాడు.

5. "సోదరులారా! ఇతరులు నా గురించి గానీ, ధర్మం గురించి గానీ, సంఘం గురించి గానీ వ్యతిరేకంగా మాట్లాడదలచినపుడు, దీని మూలంగా మీ ఇద్దరి మనసుల్లోనూ ద్వేషం చెలరేగడం గానీ, ఒళ్ళు మండటం గానీ, మీలో మీకు అయిష్టం కలగడం గానీ జరుగరాదు. మీరు, యీ కారణంగా క్రోధంతో మానసికంగా గాయపడితే, అది మీరు ఆత్మని జయించే మార్గంలో ఒక అడ్డంకిగా నిలుస్తుంది. మనకి ఇతరులు వ్యతిరేకంగానే మాట్లాడారనుకోండి. వారి మాటలకి మీరు, మండిపడి అసహ్యించుకున్నారనుకోండి. అప్పుడు వారి సంభాషణ ఏమేరకు సరిగ్గా సాగిందీ లేనిదీ మీరెలా నిర్ణయిస్తారు?"

"అది అలాకాదు, ప్రభూ."

"కానీ, ఇతరులు నన్ను నిందిస్తూ మాట్లాడినా, అదే విధంగా ధర్మం గురించీ, సంఘం గురించీ మాట్లాడినా, అతను మాట్లాడిన ప్రతి మాటా ఎలా అసత్యమో విడదీసి చూపించి, అది ఎంత తప్పో నిర్ధారించి యిలా చెప్పాలి. "ఈ కారణం వల్లగానీ, ఆ హేతువు వల్లగానీ ఇది వాస్తవం కాదు. అది అలాకాదు. అలాంటిది మాలో కనిపించదు. అది మాలో లేదు ఇలా."

6. "కానీ అదే సందర్భంలో, సోదరులారా! ఇతరులు నన్ను ప్రశంసిస్తూ మాట్లాడినా, ధర్మం గురించీ, సంఘం గురించీ ప్రశంసిస్తూ, మాట్లాడినా అందుకోసం మీరు సంతోషపడిపోరాదు. ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయిపోరాదు. వూహల్లో తేలిపోరాదు. మీరలా ప్రవర్తిస్తే, అది కూడా ఆత్మని జయించడానికి అది మీకు ఒక అడ్డంకి అవుతుంది. ఇతరులు నన్నూ, ధర్మాన్నీ, సంఘాన్నీ పొగుడుతూ మాట్లాడినపుడు, ఏది వాస్తవంగా సరైనదో మీరు అంగీకరిస్తూ, యిలా చెప్పాలి: 'ఈ కారణం వల్ల, లేక ఆ కారణం వల్ల ఇది యదార్థం. అది అవును. అలాంటి

అంశం మాలో వుంది. అది మాలో వుంది."

7. మతం మార్చుకోని వ్యక్తి, తథాగతుణ్ణి ప్రశంసిస్తున్నపుడు, అల్ప విషయాలను గురించీ, తక్కువ విలువగల అంశాలను గురించీ, కేవలం నైతిక ప్రవర్తన గురించీ మాట్లాడుతాడు. అతను పొగిడే అల్ప విషయాలూ, విలువ తక్కువ గల అంశాలూ, కేవలం నైతిక ప్రవర్తనా ఏమిటి?

(4) (నైతిక ప్రవర్తనలు, ఒకటవ భాగం)

8. "జీవరాశులను చంపడం ఆపేసి సన్యాసి గౌతముడు జీవితాన్ని నాశనం చేయాలనే ఆలోచన నుంచి విరమించుకున్నాడు. దుడ్డు కర్రనూ, కత్తినీ పక్కని పడేశాడు. అస్త్రసన్యాసం చేశాడు. తనలోని కరుకుతనానికి సిగ్గుపడ్డాడు. గుండెనిండా కరుణనీ, దయనీ నింపుకున్నాడు. కరుణా మయుడుగా మారిపోయి, అన్ని ప్రాణుల ఎడల దయ చూపించాడు." మతం మార్చుకోని వ్యక్తి తథాగతుణ్ణి మెచ్చుకొనే తీరు యిది.

లేక అతనిలా మాట్లాడతాడు: "తాను యివ్వనిదాన్ని తాను తీసుకోవడం మాని, సన్యాసి గౌతముడు తనది కానిదాన్ని పరిగ్రహించకుండా దూరంగా వున్నాడు. తాను యిచ్చిన వాటిని మాత్రమే ఆయన తీసుకుంటూ, కానుకల కోసం ఎదురుచూస్తూ, తన జీవితాన్ని అతను నిజాయితీతో, హృదయ నైర్మల్యంతో గడిపాడు."

లేదా అతనిలా చెప్పినా చెప్పవచ్చు:

"అపరిశుద్ధతను పక్కకి నెట్టేసి, సన్యాసి అయిన గౌతముడు నేడు సచ్ఛీలుడు. అతను నీచమైన దురభ్యాసానికి–సంభోగ క్రియకి దూరంగా... చాలా దూరంగా వున్నాడు."

9. లేక యిలా కూడా చెప్పవచ్చు: "అబద్ధం మాటల్ని పక్కన పెట్టేసి, సన్యాసి అయిన గౌతముడు అసత్యం నుంచి దూరంగా వున్నాడు. ఎన్నడూ తోవ తప్పని, విశ్వాసపాత్రమయిన, నమ్మదగిన సత్యం నుంచి అతను సత్యం మాట్లాడాడు. అతను ప్రపంచానికిచ్చిన మాట తప్పలేదు."

లేక యిలా కూడా చెప్పవచ్చు: "దూషించడం మానేసి, సన్యాసి అయిన గౌతముడు దూషణకీ, అపవాదులకూ దూరంగా జీవించాడు. ఇక్కడ విన్న విషయాన్ని మరొకచోట చెప్పే వాడు కాదు. అలా చేస్తే యిక్కడివాళ్ళతో అనవసరంగా తగువు వస్తుంది; మరొకచోట విన్నదాన్ని యిక్కడ చెప్పేవాడు కాదు–అక్కడి వాళ్లతో జగడం రాకుండా వుండేందుకు గాను. ఆవిధంగా అతను విడిపోయిన వారిని ఒక తాటిమీదకి తెచ్చే సంధాతగా, మిత్రుల్ని ప్రోత్సహించేవాడుగా,

శాంతిదూతగా, శాంతిప్రియునిగా, శాంతికోసం తహతహలాడేవాడుగా, శాంతికి దోహదపడే వక్తగా జీవించేవాడు."

లేక యిలా కూడా అని వుంటాడు. "మాటల్లో మొరటుతనాన్ని త్యజించి, సన్యాసి అయిన గౌతముడు పరుషమైన భాష వాడకుండా, దానికి దూరంగా బతికేడు. అనింద్యమయిన, వినసొంపయిన, ముద్దొచ్చే, హృదయాన్ని హత్తుకొనే, నాగరికమయిన, ప్రజలకి అహ్లాదం కలిగించే ఆత్మీయమయిన మాటలనే అతను మాట్లాడేవాడు."

లేక అతనిలా చెప్పి వుంటాడు. "నిస్సారమయిన మాటల్ని పక్కకి నెట్టేసి, సన్యాసి అయిన గౌతముడు తుచ్ఛమయిన సంభాషణలకు దూరంగా వున్నాడు. సకాలంలో అతను వాస్తవాల ఆధారంగా, అర్థవంతంగా మతం గురించీ, సంఘ క్రమశిక్షణ గురించీ మాట్లాడుతాడు. సరైన సమయంలో మనసులో బొమ్మ కట్టించే రీతిలో, స్పష్టంగా నిర్దేశించుకొని, విషయానికి కట్టుబడి, గుండెల్లో పదిలపరుచుకొనే విధంగా అతను మాట్లాడుతాడు."

10. లేక అతను యిలా కూడా చెప్పి వుంటాడు: "సన్యాసి అయిన గౌతముడు విత్తనాలకీ, చెట్లకీ హాని కలిగించని విధంగా జాగ్రత్తపడ్డాడు.

అతను రోజుకి ఒకే పూట భోజనం చేస్తాడు. రాత్రికి భుజించడు. కాలం గడచిపోయేక (మధ్యాహ్నం తర్వాత) అతను అన్నం తినడం మానివేశాడు.

తిరునాళ్లలో ప్రదర్శించే వేశ్యల నృత్యాలనూ, గానాన్నీ, సంగీతాన్నీ కనడానికీ, వినడానికీ, ప్రేక్షకునిగా అతను వెళ్ళడు.

అతను దండలు వేసుకోడు. సెంట్లు పూసుకోడు. లేపనాలు రాసుకోడు.

అతను పొడువైన, ఉన్నతమైన పడకల్ని వుపయోగించడు.

అతను వెండినీ, బంగారాన్నీ స్వీకరించడు.

అతను వండని వంటని స్వీకరించడు.

అతను పచ్చి మాంసం స్వీకరించడం లేదు.

అతను స్త్రీలనూ, బాలికల్నీ స్వీకరించడం లేదు.

అతను వెట్టి స్త్రీ పురుషుల్ని స్వీకరించడం లేదు.

అతను గొర్రెల్నీ, మేకల్నీ స్వీకరించడం లేదు.

అతను కోళ్ళనీ, పందుల్నీ గ్రహించడం లేదు.

అతను ఏనుగుల్నీ, గొడ్లనీ, ఆడ మగ గుర్రాల్నీ గ్రహించడం లేదు.

అతను పంట చేలనీ, బంజరు భూముల్నీ గ్రహించడం లేదు.

అతను మధ్యవర్తిగా, లేక సందేహవాహకునిగా వ్యవహరించడం లేదు.

అతను (వస్తువుల్ని) అమ్మడం గానీ, కొనడం గానీ చేయడం లేదు.

అతను కొలతల, కంచు తూకాలలో మోసం చేయడు.

కుటిల మార్గాల్లో లంచాలు చేపట్టడం, మోసం చెయ్యడం, దగా చేయడం అతనికి అలవాటు లేదు.

ఒక మనిషిని గాయపర్చడం, హత్యలు చేయడం, వెట్టి చేయించడం, దారి దోపిడీ చేయడం, బందిపోటుతనం, హింసించడం అతను చేయడు.

"ఇలాంటి విషయాలే, సోదరులారా! మతం మార్చుకోని వ్యక్తి తథాగతుణ్ణి గురించి ప్రశంసిస్తూ మాట్లాడి వుంటాడు."

* * *

'కులశీల' (నడవడికకి సంబంధించి చిన్న చిన్న పేరాలు) ఇక్కడితో సమాప్తి.

* * *

11. లేక అతనిలా చెబుతాడు: "విశ్వాసపాత్రులు సమర్పించే ఆహారం మీద బతుకుతున్న కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ నిలువచేసిన పదార్థాలను వుపయోగించే దురలవాటుకి అలవాటుపడ్డారు. అవి–వస్తువులూ, భోజన పదార్థాలూ, పానీయాలూ, బట్టలూ, ఉపకరణాలూ, పక్కలూ, పరిమళ ద్రవ్యాలూ, కూరలూ, సంభారాలు–కానీ సన్యాసి అయిన గౌతముడు మాత్రం నిలువ వుంచిన పదార్థాలను ఉపయోగించడం లేదు."

12. లేక అతనిలా అంటాడు: "విశ్వాసపాత్రులు సమర్పించే ఆహారం మీద బతుకుతున్న కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ నిలువచేసే పదార్థాలు వుపయోగించే దురలవాటు సాగించారు. అవి– వస్తువులూ, భోజన పదార్థాలూ, పానీయాలూ, బట్టలూ, ఉపకరణాలూ, పక్కలూ, పరిమళ ద్రవ్యాలూ, కూరలూ, సంభారాలూ– కానీ సన్యాసి అయిన గౌతముడు మాత్రం నిలువ వుంచే పదార్థాలను వుపయోగించడానికి దూరంగా వుంటాడు."

13. అతను యిలా అయినా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు పెట్టే భోజనం తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ వినోద ప్రదర్శనలు తిలకించడానికి వెళ్తున్నారు. అవేమిటంటే:

(1) వేశ్యల నృత్యాలు (నక్కమ్)

(2) పాటలు పాడడం (గీతమ్)

(3) వాద్య సంగీతం (వాదితమ్)

(4) తిరునాళ్ళలో వినోద ప్రదర్శనలు (షెఖమ్)

(5) వీరగాథల గానం (అక్షనమ్)

(6) చేతితో సృజించే సంగీతం (పాణిసేరమ్)

(7) కావ్యగానం (వేతల)

(8) టముకు కొట్టడం (కుంభ తూనమ్)

(9) తిరణాల వేషాలు (శోభనగర్కమ్)

(10) కాండలవాళ్ల దొమ్మరి ప్రదర్శన (కాండల–వంశ–ధోపనమ్)

(11) ఏనుగుల, గుర్రాల, ఎద్దుల, మేకల, పొట్టేళ్ళ, పుంజుల, కోలంకి పిట్టల పందేలు.

(12) బాణాకర్రల, ముష్టి, మల్లయుద్ధాల పోటీలు

(13–16) కృత్రిమ పోరాటాలూ, హాజరు పట్టీలూ, సైనిక విన్యాసాలూ, సమీక్షలు.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి వినోద ప్రదర్శనలు తిలకించడానికి వెళ్లడం లేదు.

14. లేక అతనిలా చెప్పి వుండవచ్చు: "విశ్వాసపాత్రులు సమర్పించే ఆహారం మీద బతుకే సన్యాసులూ, బ్రాహ్మణులూ క్రీడలూ, వినోద ప్రదర్శనలూ చూడ్డానికి అలవాటు పడిపోయారు. అవేమిటంటే–

(1) బోర్డుల మీద ఎనిమిదిగాని, పదిగాని చతురస్రాకారపు వరుసల్లో క్రీడలు.

(2) అవే క్రీడలు గాలిలో బోర్డులున్నట్టుగా వూహించుకొని ఆడటం.

(3) నేల మీద గీసిన గుండ్రని చక్రాల మీద నుంచి ఒక్కొక్క అడుగే జరుపుకుంటూ ముందుకు సాగిపోవడం.

(4) ఒక పోగు పోసిన రాశి నుంచి గానీ లేక గుంపు నుంచి గానీ ఒక్కొక్క వస్తువునో, లేక మనిషినో గోటితో వేరు చేయడం, తిరిగి మరొక రాశిగా పోయడం లేక గుంపుగా వుంచడం. ఈ పనిని (పోగుని, గుంపుని) కదపకుండానే చేయాలి. అలా కదిపిన పక్షంలో ఆట ఓడినట్టే లెక్క.

(6) పాచికల ఆట.

(7) చాచిన వేళ్లని లక్కలోగాని, ఎరుపు అద్దకం రంగులోగాని, పిండి కలిపిన నీళ్ళలో గానీ ముంచుతూ, చేతిని నేలమీద లేదా గోడమీద చరుస్తూ, "ఇదేమి అవుతుంది?" అంటూ కేకలు వేస్తూ, కావలసిన ఏనుగులు, గుర్రాలు మొదలయిన వాటి ఆకారాలను చూపించడం.

(8) బంతుల ఆట.

(9) ఆకులతో చేసిన బొమ్మ పిల్లనగ్రోవిని ఊదడం.

(10) బొమ్మ నాగళ్లతో భూమిని దున్నడం.

(11) గాలిలోకి ఎగిరి పిల్లిమొగ్గలు వేయడం.

(12) తాటాకు కమ్మలతో రూపొందించిన బొమ్మ గాలి యంత్రాలతో ఆడుకోవడం.

(13) కమ్మ రేకులతో చేసిన కొలపాత్రలతో వినోదించడం.

(14–15) బుల్లిబుల్లి బళ్ళతో, విల్లులతో ఆడుకోవడం రాసే పదాలను ఇట్టే పోల్చుకోవడం.

(17) స్నేహితుని మనసులో మెదిలే ఆలోచనలేమిటో చటుక్కున పసికట్టెయ్యడం.

(18) అంగ విహీనులను అనుకరిస్తూ, ధ్వన్యనుకరణ చేయడం.

సన్యాసి అయిన గౌతముడు ఇలాంటి క్రీడలకూ, వినోద ప్రదర్శనలకూ దూరంగా వుంటాడు.

15. లేక అతనిలా అయినా అని వుండవచ్చు: "విశ్వాసపాత్రులు పెట్టే తిండి తింటూ కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ ఎత్తయిన, పొడవుపాటి మంచాల మీద పడుకోవడానికి అలవాటు పడిపోయారు; అవి–

(1) అటూ ఇటూ కదిలించడానికి వీలయిన మంచాలు–ఎత్తయినవీ, ఆరడుగులు పొడవు గలవీను (అసంది)

(2) ఆనుకొనే పక్కల మీద జంతువుల బొమ్మ చెక్కడాలతో ఆసనాలు (పల్లంకొ)

(3) పొడవుపాటి గొర్రె బొచ్చు మీద మేక వెంట్రుకలతో దిండ్లు (గొనకొ)

(4) రకరకాల రంగు గుడ్డలు అతికించి, మంచాల మీద పరచే దుప్పట్లు (కిత్తక)

(5) తెల్లని దుప్పట్లు (పాటిక)

(6) పువ్వుల ఎంబ్రాయిడరీ చేసిన పలంగు పోషులు (పాటాలిక)

(7) కాటన్ వూలుతో నింపిన జలిమి దుప్పట్లు (తూలిక)

(8) పులులు, సింహాలు మొదలయిన బొమ్మలు ఎంబ్రాయిడరీ చేసిన పలంగు పోషులు (వికటిక)

(9) రెండువేపులా మృదువైన బొచ్చుగల చర్మంతో (ఫర్) అమర్చిన రగ్గులు (ఉద్దాలోమి)

(10) ఒకేవేపు మృదువైన బొచ్చుల చర్మంతో అమర్చిన రగ్గులు (ఏకంతలోమి)

(11) రత్నాలు ఎంబ్రాయిడరీ చేసిన పలంగు పోషులు (కత్తిస్సమ్)

(12) సిల్కు పలంగు పోషులు (కోసెయ్యమ్)

(13) 16గురు నర్తకీలు నృత్యం చేయడానికి వీలుగా పెద్దపెద్ద రత్న కంబళులు (కుట్టకమ్)

(14-16) ఏనుగుల, గుర్రాల, రథాల రగ్గులు.

(17) జింక చర్మాలు కట్టిన రగ్గులు (అగిన పావేని)

(18) సాదా జింక చర్మాల రగ్గులు.

(19) పై ఆచ్ఛాదనలు గల రత్న కంబళులు (సొత్తరక్షదమ్)

(20) ఎర్రగుడ్డ తలగడలతో సోఫాలు.

16. లేక అతనిలా అయినా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చే తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ అందంగా అలంకరించుకోవడానికి అలవాటు పడిపోయారు. అదెలా అంటే-

సుగంధ రజాలను ఒంటికి పూసుకొని, ఒళ్ళంతా రుద్ది స్నానం చేయడం, మల్లయోధులకు మల్లేనే శరీర అవయవాలను దుడ్డు కర్రలతో మోదుకోవడం. అద్దాలు, అంజనాలు, హారాలు, గులాల పొడి, పరిమళ ద్రవ్యాలు, కంకణాలు, నెక్లెసులు, చేతి కర్రలు, ఔషధాలు నిలువ చేసుకొనేందుకు వేరుగా గొట్టాల ఆకారాల్లో డబ్బాలూ, పొడుగుపాటి సన్నని కత్తులూ, ఎండపొడ తగలకుండా టోపీలూ, బుటాలు కుట్టిన కాలి చెప్పులూ, తలపాగాలూ, రుమాళ్ళూ, అడవి ఎద్దు తోకలతో చేసిన వింజామరలూ, జాలర్లు అమర్చిన పొడుగుపాటి ధవళ వస్త్రాలు.

సన్యాసి అయిన గౌతముడు తనని తాను అందంగా అలంకరించుకొనే సాధనాలకు దూరంగా వున్నాడు."

17. లేక ఇలా కూడా అతను అనవచ్చు: "విశ్వాసపాత్రులు సమకూర్చే తిండిని తిని, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ చౌకబారు సంభాషణలకి అలవాటు పడిపోతూ వచ్చారు. అవి-రాజుల, దొంగల, మంత్రుల కథలు, యుద్ధాలు, బీభత్సాల, పోరాటాల కథలు, తిండి, మధువులు, వస్త్రాలు, పక్కలు, హారాలు, సుగంధ ద్రవ్యాలు గురించిన చర్చలు, సంబంధాలు, వాహనాలు, గ్రామాలు, పట్టణాలు, నగరాలు, దేశాల గురించి, స్త్రీలను గురించి, వీరులను గురించి. వీధి మొగని లేక నీళ్ళాటి రేవు దగ్గర నిలబడి చెప్పే పోచికోలు కబుర్లు, దెయ్యాల కథలు, కుచ్చుటప్పాలు కొట్టడం, సముద్రం, భూమి సృష్టి గురించి గాలిపోగు చేసి మాట్లాడడం, దేవుడు ఉన్నదీ లేనిదీ అనే చర్చ-ఆస్తి నాస్తి విచికిత్స చేయడం.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి చౌకబారు సంభాషణల జోలికి పోకుండా, వాటికి దూరంగా వున్నాడు."

18. లేక యిలా అయినా అతను అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చిన తిండి తింటూ, కొందరు సన్యాసులు, బ్రాహ్మణులు వాగ్వివాదానికి దారితీసే పదజాలం అలవాటు చేసుకున్నారు. అవెలాంటివంటే–

"నాకు మల్లేనే నువ్వు సిద్ధాంతాన్నీ, క్రమశిక్షణనీ అర్థం చేసుకోవు."

"ఈ సిద్ధాంతమూ, క్రమశిక్షణా నీకెలా అర్థమవుతాయి?"

"నీవన్నీ తప్పుడు అభిప్రాయాలే. నేను మాత్రం సరైన పంథాలో వున్నాను."

"నేను విషయాన్ని సూటిగా చెబుతాను. నువ్వలా చెప్పలేవు."

"నువ్వు వెనకది ముందూ, ముందుది వెనకా చేస్తూ వుంటావు."

"ఇన్నాళ్ళుగా నువ్వు ఆలోచిస్తున్నదంతా తల్లక్రిందులయ్యింది."

"నువ్వు విసిరిన సవాలుని అందుకున్నాను."

"నువ్వు తప్పని తేలిపోయింది."

"నీ అభిప్రాయాలు తేటతెల్లం చేయడం కోసం పని ప్రారంభించు."

"దూరంగా వుండు, వీలయితే."

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి అనవసర వాగ్వివాదాల్లోకి తలదూర్చలేదు."

19. లేక యిలా అయినా అతను అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చిన తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులు సందేహవాహకులుగా, కార్యార్థులై చిన్నచిన్న దగ్గర ప్రయాణాలు చేయడానికీ, మధ్యవర్తిత్వం నెరపడానికీ, రాజుల, మంత్రుల, క్షత్రియుల, బ్రాహ్మణుల మీద చతురోక్తులు విసరడానికీ అలవాటు పడిపోయారు, యిలా చెబుతూ: 'అక్కడికి వెళ్లు. ఇక్కడికి రా. ఇది నీతో తీసుకువెళ్ళు. అక్కడ్నించి దాన్ని తీసుకురా.' అంటూ యువకులతో వేళాకోళమాడడానికి అలవాటుపట్టారు.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి సేవక పనులు చేయకుండా జాగ్రత్తపడ్డాడు."

20. లేదా యిలా కూడా అని వుంటాడు అతను: "విశ్వాసపాత్రులు పెట్టే తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ మోసగాళ్ళుగా, సోమరిపోతులుగా (డబ్బుకి మంత్రాలు చదివేవారు), దైవజ్ఞులుగా, భూతమంత్రాలు చెప్పేవారుగా–నిరంతరమూ ధనార్జన మీద దృష్టినీ, యావనీ పెంచుకున్నారు.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి వంచనకీ, పద్ధతికీ దూరంగా వున్నాడు."

['మజ్ఝిమ శీల' (నడవడికపై సుదీర్ఘ పేరాలు) యిక్కడితో సమాప్తి.]

21. లేక అతనిలా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చిన పెట్టిన తిండి తింటూ, కొందరు బ్రాహ్మణులూ సన్యాసులూ బతుకుతెరువు కోసం యీ దిగువ క్షుద్రకళలు చేపడతారు:

(1) హస్త సాముద్రికం చెప్పటం-ఎక్కువ కాలం బతుకుతారనో, మీకు మంచి భవిష్యత్తు వుందనో చెప్పడం, వగయిరా (లేక వీటికి పూర్తిగా భిన్నంగా చెప్పడం) పిల్లాడి హస్తరేఖలు, కాళ్లపై గుర్తులు చూసి చెప్పడం.

(2) శకునాలూ, లక్షణాలూ గురించి చెప్పడం.

(3) పిడుగుపాటు, తదితర ఆకాశ ప్రమాదాల గురించి శకునం చెప్పడం.

(4) కలలను విశ్లేషించి, జరగబోయేదాన్ని గురించి చెప్పడం.

(5) శరీరం మీద వున్న పుట్టుమచ్చలను చూసి అదృష్టం గురించి చెప్పడం.

(6) చిట్టెలుకలు గుడ్డ కొరికి చేసిన గుర్తులను బట్టి శకునాలు చెప్పడం.

(7) అగ్నిలో ఆజ్యం పోయడం.

(8) తెడ్డుతో నైవేద్యం సమర్పించడం.

(9-13) దేవునికి ధాన్యానికీ, పూల్‌కీ మధ్య సింధూరం, ఉడికించడానికి సిద్ధంగా వున్న పొట్టుతోని బియ్యం, నెయ్యినీ, నూనెనీ సమర్పించడం.

(14) ఆవగింజల్ని నోట్లో వేసుకొని, అగ్నిలో వమనం చేయడం ద్వారా బలి సమర్పించడం.

(15) బలి యిస్తున్న దానికి గుర్తుగా దేవునికి ఒక వ్యక్తి కుడి మోకాలి నుంచి రక్తం తీయడం.

(16) వేళ్ల గణపులు చూసి మంత్రం చదువుతూ దైవ ప్రార్థన చేస్తూ ఒక మనిషి అదృష్టవంతునిగా పుట్టిందీ లేనిందీ నిర్ణయించి చెప్పడం.

(17) గృహ నిర్మాణానికీ, విహార స్థలానికి ఒక స్థలం మంచిదో కాదో నిర్ణయించడం.

(18) వాడుకలో వున్న ధర్మసూత్రం గురించి సలహా యివ్వడం.

(19) శ్మశానంలో పిశాచాల్ని గొయ్యి తీసి పాతిపెట్టడం.

(20) దయ్యాల్ని భూస్థాపితం చెయ్యడం.

(21) మట్టి యింట్లో నివశిస్తున్నపుడు, అప్పడు ఉపయోగించే మంత్రాలు తెలిసి వుండడం.

(22) పాముల మంత్రాలు తెలిసి వుండడం.

(23) విషం పిండడంలో నేర్పు కలిగి వుండడం.

(24) తేళ్ళ వృత్తి

(25) ఎలుకలను పట్టే నేర్పు కలిగి వుండడం.

(26) పక్షుల వృత్తి
(27) కోళ్ళ వృత్తి.
(28) మనిషి ఆయుష్షు యింకా ఎంతో జ్యోతిష్యం చెప్పడం.
(29) బాణం ములుకుల గాయాలకు మంత్రం వేయడం.
(30) జంతు చక్రం.

గౌతముడు యిలాంటి క్షుద్ర కళలకు దూరంగా వుంటాడు."

22. లేక అతనిలా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చే తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ తప్పుడు పద్ధతుల ద్వారా క్షుద్రవిద్యల ద్వారా జీవితం గడిపేవారు. ఆ క్షుద్ర కళలెలాంటి వంటే–

ఈ క్రింది విషయాలను గురించి మంచి, చెడ్డ గుణాలను తెలుసుకొనే జ్ఞానం: పుట్టు మచ్చలు కలిగి వున్న వారికి వాటి మూలంగా కలిగే అదృష్టం, పొందే ఆరోగ్యం గురించి చెప్పే జ్ఞానం కలిగి వుండడం: మణులూ, కర్రలూ, దుస్తులూ, కత్తులూ, కటారువా, బాణాలూ, విల్లూ, ఇతర ఆయుధాలూ, స్త్రీలూ, పురుషులూ, మగపిల్లలూ, గుర్రాలూ, గేదెలూ, ఎద్దులూ, మేకలూ, గొర్రెలూ, కోళ్ళూ, కోలంకి పిట్టలూ చేప పిల్లలూ, తాబేళ్లూ తదితర జంతువులు.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి క్షుద్ర కళలకు దూరంగా వున్నాడు."

23. లేక అతనిలా అయినా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చే తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ తప్పుడు పద్ధతుల ద్వారా ధనార్జన చేస్తారు. క్షుద్రకళల ఆలంబనగా, భవిష్యత్తు గురించి జ్యోతిష్యం, సోదె వంటివి చేస్తారు. ఆ తప్పుడు పద్ధతుల్లో ఇవి కొన్ని:

సేనా నాయకులు సైనిక కవాతుతో సాగిపోతారు.
స్థానిక నాయకులు దాడి చేస్తారు, శత్రువులు వెనక్కి తిరుగుతారు.
శత్రు సేనా నాయకులు దాడి చేస్తారు, మన సైన్యాలు వెనక్కి తగ్గుతారు.
స్థానిక నాయకులు యుద్ధంలో విజయం సాధిస్తారు, మనం ఓటమి చవిచూస్తాం.
విదేశీ సేనానాయకులు మనపై విజయం సాధిస్తారు, మనం ఓడిపోతాం.
ఆవిధంగా విజయం యిటువైపూ, ఓటమి అటువైపూ.
సన్యాసి అయిన గౌతముడు యిటువంటి క్షుద్రకళలకి దూరంగా వున్నాడు."

24. లేక అతను యిలా అయినా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చే తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ తప్పుడు పద్ధతుల ద్వారా ధనార్జన చేస్తారు. క్షుద్ర కళల ఆలంబనగా, భవిష్యత్తు గురించి జ్యోతిష్యం చెబుతారు:

(1) చంద్రగ్రహణం గురించి చెప్పడం.
(2) సూర్యగ్రహణం గురించి చెప్పడం.
(3) నక్షత్ర గ్రహణం గురించి చెప్పడం.
(4) సూర్యుడు గానీ, చంద్రుడుగానీ గతి తప్పారని చెప్పడం.
(5) సూర్యుడు గానీ, చంద్రుడు గానీ తమతమ గతుల్లోకి తిరిగి వచ్చి చేరడం గురించి చెప్పడం.
(6) నక్షత్రాలు గతులు తప్పుతాయని చెప్పడం.
(7) గతి తప్పిన నక్షత్రాలు తిరిగి గతిలోకి చేరడం గురించి తెలియజేయడం.
(8) ఉల్కా పతనం గురించి చెప్పడం.
(9) అడవి అంటుకుపోతుందని చెప్పడం.
(10) భూకంపం వస్తుందని చెప్పడం.
(11) భగవంతుడు పిడుగులు కురిపిస్తాడని చెప్పడం.
(12–15) సూర్యుని, చంద్రుని, నక్షత్రాల, ఉదయం, వెలుగు, అభివృద్ధి, కాంతి తగ్గడం–ఈ ప్రతి ఒక్కదాని గురించీ పదిహేను దృగ్విషయాలు ఫలానా ఫలానా వాటి ఫలితమని జ్యోతిష్యం చెప్పడం.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి క్షుద్ర కళలకు దూరంగా వున్నాడు."

25. లేక అతవిలా అయినా చెప్పి వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చే తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ క్షుద్రకళలను ఆరాధించి జీవితాల్ని వెళ్లమార్చుకోసాగారు. ఉదాహరణకు–

– కుంభవృష్టి కురుస్తుందని జ్యోతిష్యం చెప్పడం.
– వర్షపాతం తక్కువగా వుంటుందని జ్యోతిష్యం చెప్పడం.
– పంటలు పుష్కలంగా పండుతాయని జ్యోతిష్యం చెప్పడం.
– ఆహార కొరత ఏర్పడుతుందని జ్యోతిష్యం చెప్పడం.
– సుఖశాంతులతో తులతూగుతూ వుంటారని జ్యోతిష్యం చెప్పడం.

- అరాజకత్వం ఏర్పడుతుందని జ్యోతిష్యం చెప్పడం.
- అంటువ్యాధులు చెలరేగుతాయని జ్యోతిష్యం చెప్పడం.
- ఆరోగ్యకరమయిన ఋతువు గురించి జ్యోతిష్యం చెప్పడం.
- వేళ్లమీద లెక్క కట్టి చెప్పడం.
- వేళ్లమీద లెక్కించకుండానే చెప్పడం.
- పెద్దపెద్ద సంఖ్యలను కూడిక చేయడం.
- వీరగాథల్నీ, కవితల్నీ రచించడం.
- తర్కించడం, కుతర్కం చేయడం.

సన్యాసి అయిన గౌతముడు యిలాంటి క్షుద్ర కళలకు దూరంగా వున్నాడు."

26. లేక అతనిలా అయినా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చిన తిండి తింటూ, కొందరు సన్యాసులూ, బ్రాహ్మణులూ తప్పడు త్రోవ తొక్కి, క్షుద్రకళల సహాయంతో డబ్బు గడించడం సాగించారు. అవెలాగంటే–

(1) పెళ్లి కోసం పెళ్లికూతురుని గానీ, పెళ్లి కొడుకుని గానీ యింటికి తీసుకురావడానికి మంచి ముహూర్తం చూడడం.

(2) పెళ్లికోసం పెళ్లి కూతురుని గానీ, పెళ్లి కొడుకుని గానీ యింట్లోంచి తీసుకువెళ్లడం గురించి మంచి ముహూర్తం చూడడం.

(3) శాంతి ఒప్పందం చేసుకోవడానికి మంచి ముహూర్తం నిర్ణయించడం (లేదా శాంతిని నెలకొల్పడం కోసం మంత్రాలు ఉపయోగించడం)

(4) దండయాత్ర చేయడానికి మంచి ముహూర్తం నిర్ణయించడం (లేదా విభేదాలు సృష్టించడానికి మంత్రాలు చదవడం)

(5) అప్పులు తీసుకోవడానికి మంచి రోజు చూడడం (పాచికలను విజయవంతంగా వేయడానికి మంత్రాలు చదవడం)

(6) డబ్బుని ఖర్చు పెట్టడానికి మంచి ముహూర్తం చూడడం (పాచికలు వేసే ప్రత్యర్థికి దురదృష్టం వెంటాడటం కోసం మంత్రాలు చదవడం)

(7) అదృష్టవంతులు కావడానికి మంత్రాలు చదవడం.

(8) దురదృష్టవంతుల్ని చేయడానికి మంత్రాలు చదవడం.

(9) కడుపు తీసేయించడానికి మంత్రాలు చదవడం.

(10) మనిషికి దవడ కట్టి పడేయడానికి మంత్రాలు చదవడం.

(11) మనిషికి మూగతనం తెప్పించడానికి మంత్రం ప్రయోగించడం.

(12) మనిషి చేతుల్ని కట్టి పడెయ్యడానికి మంత్రం ప్రయోగించడం.
(13) మనిషికి చెవుడు తెప్పించడానికి మంత్రం చదవడం.
(14) మాయాదర్పణం సహాయంతో దేవుడు మాట్లాడుతున్నట్టుగా సమాధానాలు చెప్పించడం.
(15) ఆడపిల్ల సహాయంతో దేవుడు మాట్లాడుతున్నట్టుగా సమాధానాలు చెప్పించడం.
(16) దేవుణ్నించి సమాధానాలు చెప్పించడం.
(17) సూర్యుణ్ణి ఆరాధించడం.
(18) భగవంతుణ్ణి పూజించడం.
(19) మనిషి నోట్లోంచి మంటలు పుట్టించడం.
(20) అదృష్ట దేవతని–సిరిని ఆవాహన చెయ్యడం.

సన్యాసి అయిన గౌతముడు యిటువంటి క్షుద్రకళల నుంచి దూరంగా వున్నాడు."

లేక అతనిలా అయినా అని వుంటాడు: "విశ్వాసపాత్రులు సమకూర్చిన తిండి తింటూ కొందరు సన్యాసులు, బ్రాహ్మణులు తప్పడు తోవలు తొక్కి, క్షుద్రకళల ద్వారా బతుకు తెరువు సంపాయించుకుంటారు. అవి ఎలాటివంటే–

(1) 'నాకీ పని చేసిపెడితే, నీకీ ముడుపులు సమర్పించుకుంటా'నని దేవునికి మొక్కుకోవడం.
(2) అలాంటి ముడుపులు చెల్లించడం.
(3) శవాలను పాతిపెడుతున్నపుడు మంత్రాలు పదేపదే చదవడం.
(4) పుంసత్వం కలిగించడం.
(5) ఒక మనిషి నపుంసకునిగా మార్చివేయడం.
(6) నివేశాలకు అదృష్టం కలిగించే స్థలాలను నిర్ణయించడం.
(7) స్థలాలను పవిత్రం చేయడం.
(8) పూజా విధానంలో భాగంగా నోటిని కడుగుకోవడం.
(9) పూజ కోసం స్నానం చేయడం.
(10) బలులు యివ్వడం.
(11–14) వాంతులకూ, విరేచనాలకూ మందులు యివ్వడం.
(15) తలభారం తగ్గడానికి సాధనం చేయించడం (మందులు యిచ్చి తుమ్ములు తెప్పించడం)
(16) చెవుల్లో నూనె పోయడం (పెరగడానికి గానీ, లేదా చెవి కురుపులు మానడానికి గానీ)
(17) కళ్లను తృప్తిపరచడానికి (మందు నూనె చుక్కలను కళ్ళలో వేసి) కళ్లకి ఉపశమనం

కలిగించడం)

(18) ముక్కు పుటాల ద్వారా మందుని లోపలికి ఎక్కించడం.

(19) కళ్ళకి అంజనం పెట్టడం.

(20) కళ్ళకి లేపనం పెట్టడం.

(21) కళ్ళ వైద్యునిగా ప్రాక్టీసు చేయడం.

(22) శల్య చికిత్సకునిగా ప్రాక్టీసు చేయడం.

(23) పిల్లల వైద్యునిగా ప్రాక్టీసు చేయడం.

(24) మూలికలనూ, ఔషధాలనూ యివ్వడం.

(25) మందులను మార్చి మార్చి యివ్వడం.

సన్యాసి అయిన గౌతముడు యిటువంటి క్షుద్ర కళలకు దూరంగా వున్నాడు."

"సోదరులారా! తథాగతుణ్ణి ప్రశంసించే సందర్భంలో మతం మార్చుకోని వ్యక్తి చెప్పే స్వల్ప విషయాలు, సదాచారానికి సంబంధించిన అల్ప విషయాలూను."

* * *

నడవడికకి సంబంధించిన దీర్ఘమయిన పేరా యిక్కడితో సమాప్తం.

# III

వాస్తవానికి యిది ఒక వ్యక్తి ఆచరించాల్సిన నైతిక జీవితానికి సర్వోత్కృష్ట ప్రమాణం. నైతిక జీవితం గురించి అది ఎంత ఉత్కృష్ట ప్రమాణమంటే ఆకాలంనాటి ఆర్యుల సమాజం అలాంటిదాన్ని బొత్తిగా ఎరుగదు.

బుద్ధుడు ఒక ఆదర్శ ఉదాహరణగా తాను పవిత్ర జీవితం గడపడంతోనే తన పని అయిపోలేదనీ, సమాజంలోని సాధారణ స్త్రీ పురుషుల వ్యక్తిత్వాలను కూడా మలచడానికి సయితం కంకణం కట్టుకున్నాడు. వారు ఆచరించడం కోసం జ్ఞానస్నానం అనే ఒక ప్రక్రియను ప్రవేశపెట్టాడు. ఇలాంటిది ఆర్యుల సమాజానికి పూర్తిగా తెలియదు. బుద్ధుడు విధించిన కొన్ని నైతిక సూత్రాలను ఆచరించడం ద్వారా జ్ఞానస్నానం చేసి, ఒక వ్యక్తి బౌద్ధ మతంలోకి మారిపోవచ్చు. ఈ సూత్రాలు 'పంచశీలలు' లేక ఐదు విధులుగా ప్రసిద్ధం. అవి ఏమిటంటే– (1) జీవహింస చేయరాదు (2) దొంగతనం చేయరాదు (3) అబద్ధం ఆడరాదు (4)

వ్యభిచారం చేయరాదు (5) మద్యం సేవించరాదు. ఈ ఐదు విధులూ జన సామాన్యానికి నిర్దేశించినవి. ఇహ బౌద్ధ భిక్షువులు కోసం అదనంగా ఐదు విధులు ఆదేశించడం జరిగింది. (6) నిషిద్ధ వేళల్లో భుజించరాదు (7) నృత్యం చేయరాదు (8) దండలనూ, అత్తరవులనూ, హారాల్నీ వుపయోగించరాదు (9) ఎత్తయిన లేదా విశాలమైన పరుపులు వాడరాదు (10) ఎప్పుడూ డబ్బును తీసుకోరాదు.

స్త్రీ, పురుషుల ఆలోచనలనూ, ఆచరణనూ క్రమబద్ధం చేయడానికి ఉద్దేశించబడిన ఈ శీలాలు లేక విధులు నైతిక నియమాలుగా ఏర్పడినాయి.

ఈ అన్నిటికీ అతి ముఖ్యమైనది జీవహింస చేయరాదనే విధి. ఈ విధి అంటే–కేవలం ఒక జీవి ప్రాణం తీయకుండా ఉండటంతో సరిపోదని బుద్ధుడు చాలా శ్రద్ధ తీసుకొని స్పష్టం చేశాడు. అంతేకాదు. ఈ విధిని **బాగా** అర్థం చేసుకోవాలని కూడా ఆయన యిలా నొక్కి చెప్పాడు–ఊపిరి పీల్చే ప్రతి ప్రాణి ఎడలా వాస్తవమయిన సానుభూతి, సద్భావం, ప్రేమ కలిగి వుండటం... ... ...

అవే నిశ్చయాత్మక విషయాలను ఆయన యితర విధులకు కూడా విస్తరింపజేశాడు. బౌద్ధం స్వీకరించని సన్యాసి బోధనలను గురించి, ఒకనాడు లౌకిక అనుచరుడు బుద్ధునితో యిలా చెబుతాడు–"చెడ్డ పనులు చేయరాదు. చెడ్డ మాటలు చెప్పరాదు. చెడ్డ ఆలోచనలు చేయరాదు. చెడు జీవితం గడపరాదు. ఇవి అత్యుత్తమ ఆదర్శం" అని. తన అనుచరుడు చెప్పినదాని మీద బుద్ధుని వ్యాఖ్య ఎంతో అర్థవంతమయినది– "అవే నిజమైతే, పాలు కుడిచే ప్రతి పసిపాప ఆ ఆదర్శాన్ని సాధించి వుండేది గదా! ...... జీవితమంటేనే మంచిచెడ్డలతో కూడుకున్న జ్ఞానం అని అర్థం. ఆతర్వాతనే మంచి వాటితో చెడ్డ పనులనూ, చెడ్డ మాటలనూ, చెడ్డ ఆలోచనలనూ, చెడ్డ జీవితాన్నీ మార్పు చేసుకోవాలి. ఇది సుదీర్ఘమయిన, దృఢ నిశ్చయంతో కూడిన సంకల్పం వల్ల మాత్రమే సాధ్యమవుతుంది... ... ..."

బుద్ధుని బోధనలు కేవలం కొన్నిటిని వ్యతిరేకించే భావాలు మాత్రమే కావు. అవి కొన్నిటిని ప్రతిపాదించేవీ, నిర్మాణాత్మకమయినవీను. తాను నిర్దేశించిన విధులను ఒక వ్యక్తి ఆచరించటం తోనే బుద్ధుడు తృప్తి పడలేదు. యితరులు కూడా వాటిని అనుసరించేలా ప్రోత్సహించమని ఆయన నొక్కి చెప్పేవాడు. ఉదాహరణకు 'అగుత్తర నికాయ'లో బుద్ధుడు చెప్పిందాన్నే తీసు కుందాం. ఆయన మంచివాడికీ, చాలా మంచివాడికీ మధ్య గల తేడాని ఎత్తి చూపించుతాడు. చంపడం, దొంగతనం చేయడం, వ్యభిచరించడం, అబద్ధం చెప్పడం, మద్యం సేవించడం–ఇవేవీ చేయనివాణ్ణి మనం మంచివాడు అంటాం; తాను చెడ్డపనులు చేయకుండా వుండటమే గాకుండా, యితరులు కూడా అలా నడుచుకొనేలా చేసేవాణ్ణి చాలా మంచివాడు అంటాం'... ...

బౌద్ధ మతంలోని రెండు ప్రధానమైన నీతి సూత్రాలు–ప్రేమా, జ్ఞానం.

ప్రేమని ఒక సద్గుణంగా ఆచరించమని ఎంత బలంగా ఉపదేశించాడో, బుద్ధుని మాట ల్లోనే చెప్పాలంటే, "ఒక తల్లి ఒక్కగానొక్క తన స్వంత బిడ్డను రక్షించుకోవడం కోసం, తన ప్రాణాలకు సయితం ఎలా తెగించుతుందో, అదే విధంగా అన్ని జీవరాశుల ఎడలా ప్రతి ఒక్కరూ అపరిమితమయిన (ప్రేమ నిండిన) హృదయం కలిగి వుండేలా కృషి చేయాలి. అతను ప్రపంచం ఎడల మంచి అభిప్రాయాన్ని కలిగి వుండేలా కృషి చేయాలి. పగ, ద్వేషాలు లేని క్రింద, మీద, నిరాఘాటంగా ఎల్లలు లేని (ప్రేమించే) హృదయం కావాలి. ఈ విధంగా జీవించడం, ప్రపంచంలో అత్యుత్తమంగా జీవించడం" అంటూ ప్రబోధించాడు బుద్ధుడు.

"విశ్వకరుణ, వ్యధార్థ జీవుల ఎడల సానుభూతి, వివేకవంతమయిన జీవితం తాలూకు ప్రతిరూపాన్నీ సద్భావంతో దర్శించడం–ఈ విషయాలు తథాగతుని (బుద్ధుని) వ్యక్తిత్వాన్ని పట్టి యిస్తాయి. కారణం–అలాంటి మానవపుత్రులు బహుకొద్దిమందే వుంటారు. తన దృక్కోణాన్ని తన అనుచరులకు వివరించటంలో అత్యున్నత స్థాయిలో ఆయన విజయం సాధించాడు.

తాను ప్రేమ సిద్ధాంతాన్ని ఎంత దృఢంగా ఆధారం చేసుకున్నాడో, అదే విధంగా జ్ఞాన సిద్ధాంతాన్ని కూడా చేసుకున్నాడు బుద్ధుడు. నైతిక జీవితం జ్ఞానంతో ఆరంభమయి, వివేకంతో ముగుస్తుందని ఆయన అభిప్రాయం. ఆయన "ఈ ప్రపంచాన్ని రక్షించడానికి అవతరించాడు. తన ఆశయసాధన అజ్ఞానాన్ని నాశనం చేయడం, జ్ఞానాన్ని వాస్తవ జీవిత విలువగా, వివేకంతో జీవించడంగా అభివృద్ధి పరచడం." ప్రజల్ని పరిరక్షించే శక్తిని తనకి బుద్ధుడు ఆపాదించుకోలేదు. ఆ పనిని ప్రజలే తమంతతాము చేసుకోవాలి. జ్ఞానం ద్వారా మాత్రమే ఆ పరిరక్షణమార్గం సుగమమవుతుంది. జ్ఞానం గురించి ఆయన అంతలా నొక్కిచెప్పాడు. జ్ఞానం లేని నైతికత, సదాచారం ప్రయోజనకారి కాగలవని ఆయన భావించలేదు.

మూడు విషయాలకు వ్యతిరేకంగా బుద్ధుడు పెద్దఎత్తున ప్రచార కార్యక్రమాన్ని చేపట్టాడు.

ఆయన వేద ప్రమాణాన్ని నిరాకరించాడు......

రెండోది–యజ్ఞాన్ని మతరూపంగా నిరాకరించాడు. యజ్ఞం పట్ల తన అభిప్రాయాలే మిటో, బుద్ధుడు 'జాతకమాల'లో ఒకే కథలో చాలా స్పష్టంగానే చెప్పడం జరిగింది.

## యజ్ఞం కథ

పరిశుద్ధమయిన హృదయాలు గలవారు దుష్టుల ప్రేరణకు లోనయి ప్రవర్తించరు. ఇది

తెలిసి, పవిత్ర హృదయాన్ని ప్రోత్సహించాలి. దాన్ని యీ క్రింది కథ ద్వారా ప్రబోధించడం జరిగింది.

ప్రాచీన కాలంలో వంశపారంపర్య హక్కుగా లభించడం వల్ల బోధిసత్వుడు రాజయ్యాడు. తన ప్రతిభ ద్వారా ఆయన ఆ స్థానానికి చేరుకున్నాడు. ప్రజల్ని చక్కగా పరిపాలించాడు. దేశంలో శాంతిభద్రతలు వెలకొన్నాయి. శత్రువుల బెడదలేదు. ఆయన సార్వభౌమత్వానికి విశ్వవ్యాపితంగా గుర్తింపు లభించింది. రాజ్యంలో ఏ వుపద్రవమూ, విపత్తులూ లేవు. అలాగే విదేశాలతో సత్సంబంధాలు వెలకొని వున్నాయి. సామంతులు ప్రభువు ఆదేశాల్ని శిరసావహిస్తూ వస్తున్నారు.

1. రాగద్వేషాలనే శత్రువులను జయించడం వల్ల నింద్యమైన భోగాలను ఆయన కోరుకోలేదు. అందువల్ల తన ప్రజలు సుఖాలు అనుభవించడానికి చక్రవర్తి నిండు మనసుతో నిరంతరం కృషి చేసేవాడు. తాను చేసే పనులన్నిటికీ ప్రయోజనం సన్మార్గం (ధర్మం) గనుక, చక్రవర్తి ఒక మునిలా ప్రవర్తించేవాడు.

2. చక్రవర్తికి మానవాళి స్వభావం తెలిసి వుండటం వల్ల, అత్యుత్తముడయిన చక్రవర్తి ప్రవర్తనను అనుకరించడానికి ప్రజలు ఉన్నత విలువలను ఆపాదించారు. అందువల్ల తన ప్రజలకు ముక్తి ప్రాప్తింపజేయాలనే సదుద్దేశంతో, చక్రవర్తి ప్రత్యేక శ్రద్ధ వహించి తాను చేయాల్సిన మత కర్మకాండలను చేసేవాడు.

3. ఆయన దానధర్మాలు చేయడం, నైతిక సూత్రాలను (శీల) తు.చ. తప్పకుండా పాటించడం, ఓర్పునీ, సహనాన్నీ బాగా అలవరచుకోవడం, ప్రాణుల శ్రేయస్సు కోసం నిరంతరం పాటుపడటం సాగించాడు. తన ప్రజల సుఖ సంతోషాల కోసం నిరంతరం ఆలోచిస్తూ, తదనుగుణంగా ముఖంలో భావాలను వ్యక్తం చేస్తూ, తన కాలాన్ని వెళ్లబుచ్చేవాడు. ఆయన మూర్తీభవించిన ధర్మదేవతలా వుండేవాడు.

ఆ రాజ్యంలో ఒకసారేం జరిగిందంటే–రాజు తన భుజబలంతో దేశాన్ని రక్షిస్తున్నా, దేశ ప్రజలు చేసిన అపరాధం వల్లనో, దేవతలు శీతకన్ను వేయడం వల్లనో రాజ్యంలో చాలా మండలాల్లో వర్షాలు పడక, కరువు విలయతాండవం చేసి, దేశానికి విపత్తు తెచ్చిపెట్టింది. రాజు, తానుగాని, తన దేశ ప్రజలుగాని ధర్మాన్ని తప్పడం వల్ల, ఈ ఆపద వచ్చిందని పూర్తిగా నమ్మి, నిరంతరం తన ఆలోచనల్లో ప్రజల శ్రేయస్సునే కాంక్షిస్తూ వుండటం వల్ల, వారి కడగళ్లను మనసుకి పట్టించుకొని, మత విషయాల్లో జ్ఞానులయిన వారి సలహాని రాజు కోరుతాడు. దేశాన్ని చుట్టుముట్టి వున్న ఈ ఆపద నుంచి బయటపడే మార్గం ఏమిటని బ్రాహ్మణుల్లో పెద్దలనూ, తన వంశ పురోహితుణ్నీ, మంత్రుల్నీ సలహా అడిగాడు రాజు. దేశంలో కుంభవృష్టి కురియడం కోసం రాజు వేదసమ్మతమైన, యజ్ఞం చేయాలనీ, భయంకరమైన బలిని యివ్వాలని

అందులో కొన్ని వందల జీవాలను వధించాలనీ చెబుతారు బ్రాహ్మణులు. కానీ యజ్ఞంలో వధించాల్సిన జీవాలను గురించి విన్నతర్వాత, సహజంగానే ఆయనలో వున్న జాలిగుణం తన అంతరంగంలో వారి సలహాని ఆమోదించకుండా చేసింది. అయితే సభ్యతను దృష్టిలో వుంచుకొని, కరుకు మాటలతో వారి ప్రతిపాదనని నిరాకరించి, వారి మనసుని గాయపర్చడం యిష్టం లేక, రాజు విషయాన్ని మార్చి, ఇతర విషయాల మీదకి చర్చని మరల్చాడు. అయితే ఆయన ఆంతర్యాన్ని అర్థం చేసుకోలేనివారు కావడం వల్ల వారు, మత సంబంధమయిన విషయాలను చర్చించే సందర్భం దొరికినంతనే ఆయనపై యజ్ఞం చేయమని వత్తిడి చేస్తారు.

4. "వివిధ రాచకార్యాలను సకాలంలో నిర్వహించడంలో ఏమరుపాటు చేయకుండా మీరు నిరంతరమూ శ్రద్ధ తీసుకుంటారు. భూమిపై అధికారం సంపాయించడం కోసం, దాన్ని పాలించడం కోసం నిర్దేశింపబడ్డవే రాచకార్యాలు. మీరు చేసే ఈ కార్యాల క్రమమంతా, ధర్మ విధులకి అనుగుణంగానే వుంటోంది."

5. "(అన్ని విషయాల్లోనూ) ఎంతో తెలివిగా వ్యవహరిస్తూ, త్రికాన్ని (ధర్మాన్ని, అర్థాన్నీ, కామాన్నీ) ఎంతో శ్రద్ధగా అనుష్ఠించే మీరు–బాణాన్ని చేతబట్టి, మీ ప్రజల శ్రేయస్సును కాపాడే మీరు–దేవ ప్రపంచానికి వారధి అనదగిన 'యజ్ఞాన్ని' నిర్వహించే విషయంలో ఎందుకంత అలక్ష్యంగా, దాదాపు మందకొడిగా వ్యవహరిస్తున్నారు?"

6. "మీ ఆజ్ఞలు విజయానికి తిరుగులేని కొలమానంగా భావించి, మీ సామంతులు కూడా వాటిని సేవకుల వలె శిరసావహిస్తారు. ఇప్పుడు కాలం ఆసన్నమయింది. శత్రువుల్ని నాశనం చేసే ఓ రాజా! ఉజ్వల కీర్తిని సంపాయించడం కోసం, యజ్ఞం చేసి, అత్యుత్తమ ఆశీస్సులను పొందండి."

7, 8. "ధర్మ గుణాన్ని ఒక అలవాటుగా మలచుకోవడం ద్వారా, సత్ప్రవర్తన అనే కట్టుబాటుని తు.చ. తప్పకుండా ఆచరించడం ద్వారా దీక్షితునికి కావలసిన పవిత్రత మీలో నెలకొని వుంది. అయినప్పటికీ, వేద విషయకమయిన యజ్ఞాలను చేసి, దేవతల రుణం తీర్చుకోవడమే మీకు ఉచితమయిన పని. లోపరహితమైన యజ్ఞం చేయడంవల్ల సంతృప్తి చెందిన దేవతలు, ఫలితంగా వర్షాన్ని తిరిగి యిచ్చి (పంపుతారు) వేస్తారు. బాగా ఆలోచించి, మీ ప్రజల, మీ యొక్క శ్రేయస్సుని దృష్టిలో వుంచుకొని యజ్ఞం చేయడానికి మీ ఆమోదం తెలియజేయండి. అది మీ కీర్తిని రెండింతలు చేస్తుంది."

దానిమీద రాజు యిలా ఆలోచించాడు: "వాస్తవానికి అలాంటి నాయకులను విశ్వసించడం వల్ల నా స్వీయరక్షణ ఎంతో బలహీనంగా వుంది. చట్టాన్ని విశ్వాసపాత్రంగా నమ్ముతూ, దాన్ని అభిమానిస్తూ, ఇతరుల మాటలను నమ్ముతుండటం వల్ల నాలోని సున్నిత హృదయాన్ని సమూలంగా నాశనం చేసుకోవాలి. ఇది ముమ్మాటికీ నిజం."

---

9. "ఉత్తమ ఆశ్రయదాతలుగా పేరు పొందిన వ్యక్తులు, న్యాయసమ్మతంగా వాదిస్తూనే, హాని కలిగిస్తారు. అయ్యో! వాళ్లు చూపెట్టే తప్పుడు తోవని అనుసరించిన వ్యక్తి తొందర్లోనే దుష్టశక్తుల బారిపడి, కష్టాల్లో చిక్కుకుపోతాడు."

10. వాస్తవానికి ధర్మశీలతకీ, జంతువులకి హాని చేయడానికీ మధ్య ఏమిటి సంబంధం? దేవలోకంలో వా నివాసానికీ లేక దేవతల అనుగ్రహానికీ జంతువుల బలులకీ ఏమిటి లంకె?

11, 12. అక్కడికి ఆ పవిత్ర మంత్రాలకేవో గాయపరచగల ములుకులు కలిగి వున్నట్టుగా, నిర్ణీత మంత్రాలను చదువుతూ జంతువును వధిస్తారు. అది స్వర్గానికి వెడుతుందని, అందు కోసమే దాన్ని చంపుతారని చెబుతారు. ఆ విధంగా దానికి న్యాయబద్ధతను ఆపాదిస్తారు. అయినా అది పచ్చి అబద్ధం. ఇతరులు చేసినదానికి యింకో లోకంలో ఒక వ్యక్తి ఎలా ఫలితం అనుభవిస్తాడో? అదెలా సాధ్యమో? అర్థం కాదు. తాను చెడ్డ పనులు చేయకపోవడం వల్ల పొందకపోయినా, మంచిని చేయడానికి తనని తాను అంకితం చేసుకోకపోయినా, తన చర్యల కారణంగా కాకుండా, యజ్ఞంలో వధించబడడం వల్ల, యజ్ఞపశువు స్వర్గంలోకి ఎలా ప్రవేశిస్తుంది?

13. యజ్ఞంలో చంపిన పశువు నిజంగా స్వర్గానికి వెళ్తున్నపుడు, బ్రాహ్మణులు తమంత తాముగా ముందుకొచ్చి, యజ్ఞానికి బలి పశువులుగా మారగలరని మనం ఆశించవచ్చా? ఇలాంటి ఆచారం వాళ్ళలో (బ్రాహ్మణులలో) మనకి ఎక్కడా కనిపించదు? అలాంటప్పుడు యీ ఉచిత సలహాలిచ్చే వారి సలహాలను మనస్ఫూర్తిగా ఎవరు అంగీకరిస్తారు?

14. ఇహ స్వర్గంలో, అందగత్తెలయిన అప్సరసలు అసాధారణమయిన సువాసనలు వెదజల్లుతూ, రుచికరమయిన, మిక్కిలి గొప్పదయిన, అతి శక్తివంతమయిన అమృతాన్ని పంచిపెడుతుంటే దాన్ని వదిలి, యజ్ఞంలో తమకి సమర్పించే యజ్ఞపశువుని విందారగిస్తారా?

"అందువల్ల, అలా... అలా చేయడానికి యిదే సరైన అదను." ఇలా ఒక నిర్ణయానికి వచ్చిన రాజు యజ్ఞం చేయడానికి ఆతృత వున్నట్టు నటిస్తాడు. బ్రాహ్మణుల సూచనలను ఆమోదిస్తూ, రాజు వారితో యిలా అన్నాడు: "వాస్తవానికి జాగ్రత్త రక్షణ పొందుతున్న నేను–ఎంతో తృప్తి చెందుతున్న నేను–మీ బోటి గొప్పవారి ఉచిత సలహాలు పొందుతున్న నేను–సుఖ సంతోషాలు పొందడానికి ఆతృతపడుతున్నాను! అందువల్ల వెయ్యి మందితో కూడిన నరమేధం (పురుషమేధం) నేను చేస్తాను. అందుకు అవసరమయిన వస్తువులన్నిటికీ నా రాజోద్యోగులు తమతమ పరిధుల్లో తీసుకురావాలని ఆజ్ఞాపిస్తున్నాను. సత్రానికి అవసరమయిన భవనాల నిర్మాణానికీ, గుడారాలు వేయడానికీ అనువయిన స్థలం కోసం పరిశీలన జరగాలి. తర్వాత, రాశులూ, ముహూర్తాలూ, చాంద్ర మానంలో మంచి రోజులూ పరిశీలించి, యజ్ఞానికి (జ్యోతిషులు) మంచి ముహూర్తాన్ని నిర్ణయించాలి.." దానికి పురోహితుడు యిలా జవాబు చెప్పాడు: "కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించేందుకు ప్రభువులు ప్రతి యజ్ఞం చివర్న అవభృత

(అంతిమ స్నానం) చేకూర్చి వుంటుంది. ఆతర్వాత ప్రభువులు క్రమానుగతంగా మిగి వాటిని పరిపూర్తి చేయవచ్చు. పురుష మేధానికి అవసరమయ్యే వెయ్యి మంది మనుష బలవంతంగా ఒక్కసారిగా పట్టుకున్నపుడు, ప్రజలు తప్పక మిమ్మల్ని ఆక్షేపిస్తారు. ఈ కారణం పెద్దఎత్తున ఆందోళన చెలరేగవచ్చు." రాజ పురోహితుడు చెప్పిన ఈ మాటలు (మిగతా బ్రాహ్మణులందరూ ఆమోదించారు. ఆతర్వాత రాజు యిలా అన్నాడు: "పూజ్యులారా! ప్రజ కోపతాపాలనూ, తీవ్ర ఆగ్రహాన్నీ మీరు పట్టించుకోవలసిన పనిలేదు. ప్రజల్లో చెలరేగిన ఎలాం ఆందోళననయినా నివారించటానికి అవసరమైన చర్యలన్నీ మేం తీసుకుంటాం."

ఆతర్వాత పట్టణ పౌరులతోనూ, భూకామందులతోనూ ఒక సమావేశం ఏర్పాటుచేసి రాజువారిని ఉద్దేశించి యిలా చెప్పాడు: "వెయ్యి మందితో కూడిన ఒక నరమేధాన్ని చేయాల సంకల్పించాము. కాని మా దృష్టిలో నిజాయితీ గల వారెవ్వరూ బలి యివ్వడానికి అర్హుల కారు. దాన్ని దృష్టిలో వుంచుకొనే, మీకో సలహా యివ్వదలచాము. రాజేచ్ఛని తృణీకరించి నైతిక ప్రవర్తనా పరిధుల్ని అతిక్రమించే వారు మీలో ఎవరున్నా, వారిని గురించి తెలుసుకొని అలాంటివాణ్ణి తన కుటుంబానికే మచ్చగా, ఈ దేశానికే ప్రమాదకారిగా భావించి, అతణ్ణి యజ్ఞంలో వధించడం కోసం పట్టి బంధించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాము. మా ఈ నిర్ణయాన్ని అమలుపరిచేందుకు ఏ దోషమూ లేని, చురుకైన గూఢచారులను నియమించాము. వారు నిద్రపోతున్న బాధ్యతారాహిత్యాన్ని కదిపి, కుదిపి, మిమ్మల్ని నిశితంగా పరిశీలించి, మీ నడవడిక గురించి మాకు నివేదిస్తారు."

ఆతర్వాత సమావేశానికి హాజరయిన వారిలో ప్రముఖులు, రెండు చేతులనూ కట్టుకొని, వాటిని తమ నొసటికి ఆనిస్తూ యిలా మనవి చేశారు:

15, 16 "ప్రభూ! తమ ప్రజల క్షేమం కోసమే తమ చర్యలన్నీ అయినపుడు ఆ విషయంలో తమని తప్పు పట్టాల్సిన అవసరం ఏమిటి? చివరికి ఆ బ్రహ్మ (దేవుడు) కూడా తమ చర్యని హర్షిస్తాడు. ప్రభూ! నీతి నియమాల్లో నిష్ణాతులైన తమరు మా అత్యున్నత అధికారి కూడాను. అందువల్ల ప్రభువులకు సంతోషం కలిగించే ఏ అంశమయినా, మాకు కూడా సంతోషమే. వాస్తవానికి మా ఆనందం, మా మంచి తప్ప మరేదీ ప్రభువులకు ఆనందం కలిగించదు."

ఆతర్వాత పట్టణ గ్రామీణ ప్రాంత ప్రముఖులు యీ విషయంలో ప్రభువుల ఆదేశాన్ని రసావహించారు; రాజాజ్ఞ పట్టణాల్లోనూ, దేశవ్యాపితంగానూ విస్తృతంగా ప్రచారం చేయబ ంది. దుష్టుల్ని పట్టుకోవడం జరుగుతుందని ప్రభుత్వాధికారులు తమ ముఖకవళికల ద్వారా జల్ని హెచ్చరించారు. ఈ క్రింది విధంగా ప్రతిరోజూ ప్రతిచోటా టముకు ద్వారా చాటింపు ేయడం జరిగింది:

7. ప్రజా రక్షకులయిన ప్రభువులు నిరంతరం నిజాయితీని, సత్ప్రవర్తననీ అలవరచుకొనే–ఒక్క

మాటలో చెప్పాలంటే-సదాచారం గల ప్రతి ఒక్కరి రక్షణ బాధ్యతనూ తామే చేపడతారు. అ విషయంలో తమ ప్రజల ప్రయోజనం కోసం రాజుగారు నరమేధ యజ్ఞం చేయతలపెట్టారు చెడు నడతలోనే ఆనందం పొందే వారి నుంచి వేల సంఖ్యలో బలికోసం మనుషుల్ని ఎంపి చేయడం జరుగుతుంది.

18. "అందువల్ల యిటుపైన ఎవరైనా నీతికి లోబడకుండా చెడ్డగా ప్రవర్తిస్తే, అతను ప్రభువు ఆజ్ఞను ధిక్కరించినట్టు భావించడం జరుగుతుంది. అది ప్రభువుల దృష్టికి సామంతులు తీసుకురావడం జరుగుతుంది. తన స్వంత చర్యల మూలంగానే అలాంటివారిని యజ్ఞానికి బలిపశువుగా వుపయోగించడానికి ప్రభువుల ముందు హాజరుపరచటం జరుగుతుంది. అతని శరీరాన్ని యజ్ఞ స్తంభానికి కట్టివేసినపుడు బాధతో కుప్పించిపోతున్న అతణ్ణి ప్రజలు తిలకిస్తారు."

నరమేధం కోసం దుష్టులను రాజు చాలా పకడ్బందీగా వెతికిస్తున్నాడని రాజ్యంలోని ప్రజలందరికీ తెలిసిపోయింది-ప్రజలు రోజురోజా భయోత్పాతం కలిగించే రాజాజ్ఞను ప్రకటన రూపంలో వింటూనే వున్నారు. దుష్టుల్ని వెతికి పట్టుకొనేందుకు రాజు నియమించిన సేవకులు ప్రతిరోజూ, ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడబడితే అక్కడ ప్రజలకి కనిపిస్తున్నారు. ప్రజలు చెడు ప్రవర్తనకి పూర్తిగా స్వస్తి చెప్పి, నీతిసూత్రాలను తు.చ. తప్పకుండా పాటిస్తూ, తమని తాము అదుపులో పెట్టుకోవడం చేయసాగారు. వారు పగ, ద్వేషం రగిలే ప్రతి సందర్భాన్నీ విసర్జించారు, తమ మధ్య తలెత్తే జగడాలనూ జట్టీలనూ, అభిప్రాయ భేదాలనూ పరిష్కరించుకొన్నారు, పరస్పరం ప్రేమ, గౌరవం పెంపొందించుకున్నారు. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు చెప్పిందాన్ని ఎంతో వినయవిధేయతలతో పాటించడం, సాధారణ స్వేచ్ఛాభావనని యితరులతో కలిసి పంచు కోవడం, పరులను ఆదరించడం, మంచి ప్రవర్తన, నమ్రత గలిగి వుండటం-వారిలో నెలకొని వున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే, వారు కృతయుగంలో జీవిస్తున్నట్టుగా జీవిస్తున్నారు.

19. చనిపోతామనే భయం నుంచి వారిలో మరో ప్రపంచం గురించిన ఆలోచనలు చెలరేగాయి; తమ కుటుంబ గౌరవానికి మచ్చ రానీయకుండా జాగ్రత్తపడాలనే భావన వల్ల, తమ పేరు ప్రఖ్యాతులను జాగ్రత్తగా కాపాడుకోసాగారు. వారి హృదయాల్లోని గొప్ప పవిత్ర గుణం, వారిలోని మానాభిమానాలకు బలం చేకూర్చింది. ఈ భావాలిలా వ్యాప్తిలో వుండటం మూలాన దేశ ప్రజలు తొందర్లోనే మచ్చలేని ప్రవర్తన గలవారుగా గుర్తింపు పొందారు.

20. ఎప్పటికన్నా ఎక్కువగా దేశ ప్రజల్లోని ప్రతివారూ నీతిగా ప్రవర్తించాలని బలంగా నిర్ణయిం చుకున్నా, రాజుగారి భటులు మాత్రం దుష్టులను గుర్తించడంలో జాగరూకత వహించసాగారు. ఇది కూడా విజాయితీతనం మంచి ప్రజలు తప్పకోకుండా సహకరించింది.

21. వేగుల ద్వారా తన రాజ్యంలోని పరిస్థితిని తెలుసుకున్న రాజు ఎంతో సంతోషించాడు. ఈ శుభవార్తను మోసుకువచ్చినందుకు వార్తాహరులకు విలువైన కానుకలను బహూకరించి,

మంత్రులతో సంతోషంగా యిలా చెప్పకొచ్చాడు రాజు:

22-24: "మా ప్రజల పరిరక్షణమే మాకు ముఖ్యం అని, మీకు తెలుసు. ఇపుడు యజ్ఞం కోసం కేటాయించిన ధనాన్ని మా ప్రజలు యజ్ఞ బహుమతులుగా పొందడానికి అర్హత సంపాయించుకున్నారు. అందువల్ల, సరైనదని భావించిన విధంగా, యజ్ఞాన్ని నిర్వహించాలని మేం అభిప్రాయం పడుతున్నాము. వారి ఆనందానికి ఇంధనం అయిన డబ్బుని, కావలసిన ప్రతివారూ మా దగ్గరకొచ్చి, స్వీకరించమనండి. ఈ విధంగా మన దేశాన్ని పట్టి పీడిస్తున్న దుఃఖాన్నీ, బీదరికాన్నీ అతి తొందర్లోనే పారదోలివేయగలం. మా కోపాన్ని రెచ్చగొట్టడం ద్వారా, మా ప్రజల కష్టాలు మా మనసులో జ్వాలగా మండుతూ, మా పనిలో నిరంతరం గొప్ప సహచరులుగా వుంటున్నాయి. నిజానికి మా ప్రజలను పరిరక్షించాలనే ప్రగాఢమయిన మనో నిశ్చయం మాలో కలిగిన ప్రతిసారీ మీ నించి గొప్ప సహకారం పొందుతూ వచ్చాము."

రాజాజ్ఞను శిరసావహించి, మంత్రులు వెంటనే దాన్ని అమలు చేయసాగారు. అన్ని గ్రామాల్లోనూ, పట్నాల్లోనూ, అంగళ్ళలోనూ, అదేవిధంగా రహదారుల పక్కన వున్న అన్ని వూళ్ల లోనూ ధర్మశాలలు నిర్మించమని మంత్రులు ఆజ్ఞలు జారీచేశారు. ఆ నిర్మాణం పూర్తికాగానే, దేశంలో వున్న బిచ్చగాళ్ళందర్నీ ఆ ధర్మశాలలోకి చేర్చి, రాజు ఆజ్ఞ ప్రకారం వారికి ప్రతిరోజూ బహుమతులు యిస్తూ వచ్చారు.

25. ఆవిధంగా దేశంలోంచి పేదరికం తొలగిపోయింది. రాజు అందించిన డబ్బుతో ప్రజానీకం రకరకాల అందమైన దుస్తులతో, నగలతో అలంకరించుకొని పండుగ రోజుల్ని గుర్తు చేస్తున్నారు.

26. చెరువులో లేచిన చిన్నచిన్న కెరటాల వల్ల కమలాల పూలరజం ఏ విధంగానైతే ఎక్కువ నీటి ఉపరితలం మీద వ్యాపిస్తుందో, అదే విధంగా బహుమతులు పొందిన ప్రజలు ఆనందంతో రాజు దాతృత్వాన్ని కీర్తినీ పొగుడుతూ, వాటిని అన్ని దిక్కులకూ వ్యాపింపజేయసాగారు.

27. తమ పాలకుని వివేకవంతమైన చర్యల వల్ల, మొత్తం ప్రజలందరూ సన్మార్గంలో నడుచు కోవడంతో, ప్రజల శ్రేయస్సుకు ఆ సుగుణాలు సహకరించి, మహమ్మారి మొదలగు రోగాలు తమ పట్టుని కోల్పోయి, తెరమరుగయినాయి.

28. కొత్త రాజ్యాన్ని చేపట్టిన రాజులు చట్టబద్ధమయిన అంశాలను ఆమోదించినట్టుగానే, క్రమం తప్పకుండా ఒకదాని తర్వాత ఒకటి చొప్పున రుతువులు వచ్చి ప్రజలందర్నీ ఉల్లాసంలో ఉప్పొంగేలా ముంచెత్తసాగాయి. అతర్వాత భూదేవి ఇబ్బడి, ముబ్బడిగా వివిధ రకాల ధాన్యాల పంటలను యిస్తోంది. చెరువుల్లోనూ, కాలవల్లోనూ స్వచ్ఛమయిన, నీలం రంగు నీరూ-నీటి మీద తేలియాడే కలువ పువ్వులూ.

29. మానవాళిని ఎలాంటి అంటురోగాలూ బాధించలేదు; ఎన్నడూ లేని విధంగా మందులుగా వుపయోగించిన వనమూలికలు అమోఘంగా గుణం చూపాయి; రుతు పవనాలు సకాలంలో సక్రమంగా వీచాయి; గ్రహాలు శుభప్రదమయిన మార్గాల వెంట పయనించాయి.

30. ప్రమాదకరంగా దల్లక్రిందులు చేసే పరిస్థితులు యింటా, ఇతర దేశాల నుంచీ కానరావు. అందువల్ల భయపడాల్సిన పనిలేదు. ఆ దేశ ప్రజలు నిరంతరం రుజుప్రవర్తనతో, సంయమనంతో, సత్ప్రవర్తననీ, నమ్రతనీ అలవరచుకొని, కృతయుగం నాటి విశేష ప్రయోజనాలను పోలిన ప్రయోజనాలను పొందారు.

తన అధికారంతో అప్పుడు రాజు తన పద్ధతిలో యజ్ఞాన్ని న్యాయం (విధుల) ప్రకారం నిర్వహించి, పేద ప్రజల కష్టాలనూ, మహమ్మారులనూ రూపుమాపాడు. దేశంలో సుఖశాంతులతో సమృద్ధిలో వర్ధిల్లే ప్రజలు చూపరులకు ఆనందం కలిగిస్తున్నారు. అదే విధంగా తమ ప్రభువుని ఆశీర్వదించడంలో ప్రజలు ఎన్నడూ అలసిపోవడం లేదు, డస్సిపోవడం లేదు. ఆ విధంగా ఆ రాజు కీర్తి అన్ని దిశలకూ వ్యాపించసాగింది.

ఒకవాడు, (నిజమైన) నమ్మకాన్ని యిష్టపడిన ఒక అత్యున్నత రాజోద్యోగి రాజుతో యిలా అన్నాడు: "నిజంగా చెబుతున్నాను, ప్రభూ! నిజంగా!"

31. "ప్రభువులు ఎల్లప్పుడూ అత్యున్నత, అధమ, మధ్యమ తరహా-యిలా అన్నిరకాలయిన వ్యవహారాలనూ నిర్వర్తిస్తూండటం వల్ల ఎంతటి తెలివిగల వారినయినా జ్ఞానంతో అధిగమించగలరు."

"ప్రభువులు జంతుబలి అనే నిందనీయమయిన పాపం నుంచి బయటపడి, సరైన పద్ధతిలో యజ్ఞం చేయడం వల్ల తమ ప్రజలు సుఖసంతోషాలు యీ లోకంలోనూ, పరలోకంలోనూ తమకు లభిస్తాయి. ప్రజలు ధర్మబద్ధంగా సత్ప్రవర్తనను అలవరచుకోవడం వల్ల, వారి కష్టాలు గట్టెక్కాయి; పేదరికం వల్ల అనుభవించిన బాధలు కూడా తొలగిపోయాయి. వేయేల? తమ ప్రజలు ఎంతో సుఖసంతోషాలతో వున్నారు.

32. "తమ అవయవాల మీద కప్పి వున్న నల్లని జింక చర్మం పున్నమి చంద్రుని మొహం మీద మచ్చను గుర్తు తెస్తోంది. అలాగే (యజ్ఞ) దీక్షవల్ల తమ మీద విధించుకున్న నిగ్రహం తమ ప్రవర్తన, నడవడికలోని సహజ సౌందర్యానికి ఆటంకం కాలేదు. దీక్షితునిగా తమ తల మీద ధరించిన వస్త్రం రాజఛత్ర కాంతులతో కలిసి మెరిసిపోతుంది. చివరకి, తమ విశాల హృదయంతో, ఇంద్రుని గర్వాన్ని అణచివేసి, అధిగమించారు."

33. "నిజానికి, ఓ వివేకవంతుడయిన రాజా! కొంత మంచి జరుగుతుందనే ఆశతో యజ్ఞం చేయాలని కోరేవారి కోసం, ప్రాణం వున్న జీవాలకు హాని చేయడం నికృష్టమైన చర్య. దానికి భిన్నంగా–తమ కీర్తికి స్మృతి చిహ్నమయిన తమ యజ్ఞం, చక్కటి తమ ప్రవర్తనకీ, అవగుణాల ఎడల తమ విరక్తికీ అనుగుణంగానే వుంది.

34. "అహా! తమలో రక్షకుణ్ణి పొందిన తమ ప్రజలు ఎంతగా ఆనందిస్తారో! ఏ తండ్రి కూడా (తమలాగా) తన పిల్లలకి ఉత్తమ సంరక్షకుడు కాజాలడు."

మరొకరు యిలా అన్నారు:

35. "ధనవంతులు దానగుణాన్ని ఎందుకు అలవరుచుకుంటారంటే, ఆ సుగుణం పెంపొందించు కోవడంలో వారికి ఆకాంక్షలున్నాయి కనుక; మంచిపేరు తెచ్చుకునే కోరికతోనో, మరణానంతరం స్వర్గానికి పోవాలన్న ఆశతోనో సత్ప్రవర్తనను అలవరుచుకోవచ్చు. ఇతరుల క్షేమం కోసం నువ్వు చూపిన నేర్పులో ఆ రెండు లక్షణాలూ లేవు. నీ వంటి నేర్పు, జ్ఞానమూ, సౌశీల్యమూ సాధించిన వారిలో మాత్రమే సాధ్యం." ఆవిధంగా స్వచ్ఛమైన హృదయం గలవారు కుటిలుల ప్రేరణకు లొంగరని తెలుస్తోంది. దీన్ని తెలిసి, హృదయ నైర్మల్యం అవలరచుకోవాలి."

[రాజకుమారులకు చెప్పే ఆధ్యాత్మిక పాఠాల్లో, యివి కూడా చెప్పాలి:]

"తన ప్రజల మంచి ఆశించిన వ్యక్తి, తప్పదు శ్రమించడం.

అది తెస్తుంది సుఖసంతోషాలు, ముక్తి, కీర్తి.

ఇది తప్ప రాజులకు పరమార్థం లేదు."

ఈ దిగువ విషయాన్ని కూడా బోధించాలి: "భౌతిక సంపద కోసం పాటుపడే (రాజ కుమారుడు) మత బోధనల కనుగుణంగా వ్యవహరించాలి. ప్రజల మత నడవడికలో భాగమైన చింతన అభ్యున్నతికి మూలాధారంగా వుంటుంది."

ఆతర్వాత యీ విషయాన్ని కూడా బోధించాలి: "జంతువులకు హాని చేయడం వల్ల బ్రహ్మానందం కలుగదు. కాని దాతృత్వం, ఆత్మ నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం-యిలాంటివే మరికొన్నిటికి ఆ శక్తి వుంది; అందుచేత బ్రహ్మానందానికి తపించేవారు నీతి, ధర్మం, సన్మార్గానికి తమను తాము అంకితం చేసుకోవాలి." తథాగతుని గురించి వ్యాఖ్యానించి చెప్పేనపుడు కూడా–"తాను యింకా గత జన్మల్లోనే వున్నపుడు కూడా, ఈ విధంగా ప్రపంచ ప్రయోజనాల

వేపు ప్రభువు తమ మొగ్గుని చూపించారు."

# IV

యజ్ఞంపై మరొక శక్తివంతమయిన దాడి 'కుతదంత సుత్త' ప్రవచనాల్లో మనకి కనిపిస్తుంది. అది యిలా వుంది:

## తప్పదు యజ్ఞమూ-సరైనదీనూ

1. ఈ విధంగా విన్నాను నేను. ఐదు వందల మంది భిక్షుక మహాగణంతో కలిసి ఒకనాడు భగవానుడు మగధ దేశం పర్యటించి, ఆ దేశంలో కనుమత అనే బ్రాహ్మణ గ్రామం చేరుకున్నారు. ఆ కనుమతలో వారు 'అంబలత్తిక' అనే విహార స్థలంలో బసచేశారు.

అదే సమయంలో బ్రాహ్మణుడయిన కుతదంతుడు కనుమతలో నివశించేవాడు. మగధరాజయిన సేనియ బింబిసారుడు కనుమత గ్రామాన్ని కుతదంతునికి ఉన్నతమయిన రాజ బహుమతిగా ఆ గ్రామం మీద సంపూర్ణ అధికారాలతో యిచ్చివేశాడు. కనుమత గ్రామం సజీవంగా కళకళలాడుతూ, సమృద్ధిగా గడ్డిభూములతో, వనసీమతో, నీటితో, ధనధాన్యాలతో తులతూగుతూండేది.

అదే సమయంలో బ్రాహ్మణ కుతదంతుడి తరఫున ఒక గొప్ప యజ్ఞం చేయడానికి రంగం సిద్ధమయింది. ఒక వంద ఎద్దులూ, వంద కోడెగిత్తలూ, వంద ఆవుపడ్డలూ, వంద మేకలూ, వంద గొర్రెపోతులూ-వీటన్నిటినీ వధించడం కోసం యజ్ఞ స్తంభం దగ్గరకి వాటిని చేర్చారు.

2. అప్పుడు బ్రాహ్మణులూ, కనుమత గ్రామ గృహస్థులూ 'సమాన గౌతముడు వస్తా'రని తెలుసుకున్నారు. వారు గుంపులు గుంపులుగా కనుమత నుంచి అంబలకత్తికకి బయలుదేరారు.

3. అప్పుడే బ్రాహ్మణ కుతదంతుడు తన మధ్యాహ్నపు విశ్రాంతి కోసం యింటి మిద్దెపై భాగం మీదకి వెళ్ళాడు. గుంపులు గుంపులుగా గ్రామ ప్రజలు ఈ విధంగా ప్రయాణమవుతూ వుండడం చూసి, 'కారణం ఏమి'టని ద్వార పాలకుణ్ణి అడిగాడు. అతను కుతదంతునికి వివరించాడు.

4. అందుమీదట కుతదంతుడు యిలా ఆలోచించాడు: 'మూడింతల పద్ధతితో, పదహారు వుపకరణాల సాధనాలతో విజయవంతంగా యజ్ఞం చేయడం గురించి సమాన గౌతమునికి బాగా తెలుసునని విన్నాను. ఇపుడు నాకు ఈ విషయాలేమీ తెలియకపోయినా, యజ్ఞాన్ని చేయతలపెట్టాను. అందువల్ల సమాన గౌతముని దగ్గరకు వెళ్లి దాన్ని (యజ్ఞం) గురించి అడిగి తెలుసుకోవడం మంచిది.'

తాను కూడా భగవానుడిని కలుస్తానని, తాను వచ్చే దాకా వుండమని చెప్పి కుతదం తుడు తన ద్వారపాలకుని ద్వారా బ్రాహ్మణులకీ, గృహస్థులకూ కబురుపెట్టాడు.

5. కానీ అదే సమయంలో చాలామంది బ్రాహ్మణులు ఆ గొప్ప యజ్ఞంలో పాల్గొనడానికి కనుమతకి వచ్చారు. వచ్చేక విషయం తెలుసుకున్న బ్రాహ్మణులు కుతదంతుని దగ్గరకి వెళ్లి (భగవానుడి దగ్గరకు) వెళ్లవద్దనీ సోనదండునికి చెప్పిన కారణాలనే యితనికీ చెప్పారు. కాని సోనదండుడు చెప్పిన విధంగానే కుతదంతుడు కూడా బ్రాహ్మణులకు జవాబు చెప్తాడు. అతని సమాధానానికి తృప్తి చెందిన ఆ బ్రాహ్మణులు, అతనితో కలిసి భగవాన్‌ని చూడ్డానికి బయలుదేరారు.

9. భగవానుడు ఆసనం మీద కూచొని వుండగా, బ్రాహ్మణ కుతదంతుడు తాను విన్నదంతా ఆయనకి నివేదించి, మూడు పద్ధతుల్లో, పదహారు రకాల వుపకరణలతో కూడిన యజ్ఞాన్ని విజయవంతంగా ఎలా నిర్వహించాలో వివరించమని ఆయన్ని వేడుకుంటాడు అతను.

"అయితే సరే, ఓ బ్రాహ్మణా! చెవి యొగ్గి శ్రద్ధగా విను. చెబుతాను."

"మంచిది. సెలవియ్యండి, భగవాన్!" అన్నాడు సమాధానంగా కుతదంతుడు. అంతట భగవాన్ యిలా చెప్తాడు:

10. "ఓ బ్రాహ్మణా! చాలాకాలం క్రిందట మంచి బలశాలీ, గొప్ప సిరిసంపదలతో, ఆస్తితో, బంగారం వెండీ నిల్వలతో, వినోదానికి అవసరమయిన హంగులతో, ధన ధాన్యాలతో, సమృద్ధయిన ధనాగారంతో, ధాన్యపు కొట్లతో మహావిజిత అనే రాజు పరిపాలించేవాడు. ఒకనాడు మహావిజిత ఏకాంతంలో ధ్యానంలో వుండగా, ఒక ఆలోచన వచ్చి అతణ్ని కలవరపరచింది. ఆ ఆలోచనేమిటంటే– "ఒక మనిషి అనుభవించడానికి అవసరమైన అన్ని మంచి వస్తువులూ మా దగ్గర యిబ్బడిముబ్బడిగా వున్నాయి. మా భుజబలంతో జయించి రాజ్యాన్ని విస్తరింపజేశా. చాలా కాలందాకా సుఖశాంతులతో, ధనధాన్యాలతో తులతూగటం కోసం మేమొక యజ్ఞం చేస్తే బావుంటుంది."

ఈ ఆలోచన రాగానే వెంటనే తన బ్రాహ్మణ పురోహితుణ్ని పిలిపించి, తాను ఏమి ఆలోచించినదీ పూసగుచ్చినట్టు చెప్పి, చివర్ని యిలా అన్నాడు రాజు మహావిజిత: "ఓ బ్రాహ్మణా! పూజ్యులు యిష్టపడితేనే మేమొక గొప్ప యాగాన్ని చేయతలపెట్టాం. చాలా కాలందాకా మా క్షేమం కోసం, సుఖశాంతులు కోసం ఆ యజ్ఞాన్ని ఎలా చెయ్యాలో మాకు నిర్దేశించండి."

11. ఆతర్వాత రాజ పురోహితుడైన బ్రాహ్మణుడు రాజుతో యిలా చెప్తాడు: "ప్రభూ! రాజ్యం

దోపిడీలకు, దౌర్జన్యాలకూ నిలయమయింది. ఇతర రాజ్యాల్లోని బందిపోట్లు మన గ్రామాలపై, పట్టణాలపై పడి యిళ్లను దోచుకుపోతున్నారు. రోడ్ల మీద ప్రయాణం చేయాలంటేనే రక్షణ లేని పరిస్థితి ఏర్పడింది. దేశం దుర్భర పరిస్థితిలో వున్న సమయంలో ప్రభువులు ప్రజలపై కొత్త పన్నుల భారం మోపాలని చూడడం, వాస్తవానికి ప్రభువుల తప్పుగా ప్రవర్తిస్తున్నారనే చెప్పాలి. కాని ఒకవేళ ప్రభువులు మరోలా అనుకోవచ్చు–'మేము అలజడులను బలంగా అణచివేసి, దోషులను దేశం నుంచి బహిష్కరించి గానీ, జరిమానాలు, చెరసాలలూ, ఉరికొయ్యలూ శిక్షలుగా విధించిగానీ యీ దుర్మార్గుల ఆట కట్టించగలం!' అని. ప్రభువులు వారి అలజడులనూ, ఆగడాలనూ సమర్ధవంతంగా ఎదుర్కొని, వాటిని అంతమొందించవచ్చు. కాని శిక్షల నుంచి తప్పించుకున్న గజదొంగలు రాజ్యంలో యింకా అలజడిని సృష్టిస్తూ వుండవచ్చు. ఈ అశాంతినీ, ఈ వ్యవస్థనీ పూర్తిగా తొలగించడానికి అనుసరించాల్సిన ఒక పద్ధతి వుంది. అదేమిటంటే–రాజ్యంలో పశువుల్నీ, పంట పొలాల్నీ ఎవరైతే శ్రద్ధగా చూసుకుంటారో, వారికి ప్రభువులు ఆహారం, పంటలు పండించుకోవడానికి విత్తనాలు సరఫరా చేయించాలి. అలాగే రాజ్యంలో శ్రద్ధగా వర్తకం చేసుకొనేవారికి ప్రభువులు పెట్టుబడి యివ్వాలి. రాజ్యంలో ప్రభుత్వోగాల్ని శ్రద్ధగా చూసుకొనేవారికి, ప్రభువులు వేతనాలు సక్రమంగా యిచ్చి, వారికి ఆహారం సరఫరా చేయించాలి. ఆయా వ్యక్తులు తమతమ స్వంత వ్యాపారాలను చేసుకుంటారు అప్పుడు. యిక వారు రాజ్యాన్ని యిబ్బందులపాలు చెయ్యరు. ఆ విధంగా ప్రభుత్వ ఆదాయం బాగా పెరుగుతుంది; దేశం సుఖశాంతులతో వర్ధిల్లుతూ, ఏ అలజడులూ లేకుండా ప్రశాంతంగా వుంటుంది; దేశ ప్రజానీకం ఒకరంటే వేరొకరికి ఆత్మీయతతో, అభిమానంతో సంతోషంగా వుంటారు; తమ పిల్లల్ని కేరింతలు కొట్టిస్తూ, తలుపులకు గడియపెట్టకుండా, బార్లా తెరిచి వుంచుతారు."

"అప్పుడు రాజు మహావిజిత రాజ పురోహితుడు చెప్పిన విషయాన్ని ఆమోదించి, దాన్ని అమలుపరిచాడు. ఇహ ఆ వ్యక్తులు తమతమ వ్యాపారాలను సక్రమంగా చేసుకుంటూ రాజ్యాన్ని యిబ్బందిపాలు చేయడం లేదిప్పుడు. ఆతర్వాత ప్రభుత్వ ఆదాయం బాగా పెరిగింది. దేశంలో ఏ అలజడులూ లేకుండా ప్రశాంతంగా వుంది. దేశ ప్రజానీకం ఒకరంటే వేరొకరికి ఎంతో ఆత్మీయతతో, అభిమానంతో, సంతోషంతో వుండసాగారు; తమ పిల్లల్ని కేరింతలు కొట్టిస్తూ, తలుపులకు గడియ పెట్టకుండా, బార్లా తెరిచి వుంచసాగారు."

12. అందువల్ల మహావిజిత రాజు తన రాజ పురోహితుణ్ణి పిలిపించి, యిలా చెప్పాడు: "దేశంలో పూర్వపు అలజడులూ, అశాంతీ ముగిసీ, ఒక కొలిక్కి వచ్చి, దేశం ప్రశాంతంగా వుంది. చిరకాలందాకా మా క్షేమం, మా బాగుకోసం, పూజ్యుడా! మేం గొప్ప యజ్ఞం చేయతలపెట్టాం. అది చేసే విధం ఎలాగో సలహా యివ్వండి."

"మేం గొప్ప యజ్ఞం తలపెట్టాం. చాలాకాలం దాకా మా క్షేమం, మా బాగుకోసం ఈ యజ్ఞం చేయడానికి పూజ్యులు అనుమతించండి." అని చెప్పి, రాజు తన రాజ్యంలోని గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ నివసించే అందరు క్షత్రియులకూ, సామంతులకూ, రైతులకూ,

అలాగే గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ నివసించే మంత్రులకూ, రాజాధికారులకూ, అదే విధంగా గ్రామాల్లో గానీ, పట్నాల్లో గానీ నివసించే బ్రాహ్మణులకూ, యింకా గ్రామాల్లో గానీ, పట్నాల్లోగానీ నివసించే స్థితిపరులైన గృహస్థులకూ ఆహ్వానాలు పంపించాలి."

"తర్వాత మహావిజిత రాజు యిలా చెప్పాడు-"ఓ బ్రాహ్మణా! మీరు చెప్పినట్టే చేస్తాను." అని రాజ పురోహితుని మాటల్ని ఆమోదించి, అలాగే చేశాడు రాజు. క్షత్రియులూ, మంత్రులూ, బ్రాహ్మణులూ, గృహస్థులూ- ఒకే విధమయిన జవాబు యిచ్చారు: "ఓ రాజా! ఇదే అదను. ప్రభువులు యజ్ఞం చేయండి" అంటూ.

ఆ విధంగా ఆమోదంతో సహచరులయిన ఆ నాలుగు వర్గాల వారూ రాజుగారు తలపెట్టే యజ్ఞానికి అవసరమైన ఉపకరణలు సమకూర్చిపెట్టడానికి సిద్ధంగా వున్నారు.

13. ఈ క్రింద చెప్పిన ఎనిమిది విధాల్లోనూ మహావిజిత రాజు సమృద్ధి కలిగి వున్నాడు:

"ఆయన యిటు తల్లి వంక, అటు తండ్రి వంక-రెండువేపులా, ఏడు తరాల్లో పరిశుద్ధమయిన సంతతి. ఆయనకి ఎలాంటి కళంకమూ లేదు. పుట్టుకకు సంబంధించి ఏ అవలక్షణమూ లేదు."

"ఆయన సొగసైన వాడు, సుందరరూపి, చూడగానే విశ్వాసం కలిగించే గొప్ప అందంగా వుండే వర్చస్సు, కాంతులీనే శరీరఛాయ, చక్కని సాన్నిధ్యం, రాజసం వుట్టిపడే వ్యక్తిత్వం."

"ఆయన సంపన్నుడు, గొప్ప సిరి సంపదలతో, పెద్దపెద్ద ఆస్తులతో, బంగారం, వెండి నిల్వలతో, భోగవిలాసాలకు అవసరమయిన అన్ని హంగులతో, ధనాగారాలతో, ధాన్యాగారాలతో ధాన్యరాశులు నిండి అలరారుతున్నాడు."

"క్రమశిక్షణ కలిగి, విశ్వాసపాత్రమయిన, ఏనుగులు, అశ్వాలు, రథాలు, విలుకాండ్రు-యీ చతురంగ బలాల సైన్యాన్ని ఆదేశించే ఆయన సర్వశక్తిమంతుడు. ఆయన తన కీర్తితోనే తన శత్రువుల్ని దగ్ధం చేసేస్తాడని అనిపిస్తుంది."

"ఆయన ఆస్తికుడు, దయార్ద్ర హృదయుడు, ఉత్తముడయిన దాత, వసంతంలో నుయ్యిలా సమానులూ (బౌద్ధులూ), బ్రాహ్మణులూ, బాటసారులూ, బిచ్చగాళ్ళూ, దరఖాస్తు దారులూ కావలసినంత పొందవచ్చు-సర్వవేళలా తెరిచివుండే ఆయన భవనం నుంచి."

"చెప్పేది విని, ఆయన అర్థం చేసుకొని, వివరించగలడు. ఈ సూక్తికి యిలాంటి అర్థాలున్నాయి. దానికి అలాంటి అర్థాలున్నాయి" అంటూ.

"ఆయన వివేకవంతుడు, ప్రావీణ్యం గలవాడు, మేధావి, భూత, భవిష్యత్ వర్తమానాలను గురించి ఆలోచించగల సమర్థుడు."

"తన ఎనిమిది సామర్థ్యాలను కూడా, ఉపకరణలతో సహా ఉపయోగించి ఆయన యజ్ఞం చేయగలడు."

14. "రాజ పురోహితుడైన బ్రాహ్మణునికి యీ దిగువ నాలుగు విధాలయిన సామర్థ్యాలున్నాయి."

"ఆయనది ఉత్తమ పుట్టుక, యిటు తల్లివంక గానీ, అటు తండ్రివంక గానీ ఏడు తరాల్లోనూ పవిత్రమైన సంతానం. ఎలాంటి కళంకమూ, అవలక్షణమూ లేని పుట్టుక."

మంత్రాలు ఆయనకు కంఠతా వచ్చు. పదేపదే పునశ్చరణ చేయగల విద్యార్థి. మూడు వేదాలలో పండితుడు. మంత్రానుక్రమణికను, కర్మకాండను, ఉచ్చారణ విధానాన్నీ వ్యాఖ్యానాలనీ నాల్గవదిగా, పురాణాలను ఐదవదిగా చదివినవాడు. పలుకుబడిలోనూ, వ్యాకరణంలోనూ దిట్ట. లోకాయతనంలోనూ, మహాత్ముల శరీరంలోని ముప్పై చిహ్నాలను గుర్తించడంలోనూ నిష్ణాతుడు. "ఆయన సదాచార సంపన్నుడు, సదాచారంలో స్థిరపడ్డవాడు, గొప్పగా ఎదిగిన సుగుణాల రాశి."

"ఆయన ప్రతిభావంతుడు, ప్రావీణ్యుడు, వివేకవంతుడు; పాకశాస్త్ర ప్రావీణ్యంలో ప్రథముడో, ద్వితీయుడో."

"ఈ విధంగా ఆయనకున్న నాలుగు సామర్థ్యాలూ, ఉపకరణలతో సహా–ఆ యజ్ఞానికి వుపకరిస్తాయి."

15. ఆతర్వాత, ఓ బ్రాహ్మణా! ఆచార్యా! యజ్ఞం ప్రారంభం కావడానికి ముందుగానే, మహావిజిత రాజుకి ఆ మూడు పద్ధతుల గురించీ వివరించండి:

"ఆ గొప్ప యజ్ఞాన్ని ప్రారంభించడానికి ముందుగా ప్రభువయిన రాజు, 'అయ్యో! ఇందు వల్ల సిరిసంపదల్లో కొంతభాగం ఖర్చయిపోయిందే' అని బాధ పడతాడా? అలాంటి ఆలోచన ప్రభువుకి రాకుండు గాక! ఆ గొప్ప యజ్ఞాన్ని అర్పణ చేస్తూ, ప్రభువయిన రాజు యిలా మనసులో బాధరాదు: 'అయ్యో! యిందులో నా సిరి సంపదల్లో కొంత భాగం ఖర్చయి పోయిందే!" అని ప్రభువయిన రాజు యిలా మనసులో ఎంతమాత్రమూ చింతించరాదు.

"అయ్యో! యిందులో సిరిసంపదల్లో కొంతభాగం ఖర్చుయిపోయిందే" అంటూ ప్రభువయిన రాజు గొప్ప యజ్ఞాన్ని అర్పణ చేశాక, మనసులో చింతించరాదు.

"ఆ విధంగా యజ్ఞం ప్రారంభించడానికి ముందు, రాజు పురోహితుడయిన ఆచార్యా! మూడు పద్ధతులను మహావిజిత రాజుకు వివరించండి!"

16. "ఓ బ్రాహ్మణుడా! యజ్ఞంలో పాల్గొనేవారికి, యజ్ఞం చేసిన తర్వాత కలుగబోయే పది విధాలయిన పరితాపం గురించి, అంతకు ముందే రాజ పురోహితుడు యిలా చెప్పాడు: నీవు చేయబోయే యజ్ఞాన్ని చూడ్డానికి, ప్రభూ! రకరకాల వ్యక్తులు వస్తారు. జీవరాశుల ప్రాణాలు తీసేవారూ, అలా చేయనివారూ–తాము యివ్వని వాటిని తీసుకోజూచేవారూ, అలా చేయని వారూ–అబద్ధాలు చెప్పేవారూ, అలా చెప్పనివారూ–అకారణంగా అపనిందలు వేసేవారూ, అలా చేయనివారూ–మొరటుగా మాట్లాడేవారూ, అలా చేయనివారూ–పోచికోలు కబుర్లు చెప్పేవాళ్లూ, అలా చెప్పని వారూ–ఏదో ఆశించేవారూ, అలా చేయని వారూ–పగనీ, ద్వేషాన్నీ రగిలించేవారూ, అలా చేయనివారూ–తప్పుడు అభిప్రాయాలు కలవారూ, సదభిప్రాయాలు కలవారూ – ఇలా వివరించిన వారిలో చెడుగు చేసేవారిని, అలాగే వుండనివ్వండి. మంచి చేసేవారి కోసం, ప్రభూ! కర్మకాండలు ఏర్పాటు చెయ్యండి, ప్రభూ! వారి కోసం మన మనుషులు సంతోషపడనివ్వండి. వారిలో మన మనసులు శాంతిని పొందనివ్వండి."

17. "ఆతర్వాత, ఓ బ్రాహ్మణా! ఆచార్యవర్యా! ప్రభువు యజ్ఞం నిర్వహిస్తూ వుండగా ఆయన హృదయం పదహారు విధాలుగా ఆవేశం పొందుతుంది. ఉద్వేగం పొందుతుంది. ప్రేరణ పొందుతుంది, ఆదేశితమవుతుంది: 'యజ్ఞం చేస్తున్న రాజు గురించి యిలా చెప్పే వారెవరయినా వున్నారా: "మహా విజితరాజు తన ప్రజల్లో నాలుగు వర్గాల వారిని ఆహ్వానించకుండా, ఎనిమిది స్వంత సామర్థ్యాలూ, దానాలూ లేకుండా, నాలుగు సామర్థ్యాలూ గల బ్రాహ్మణుని సహకారం తీసుకోకుండా యజ్ఞం చేస్తున్నాడు." అని ఎవరయినా అంటే, వారు నిజాన్ని మాట్లాడటం లేదని చెప్పాలి. యజ్ఞం చేయడానికి నాలుగు వర్గాల ప్రజల ఆమోదాన్ని పొందిన రాజుకి ఎనిమిది సామర్థ్యాలున్నాయి, ఆయన పురోహితునికి నాలుగు స్వంత గుణాలున్నాయి. ఇహ పదహారు షరతులు గురించి–ప్రతి షరతూ నెరవేర్చడం జరుగుతుందని రాజు నిశ్చితంగా వుండవచ్చు. ఆయన యజ్ఞం చేసి, సంతోషం అనుభవించి, మనసులో ప్రశాంతంగా వుండవచ్చు."

18. "ఆతర్వాత, ఓ బ్రాహ్మణా! ఆ యజ్ఞంలో ఏ రకమయిన ఎద్దుల్నిగానీ, మేకల్నిగానీ, కోళ్లనిగానీ, బలిసిన పశువుల్నిగానీ, ఏ యితర జీవరాసుల్ని గానీ చంపడం జరగలేదు. అక్కడ యజ్ఞ స్తంభంగా పాతడం కోసం ఏ చెట్టునీ నరికివేయడం జరగలేదు. యజ్ఞ స్థలంలో చల్లటం కోసం దర్భగడ్డిని కొడవలితో కోయడం జరగలేదు. అక్కడ పని చేయడానికి నియోగించిన బానిసలనూ, వార్తాహరులనూ, సేవకులనూ ఇనుపచువ్వలతో గానీ, భయంవల్ల గానీ తరిమి వేయడం జరగలేదు. లేదా కళ్లలో నీళ్లు కుక్కుకుంటూ, వారు పని చేయనూలేదు. యజ్ఞం

పనులలో సహాయం చేయడానికి ఎంపిక చేసిన వారు ఆయా పనుల్లో సహాయం చేశారు. అలా ఎంపిక చేయని వారు సహాయం పనులు చేయలేదు. అలాగే పనులు చేయడానికి ఎంపిక చేసిన ప్రతివారూ, ఆయా పనులు చేశారు. అలా ఎంపిక చేయనివారు వెళ్లిపోయారు అక్కడనుంచి. యజ్ఞంలో నెయ్యి, నూనె, వెన్న, పాలు, తేనె, పంచదార బలిగా వుపయోగించడం జరిగింది."

19. ఆతర్వాత, ఓ బ్రాహ్మణా! క్షత్రియ సామంతులూ, మంత్రులూ, రాజాధికారులూ, స్థాయి గలిగిన బ్రాహ్మణులూ, స్థోమత గలిగిన గృహస్థులూ–వారు గ్రామీణులయినా, పట్టణవాసులయినా తమతో డబ్బు తీసుకెళ్లి, మహావిజితరాజుతో యిలా చెప్పారు–"తండ్రీ! ప్రభువులకు అక్కరకు వస్తుందని దండిగా డబ్బుని తీసుకొచ్చాం. మా చేతుల మీదుగా యిచ్చే యీ డబ్బుని ఏలిన వారు స్వీకరించాలి!"

"మిత్రులారా! నా దగ్గర చాలినంత డబ్బుంది. వసూలు చేసిన పన్నులే బోలెడున్నాయి. అందువల్ల మీరు తెచ్చిన డబ్బు మీ దగ్గరే వుంచుకొని, ఇక్కడ నుంచి కావలసినంత డబ్బును మీరు తీసుకెళ్లండి!"

ఈ విధంగా తాము ఇవ్వజూపిన డబ్బుని రాజు నిరాకరించగా, వాళ్లు ఒక పక్కకి వెళ్లి, తమలో తాము యిలా చర్చించుకున్నారు–"మనం తెచ్చిన డబ్బుని ఎవరి యిళ్లకి వాళ్లు తిరిగి తీసుకుపోవడం వుచితం కాదు. మహా విజితరాజుగారు పెద్దఎత్తున యజ్ఞం చేస్తున్నారు. యజ్ఞానంతర కార్యక్రమం మనం చేపడితే బావుంటుంది గదా? ఏవంటారు?"

20. "రాజు చేస్తున్న యజ్ఞవాటికకి తూర్పు దిశగా క్షత్రియులు నిరంతరం దానాలు చేయడం మొదలుపెట్టారు. అలాగే అధికారులు దక్షిణం వేపున, బ్రాహ్మణులు పశ్చిమ దిశగా, గృహస్థులు ఉత్తరం వేపుగా దానధర్మాలు నిరంతరం చేయడం సాగించారు. దానం చేస్తున్న వస్తువులు గానీ, బహుమతి ఇస్తున్న పద్ధతిగానీ–మహావిజిత రాజు చేస్తున్న మహా యజ్ఞానికి అనుగుణంగానే వున్నాయి."

"ఆవిధంగా, ఓ బ్రాహ్మణా! యజ్ఞానికి నాలుగు విధాలుగా సహకారం లభిస్తోంది. మహా విజితరాజుకి ఎనిమిది స్వంత సామర్థ్యాలున్నాయి. యజ్ఞం నిర్వహించే రాజ పురోహితునికి నాలుగు సుగుణాలున్నాయి. యజ్ఞం మూడు విధాలుగా అర్పించడం జరుగుతుంది. దీన్నే, ఓ బ్రాహ్మణా! యజ్ఞాన్ని ఒక ఉత్సవంగా, మూడు రకాల పద్ధతుల్లో, పదహారు విధాల సామగ్రితో నిర్వహించడం అంటారు."

21. అతను యీ విధంగా మాట్లాడగా, ఆ బ్రాహ్మణులు పెద్ద పెట్టు గొంతెత్తి అరుస్తూ యిలా చెప్పారు–"ఎంత దివ్యంగా వుందీ యజ్ఞం, నెరవేర్చిన తీరు ఎంత స్వచ్ఛంగా వుంది!" అవి. కాని

బ్రాహ్మణ కుతదంతుడు అక్కడ మౌనంగా కూచున్నాడు.

అంతట కుతదంతుణ్ని ఆ బ్రాహ్మణులు యిలా అడిగారు: "సమాన గౌతముడి మంచి మాటల్ని మీరు ఎందుకు ఆమోదించరాదు?" అని.

"నేను ఆమోదించకమానను. సమాన గౌతముడు అంత చక్కగా మాట్లాడిన మాటల్ని బాగా మాట్లాడారని ఆమోదించని వారి తలకాయ, విజానికి, రెండుగా పగిలిపోతుంది." కాని సమాన గౌతముడు చెబుతాడని నేను అనుకోను యిలా: "అలా నేను విన్నాను" అని, లేదా "ఉచితమని భావించను" అని, కాని యిలాగే అంటాడు–"అప్పుడు యిలా వుంది", లేదా, "ఈ విధంగా వుండింది అప్పుడు" అని. అందువల్ల నేను యిలా అనుకున్నాను, "నిశ్చయంగా సమాన గౌతముడే అప్పుడు మహావిజిత రాజయి వుంటాడు లేదా యజ్ఞానికి సహకరించిన రాజ పురోహితుడయిన బ్రాహ్మణుడయినా అయి వుంటాడు. అలాంటి యజ్ఞాన్ని చేసిన వారూ, లేదా దాన్ని చేయడానికి ప్రోత్సహించిన వారూ, చనిపోయిన తర్వాత శరీరం విచ్ఛిన్నమయిపోయాక, స్వర్గంలో ఒకానొక స్థాయి ఆనందం పొందినట్టుగా, పూజ్యుడయిన గౌతముడు అంగీకరిస్తాడా?"

"ఓ బ్రాహ్మణా! నీవన్నది నిజమే. ఒప్పుకుంటాను. అప్పుడు నేనే ఆ బ్రాహ్మణ పురోహితుని గా ఆ యజ్ఞాన్ని చేయించాను."

22. "ఓ గౌతమా! ఎక్కువ ఫలితాల్ని ఇచ్చి, ఎక్కువ ప్రయోజనకారి అయి, తక్కువ శ్రమతో, తక్కువ కష్టంతో నిర్వర్తించే మరొక యజ్ఞమేదయినా వుందా?"

"ఆ! వుంది, బ్రాహ్మణా!"

"ఓ గౌతమా! అదేమిటి?"

"నిత్యం సమర్థులయిన సన్యాసులకు దానంగా యివ్వడం కోసం శాశ్వత బహుమతులు యింట్లో వుంచాలి."

23. "ఓ గౌతమా! అలా చేయడానికి కారణం ఏమిటి? ప్రత్యేకించి సమర్థులయిన సన్యాసులకు నిత్యం దానాలు ఎందుకు చేయాలి? వాటిని ఎందుకు కుటుంబాల్లో వుంచాలి? ఇతర యజ్ఞాలకన్నా తక్కువ శ్రమతో, తక్కువ కష్టంతో, అతిగొప్ప ఫలితాలనూ, అతిగొప్ప ప్రయోజనాలనూ పొందేందుకు మూడు పద్ధతుల్లో, పదహారు రకాలుగా చేసే మరో యజ్ఞమేదయినా వుందా?"

"ఓయీ బ్రాహ్మణా! నువ్వు చెప్పే యజ్ఞానికి అర్హతుడు (బుద్ధుడు) పోలేదు, దానివల్ల అర్హత గల మార్గంలో ప్రవేశించడమూ జరగదు. ఎందుకో తెలుసా? అందులో దుడ్డు కర్రలతో మోదడం వుంటుంది, గొంతులు పట్టుకోవడం వుంటుంది. అలాంటివి ఏవీలేని, మొదట

రకం యజ్ఞం చేసేవారి దగ్గరకి వెళ్తారు. అందువల్ల నిత్యదానాలు రెండో రకమయిన యజ్ఞాన్ని మించినది."

24. "ఓ గౌతమా! తక్కువ శ్రమ, తక్కువ కష్టంతో అతి గొప్ప ఫలితం, అతి గొప్ప ప్రయోజనం పొందేందుకు ఈ రెండింటికన్నా మరో యజ్ఞం ఏదయినా వుందా?"

"ఆ! వుంది. ఓ బ్రాహ్మణా! వుంది."

"ఓ గౌతమా! అదేమిటి?"

"నాలుగు దిక్కుల్లోనూ సంఘం తరఫున నివాస స్థలం (విహారం) నిర్మించండి."

25. "ఓ గౌతమా! తక్కువ శ్రమ, తక్కువ కష్టంతో, అతి గొప్ప ఫలితం, అతి గొప్ప ప్రయోజనం పొందేందుకు ఈ మూడింటికన్నా యితర యజ్ఞం ఏదయినా వుందా?"

"ఆ! వుంది! ఓ బ్రాహ్మణా! వుంది!"

"అదేమిటి, ఓ గౌతమా?"

"ఎవరైతే హృదయంలో విశ్వాసంతో బుద్ధుణ్ణి, సత్యాన్నీ, సంఘాన్ని మార్గదర్శిగా ఎంచుకొంటాడో, అతను అలా ఎంచుకోవడం బాహాటంగా చేసే దానధర్మాలకన్నా, నిత్యం వేసే భిక్షకన్నా, విహారాన్ని బహూకరించడం కన్నా ఉత్తమమయిన యజ్ఞం చేసినట్టవుతుంది."

26. "ఓ గౌతమా! తక్కువ శ్రమంతో, తక్కువ కష్టంతో అతిగొప్ప ఫలితం, అతిగొప్ప ప్రయోజనం పొందేందుకు పైన చెప్పే నాలుగు యజ్ఞాలకన్నా భిన్నమయిన యజ్ఞం ఏదయినా వుందా?"

"ఒక మనిషి మనసులో విశ్వాసంతో ధర్మ సూత్రాలను ఆచరించే బాధ్యత తీసుకుంటాడో ప్రాణహాని తలపెట్టకుండా; తాను యివ్వని దాన్ని తీసుకోకుండా; కామ ప్రవృత్తికి దూరంగా, చెడు ప్రవర్తన చేయకుండా; అబద్ధం చెప్పకుండా, వెర్రెక్కించే ఘాటైన మత్తు పానీయాలకు దూరంగా, బాధ్యతారాహిత్యానికి దూరంగా వుంటాడో–అదే బాహాటంగా చేసే దానధర్మాలకన్నా, నిరంతర భిక్షాదానం కన్నా, విహారదానం కన్నా మార్గదర్శకత్వాన్ని ఆమోదించడం కన్నా ఉత్తమమయిన యజ్ఞం."

27. "ఓ గౌతమా! తక్కువ శ్రమతో, తక్కువ కష్టంతో అతిగొప్ప ఫలితం, అతిగొప్ప ప్రయోజనం పొందే ఈ ఐదు యజ్ఞాలకన్నా ఉత్తమమయిన యజ్ఞం ఏదయినా వుందా?"

"ఓ వుంది బ్రాహ్మణా! వుంది."

"అదేమిటి గౌతమా?"

[సమాధానం తొలి ఘనపై 'సమాన ఫాలెసుత్త' 40–75 దాకా–గ్రంథంలో 62 నుంచి 74 (పాఠం నుంచి)పేజీల దాకా–అతి దీర్ఘమయిన ఉల్లేఖన యీ క్రింది విధంగా వుంది:]

1. బుద్ధుని ఆవిర్భావానికి సంబంధించిన ఉపోద్ఘాతం పేరాలు, ఆయన బోధనలు, చివరిగా ఆయన మహాభినిష్క్రమణం.
2. శీలాలు (చిరు నైతికాంశాలు)
3. విశ్వాసానికి సంబంధించిన పేరా.
4. 'ఇంద్రియాల ద్వారాన్ని కాపలా కాయడం' గురించిన పేరా.
5. 'వివేకం, ఆత్మనిగ్రహం కలిగి వుండడం' గురించిన పేరా.
6. ఆత్మ సంతృప్తికి సంబంధించిన పేరా.
7. ఏకాంతవాసానికి సంబంధించిన పేరా.
8. ఐదు అడ్డంకులకు సంబంధించిన పేరా.
9. తొలి ఘనకి సంబంధించిన వర్ణన.

"ఓ బ్రాహ్మణా! ఇది తక్కువ శ్రమ, తక్కువ కష్టంతో అతిగొప్ప ఫలితం, అతిగొప్ప ప్రయోజనం కలిగించే గత యజ్ఞాలన్నిటికన్నా మించిన యజ్ఞం."

[వరుసగా ఇది రెండవ, మూడవ, నాలుగవ ఘనాలుగా (సమనోఫాల సుత్తలు–77–82 వరకూ) జ్ఞానంవల్ల కలిగిన అంతర్దృష్టి–(అదే, 83, 84), తర్వాత (నేరుగా ఉదహరించకుండా 85–96లు రెండింటినీ కలుపుకొని) అసవల నాశనానికి సంబంధించిన జ్ఞానం, ఎంతో హాని కలిగించే మత్తు పానీయాలు లేక వరదలుగా చెప్పడం జరిగింది. (అదే, 97–98)]

"ఓ బ్రాహ్మణా! మనిషి నిర్వహించ యింతకన్నా ఉన్నతమయిన, మధురమయిన యజ్ఞం మరొకటి లేదు."

28. ఆయనిలా మాట్లాడిన తర్వాత బ్రాహ్మణ కుతదంతుడు భగవానునితో యిలా అన్నాడు:

"అత్యద్భుతం, ఓ గౌతమా! నీ ముఖతః వెలువడిన పలుకులు, అత్యద్భుతం! కిందకి విసిరేసిన దాన్ని మనిషి తిరిగి దాని స్థానంలో వుంచినట్టుగా, లేక దాగివున్న దాన్ని వెలికితీసినట్టుగా, తోవ తప్పినవానికి సరైన తోవను చూపించినట్టుగా, కారుచీకటిలోకి కాంతిపుంజాన్ని తెచ్చి, కళ్ళున్న వారికి బయట వస్తువులు కనిపింపజేసినట్టుగా–సరిగ్గా అదేవిధంగా పూజ్యులైన గౌతముని ద్వారా నాకు సత్యం ఎన్నో విధాలుగా దర్శనం యిప్పించడం జరిగింది. నేను–నేను కూడా, పూజ్యులైన గౌతమునీ, ఆయన సిద్ధాంతాన్నీ, సంఘాన్నీ నా మార్గదర్శకులుగా స్వీకరించాను. పూజ్యులయిన భగవానుడు తమ అనుచరునిగా స్వీకరించుగాక! నేడు లగాయితూ నా బొందిలో ప్రాణమున్నంతదాకా ఆయనే నాకు మార్గదర్శి. ఓ గౌతమా! నేను నాదగ్గర వున్న ఏడు వందలు ఎద్దులనూ, ఏడు వందలు కోడె గిత్తలనూ, ఏడు వందల తువ్వాయిలనూ, ఏడు వందలు మేకలనూ, ఏడు వందలు పొట్టేళ్ళనూ యధేచ్ఛగా, స్వేచ్ఛగా సంచరించమని విడచిపెట్టేస్తాను. వాటికి ప్రాణదానం చేస్తాను. అవి కడుపారా పచ్చగడ్డిని మేసి, కావలసినంత స్వచ్ఛమయిన నీటిని తాగుగాక! చల్లగాలిలో అవి తిరుగాడు గాక!"

29. అప్పుడు భగవానుడు బ్రాహ్మణ కుతదంతునికి సంఘ పద్ధతి ప్రకారం ప్రవచించాడు–కుతదంతునితో ఔదార్యం గురించీ, ప్రమాదం గురించీ, అహంకారం గురించీ, కామప్రవృత్తి గురించీ, పరిత్యాగం యొక్క ప్రయోజనాలను గురించీ. బ్రాహ్మణ కుతదంతునిలో సంసిద్ధత ఏర్పడిందనీ, అతను మెత్తబడ్డాడనీ, బౌద్ధ మతమంటే వ్యతిరేకత అతని మనసులోంచి తొలగిపోయిందనీ, పైగా దాన్ని పైకెత్తుతున్నదనీ, హృదయంలో బౌద్ధాన్ని పూర్తిగా విశ్వసిస్తున్నాడనీ తెలుసుకున్నాక, బుద్ధుడు తన సిద్ధాంతం మాత్రమే లోకంలో విజయవంతమవుతుందని చాటి చెప్పాడు; అనగా దుఃఖ సిద్ధాంతం, దాని మూలం, దాని నిదానం, దాని మార్గం. ఉతకడం వల్ల మరకలన్నీ పోయి, బట్ట శుభ్రపడి, కలంకారీ అద్దకానికి సిద్ధంగా వున్నట్టుగా బ్రాహ్మణ కుతదంతుడు అక్కడ కూచున్నా, సత్యాన్ని పొందడానికి అతనికి మచ్చలేని, స్వచ్ఛమైన కళ్ళున్నాయి. ప్రారంభం ఏ విధంగానైనా, దాని విచ్ఛిత్తి కూడా దానికి సహజమని ఆయన తెలుసుకున్నాడు.

30. ఆతర్వాత సత్యాన్ని దర్శించిన బ్రాహ్మణ కుత దంతుడు దానిపై అధికారం సంపాయించాడు, దాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాడు, దాన్ని లోతుల్లో తరచి చూశాడు. సందేహాన్ని అధిగమించి, నివృత్తిని సాధించిన తాను కలవరపడే పరిస్థితిపై పూర్తిగా అదుపుని సాధించి, గురుబోధలను గురించిన జ్ఞానం కోసం ఎవరిమీద ఆధారపడడానికి యిష్టంలేని తాను, భగవానుణ్ణి ఉద్దేశించి యిలా అన్నాడు:

"పూజ్య గౌతములు రేపటి తమ భోజనాన్ని నాతో కలిసి భుజించే అనుజ్ఞ దయ చేయించాలి. అంతేకాదు. తమతో తమ సంఘ సభ్యులను కూడా తీసుకురావాలి."

తన ఆమోదాన్ని మౌనంగా వ్యక్తం చేశాడు భగవానుడు. అంతలో తథాగతుని స్వీకృతిని గ్రహించిన బ్రాహ్మణ కుతదంతుడు, తన ఆసనం నుంచిలేచి, కుడివేపుగా బయటికి నడిచి వెళ్లిపోయాడు. సూర్యోదయం అవుతూండగా అతను యజ్ఞంకోసం తవ్విన గోతి దగ్గరే క్షీరాన్నాన్నీ, పాయసాన్నీ వండించి, భగవాన్‌కి తెలిజేశాడు–"భోజనానికి వేళయింది, గౌతమా! అంతా సిద్ధంగా వుంది." ఉదయమే దుస్తులు ధరించిన భగవానుడు బ్రాహ్మణ కుతదంతుని పలుకులు విని, పాదంగుపాటి అంగీని కూడా మీదను వేసుకొని, భిక్షా పాత్రను చేతిలోకి తీసుకొని, భిక్షువులు తనని అనుసరించగా, యజ్ఞవేదిక దగ్గరకు వెళ్లి, తనకోసం ఏర్పాటు చేసిన ఆసనంమీద కూచు న్నాడు. బ్రాహ్మణ కుతదంతుడు తన చేత్తో బుద్ధునికీ, భిక్షువులకూ క్షీరాన్నాన్నీ, పాయసాన్నీ తృప్తిగా తినేదాకా వడ్డించాడు. భగవానుడు భోజనం ముగించుకొని, చేతులనూ, భిక్షాపాత్రనీ కడుక్కున్నాడు. ఆతర్వాత బ్రాహ్మణ కుతదంతుడు బుద్ధుని ఆసనానికి కాస్త తక్కువ ఎత్తులో వున్న ఆసనం మీద కూచున్నాడు. అతను అలా కూచున్న తర్వాత భగవానుడు బ్రాహ్మణ కుతదంతునికి మనసుకి హత్తుకునేలా మత ప్రవచనం చేశాడు. బ్రాహ్మణ కుతదంతుడు ఎంతగానో ఆనందపడ్డాడు. ఆతర్వాత బుద్ధుడు తన ఆసనం మీదనుంచి లేచి అక్కడనుంచి నిష్క్రమించాడు.

(కుతదంత సుత్త ముగిసింది)

# V

మూడోది–బుద్ధుడు కుల వ్యవస్థను పూర్తిగా నిరసించాడు. ఈనాడు ఉన్న రూపంలో ఆనాడు కుల వ్యవస్థ లేదు. సహపంక్తి భోజనాలపై, అంతర్గత వివాహాలపై నిషేధం ఆనాడు అమలులో లేదు. పరిస్థితులు కూడా యిప్పుడున్నంత కఠినంగా ఆనాడు లేవు. కానీ కుల వ్యవస్థకి ఆధారమైన అసమానత్వం అనే సూత్రం మాత్రం వేరూనుకొని నాడు స్థిరపడింది. ఈ సూత్రానికి వ్యతిరేకంగానే బుద్ధుడు పటిష్టమయిన రీతిలో, తీవ్రమయిన పోరాటం సాగించాడు. బ్రాహ్మణాధిక్యతను బుద్ధుడు ఎంత బలంగా వ్యతిరేకించిందీ, అందుకు ఆయన పెట్టే తర్కం ఎంత నమ్మదగేదిగా వుండేదీ, ఆయన చేసిన ప్రవచనాలను బట్టి మనం అర్థం చేసుకోవచ్చు. ఆ ప్రవచనాలను అన్నిటిలోనూ ఎక్కువ ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది 'అంబత్త సుత్త'గా పేరు పొందింది.

## అంబత్త సుత్త

[ఒక బ్రాహ్మణ యువకుని దురుసుతనమూ, ఒక వృద్ధుని విశ్వాసమూ]

1. నేనిలా విన్నాను. ఒకనాడు భగవానుడు, ఐదు వందల మంది బౌద్ధ భిక్షువుల మహాగణంతో కలసి కోసల దేశం పర్యటన చేస్తూ చివరికి 'ఇక్కనంకల' అనే బ్రాహ్మణ గ్రామం చేరుకున్నాడు. 'ఇక్కనంకల' వనంలో బసచేశాడు.

కోసల రాజు పసేనది, తన రాజ్యంలోని గ్రామమయిన ఉక్కత్తను పొక్కర్శది అనే బ్రాహ్మణునికి దానంగా ఇచ్చాడు. రాజుకి కోసల దేశం మీద ఎలాంటి హక్కులయితే ఉన్నాయో పొక్కర్శదికి ఉక్కత్త గ్రామం మీద కూడా అలాంటి హక్కులనే ధారాదత్తం చేశాడు. ఆ ఉక్కత్త గ్రామంలో జీవితం తొణికిసలాడుతోంది. పశువులు మేయడానికి చాలినంత బీళ్లున్నాయి. ఉద్యానవనం వుంది. ధాన్యరాశులకు లోటు లేదు.

2. బ్రాహ్మణుడు పొక్కర్శది ఒక వార్త విన్నాడు. అదేమిటంటే–శాక్య తెగవాడూ, మత జీవితాన్ని వరించడం కోసం శాక్యరాజ కుటుంబం విడిచి బయటికి వచ్చినవాడూ అయిన సమాన గౌతముడు పెద్దఎత్తున తన బౌద్ధ సంఘానికి చెందిన భిక్షువులతో కలసి 'ఇక్కనంకల' గ్రామానికి వచ్చాడనీ, 'ఇక్కనంకల' వనంలో బస చేశాడని చెప్పగా విన్నాడు. పూజ్యుడు గౌతముని గురించి ఇతర దేశాల్లో చాలా గొప్పగా చెప్పకుంటున్నారు, యిలా: "భగవానుడు అర్హతుడు. జ్ఞానోదయం పొందినవాడు. అపారమయిన జ్ఞానాన్నీ, మంచితనాన్నీ సంతరించుకున్నాడు. వివిధ లోకాలకు సంబంధించిన విజ్ఞానం తెలిసిన ఆనందమయుడు. మార్గదర్శ్యాన్ని ఆకాంక్షించే మర్త్యులకు మార్గదర్శిగా అతన్నెవరూ అధిగమించలేరు. దేవతలకూ, మానవులకూ ఆయన

ఆచార్యుడు, పుణ్య పురుషుడు. ఒక బుద్ధుడు. దేవుళ్లకి పైనగల ఊర్ధ్వ లోకాలను కలుపుకొని, తాను స్వయంగా ఈ విశ్వాన్ని ముఖాముఖంగా ఎరిగినవాడు, చూసినవాడు. అలాగే బ్రాహ్మణులనూ, పితృదేవలనూ- మునులతో, బ్రాహ్మణులతో, రాజులతో, ప్రజలతో కూడిన క్రింద లోకం-యివన్నీ తెలిసినవాడూ, తనకి తెలిసిన జ్ఞానాన్ని అందరికీ పంచిపెట్టేవాడు. సత్యం మూలంలో సుందరమయినది, అభివృద్ధిలో సుందరమయినది, సిద్ధిలో సుందరమయినది-అని ప్రకటించాడు ఆయన. సారాంశంలో అక్షరశః పరిశుద్ధతతో, పరిపూర్ణతతో కూడిన ఉన్నత జీవితాన్ని గురించి ఆయన ఎరుకపరుస్తాడు."

"అలాంటి అర్హుడయిన భగవాన్‌ని దర్శిస్తూ వుండటం ఎంతో ఉత్తమం."

3. ఆరోజుల్లో ఆచార్య పొక్కరసది దగ్గర బ్రాహ్మణ యువకుడు అంబత్తుడు శిష్యుడుగా వుండేవాడు. తాత్విక పద్యాలను కంఠతాపెట్టి అంబత్తుడు వల్లె వేయసాగాడు. మూడు వేదాలనూ, వాటి సూచీ పట్టీలతో, కర్మకాండ ప్రక్రియతో, స్వరయుక్తంగా వ్యాఖ్యానంతో (నాల్గోదిగా), జాతీయాలతో, వ్యాకరణంతో సహా ఐతిహ్యాలను (ఐదవదిగా) నేర్చుకొని, లోకాయత కుతర్కంలో నైపుణ్యతను సంపాదించి, ఒక గొప్ప వ్యక్తి శరీరంపై చిహ్నాలనూ, గుర్తులనూ పోల్చుకోవడంలో- మూడు రెట్ల వైదిక జ్ఞానాన్ని వివరించే, వ్యాఖ్యానించే పద్ధతిలో తన ఆచార్యునికి మల్లేనే ఘనాపాఠిగా గుర్తింపు పొంది, తన గురించి తానిలా చెప్పకుంటాడు: 'నాకు తెలిసింది నీకు తెలుసు, నీకు తెలిసిందే నాకూ తెలుసు' అని.

4. ఆచార్య పొక్కరసది శిష్యుడు అంబత్తునికి ఈ భోగట్టాని చెబుతూ, యిలా శెలవిచ్చాడు- "ఇలారా, ప్రియ అంబత్తా! సనామ (బౌద్ధ) గౌతముని దగ్గరకెళ్లి, పరదేశాల్లో అతణ్ణి గురించి గొప్పగా ప్రచారం జరుగుతున్నదంతా వాస్తవం అవునో, కాదో, వారు చెబుతున్నట్టుగా సనామ గౌతమునిలో వున్నదీ లేనిదీ తెలుసుకురా!"

5. "కాని అది నిజమవునో కాదో నేనెలా తెలుసుకొనేది ఆర్యా?"

"గొప్ప వ్యక్తి శరీరంపై వుండే ముప్పయ్ రెండు చిహ్నాలను గురించి, అంబత్తా! మన రుక్కుల్లో వివరించడం జరిగింది. ఆ చిహ్నాలు గనక అతని శరీరం మీద వుంటే, అతను రెండింటిలోనూ ఏదో ఒకటి అవుతాడు. అంత తప్ప మరేమీ కాదు. గృహస్థుగానే వుంటే, అతను ప్రపంచ సార్వభౌమాధికారిగా, న్యాయబుద్ధి గల రాజుగా, నాలుగు మహాసముద్రాల తీరాల పర్యంతం వ్యాపించే అతని అధికారం ఒక విజేతగా, ఒక ప్రజా రక్షకునిగా, ఏడు రాః కోశాగారాలను కలిగి వుంటాడు. ఆయన కలిగి వుండే ఆ ఏడు కోశాగారాలూ ఏమంటే-చక్రం, ఏనుగులు, గుర్రాలు, మణులు-మాణిక్యాలు, స్త్రీలు, కోశాధికారి, ఏడువాడుగా సలహాకారుడు. శత్రు సైన్యాల్ని చిత్తుగా ఓడించగలిగిన బలాఢ్యులయిన వీరులైన వెయ్యి మంది కొడుకులుంటారు అతనికి. సముద్రం నుంచి సముద్రం దాకా గల భూఖండంలో పూర్తిగా ప్రాబల్యం కలిగి, కత్తి, ధర్మదండం అవసరం లేకుండా న్యాయబుద్ధితో చక్కగా పరిపాలన సాగిస్తాడు. కాని అతను అదే గృహస్థు జీవితం నుంచి బయటపడి, గృహం వుండని స్థితికి (సంఘ

జీవితానికి) చేరుకుంటే, అతను ప్రపంచం కళ్ల నుంచి (కపటమనే) ముసుగు తొలగించే బుద్ధుడయిపోతాడు. ఇప్పుడు, అంబత్తా! నేను రుక్కులనిచ్చేవాణ్ణి, నువ్వు వాటిని నా నుంచి అందుకునేవాడివి."

6. "చాలా మంచిది ఆర్యా!" అని అంబత్తుడు జవాబు చెప్పి, ఆసనం మీదనుంచి లేచి, పొక్కరసది ఆచార్యవర్యులకు నమస్కరించి, గుర్రాలు పూన్చిన రథం ఎక్కి, బ్రాహ్మణ యువకులతో కలిసి ఇక్కనంకల వనం వేపుగా సాగిపోయాడు. రహదారి వున్నంతదాకా రథంమీద పయనించి, ఆతర్వాత రథం దిగి, వనంలోకి కాలి నడకన చేరాడు.

7. ఆ సమయంలో అక్కడ బౌద్ధ భిక్షువులు ఆరుబయట అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు. అంబత్తుడు వారి దగ్గరికి వెళ్ళి, యిలా అన్నాడు: "పూజ్యులయిన గౌతములు ఎక్కడున్నారు? వారి దర్శనార్థం మేం వచ్చేం."

8. బౌద్ధ భిక్షువులు యిలా తలపోసారు: "బ్రాహ్మణ యువకుడు, సుప్రసిద్ధ వంశానికి చెందినవాడు, ఒక సుప్రసిద్ధ బ్రాహ్మణుడు పొక్కరసది శిష్యుడు. అలాంటి యితనితో సంభాషించడానికి భగవానునికి ఎలాంటి అభ్యంతరమూ వుండదు." యిలా ఆలోచించి, అంబత్తునితో యిలా చెప్పారు: "తలుపు మూసిన గదిలో గౌతములు బసచేసి వున్నారు. మెల్లగా వరండాలోకి నడుచుకుంటూ వెళ్లి, చిన్నగా దగ్గి, తలుపు తట్టండి. భగవాన్ తలుపు తీస్తారు."

9. ఆతర్వాత అంబత్తుడు వారు చెప్పినట్టే చేస్తాడు. భగవానుడు తలుపు తెరుస్తాడు. అంబత్తుడూ, మిగతా బ్రాహ్మణ యువకులూ గదిలోకి ప్రవేశిస్తారు. వారంతా భగవాన్‌ని వినమ్రంగా నమస్కరించి, అభినందనలు అందుకొని, ఆసనాల మీద కూచున్నారు. కాని అంబత్తుడు మాత్రం పచార్లు చేస్తూ, మధ్యమధ్య ప్రయత్నపూర్వకంగా మర్యాద కోసం ఏదో మాట్లాడుతూ, ఆందోళనపడుతూ నిలుచునే వున్నాడు, భగవాన్ అక్కడ కూచొని వుండగా.

10. భగవానుడు అతనితో యిలా అన్నాడు: "నేనిలా కూచొని వుండగా, అంబత్తా! ఇదేనా వరస? వయసులో పండిన గురువులతో, మీ గురువులకు గురువులతో, వయోవృద్ధులతో ఇలాగేనా మాట్లాడుతారు? ఇప్పుడు నువ్వు కొంతసేపు నిలబడటం, కొంతసేపు పచార్లు చేయడం-యిలా చేయడం ఏం బాగుందీ-నేను కూచొని వుండగా."

11. "అలా కాదు, గౌతమా! బ్రాహ్మణుడు నడుస్తూ వుండగా తను కూడా ఆయనతోపాటే నడుస్తూ మాట్లాడటం సరైనది. అలాగే బ్రాహ్మణుడు నిలబడితే తనూ నిలబడటం, అతను కూచున్నాకనే తనూ కూచోవడం, బ్రాహ్మణుడు విశ్రాంతి తీసుకున్నాకనే తాను విశ్రాంతి తీసుకోవాలి. అయితే యిప్పుడు మీతో మాట్లాడుతున్నట్టుగానే, కపట సన్యాసులతో, కర్రిమొద్దు

దాసులతో, మా బంధువు కాలికింద పడివుండే భ్రష్టులతో ఇలాగే మాట్లాడుతాను."

"కానీ, అంబత్తా! యిక్కడికి వచ్చిన వెంటనే ఏదో ప్రశ్నించబోయేవు? అప్పటి నీ మనసులోని అభిప్రాయం వైపుకి నీ దృష్టిని మరల్చు. తన సంస్కృతి ఎడల ఎంతో అభిమానం వున్న బ్రాహ్మణ యువకుడు అంబత్తునికి ఈ మొరటుతనం ఎలా అబ్బింది? బహుశా శిక్షణ లోపం కావచ్చు."

12. తన గురించి మొరటు అనే పదం వాడినందుకు భగవానుడిపై చిర్రెత్తుకొచ్చింది. కోపం ముంచుకొచ్చింది. తనంటే భగవానుడు విసుగు చెందాడనే ఆలోచన మనసులో మెదలగానే, తను ఆయన్ని తిరస్కారంతో ఎగతాళి చేస్తూ, అవమానించే వుద్దేశంతో యిలా అన్నాడు: "గౌతమా! మీ శాక్య తెగ కరుకుది. మొరటుతనం, యిట్టే కోపం తెచ్చుకొనేది మీ శాక్య తెగ. అది ఉగ్రమైనది కూడా. సేవకులు, కేవలం సేవకులు. వాళ్లు బ్రాహ్మణులను గౌరవించరు, వారికి (బ్రాహ్మణులకు) విలువ యిచ్చి, వారిని గొప్పగా ఎంచరు. అలాగే వారికి సంభావనలు సమర్పించుకోవడం గానీ, మర్యాద చేయడంగానీ చేయరు. అదీ, గౌతమా! అది ఔచిత్యమూ కాదు, యుక్తమూ కాదు."

ఆ విధంగా బ్రాహ్మణ యువకుడు అంబత్తుడు తొట్టతొలిసారిగా శాక్యులమీద దాసులని ఆరోపణ చేశాడు.

13. "కాని, అయితే అంబత్తా! శాక్యులు నీకెలా మనసు నొప్పించారు?"

"గౌతమా! ఒకసారి నాపని మీదనో, ఆచార్యులు పొక్కరసది వారి పనిమీదనో నేను కపిలవస్తుకి వెళ్ళాను. వెళ్లి తిన్నగా శాక్యుల సమావేశ మందిరంలో ప్రవేశించాను. అప్పుడు శాక్య యువకులూ, వృద్ధులూ ఉన్నతాసనాల మీద కూచొని, నన్ను చూసి ఎగతాళి చేస్తూ, సూటిపోటి మాటలు ఆడుతూ, మెల్లగా ఒకర్నొకరు చేతులతో తట్టి సంజ్ఞలు చేసుకుంటూ పగలబడి నవ్వుతున్నారు. నిజానికి వారి సూటిపోటి మాటలకీ, ఎగతాళికీ మూలం నేనే కాబోలు అనిపించింది. వారిలో ఏ ఒక్కరూ నన్ను ఆసనం చూపించి కూచోమన్న పాపాన పోలేదు. అది, గౌతమా! ఔచిత్యమూ కాదు; యుక్తమూ కాదు. శాక్యులు సేవకులు, కేవలం సేవకులు. వాళ్ళు బ్రాహ్మణులను గౌరవించరు. వారికి విలువనిచ్చి, వారిని గొప్పగా భావించరు. వారికి (బ్రాహ్మణులకు) సంభావనలు సమర్పించుకోవడం గానీ, మర్యాదలు చేయడంగానీ చేయరు."

ఈ విధంగా బ్రాహ్మణ యువకుడు అంబత్తుడు రెండోసారి కూడా శాక్యులను సేవకులని ఎద్దేవా చేశాడు.

14. "అంబత్తా! బుల్లి కోలంకి పిట్ట ఎంత పెంకిదయినా, తనకేం కావాలో తన స్వంత

గూడులో గాని చెప్పదు. అక్కడ శాక్యులు కపిలవస్తులో తమతమ స్వగృహాల్లో వుంటున్నారు. అంత స్వల్ప విషయం గురించి తప్పపట్టడం నీకు తగదు."

15. నాలుగు శ్రేణులున్నాయి గదా, గౌతమా! కులీనులూ, బ్రాహ్మణులూ, వర్తకులూ, శ్రమజీవులు– ఈ నాలుగు మూడు శ్రేణులు–కులీనులూ, వర్తకులూ, శ్రమజీవులు–వాస్తవానికి బ్రాహ్మణులకు సేవకులు. అందువల్ల, గౌతమా! అది ఔచిత్యమూ కాదు, యుక్తమూ కాదు. శాక్యులు సేవకులు, కేవలం సేవకులు. వాళ్ళు బ్రాహ్మణులను గౌరవించరు; వారికి విలువనిచ్చి, వారిని గొప్పగా భావించరు. వారికి సంభావనలను సమర్పించుకోవడం గానీ, మర్యాదలు చేయడం గానీ చేయరు.

ఈ విధంగా బ్రాహ్మణ యువకుడు అంబత్తుడు మూడోసారి కూడా శాక్యులను సేవకులని ఎద్దేవా చేశాడు.

16. అప్పుడు గౌతముడు యిలా ఆలోచించసాగాడు: "ఈ అంబత్తుడు శాక్యులను సేవకుల స్థాయికి దించి చూపడానికి ప్రయత్నిస్తున్నాడు. అతణ్ణి మరి నీ వంశవృక్షం ఏదని తిరగేసి అడిగితే?"–గౌతముడు అంబత్తునితో యిలా అన్నాడు:

"మరయితే, అంబత్తా! నువ్వే వంశానికి చెందుతావు?"

"అవును, కానీ! మీ ప్రాచీన నామం, వంశవృక్షం ఆలోచిస్తే, అంబత్తా! మీ తండ్రి వంక, తల్లి వంక చూస్తే, శాక్యులు ఒకనాడు మీ యజమానులుగా కనిపిస్తారు. నువ్వు వారి దాసీ కన్యల్లో ఒకదాని సంతతి. కానీ, వారి వంశమూలానికి పోతే శాక్యులు ఒక్కాక రాజ సంతతి వారు."

"చాలాకాలం క్రితం, అంబత్తా! ఒక్కాక రాజు తన తదనంతరం తన సింహాసనానికి వారసునిగా పెద్ద కుమారులనందర్నీ తప్పించి, తన ముద్దుల రాణి కొడుకుకి కట్టబెట్టడం కోసం ప్రయత్నిస్తాడు. ఒక్క ముఖ, కరండ, హత్తినిక, సినిపుర–ఈ నలుగురు పెద్ద కొడుకులనూ దేశం నుంచి బహిష్కరించాడు రాజు. ఇలా దేశ బహిష్కృతులయిన రాజకుమారులు హిమాలయ పర్వతాలకు వెళ్ళి, ఆ సానువుల్లో సరస్సు ఒడ్డున నివాసం ఏర్పరచుకున్నారు. ఆ ఒడ్డున శక్తివంతమయిన ఒక సింధూరపు వృక్షం పెరిగింది. తమ వంశపురక్తం ఎక్కడ కలుషితం అయిపోతుందో అన్న భయంతో వారు తమ సొంత అక్కచెల్లెళ్లనే వివాహాలు చేసుకున్నారు."

ఒక్కాక రాజు తన మంత్రులను పిలిపించి ఒకరోజున అడిగాడు: "అమాత్యులారా! (నా) పిల్లలు ఎక్కడున్నారు?"

"తండ్రీ! హిమాలయ పర్వతపు సానువుల్లో ఒక సరస్సు ఒడ్డున ఒక శక్తివంతమయిన సింధూరపు (శాకో) వృక్షం పెరిగింది. అదిగో, అక్కడ నివసిస్తున్నారు వాళ్ళు. తమ వంశరక్తం ఎక్కడ కలుషితం అయిపోతుందో అన్న భయంవల్ల వారు తమ సొంత చెల్లెళ్ళనే (పకహి) పెళ్లిళ్లు చేసుకుంటున్నారు."

"అది విన్న ఒక్కాక రాజు అమందానందభరితుడయ్యాడు: 'సింధూర' (శాక్య) వృక్ష హృదయాలు, ఆ యువకులు! బాగుంది. తమ వంశాన్ని తాము కాపాడుతున్నారు. (పరమ శాక్య)!"

"అదీ విషయం, అంబత్తా! వారికి 'శాక్యు'లని పేరు రావడానికి కారణం. ఒక్కాక రాజు దగ్గర 'దిశ' అనే ఒక దాసీకన్య వుండేది. ఆమె ఒక నల్లని శిశువుని కన్నది. ఈ భూమిమీద పడీపడగానే, ఆ నల్లని శిశువు యిలా అంది: "నన్ను కడుగు, అమ్మా! నన్ను స్నానం చేయించు, అమ్మా! నన్ను విముక్తి చెయ్ ఈ మురికి నుంచి, అమ్మా! నీకు వుపయోగపడేందుకు గాను."

"ఇప్పుడు, ఇప్పటిలాగానే, అంబత్తా! జనం దయ్యాలను "దయ్యా"లనే వారు. అందువల్ల అప్పుడు దయ్యాలను వాళ్ళు 'నల్ల' అని పిలిచేవారు (కన్హే)! వాళ్ళన్నారు యిలా, "పుట్టగానే వీడు మాట్లాడాడు! నల్లనివాడు పుట్టాడు. దయ్యం పుట్టాడు!" అదీ అంబత్తా! కన్హ యనుల'కుదురు'. అతనే (ఆ పసివాడే) కన్హ యనులకు మూల పురుషుడు. ఆ విధంగా, అంబత్తా! మీ తండ్రి తరఫున, మీ తల్లి తరఫున మీ ప్రాచీన నామాన్నీ, వంశ వృక్షాన్ని గురించీ తెలుసుకోవాలంటే, శాక్యులు ఒకప్పుడు మీకు యజమానులూ, మీరు ఒక దాసీకన్యకి పుట్టినవారూ అని తెలుస్తుంది."

17. భగవాన్ అలా చెప్పిన పిదప, బ్రాహ్మణ యువకులు ఆయనతో యిలా అన్నారు: "పూజ్య గౌతమా! వినయ విధేయతలు గల అంబత్తుడు తాము దాసీకన్య సంతతి అనే దూషణను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాడు. గౌతమా! అతను మంచి కుటుంబంలో పుట్టాడు. అతను వేలను క్షుణ్ణంగా చదువుకున్నాడు. చక్కగా వల్లెవేస్తాడు. పండితుడు. ఈ విషయాల్లో పూజ్య గౌతములకు సమాధానం యివ్వగల సమర్థుడు."

18. అంతట భగవానుడు వారికి యిలా చెప్పాడు: "నిజం కావచ్చు. నేను చెప్పిన దానికి భిన్నంగా ఆలోచిస్తుంటే, చర్చను కొనసాగించే బాధ్యత మీది. కానీ మీరు చెబుతున్నట్టుగా అంబత్తుడు మాట్లాడనివ్వండి."

19. "మేం అలా భావించడం లేదు. మేం మౌనం వహిస్తాం. అతను ఈ విషయాల్లో పూజ్య గౌతములకు సమాధానాలు యివ్వగలుగుతాడు."

20. ఆతర్వాత గౌతముడు అంబత్తునితో యిలా అన్నాడు: "అప్పుడు తర్వాతి ప్రశ్న వుదయిస్తుంది, అంబత్తా! చాలా యుక్తమయిన ప్రశ్న. నీకు యిష్టం లేకపోయినా, నువ్వు జవాబు చెప్పితీరాలి. నువ్వు సూటిగా సమాధానం చెప్పకపోయినా, దాన్నిదాటి మరొక ప్రశ్నకి పోయినా, లేక మౌనం వహించినా, లేక వెళ్లిపోయినా, నీ తల తక్షణం ముక్కలయిపోతుంది. వృద్ధ బ్రాహ్మణులూ, ఏళ్లలోకి ఎదిగిన చనిపోయినవారూ మీ గురువులుగానీ, వారి గురువుగానీ మాటల సందర్భంలో కన్హయనులు 'కుదురు' ఎప్పుడు మొదలయిందీ, వారి మూల పురుషుడెవరు? చెప్పుకున్నప్పుడు నువ్వు విన్నావా?"

భగవాన్ యిలా మాట్లాడుతూ వుండగా అంబత్తుడు మౌనం వహించాడు. భగవాన్ అదే ప్రశ్నని మళ్లీ అడిగాడు. అయినా అంబత్తుడు నోరు మెదపలేదు. అప్పుడు మళ్లీ భగవాన్ అతనితో యిలా చెప్పాడు: "సమాధానం చెప్పు, అంబత్తా! మౌనానికిది సమయం కాదు. అతడెవరైనా, అంబత్తా! మూడవసారి కూడా తథాగతుడు వేసిన ప్రశ్నకు సహేతుకమయిన జవాబు యివ్వని పక్షంలో, అతని తల తక్షణం తునాతునకలయిపోవు గాక!"

21. అప్పుడు పిడుగును ధరించిన దయ్యం ఆకాశంలో అంబత్తుని తలమీదనే నిలిచి వుంది. దాని చేతిలో మండుతున్న, కళ్లు మిరుమిట్లు గొలిపే వెలుగు విరజిమ్మే శక్తివంతమయిన యినుప కడ్డీని చేతబూని వుంది. జవాబు చెప్పకపోతే, తక్షణం అతని తలను ముక్కలు చేసేసేలా వుంది. గౌతముడు పిడుగును చేతబూనిన దయ్యాన్నీ, అంబత్తున్నీ చూశాడు. విషయం గ్రహించిన అంబత్తుడు బిత్తరపోయాడు, గజగజ వణికిపోయాడు, ఆందోళన చెందాడు, భగవానుని పాదాల మీదపడి, తన క్షేమాన్నీ, రక్షణనీ, సహాయాన్నీ అర్థిస్తూ, యిలా అన్నాడు: "భగవాన్! ఏం అన్నారు? మరోసారి చెప్పండి!"

"అంబత్తా! ఏమనుకుంటున్నావు? వృద్ధ బ్రాహ్మణులూ, ఏళ్లకి ఎదిగి చనిపోయినవారూ, మీ గురువులు గానీ, వారి గురువులు గానీ మాటల సందర్భంలో కన్హయనుల కుదురు ఎప్పుడు మొదలయిందీ, వారి మూల పురుషుడెవరు? అని చెప్పుకుంటుండగా ఇవన్నీ ఏమి విన్నావు?"

"ఇప్పుడే, గౌతమా! నేను విన్నది. పూజ్య గౌతములు కూడా సెలవిచ్చారు. అదే కన్హయనుల కదురు, అతనే వారి మూల పురుషుడు."

22. అంబత్తుడు అలా చెప్పిన మరుక్షణమే తతిమా బ్రాహ్మణ యువకుల్లో కలకలం బయలుదేరింది. వారు కోపంతో వూగిపోతూ పెడబొబ్బలు పెట్టారు. నానా హంగామా చేశారు. చివరికి యిలా అన్నారు: "బ్రాహ్మణ అంబత్తుడు జాతి తక్కువవాడు; వాళ్లది మంచి వంశం కాదు; అతను దాసీకన్య వంశం వాడు. శాక్యులు ఒకప్పటి అతని యజమానులు. న్యాయ సమ్మతంగా మాట్లాడిన సమాన గౌతముని నమ్మదగిన వ్యక్తి కాడని మేం అనుకోవడం లేదు."

23. భగవాన్ యిలా ఆలోచించాడు: అంబత్తున్ని దాసీకన్య వంశానికి చెందినవానిగా, తక్కువ భావించడంలో ఈ బ్రాహ్మణ యువకులు చాలా దూరమే వెళ్ళారు. ముందు వీళ్ల నిందల నుంచి అతని (అంబత్తుణ్ని) విముక్తం చేయాలి! ఆయన వాళ్లతో యిలా అన్నాడు: "అంబత్తుడు, తాను దిగివచ్చాడని చెప్పి, అతణ్ని తీవ్రంగా అవమానించకండి. ఆ కన్హుడు గొప్పజ్ఞాని. అతను దెక్కన్‌కి వెళ్లి, అక్కడ మంత్రాలు నేర్చుకొని, ఒక్కకుని రాజ్యంలోకి వచ్చి, రాకుమార్తె 'మద్దరూపి'ని పెళ్లి చేయమని రాజుని అడుగుతాడు. అతనికిరాజు యిలా జవాబు చెబుతాడు: "నిశ్చయంగా వీడు–నా దాసీ కొడుకేను. నా కూతుర్ని పెళ్ళాడుతాడట. హూ!" అని మండిపడుతూ, విల్లుకి అంబుని సంధించాడు. కాని, రాజు అంబుని విల్లు నుంచి సంధించి విడువనూలేకపోయాడు. అలా అని సంధించిన నారిని వెనక్కి తీసుకోనూలేకపోయాడు.

ఆతర్వాత మంత్రులూ, సభాసదులూ ముని కన్హుని దగ్గరకి వెళ్లి వేడుకుంటారు–" అయ్యా! రాజుని సురక్షితంగా వెళ్ళనివ్వండి... రాజుని సురక్షితంగా వెళ్లిపోనివ్వండి." అని వేడుకున్నారు.

"సరే! రాజుకే హానీ జరుగదు. కానీ అతను అంబుని అధోముఖంగా విడిచిపెడితే, రాజు రాజ్యం విస్తరించినంతమేరకూ భూమి ఎండిపోతుంది." అన్నాడు ముని కన్హుడు.

"స్వామీ! రాజుని క్షేమంగా విచిచిపెట్టండి. అలాగే రాజ్యాన్ని కూడా."

"రాజుకి హాని జరుగదు, అలాగే అతని రాజ్యానికి కూడా. కాని ఆ సంధించిన బాణం నుంచి అంబుని ఊర్ధ్వముఖంగా విడిచిపెడితే, దేవుడు ఏడేళ్ల దాకా వర్షాలు కురిపించడు–అతని (రాజు) రాజ్యం విస్తరించినంత మేరకు."

"స్వామీ! రాజుని క్షేమంగా వెళ్ళనివ్వండి. అలాగే రాజ్యాన్ని కూడా; దేవుడు వర్షాన్ని కురవనివ్వండి."

"రాజుకెలాంటి హానీ జరుగదు; అలాగే అతని రాజ్యానికి కూడా. దేవుడు కూడా వర్షం కురిపిస్తాడు. అయితే రాజు సంధించిన తన బాణాన్ని తన పెద్ద కొడుకు మీదకి విడువమనండి. రాజకుమారునికి ఎలాంటి ప్రమాదమూ జరుగదు. అలాగే అతని వెంద్రుక సయితం తెగదు."

"ఆతర్వాత, బ్రాహ్మణులారా! మంత్రులు విషయాన్ని తమ రాజు ఒక్కకునికి విన్నవించి, యిలా చెప్పారు: "రాజును తన పెద్ద కొడుకువేపు బాణాన్ని ఎక్కుపెట్టమనండి, అతనికెలాంటి హానీ జరుగదు. అతను భయభ్రాంతుడు కాడు." రాజు అలాగే చేసాడు. ఎలాంటి నష్టమూ జరగలేదు. కానీ ఆ గుణపాఠం వల్ల రాజు భయభ్రాంతుడయి, రాకుమార్తె మద్దరూపిని కన్హ

నునికిచ్చి పెళ్లి చేశాడు. బ్రాహ్మణుల్లారా! దాసీకన్యా వారసత్వం కారణంగా మీరు అంబత్తుణ్ని తీవ్రంగా అధిక్షేపించరాదు. కణ్హనుడు మహిమ గల మౌని."

24. ఆతర్వాత అంబత్తునితో భగవానుడిలా చెప్పాడు: "నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా! ఒక క్షత్రియ యువకునికి ఒక బ్రాహ్మణ కన్యతో శరీర సంబంధం ఏర్పడి, ఒక కొడుకు పుట్టాడనుకుందాం. క్షత్రియ యువకుని వల్ల బ్రాహ్మణ కన్యకు పుట్టిన కొడుకుకి బ్రాహ్మణుల నుంచి (గౌరవ సూచకంగా) ఒక ఆసనం, మంచినీరు లభిస్తాయా?"

"తప్పక లభిస్తాయి, గౌతమా!"

"కానీ బ్రాహ్మణుల తద్దినం భోజనాల్లోనూ అతన్ని సహపంక్తిలో కూచోనిచ్చి, క్షీరాన్నాన్నీ లేదా దేవుడికి సమర్పించే నైవేద్యాన్నీ, ఒకరికి బహుమతిగా పంపించే ఆహారాన్నీ అతనికి పెడతారా?"

"ఆ! తప్పక, గౌతమా."

"కానీ బ్రాహ్మణులు అతనికి శ్లోకాలను నేర్పుతారా?"

'తప్పక, గౌతమా!"

"బ్రాహ్మణుల భార్యలను అతడు చూడవచ్చా?"

"చూడవచ్చు."

"కానీ క్షత్రియులు అతణ్ని క్షత్రియ సంస్కారం చేయించడానికి సమ్మతిస్తారా?"

"ఒప్పుకోరు, గౌతమా."

"కారణం–అతను తల్లివంక పరిశుద్ధుడు కాడు గనుక."

25. "అయితే నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా! ఉదాహరణకు ఓ బ్రాహ్మణ యువకునికి క్షత్రియ కన్యతో శరీర సంబంధం ఏర్పడి, వారికి ఆ అనుబంధం వల్ల ఒక కొడుకు పుట్టాడనుకుందాం. అప్పుడు బ్రాహ్మణ యువకునివల్ల క్షత్రియ కన్యకు పుట్టిన కొడుకుకి కూచోడానికి ఆసనం, మంచినీరూ (గౌరవసూచకంగా) బ్రాహ్మణులు యిస్తారా?"

"ఆ యిస్తారు, గౌతమా!"

"కానీ బ్రాహ్మణుల శ్రాద్ధ భోజనాల్లో అతణ్ని సహపంక్తిని కూచోనిస్తారా? పాలతో వుడికించిన భోజనాన్ని లేదా దేవునికి అర్పించే నైవేద్యాన్నీ, ఒకరికి బహుమతిగా పంపే ఆహారాన్నీ అతనికి పెడారా?"

"ఆ! తప్పక పెడతారు, గౌతమా."

"కానీ బ్రాహ్మణులు అతనికి శ్లోకాలు నేర్పుతారా?"

"నేర్పుతారు, గౌతమా."

"కానీ క్షత్రియులు అతణ్ణి క్షత్రియ సంస్కారం చేయించడానికి ఒప్పుకుంటారా?"

"ఒప్పుకోరు, గౌతమా."

"ఎందుకు ఒప్పుకోరు?"

"అతను తండ్రి వంక పరిశుద్ధుడు కాడు గనక."

26. "అయితే, అంబత్తా! స్త్రీలను స్త్రీలతో, పురుషులను పురుషులతో పరిపోల్చవచ్చునా? క్షత్రియులు ఉన్నతులు, బ్రాహ్మణులు అధములు అనవచ్చా?"

"అయితే, అంబత్తా! నువ్వేం అనుకుంటున్నావు? ఏదో ఒకనేరం చేయడం వల్ల బ్రాహ్మణులందరూ ఒక బ్రాహ్మణున్ని–తల నున్నగా గొరిగించి, అతని తలపై బూడిదను గుమ్మరించి, తమ దేశం నుంచీ, తన పట్నం నుంచీ బహిష్కరించాలనుకోండి. అప్పుడు అతనికి బ్రాహ్మణులు తమ మధ్య ఆసనం వేస్తారా? తాగడానికి మంచినీరు యిస్తారా?"

"ఉహూ! యివ్వరు, గౌతమా!"

"బ్రాహ్మణుల తద్దినం భోజనాల్లో అతణ్ణి సహపంక్తిలో కూచోనిస్తారా? పాలతో ఉడికించిన అన్నాన్నీ లేదా దేవునికి సమర్పించే నైవేద్యాన్నీ, ఒకరికి బహుమతిగా పంపించే భోజనాన్నీ అతనికి పెడతరా?"

"ఉహూ! పెట్టరు, గౌతమా!"

"బ్రాహ్మణులు అతనికి శ్లోకాలు నేర్పుతారా?"

"నేర్పరు, గౌతమా."

"తమ భార్యల మొహాల్ని అతణ్ణి చూడనిస్తారా?"

"ఊహూ! చూడనివ్వరు, గౌతమా!"

"కానీ, నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా? అదే విధంగా క్షత్రియులంతా కలిసి ఒక క్షత్రియుణ్ణి న్యాయరక్షణ నుంచి తొలగించి, అతణ్ణి దేశం నుంచి గానీ, పట్నం నుంచి గానీ బహిష్కరిస్తే, అతనికి బ్రాహ్మణులు ఆసనమూ, మంచినీరూ యిస్తారా?"

"ఆ! తప్పక యిస్తారు, గౌతమా!"

"తమ తద్దినం భోజనాల్లో అతణ్ణి సహపంక్తి భోజనం చేయనిస్తారా? క్షీరాన్నాన్నీ, లేదా దేవునికి సమర్పించే నైవేద్యాన్నీ, ఒకరికి బహుమతిగా పంపే ఆహారాన్నీ అతనికి పెడతారా?"

"ఆ! పెడతారు, గౌతమా!"

"అతనికి బ్రాహ్మణులు శ్లోకాల్ని నేర్పుతారా?"

"నేర్పుతారు, గౌతమా."

"తమ భార్యల మొహాల్ని అతణ్ణి చూడనిస్తారా?"

"చూడనిస్తారు, గౌతమా."

"కానీ దానివల్ల, అంబత్తా! క్షత్రియుడు అట్టడుగు పదచ్యుతికి లోనయి, గుండు నున్నగా గొరిగించబడి, తలమీద బూడిద గుమ్మరించి, దేశం నుంచీ, పట్నాల నుంచీ బహిష్కరించివేస్తారు. ఆ విధంగా, క్షత్రియుడు అధమస్థాయిలో భ్రష్టుడయినా, క్షత్రియులు ఎన్నటికీ ఉన్నతులే, బ్రాహ్మణులు అధములే."

28. "అంతేకాదు. బ్రాహ్మణ దేవుళ్ళలో ఒకరయిన సనమ కుమారుడు యీ దిగువ పద్యం చెబుతాడు:

"వంశ వృక్షంపై విశ్వాసమున్న
వారందరిలోనూ
క్షత్రియుడు అత్యుత్తముడు
వివేకంలోనూ, న్యాయంలోనూ
దేవుళ్ళలోనూ మనుషులలోనూ
పరిపూర్ణుడతనే!"

"ఇప్పుడీ పద్యాన్నీ, అంబత్తా! బ్రాహ్మణ సనామ కుమారుడు చక్కగా పాడాడు, చెడ్డగా కాదు. పద్యం భావంతో తొణికిసలాడుతోంది, ఉత్తినే కాదు. దాన్ని నేను కూడా ఆమోదిస్తున్నాను."

"నేను కూడా" అన్నాడు అంబత్తుడు.

"వంశవృక్షంపై విశ్వాసమున్న
వారందరిలోనూ

క్షత్రియుదు అత్యత్తముదు
వివేకంలోనూ న్యాయంలోనూ
దేవుళ్ళలోనూ మనుషులలోనూ
పరిపూర్ణుడతనే"

[సూక్త పఠనార్థం ప్రధమ భాగం ఇక్కడ ముగుస్తుంది.]

* * *

1. "కానీ గౌతమా! ఆ పద్యంలో చెప్పిన న్యాయమంటే, వివేకమంటే ఏమిటి?"

"అంబత్తా! సర్వోత్కృష్టమైన జ్ఞానంలో, న్యాయంలో జన్మ గురించి గానీ, వంశపారంప ర్యత గురించి గానీ, "నేనెంత యోగ్యణ్నో, నువ్వు కూడా అంతే," "నేను యోగ్యుడయినంతగా నువ్వు కావు వంటి అహంభావం గురించిన ప్రస్తావన గానీ కానరాదు: పెళ్లి చేసుకోవడం గురించి, పిల్లను యివ్వడం గురించిన చర్చ యిలాంటి విషయాలను గురించి ప్రస్తావన చేయబడింది. అంబత్తా! ఎవరైతే పుట్టుక, వంశపారంపర్యత లేక సాంఘిక హోదాకి సంబం ధించి అహంభావం, లేక పెళ్లి మూలంగా ఏర్పడ్డ సంబంధం గురించిన భావబంధం, కలిగి వుంటారో వారు ఉత్తమ జ్ఞానానికీ, న్యాయానికీ దూరమవుతారు. అలాంటి బంధాలన్నిటినీ వదిలించుకుంటేనే తప్ప, ఒక వ్యక్తి జ్ఞానంలో, ప్రవర్తనలో ఉత్కృష్ట పరిపూర్ణతను అనుభవానికి తెచ్చుకోలేదు.

2. "కానీ, గౌతమా! ఆ ప్రవర్తన ఎలాంటిది? ఆ జ్ఞానం ఎలాంటిది? [ఇక్కడ 'నైతికత' (శీల) అనే శీర్షికను అనుసరించాలి.]

ఉపోద్ఘాతం పేరాలు 'సమానపాలు'కి సంబంధించి (4.142, మూలం పేజీలు 62,63) బుద్ధుని దర్శనం గురించీ, ఆయన ప్రపంచ పరిత్యాగం గురించీ–ఆతర్వాత ఇవి.

1. మూలంలోని శీలలు, పై పేజీలు 4–12 (8–27). కేవలం స్థాయిలోనే వ్యత్యాసం వుంటుంది. మరలమరల వచ్చే ప్రకరణం మొత్తంగా, ప్రతి ఉపవాక్యం షరతు చివరా, యిలా సాగుతుంది–"ఇది ఆయనలో నైతికతగా పరిగణింపబడింది."

ఆతర్వాత 'ప్రవర్తన' (కరుణ) అనే శీర్షిక క్రింద–

2. 'విశ్వాసం' గురించిన పేరా, మూలం 63లో 69వ పేజీ. ఇక నుంచి ముందుకు సాగే పల్లవి: ఇది ఆయనలో నైతికతగా పరిగణింపబడింది.

3. "ఇంద్రియాలకు ద్వారబంధం" గురించిన పేరా, 64, మూలం పేజీ 70.

4. "అప్రమత్తత-నిగ్రహము" గురించిన పేరా 65, మూలం పేజీ 70.

5. "సంతృప్తి" గురించిన పేరా, 66, మూలం పేజీ 71.

6. "ఏకాంతవాసం" గురించిన పేరా, 67, మూలం పేజీ 71.

7. "ఐదు అడ్డంకులు" గురించిన పేరాలు, 68-74, మూలం పేజీలు 71-72.

8. "నాలుగు ఆనంద పారవశ్య ధ్యానాలు" గురించిన పేరాలు, 73-76, మూలం పేజీలు 75-82. ఇక్కడ ప్రతిదాని చివరా పల్లవి ("మునుపటి దానికన్నా ఉన్నతం, శ్రేష్ఠం") అనేదాన్ని భిక్షుని ఉత్తమ జీవిత ఫలంగా గాకుండా, ఉత్తమ ప్రవర్తనాఫలంగా చదవాలి.

## వివేకం[illegible] (విగ్గ)

9. "జ్ఞానం నుంచి ఏర్పడే అంతర్ దృష్టి" (నానదశ్శనమ్) గురించిన పేరాలు. 83, 84, మూలం పేజీ 76. ఇక్కడ నుంచీ మొదలయ్యే పల్లవి: "ఇది అతనిలో జ్ఞానంగా లెక్కించబడుతుంది. అది మునుపటి దానికన్నా ఉన్నతమైనదీ, అతి తీయనిదీను."

10. "మనోచిత్రం" గురించిన పేరాలు, 85, 86, మూలం పేజీ 77.

11. "మార్మిక బహుమతులు" (ఇద్ధి) గురించిన పేరాలు, 87, 88, మూలం పేజీ 77.

12. "దివ్యకర్ణం (దిబ్బసోత) 89, 90 మూలం పేజీ 79.

13. "ఇతరుల హృదయాలను అవగాహన చేసుకొనే జ్ఞానం" (కొత్త పరియ-నానమ్) గురించిన పేరాలు, 91, 92 మూలం పేజీ 79.

14. "తన గత జన్మలను గురించిన జ్ఞాపకం (పబ్బె-నివాస-అనుస్సతి-నామ) గురించిన పేరాలు, 93, 94 - మూలం పేజీ 79.

15. "దివ్యచక్షువు" (దిబ్బకక్కు) గురించిన పేరా, 95, 96 - మూలం పేజీ 82.

16. "ప్రాణాంతక వరదల నాశనం" (అశవనం ఖయననమ్) గురించిన పేరాలు, 97, 98 - మూలం పేజీ 83.

"అలాంటి మనిషి, అంబత్తా! జ్ఞానంలో నిక్కచ్చి, ప్రవర్తనలో నిక్కచ్చి, జ్ఞానంలో, ప్రవర్తనలో నిక్కచ్చిగా వుంటాడు. ఇంతకన్నా ఉన్నతమూ, మధురతరమూ అయిన నిక్కచ్చితనం జ్ఞానంలో, ప్రవర్తనలో వుండదు.

3. "ఇప్పుడు, అంబత్తా! జ్ఞానంలో, మంచితనంలో సర్వోత్కృష్ట పరిపూర్ణతకి కూడా నాలుగు

బెజ్జాలున్నాయి. అవేమిటి?"

"ఒకవేళ, అంబత్తా! ఏ సన్యాసి గానీ, బ్రాహ్మణుడు గానీ, జ్ఞానంలో, ప్రవర్తనలో క్షుణ్ణంగా సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించకుండానే, తన భుజం మీద కాడిని వుంచుకొని (అగ్గిపుల్లలనూ, నీళ్ల కుండనూ, సూదులనూ తతమ్మా సన్యాసి ఉపయోగించే సరంజామాను మోసుకెళ్లడం) తనలో తాను యిలా అనుకుంటూ, అడవిలోకి వెళ్లిపోవాలి–"ఇహమీదట తమలో తాము వృక్షాల నుంచి కిందపడే ఫలాలనే భుజించేవాళ్లలో నేనూ ఒకణ్ణవుతాను. అప్పుడు, జ్ఞానాన్నీ ధర్మాన్ని సాధించిన తనకి తాను సేవకుడు కావడానికి మాత్రమే అతను అర్హుడవుతాడు."

"మళ్లీ, అంబత్తా! ఒకవేళ ఏ సన్యాసి గానీ, బ్రాహ్మణుడుగానీ జ్ఞానంలో, ప్రవర్తనలో క్షుణ్ణంగా సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించకుండానే తమంత తాముగా నేలను రాలే పండ్లను మాత్రమే తింటూ బతుకకుండా, చేతిలో బొరిగె, గంప పట్టుకొని యిలా అనుకుంటూ అడవి లోకి ప్రవేశించాలి–"యిహ మీద నేను కందమూలాలూ, పళ్లూ మాత్రమే తిని బతికే వాళ్లలో ఒకణ్ణవుతాను." అప్పుడు, వాస్తవంగా, జ్ఞానాన్నీ, ధర్మాన్నీ సాధించిన తన హితానుసేవకునిగా కావడానికి మాత్రమే అతను అర్హుడవుతాడు."

"మళ్లీ, అంబత్తా! ఒకవేళ ఏ సన్యాసిగానీ, బ్రాహ్మణుడు గానీ జ్ఞానంలో, ప్రవర్తనలో నువ్వు క్షుణ్ణంగా సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించకుండానే, తమంతతాముగా నేలనురాలిన పండ్లను మాత్రమే తింటూ బతకకుండానే, కందమూలాలూ, పళ్లు మాత్రమే తిని బతకకుం డానే, ఒక పట్టణం, లేక పల్లెటూరు పొలిమేరల్లో ఒక అగ్ని దైవపీఠాన్ని నెలకొల్పి, అక్కడ నివసిస్తూ, అగ్నిదేవునికి సేవచేస్తూ వుండాలి. అప్పుడు, వాస్తవంగా జ్ఞానాన్నీ, ధర్మాన్ని సాధించిన తనకితాను సేవకునిగా కావడానికి మాత్రమే అతను అర్హుడవుతాడు."

"మళ్లీ, అంబత్తా! ఒకవేళ ఏ సన్యాసి గానీ, బ్రాహ్మణుడు గానీ జ్ఞానంలో, ప్రవర్తనలో నువ్వు క్షుణ్ణంగా సర్వోత్కృష్ణ పరిపూర్ణతను సాధించకుండానే తనంతతానుగా నేలమీద రాలిన పండ్లను మాత్రమే తింటూ, బతకకుండగానే, అగ్నిదేవునికి సేవ చేస్తూ బతకకుండానే, నాలుగు రోడ్ల కూడలిలో నాలుగు ద్వారాలు గల ధర్మసత్రాన్ని నిర్మించి, అక్కడ్నే నివసిస్తూ, తనకి తాను యిలా చెప్పుకోవాలి–"తాను ఎవరైనా–సన్యాసి అయినా, బ్రాహ్మణుడు అయినా–ఈ నాలుగు తోవలలో ఏ తోవనుంచి నడచివచ్చినా, అతనిని నా శక్త్యనుసారం, నా అర్హతమేరకు సేవ చేస్తాను–అంతట, వాస్తవంగా, ధర్మాన్ని సాధించిన తనకి తాను సేవకునిగా కావడానికి మాత్రమే అతను అర్హుడవుతాడు."

"అంబత్తా! జ్ఞానంలో, ధర్మంలో సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించడంలో యివే నాలుగు బెజ్జాలు."

4. "నీ గురించి నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా? ఒకే ఆచార్యుని దగ్గర, చదివే తరగతి విద్యార్థుల్లో ఒకనిగా, జ్ఞానంలో, ప్రవర్తనలో ఈ ఉత్కృష్ట పరిపూర్ణతను నీకు బోధించడం జరిగిందా?"

"అది కాదు, గౌతమా! నేను నేర్చుకున్నది అత్యల్పమని నీ ముందు బహిరంగంగా ఒప్పుకుంటున్నాను.

ఈ వివేకమూ, ప్రవర్తనా ఎంత ఉన్నతమైనవి? నేను వాటిలో శిక్షణ పొందడమే? ఎంతమాట!" జ్ఞానంలో, మంచితనంలో సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించలేకపోయినా, కాడిని భుజాన్ని పెట్టుకొని, 'తమంత తాముగా నేలమీద రాలిన పళ్లు భుజిస్తూ మాత్రమే బతుకుతాననీ' సంతోషంగా ఒట్టు పెట్టుకొని, అడవిలోకి దూసుకుపోవడానికి నువ్వు శిక్షణ పొందావా?"

"అది కూడా లేదు, గౌతమా?"

"అయితే నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా? జ్ఞానంలో, మంచితనంలో క్షుణ్ణంగా నువ్వు సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించలేకపోయినా, నేల మీద రాలిన పళ్లు భుజిస్తూ బతకగలిగే స్థితికి నువ్వు చేరుకోలేకపోయినా, బొరిగె, గంప చేతిలోకి తీసుకొని, 'కంద మూలాలనూ, పళ్లను మాత్రమే తిని బతుకుతానని' సంతోషంగా ఒట్టు పెట్టుకొని అడవిలోకి దూసుకుపోవడానికి శిక్షణ పొందేవా నువ్వు?"

"అది కూడా లేదు, గౌతమా."

"అయితే నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా? జ్ఞానంలో, మంచితనంలో క్షుణ్ణంగా నువ్వు సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించలేకపోయినా, నేలను రాలిన పళ్లను భుజిస్తూ బతకగలిగే స్థితికి నువ్వు రాలేకపోయినా, కంద మూలాలు, పళ్ళు తింటూ బతికే స్థితికి చేరుకోలేకపోయినా, ఏదో ఒక గ్రామంలో లేక పట్టణం పొలిమేరలో ఒక అగ్నిదైవ పీఠాన్ని నెలకొల్పి, అక్కడే నివసిస్తూ, సంతోషంగా అగ్నిదేవుణ్ణి సేవించడంలో శిక్షణ పొందావా?"

"అది కూడా లేదు, గౌతమా."

"అయితే నువ్వేం అనుకుంటున్నావు, అంబత్తా? జ్ఞానంతో, మంచితనంతో క్షుణ్ణంగా నువ్వు సర్వోత్కృష్ట పరిపూర్ణతను సాధించలేకపోయినా, నేలను రాలిన పళ్లు భుజిస్తూ బతకగలిగే స్థితికి నువ్వు యింకా చేరుకోలేకపోయినా, కందలమూలాలూ, పళ్ళూ తింటూనే బతకగలిగే స్థితికి నువ్వు చేరుకోలేకపోయినా, అగ్నిదేవుణ్ణి సేవిస్తూ బతకగలిగే స్థితి నువ్వు లేకపోయినా, నాలుగు రోడ్ల కూడలిలో నాలుగు ద్వారాలు గల ధర్మసత్రాన్ని కట్టించి, అక్కడనే నువ్వు నివసిస్తూ; ఆ నాలుగు మార్గాలలో ఏ మార్గం వెంట ఎవరు వస్తున్నా, నీ సామర్థ్యం మేరకు, నీ శక్త్యానుసారం వారిని వినోదింపచేస్తానని సంతోషంగా ఒట్టుపెట్టుకొనేలాగా నువ్వు శిక్షణ పొందావా?"

"అది కూడా లేదు, గౌతమా!"

"అలాగయితే అంబత్తా! విద్యార్థిగా నువ్వు ఉత్కృష్ట జ్ఞానంలోనూ, నడతలోనూ అవ పరమయిన శిక్షణ పొందడంలో విఫలమవడమే గాకుండా, బెజ్జాల్లో ఏ ఒక్కదాని గురించి

కూడా తెలుసుకోలేకపో యావు. ఫలితంగా నీకు పరిపూర్ణత సిద్ధించలేదు. మీ గురువు–బ్రాహ్మణ పొక్కరసది కూడా–నీకు ఇలా చెప్పారు. "ఎవరీ కపట సన్యాసులు. దాస్య క్రిమొద్దులు, మా బంధువుల కాలికింద చెత్తలాంటి వారు. మూడు దేలను ఔపోసన పట్టిన బ్రాహ్మణులతో సమానంగా ప్రావీణ్యత సంపాయించుకుని గొప్పలు చెబుతారా!" ఆయన స్వయానా నిర్వర్తించాల్సిన కొద్దిపాటి బాధ్యతల్లో ఏ ఒక్కదాన్నీ కూడా పరిపూర్తి చేయనే లేదు. (అదే పెద్దవాటి నిర్లక్ష్యానికి దారి తీస్తుంది.) చూశావా, అంబత్తా! మీ గురువు బ్రాహ్మణ పొక్కరసది గారు నీకు ఎంత తీవ్రమయిన హాని చేశారో?"

6. "అంబత్తా! బ్రాహ్మణ పొక్కరసది కోసల నరేశుడు పసేనది నుంచి అగ్రహారం పొందిన వాడు. అయినా రాజు అతణ్ణి తన సముఖానికి రావడానికి అనుమతించడం లేదు. అతనితో సంప్రదించాల్సి వచ్చినపుడు రాజు తెరవెనుక నుంచే మాట్లాడుతున్నాడు–ఇదెట్లా, అంబత్తా! ఏ రాజు నుంచయితే అతను న్యాయ సమ్మతమయిన జీవనభృతిని పొందుతున్నాడో, ఆ కోసలరాజు పసేనదే అతన్ని తన ఎదుట చూడ్డానికి యిష్టపడటం లేదు. చూశావా, అంబత్తా! మీ గురువు, బ్రాహ్మణ పొక్కరసది గారు యీ విధంగా నీకెంత తీవ్రమయిన హాని చేశారో?"

7. "అంబత్తా! ఇప్పుడు నువ్వేం అనుకుంటున్నావు? ఒకరాజు ఏనుగు మెడ మీదనో, గుర్రం నడుం మీదనో, తన రథం మీదనో నిల్చుని, దేశానికి సంబంధించి కొన్ని ముఖ్యమయిన విషయాలు ముఖ్యులతోనో, యువరాజులతో చర్చించాలనుకో, ఆయన ఆచోటు నుంచి వెళ్ళిపోయాక, ఒక సేవకుడో (శూద్రుడు), సేవకుని దాసుడో ముందుకొచ్చి, అక్కడ నిలబడి, విషయాన్ని చర్చించాల్సి వచ్చినపుడు యిలా చెబుతాడు. "ఇలా, ఇలా సెలవిచ్చారు పసేనది మహారాజావారు" అని. రాజు ఎలా మాట్లాడుతారో, అలాగే అతనిలా చెబుతాడు లేదా రాజు ఎలా చర్చించారో, అలాగే చర్చిస్తాడు. అలా మాట్లాడినంత మాత్రాన అతను రాజుగాని, రాజ్యాధికారి గాని అయిపోడు గదా?"

"కాదు, గౌతమా!"

8. కానీ, అదే విధంగా, అంబత్తా! బ్రాహ్మణులు ఆ ప్రాచీన కథలు (ఋషులు), రుక్కులను రచించారు. పదాల ఆ ప్రాచీన రూపాన్ని ఆ రుక్కులను సస్వరంగా పాడేవారు, పఠించేవారు. వాటిని ఈనాటి బ్రాహ్మణులు మళ్ళీ సస్వరంగా పఠిస్తున్నారు, అభ్యసిస్తున్నారు. ఉదాత్త స్వరం గానం చేస్తున్నారు. ఆనాటికి అత్తక, వామక, వామవేద, యమతగ్గి, అంగీరస, భరద్వాజ, వసెత్త (వశిష్ట), వెస్సమిత్త (విశ్వామిత్ర), కస్సప (కశ్యప), భగు (భృగు)లకు మల్లేనే! నువ్వు కూడా అనొచ్చు. "విద్యార్థిగా నాకు వారి రుక్కులు కంఠతా వచ్చు"నని. ఆ కారణంగా నువ్వు ఋషికి కాగలవా? ఋషి స్థాయికి చేరుకున్నావా? అలాంటి పరిస్థితులకు తావు లేదు.

9. ఇప్పుడేం ఆలోచిస్తున్నావు, అంబత్తా! బ్రాహ్మణులు, ఏళ్ళు పైబడిన వారు, నీ గురుదేవులు, వారి గురువులు మాట్లాడుకుంటుండగా ఏమి విన్నావు? ఎవరి రుక్కులనయితే నీవు పఠిస్తున్నావో, మాటిమాటికీ చదువుతున్నావో–ఆ ప్రాచీన ఋషులు, తల వెంట్రుకలకు, గెడ్డాలకు–సుగంధ తైలం రాసుకుని, నున్నగా దువ్వుకొని, మనోహరాలు చేసుకొని, ధవళ వస్త్రాలు

వేసుకొని, సంపూర్ణంగా పంచేంద్రియాల ఆనందాన్ని నీలాగా, నీ గురువులాగా అనుభవించారనా?

"అది కాదు, గౌతమా."

"లేక వారు (ప్రాచీన ఋషులు) నీ లాగా నీ గురువు లాగా అన్నిరకాల రాయిరప్పలను ఏరివేసి (రసాలను), బియ్యాన్ని ఉడికించి అందులో రకరకాల కూరలను, రసాలను వేసుకొని తినేవారా?"

"అది కాదు, గౌతమా!"

"నడుము చుట్టూ వడ్డాణాలూ కుచ్చుల ఆభరణాలతో సింగారించుకుని నీ కోసం, నీ గురువు కోసం ఎదురు చూసినట్టు వారి కోసం కూడా ఎదురు చూసేవారా?"

"లేక నీలాగా, నీ గురువులాగా వారు పొడుగుపాటి కొరడాలను, ములుకోలను చేతబట్టి గుర్రాలు పూన్చిన రథాలెక్కి షికారుకు వెళ్ళేవారా?"

"లేదు, గౌతమా!"

"పహారాలు, కందకాలు, ద్వారబంధాలు, సాయుధ రక్షకులున్న పట్టణాలలో నీలాగా, నీ గురువులాగా వుండేవారా?"

"లేదు గౌతమా!"

10. "అయితే, అప్పుడు అంబత్తా! మీ గురువుగాని, నువ్వుగాని ఋషులు కాదు గదా! ఋషులు జీవించే పరిస్థితుల్లో నువ్వు జీవించటం లేదు కదా! కానీ ఏదిఏమైనా అంబత్తా! నా గురించి నీకు ఎలాంటి అనుమానం వున్నా, ఎలాంటి సందేహం వున్నా, నన్ను అడుగవచ్చు. నీ సందేహాలకు వివరణ ఇవ్వడం ద్వారా వాటిని నివృత్తి చేస్తాను."

11. అంతట తథాగతుడు తన గది నుంచి ముందుకెళ్ళి; అక్కడ ముందుకీ వెనక్కీ పచార్లు చేయసాగాడు. అంబత్తుడు గౌతముణ్ణి అనుసరించసాగాడు. అలా పచార్లు చేస్తూనే అంబత్తుడు ఆయన (బుద్ధుడి) శరీరం మీద మహా పురుషుడికి ఉండాల్సిన ముప్పయ్ రెండు గుర్తులూ ఉన్నాయో లేదో అని చూశాడు. రెండు గుర్తులు తప్ప-మిగతా అన్నిటివీ అతడు కనుగొన్నాడు. ఆ రెండూ కూడా-మరుగు చేయబడ్డ అవయవం ఒకటి. ఇక కనిపించని (నోటిలోని) నాలుక రెండోది. నాలుక పొడవు ఎంతన్నది తెలియలేదు. వీటికి సంబంధించే అంబత్తునికి సంశయం, అనుమానం, అతనికి తృప్తి కలగటం లేదు. సరిగ్గా నిర్ధారించుకోలేకపోతున్నాడు.

12. అంబత్తుడు సంశయంలో కొట్టుమిట్టాడుతున్న విషయం గురించి తథాగతుడికి తెలుసు. తన అద్భుత శక్తుల్ని ఉపయోగించాడు అతడు. బట్టల్లో కప్పవలసిన అవయవం తొడుగుతో బయటికి వచ్చింది. తథాగతుడు నాలుకను చాపి చుట్టూ తిప్పాడు. ఆయన దానితో తన రెండు చెవులపై చిన్నగా తాడించాడు. అలాగే మళ్లీ స్పృశించి, రెండు నాసికా రంధ్రాలనూ స్పృశింపచేశాడు. మొత్తం తన నొసటినంతటిని (తన) నాలుకతో తథాగతుడు కపివేశాడు.

అంతట బ్రాహ్మణ యువకుడు అంబత్తుడు యిలా ఆలోచించసాగాడు. "పూజ్య గౌతముడికి, మహా పురుషుని శరీరం మీద వుండాల్సిన ముప్ఫయ్ రెండు చిహ్నాలు (కనిపించలేదనుకున్న రెండింటితో సహా కలిపి) ఉన్నాయి. అంబత్తుడు తథాగతునితో ఇలా చెప్పాడు. "ఇహ గౌతమా! మనం సంతోషంగా విడిపోదాం. చాలా పని తొందర్లో వున్నాన్నేను. పని చేసుకోవాలి."

"అలాగే, అంబత్తా! ఉచితమైనట్టు చేయి."

అంతట అంబత్తుడు గుర్రాలు పూన్చిన రథం ఎక్కి, వెళ్ళిపోయాడు.

13. ఇహ అక్కడ బ్రాహ్మణ పొక్కరసది, ఉక్కత గ్రామం నుంచి, తన బ్రాహ్మణ అనుచర వర్గంతో బయలుదేరి విహార స్థలానికి వచ్చి, సుఖాసీనుడై, పనిమీద వెళ్ళిన శిష్యుడు ఇంకా ఎందుకు తిరిగి రాలేదా అని ఎదురుచూడసాగాడు. రహదారి వున్నంతమేరకు అంబత్తుని రథం వచ్చింది. ఆతర్వాత అతను రథం దిగి, కాలి నడకన పొక్కరసదిని చేరి నమస్కరించి, సవినయంగా తనూ ఒక ఆసనం మీద కూర్చున్నాడు. శిష్యుడు కూర్చున్నాక, గురువు యిలా ప్రశ్నించాడు:

14. "సరే అంబత్తా! తథాగతుణ్ణి చూశావా?"

"అవును గురువుగారూ, మేము ఆయన్ని చూశాము!"

"అంతా చెప్పకుంటున్నట్టుగా పూజ్య గౌతముడు అలాగే ఉన్నాడా? లేదా? చూసి చెప్పమన్నాను గదా?"

"ఆయన అలాగే వున్నాడు గురువుగారూ, బయట అంతా చెప్పకుంటున్నట్టుగానే ఉన్నాడు. తద్భిన్నంగా మాత్రం లేరు. మహా పురుషునికి వుండాల్సిన ముప్ఫయ్ రెండు చిహ్నాలు ఆయన వొంటిమీద వున్నాయి. కొన్ని మాత్రమే కాదు. అన్ని చిహ్నాలూ పూర్తిగా వున్నాయి."

"అంబత్తా! సమాన గౌతమునితో నువ్వు ఏమయినా మాట్లాడావా?"

"చిత్తం గురుదేవా, మాట్లాడాను."

"సంభాషణ ఎలా సాగింది!"

ఆతర్వాత అంబత్తుడు తనకీ, తథాగతునికీ మధ్య జరిగిన సంభాషణంతా గురువు పొక్కరసదితో పూసగుచ్చినట్టుగా చెప్పకొచ్చాడు.

15. అంబత్తుడు అలా చెప్పాడో లేదో పొక్కరసది చర్రునలేచిపోయాడు అంత ఎత్తున. "హా! మూర్ఖుడా! తెలివితక్కువ దద్దమ్మా! ఆహా! మన మూడు వేద్లోనూ గొప్ప పండితుడివే! మనిషి చనిపోయాక, ఆ శరీరం విచ్ఛేదమయిపోయి, మరో జన్మెత్తి, భయంకరమైన పరిస్థితిలో, దుఃఖంలో దైన్యంలో కొట్టుమిట్టాడుతాడని వాళ్ళు చెబుతారు! నువ్వు వక్కాణించిన నీ అహంకార వాక్కుల అర్థం ఏమిటి?–గౌతముడి సిద్ధాంతాలు కాకపోతే? ఏమి పండితుడండీ! ఏమి

మంద బుద్ధండీ! నిజంగానే మన మూడు వేదాల్లోనూ ప్రవీణుడండీ!...." అంటూ అసహనంతో మండిపోతూ, పొక్కరసది తన శిష్యుడు అంబత్తుణ్ణి కాలితో ఒక్క తన్ను తన్నాడు. ఆ దెబ్బతో అంబత్తుడు దొర్లుకుపోయాడు. వెంటనే స్వయంగా తానే బయలుదేరి వెళ్ళి ఎలాగోలా తథాగతుణ్ణి చూడాలని నిశ్చయించుకున్నాడు.

16. కానీ అక్కడున్న అతని బ్రాహ్మణ అనుచరవర్గం యిలా చెప్పారు: "అయ్యా! బాగా పొద్దుపోయింది. సమాన గౌతముణ్ణి ఈ వేళప్పుడు కలియటం కుదరనిది. పూజ్య పొక్కరసదులు రేపు వెళ్తే బాగుంటుంది."

అంతట పొక్కరసది తమ స్వగృహంలోనే పరమాన్నాన్ని, పాయసాన్ని తయారు చేయించి, వాటిని బళ్ళమీదకెత్తించి, మండుతున్న కాగడాల వెలుగులో ఉక్కత్తకు బయలుదేరాడు. ఆ గ్రామం చేరుకొని తను రథం మీద వెళ్ళగలిగినంత మేర ఇఖనంఖల వనంలో వెళ్ళి; ఆతర్వాత పొక్కరసది కాలి నడకన సాగి, తథాగతుణ్ణి కలుసుకొన్నాడు. తనూ, తథాగతుడు ఒకరికొకరు శుభాకాంక్షలు, అభినందనలు వంటి మర్యాద సూచకాలను తెలుపుకొన్నారు. ఆతర్వాత పొక్కరసది ఒకపక్కనున్న ఆసనం మీద కూచొని, తథాగతుని ఇలా అడిగాడు.

17. "మా విద్యార్థి, బ్రాహ్మణ యువకుడు అంబత్తుడు ఇక్కడకు వచ్చాడా?"

"ఆ! బ్రాహ్మణుడా! తను వచ్చాడు"

"గౌతమా! మీరు అతనితో ఏమయినా మాట్లాడారా?"

"ఆ! బ్రాహ్మణుడా! మాట్లాడాను."

"అతనితో మీరొనర్చిన జ్ఞాన సంభాషణ ఏమిటి?"

18. అంతట తనకు, అంబత్తునకు నడుమ జరిగిన సంభాషణ అంతటినీ తథాగతుడు బ్రాహ్మణ పొక్కరసదికి వివరంగా పూసగుచ్చినట్లు చెప్పకొచ్చాడు. అలా ఆయన చెప్పిన తర్వాత, పొక్కరసది తథాగతునితో యిలా అన్నాడు: "అతను యువకుడూ, తెలివితక్కువ వాడు, గౌతమా! ఆ బ్రాహ్మణ యువకుడు అంబత్తుణ్ణి క్షమించు, గౌతమా!"

"బ్రాహ్మణుడా! బ్రాహ్మణ యువకుడు అంబత్తుణ్ణి సుఖంగా ఉండనియ్యి."

19. బ్రాహ్మణ పొక్కరసది, తథాగతుని శరీరం మీద మహా పురుషునికి ఉండాల్సిన ముప్ఫయ్ రెండు చిహ్నాల్ని లెక్కించసాగాడు. అతను అన్నీ లెక్క పెట్టగలిగాడు గానీ-రెండుమాత్రం కన్పించలేదు. ఆ రెండింటిలోను బట్టల మాటున ఒకటి, ఇక రెండోది సుదీర్ఘమయిన నాలుక. ఈ రెండిటి గురించి ఇంకా అతని అనుమాన నివృత్తి కాలేదు. అందువల్ల ఒక సంపూర్ణ నిర్ణయా

నికి రాలేకపోయాడు. కానీ, తథాగతుడు ఆ రెండింటిని కూడా పొక్కరసిద్దికి- అంబట్టునికి చూపించినట్టుగానే చూపించాడు. తథాగతునికి ఒక మహా పురుషునికి ఉండాల్సిన ముప్ఫయ్ రెండు చిహ్నాలు వున్నాయని పొక్కరసది గ్రహించాడు. కొన్ని మాత్రమే కాదు. అన్నీ వున్నాయి. తర్వాత అతను తథాగతుని యిలా అడిగాడు. "పూజ్య గౌతములు, వారి సంఘ భిక్షువులూ రేపు నాతో భోజనం చేయడానికి అనుజ్ఞ దయచేస్తారా?". అతని అభ్యర్ధనను తథాగతుడు మౌనంగా అంగీకరించాడు.

20. ఆతర్వాత బ్రాహ్మణ పొక్కరసది, పూజ్య గౌతముడు తన అభ్యర్ధనను అంగీకరించడం చూసి, (మర్నాడు) భోజనం చేసే వేళకి యిలా అన్నాడు: "పూజ్య గౌతమా! వేళయింది. భోజనం సిద్ధంగా వుంది." పొద్దున్నే దుస్తులు వేసుకున్న తథాగతుడు, వాటికితోడు పైన వేసుకొనే అంగారఖాను కూడా వేసుకొని, చేత భిక్షాపాత్రను పట్టుకొని, ఇతర భిక్షువులతో కలసి పొక్కరసది ఇంటికి వెళ్ళాడు. వెళ్ళి, తనకోసం ఏర్పాటు చేసిన ఆసనం మీద కూర్చున్నాడు. తథాగతునికి పొక్కరసది తానే వడ్డన చేశాడు. పరమాన్నాన్నీ, పాయసాన్ని-ఇహ వద్దు అన్నదాకా అతను వడ్డన చేస్తూనే ఉన్నాడు. అలాగే బ్రాహ్మణ యువకులు భిక్షువులకు వడ్డన చేశారు. తథాగతుడు భోజనం ముగించి, భిక్షాపాత్రను, చేతినీ కుడుక్కున్నాడు. పొక్కరసది తథాగతుని పక్కని దిగువ ఆసనం మీద కూర్చున్నాడు.

21. ఆయన అలా కూచున్నాక, తథాగతుడు మెల్లమెల్లగా బోధన చేశాడు. అంటే, ఆయన అతనికి ఔదార్యం గురించీ, ఋజువర్తన గురించీ, స్వర్గం గురించీ, భయాన్ని గురించీ, అహంకారాన్ని గురించీ, తుచ్ఛమయిన కామవాంఛల గురించీ, పరిత్యాగంలోని ప్రయోజనాలను గురించీ బోధించాడు. ఎప్పుడయితే బ్రాహ్మణ పొక్కరసది తన బోధనలు గ్రహించటానికి సర్వసన్నద్ధుడయినాడనీ, వాటితో మెత్తబడ్డాడనీ, అభిమానాన్ని త్యజించాడనీ, తనమీద మనసులో పూర్తిగా విశ్వాసం కలిగి వున్నాడని తెలుసుకున్నాడో, బౌద్ధులు తాము విజయం సాధించిన సిద్ధాంతాన్ని బుద్ధుడు అతనికి ప్రబోధించాడు. అదే-కరుణ సిద్ధాంతం. దాని మూలాన్ని, పరి సమాప్తిని, దాని విధానాన్ని వివరించాడు. ఏ విధంగా అయితే వస్త్రాన్ని మరకలు లేకుండా ఉతికి, పరిశుభ్రమయిన తర్వాత అద్దకం వేయడానికి సిద్ధం చేస్తారో, బ్రాహ్మణ పొక్కరసది సత్యం కోసం మచ్చలేని మనస్థితిని అక్కడ కూచునే పొందాడు. అతనికి తెలుసు: దేనికయితే ప్రారంభం వుంటుందో, స్వాభావికంగా దానిలోనే విచ్ఛిత్తి కూడా వుంటుందని.

22. ఆతర్వాత బ్రాహ్మణ పొక్కరసది సత్యాన్ని దర్శించాడు. దానిలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. అవగతం చేసుకొన్నాడు. దీని లోతుల్లోకి వెళ్ళిపోయాడు. సంశయాన్ని అధిగమించాడు. కలవరాన్ని కాలరాసి, సంపూర్ణ ఆత్మవిశ్వాసాన్ని పొందాడు. గురువు ప్రబోధనల జ్ఞానం కోసం ఎవరిమీద ఆధారపడలేదు. తథాగతునితో అతడిలా అన్నాడు:

"అత్యద్భుతం గౌతమా! (నీ ముఖతః విన్న మాటలు) అత్యద్భుతం. విసరివేసిన దాన్ని తీసుకురావటానికి గానీ, లేక దాచిపెట్టినదాన్ని వెలికి తీయటానికిగానీ, లేదా పదభ్రష్టునికి సరైన మార్గాన్ని చూపించటానికి గానీ లేదా అంధకారంలోకి వెలుగును తీసుకురావటానికి గానీ, తద్వారా కళ్ళున్నవారు బాహ్యరూపాల్ని దర్శించటానికి గానీ–ఎవరో ఒకరిని ఎలా నియమించాలో ఇదీ అలాగే కావచ్చు. ప్రభువు గౌతముడు సత్యాన్ని నాకు ఎన్నో రకాలుగా తెలిపాడు. ఇహ నేను, గౌతమా! నా భార్యాసుతులతో సహా, పూజ్య గౌతములను నా పథ నిర్దేశకులుగా ఆశ్రయించాను. సత్యాన్నీ, సంఘాన్నీ ఆశ్రయించాం. పూజ్యులైన గౌతములు నన్ను వారి శిష్యునిగా, అంతేవాసిగా స్వీకరించాలి. నేను నేటి లగాయితూ, ఈ బొందిలో ప్రాణం వున్నంతదాకా, మిమ్మల్నే నా గురువులుగా ఎంచుకొన్నాను. పూజ్య గౌతములు ఉక్కత్త గ్రామంలో తమ శిష్యుల్ని, ఇతర కుటుంబాన్ని దర్శిస్తున్నట్టుగానే, నన్ను కూడా చూడవలసిందిగా కోరుతున్నాను. అక్కడ ఎవరైతే బ్రాహ్మణులు, వారి భార్యలు పూజ్య గౌతములను భక్తితో కొలుస్తారో, వారి సమక్షంలో లేచి నిలుచుంటారో, ఆసనం చూపించుతారో, లేక మంచినీరు సమర్పిస్తారో, లేక వారితో ఆనందం అనుభవిస్తారో, అటువంటి వారికి అది వారి శ్రేయస్సుకి హేతువవుతుంది."

"భళీ! బ్రాహ్మణుడా! నీవు చెప్పింది బాగుంది."

(అంబత్త సుత్త పరిసమాప్తం)

# VI

కులాన్ని వ్యతిరేకించే సందర్భంలో, బుద్ధుడు తానేమయితే ప్రబోధించాడో, దాన్నే ఆయన అమలుపరచాడు. ఆర్యుల సమాజం దేన్నయితే చేయడానికి నిరాకరించిందో, దాన్నే ఆయన చేశాడు. ఆర్యుల సమాజంలో శూద్రుడు లేదా కడజాతి వ్యక్తి బ్రాహ్మణుడు ఎన్నటికీ కాలేడు. కానీ బుద్ధుడు కులానికి వ్యతిరేకంగా ప్రబోధించడమే కాకుండా, శూద్రుడికీ, కడజాతి వాడికి 'భిక్కు' (భిక్షువు) స్థాయి కల్పించాడు. బ్రాహ్మణ మతం (బ్రాహ్మినిజం)లో బ్రాహ్మణుని స్థాయి ఎటువంటిదో, బౌద్ధమతంలో భిక్కుల స్థానమూ అంతే! రేస్ డేవిస్ ఇలా స్పష్టంగా చెబుతున్నారు: (డా. అంబేద్కర్ యిక్కడ కొటేషన్ ఇవ్వడం మర్చిపోయారు–సంపాదకులు)

మొదటి విషయం, తన సంఘం విషయంలో, దానిపై ఆయనకి సంపూర్ణమయిన పట్టు వుంది–పుట్టుక, వృత్తి, సామాజిక స్థాయికి సంబంధించి అన్ని అనుకూలతలను, ప్రతికూలతలను పూర్తిగా యింక ఏ ఆలోచనా లేకుండా పరిగణనలోకి తీసుకోవడం మానేసి; సాంఘిక అపవిత్రత, విధి విహితాల నుంచి ఎదురయ్యే అన్ని అడ్డంకుల్నీ, అనర్హతలను తుడిచిపెట్టాడు బుద్ధుడు.

బౌద్ధ సంఘంలోని ముఖ్యమయిన వారిలో ఒకడు, గౌతముడు తన తర్వాత సంఘ సూత్రాల్లో అతి ముఖ్యమయిన అధికారిగా పేర్కొన్నవాడు, అయిన ఉపాలి పూర్వాశ్రమంలో మంగలివాడు. హిందూ సమాజంలో తృణీకారానికి గురిఅయిన వృత్తుల్లో అది ఒకటి. అలాగే సునీత. గిరిజన తెగల్లో అతి తక్కువదైన 'పుక్కుస' తెగకు చెందినవాడు. ఇతడు రాసిన పద్యాలు 'థేరి గాథ'లలో చేర్చడానికి ఎంపిక చేయబడ్డాయి. సాంప్రదాయాన్ని సవాల్‌చేసిన సతి బెస్తవాని కొడుకు. ఆ కులం నిమ్నకులం. క్రూరమయిన వృత్తి కావటం చేత అది ఏవగింపుకి గురయింది. ఇక నందుడు గోపాలుడు. ఇద్దరు పంతకోలు–ఓ మంచి కుటుంబంలోని యువతి, ఒక దాసుడు పెళ్ళి చేసుకోవడం వల్ల పుట్టారు. (మనువు నిర్దేశించిన నియమం 31 ప్రకారం ఆ ఇద్దరు కూడా కులభ్రష్టులే గదా!) కాప లేళ్ళని పట్టేవాని కూతురు. పున్న, పున్నిక–ఈ ఇద్దరూ దాసీకన్యలు. సుమంగళ మాత రెల్లుతో పనిచేసే శ్రామికుల కూతురూ, తల్లీ కూడా. శుభ కమ్మరివాని కూతురు. మౌలిక బౌద్ధ గ్రంథాలు వెలుగులోకి వచ్చేకొద్దీ మరిన్ని పేర్లను మనం చెప్పవచ్చు. ఇవేకాక మరికొన్ని ఇతర పేర్లు కూడా తెలుస్తాయి.

'ఆ! ఇప్పటిదాకా చెప్పిన సంఖ్య చాలా స్వల్పం' అని తిరస్కారసూచకంగా నవ్వేయడం లోనూ అదంతా పైపై ప్రదర్శన కొరకే అనడంలోనూ చారిత్రక దృష్టి అంతగా కనిపించదు. మొత్తం జనాభాలో అణగారిన జాతులవారు, సిప్పాల శాతంతో పోలిస్తే బౌద్ధ సంఘంలో కడజాతి వారి సంఖ్య అధిక నిష్పత్తిలోనే వుంటుంది. థేరిగాథలో పేర్కొన్న థేరిలలో 60 మంది సాంఘిక స్థాయి మనకు తెలుసు. వారిలో పైన చెప్పిన అయిదుగురు అట్టడుగు కులాల వారు. అంటే

మొత్తం సంఖ్యలో 8 1/2 శాతం మంది పునాది వర్గంలో నుంచి వచ్చినవారు. జనాభాలో వారి శాతంతో పోల్చి చూస్తే ఈ నిష్పత్తి సుమారుగా సరిపోతుంది.

ఏవిధంగా అయితే బుద్ధుడు శూద్రులను, కడజాతి మనుషులను బౌద్ధ మతంలో అత్యున్నత స్థాయికి-అంటే భిక్కులుగా చేయడం ద్వారా-వారి సాంఘిక స్థాయికి పెంచాడో, అదే విధంగా స్త్రీల స్థాయిని కూడా పెంచాడు. ఆర్యుల సమాజంలో శూద్రులు ఏ స్థానంలో అయితే వుంచబడ్డారో, స్త్రీలు కూడా అదే స్థానంలో వుంచబడ్డారు. ఆర్య సాహిత్యమంతటా కూడా శూద్రులు, స్త్రీలుఒకే స్థాయికి చెందినవారుగా పేర్కొబడ్డారు. (ఆర్య సమాజంలో) సన్యసించడం ఒక్కటే మోక్షానికి తెరచిన మార్గం. కానీ శూద్రులు, స్త్రీలు సన్యసించటానికి అవకాశం లేదు. అంటే వీరు మోక్ష పరిధికి లోబడిన వారు కాదన్నమాట. శూద్రుల విషయంలో లాగానే, బుద్ధుడు స్త్రీల విషయంలో కూడా ఆర్యులు పెట్టుకొన్న నియమాల నడ్డి విరగ్గొట్టాడు. బౌద్ధ మతంలో ఏ విధంగా అయితే శూద్రుడు భిక్కు కాగలుగుతున్నాడో, అదే విధంగా స్త్రీ పరివ్రాజిక/భిక్కుణి కాగలిగింది. ఇది స్త్రీకి అత్యున్నత స్థాయి కల్పించినటువంటిది. ఆనాటి ఆర్యుల సమాజం దృష్టిలో ఇది ఊహకయినా అందని విషయం.

బుద్ధుడు, ఆర్యుల సమాజ నాయకులతో పోరాడిన మరొక అంశం-హిందూ గురువుల నీతిసూత్రాలు, వారి బోధనలూను. జ్ఞానార్జన, విద్య-ఈ రెండు బ్రాహ్మణుల, క్షత్రియుల, వైశ్యుల హక్కుభుక్తాలు అనేది; శూద్రులు విద్య నేర్చుకోడానికి అర్హులు కారనేది పాతుకుపోయి వున్న అభిప్రాయం. తాము స్త్రీలకూ, బ్రాహ్మణులు కాని పురుషులకూ విద్యను బోధిస్తే-సామాజిక వ్యవస్థకు అంత ముప్పు ఏర్పడుతుందని వారు ఒత్తి చెప్పారు. ఈ ఆర్యుల సిద్ధాంతాన్ని బుద్ధుడు పూర్తిగా నిరాకరించాడు. ఈ సమస్య మీద రైస్ డేవిస్ యిలా నొక్కి చెప్పారు. "ప్రతి ఒక్కరూ విద్యను అభ్యసించడానికి అవకాశం యివ్వాలి. శక్తి-సామర్థ్యాలున్న ప్రతివారికీ బోధించడానికి అవకాశం కల్పించాలి. అతను విద్యను బోధిస్తే, ఎలాంటి మినహాయింపులూ లేకుండా, ఎవర్నీ త్రోసిరాజనకుండా-అది అందరికీ బోధించాలి." ఈ సందర్భంలో బుద్ధునికీ, బ్రాహ్మణ లోహిక్కునికీ మధ్య జరిగిన సంవాదాన్ని ఉదహరించి చూపడం అవసరం. అది 'లోహిక్క సుత్త'గా ప్రసిద్ధం.

## లోహిక్క సుత్త

(బోధించడంలోని నైతిక సూత్రాలకు సంబంధించిన కొన్ని అంశాలు)

1. నేనిలా విన్నాను. తథాగతుడు ఒకనాడు ఐదు వందల మంది భిక్కు బృందంతో కలసి కోసల మండలాలను పర్యటిస్తూ, చివరికి సాలవాటిక (గ్రామం అంతా సాలవృక్షాల వరుసతో చుట్టి వున్నట్టిది) చేరుకున్నాడు. ఆకాలంలో సాలవాటికలో బ్రాహ్మణ లోహిక్కుడు స్థిర నివాసం ఏర్పరచుకొని వుంటున్నాడు. ఆ గ్రామం సమృద్ధిగా పచ్చిక బీళ్ళూ, వనాలు, ధనధాన్యాలతో తుల తూగుతోంది. కోసలరాజు పసేనది సాలవాటికను రాజ బహుమతిగా సమస్త హక్కుభుక్తాలతో

లోహిక్కునికి యిచ్చివేశాడు.

2. ఒకనాడు బ్రాహ్మణ లోహిక్కుని మనసులో ఒక దుర్బుద్ధి పుట్టింది–తానొక ఆలోచనను ఎందుకు ఆచరణలో పెట్టకూడదు అని: ఆ ఆలోచన ఏమిటంటే–ఒకవేళ సమానునికి గానీ, బ్రాహ్మణునికి గానీ జ్ఞానం కలిగితే అప్పుడతను ఆ విషయం గురించి ఎవరికీ తెలియచేయాల్సిన పనిలేదు. దేనికోసం ఒక మనిషి మరో మనిషిని ఏమైనా చేస్తాడు? ఆ విషయం గురించి ఇతరులకు చెప్పడమంటే అర్థం—పాత బంధాన్ని తెంచుకొని, కొత్త బంధంలో యిరుక్కోవడమన్న మాట. అలాంటిదే యిది కూడా! (ఇతరులకు తెలియచెప్పాలన్న అభిలాష కూడా); అది ఒక రకమైన మోహం కూడా! అసలు దేనికోసం ఒక మనిషి మరో మనిషికోసం ఏదైనా చేస్తాడు?"

ఇప్పుడు బ్రాహ్మణ లోహిక్కుడు ఈ వార్తలను విన్నాడు: శాక్య (మహారాజు)ల కొడుకు, శాక్య వంశాన్ని కాదని మత జీవితాన్ని వరించిన సమాన గౌతముడు కోసల మండలాలను పర్యటిస్తూ, బౌద్ధ భిక్కుల బృందంతో సాలవాటికకు చేరుకున్నాడట. ఆ పూజ్య గౌతముని గురించి ఇతర ప్రాంతాల్లో గొప్పగా చెప్పకుంటున్నారట. ఆ పూజ్యుడు అర్హతుడట. మహాజ్ఞానట. జ్ఞానంలో, మంచితనంలో, ఆయనకు ఆయనే సాటట. లోకాలకు సంబంధించిన జ్ఞానంతో సంతోషంగా వుంటాడట. మార్గదర్శకులైన వ్యక్తులలో ఆయనకు సాటి రాగలిగినవారు మరొకరు లేరట. దేవతలకీ, మనుషులకీ బోధకుడట. అతను బుద్ధుడట. పరమ పూజనీయుడట. దేవుళ్ళకీ, బ్రాహ్మణులకూ, మారులకీ పైనున్న (ఊర్ధ్వ) లోకాలతో పాటు, సమానులతోనూ, బ్రాహ్మణులతోనూ, రాజులతో, ప్రజలతోనూ కలిసి వున్న ఈ విశ్వాన్ని–ఎదురెదురుగా చూస్తున్నట్టుగా, తానుగా క్షుణ్ణంగా ఎరుగును. తనకి తెలిసిన జ్ఞానాన్ని ఇతరులకు పంచుతాడు. సత్యం–మూలంలో సుందరమైంది. అభివృద్ధి క్రమంలో సుందరమైంది. సిద్ధిలో సుందరమైంది– అని మనసా వాచా ఆయన ప్రకటించాడు. పరిపూర్ణతలో, పరిశుద్ధతలో ఆయన ఉన్నత జీవితం గురించి అందరికీ తెలియచేశాడు. ఆ అర్హతుణ్ణి (యోగ్యుణ్ణి) దర్శించడం మంచిది.

4. బ్రాహ్మణ లోహిక్కుడు అప్పుడు మంగలివాడైన భేషికునితో యిలా అన్నాడు. ఇలారా, భేషికా! నువ్వు చాలా మంచివాడివి. సమాన గౌతముడు ఎక్కడున్నాడో అక్కడికి వెళ్ళు. వెళ్ళి ఆయన అనారోగ్యాన్ని నేను విచారించానని చెప్పు. జబ్బు తగ్గిందా స్వస్థతగా వుందా అని నా పేరు మీద అడుగు. ఆయనకు తీరిక వుందో లేదో కనుక్కో! తీరిక లేకపోతే ఎప్పుడు తీరికవుతుందో అడుగు. ఇవన్నీ తెలుసుకొని యిలా మాట్లాడు: "పూజ్యులు గౌతములూ, మీరు, మీ భిక్కు బృందం రేపటి భోజనాన్ని బ్రాహ్మణ లోహిక్కుని యింట భుజించాలి."

5. "మంచిది దొరా" అన్నాడు మంగలి భేషికుడు. అతడు లోహిక్కుడు చెప్పిన పనిని చేయడానికి ఒప్పుకున్నాడు. తనని ఆజ్ఞాపించిన విధంగా అతను ఆచరించాడు. తథాగతుడు అతని అభ్యర్థనకి మౌనంగానే అంగీకారాన్ని తెలియచేశాడు.

6. తథాగతుడు తన అభ్యర్థనకి ఆమోదం తెలియజేశాడని గ్రహించగానే, (ఆసనం మీద నుంచి లేచి) బ్రాహ్మణ లోహిక్కుని దగ్గరకు వచ్చి, యీ విధంగా చెప్పాడు భేషికుడు: "అయ్యగారూ! తమరు ఆజ్ఞాపించినట్లుగానే మీ పేరు మీద మహాత్ముణ్ణి భోజనానికి రమ్మన్నాను. ఆ అయ్యగారు ఒప్పేసుకొన్నారు."

7. ఆరోజు రాత్రి గడిచింది. అంతట ఉదయాన్నే లేచి బ్రాహ్మణ లోహిక్కుడు పరమాన్నాన్నీ పాయసాన్నీ వండించాడు. ఆతర్వాత భేషికుడ్ని పిలిచి, యిలా చెప్పాడు: "భేషికా! ఇలారా! చాలా మంచివాడివి నువ్వు. సమాన గౌతముడు ఎక్కడున్నాడో చూసి అక్కడకు వెళ్ళు... వెళ్ళి, భోజనాలు చేసే వేళయిందని తెలియచేయి. 'గౌతమా! త్వరగా రండి. భోజనం సిద్ధంగా వుంది' అని పిలువు."

"అలాగే అయ్యగారూ!" అని బ్రాహ్మణ లోహిక్కుడు చెప్పినదాన్ని భేషిక్కుడు అంగీకరించాడు. ఆయన ఆజ్ఞాపించినట్టుగానే భేషిక్కుడు ఆచరించాడు.

ప్రొద్దుటే తగిన దుస్తులు ధరించిన తథాగతుడు, భిక్షాపాత్రతో, బౌద్ధ భిక్షువులతో సాల వాటికకు బయలుదేరాడు.

8. ఆయన ముందు సాగుతుండగా, మంగలి భేషికుడు అడుగులో అడుగు వేసుకుంటూ, ఆయనని అనుసరించాడు. అతడు తథాగతునితో ఇలా చెప్పాడు:

"ప్రభూ! ఈ దిగువ చెప్పే కుత్సితపు అభిప్రాయం లోహిక్కునిలో వుంది. ఉదాహరణకు ఒక సమానుడో లేక బ్రాహ్మణుడో ఒకమేరకు జ్ఞానోదయం పొందాడనుకొందాం. దాన్ని గురించి అతడు వేరే ఎవ్వరికీ ఈ విషయం గురించి చెప్పడు. కారణం–ఒక మనిషి మరో మనిషి కోసం ఏం చెయ్యగలడు? ఇతరులకు చెప్పడం అంటే అర్థం ఒక పాత బంధం నుంచి వెలువడిన వ్యక్తి, మరో కొత్త బంధంలో చిక్కుకుపోవడం లాంటిది. అలాంటిదేననుకుంటాను, ఇది కూడా! (ఇతరులకు చెప్పాలనే కోర్కె). ఇది ఒకరకమైన మోహం." ప్రభూ! తథాగతులు ఆయన (లోహిక్కుని) మనసులోని భ్రాంతిని తొలగించగలిగితే చాలా బాగుంటుంది. ఎందుకోసం ఒక మనిషి మరో మనిషి కోసం ఏదైనా చేయగలుగుతాడు?"

"అదే మంచిదనుకుంటాను, భేషికా! అదే మంచిదనుకుంటాను."

9. తథాగతుడు బ్రాహ్మణ లోహిక్కుని యింటికి వెళ్ళి తనకోసం ఏర్పాటు చేసిన ఆసనం మీద కూర్చున్నాడు. బ్రాహ్మణ లోహిక్కుడు–బుద్ధుడికీ, బౌద్ధ భిక్కువులుకీ–పరమాన్నాన్నీ, పాయసాన్ని తృప్తిగా వడ్డించాడు. 'ఇక తినలేం. వద్దు, వద్దు' అన్నదాకా వడ్డిస్తూనే వున్నాడు. తథాగతుడు

భోజనం చేయడం ముగించి; భిక్షాపాత్రనీ, చేతుల్నీ కడుకున్నాడు. ఆతర్వాత బ్రాహ్మణ లోహిక్కుడు తక్కువ ఎత్తు వున్న ఆసనాన్ని తెచ్చుకొని తథాగతునికి దగ్గరగా వేసుకొని, దానిమీద ఆసీనుడయ్యాడు. అలా కూచున్న అతనితో తథాగతుడు ఇలా మాట్లాడాడు:

"లోహిక్కా! వాళ్ళు చెప్పేది నిజమేనా? ఈ క్రింద చెప్పే కుత్సితమయిన అభిప్రాయం నీ మనసులో పుట్టిందేనా (పైన ఉదహరించిన అభిప్రాయాన్ని ఆయన చెప్పాడు)?"

"అది నిజమే గౌతమా."

10. "లోహిక్కా! ఇప్పుడేం అనుకుంటున్నావు? సాలవాటికలో నీవు స్థిరపడ్డట్టేనా?"

"ఆ! స్థిరపడ్డట్టే గౌతమా!"

"అయితే లోహిక్కా! మాటవరసకి యిప్పుడు ఒకరు ఇలా అన్నారనుకో! 'బ్రాహ్మణ లోహిక్కుడికి సాలవాటిక రాజ్యంగా వుంది. ఈ సాలవాటిక నుంచి వచ్చే ఆదాయాన్నీ, ఫల సాయాన్నీ అంతటినీ ఇతరులకు చిల్లిగవ్వ కూడా ఇవ్వకుండా ఆయననే అనుభవించనీయండి.' ఈ రకంగా మాట్లాడటం మీమీద ఆధారపడి బతికేవాళ్ళు వింటే ప్రమాదం. అవునంటావా? కాదంటావా?"

"గౌతమా! అలా అనేవాడు ప్రమాదకారియైన వ్యక్తే!"

"ఆ రకంగా ప్రమాదాన్ని సృష్టించేవాడు వారి మంచినీ, క్షేమాన్నీ కోరేవాడు అవుతాడా? అవ్వడా?"

"అలాంటివాడు వారి క్షేమాన్ని గురించి ఆలోచించడు, గౌతమా!"

"వారి క్షేమాన్ని పరిగణనలోనికి తీసుకోని వాని మనసు, వారిపట్ల ప్రేమతో స్థిరంగా వుంటుందా? విద్వేషంతో నిండి వుంటుందా?"

"విద్వేషంతో నిండి వుంటుంది గౌతమా!"

"కానీ ఒకరి మనసు విద్వేషంతో స్థిరంగా వుంటే, అది అనారోగ్యకరమయిన సిద్ధాంత మవుతుందా? ఆరోగ్యకరమైనదవుతుందా?"

"అనారోగ్యకరమైన సిద్ధాంతం అవుతుంది. గౌతమా!"

"ఇప్పుడు, ఒక మనిషి అనారోగ్యకరమైన సిద్ధాంతాన్ని కలిగి వుంటే, లోహిక్కా! తనకి వచ్చే రెండు జన్మల్లోనూ, ఒకదాన్ని ప్రాయశ్చిత్తంతో గడిపేలా గానీ; లేక పశువుగా పునర్జన్మ ఎత్తేలా గానీ వుంటుందని ప్రకటిస్తున్నాను."

11. "ఇప్పుడేం ఆలోచిస్తున్నావు. లోహిక్కా? కోసల నరేశుడు పసేనది అధీనంలో కాశీ, కోసల–రెండు పట్నాలు ఉన్నాయి గదా!"

"అవును, వున్నాయి. నిజమే గౌతమా!"

"అప్పుడు లోహిక్కా! మాట వరుసకి ఒకరు ఇలా అన్నారనుకోండి: 'కోసలరాజు పసేనది అధీనంలో కాశీ, కోసల–రెండు పట్నాలు ఉన్నాయి. ఇతరులెవరికీ ఏమీ పంచకుండా, ఆయననే కాశీ నుంచీ, కోసల నుంచి వచ్చే ఆదాయాన్ని, ఫలసాయాన్ని పూర్తిగా అనుభవించనీయమనండి.' పసేనది రాజు మీద ఆధారపడి బతికేవారు వినేలా పై మాటలు అనేవాడు ప్రమాదకారి కదూ? మీకూ, ఇతరులకూ కూడా!"

"అవును గౌతమా! అతను ప్రమాదం కలిగించే వ్యక్తే మరి!"

"అలా ప్రమాదం కలిగించే ఆలోచనలు కలిగిన వ్యక్తి, వారి గురించి సానుభూతితో వుండగలడా? వుండలేడా?"

"అతను వారి క్షేమం గురించి ఆలోచించదు, గౌతమా!"

"వారి క్షేమం గురించి ఆలోచించని వాని మనసు వారి ఎడల ప్రేమతో, దృఢంగా వుంటుందా? విద్వేషంతో వుంటుందా?"

"విద్వేషంతోనే వుంటుంది. గౌతమా!"

"ఒకరి మనసు ద్వేషంతో నిండిపోయి వుంటే, అది అనారోగ్యకరమయిన సిద్ధాంతమా? ఆరోగ్యకరమైనదా?"

"అది అనారోగ్యకరమయిన సిద్ధాంతమే, గౌతమా!"

"అనారోగ్యకరమయిన సిద్ధాంతాన్ని గలిగిన మనిషి రాబోయే రెండు జన్మల్లోనూ ఒకటి–అతను ఆ జన్మలో ప్రాయశ్చిత్తంతో గడపడం గానీ, పశువుగా పునర్జన్మ ఎత్తడం గానీ చేయాల్సిందే."

12 & 14. "అయితే అప్పుడు లోహిక్కా! సాలవాటికను సొంతం చేసుకున్న మీరు, ఎవరికీ చిల్లిగవ్వ కూడా యివ్వకుండా, దాని మీద వచ్చే ఆదాయమంతా, ఫల సాయమంతా, ఒక్కరే అనుభవించమని, ఎవరయినా అంటే; కాశీ, కోసల–ఈ రెండు నగరాల మీద అధికారం వున్న కోసల రాజు పసేనది, ఆ రెండింటి మీద వచ్చే ఆదాయాన్ని, ఫలసాయాన్నీ అంతా తనే అనుభవించమనీ, ఒక్క చిల్లిగవ్వ కూడా ఎవరికి యివ్వనవసరం లేదనీ ఎవరైనా అంటే; అలా అనేవాడు మీమీద ఆధారపడి బతికేవారికి ప్రమాదం తెచ్చిపెడుతున్నాడనీ, లేదా రాజు మీద ఆధారపడి జీవించే మీకు, ఇతరులకు కూడా అలా చేస్తున్నాడనీ మీరు అంగీకరిస్తారు. ఆ విధంగా ఇతరులకు ప్రమాదం తెచ్చి పెట్టేవాడు, వారిపై సానుభూతి లేనివాడు. సానుభూతి లేని మనిషి మనసు శతృత్వంతో నిండిపోతుంది. అలా శతృత్వంతో నిండిన మనసు అనారోగ్యకర సిద్ధాంతం అవుతుంది.

13 & 15. "లోహిక్కా, అదే విధంగా "ఒక సమానుడు కానీ, బ్రాహ్మణుడు కానీ, ఒకానొక ఉన్నత మానసిక స్థితికి చేరితే, దాని గురించి అతనెవరికీ చెప్పకూడదు. దేనికోసం ఒకరు మరొకరికి ఏదైనా చేయాలి? అనుకుంటాడు. ఇతరులకు చెప్పడం అంటే – పాత బంధనాలను వదిలించుకున్న తాను మరో కొత్త బంధంలోకి ప్రవేశించడమే కదా, అందుకని ఇతరులకు వెల్లడించాలనే కోరిక కూడా ఒక రకం మోహమే అంటాను" అని ఎవరైనా అన్నారనుకో. అలా అనేవాడు 'సత్యాన్ని సాధించిన వాడు' రూపొందించిన సిద్ధాంతాన్నీ, క్రమశిక్షణనీ స్వయంగా చేపట్టిన తక్కిన వారి దారిలో అవరోధాలు కల్పిస్తున్నాడన్న మాట. వారు దీక్ష పొందే ఫలాన్ని, మరొక్క జన్మ పొందే ఫలాన్ని, జన్మరాహిత్య ఫలాన్ని, అర్హతత్వం పొందే ఫలాన్ని కూడా వారు పొందకుండా, తమ సద్వర్తన ద్వారా స్వర్గంలో బ్రహ్మానంద స్థితిలో పునర్జన్మను వారు సాధించకుండా అడ్డుపడుతున్నారన్న మాట. వారికి అలా అడ్డు పడుతున్నాడంటే వారి క్షేమం గురించి అతనికి సానుభూతి లేదన్న మాట. వారి క్షేమం గురించి పట్టని అతను మనసు శత్రుత్వంతో నిండిపోతుంది. మనసు శత్రుత్వంతో నిండిపోయాక, అతనిదిక పసలేని సిద్ధాంతం. అపసవ్యమైన సిద్ధాంతాలున్న మనిషికి వచ్చే రెండు జన్మల్లోను ఒకదానిలో ప్రాయశ్చిత్తమో, జంతుజన్మో కలుగుతుందని ప్రకటిస్తున్నాను లోహిక్కా!"

16. లోహిక్కా! ఈ ప్రపంచంలో నిందింపదగిన మూడు రకాలయిన గురువులు ఉన్నారు. అలాంటివారిని ఎవరు నిందించినా, వారికి పెట్టే చివాట్లు–వాస్తవాలు నిజం మీద ఆధారపడి వుండాలి గాని, అనుచితమైనవిగా వుండరాదు. ఆ మూడు రకాలు ఏమిటి?

"లోహిక్కా! మొదటి రకం గురువు వుంటాడు. ఏ 'సమాన' స్థితిని సాధించడం కోసం అయితే ఇల్లు వాకిలీ వదలిపెట్టేసి బయటికి వచ్చేస్తాడో; ఇల్లులేని జీవితం గడుపుతాడో,

దాన్నే అతడు సాధించలేడు. తాను దాన్ని సాధించకుండానే, శిష్యులకు సిద్ధాంతాన్ని (ధమ్మ) ఇలా బోధిస్తుంటాడు: "ఇది నీకు మంచిది, దీనివల్ల నీకు ఆనందం కలుగుతుంది." ఆ శ్రోతలు అతను చెప్పేదేమీ వినరు; అతను చెప్పే విషయానికి చెవి ఒగ్గి వినరు. అది వినడం వల్ల కలిగిన జ్ఞానంతో వారివారి హృదయాల్లో స్థిరత్వం ఏర్పడదు; గురువు చెప్పే బోధనలను పట్టించుకోకుండా ఎవరి తోవను వారు వెళతారు. ఈ వాస్తవాలన్నిటినీ గమనంలోకి తెసుకొని, ఆ గురువుని మందలించాలి. అంతేకాదు. ఇలాంటి మాటల్ని కూడా జోడించాలి: "ఛీ పొమ్మంటున్నా ఆ స్త్రీ వెంటబడే వాడిలాగానూ, మొహం తిప్పకుంటున్నా కావులించుకోవాలని చూసేవాడిలాగాను వున్నావు. అటువంటి కామమే ఇది. (శిష్యులు నమ్మకున్నా, ఎవరూ వినకున్నా బోధకుని వలె డాబు కొట్టడం) కూడా. అయితే, దేనికోసం ఎవరైనా ఇంకొకరికి ఏదైనా చేస్తారు?"

"లోహిక్కా! ఇతను ప్రపంచంలో నిందార్హుడయిన మొదటి రకం గురువు. ఇలాంటివాణ్ణి ఎవరు నిందించినా, ఆ చీవాట్లు వాస్తవాల మీద, సత్యం మీద ఆధారపడి న్యాయోచితంగా వుండాలి. అనుచితంగా వుండరాదు."

17. ఇహ లోహిక్కా! రెండో రకం గురువు గురించి చెబుతాను విను. ఇతను 'సమానుని' స్థాయికి చేరుకోడు. నిజానికి దానికోసమే గృహస్థాశ్రమ జీవితాన్ని త్యజించి, గృహస్థాశ్రమం కాని వేరొక జీవితాన్ని ఎంచుకొంటాడు. తాను సాధించవలసినదాన్ని సాధించకుండానే, తన సిద్ధాంతాన్ని శిష్యులకు బోధిస్తుంటాడు. అతను ఇంకా ఇలా చెబుతాడు. "ఇది నీకు మంచిది; దానివల్ల నీకు ఆనందం కలుగుతుంది" అని అంటుంటాడు. అతను చెప్పినదాన్ని అతని శిష్యులు వింటారు. తమ చెవులు ఒగ్గి మరీ శ్రద్ధగా వింటారు. అతను చెప్పిందాన్ని విని, అవగాహన చేసుకొని తమతమ హృదయాల్లో దృఢమయిన అభిప్రాయాన్ని ఏర్పరచుకుంటారు. గురుబోధనల నుంచి వేరు కాకుండా తమకి తోచిన తోవను కూడా వారు అనుసరించరు. ఈ వాస్తవాలను ఆధారంగా చేసుకుని ఆ గురువును చివాట్లు పెట్టాలి. ఇంకా ఇలా చెప్పాలి: "నువ్వు ఎలాంటి వాడివంటే-తన స్వంత పొలాన్ని గురించి పట్టించుకోకుండా, పక్కవాడి పొలంలో పెరిగిపోయి వున్న కలుపు మొక్కల్ని ఏరి పారెయ్యడానికి ఆలోచిస్తూ వుండే వ్యక్తి లాంటివాడివి. ఇదే నీ కోరిక. (నీకు నీవు బోధించుకోకుండా, ఇతరులకు బోధిస్తూ పోతుంటావు నీవు) ఎందుకోసం, అప్పడు. ఒక మనిషి కోసం మరో మనిషి చేయగలడు?"

"లోహిక్కా! ప్రపంచంలో మందలించదగ్గ వారిలో ఈ రకం గురువు రెండో కోవకి చెందుతాడు. అలాంటివాణ్ణి ఎవ్వరు నిందించదలచినా, వాస్తవాలు, సత్యం మీద ఆధారపడే అతణ్ణి నిందించాలి తప్ప, అనుచితంగా మాత్రం కాదు.

18. ఇహ మూడో రకం గురువుంటాడు. ఇతను తాను దేని గురించయితే యింటిని విడిచిపెట్టి, గృహస్థాశ్రమం కాని జీవితాన్ని ఎంచుకుంటాడో, ఆ 'సమానుని' స్థాయి ఆశయాన్ని సాధిస్తాడు. దాన్ని సాధించిన తను, తన శిష్యులకు సిద్ధాంతాన్ని బోధిస్తాడు యిలా: "ఇది నీకు మంచిది.

దీనివల్ల నీకు ఆనందం కలుగుతుంది" అంటూ. కానీ ఆ శిష్యులు అతను చెప్పింది వినరు. అతను చెప్పేదానికి చెవులొగ్గరు. (ఏ కాస్తో విన్నా) ఆ విన్నదాన్నుంచి ఏర్పడ్డ అవగాహనతో వారి హృదయాల్లో స్థిరమయిన అభిప్రాయం ఏర్పడదు. గురువు చెప్పిన తోవను కాకుండా, వారు తమ తోవను తాము తొక్కుతారు.

19. ఈ వాస్తవాల్ని ఎత్తిచూపిస్తూ, అటువంటి గురువును యిలా మందలించాలి. "నీవెలాంటి వాడివంటే, పాత బంధాల్ని పూర్తిగా తెంచేసుకొని, కొత్త బంధంలో చిక్కుకునే వాడివి. నీ ధోరణి అలాగే ఉంది. (నువ్వు బోధించటానికి పూర్తిగా శిక్షణ పొందకుండానే నువ్వు బోధిస్తూపోతున్నావు.) అయితే ఎందుకోసం, ఒక మనిషి మరో మనిషి కోసం చేస్తాడు?

"లోహిక్కా! ఈ ప్రపంచంలో నిందించతగ్గ మూడో కోవకి చెందిన గురువు ఇతను. అతణ్ని ఎవరు మందలించినా, అవి వాస్తవాల మీద, సత్యం మీద ఆధారపడి మాత్రమే ఉండాలి. అసంగతంగా మాత్రం వుండరాదు."

20. "అతను (తథాగతుడు) ఎప్పుడైతే అలా మాట్లాడాతో ఆ లోహిక్క బ్రాహ్మణుడు ఆ మహాత్మునితో ఇలా అన్నాడు: "గౌతమా! అలా అయితే ఈ ప్రపంచంలో నిందకు గురికాని గురువు ఎవరైనా ఉన్నాడా?"

"లేకేం, వున్నాడు. లోహిక్కా! ఈ ప్రపంచంలో నిందకు గురికాని గురువున్నాడు."

"అయితే గౌతమా! అతనెలాంటి గురువు?"

('సమన్న–ఫాల'లో పొందుపరచిన విధంగా వివరణ సమాధానం ఈ క్రింది విధంగా వుంది.)

1. తథాగతుని (సత్యం జయించినవాని) ఆవిర్భావం, బోధనలు, శిష్యునితో ఆయన సంవాదం, గృహస్థాశ్రమం కాని స్థితిని ఆయన వరించడం.

2. తాను ఆచరిస్తున్న శుద్ధ నైతిక ప్రవర్తన యొక్క చిన్నచిన్న వివరాలు.

3. తన ఆచరణ నుంచి హృదయంలో ఏర్పడ్డ ఆత్మ విశ్వాసం.

4. తన ఇంద్రియాల ద్వారాలను కాపలా కాయటానికి సంబంధించిన పేరాగ్రాఫ్.

5. 'జాగరూకత–ఆత్మ నిగ్రహం' జాగరూకత గురించిన పేరాగ్రాఫ్.

6. నిరాడంబర జీవిత విధానం, ఉన్నదానితోనే సంతృప్తి చెందడం గురించిన పేరాగ్రాఫ్.

7. విముక్తి, సులభంగా వచ్చే కోపం, సోమరితనం, ఆందోళన, విభ్రాంతి–వీటిని గురించిన పేరాగ్రాఫ్‌లు.

8. విముక్తి ఫలితంగా శరీరమంతటా అలముకొన్న ఉల్లాసం, ప్రశాంతతను గురించిన పేరాగ్రాఫ్‌లు.

9. చతుర్విధ ఘనాలకు సంబంధించిన పేరాగ్రాఫ్‌లు.

10. జ్ఞానం వల్ల కలిగే అంతర్దృష్టి. (ప్రథమ మార్గం గురించిన జ్ఞానం) గురించిన పేరాగ్రాఫ్‌లు.

11. నాలుగు ఉదాత్త సత్యాల గ్రహింపు–కామం, భ్రమలు, ఆడంబరాలు, అజ్ఞానం–యీ మత్తుల వశింపు, అర్హత సిద్ధి–వీటికి సంబంధించిన పేరాగ్రాఫ్‌లు.

ముక్తాయింపుగా చివరి పేరా:

"గురువు ఎవరైనా లోహిక్కా! అతని క్రింద శిష్యుడు పై విధంగా విలక్షణతను సాధించడం–ప్రపంచంలో గురువుగా నిందకు ఆస్కారం లేనివాడవుతాడు. లోహిక్కా! అలాంటి వ్యక్తిని ఎవరు నిందించినా ఆ నింద అనౌచిత్యంతో కూడుకొన్నదవుతుంది. అది వాస్తవాల మీద సత్యం మీద ఆధారపడి వుండదు."

78. ఆయన యిలా చెప్పిన తర్వాత బ్రాహ్మణుడయిన లోహిక్కుడు గౌతమునితో ఇలా అన్నాడు:

"గౌతమా! ఒక మనిషి పాపమోచన లోకపు అపాయకరమైన నిట్టాయి అంచుమీద పడబోతుంటే, అతని జుట్టుని అందిపుచ్చుకొని, పట్టితెచ్చి, గట్టి నేల మీద జాగ్రత్తగా వుంచినట్లుగా పాపమోచన లోకంలో పడబోతున్న నన్ను ఎత్తి తెచ్చి నేలమీద నిలబెట్టావు! అత్యద్భుతాలు, గౌతమా! మీ నోటి నుంచి వెలువడ్డ మాటలు అత్యద్భుతాలు. ఏ విధంగా అయితే నేల మీద పడేసిన వాటిని తెచ్చి, నిలబెడతారో. దాచేసిన దాన్ని ఎలాగయితే వెలుగులోకి తెస్తారో, దారితప్పిన వారికి సరైన తోవ ఎలా చూపిస్తారో, చీకటి మూగినచోట వెలుగు ప్రసరింపచేస్తే బాహ్య వస్తువులను చూడ్డం ఎలా సాధ్యమవుతుందో, అదేవిధంగా పూజ్యగౌతముని ద్వారా సత్యం నాకు అనేక రూపాల్లో దర్శనం ఇచ్చింది. నేను... నేను కూడా పూజ్య గౌతముణ్ణి,

నన్ను తమ శిష్యునిగా స్వీకరించమని కోరుతున్నాను. నేటి నుంచి నేను నాలో ప్రాణం వున్నంతవరకు ఆయన్ని నా గురువుగానే ఎంచుకొంటాను."

అనువాదం: నిర్మలానంద, డా. పి.ఆపదరావు

## :అథస్సూచికలు:

1. మహాభారతం. అరణ్యపర్వం.
2. -అదే- సభాపర్వం.
3. మహాభారతం.
4. మహాభారతం. విరాట పర్వం. అధ్యా. 15. శ్లో 10.
5. మత్తు కలిగించే సురను తాగడం బ్రాహ్మణ స్త్రీలలో,(ఇమ్ము వర్ణాల స్త్రీల సంగతి చెప్పనక్కరలేదు) మధ్య ఆర్యావర్తంలో క్రీ.శ. ఏడెనిమిది శతాబ్దాల దాకా ఉన్నట్టు కుమారుభట్టు 'తంత్ర వార్తికం' I (iii) వల్ల స్పష్టమవుతోంది. "నేటి కాలపు మనుషులలో అహిచ్ఛత్ర, మధుర దేశాల బ్రాహ్మణ స్త్రీలు సురాపానానికి అలవాటుపడిపోయారు." అని అందులో వుంది. కుమారిలభట్టు ధాన్యాల నుంచి తీసిన 'సుర'ను కాక, [illegible]ల నుంచి తీసిన మాధవ, మొలాసిస్ నుంచి తీసిన '[illegible]డి' పానీయం విషయంలో బ్రాహ్మణ స్త్రీలను మాత్రమే తప్పపట్టాడు. క్షత్రియ, వైశ్య స్త్రీలను తప్పపట్టలేదు.
6. మహాభారతం. ఆదిపర్వం. అధ్యా. 66.
7. ఋగ్వేదం
8. హరివంశం. అధ్యా. 2.
9. అదే. అధ్యా. 10.
10. అదే. అధ్యా. 27.
11. యాస్క. నిరుక్త. అధ్యా. 5. కాండ. 6.
12. హరివంశం. అధ్యా. 2.
13. అదే
14. అదే
15. మహాభారతం, ఆదిపర్వం. అధ్యా. 193.
16. అదే. ఉద్యోగపర్వం. అధ్యా. 106-123.
17. మహాభారతం. అధ్యాయం 1-118.
18. -అదే- అధ్యాయం. 66.
19. 'రెలిజియన్స్ ఆఫ్ ఇండియా' అనే హాప్కిన్స్ గ్రంథం నుంచి గ్రహించడం జరిగింది.
20. సుత్త నిపాత.
21. ప్రాట్ - బుద్ధిజమ్. పే. 49.

# అధ్యాయం – 9

# బౌద్ధమత క్షీణత! పతనం!!

["విప్లవం–ప్రతి విప్లవం" అన్న విమర్శనాత్మక రచనలో భాగంగా "బౌద్ధమతం క్షీణత–పతనం"ను డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రాశారు. మా దగ్గరున్న కాగితాలలో ఈ భాగానికి చెందినవి అయిదు పేజీలు మాత్రమే కనిపించాయి. అవి కూడా పరిచూపినవి కాదు. ఈ వ్యాసాన్ని మేం శ్రీ ఎస్.ఎస్.రేజ్ నుంచి అందుకున్నాం. దానిలో డాక్టర్ అంబేద్కర్ దస్తూరితో చేసిన సవరణలున్నాయి. ఆ పద్దెనిమిది పేజీల టైప్ చేసిన వ్యాసాన్ని ఇక్కడ అందిస్తున్నాం –సంపాదకులు]

బౌద్ధమతం భారతదేశం నుంచి అదృశ్యం కావడం ఎందరినో ఆశ్చర్యపరచినా, అది అంతుబట్టని విషయంగానే మిగిలిపోయింది. దీన్ని గురించి అనుక్షణం ఆలోచించే వాళ్ళకయితే ఇది విచారాన్ని మిగిలించే విషయమే. బౌద్ధమతం భారతదేశం నుంచి అదృశ్యం కావడం ఈ విషయంపై ఆసక్తి ఉన్న వారందరికీ అత్యాశ్చర్యకరమైన విషయమే కాదు, విచారకరం కూడా. కానీ, చైనా, బర్మా, జపాన్, సయాం, సిలోన్, ఇండోచైనా వంటి దేశాల్లో బౌద్ధం దేదీప్యమానంగా వెలుగొందుతోంది. ఒక్క భారతదేశంలో మాత్రమే అది అంతరించిపోయింది. బౌద్ధమతం మన దేశం నుంచి నామరూపాలు లేకుండాపోవడమే కాదు. చాలామంది హిందువులు బుద్ధుడి పేరే మరచిపోయినట్లు అనిపిస్తోంది. అదెలా సంభవమైంది? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. సంతృప్తి కరమైన సమాధానం లేకపోవడమే కాదు, అందుకోసం ఎవరూ ప్రయత్నం కూడా చేయలేదు. ఈ విషయంలో ఒక ముఖ్యమైన తేడాను గుర్తించడంలో విఫలమవుతుంటారు. అదేమిటంటే బౌద్ధమత క్షీణతకూ, పతనానికీ ఉన్న తేడా. ఈ భేదాన్ని గుర్తించడం ఎందువల్ల అవసరమంటే, బౌద్ధమత పతనం కారణాలు వేరు. దాని క్షీణతకు కారణాలు వేరు. పతనం సంభవించడానికీ చాలా స్పష్టమైన కారణాలున్నాయి కానీ, క్షీణతకు మాత్రం అంత ఖచ్చితమైన కారణాలు లేవు.

ముసల్మానుల ముట్టడితో బౌద్ధమతం నశించడం ఆరంభించిందనటంలో ఎలాంటి సందేహం లేదు. 'బట్' (But)కు శత్రువుగా ఇస్లామ్ అవతరించింది. 'బట్' అనే అరబ్ పదానికి అర్థం 'విగ్రహం' అని. 'బట్' పదం మూలమేమిటో చాలామందికి తెలియదు కానీ, అది నిజానికి బుద్ధునికి అరబిక్ అపభ్రంశరూపం. ఆ పదం వ్యుత్పత్తి సూచిస్తున్నదేమిటంటే ముసల్మానుల దృష్టిలో విగ్రహారాధన అంటే బౌద్ధమతమే. ఆ రెండూ ఒకటే. అందువల్ల వారి విగ్రహ విధ్వంసనం బౌద్ధమత విధ్వంసనంగా పరిణమించింది. బౌద్ధమతాన్ని ఇస్లామ్ భారతదేశంలోనే కాదు. అసలెక్కడ వుంటే అక్కడ నాశనం చేసింది. ఇస్లామ్ అవతరణకు ముందు బౌద్ధం బాక్ట్రియా, పార్థియా, ఆఫ్ఘనిస్తాన్, గాంధార, చైనీయ, తుర్కిస్తాన్‌లోనూ, దాదాపు ఆసియా అంతటా విస్తరించి వుండేది! ఈ దేశాలన్నిటా ఇస్లామ్ బౌద్ధాన్ని నాశనం చేసింది.

స్మిత్ అనే పరిశోధకుడు[2] చెప్పినట్టు "ముసల్మాను దురాక్రమణదారులు అనేకచోట్ల సాగించిన తీవ్రమైన మారణకాండ సాంప్రదాయ హైందవ విపక్షను మించినటువంటిది. అంతేకాదు, అది (భారతదేశంలోని) అనేక ప్రాంతాల్లో బౌద్ధం అదృశ్యం కావడానికి ప్రధాన కారణం." అయితే ఈ వాక్యాల్ని అందరూ విశ్వసించలేరేమో! ఎందుకంటే ఈ వివరణ సమగ్రంగా లేదు. బౌద్ధమతంతో పాటు బ్రాహ్మణ మతంపై మీద కూడా ముసల్మానులు దాడి జరిపారు. అలాంటప్పుడు బౌద్ధం మాత్రం అంతరించి బ్రాహ్మణ మతం ఎలా బతికి బట్టగట్టింది? ఈ వాదన బాగానే వున్నా పై సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేయలేదు. బ్రాహ్మణమతం బతికి బట్టకట్టిందని అంగీకరించినంత మాత్రాన, బౌద్ధం పతనానికి ఇస్లామ్ ఖడ్గం కారణం కాదన్నట్టు కాదు. అంటే, ఇస్లామ్ దాడిని బ్రాహ్మణమతం తట్టుకోవడానికీ, బౌద్ధం తట్టుకోలేకపోవడానికీ కారణమైన కొన్ని పరిస్థితులున్నాయని అర్థం. బ్రాహ్మణ మతం విషయంలో అదృష్టవశాత్తు, బౌద్ధం విషయంలో దురదృష్టవశాత్తూ అదే వాస్తవం.

ముస్లింల దురాక్రమణ దాడుల ముందు బ్రాహ్మణ మతం నిలదొక్కుకోవడానికి, బౌద్ధ మతం బలి కావడానికి అనుకూలమైన ప్రత్యేక పరిస్థితులు నిశితంగా పరిశీలిస్తే మూడు ప్రధానాంశాలు ప్రస్ఫుటంగా మనకు కన్పిస్తాయి. ముస్లింల దురాక్రమణలు, దాడులు జరిగిన కాలంలో బ్రాహ్మణ మతానికి రాజ్య మద్దతు ఎక్కువగా ఉండేది. బౌద్ధమతానికి ఆ సౌకర్యం లేకుండాపోయింది. మరింత ముఖ్యమైన వాస్తవమేమిటంటే, విగ్రహారాధన నిర్మూలన మతంగా ప్రారంభమైన ఇస్లామ్‌లో ఆ వేడి తగ్గి శాంతించేదాకా బ్రాహ్మణమతానికి రాజ్యమద్దతు కొనసాగుతూ వచ్చింది. రెండవది ఇస్లామ్ ఖడ్గం ముందు బౌద్ధ గురువులు నిలబడలేక పోయారు. బ్రాహ్మణ మతం విషయంలో మత పెద్దలను ఇస్లామ్ నిర్మూలించలేకపోయింది. మూడోది–భారతదేశంలోని బ్రాహ్మణవాద పాలకుల వేధింపులకు తట్టుకోలేక సామాన్య బౌద్ధ మతావలంబకులంతా బౌద్ధాన్ని వదిలి ఇస్లామ్‌ను ఆశ్రయించారు.

పైన చెప్పిన అన్ని పరిస్థితులకూ చరిత్రలో ఆధారాలున్నాయి. ముస్లిముల అధీనంలోకి వచ్చిన మొదటి భారతీయ ప్రాంతం సింధ్. దానికో శూద్రరాజు ఉండేవాడు. కానీ ఓ బ్రాహ్మణుడు అతనిని గద్దె దింపి తన ఏలుబడిలోకి తీసుకున్నాడు. సహజంగానే అతని పాలన బ్రాహ్మణ మతాన్ని బలపరిచింది. ఇబ్నె కాసిమ్ క్రీస్తుశకం 712లో సింధ్‌ను ఆక్రమించుకున్నప్పుడు అక్కడి రాజు దాహిర్. అతను బ్రాహ్మణ వంశ పాలకుడు.

తాను చూసినప్పుడు పంజాబ్‌ను ఓ క్షత్రియ బౌద్ధ రాజవంశం పాలిస్తోందని హువాన్ త్సాంగ్ రాశాడు. క్రీస్తుశకం 880 వరకు పంజాబ్‌ను ఆ వంశమే పాలించింది. ఆ ఏడాదే 'లల్లియ' అనే బ్రాహ్మణ సేనాపతి గద్దెను చేజిక్కించుకుని బ్రాహ్మణ షాహి పాలనను ప్రారంభించాడు. 880 నుంచి 1021 వరకు ఆ వంశమే పాలించింది. సబుక్తగిన్, మొహమ్మద్‌లతో ఆరంభమైన ముసల్మానుల పంజాబు దండయాత్రల కాలంలో స్థానిక పాలకులు బ్రాహ్మణ మతానికి చెందిన జయపాలుడు (960–980), ఆనందపాలుడు (980–1000), త్రిలోచనపాలుడు

(1000–1021).

ఇక మధ్య భారతంలో మహ్మద్‌తో ప్రారంభమయిన దురాక్రమణల పర్వం షాబుద్దీన్ ఘోరీ దాకా కొనసాగింది. అప్పట్లో మధ్యభారతం వివిధ సామ్రాజ్యాలుగా విడిపోయి వుంది. గులోహితులు మేవాడ్‌ని పాలిస్తే (ఇప్పటి ఉదయపూర్) సంబార్ ప్రాంతాన్ని (ఇప్పుడు బుంది, కోట, సిరోహిగా విడివడి వుంది). చౌహానులు; కనోజ్‌ని ప్రతిహార్లు[3], ధార్‌ని పర్మార్లు, చేదిని కలచూరీలు, అన్విల్‌వాడ్‌ను చౌడులు, బుందేల్ ఖండ్‌ను చెందెల్లాలు పరిపాలించారు. ఇప్పుడు ఈ ప్రాంతాలన్నీ రాజపుత్రుల ఆధీనంలోకి వచ్చాయి. అయితే బ్రాహ్మణీకానికి వత్తాసుపలికే శక్తిగా ఆతర్వాత రాజపుత్రులు ఎలా రూపొందగలిగారో అనే అంశం అంతుబట్టని విషయం. అది తర్వాత చర్చిస్తాను.

దురాక్రమణల కాలంలోనే బెంగాల్ తూర్పు, పశ్చిమ రాజ్యాలుగా రెండు సామ్రాజ్యాలుగా చీలిపోయింది. పశ్చిమ బెంగాల్‌ను పాలరాజ వంశం వారు, తూర్పు బెంగాల్‌ను సేన వంశం వారు పాలించేవారు.

పాలులు క్షత్రియులు. వారు బౌద్ధులు. కానీ, వైద్య[4] చెప్పినట్లు 'వారి బౌద్ధం ఆరంభ దశకే పరిమితమో లేదా నామమాత్రమో'. సేన రాజుల విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. వారు క్షత్రియుల సైనిక వృత్తిని స్వీకరించిన బ్రాహ్మణులని డాక్టర్ భండార్కర్ అంటారు. వైద్య వారు ఆర్య క్షత్రియులో చంద్ర వంశానికి చెందిన రాజపుత్రులో అంటారు. ఏది ఏమయినా రాజపుత్రులవలెనే సేన రాజులు కూడా సాంప్రదాయ మతానికి గట్టి సమర్థకులు.[5]

"దక్షిణాదిన నర్మదా ప్రాంతం ముస్లిముల ఆక్రమణకారులలో అప్పట్లో నాలుగు సామ్రాజ్యాల కింద పాలించబడేది. 1. ముస్లిముల ఆక్రమణ కాలంలో 2. పశ్చిమ చాళుక్యుల చేత, అలాగే 3. పశ్చిమ తీరంలో కొంకణి ప్రాంతంలోని సిలాహార సామ్రాజ్యం 4. తూర్పు తీరంలోని త్రికళింగుల గాంగ సామ్రాజ్యం. ఇవన్నీ ముస్లింల ఆక్రమణ కాలమైన క్రీ.శ. 1000–1200 కాలంలోనే వృద్ధి చెందాయి. అయితే వీటి కింద ఉన్న కొన్ని సామంత రాజ్యాలు 12వ శతాబ్దంనాటికి ఎదిగి 13వ శతాబ్దానికల్లా విముక్తి పొంది, సర్వ స్వతంత్రాలయ్యాయి. అవి. 1. యాదవులు పాలించిన దేవగిరి. 2. కాకతీయుల ఓరుగల్లు. 3. హోయసలుల హళేబీడు. 4. పాండ్యుల మధుర. 5. చేరుల తిరువనంతపురం.

పైన చెప్పిన వంశీయులందరు సనాతన బ్రాహ్మణీకాన్ని అనుసరించిన వాళ్ళే.

భారతదేశంపై ముస్లిముల ఆక్రమణలు క్రీస్తుశకం 1001లో ప్రారంభమయ్యాయి. ఈ ఆక్రమణల ఆఖరి విడత క్రీస్తుశకం 1296లో అల్లావుద్దీన్ ఖిల్జీ దేవగిరిని ఆక్రమించడంతో దక్షిణా

దికి చేరుకుంది. నిజానికి ముస్లిమ్ ఆక్రమణల పర్వం 1296లో ముగిసిపోలేదు. ఓడిపోయినా కూడా తలెత్తుతున్న స్థానిక పాలకులతో ముస్లిము ఆక్రమణదారుల యుద్ధాలు కొనసాగుతూనే వచ్చాయి. ఇక్కడ గుర్తుపెట్టుకోవలసిన అంశం ఏమిటంటే, ముస్లిం ఆక్రమణ యుద్ధాలు సాగిన మూడు వందల సంవత్సరాలూ భారతదేశమంతా సాంప్రదాయ బ్రాహ్మణ మతావలంబకులైన రాజులే పాలించారు. ముస్లిమ్ ఆక్రమణదారుల చేతిలో దెబ్బమీద దెబ్బతిన్న బ్రాహ్మణ మతం స్థానిక పాలకుల మద్దతు కోసం ప్రయత్నించి పొందగలిగింది. ముస్లిం ఆక్రమణదారుల చేతిలో అటువంటి దాడికే గురయిన బౌద్ధానికి మాత్రం ఏ ఆశా లేదు. బౌద్ధానిది అరణ్య రోదనే అయింది. స్థానిక పాలకుల పరోక్ష విధ్వంసంలోనూ, ముస్లిం పాలకుల ప్రత్యక్ష ధ్వంసంలోనూ అది నామరూపాలు లేకుండా పోయింది. నలంద, విక్రమశిల, జగద్దల, వదంతపురి వంటి బౌద్ధ విశ్వ విద్యాలయాలను సైతం ముసల్మానులు విడిచిపెట్టలేదు. దేశమంతా విస్తరించి వున్న బౌద్ధ ఆరామాలను కూడా ముస్లింలు నేలమట్టం గావించడంతో–బౌద్ధ భిక్షువులు వలసపోవటం మొదలయింది. పొరుగు దేశాలయిన నేపాల్, టిబెట్‌లకు వేల సంఖ్యలో బౌద్ధ భిక్షువులు తరలివెళ్ళారు. ఈ క్రమంలోనే ఎందరో భిక్షువులు ముస్లిం సేనానుల కిరాతకాలకు బలయ్యారు. బౌద్ధ భిక్షుగణాన్ని ముస్లిం ఆక్రమణదారులు ఎలా అంతమొందించిందీ పూసగుచ్చినట్లు ముస్లిం అధికారులే గ్రంథస్థం చేసారు. క్రీ.శ. 1197 కాలంలో జరిగిన బీహార్ దురాక్రమణలో ముసల్మాన్ జనరల్ ఒకడు బౌద్ధ భిక్షువుల్ని ఎలా ఊచకోత కోశాడో వివరిస్తూ విన్సెంట్ స్మిత్ ఇలా వివరించాడు–6

"అనేక పర్యాయాలు బీహార్‌పై బందిపోటు దాడులు చేసిన ఆ ముసల్మాను సైన్యాధికారి హఠాత్తుగా రాజధానిని పట్టుకున్నాడు. క్రీస్తుశకం 1243లో జరిగిన ఆ దాడి నుంచి బతికి బయటపడ్డ ఒక వ్యక్తిని దాదాపు సమకాలికుడైన ఓ చరిత్రకారుడు కలుసుకుని వివరాలు సేకరించాడు. బీహారు కోటను పట్టుకున్నది కేవలం 200 మంది ఉన్న అశ్వికుల దళం. వారు వెనుక ద్వారాన్ని ఛేదించుకుని వెళ్ళి కోటను పట్టుకున్నారు. పెద్దఎత్తున లూటీ చేశారు. ముండనం చేయించుకున్న బ్రాహ్మణులను – అంటే బౌద్ధ భిక్షువులను ఊచకోత కోశారు. ఆ మారణకాండ ఏ స్థాయిలో జరిగిందంటే, బౌద్ధారామాల గ్రంథాలయాల్లోని పుస్తకాలలోని అంశాలను వివరించే సమర్థుడు కావాలని విజేత కోరితే, వాటిని చదివి చెప్పగల వారెవరూ మిగలలేదు. ఆ కోట, ఆ నగరం అంతా కలిపి ఓ కళాశాల అట. హిందీలో కళాశాలను విహారమంటారు."

బౌద్ధ భిక్షువులపై ఇస్లామిక్ ఆక్రమణదారులు సాగించిన మారణకాండ ఆ స్థాయిలో జరిగింది. గొడ్డలివేటు వేర్లపైనే పడింది. బౌద్ధ భిక్షుగణాన్ని వధించడం ద్వారా ఇస్లామ్ బౌద్ధాన్నే చంపేసింది. మరే భావజాలంలాగే, మతం కూడా ప్రచారం మీదే బతుకుతుంది. ప్రచారం లేకపోతే మతం విఫలం అవుతుంది. ఎంత ద్వేషించదగింది అయినా పూజారి వర్గం అనేది మత ప్రచారాన్ని కొనసాగించడానికి అవసరం. ఎందుకంటే ప్రచారం ద్వారానే మతం నిలబడుతుంది. పూజారి వర్గం లేకుండా మతం అంతరించిపోతుంది. ఇస్లామిక్ ఖడ్గం

బౌద్ధ మతానికి పూజారి వర్గం అనదగ్గ భిక్షువులపై విరుచుకుపడింది. ఫలితంగా బౌద్ధం నశించిపోయింది లేదా విదేశాలకు వలస వెళ్ళింది. బౌద్ధ జ్యోతిని నిలబెట్టడానికి ఎవరూ మిగలలేదు.

బ్రాహ్మణ పూజారి వర్గం విషయంలో కూడా అదే జరిగి వుండవచ్చు కదా అని అనవచ్చు. ఆ స్థాయిలో మాత్రం కాదు కానీ జరిగే వుండవచ్చు. కానీ బౌద్ధ, బ్రాహ్మణ మతాల నిర్మాణంలో తేడా వుంది. ఆ తేడా ఎంత పెద్దదంటే, ఇస్లామ్ దాడికి బ్రాహ్మణ మతం తట్టుకుని, బౌద్ధం తట్టుకోలేకపోవడానికి ఆ తేడాలోనే మొత్తం కారణం వుంది. ఆ తేడా రెండు మతాల పూజారి వర్గం నిర్మాణంలో ఉంది.

బ్రాహ్మణ మత పూజారి గణ నిర్మాణం చాలా విస్తృతమైనది. దీని గురించిన స్పష్టమైన, సంక్షిప్తమైన వర్ణనను 'ఇండియన్ ఆంటిక్వారీ' అన్న గ్రంథంలో కీర్తిశేషులు శ్రీ రామకృష్ణ భండార్కర్ అందించారు.[7]

"ప్రతి బ్రాహ్మణ కుటుంబమూ ఒక ప్రత్యేక వేదాన్ని, అందులోని ఓ ప్రత్యేక శాఖను అధ్యయనం చేస్తుంది. ఆ వేదానికి అనుబంధంగా ఉన్న సూత్రాలలో చెప్పినట్టు ఆ కుటుంబానికి సంబంధించిన క్రతువులో కర్మలూ నిర్వహించబడతాయి. అధ్యయనం అంటే, ఆ ప్రత్యేక వేదంలోని భాగాలను కంతలూ పట్టడమే. ఉత్తర భారతంలో అధిక వ్యాప్తిలో ఉన్న వేదం శ్వేత యజుర్వేదం. శాఖ మధ్యాందిన. వారణాసిలో తప్ప ఈ అధ్యయనం మిగతాచోట అంతరించిపోయింది. వారణాసిలో బ్రాహ్మణులు దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చి స్థిరపడ్డారు. గుజరాత్‌లో అది కొంత మిగిలి వుంది. అయితే మరాఠా ప్రాంతంలో ఎక్కువే. తెలంగాణాలోని బ్రాహ్మణుల్లో అధికులు ఇంకా ఈ అధ్యయనానికి జీవితాన్ని వెచ్చిస్తుంటారు. వీరిలో చాలా మంది దక్షిణత కోసం దేశంలోని నలుమూలలకూ వెడతారు. ఆయా ప్రాంతాల స్థానికులు కృష్ణయజుర్వేదాన్ని, ఆపస్తంబ శాఖ సూత్రాల్ని వల్లె వేయించుకుని తమ స్తోమతుకు తగ్గట్టు సంభావనలిస్తారు. బొంబాయికి తెలంగాణా బ్రాహ్మణుడు వచ్చి నన్ను దక్షిణ అడక్కుండా వారం కూడా గడవదు. ప్రతిసారీ నేను వారిచేత వల్లె వేయించుకుని, నా దగ్గరున్న అచ్చు ప్రతులలో పరిపోల్చుతుంటాను.

వృత్తిరీత్యా ప్రతి వేద శాఖకీ చెందిన బ్రాహ్మణులు రెండు తరగతులుగా ఉంటారు. గృహస్థులు, భిక్షుకులు. మొదటి రకంవారు లౌకిక వ్యాపకాల్లో వుంటారు. రెండో రకం వారు పవిత్ర గ్రంథాల అధ్యయనానికీ, మతకర్మల ఆచరణకీ సమయం వెచ్చిస్తారు.

పై రెండు రకాల వారూ రోజూ సంధ్యావందనం చేయాలి. ఈ సంధ్యావందనం వేదానికో రకంగా ఉంటుంది. కానీ, 'తత్ సవితుర్ వరేణ్యం' అనే గాయత్రి మంత్రం మాత్రం ఐదుసార్లో, ఇరవై ఎనిమిది సార్లో, నూటా ఎనిమిది సార్లో జపించడం అందరికీ వర్తించేదే.

సంధ్యావందనంలో ప్రధాన భాగం అదే.

'అదికాక, చాలామంది బ్రహ్మయజ్ఞం కూడా రోజూ చేస్తారు. కొన్ని సందర్భాలలో అందరూ దాన్ని చేస్తారు. ఇందుకు రుగ్వేదంలోని ప్రథమ మండలంలోని ప్రథమ రుక్కు, ఐతరేయ బ్రాహ్మణంలోని ప్రారంభ వాక్యాలు, ఐతరేయ అరణ్యకంలోని ఐదు భాగాలు, యజుస్-సంహిత, సామ-సంహిత, అధర్వ సంహిత, ఆశ్వలాయన కల్పసూత్రాలు, నిరుక్తం, ఖండాలు, నిఘంటువు, జ్యోతిష్యం, శిక్ష, పాణిని, యజ్ఞవల్క్యం స్మృతి, మహాభారతం, కనదసూత్రాలు, జైమిని సూత్రాలు, బాదరాయణ సూత్రాలు వల్లించాలి.'

ఇక్కడ గుర్తుంచుకోవలసిన అంశం అధికారికంగా భిక్షుకునికి 8 గృహస్థునికి భేదం లేదు. బ్రాహ్మణ మతంలో ఇద్దరూ పురోహితులే. భిక్షుకునితో సమానంగా గృహస్థునికి కూడా పౌరోహిత్య అర్హత ఉన్నది. ఒక గృహస్థుడు పౌరోహిత్యం స్వీకరించలేదంటే కారణం, అతను మంత్రాలలో పండితుడు కాకపోవడమో, తంతులు తెలియకపోవడమో, మరేదైనా ఆకర్షణీయమైన వృత్తిలో వుండడమో అయి వుంటుంది. బ్రాహ్మణ మత వ్యవస్థలో కులబహిష్కారం పొందని ప్రతి బ్రాహ్మణుడూ పౌరోహిత్యానికి అర్హుడే. భిక్షుకుడు వాస్తవంగా పురోహితుడు. గృహస్థుడు పురోహితుడు కాగలిగిన అర్హుడు. బ్రాహ్మణ పురోహిత గణంలో బ్రాహ్మణులందరూ చేరడానికి అర్హులే. పురోహితునిగా వ్యవహరించడానికి బ్రాహ్మణునికి ప్రత్యేకమైన శిక్షణ గానీ, తంతు గానీ అవసరం లేదు. పూజా పునస్కారాలు జరపగలగడమే చాలు. బ్రాహ్మణ మతంలో పౌరోహిత్యం ఎన్నటికీ అంతరించదు. ప్రతి బ్రాహ్మణుడూ పురోహితుడు కాగలిగినవాడే కాబట్టి, అవసరమైనప్పుడల్లా కొత్తవారు చేరుతుంటారు. దానికి అంతులేదు (There is nothing to stop the rake's life and progress) బౌద్ధమతంలో ఇది సాధ్యపడదు. మతాచార్యునిగా వ్యవహరించాలంటే, ఆ హోదా అంతకుముందే పొందినవారి ద్వారా నిర్ణీత తతంగం జరగవలసి వుంటుంది. బౌద్ధ మతాచార్యుల ఊచకోత తరువాత ఆచార్యత్వ ప్రదానం అసాధ్యం కావడంతో, ఆ మతంలోని మతాచార్య గణం దాదాపు అంతరించిపోయింది. బౌద్ధాచార్యుల స్థానాలను భర్తీ చేయడానికి ప్రయత్నమైతే జరిగింది. ఎక్కడి నుంచి వీలైతే అక్కడి నుంచి వారిని తీసుకోవలసి వచ్చింది. వారు ఖచ్చితంగా తగినవారు కాదు. హరప్రసాద్ శాస్త్రి ప్రకారం.9–

"భిక్షువుల కొరత బౌద్ధ మతాచార్య వర్గం కూర్పులో పెద్ద మార్పు తెచ్చింది. గృహస్థ మతాచార్యులైన ఆర్యలు భిక్షుకుల స్థానం తీసుకుని బౌద్ధుల మతావసరాలను నెరవేర్చసాగారు. కొన్ని తతంగాల ద్వారా వారు భిక్షుకుల ధార్మిక హోదాను పొందగలిగారు. (ఉపోద్ఘాతం 19.7, తటాకార గుప్తుని ఆది కర్మాచరణను ఉటంకిస్తూ : 149, 1207–1208 పేజీలు) వారు ధార్మిక కార్యక్రమాలను నిర్వహిస్తూనే, తాపీ పని, శిల్పం, కంసాలి, వడ్రంగి, పూత పనుల ద్వారా జీవిక సాధించేవారు. ఈ చేతివృత్తుల ధర్మాచార్యులు తరువాత కాలంలో భిక్షువుల సంఖ్యను మించిపోయారు. ప్రజల ధార్మిక మార్గదర్శులయ్యారు. అయితే, వారి జీవన వృత్తుల కారణంగా అధ్యయనానికీ, ధ్యానానికీ, ఇతర ఆధ్యాత్మిక కృషికి సమయం లేకపోయింది. పతనావస్థలో

ఉన్న బౌద్ధాన్నీ ఉద్ధరించడాన్ని గానీ సంస్కరణల ద్వారా పతనాన్ని ఆపడాన్ని గానీ వారి నుంచి ఆశించలేము."

నూతన బౌద్ధ ధర్మాచార్యులు హోదాలో గానీ, అధ్యయనంలో గానీ – కపటంలోనూ, పాండిత్యంలో గానీ సమర్థులైన ప్రత్యర్థి బ్రాహ్మణులతో సరితూగలేకపోయారు.[10]

బ్రాహ్మణ మతం పతనం నుంచి నిలదొక్కుకోవడానికి, బౌద్ధం నిలదొక్కుకోలేకపోవడానికీ బౌద్ధం కంటె బ్రాహ్మణమతంలో స్వభావసిద్ధంగా గొప్పతనం వుండడం కారణం కాదు. వారివారి పౌరోహిత్యగణం ప్రత్యేక స్వభావాలలో ఆ కారణం వుంది. బౌద్ధం తన పౌరోహిత్యగణం మరణించడం వల్ల, దానిని తిరిగి సృష్టించలేకపోవడం వల్ల మరణించింది. బ్రాహ్మణ మతం దెబ్బతిన్నా, చావు దెబ్బ తినలేదు. చనిపోయిన ప్రతి బ్రాహ్మణ పురోహితుని స్థానాన్నీ మరో బ్రాహ్మణుడు పూరించాడు.

బౌద్ధ మతావలంబకులు ఇస్లాంలోకి పరివర్తన చెందడం బౌద్ధం పతనానికి కారణమన్న దానిలో సందేహం ఏమీ లేదు.

అలహాబాద్‌లో 1938లో జరిగిన ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్‌లో మధ్యయుగాల, రాజపుత్ర విభాగంలో అధ్యక్షోపన్యాసం చేస్తూ ప్రొఫెసర్ సురేంద్రనాథ్ సేన్ భారతీయ మధ్యయుగాల చరిత్రకు సంబంధించి అపరిష్కృత సమస్యలను రెండింటిని సరిగ్గా పేర్కొన్నారు. అవి: రాజపుత్రుల మూలం, భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ముస్లిముల ఉనికికి కారణం. ఈ రెంటికీ నేటికీ సంతృప్తికరమైన సమాధానాలు లేవు. రెండో సమస్యను ప్రస్తావిస్తూ ఆయన ఇలా చెప్పారు:

"ఒక సమస్యను చర్చించడానికి నన్ను అనుమతించండి. అదేమీ పూర్తిగా పురావస్తు సంబంధమైన ప్రశ్న కాదు. భారతదేశంలో ముస్లిమ్ జనాభా వివిధ ప్రాంతాలలో ఉండడానికి సరైన వివరణ లభించాల్సి వుంది. ఇస్లాము దురాక్రమణ మార్గంలో పయనించిందని, గెలుచుకున్న రాజ్యాల ప్రజలను బలవంతంగా మతంలో చేర్చుకుందని సాధారణంగా అనుకుంటాము. సరిహద్దు రాష్ట్రంలో, పంజాబ్‌లో ముస్లిముల ఆధిక్యం ఆ అభిప్రాయానికి మద్దతునిస్తున్నాయి. కానీ, ఈ సిద్ధాంతం తూర్పు బెంగాల్‌లో ముస్లిములు అధిక మెజారిటీలో వుండడాన్ని వివరించలేదు. కుషాణుల కాలంలో వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో టర్కిష్ ప్రజలు వుండి వుంటారు, ఆక్రమణదారులతో ఉన్న జాతి సారూప్యం వల్ల వారు సులువుగా ఇస్లామ్‌లోకి పరివర్తన చెందారని అనుకోవచ్చు. కానీ, తూర్పు బెంగాల్‌లోని ముస్లిములకు జాతిపరంగా టర్కిష్‌లతో, ఆఫ్ఘన్‌లతో సారూప్యం లేదు. మరి అక్కడి హిందువుల మత మార్పిడికి మరేవో కారణాలు వుండి వుండాలి."[11]

ఆ కారణాలు ఏమై వుంటాయి? ముస్లిముల దురాక్రమణలలో కనిపించే ఈ కారణాలను ప్రొఫెసర్ సేన్ స్పష్టంగా చూపించారు. నూటి సాక్ష్యం అనదగ్గ సింద్ ఉదాహరణను ఆయన ఇలా వివరించాడు:[12]

"చచ్‌నాముని ప్రకారం సింద్‌లోని బౌద్ధులు బ్రాహ్మణ పాలకుల చేతిలో అన్నిరకాల అవమానాలను చవిచూశారు. అరబ్బులు వారి దేశంపై దాడికి దిగినప్పుడు బౌద్ధులు వారికి మనస్ఫూర్తిగా మద్దతు ఇచ్చారు. దాహిర్ హతుడై, అక్కడ ముస్లిం ప్రభుత్వం ఏర్పడ్డ తరువాత బౌద్ధులకు నిరాశే ఎదురైంది. బౌద్ధుల విషయంలో అరబ్బులు యుద్ధ పూర్వ స్థితిని పునరుద్ధరించడానికి మాత్రమే స్థిరపడ్డారు. హిందువులకు మాత్రం ప్రాధాన్యస్థాయి కల్పించారు. ఈ స్థితిలో బౌద్ధులకు ఇస్లామ్‌ను స్వీకరించడం తప్ప గత్యంతరం లేకపోయింది. ఎందుకంటే మత మార్పిడి చేసుకున్నవారు పాలకులతో సమాన సౌకర్యాలకు అర్హులు. కాబట్టి సింద్ బౌద్ధులు పెద్ద సంఖ్యలో ఇస్లామ్‌లోకి వెళ్ళారు."

ప్రొఫెసర్ సేన్ చెప్పిన ఈ ముఖ్యమైన వివరాలు చూడండి:

"ముస్లిములు ఇప్పుడు అధికంగా నివసించే పంజాబ్, కాశ్మీర్, బీహార్ షరీఫ్ పరిసరాలు, వాయవ్య బెంగాల్ అన్నీ కూడా ముస్లిముల రాకపూర్వం బౌద్ధ మత కేంద్రాలు కావడం యాదృచ్ఛికం కానేరదు. రాజకీయ లాభానికి బౌద్ధులు హిందువులకంటె సులువుగా లొంగిపోయారనడం న్యాయంకాదు. రాజకీయ హోదా మెరుగుపరుచుకొనే అవకాశాల కోసమే మత మార్పిడి చేసుకున్నారనడమూ సరికాదు."

భారతదేశంలోని బౌద్ధులు బౌద్ధాన్ని త్యజించి ఇస్లామ్‌ను స్వీకరించడానికి దారితీసిన కారణాలపై దురదృష్టవశాత్తూ పరిశోధన జరగలేదు. కాబట్టి, ఆ మత మార్పిడులకు బ్రాహ్మణ రాజుల వేధింపు ఎంత వరకు కారణమో చెప్పలేము. అయితే అదే ప్రధాన కారణమనడానికి సూచనలు లేకపోలేదు. బౌద్ధులను వేధింపులకు గురిచేసిన ఇద్దరు రాజుల గురించి మనకు ఆధారాలున్నాయి.

మొదట చెప్పవలసింది మిహిరకులుని గురించి. అతను హూణుడు. హూణులు క్రీస్తు శకం 455లో భారతదేశంపై దండెత్తి వచ్చి, పంజాబ్‌లో నేడు సియాల్‌కోట్‌గా పిలుస్తున్న సాకలను రాజధానిగా రాజ్యం ఏర్పరుచుకున్నారు. మిహిరకోలుదు క్రీస్తుశకం 528 ప్రాంతాల్లో రాజ్యం చేశాడు. విన్సెంట్ స్మిత్ చెప్పినట్టు:[13]

"మిహిరకులుడు రక్తపిపాసి అయిన నియంత అని అందరూ అంగీకరిస్తారు. 'భారతదేశవు అత్తిల' అయిన మిహిరకులుడు హూణ స్వభావంగా చరిత్రకారులు చెప్పిన క్రూరత్వంతో మితిమీరి వ్యవహరించాడు."

మిహిరకులుడు, స్మిత్ భాషలో[14]: "శాంతియుత బౌద్ధ జనగణంపై తీవ్ర శత్రుత్వాన్ని చూపి, స్థూపాలను విహారాలను కూలదసి దోచుకున్నాడు."

రెండవవాడు తూర్పు భారతీయ రాజైన శశాంకుడు. ఏడో శతాబ్దం ప్రథమ దశాబ్దంలో పాలించిన ఈ రాజు హర్షునితో యుద్ధంలో ఓడిపోయాడు. విన్సెంట్ స్మిత్ మాటల్లో[15]: "హర్షుని సోదరుని ఘాతకు హంతకుడైన శశాంకుడు బహుశా గుప్త వంశీకుడు. అవాంఛకుడైన అతడు బౌద్ధాన్ని ద్వేషించి దాన్ని రూపుమాపడానికి శాయశక్తులా ప్రయత్నించాడు. అశోకుడు భక్తిశ్రద్ధలతో పోషించిన బుద్ధ గయలోని బోధి వృక్షాన్ని పెరికివేసి తగులబెట్టించాడు. పాటలీపుత్రంలో బుద్ధుని పాదముద్రల శిలను పగులగొట్టాడు. విహారాలను ధ్వంసం చేశాడు. భిక్షువులను తరిమివేశాడు. నేపాలీ పర్వతాల దాకా ఈ హింసాకాండను కొనసాగించాడు."

ఏడో శతాబ్దం భారతదేశంలో మత వేధింపుల శతాబ్దంలాగా తోస్తుంది. స్మిత్ చెప్పినట్టు:[16]

"ఏడో శతాబ్దంలో దక్షిణ భారతదేశంలో సోదర మతమైన జైనంపై భయానకమైన దాడులు జరిగాయి."

ముస్లిం ఆక్రమణ కాలానికి సమీపంగా వస్తే; వేధింపులే మత మార్పిడులకు కారణమని సింద్ సంఘటన నిస్సందేహంగా చెబుతుంది. ఈ వేధింపులు ముస్లింల ఆక్రమణల వరకు కొనసాగాయి. నాడు ఉత్తరాది రాజులంతా బౌద్ధ వ్యతిరేకులైన బ్రాహ్మణులో, రాజపుత్రులో కావడం కారణం కావచ్చు. 12వ శతాబ్దంలో కూడా జైనులపై దాడులు జరిగాయనడానికి తగిన చరిత్రకాధారాలున్నాయి. 1174-76 ప్రాంతంలో రాజ్యానికి వచ్చిన గుజరాత్ శైవ రాజు అజయ దేవుడు జైనులపై నిర్దాక్షిణ్యమైన అణచివేత సాగించి, వారి నాయకుడిని హింసించి చంపాడని స్మిత్ పేర్కొన్నాడు. "తీవ్ర అణచివేతకు సంబంధించి అనేక ఇతర సుప్రసిద్ధ ఉదాహరణలు కూడా చెప్పవచ్చు" అని ఆయన అన్నాడు.

కాబట్టి బ్రాహ్మణ మత నిరంకుశత్వాన్నించి తప్పించుకోవడానికి మార్గంగా బౌద్ధులు ఇస్లామ్‌ను ఆశ్రయించడం వల్లనే బౌద్ధం పతనమైందన్న నిర్ధారణకు విప్రతిపత్తి ఏదీ లేదు. చూపిన సాక్ష్యాలు నిర్ధారణను బలపరచకపోయినా, కనీసం ఆ నిర్ధారణకు సంభావ్యతను కలిగిస్తాయి. బౌద్ధమత పతనం అనర్థమే అయితే, అది బ్రాహ్మణమతం జబ్బలు చరుచుకోవలసిన అనర్థమే.

అనువాదం: బాబివర్ధన్

## :అథస్సూచికలు:

1. ఆధునిక పరిశోధకులు యూరప్‌లో బౌద్ధం వ్యాపించిందనీ; బ్రిటన్‌లో 'కెల్'లు ఒకప్పుడు బౌద్ధులనీ ఆధునిక పరిశోధకులు అంటున్నారు.

చూ. "బుద్ధిజమ్ ఇన్ ప్రి-క్రిస్టియన్ బ్రిటన్"-డోనాల్డ్ ఎ.మెకంజీ.

2. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా. (1924). పుటలు (?)

3. కనోజ్ ఏమీ మిగల్లేదు. పృథ్వీరాజు సాహసోపేతంగా ఎదుర్కొన్నా మహమ్మద్ దాన్ని పూర్తిగా ధ్వంసం చేశాడు.

4. హిస్టరీ ఆఫ్ మిడీవల్ ఇండియా. వాల్యూ. II పే. 42.

5. హిస్టరీ ఆఫ్ మిడీవల్ ఇండియా. వాల్యూ. III అధ్యా. 10.

6. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా. (1924). పే. 419-420.

7. ఇండియన్ ఆంటిక్వరి. 1874. పే. 132. మాక్స్ ముల్లర్ చేత ఉటంకించబడింది. 'హిబ్బర్ట్ లెక్చర్స్' (1878) పే. 162-164.

8. (బ్రాహ్మణులలోని) భిక్షుకులు తిరిగి ఉపశాఖలుగా విభజింపబడ్డారు. (1) వైదికులు (2) యాజ్ఞికులు (3) శ్రోత్రియులు. (4) అగ్నిహోత్రులు. వైదికులు అంటే దొల్పి వల్లెవేసి, తప్పల్లే కుండా అప్పగించగలిగినవారు. యాజ్ఞికులు గొప్పగొప్ప క్రతువుల్ని నిర్వహించటంలో నిపుణులు. శ్రోత్రియులు త్రేతాగ్నుల్ని ఆరాధించేవారు. పక్షానికొక పర్యాయం 'ఇష్టి' క్రతువుల్ని నిర్వహించే వారు, అలాగే నాలుగు మాసాలకొకసారి చతుర్మాస్య వ్రతాన్ని నిర్వహించేవాళ్ళు అగ్నిహోత్రులు.

9. నరేంద్రనాథ్‌లా అభిప్రాయాల సారాంశం ఇది. చూ. హరప్రసాద్ శాస్త్రి మెమోరియల్ వాల్యూమ్. పే. 363-64.

10. బౌద్ధ సన్యాసులు ఆరామాల్ని వదిలిపెట్టగూడదు. మత ప్రచారానికే పూర్తిగా అంకితం కావాలి. దానికి కారణం హరిప్రసాద్ శాస్త్రి పేర్కొన్నట్లుగా ఇది "బౌద్ధుల సంఖ్య తగ్గిపోవటం వల్ల బౌద్ధ సన్యాసులు భిక్షను పొందటం ఎంతో కష్టమయింది. ఒక భిక్షువు-ముగ్గురు గృహస్థుల నుంచి మాత్రమే భిక్ష స్వీకరించవచ్చు. అదీ నెలలో ఒక ఇంటి నుంచి ఒక పర్యాయం మాత్రమే. అంటే ఒక బౌద్ధ సన్యాసి జీవితం సాగిపోవాలంటే తొంభై మంది గృహస్థులు కనీసం ఉండాలన్న మాట."-చూ. హరప్రసాద్ శాస్త్రి మెమోరియల్. వాల్యూమ్. పే. 362.

11. ఎర్లీ కెరీర్ ఆఫ్ కనోజి ఆన్‌గ్రియా అండ్ అదర్ పేపర్స్. పే. 188-189

12. ఎర్లీ కెరీర్ ఆఫ్ కనోజి ఆన్‌గ్రియా అండ్ అదర్ పేపర్స్. పు. 188-189.

13. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా. (1924). పే. 336

14. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా. (1924). పే. 337

15. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా. (1924). పే. 360

16. ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా. (1924). పుట. అథస్సూచిక. పే. 214.

# అధ్యాయం – 10

# బ్రాహ్మణమత సాహిత్యం

[ఈ వ్యాసం తాలూకు చెల్లాచెదరైన పేజీల్ని మేము చూడటం తటస్థించింది. పేజీలకు 6 నుంచి 14; 17 నుంచి 39–నంబర్లు ఉన్నాయి. 'బౌద్ధమత పతనం, పరాజయం' (Decline and Fall of Buddhism) అనే వ్యాసం కొనసాగింపు ఈ పేజీలు కావచ్చు. వీటిల్లో కొన్ని పేజీలు (టైపు చేసిన) మొదటి పేజీలు. మరికొన్ని కార్బన్ కాపీలు. వేదాంత సూత్రాలు. భగవద్గీతలోని విషయాలకు సంబంధించిన 14 పేజీల విషయం ఉంది. (1) బౌద్ధమత పతనం పరాజయం (2) బ్రాహ్మణ మత సాహిత్యం (3) వేదాంత సూత్రాలు, భగవద్గీత అనే పేర్లతో మూడు అధ్యాయాలు ఉన్నాయి. ఈ భాగంలో అదే పేరుతో ఉన్న వ్యాసాలకంటే అవి ఆకృతిలోను, విషయంలోను భిన్నమైనటువంటివి–సంపాదకులు]

## I

పుష్యమిత్రుని కాలంలో రాజకీయ ఘన విజయాన్ని సాధించిన తర్వాత పెంపొందిన బ్రాహ్మణమత సాహిత్యం నుంచి హేతువులనందించే వాస్తవాలను సమీకరించాలి.

(1) మనుస్మృతి (2) గీత (3) శంకరాచార్య వేదాంతం (4) మహాభారతం (5) రామాయణం (6) పురాణాలు. అనే ఆరు రకాలుగా ఈ సాహిత్యాన్ని విభజించవచ్చు. ఈ సాహిత్యాన్ని విశ్లేషించడంలో బౌద్ధ మత క్షీణతకు దారితీసిన హేతువును లేదా హేతువులను సూచించగలిగిన వాస్తవాలను మాత్రమే వెల్లడించాలనుకుంటున్నాను.

దీనిలో అసాధారణమైనది లేదా అన్యాయమైనది ఏమీ లేదు. ప్రజా జీవితం ప్రతిబింబించే దర్పణమే సాహిత్యం అని కదా చెబుతారు!

ఒక విషయాన్ని స్పష్టం చేయదలుచుకున్నాను. అది ఈ (బ్రాహ్మణ మత) సాహిత్యావ కాలానికి సంబంధించింది. పుష్యమిత్రుని విప్లవం తర్వాతే ఈ పైన సూచించిన సాహిత్యం వెలువడిందనే విషయాన్ని చాలామంది అంగీకరిందు. ఛాందసులైనా, కాకున్నా చదువుకున్నా, చదువుకోకపోయినా చాలామంది హిందువులు తమ పవిత్ర సాహిత్యం అత్యంత ప్రాచీన కాలానికి చెందిందనే ప్రగాఢ విశ్వాసంతో ఉన్నారు. తమ పవిత్ర సాహిత్యం అత్యంత ప్రాచీన కాలానికి చెందిందనే నమ్మకం హిందూ విశ్వాసంలో భాగంగా కనిపిస్తుంది.

మనువు కాలానికి సంబంధించి, క్రీ.పూ. 185 తర్వాత అంటే పుష్యమిత్రుని విప్లవం తర్వాత మనుస్మృతిని సుమతి భార్గవుడే రచించాడని తెల్పటానికి ఉన్న ఆధారాలను ఇదివరకే ఇచ్చాను. ఈ విషయాన్ని గురించి ఇంతకు మించి చెప్పవలసిందేమీ లేదు.

భగవద్గీత రచనా కాలానికి సంబంధించి అభిప్రాయ భేదాలున్నాయి.

ఎంత పూర్వమో చెప్పలేకపోయినప్పటికీ క్రీ.పూ. 3వ శతాబ్దానికి పూర్వమే భగవద్గీత ఉన్నదని శ్రీ తెలంగ్ భావించారు.

శ్రీ తిలక్------

ప్రారంభంలో ఉన్న భగవద్గీత కంటే నేడున్న గీత భిన్నమైనదని ప్రొఫెసర్ గార్బ్[1] అభిప్రాయపడ్డారు. ఆదిలో ఉన్న భగవద్గీత మనకు యథాతథంగా అందకుండా కొన్ని అవసరమైన మార్పులకు లోనయిందనే అభిప్రాయంతో పలువురు హిందూ దేశేతర భారత చరిత్రకారులు ఏకీభవిస్తున్నారని వారు ప్రొఫెసర్ గార్బ్ సమ్మతిస్తున్నారు. ప్రొఫెసర్ గార్బ్ అభిప్రాయ ప్రకారం భగవద్గీత మూలానికి సంబంధించని 146 శ్లోకాలు నేటి గీతలో ఉన్నాయి. గీతారచనా కాలం "క్రీ.శ. 2వ శతాబ్ది కంటె పూర్వమై ఉండదని" ప్రొఫెసర్ గార్బ్ అభిప్రాయం.

బాలాదిత్య మహారాజు కాలంలో భగవద్గీత రచన సాగిందని ప్రొఫెసర్ కోశాంబి దృఢాభిప్రాయం. ఆంధ్ర వంశ రాజులను... సంవత్సరంలో ఓడించిన గుప్త వంశానికి చెందినవాడు బాలాదిత్యుడు. క్రీ.శ. 467లో బాలాదిత్యుడు సింహాసనాన్ని అధిష్ఠించాడు. కోశాంబి గీతరచనకు సంబంధించి అంత తరువాతి కాలాన్ని చెప్పడానికి రెండు కారణాలున్నాయి. క్రీ.శ. 788వ సంవత్సరంలో జన్మించి క్రీ.శ. 820వ సంవత్సరంలో మరణించిన శంకరాచార్యులు భగవద్గీతకు భాష్యాన్ని రచించేవరకు గీత "వెల్లడి కాని సంకలనమే". శంకరాచార్యుని కాలానికి 50 సంవత్సరాల ముందే శాంత రక్షితుడు రచించిన తత్వ సంగ్రహంలో భగవద్గీత ప్రస్తావన ఎక్కడా లేదు. ఆయన చెప్పిన రెండో కారణం ఇది. వసు బంధువు విజ్ఞానవాద సిద్ధాంత ప్రవర్తకుడు. వసుబంధ విజ్ఞానవాద విమర్శ బ్రహ్మసూత్ర భాష్యంలో ఉంది. గీతలో బ్రహ్మసూత్ర భాష్య ప్రస్తావన ఉంది.[2] కాబట్టి భగవద్గీత వసుబంధు బ్రహ్మసూత్ర భాష్యాలకు తర్వాతిది. గుప్త రాజయిన బలాదిత్యుని గురువు వసుబంధువు. కాబట్టి బలాదిత్యుని పరిపాలనా కాలంలో కాని, అతని అనంతర కాలంలో కాని భగవద్గీత రచన జరిగి ఉండాలి.

శంకరాచార్యుని కాలం గురించి ఇంతకంటే అధికంగా చెప్పవలసింది ఏమీ లేదు. ఆయన ఎప్పుడు పుట్టాడు, ఎంతకాలం జీవించాడు, ఏయే రచనలు చేసాడు-అనే విషయాల్ని గురించి భిన్నాభిప్రాయం లేదు. అయితే జీవితం గురించి మాత్రం కొంత చెప్పవలసి ఉంది. కానీ

విషయాన్ని మరోచోట ప్రస్తావిస్తాను.

మహాభారత రచనాకాల నిర్ణయం చేయటం దాదాపు అసాధ్యం. అయితే దాని రచనా కాల నిర్ణయ ప్రయత్నాన్ని మాత్రం కొంతవరకు చేయవచ్చు. మహాభారతం మూడు దశల్లో సంకలితం అయింది. ప్రతి సంపాదకుడు గ్రంథ శీర్షికను, విషయాన్ని మార్చివేశాడు. మొదట్లో ఇది 'జయ' అనే పేరుతో ప్రఖ్యాతమయింది. ఈ అసలు పేరు మూడో కూర్పులో కూడా గ్రంథాదిలోను, గ్రంథాంతంలోను ఉంది. 'జయ' అనే పేరుతో విదితమయిన మూల గ్రంథాన్ని వ్యాసుడు రచించాడు. దాని రెండవ కూర్పులో అది భారతమనే పేరును సంతరించుకుంది. దీని సంపాదకుడు వైశంపాయనుడు. ఇదొక్కటే భారతానికి ద్వితీయ రూపం కాదు. వైశంపాయనునితో పాటు వ్యాసునికి ఇంకా సుమంత, జైమిని, పైల, శుకులనే నలుగురు శిష్యులున్నారు. వారందరూ వ్యాసుని దగ్గర చదువుకున్నవారే. ఒక్కొక్కరు ఒక్కో రూపంలో భారతాన్ని వెలువరించారు. ఈ విధంగా భారతానికి ఇంకా నాలుగు కూర్పులున్నాయి. వైశంపాయనుడు మొత్తాన్ని కూర్చి తన కూర్పును తీసుకువచ్చాడు. మూడో సంపాదకుడు సౌతి. వైశంపాయనుని భారత ప్రతికి ఆయను కొత్తరూపాన్ని ఇచ్చాడు. చివరి సౌతి పాఠానికి 'మహాభారత'మనే పేరు వచ్చింది. పరిమాణంలోను కథావిషయంలోను కూడా ఈ గ్రంథం బాగా పెరిగింది. వ్యాసుని 'జయ' 8,800 శ్లోకాలు మించని చిన్ని కథ. వైశంపాయనుని చేతిలో ఇది 24000 శ్లోకాల గ్రంథంగా పెరిగింది. దీన్ని సౌతి 96,836 శ్లోకాల మహా గ్రంథంగా విస్తరించాడు. కథా విషయానికి సంబంధించినంత వరకూ వ్యాసుని 'జయ' కౌరవ పాండవుల యుద్ధ సంబంధిత కథకు మాత్రమే పరిమితం. వైశంపాయనుని చేతిలో ఇది ఇనుమడించింది. మూలకథకు ధర్మోపదేశం తోడయింది. తొలుత కేవలం చారిత్రక గ్రంథమయినా భారతం సాంఘిక, నైతిక, మత నియమాలను బోధించే ధర్మోపదేశ గ్రంథంగా మారింది. తుది సంపాదకుడయిన సౌతి దీన్ని ఒక జనగాధా సర్వస్వంగా తీర్చిదిద్దాడు. భారతంలో లేని, జనశ్రుతిలో ఉన్న చిన్న చిన్ని కథలను, చారిత్రక గాథలను కనుమరుగు కాకుండా ఉండటానికి లేదా ఒకేచోట సమీకృతం కావటానికి సౌతి వీటన్నిటిని ఒక చోటకు తెచ్చారు. విద్యకు, జ్ఞానానికి కాణాచిగా భారతాన్ని తీర్చిదిద్దాలని సౌతి ంతము లక్ష్యం. రాజనీతి, భూగోళం, ధనుర్విద్య మొదలైన అన్ని అంశాలను చేర్చటానికి నే కారణం. చెప్పినదాన్ని తిరిగి తిరిగి చెప్పటాన్ని గమనించినప్పుడు భారతం సౌతి చేతిలో హభారతం'గా ఎలా మారిందో స్పష్టమవుతుంది.

ఇక దీని రచనా కాలం గురించి చూద్దాం. కౌరవ పాండవుల మధ్య జరిగిన యుద్ధం ప్రాచీనమయినది అనే విషయంలో సందేహమేమీ లేదు. అంతమాత్రాన భారత రచనా కూడా దీనంత ప్రాచీనమయిందే అని భావించనవసరం లేదు. అలాగని సమకాలీనము దని కూడా అనలేం. ఏ కూర్పు ఏ కాలంలో జరిగింది అనే విషయాన్ని రూఢి పరచడం ా కష్టమే. ఈ రచనా కాలానికి సంబంధించి ప్రొఫెసర్ హాప్కిన్[3] చెప్పినదాన్ని ప్రస్తావించటం ంజసం. "టూకీగా చెప్పాలంటే మొత్తం మహాభారత రచన క్రీ.శ. 200–400 మధ్య ిగి వుండవచ్చు. ఏదేమైనప్పటికీ, తర్వాత కాలంలో చేరినవి అని ఖచ్చితంగా తెలిసిన వాటిని

దృష్టిలో ఉంచుకోకుండానూ, ఆతర్వాత కాలంలో చేరిన వేర్వేరు రచయితల లేఖనాల్ని లెక్కలోకి తీసుకోకుండాను ఈ నిర్ణయం చేశాను."

కానీ ఇంకా తర్వాతి కాలాన్ని సూచించే ఇతర ఆధారాలున్నాయి.

హూణుల ప్రసక్తి మహాభారతంలో ఉంది. క్రీ.శ. 455 సంవత్సరంలో లేదా ఆ ప్రాంతాలలో హూణులతో యుద్ధం చేసి వారిని ఓడించినవాడు స్కందగుప్తుడు. అయినప్పటికీ హూణుల దండయాత్రలు క్రీ.శ. 528 వరకు కొనసాగాయి. కాబట్టి స్కందగుప్తుని కాలంలో గాని, ఆతర్వాత గాని మహాభారత రచన జరిగిందనేది స్పష్టం.

ఈ కాలం కంటే కూడా తర్వాత జరిగిందనటానికి దాఖలాలున్నాయి. మహాభారతంలో మ్లేచ్ఛుల లేదా మహమ్మదీయుల ప్రస్తావన ఉంది. మహాభారతం అరణ్యపర్వంలోని 190వ అధ్యాయంలోని 29వ శ్లోకంలో గ్రంథకర్త "ప్రపంచమంతా మహమ్మదీయమయమౌతుందనీ" యజ్ఞాలు, కర్మకాండలు, ఆచార సంపర్కాలు, విధులు మొదలగు వాటికి కాలం చెల్లుతుందని తెలిపాడు. మహమ్మదీయుల ప్రస్తావనకు ఇది ప్రత్యక్ష సాక్ష్యం. జరిగిన విషయాల్ని మాత్రమే చెప్పడం పురాణ లక్షణం. భారత పురాణం–మహమ్మదీయుల దండయాత్ర జరగబోయే విషయంగా–భారతంలో–చెప్పినప్పటికీ, ఇది జరిగిన విషయాన్ని గూర్చి చెప్పినటువంటిదేనని స్పష్టం. కాబట్టి మహమ్మదీయుల దండయాత్రల తర్వాతే మహాభారత రచన జరిగిందనటానికి ఈ శ్లోకమే సరైన ఆధారం.

ఈ నిర్ధారణ బలపరచటానికి మరికొన్ని ఆధారాలు లేకపోలేదు. అదే అధ్యాయం 59వ శ్లోకంలో "వృషలుల బాధలు భరించలేని బ్రాహ్మణులు తమను రక్షించే నాథుడే లేడని అంటూ పిచ్చెత్తినట్లు పరుగెత్తుతారు–అని వుంది.

ఈ శ్లోకంలోని వృషలులు బౌద్ధ మతస్థులు కానేకారు. బ్రాహ్మణులు ఏ కాలంలోనైనా పీడితులైనట్లు సాక్ష్యం ఏమాత్రం లేదు. మరో మాటలో చెప్పాలంటే బౌద్ధుల కాలంలో బ్రాహ్మణులు బౌద్ధ బిక్షువులతో సమానంగా స్వేచ్ఛ అనుభవించేవారు. 'సంస్కృతి హీనులు' అని అర్థం ఉన్న వృషలులు ప్రస్తావన మహమ్మదీయ దురాక్రమణదారులకే సంబంధించినదయి ఉండాలి.

అరణ్య పర్వంలోని అదే అధ్యాయంలో మరికొన్ని శ్లోకాలున్నాయి. అవి 65, 66, 67 శ్లోకాలు. ఈ శ్లోకాలలో "సమాజం విచ్ఛిన్నమౌతుంది. ఏడుకలను (YEDUKAS) ప్రజలు పూజిస్తారు. దేవుళ్ళను బహిష్కరిస్తారు. ద్విజులను శూద్రులు సేవించరు. ప్రపంచమంతా ఏడుకలమయమవుతుంది. అదే యుగాంతం" అని పేర్కొనడం జరిగింది.

ఇంతకీ ఏడుక పదానికి అర్థమేమిటి? కొందరు బౌద్ధ చైత్యమని దీనికి అర్థం చెప్తారు. కానీ దీన్ని కోశాంబి[4] అంగీకరించడు. బౌద్ధ సాహిత్యంలో కానీ, వైదిక వాఙ్మయంలో కాని

'ఏదుక' శబ్దం చైత్యం అనే అర్థంలో పైగా, మహేశ్వర భట్టు వ్యాఖ్యానించినట్టు అమరకోశం ఏదుకకు బలం కోసం చెక్క నిర్మాణం కలిగిన గోడ అని అర్థం చెప్పింది. 'ఏదుకా' అనే దాన్ని మహమ్మదీయులు ప్రార్థనలు చేసే 'ఈద్గా'యేనని కోశాంబి భావించారు. ఈ వ్యాఖ్యే వాస్తవమైతే ఆ మహాభారత భాగాలు మహమ్మదు గోరీ దండయాత్ర తరువాతి రచనలనేది స్పష్టమవుతుంది. ఇబన్ కాశిమ్ ఆధిపత్యంలో క్రీ.శ. 712లో మహమ్మదీయుల మొదటి దండయాత్ర జరిగింది. ఉత్తర భారతదేశంలోని కొన్ని పట్టణాలను స్వాధీనం చేసుకొన్నా, అతడు పెద్దగా విధ్వంసకాండకు పూనుకోలేదు. ఆతర్వాత దండయాత్ర చేసిన గజనీ మహమ్మద్ గుళ్ళూ గోపురాలను, బౌద్ధారామాల్ని ధ్వంసం చేయడంతో పాటు రెండు మతాలకు చెందిన పూజారుల్ని ఊచకోత కోశాడు. మసీదులను లేదా ఈద్గాల్లను నిర్మించే కార్యక్రమాన్ని అతడు చేపట్టలేదు. మహమ్మద్ గోరీ ఈ పనిచేశాడు. కాబట్టి క్రీ.శ. 1200 దాకా మహాభారత రచన పూర్తి కాలేదని తెలుస్తుంది.

మహాభారతంలాగానే రామాయణం రచన కూడా మూడు దశల్లో జరిగినట్లు కనిపిస్తోంది. మహాభారతంలో రామాయణానికి సంబంధించిన రెండు రకాల ప్రస్తావనలున్నాయి. రచయిత ప్రసక్తి లేకుండా ఒక సందర్భంలో రామాయణ ప్రస్తావన మహాభారతంలో ఉంది. ఇంకో సందర్భంలో వాల్మీకి-రామాయణ రచయిత అనే ప్రస్తావన ఉంది. కానీ ఇప్పుడున్న రామాయణం మాత్రం వాల్మీకి రచించినది కాదు.[5] సి.వి. వైద్యగారి[6] అభిప్రాయంలో-

"పరిశోధకుడు, ప్రామాణిక వ్యాఖ్యాత అయిన కటకుడు ఆమోదిస్తునప్పటికీ, ఇపుడున్న రామాయణం వాల్మీకి రచించిన అసలు రామాయణం కానేకాదు. రామాయణాన్ని గాఢంగా ఆరాధించే అతి ఛాందసులు గూడా ఈ సత్యాన్ని కాదనలేరు. జిజ్ఞాసతో చదివే ఏ పాఠకుడైనా రామాయణంలోని ద్వైధీభావాల్ని ఇట్టే గ్రహించగలడు. బెంగాలీ లేదా గుజరాతీ భాషలలోని రామాయణ గ్రంథాల్లోని అధిక పాఠాలు, అసందర్భ విషయాలు, అన్వయరాహిత్య శ్లోకాలు దీనికి ప్రబల నిదర్శనం. వాల్మీకి రచించిన రామాయణం ఆతర్వాత ఎన్నో మార్పులకు లోనయి, ఇప్పటి రూపాన్ని సంతరించుకున్నట్లుగా ఎవరన్నా అంగీకరిస్తారు."

భారతంలో లాగానే రామాయణంలో కూడా కథాంశం రానురాను అభివృద్ధి చెందింది. మొదట అది (రామాయణం) రాముని భార్య సీతను రావణుడు ఎత్తుకుపోయిన కారణంగా ఏర్పడ్డ రామాయణ యుద్ధ కథ మాత్రమే. రెండో మార్పులో అది ధర్మోపదేశంతో కూడిన కథ అయింది. కేవలం చారిత్రక గ్రంథస్థాయి నుంచి రామాయణం సాంఘిక, నైతిక, ధార్మిక విధులను ప్రబోధించటం లక్ష్యమైన ధర్మోపదేశ గ్రంథంగా మారింది. రామాయణం మూడో కూర్పు సంతరించుకున్నపుడు మహాభారతంలాగానే ప్రాచీన కథా, జ్ఞాన, తత్వ, కళా, శాస్త్రాల సమాహారం అయింది.

రామాయణ రచనా కాలానికి సంబంధించి ఒకటి మాత్రం ఖాయం. రాముని ఉదంతం

పాండవుల వృత్తాంతం కంటె ప్రాచీనమైనది. కాని మహాభారత రచనతో పాటు రామాయణ రచన కూడా సమానవేగంతో కొనసాగింది. రామాయణంలోని కొన్ని భాగాలు మహాభారతం కంటే ప్రాచీనమైతే కావచ్చు కానీ మహాభారత రచన పూర్తయిన తర్వాతనే రామాయణంలోని చాలా భాగాల రచన సాగిందనడం నిస్సందేహం."[7]

(అసంపూర్ణం)

# II

1) భగవద్గీత 2) వేదాంత సూత్రాలు 3) మహాభారతం 4) రామాయణం 5) పురాణాలు అనే వాఙ్మయం నుంచి నేను చెప్పదలచుకున్న విషయాలను వెల్లడిస్తాను. బౌద్ధమత పతనానికి హేతువుగా, హేతువులుగా పనికివచ్చే వాస్తవాలను మాత్రమే ఈ వాఙ్మయ విశ్లేణలో వెల్లడిస్తాను.

ఈ సాహిత్యంలోని విషయాన్ని పరిశీలించే ముందు ఈ సాహిత్యం పుట్టిన కాలాన్ని గూర్చి ముందుగా ప్రస్తావిస్తాను. పుష్యమిత్రుని విప్లవానంతరం ఈ సాహిత్యం ఆవిర్భవించిందనే విషయాన్ని అందరూ అంగీకరించరు. ఛాందసులైనా కాకున్నా, జ్ఞానులైనా అజ్ఞానులైనా హిందువులు తమ పవిత్ర మత సాహిత్యం అత్యంత ప్రాచీన కాలానికి చెందినదనే ప్రగాఢ విశ్వాసంతో ఉన్నారు. నిజానికి తమ పవిత్ర సాహిత్యం అత్యంత ప్రాచీనమని నమ్మవలసిన అవసరం హిందూ విశ్వాసంలో భాగంగా కనిపిస్తోంది.

## (1) భగవద్గీత

భగవద్గీతతో ప్రారంభిద్దాం. దీని రచనా కాలం వివాదాస్పదం. క్రీ.పూ. 200 సంవత్సరం గీతారచనా కాలానికి అంతిమావధి అని తెలంగ్[8] భావించారు. "ప్రస్తుత భగవద్గీత రచనా కాలం శకయుగం ప్రారంభం కావడానికి పూర్వం 500 సంవత్సరాలకు మించద"ని కీర్తిశేషులు తిలక్ విశ్వసించారు.[9] అంటే ప్రస్తుత గీత రచనా కాలం సుమారు........ గీతరచనా కాలం క్రీ.శ. 200 నుండి 400 సంవత్సరాల మధ్య కాలమై ఉండాలని ప్రొఫెసర్ గార్బ్[10] భావించారు. తిరుగులేని భోగట్టాతో కోశాంబి ఇంకో దృక్పథాన్ని వెల్లడించారు.

గుప్త బలాదిత్యుని పరిపాలనా కాలంలో భగవద్గీత రచింపబడిందని ప్రొఫెసర్ కోశాంబి దృఢాభిప్రాయం. బలాదిత్య మహారాజు ఆంధ్ర వంశాన్ని.... సంవత్సరంలో ఓడించిన గుప్త వంశానికి చెందినవాడు. క్రీ.శ. 467లో బలాదిత్యుడు సింహాసనాన్ని అధిష్ఠించాడు. గీత రచనా కాలమింత అర్వాచీనమని చెప్పటానికి అతనికి రెండు కారణాలున్నాయి. క్రీ.శ. 788లో జన్మించి

క్రీ.శ. 820లో మరణించిన శంకరాచార్యుడు భగవద్గీతకు భాష్యాన్ని రచించేదాకా, అది (భగవద్గీత) తెలియనిదే. శంకరాచార్యుల కాలానికి 50 సంవత్సరాల ముందే శాంతరక్షితుడు రచించిన తత్వసంగ్రహంలో దీని ప్రస్తావన నిస్సందేహంగా లేదు. ఆయన చెప్పిన రెండో కారణం–వసు బంధువు విజ్ఞానవాద సిద్ధాంత ప్రవక్తకుడు. శంకరుని బ్రహ్మసూత్ర భాష్యంలో వసుబంధు విజ్ఞానవాదానికి సంబంధించిన విమర్శ ఉంది. భగవద్గీతలో బ్రహ్మసూత్ర భాష్య ప్రస్తావన ఉంది.[11] కాబట్టి గీత వసు బంధువుకు, బ్రహ్మసూత్ర భాష్యానికి తర్వాతిదై ఉండాలి. వసుబంధువు గుప్త రాజయిన బలాదిత్యుని గురువు కాబట్టి బలాదిత్యుని పరిపాలనా కాలం అంటే క్రీ.శ. 467 ప్రాంతంలో లేదా ఆతర్వాత కాలంలో భగవద్గీత రచన జరిగి ఉండాలి లేదా కనీసం కొన్ని భాగాలు ఆ కాలంలో అసలు కూర్పుకు చేర్చబడి ఉండాలి.

భగవద్గీత రచనా కాలం గురించి అభిప్రాయభేదం ఉన్నా భగవద్గీత పలు కూర్పులకు లోనైందనే విషయంలో మాత్రం అభిప్రాయభేదం లేదు. భగవద్గీత మనకు మౌలిక రూపంలో రాలేదని, పలువురు సంపాదకుల చేతులలో కాలక్రమేణా పలు మార్పులకు చేర్పులకు లోనైందని అందరూ విశ్వసిస్తున్నారు. ఈ మార్పులు చేసిన సంపాదకులందరూ సమాన శక్తిసామర్థ్యాలు కలవారు కారనేది స్పష్టం. ప్రొఫెసర్ గార్బ్[12] సూచించినట్లుగా

"గీత 'ప్రతిభావంతుని కళాత్మక దృష్టితో నిర్మితమైన కళాసృష్టి ఏమాత్రమూ' కానేకాదు. చాలాసార్లు తరచుగా చెప్పిందే చెప్పడం, ఆడంబరంతో కూడిన పరస్పర పదాలతో పదేపదే వివరించడం కనిపిస్తుంది. సాహిత్యపరంగా చూచినా వ్యక్తీకరణాలు అనేకం వీరికనుకూలంగా ఉపనిషద్వాఙ్మయం నుంచి యథాతథంగా గ్రహించడం జరిగింది. సమర్థుడైన కవి ఎప్పుడు ఈ పని చేయడు. సత్త్వ, రజో, తమో గుణాల గురించి భారతీయ ఛాందసంతో వర్గీకరించడం జరిగింది. వీటి ద్వారానే కాక గీత నిజమైన సృజనాత్మక తపనతో సృష్టి కాలేదనడానికి ఇంకా చాలా దాఖలాలున్నాయి...."

ఒకవైపు ఔన్నత్యం, మరోవైపు అల్పత్వం, ఒకవైపు హేతువు మరోవైపు నిర్హేతుకత లక్షణాలుగా కలిగినదని భగవద్గీతను గూర్చి హప్కిన్స్ అన్నాడు. "అక్కడక్కడ మెరుపులు, మార్మిక గాంభీర్యం ఉన్నప్పటికీ, భగవద్గీత ప్రస్తుత రూపంలో కవిత్వంగా మాత్రం అసంతృప్తినే కలిగిస్తుంది. పదేపదే చెప్పిందే చెప్పడం, పదబంధ నిర్మాణంలోనూ, వాటి అర్థాలలోనూ వైరుధ్యాలుండడం చూస్తే 'అది అద్భుత గీతం, వెంట్రుకలు నిక్క బొడిపించే గీతం' అన్న వర్ణన ఎవరికీ ఆశ్చర్యం కలగదు."

పాశ్చాత్యుల దృక్పథమని దీన్ని తిరస్కరించకూడదు. భగవద్గీతా రచనలో పాలుపంచుకున్న కొందరికి వ్యాకరణ నియమాలు కూడా సరిగ్గా తెలియవనే విషయాన్ని ప్రొఫెసర్ రాజ్‌వాడే[13] వాదన బలపరుస్తుంది.

విభిన్న సంపాదకుల వల్ల భగవద్గీతకు వేర్వేరు కూర్పులేర్పడ్డాయని అందరూ అంగీకరిస్తున్న గీతలో ఏ భాగాలు అసలైనవో, ఏ భాగాలు తర్వాత కాలంలో చేర్చబడ్డాయో అనే విషయంలో వారు ఏకాభిప్రాయంతో లేరు. కే.శే. రాజారామ్ శాస్త్రి అభిప్రాయంలో భగవద్గీత మూలంలో 60 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. భగవద్గీత మూలంలో మొదటి 11 అధ్యాయాలు మాత్రమే ఉన్నాయని, 12 నుంచి 18 వరకు ఉన్న అధ్యాయాలు ఆతర్వాత చేర్చినటువంటివని హంబోల్ అభిప్రాయపడ్డారు. భగవద్గీతకు ప్రాణం మొదటి 14 అధ్యాయాలేనని హాప్కిన్స్ అభిప్రాయం. ప్రొఫెసర్ రాజ్‌వాడే ఉద్దేశంలో 10, 11 అధ్యాయాలు కల్పితాలు. భగవద్గీతలో 146 శ్లోకాలు కొత్తగా చేరినవనీ, ఇవి భగవద్గీత మూలంలో లేనివనీ, అంటే 1/5 వంతు గీత అనంతర కాలంలో కూర్చినట్టిదనీ ప్రొఫెసర్ గార్బ్ అభిప్రాయం.

గీతకారునిగా ఎవర్నీ ఎక్కడా పేర్కొనలేదు. రణభూమిలో కృష్ణార్జునుల మధ్య జరిగిన సంభాషణ గీత. కృష్ణుడు తన తత్వాన్ని ప్రబోధించడం ముఖ్యాంశం. కౌరవుల తండ్రి అయిన ధృతరాష్ట్రునికి సంజయుడు కృష్ణార్జునుల సంభాషణను నివేదిస్తాడు. గీత మహాభారతంలో భాగమై ఉండాలి. సందర్భాన్ని అనుసరించి మహాభారతంలో గీతకు సహజంగా స్థానం ఉండాల్సి ఉండగా అక్కడ దానికి స్థానం లేకపోవడం కన్పిస్తుంది. దానికది ఒక ప్రత్యేక స్వతంత్ర గ్రంథం. అయితే దీనిని ఎవరు రాసిందీ ఇదమిత్థంగా లేదు. కృష్ణార్జునుల మధ్య జరిగిన సంభాషణను ధృతరాష్ట్రునికి నివేదించవలసిందిగా సంజయుణ్ని వ్యాసుడు కోరినట్లుగా మనకు తెలుసు. కాబట్టి వ్యాసుడే గీతాకారుడు అని కొందరు అనవచ్చు.

## (2) వేదాంత సూత్రాలు

ఇంతకు ముందు చెప్పినట్లుగా వేదాలు, బ్రాహ్మణాలు ఆరణ్యకాలు, ఉపనిషత్తులు వైదిక వాఙ్మయంలో భాగాలు. విషయాన్నిబట్టి ఈ వాఙ్మయం రెండు రకాలు. మొదటిది కర్మకాండగా పిలిచే మతవిధులు, ఆచార వ్యవహారాలు, సంస్కారాలకు సంబంధించిన వాఙ్మయం. ఇక రెండవది జ్ఞానకాండ అంటే బ్రహ్మజ్ఞానాన్ని ప్రతిపాదించే వైదిక ప్రతిపత్తి కలిగిన వాఙ్మయ.. వేదాలు, బ్రాహ్మణాలు ఈ వాఙ్మయంలో మొదటి తరగతి చెందినవి కాగా; ఆరణ్యకాలు, ఉపనిషత్తులు రెండో తరగతికి చెందుతాయి.

వైదిక సాహిత్యం బృహత్పరిమాణంలో వృద్ధి పొందింది. ముఖ్య విషయమేమిటంటే అది విశృంఖలంగా విస్తరించింది. ఈ అస్తవ్యస్త పరిస్థితిని తొలగించి ఒక క్రమాన్ని కలిగించడానికి ఒక సమన్వయ పద్ధతి అవసరం. ఈ సమన్వయావశ్యకతలోంచి మీమాంస పుట్టుకొచ్చింది. ఇది వైదిక వాఙ్మయంలోని పవిత్ర మంత్రాల్ని విశదీకరించే తత్వజిజ్ఞాస శాఖగా వికసించింది. ఈ సమన్వయావశ్యకతను గుర్తించినవారు కర్మకాండ భాగాన్ని వ్యవస్థీకరించేవారు గాను, జ్ఞానకాండ భాగాన్ని వ్యవస్థీకరించేవారు గాను రెండు శాఖలుగా విడిపోయారు. దీనిఫలితంగా మీమాంసా శాస్త్రం పూర్వ మీమాంస అనీ, ఉత్తర మీమాంస అనీ, రెండు శాఖలుగా వికసించింది. పూర్వ మీమాంస అనే పేరులో ఉన్నట్లుగానే ఇది వైదిక వాఙ్మయంలోని తొలి భాగాలైన వేదాలు,

బ్రాహ్మణాలు గురించి విశదపరుస్తుంది. అలానే ఉత్తర మీమాంస వైదిక వాఙ్మయంలోని ఉత్తర భాగాలయిన అరణ్యకాలను గూర్చి ఉపనిషత్తులను గూర్చి విశదపరుస్తుంది.

మీమాంస శాస్త్రానికి చెందిన ఈ రెండు శాఖల వాఙ్మయం అమితంగా ఉంది. వీటిలో రెండు సూత్ర సంకలనాలు మీమాంసా రంగంలో ప్రధానంగాను, ప్రముఖంగాను స్థిరపడ్డాయి. వీటిలో ఒకదాన్ని జైమిని, మరొకదాన్ని బాదరాయణుడు రచించారని చెబుతారు. జైమిని సూత్రాలు కర్మకాండను,[14] బాదరాయణుని సూత్రాలు జ్ఞానకాండను వివరిస్తాయి. జైమిని, బాదరాయణులకు పూర్వం ఈ విషయంపై గ్రంథాలు రచించిన మరికొందరు రచయితలు ఉన్నారనటంలో సందేహం లేదు. ఏమైనప్పటికి మీమాంస శాస్త్రానికి సంబంధించిన రెండు శాఖల్లోనూ జైమిని బాదరాయణుల సూత్ర గ్రంథాలు ప్రామాణికాలుగా మిగిలాయి.

ఈ రెండింటిలో ఉన్న సూత్రాలు మీమాంస అనే జిజ్ఞాసా శాఖకు చెందినవైనప్పటికీ జైమినీ సూత్రాల్ని మీమాంస సూత్రాలనీ,[15] బాదరాయణ సూత్రాల్ని వేదాంత సూత్రాలనీ పిలుస్తారు. వేదం యొక్క అంతం వేదాంతం లేదా ఉపనిషత్తులతో కూడిన వేదాల చివరి అధ్యాయం వేదాంతం. ఎందుకంటే 'వేదాల అంతిమ లక్ష్యాన్ని' ఉపనిషత్తుల్లో పొందుపరిచారు. వాటిని వ్యవస్థీకరించి సమన్వయపరచే బాదరాయణ సూత్రాలు వేదాంత సూత్రాలు[16] లేదా సంజయుణ్ణి నివేదించమని కోరిన వేదచరమాధ్యాయంలోని సిద్ధాంతాలు వేదాంతసూత్రాలు. ఇదే వేదాంత సూత్రాల మూలం.

అసలీ బాదరాయణుడెవరు? అతడీ సూత్రాలను ఎప్పుడు రచించాడు? బాదరాయణుని పేరు తప్ప మరేమి తెలియదు. ఇది సూత్రకర్త అసలు పేరేనో కాదో కూడా నిశ్చయంగా తెలియదు. బాదరాయణ సూత్రాల ప్రధాన వ్యాఖ్యాతల మధ్య కూడా సూత్రకర్తృత్వం విషయంలో చెప్పదగినంత గందరగోళం ఉంది. సూత్రకర్త బాదరాయణుడని కొందరు చెప్తారు. మరికొందరు వ్యాసుడని చెప్తారు. ఇంకొందరైతే ఇద్దరూ ఒక్కరేనని చెప్తారు. మొత్తంమీద సూత్రాల రచయిత విషయంలో ఇటువంటి బలమైన విరుద్ధాభిప్రాయాలు ఉన్నాయి.

జటిలమైన ఈ సూత్రాలను అతడెందుకు రచించాడు? వైదిక వాఙ్మయంలోని కర్మకాండ భాగాన్ని క్రమబద్ధీకరించే పనికి బ్రాహ్మణులు పూనుకున్నారంటే మనం అర్థం చేసుకోవచ్చు. బ్రాహ్మణులు కర్మకాండలో తలమునకలైనవారు. వైదిక వాఙ్మయంలోని కర్మకాండ భాగాన్ని క్రమబద్ధీకరించటంలోనే వారి ఉనికి, బతుకు తెరువులు ఆధారపడి ఉన్నాయి. వైదిక వాఙ్మయంలోని 'జ్ఞానకాండ' భాగంలో వారికే ఆసక్తీ లేదు. అలాంటప్పుడు దాన్ని ఎందుకు వ్యవస్థీకరించే అవసరం వాళ్ళకొచ్చింది? అసలా ప్రశ్నే ఇంత దాకా తలెత్తలేదు. కాని, ఈ ప్రశ్న ఎంత ముఖ్యమైందో, సమాధానం కూడా అంతే విలువైంది. ఈ ప్రశ్న ఎందుకు ముఖ్యమైందో, సమాధానమేమిటో నేను తర్వాత చర్చిస్తాను.

వేదాంత సూత్రాలకు సంబంధించి ఇంకా రెండు ప్రశ్నలున్నాయి. మొదటిది – ఇది స్వభావాన్ని బట్టి మత సంబంధమైన గ్రంథమా? లేక వేదాంతపరమైన గ్రంథమా? లేక సువ్యవస్థితమైన ఆధ్యాత్మికతను శుద్ధ వేదాంతాన్ని ముడివేసి దాన్ని ప్రమాదరహితంగా మార్చే ప్రయత్నమా? రెండో ప్రశ్న వేదాంత సూత్రాల వ్యాఖ్యానాలకు సంబంధించింది. ఈ సూత్రాలకు సంబంధించి మొత్తం అయిదు వ్యాఖ్యానాలున్నాయి. మేధా సంపత్తి కలిగిన అయిదుగురు ఆచార్యులు ఈ వ్యాఖ్యానకర్తలు. వారు (1) శంకరాచార్యుడు (క్రీ.శ. 788 నుండి క్రీ.శ. 820 వరకు) (2) రామానుజాచార్యుడు (క్రీ.శ. 1017 నుండి క్రీ.శ. 1137 వరకు) (3) నింబార్కాచార్యుడు (క్రీ.శ. 1162లో మరణించాడు) (4) మాధ్వాచార్యుడు (క్రీ.శ. 1197 నుండి 1276 వరకు) (5) వల్లభాచార్యుడు (క్రీ.శ. 1417లో జన్మించాడు). ఈ అయిదుగురు ఆచార్యులు ఒకే అంశాన్ని భిన్న రీతులలో వ్యాఖ్యానించటంతో వేదాంతసూత్రాలకన్న వ్యాఖ్యానాలు అధిక ప్రాముఖ్యం సంతరించుకున్నాయి. అయిదుగురూ అయదు ఆలోచనా ధోరణులను ఈ సూత్రాలలో అన్వేషించారు. శంకరాచార్యుల ప్రకారం వేదాంత సూత్రాలు సంపూర్ణ అద్వైతాన్ని బోధిస్తాయి. రామానుజాచార్యుని ప్రకారం విశిష్టాద్వైతాన్ని, నింబార్కుని ప్రకారం ద్వైతాద్వైతం, మధ్వాచార్యుని ప్రకారం ద్వైతాన్ని, వల్లభాచార్యుని ప్రకారం శుద్ధాద్వైతాన్ని వేదాంత సూత్రాలు బోధిస్తున్నాయి. ఈ పదాల అర్థాల్ని ఇక్కడ చర్చించను. సూత్ర సంకలనం ఒకటే అయిన రచన అయిదు భిన్న అన్వయాల కారణంగా అయిదు భిన్న తాత్విక ధోరణులెందుకు ఆవిర్భవించాల నేదే నా ప్రశ్న. ఇది కేవలం వ్యాకరణానికి సంబంధించినదా! ఈ విభిన్న అన్వయాల వెనుక వేరే ఉద్దేశం ఏమైనా ఉందా? అనేక వ్యాఖ్యానాలు ఉండటం వల్ల ఇంకో ప్రశ్న కూడా పుడుతుంది. ఈ అయిదు భిన్న మార్గాలు పరమాత్మ, జీవాత్మలను దర్శించే వేర్వేరు వ్యాఖ్యానాలు అయినప్పటికీ వాస్తవానికి అవి రెండే. వీరిలో శంకరాచార్యుడు ఒక్కడిదే ఒక ప్రమాణమార్గం. మిగిలిన నలుగురిదీ కలిపి రెండో మార్గం. ఈ నలుగురిలో అంతర్గతంగా విభేదాలున్నా (1) జీవాత్మ పరమాత్మల ఐక్యం (2) జగత్తు మిథ్య అనే శంకరుడు ప్రబోధించిన రెండు విషయాల్ని వ్యతిరేకించటంలో మాత్రం ఏకీభవిస్తున్నారు. ఇక్కడే మూడో ప్రశ్న ఉదయిస్తుంది. బాదరాయణుని వేదాంత సూత్రాలకు ఇటువంటి అపూర్వ దృక్పథాన్ని శంకరాచార్యుడు ఎందుకు ప్రతిపాదించాడు? ఇది సూత్రాల విమర్శనాత్మక అధ్యయన ఫలితమా? లేక ముందే ఏర్పరచుకున్న అభిప్రాయాన్ని సమర్థించుకోవడానికి కావలసి చేసిన అన్వయమా?

ఈ ప్రశ్నను మాత్రమే నేను లేవనెత్తుతున్నాను. దానిని ఇక్కడ చర్చించాలనుకోవడం లేదు. ఇక్కడ ఈ వాఙ్మయకాలం గురించి మాత్రమే ఇక్కడ నాకు అవసరం. ఇది బౌద్ధానికి ముందుదా? తర్వాతిదా?

వేదాంత సూత్రాల కాల నిర్ణయంలో భగవద్గీతలాగానే ఇక్కడా ఇంకో ఇబ్బంది ఎదురైంది. అదేమిటంటే భగవద్గీతలాగానే దశలవారీగా ఇది కూడా సంస్కరణలకు లోనుకావటం. వేదాంత సూత్రాలు మూడుసార్లు కొత్త కూర్పులు పొందాయని కొందరంటారు.[18] కాబట్టి దీని రచనా కాలానికి సంబంధించి ఏ విషయాన్నీ నిశ్చయంగా చెప్పలేము.[19] వెల్లడైన అభిప్రాయాలన్నీ

ఉజ్జాయింపుగా చెప్పినవే! సూత్రాలు కొన్ని బౌద్ధమతాన్ని పరోక్షంగా ప్రస్తావిస్తున్న కారణంగా బౌద్ధమతం అభివృద్ధి చెందిన తర్వాతనే వేదాంతసూత్ర రచన జరిగిందనటంలో సందేహం లేదు. మనువు తన స్మృతిలో ఉదహరించిన కారణంగా అవి వేదాంత సూత్రాలు మనువు తర్వాతివి కావు. కాగా వేదాంత సూత్రాల రచన క్రీ.శ. 200ల ప్రాంతాలలో జరిగి ఉండవచ్చునని ప్రొఫెసర్ కీత్ భావిస్తుండగా, క్రీ.శ. 200 క్రీ.శ. 450 మధ్య కాలంలో-అయి ఉండవచ్చునని ప్రొఫెసర్ జాకోబ్ విశ్వాసం.

## (3) మహాభారతం

మహాభారత రచనా కాలాన్ని సంవత్సరం, తేదీతో సహా నిర్ణయించడం దాదాపు అసాధ్యం. అయితే స్థూలంగా దాని రచనాకాల నిర్ణయ ప్రయత్నాన్ని మాత్రం కొంతవరకు చేయవచ్చు. మహాభారతం మూడు దశల్లో అభివృద్ధి చెందింది. ప్రతి సంపాదకుడు గ్రంథ శీర్షికను, విషయాన్ని మార్చివేశాడు. మొదట్లో ఇది (విజయం) 'జయ' అనే పేరుతో ప్రఖ్యాతమైంది. ఈ అసలు పేరు మూడో కూర్పులో కూడా ఆద్యంతాలు రెంటిలోనూ ఉంది. 'జయ' అనే పేరుతో విదితమైన మూలగ్రంథాన్ని 'వ్యాసుడు' రచించాడు. రెండో కూర్పులో ఇది భారతంగా వాసికెక్కింది. దీని సంపాదకుడు వైశంపాయనుడు. ఇదే భారతానికి తుదిరూపం కాదు. వ్యాసునికి వైశంపాయనునితో పాటు ఇంకా సుమంతుడు, జైమిని, పైలుడు, శకుడు అనే నలుగురు ఇతర శిష్యులు ఉన్నారు. వారందరూ వ్యాసుని దగ్గర చదువుకున్న వారే! ఒక్కొక్కరు ఒక్కో రూపంలో భారతాన్ని రూపొందించారు. ఈ విధంగా భారతానికి ఇంకా నాలుగు కూర్పులు వచ్చాయి. వైశంపాయనుడు మొత్తాన్ని కూర్చి తనదైన శైలిలో వెలుగులోకి తీసుకొచ్చాడు. మూడో సంపాదకుడు సౌతి, వైశంపాయనుని భారత ప్రతికి ఆయన కొత్త రూపాన్ని ఇచ్చాడు. చివరికి సౌతీ పాఠానికి 'మహాభారత' నామమనే పేరు వచ్చింది. పరిమాణంలోను కథా విషయంలోను కూడా ఈ గ్రంథం బాగా పెరిగింది. వ్యాసుని 'జయ' 8,800 శ్లోకాలను మించని చిన్న కథ. వైశంపాయనుని చేతిలో ఇది 24,000 శ్లోకాల గ్రంథంగా పెరిగింది. దీనిని సౌతి 96,836 శ్లోకాల మహాగ్రంథంగా విస్తరించాడు. కథాంశానికి సంబంధించినంత వరకు వ్యాసుని 'జయ' కౌరవ, పాండవ యుద్ధ కథకు మాత్రమే పరిమితం. వైశంపాయనుని చేతిలో ఇది ఇనుమడించింది. మూలకథకు ధర్మోపదేశం తోడయింది. తొలుత కేవలం చారిత్రక గ్రంథమైన భారతం మత నియమాలను బోధించే ధర్మోపదేశ గ్రంథంగా మారింది. ఆఖరి సంపాదకుడైన సౌతి విజ్ఞాన సర్వస్వంగా దీన్నితీర్చిదిద్దాడు. భారతంలో లేని, జన శ్రుతిలో వున్న చిన్నచిన్న కథలను, చారిత్రక గాథలను కనుమరుగు కాకుండా ఉండడానికి లేదా ఒకచోట సమీకృతం కావడానికి సౌతి వీటన్నిటినీ ఒకచోటికి తెచ్చాడు. విద్యకు, జ్ఞానానికి కాణాచిగా భారతాన్ని తీర్చిదిద్దాలని సౌతి అంతిమలక్ష్యం. రాజనీతి, భూగోళం, ధనుర్విద్య మొదలైన అన్ని అంశాలను భారతంలో సౌతి చేర్చడానికి ఇదే కారణం. చెప్పినదాన్నే తిరిగి చెప్పడాన్ని గమనించినపుడు ఆయన చేతిలో భారతం మహాభారతంగా ఎలా పరిణమించిందో స్పష్టమవుతుంది.

ఇక దాని రచనా కాలం గురించి చూద్దాం. కౌరవ పాండవుల మధ్య జరిగిన యుద్ధం చాలా ప్రాచీనమైనదనే విషయంలో సందేహం లేదు. అంతమాత్రాన భారత రచనాకాలం కూడా దానంతటి ప్రాచీనమయినదే అని భావించనక్కరలేదు. అలాగని సమకాలీనమయిందని కూడా అనలేం. ఏ మార్పు ఏ కాలంలో జరిగిందో అనే విషయాన్ని రూఢిపరచడం కూడా కష్టమే. ఈ రచనా కాలానికి సంబంధించి ప్రొఫెసర్ హాప్కిన్స్[20] చెప్పిన దాన్ని ప్రస్తావించటం సమంజసం.

"టూకీగానే చెప్పాలంటే మొత్తం మహాభారత రచన క్రీ.శ. 200–400 మధ్య జరిగి వుండవచ్చు. అయితే, తర్వాత కాలంలో చేరినవే అవి ఖచ్చితంగా తెలిసిన అంశాల్ని దృష్టిలో ఉంచుకోకుండానూ, ఆతర్వాత కాలంలో చేరిన వేర్వేరు రచయితల లేఖనాల్ని లెక్కలోకి తీసుకోకుండాను ఈ కాల నిర్ణయం చేశారు."

మహాభారతం ఇంకా తర్వాతి కాలానికి చెందిందని ఖచ్చితంగా చెప్పటానికి తగినన్ని ఆధారాలున్నాయి.

మహాభారతంలో హూణుల ప్రసక్తి ఉంది. క్రీ.శ. 455వ సంవత్సరం లేదా ఆ ప్రాంతాలలో హూణులతో యుద్ధం చేసి వారిని ఓడించిన వాడు స్కందగుప్తుడు. అయినప్పటికీ హూణుల దండయాత్రలు క్రీ.శ. 528 వరకూ కొనసాగాయి. కాబట్టి దండయాత్రల కాలంలో గానీ లేదా ఆతర్వాతగానీ మహాభారత రచన జరిగిందనేది స్పష్టం.

దీనికంటే కూడా ఇంకా తర్వాతి కాలానికి చెందిందని కోశాంబి[21] పేర్కొన్న ఆధారాలున్నాయి. మహాభారతంలో మ్లేచ్ఛులు లేదా మహమ్మదీయుల ప్రస్తావన ఉంది. మహాభారతం అరణ్యపర్వం 190వ అధ్యాయం 29వ శ్లోకంలో గ్రంథకర్త "ప్రపంచమంతా మహమ్మదీయమయమౌతుందని యజ్ఞాలు, కర్మకాండలు, ఆచార సంస్కారాలు, విధులు మొదలైన వాటికి కాలం చెల్లుతుంది"– అని రాశాడు. మహమ్మదీయుల ప్రస్తావనకు ఇది ప్రత్యక్ష సాక్ష్యం. జరిగిన విషయాన్ని మాత్రమే చెప్పటం పురాణ లక్షణం. భారతం పురాణం. మహమ్మదీయుల దండయాత్ర జరగబోయే విషయంగా భారతంలో చెప్పినప్పటికీ, ఇది జరిగిన విషయాన్ని గూర్చి చెప్పినటువంటిదే అనేది స్పష్టం. కాబట్టి మహమ్మదీయులు దండయాత్ర తర్వాతే మహాభారత రచన జరిగిందనడానికి ఈ శ్లోకమే ఆధారం.

ఈ నిర్ణయాన్ని బలపరచడానికి మరికొన్ని ఆధారాలు కూడా లేకపోలేదు.

అదే అధ్యాయం 59వ శ్లోకంలో "వృషలుల బాధలు భరించలేక బ్రాహ్మణులు తమను రక్షించే నాథుడే లేడా అంటూ గగ్గోలు పెడతారు" అనే ప్రస్తావన ఉంది.

ఈ శ్లోకంలోని వృషలులు బౌద్ధ మతస్థులు కానేకారు. బ్రాహ్మణులు ఎప్పుడైనా పీడితులైనట్లు ఏమాత్రమూ సాక్ష్యం లేదు. మరో మాటలో చెప్పాలంటే బౌద్ధుల కాలంలో బ్రాహ్మణులు బౌద్ధ భిక్షువులతో సమానంగా స్వేచ్ఛ అనుభవించేవారు. సంస్కృతీహీనులనే అర్థం ఉన్న వృషలుల ప్రస్తావన మహమ్మదీయ దురాక్రమణదారులకే సంబంధించినదై ఉండాలి. అదే గనక జరిగి వుంటే మహాభారతంలో కొంత భాగం తప్పకుండా భారతదేశంలో మహమ్మదీయ దండయాత్రలు ప్రారంభమయిన తర్వాత రచించబడి ఉండాలి.

అరణ్య పర్వంలో అదే అధ్యాయంలో ఇదే అభిప్రాయాన్ని బలపరిచే మరికొన్ని శ్లోకాలున్నాయి. అవి 65, 66, 67 (శ్లోకాలు). ఈ శ్లోకాలలో "సమాజం విచ్ఛిన్నం అవుతుంది. ప్రజలు ఏడుకలను పూజిస్తారు. దేవుళ్ళను బహిష్కరిస్తారు. శూద్రులు ద్విజులను సేవించరు. ప్రపంచమంతా ఏడుకల మయమౌతుంది. అదే యుగాంతం" అని పేర్కొనటం జరిగింది.

ఇంతకీ 'ఏడుక' అనే పదానికి అర్థం ఏమిటి? 'ఏడుక' పదం అస్థిక (బొమిక) అనే అర్థాన్నిస్తుందనీ, ప్రత్యేకంగా బుద్ధుని అస్థికలనీ, ఆతర్వాత బుద్ధుని అస్థికలను చైత్యం కలిగి ఉంటుంది కాబట్టి చైత్యమనీ కొందరు భావించారు. కానీ కోశాంబి దీన్ని అంగీకరించడు.[22] బౌద్ధ సాహిత్యంలో కానీ వైదిక వాఙ్మయంలో కానీ 'ఏడుక' పదం చైత్యార్థంలో వాడలేదు. అమరకోశ వ్యాఖ్యాత మహేశ్వరభట్టు ప్రకారం ఏడుక పదం అర్థం గట్టితనం కోసం చెక్క నిర్మాణంతో కలిపి కట్టిన గోడఅనే అర్థాన్నిస్తుంది. ఏడుక అనేదాన్ని మహమ్మదీయులు నమాజు ప్రారంభించటానికి ముందు ఉచ్చరించే 'ఈద్గా' (ఏడుక)గా కోశాంబి భావించారు. ఈ వ్యాఖ్యే వాస్తవమయితే ఆ మహాభారత భాగం మహమ్మదీయ దండయాత్రల తర్వాత అంటే మహమ్మద్ గోరీ దండయాత్రల తర్వాతి రచన అనేది స్పష్టమవుతుంది. మొట్టమొదటి మహమ్మదీయ దండయాత్ర ఇబన్ కాశిమ్ ఆధ్వర్యంలో క్రీ.శ. 721లో జరిగింది. అతడు ఉత్తర హిందూదేశంలోని కొన్ని పట్టణాలను స్వాధీనపరచుకొన్నాడు. కానీ దేవాలయాల, విహారాల విధ్వంసానికి అంతగా పాల్పడలేదు. రెండు మతాల పురోహితులను ఊచకోత కోశాడు. కానీ అతడు స్వయంగా మసీదులను కానీ 'ఈద్గా' లను కానీ కట్టించే కార్యక్రమాన్ని చేపట్టలేదు. మహమ్మద్ గోరీ ఆ పనిచేశాడు. కాబట్టి మహాభారత రచన క్రీ.శ. 1200 వరకు కొనసాగిందని ఖచ్చితంగా చెప్పవచ్చు.

## (రామాయణం)

మహాభారతంలాగానే రామాయణ రచన కూడా మూడు దశల్లో జరిగిందనేది వాస్తవం. మహాభారతంలో రామాయణానికి సంబంధించిన రెండు రకాల ప్రస్తావనలున్నాయి. ఒక సందర్భంలో రచయిత ప్రసక్తి ఏమీ లేకుండా రామాయణ ప్రస్తావన ఉంది. ఇంకో సందర్భంలో వాల్మీకి రామాయణ రచయితగా ప్రస్తావన ఉంది. కానీ ప్రస్తుతమున్న రామాయణం వాల్మీకి రచించిన రామాయణం కాదు.[23] పి.వి.వైద్య[24]గారి అభిప్రాయంలో–

"పరిశోధకుడు, ప్రామాణిక వ్యాఖ్యాత అయిన కటకుడు ఆమోదించినప్పటికీ, ప్రస్తుత మున్న రామాయణం వాల్మీకి రచించిన అసలు రామాయణం కాదు. రామాయణాన్ని గాఢంగా ఆరాధించే అతి ఛాందసులు కూడా ఈ సత్యాన్ని కాదనలేరు. జిజ్ఞాసతో చదివే ఏ పాఠకు డయినా రామాయణంలోని ద్వైధీభావాన్ని ఇట్టే గ్రహించగలడు. బెంగాల్, లేదా బొంబాయి భాషల్లో రామాయణ ప్రతుల్లోని అధిక పాఠాలు, అసందర్భ విషయాలు, అన్వయరాహిత్య శ్లోకాలు దీనికి ప్రబల నిదర్శనం. వాల్మీకి రచించిన రామాయణం ఆతర్వాత కాలంలో ఎన్నో మార్పులకు లోనై, యిప్పటి రూపాన్ని సంతరించుకున్నట్లుగా ఎవరయినా అంగీకరిస్తారు."

మహాభారతంలాగానే రామాయణంలో కూడా కథాంశం రానురాను అభివృద్ధి చెందింది. మొదటి అది రాముని భార్య సీతను రావణుడు ఎత్తుకుపోయిన కారణంగా ఏర్పడ్డ రామరావణ యుద్ధ కథ మాత్రమే. రెండో కూర్పులో అది ధర్మోపదేశంతో కూడిన కథ అయింది. కేవలం చారిత్రక గ్రంథ స్థాయి నుంచి అది సాంఘిక, నైతిక, ధార్మిక విధులను ప్రబోధించటం లక్ష్యమైన ధర్మోపదేశ గ్రంథంగా మారింది. రామాయణం మూడో కూర్పు సంతరించుకున్నప్పుడు మహాభారతంలాగానే కథా, జ్ఞాన, తత్వ, కళా శాస్త్రాల సమాహారం అయింది.

రామాయణ రచనా కాలానికి సంబంధించి, ఒక విషయం మాత్రం రూఢి అయింది. అది రాముని ఉదంతం, పాండవ వృత్తాంతం కంటే ప్రాచీనతరమనేది. మహాభారత రచనతో పాటు రామాయణ రచన సమాన వేగంతో కొనసాగింది. రామాయణంలోని కొన్ని భాగాలు మహాభారతం కంటే ప్రాచీనతరమైతే కావచ్చు. కానీ మహాభారత రచన పూర్తయిన తర్వాతనే రామాయణంలోని చాలా భాగాల రచన సాగిందనటం నిస్సందేహం.[25]

## పురాణాలు

నేడు పురాణాల[26] సంఖ్య పద్దెనిమిది. అయితే, ఈ సంఖ్య అసలు సంఖ్య కాదు. సంప్రదాయాన్ని అనుసరించి మొదట్లో ఒకే పురాణం ఉండేదనటంలో సందేహం లేదు. ఈ పురాణం వేదాలకంటే ప్రాచీనమైనదని సంప్రదాయం చెపుతుంది. ఈ పురాణాన్ని అధర్వవేదం ప్రస్తావించింది. బ్రహ్మండపురాణం తాను వేదాలకంటే పురాతనమైనదాన్నని చాటుకుంది. శత పదం కోసం రాజుకు ఆ గాధలు తెలియవలసిన అవసరం ఉంది. యజ్ఞం పదోరోజున అధ్వర్యువు రాజుకు పురాణాన్ని చదివి వినిపించాల్సి ఉందని బ్రాహ్మణం చెబుతుంది.

ఒకే పురాణాన్ని 18గా మార్చి కూర్చినవాడు వ్యాసుడనీ, అష్టాదశ పురాణ కర్తృత్వం అతనికే ఆపాదించారు. కొత్తగా కలపడం ద్వారాను, మరికొన్నింటిని తీసివేయడం మూలంగాను వ్యాసుడు ఆ ఒక్క పురాణాన్నే పద్దెనిమిది పురాణాలుగా చేశాడు. పురాణాల పరిణామ క్రమానికి ఈ అష్టాదశ సంఖ్య రెండో దశ. పద్దెనిమిది పురాణాలలోని ప్రతి పురాణం ఆదిపురాణం[27] అనే తొలి రూపంలో వ్యాసకృతం. అష్టాదశ పురాణాల రచన తర్వాత వ్యాసుడు వాటిని

తన శిష్యుడయిన రోమ హర్షణికి బోధించాడు. రోమహర్షణి ఆ పురాణాల సారాన్ని తనదైన శైలిలో తన ఆరుగురు శిష్యులకు బోధించాడు. రోమహర్షణుని కూర్పు ఈ విధంగా పురాణాల్లో మూడో కూర్పు అయింది. రోమహర్షణుని ఆరుగురు శిష్యులలో కశ్యప, సవర్ణి, వైశంపాయనులనే ముగ్గురు మరలా మూడు వేర్వేరు కూర్పులను సంతరించారు. అవి వారి పేర్లతోనే ప్రసిద్ధి పొందాయి. ఇది పురాణాల నాల్గో కూర్పు. భవిష్య పురాణం ప్రకారం విక్రమాదిత్య మహరాజు[28]కి పరిపాలనా కాలంలో పురాణాల సంస్కరణ జరిగింది.

ఇక పురాణాల ఇతివృత్తాన్ని చూద్దాం. ప్రాచీన కాలం నుంచి కూడా పురాణం జ్ఞాన విభాగంగా పేరుబడింది. ఇతిహాసం లేదా చరిత్ర నుంచి పురాణం వేరుపడటం ఇందుకు నిదర్శనం. పాలకునికి సంబంధించిన గత సంఘటనల గ్రంథమే ఇతిహాసం. ప్రత్యక్షంగా చూసిన సంఘటనలను కథారూపంలో చెప్పటం ఆఖ్యానం. విన్న విషయం గురించి చెప్పేది ఉపాఖ్యానం. ఇక గాథలంటే చనిపోయిన పూర్వీకుల గురించి ప్రకృతికీ జగత్తుకీ సంబంధించిన గీతాలాపన అని అర్థం.

శ్రద్ధాకల్పాలకు[29] సంబంధించిన ప్రాచీన కర్మకాండ మార్గమే 'కల్పశుద్ధి', ఈ జ్ఞాన శాఖలన్నిటి నుంచి పురాణం విడివడింది. పురాణం 5 విషయాలకు సంబంధించింది (1) స్వర్గం (2) ప్రతిసర్గం (3) వంశం (4) మన్వంతరం (5) వంశాను చరితం. సర్గం అంటే విశ్వసృష్టి. ప్రతి సర్గం విశ్వ విచ్ఛిత్త్యర్థాన్నిస్తుంది. వంశం వంశ క్రమార్థాన్ని ఇస్తుంది. మన్వంతరం భూమికి మూల పురుషులు లేదా చక్రవర్తులయిన 14 మంది వేర్వేరు మనువుల కాలాలనే అర్థాన్నిస్తుంది. రాజవంశ వృత్తాంతాన్ని తెలిపేది వంశానుచరితం.

పురాణాల ఇతివృత్తంలోను, పరిధుల్లోను చెప్పుకోదగినంత చేర్పు జరిగింది. మనకున్న పురాణాలు ఈ ఐదు విషయాలకే పరిమితమై లేవు. ఈ విషయాలకు అదనంగా అవి పరిధికి మించి బాహ్యమయిన ఇతర విషయాలతో విస్తరించాయి. వీటిని భిన్నమైన లేదా అదనమైన విషయాలను కలిగి వున్నాయి. పురాణాల పరిధి గురించిన మౌలికాలోచనలో అంతగా మార్పు వచ్చింది. అదనపు విషయాలు ఈ క్రింది ప్రధాన విషయాంశాలను కలిగి ఉన్నాయి.

I. స్మృతి ధర్మం : ఇందులో

(1) వర్ణాశ్రమ ధర్మం (2) అర్చన (3) ఆహ్నికం (4) భాష్యభాష్యం (5) వివాహం (6) అశౌచం (7) శ్రాద్ధం (8) ద్రవ్యశుద్ధి (9) పాతకం (10) ప్రాయశ్చిత్తం (11) నరకం (12) కర్మ విపాకం (13) యుగధర్మం-వీటి చర్చ.

II. వ్రతధర్మం-పవిత్ర వ్రతాల, పవిత్ర దినాల అనుష్ఠానం.

III. క్షేత్ర ధర్మం–పవిత్రస్థల పుణ్యక్షేత్ర యాత్రలు.

IV. దానధర్మం–పవిత్రులకు కానుకలు.

వీటికి అదనంగా పురాణాలలు అమితంగా పట్టించుకున్న ఉన్న మరో రెండు కొత్త విషయాలున్నాయి.

ఈ రెండు విషయాలలో మొదటిది శాఖాపరమైన పూజ. ఒక్కో పురాణం ఒక దైవానికి సంబంధించింది. ఆ ప్రత్యేక దైవాన్ని గురించి, ఆ దేవత ఆరాధన వైశిష్ట్యం గురించి, ఆరాధక తెగ గురించీ మాత్రమే చెబుతాయి. ఐదు పురాణాలు[30] విష్ణు పూజను, ఎనిమిది[31] శివపూజను, ఒకటి[32] బ్రహ్మపూజను, ఒకటి[33] సూర్యారాధనను, రెండు దేవీ ఉపాసనను, ఒకటి గణేశ్వరార్చనను సమర్థిస్తున్నాయి.

పురాణాలు తమ ఇతివృత్తంగా చేసుకొన్న రెండో విషయం భగవంతుడి అవతారాల చరిత్ర. ఇద్దరు దేవుళ్ళ ఏకత్వాన్నీ, దేవుడి అవతారానికి పురాణాలు భేదం చూపాయి. ఏకత్వాన్ని గుర్తించడం అంటే, రెండు పేర్లున్నప్పటికీ దేవుడొకడే అని చెప్పడం; అవతారం అంటే దేవుడు మనిషిగానో, జంతువుగానో మారి అద్భుతాలు చేయడం. అవతారాల చరిత్రలో విష్ణువు బాగా పనికివస్తాడు. ఎప్పటికప్పుడు అవతారాలు ధరించి, అద్భుత కార్యాలు చేయడం విష్ణువులోనే కనిపిస్తుంది. పురాణాలలో ఈ అంశంపై విస్తృతంగా చర్చించారు.

ఈ అనేక నూతన విషయాలు చేరటం వల్ల పురాణ గాథలు గుర్తు పట్టలేనంతగా కొత్త రూపు తీసుకోవడంలో ఆశ్చర్యమేముంది?

పురాణాల కర్తృత్వం విషయంలో గమనించవలసిన సంగతి మరొకటి ఉంది. అది పురాణ కర్తృత్వం–ఒకరి నుంచి మరొకరికి మారడానికి సంబంధించింది. ప్రాచీనమైన హిందూ విద్యాధికులలో రెండు రకాల వారున్నారు. తొలి భాగానికి చెందినవారు బ్రాహ్మణులైతే, రెండో భాగానికి చెందినవారు బ్రాహ్మణేతరులైన సూతులనబడేవారు. వీరిలో ప్రతి శాఖ వారిదైన ఒక ప్రత్యేక వాఙ్మయ భాగానికి అధికారులు. సూతులు పురాణాలపై గుత్తాధిపత్యం కలవారు. పురాణ రచనలో కాని, ప్రవచనంలో కాని బ్రాహ్మణులకు ఏ విధమైన ప్రమేయం లేదు. అది కేవలం సూతులకే ప్రత్యేకం. సూతులు పురాణాల రచన, ప్రవచనాల విషయంలో ప్రత్యేక కృషి చేసినప్పటికీ, వీరికి ఆ విషయంలో వంశపారంపర్యంగా నిర్ణీతమైన హక్కు ఉన్నప్పటికీ బ్రాహ్మణులు కాలక్రమంగా ఈ హక్కును తమ చేతిలో లాగేసుకుని, అప్పటిదాకా గుత్తాధిపత్యం చలాయించిన సూతుల్ని తమ వృత్తి నుంచి తొలగించారు. ఈ విధంగా పురాణ కర్తృత్వంలో మార్పు వచ్చింది. సూతులకు బదులుగా బ్రాహ్మణులు ఆ పురాణాల రచయితలయ్యారు.[34]

పురాణాలు బ్రాహ్మణుల చేతులలో పడ్డ తర్వాత బహుశా అవి కొత్త విషయాల చేర్పునకు వీలుగా మార్పుల్ని పొంది ఉండవచ్చు. వారి సంపాదకత్వం, పునర్నిర్మించడం అనేవి సాహసంతో కూడినవే! ఆ రెండు పనుల్లో భాగంగా వారు పురాణాల్లో కొత్త అధ్యాయాల్ని కూడా కల్పించారు. ఈ క్రమంలో కొన్ని పురాణాలు తమలోని ప్రాచీన విషయాలను, పాత అధ్యాయాల స్థానంలో కొత్తవి పెట్టారు, పాత పేర్లతో కొత్త అధ్యాయాలు రచించారు. భద్రపరచుకున్నాయి, కొన్ని పాత విషయాల్ని కోల్పోయాయి, మరికొన్ని కొత్త విషయాలను సంతరించుకున్నాయి. కొన్ని పూర్తిగా కొత్త గ్రంథాలయ్యాయి.

పురాణ రచనాకాల నిర్ణయం కష్టసాధ్యమైన సమస్య. బ్రాహ్మణులు రచించిన చరిత్రంతా కూడా తారీకులు లేనిదే! పురాణాలు దీనికి అపవాదం ఏమీ కావు. ఖచ్చితంగా తెలుస్తున్న తారీకుల్ని ఆధారంగా చేసుకున్న సంఘటనల సంబంధంతో, వివరమయిన సాక్ష్యంతో పురాణాల కాలాన్ని నిర్ణయించాలి. బ్రాహ్మణ వాఙ్మయంలోని ఇతర భాగాల విభిన్న పురాణాల రచనా కాలాల్ని పరీక్షించే ప్రయత్నం జరగలేదు. వైదిక వాఙ్మయ విషయం వలె పండితులు పురాణాలపై ఏమాత్రమూ దృష్టి పెట్టలేదనేది నిశ్చయం. పురాణాల రచనా కాల నిర్ణయ విషయంలో హజరా గ్రంథంలో మాత్రమే నాకు తెలిసినంతవరకూ కొంత ప్రయత్నం జరిగింది.ఆయన గుర్తించిన పురాణాల తేదీలను ఈ కింద పొందు పరుస్తున్నాను.

| | పురాణాలు | | రచనా కాలం |
|---|---|---|---|
| 1) | మార్కండేయ పురాణం | ...... | క్రీ.శ. 200-600 మధ్య |
| 2) | వాయుపురాణం | ...... | క్రీ.శ. 200-500 మధ్య |
| 3) | బ్రహ్మాండ పురాణం | ...... | క్రీ.శ. 200-500 మధ్య |
| 4) | విష్ణు పురాణం | ...... | క్రీ.శ. 100-350 మధ్య |
| 5) | మత్స్య పురాణం | ...... | కొంతభాగం రమారమి క్రీ.శ.325, కొంతభాగం క్రీ.శ. 1100లో... |
| 6) | భాగవతం | ...... | క్రీ.శ. 500-600 మధ్య |
| 7) | కూర్మ పురాణం | ...... | క్రీ.శ. 550-1000 మధ్య |
| 8) | వామన పురాణం | ...... | క్రీ.శ. 700-1000 మధ్య |
| 9) | లింగ పురాణం | ...... | క్రీ.శ. 600-1000 మధ్య |
| 10) | వరాహ పురాణం | ...... | క్రీ.శ. 800-1500 మధ్య |
| 11) | పద్మ పురాణం | ...... | క్రీ.శ. 600-950 మధ్య |
| 12) | బృహన్నారదీయ పురాణం | ...... | క్రీ.శ. 875-1000 మధ్య |
| 13) | అగ్ని పురాణం | ...... | క్రీ.శ. 800-900 మధ్య |

| | | | |
|---|---|---|---|
| 14) | గరుడ పురాణం | ...... | క్రీ.శ. 850–1000 మధ్య |
| 15) | బ్రహ్మ పురాణం | ...... | క్రీ.శ. 900–1000 మధ్య |
| 16) | స్కంద పురాణం | ...... | క్రీ.శ. 700–తర్వాత |
| 17) | బ్రహ్మవైవర్త పురాణం | ...... | క్రీ.శ. 700–తర్వాత |
| 18) | భవిష్య పురాణం | ...... | క్రీ.శ. 500–తర్వాత |

ప్రస్తుతానికి పురాణాలకు ఇంతకంటే ఖచ్చితమైన కాలాన్ని నిర్ణయించలేము. ఈ రంగంలో జరిగే పరిశోధనల వల్ల ఈ కాల గరిష్ఠ కనిష్ఠ పరిమితుల్ని తగ్గించవచ్చు. భేదం అనేది కొద్దిపాటి తేడా మాత్రమే. యుగాల్ని తారుమారు చేసేవి కావు.

పురాణ వాఙ్మయ కాల నిర్ణయంలో సందేహాలన్నింటిని తొలగించి–పురాణాలు బుద్ధుని తర్వాతి కాలానికి చెందినవి అని చెప్పటానికి ఈ చిన్న సర్వే చాలు. ఇది ఎంతో ప్రాముఖ్యం ఉన్న మరో విషయాన్ని రూఢం చేస్తుంది. పుష్యమిత్రుని నాయకత్వంలో బ్రాహ్మణులు విజయం సాధించిన కాలం తర్వాత ఈ వాఙ్మయం పుట్టింది. ఈ 'సర్వే' మరో విషయాన్ని కూడా తెల్పు తుంది. వ్యాసుడు భారతాన్ని రచించాడు. వ్యాసుడే భగవద్గీతను చెప్పాడు. వ్యాసుడే పురాణాల్ని కూడా రచించాడు. మహాభారతం 18 పర్వాల గ్రంథంలో భగవద్గీతలో 18 అధ్యాయాలున్నాయి. పురాణాలు కూడా పద్దెనిమిదే! ఇదంతా యాదృచ్ఛికమా? లేక ఉద్దేశ్యపూర్వకంగా పన్ని పన్నాగం ఫలితమా? మనం వేచి చూడాల్సిన విషయం ఇది.

# III

## వేదాంత సూత్రాలు

జైమిని కర్మ సూత్రాల పద్ధతిలోనే బాదరాయణుని వేదాంత సూత్రాలు ఒక ప్రత్యేక శాఖ అధ్యయనంగా రూపొందాయి. వారివారి విషయాల్లో జైమిని, బాదరాయణులు ఇద్దరూ వేర్వేరు ఆలోచనా ధోరణులకు చెందినవారే అయినా, ఒకరినొకరు సానుకూలంగా స్వీకరించడం ఎలా జరిగిందన్న ప్రశ్న రావడం సహజం. లోతుగా వెడితే వాస్తవాలు వెల్లడవుతాయి. ప్రొఫెసర్ బేల్వాల్కర్[35] పేర్కొన్నట్లు "వేదాంత సూత్రాలు కర్మ సూత్రాల మూసలోనే రచించినటువంటివి. పరిభాషల్లో కానీ, చర్చా పద్ధతిలో గానీ జైమినిని బాదరాయణుడు గుడ్డిగా అనుసరించాడు." అతడు శ్రుతుల అర్థ నిర్ణయం చేసేటప్పుడు జైమిని నియమాల్ని ఆమోదించి అనుసరించాడు. జైమిని ఏ అర్థంలో అయితే వాడాడో ఆ అర్థంలోనే అతని పారిభాషిక పదాలనే బాదరాయణుడు ప్రయోగించాడు.

ఇది కొద్దిపాటి ఆశ్చర్యాన్ని మాత్రమే కలిగించే విషయం. కానీ సిద్ధాంతాల విషయంగా ఈ రెండు శాఖలు ఒకరిపట్ల మరొకరు అనుసరించే దృక్పథం మాత్రం తక్కువ ఆశ్చర్యాన్ని కలిగించేది కాదు. ఒక ఉదాహరణనిస్తున్నాను.

వేదాంత విషయంలో జైమిని అభిప్రాయానికి నిదర్శనంగా బాదరాయణుడు ఈ క్రింది సూత్రాలను పేర్కొన్నాడు.[36]

2. (ఆత్మ) యజ్ఞకర్మలకు అనుబంధమైనటువంటిది. కాబట్టి (ఆత్మజ్ఞాన ఫలాలు) కర్తకు లభించిన ప్రశంసలు మాత్రమేనంటాడు జైమిని.

"జైమిని ప్రకారం వేదాలు ముక్తితో పాటు కొన్ని ప్రయోజనాల సాధనకు మాత్రమే కర్మల్ని విధిస్తున్నాయి. వేదాంతం ప్రతిపాదించినట్లుగా ఆత్మజ్ఞానం ఏ స్వతంత్ర ఫలితాలనూ కలిగించదు. కానీ, వేదాంతం చెప్పినట్టు, కర్త ద్వారా కర్మలతో సంబంధం కలిగి వుంటుంది. శరీరం కంటె తాను భిన్నమైన వాడిననీ, మరణానంతరం స్వీయ యజ్ఞ ఫలితాలను అనుభవించ డానికి స్వర్గానికి వెడతాననీ తెలిస్తే తప్ప యజ్ఞాన్ని ఎవరూ నిర్వహించరు. ఆత్మజ్ఞానాన్ని చర్చించే వేదాంతభావం క్రతుకర్మలకు కర్త లోబడినవాడని తెలియజేయడానికే ఉపయోగిస్తుంది. అయితే, ఆత్మజ్ఞాన ఫలాలుగా వేదాంత గ్రంథాలు ప్రకటించే ఫలితాలు కేవలం స్తోత్రప్రాయమే, ఆ గ్రంథాలు కూడా స్తోత్రరూపంలోనే ఆ ఫలితాలను ప్రకటిస్తాయి. శుద్ధి కార్యక్రమాల ద్వారా ఇతరాలు కూడా క్రతువులకు అర్హమవుతాయనీ, అయితే ఆత్మ శరీరానంతరం కూడా జీవిస్తుందన్న జ్ఞానమే కర్తను యజ్ఞకర్మలకు అర్హుణ్ణి చేస్తాయనీ జైమిని అంటాడు.

3. (శ్రుతుల నుంచి) మనం (జ్ఞానుల) ప్రవర్తన గురించి తెలుసుకుంటాం కాబట్టి

"విదేశ దేశ రాజైన జనకుడు యజ్ఞం చేసి ఎన్నో దానాలు చేశాడు. (బృహ 3–1–1)", "ఆర్యులారా, నేను కూడా యజ్ఞాన్ని చేయబోతున్నాను" (ఛాందో 5–11–5) ఇప్పుడు జనకుడు, అశ్వపతి ఇద్దరూ ఆత్మజ్ఞానం కలిగిన వారు. ఆత్మజ్ఞానం వల్లనే ముక్తిని సాధించేటట్టయితే, వారు యజ్ఞాలు చేయవలసిన అవసరం లేదు. కానీ, ఉదాహృత గ్రంథాలు రెండూ వారు యజ్ఞాలు చేసినట్టు చెబుతున్నాయి. కాబట్టి వేదాంతులు చెప్పినట్టు ఆత్మజ్ఞానం వల్ల కాక యజ్ఞకర్మల వల్లనే ముక్తి సాధ్యమని నిరూపణ అవుతోంది.

4. అది (అంటే ఆత్మజ్ఞానం యజ్ఞ కర్మలకు అధీనమై ఉంటుందని) గ్రంథాలు సూటిగా ప్రకటిస్తున్నాయి.

"జ్ఞానంలో, విశ్వాసంతో, ధ్యానంతో ఆచరించినదే అధిక శక్తివంతం" (ఛాందో

1-1-10); యజ్ఞకర్మలో జ్ఞానం ఒక భాగమని పై ఉల్లేఖన స్పష్టం చేస్తోంది.

5. ఆ రెండూ (జ్ఞానం, కర్మ), (ఫలితాల సాధన కోసం దేహం వదిలివెళ్ళే ఆత్మతో) కలిసి ప్రయాణిస్తాయి కాబట్టి -

"దాన్ని జ్ఞానం, కర్మ, గతానుభవం అనుసరిస్తాయి" (బృహ 4-4-2). జ్ఞానకర్తలు ఆత్మతో సహా ప్రయాణించి ప్రాప్తించనున్న ఫలానుభవాన్ని సిద్ధం చేస్తాయి. జ్ఞానం స్వతంత్రంగా ఆ ఫలానుభవాన్ని ఉత్పన్నం చేయలేదు.

6. (శ్రుతులు) ఇటువంటి వాటి కోసం (వేదాలు ఉద్దేశించాయనుకోవడం వల్ల) (కర్మను) విధిస్తున్నాయి కాబట్టి -

"ఆత్మజ్ఞాన సహితమైన వేదజ్ఞానం కల వారికి మాత్రమే కర్మను శాస్త్రాలు విధిస్తున్నాయి. కాబట్టి జ్ఞానం స్వతంత్రంగా ఏ ఫలితాన్ని ఇవ్వదు."

7. ఇక నిర్ణీత సూత్రాల వల్ల -

"కర్మలనాచరిస్తూ ఇక్కడ మనిషి నూరేళ్ళు జీవించాలని కోరుకొను గాక" (ఈశా - 2);

"అగ్నిహోత్రం వార్ధక్యం, మరణం పర్యంతం నిలిచే యజ్ఞం. వార్ధక్యం ద్వారా, లేదా మరణం ద్వారా దాని నుంచి విముక్తి పొందవచ్చు" (శత. బ్రా. 12.4-1-1)పై ఉల్లేఖనల వల్ల కూడా జ్ఞానం కర్మకు అధీనమేనని తెలుస్తుంది.

జైమినిపై, కర్మకాండ శాస్త్రాలపై బాదరాయణుని వైఖరి ఏమిటి? బాదరాయణుని వేదాంతంపై జైమిని చేసిన విమర్శకు పైన ఉటంకించిన సూత్రాల ద్వారా బాదరాయణుడిచ్చిన సమాధానంలో ఇది స్పష్టమవుతుంది. సమాధానం ఈ కింది సూత్రాలలో ఉంది.[37]

8. (శ్రుతులు) కర్తకంటె భిన్నమయిన (ఉన్నతమైన ఆత్మ) ఉందని బోధిస్తున్నాయి. (శ్రుతుల వల్ల) దాన్ని తెలుసుకోవచ్చు. అందువల్ల బాదరాయణుల దృక్పథం సరయినదే.

"2-7 మధ్య సూత్రాలు మీమాంసకుల దృక్పథాన్ని వివరిస్తున్నాయి. అవి 8-17 మధ్య సూత్రాల్లో ఖండనకు గురయ్యాయి."

వేదాంత గ్రంథాలు కర్త అయిన కొన్ని పరిమితులున్న జీవాత్మను గురించి కాకుండా కర్త కంటే భిన్నమైన ఉన్నత ఆత్మ గురించి బోధిస్తాయి. ఈ విధంగా వేదాంత గ్రంథాల చేత ప్రతిపాదితమైన ఆత్మజ్ఞానం కంటె ఆ కర్త కలిగి వుండే ఆత్మజ్ఞానం భిన్నమైంది. అన్ని పరిమితుల నుంచి స్వేచ్ఛను పొందిన ఆత్మజ్ఞానం కర్మలకు సాయపడకపోగా కర్మలన్నింటికి కూడా చరమగీతం పాడుతుంది. "ఎవరు అంతటినీ సంకల్పిస్తాడో, ఎవనికి అన్నీ తెలుసునో" (ముండకో 1-1-9) "ఓ గార్గి! ఈ అక్షర ప్రశాసనంలో" (బృహ. 3-8-9) మొదలైన గ్రంథ భాగాలను బట్టి వేదాంత గ్రంథాలు ఉన్నతమైన ఆత్మ ప్రతిపాదకాలనీ స్పష్టమవుతుంది.

9. కాని శ్రుతివచనాలు ఉభయ దృక్పథాలను సమానంగా బలపరుస్తున్నాయి.

"3వ సూత్రం వెల్లడించిన అభిప్రాయాన్ని ఈ సూత్రం ఖండిస్తోంది. జనకాదులు జ్ఞానాన్ని పొందినప్పటికీ కర్మలాచరించటంలో తలమునకలయ్యారని అక్కడ చెప్పబడింది. జ్ఞానప్రాప్తి నొందిన వారికి కర్మ లేదనే దృక్పథాన్ని శ్రుతి ప్రమాణం సమానంగా బలపరుస్తుందని ఈ సూత్రం తెలుపుతుంది. "ఆత్మను తెలుసుకొని బ్రాహ్మణులు పుత్రేషణను, విత్తేషణను, లోకేషణను వదులుకుంటారు, సన్యాసి జీవితాన్ని గడుపుతారు" (బృహ. 3-5-1). "యాజ్ఞవల్క్యుని వంటి ఆత్మజ్ఞానులు కర్మలను పరిత్యజించినట్లుగా శ్రుతుల నుంచి మనం కూడా తెలుసుకుం టున్నాం." "అమృతత్వ సాధనమైన ఆత్మజ్ఞానమిదే ప్రియా! అని చెప్పి యాజ్ఞవల్క్యుడు గృహాన్ని వదిలిపెట్టాడు" (బృహ. 4-5-15). జనకాదుల కర్మ నిరాసక్తమయింది కాబట్టి ఆచరణ దృష్ట్యా అది కర్మ కానట్లే, కాబట్టి మీమాంసకుల వాదం బలహీనమైనది.

10. 4వ సూత్రం సూచించిన (శ్రుతి విషయం) విశ్వ జనీనంగా సత్యమైనది కాదు.

ఈ భాగంలోని విషయం ఉద్గీతకు మాత్రమే సంబంధించింది కాబట్టి, జ్ఞానరం యజ్ఞఫల వృద్ధికరమనే (శ్రుతి) వచనం అన్ని జ్ఞానాలకు వర్తించేటువంటిది కాదు.

11. (ఇద్దరు వ్యక్తుల మధ్య) నూరింటిని విభజించినట్టుగానే, జ్ఞాన కర్మల మధ్య విభజన ఉంది.

ఈ సూత్రం అయిదవదైన జ్ఞాన సూత్రాన్ని ఖండిస్తోంది. "జ్ఞానం, కర్మ, పూర్వ అనుభవాలు, దానిననుసరిస్తున్నాయి." (బృహ 4-4-2) ఇక్కడ జ్ఞానకర్మలను పంచుకొనే అర్థంలో అంటే జ్ఞానం ఒకదాన్ని, కర్మ ఇంకొకదాన్ని అనుసరిస్తాయి అని గ్రహించాలి. నూరింటిని ఇద్దరికి ఇమ్మన్నప్పుడు మనం రెండు సమభాగాల్ని చేసి ఒక్కొక్కరికి 50 చొప్పున ఇస్తాము. అంతేకానీ రెండింటినీ కలపటం కుదరదు. ఈ వివరణ లేకుండా కూడా 5వ సూత్రాన్ని తిర స్కరించవచ్చు. ఉదాహృత గ్రంథ భాగం ఆత్మముక్తి గురించి కాకుండా జన్మాంతరాన్ని పొందిన

ఆత్మకు సంబంధించిన జ్ఞానకర్మలను గురించి మాత్రమే సూచిస్తోంది. "జన్మాంతరాన్ని కోరే వ్యక్తి..." (బృహ. 4–4–6) అనే గ్రంథంలోని ముందరి భాగం జన్మాంతరాన్ని పొందే ఆత్మను సూచిస్తుందని "కానీ ఏమీ కోరని మనుష్యుడు (జన్మాంతరాన్ని పొందదు) మొ. (బృహ. 4–4–6) అని ఆత్మ విముక్తిని గురించి శ్రుతి తెలుపుతుంది.

12. వేదాల్ని అధ్యయనం కావించిన వారినుద్దేశించి మాత్రమే (శ్రుతులు కర్మల్ని విధిస్తున్నాయి.)

"ఈ సూత్రం ఆరవ సూత్రాన్ని ఖండిస్తోంది. వేదాల్ని అధ్యయనం కావించిన వారు యజ్ఞాల్ని గురించి ఎరిగిన వారు కర్మకాండలను నిర్వర్తించతగిన వారు. ఉపనిషత్తుల ద్వారా లభించే ఆత్మజ్ఞానం పొందినవారికి కర్మ విధించబడలేదు. ఇట్టి జ్ఞానం కర్మకు తగనటువంటిది.

13. (జైమిని గురించి) ప్రత్యేక ప్రసక్తి లేదు. కాబట్టి (అది అతనికి వర్తించదు.)

ఇది 7వ సూత్రాన్ని ఖండిస్తోంది. అక్కడ ఉదాహృతమైన ఈశోపనిషత్పాఠం స్థూల ప్రకటన, అది జ్ఞానికి కూడా వర్తిస్తుందనే ప్రత్యేక ప్రసక్తి అక్కడ లేదు. ఇటువంటి ప్రత్యేక వివరణ లేని కారణంగా అతనిని (జ్ఞాని) అది బంధించదు.

14. (కర్మను చేయమని) అనుమతించడం (జ్ఞానాన్ని) పొగడటమే.

ఆత్మజ్ఞాన సంపన్నులు కర్మను చేయాలనే విధి ఈ జ్ఞాన వైభవాన్ని చాటటానికే. దీనిలోని ప్రశంస ఇది: ఆత్మజ్ఞాని జీవితాంతం కర్మలను అనుష్ఠించవచ్చు. కాని ఈ జ్ఞానం వల్ల అతడు కర్మఫలబద్ధుడు కాడు.

15. కొందరు వారి అభీష్టానుసారం (కర్మనుష్ఠానం నుంచి విరమించుకున్నారు.)

3వ సూత్రం జ్ఞానాంతరం కూడా జనకుడు మొదలైన వారు కర్మానుష్ఠానం కావించారని చెప్పింది. కొందరు తమంత తాము అన్ని కర్మల్ని వదిలేశారని ఈ సూత్రం చెప్తోంది. జ్ఞానానంతరం ఇతరులకు ఆదర్శవంతంగా ఉండటానికిగాను కొందరు కర్మానుష్ఠానాన్ని ఎంచుకోవచ్చు, మరికొందరు సకలకర్మల్ని పరిత్యజించవచ్చునని ఇది సూచిస్తోంది. కర్మకు సంబంధించినంతవరకు ఆత్మజ్ఞానులపై నిర్బంధం లేదు.

16. (జ్ఞానం వల్ల సకల కర్మాల్ని ఆచరించే అర్హతలు) నశిస్తాయని (శ్రుతులు చెప్తున్నాయి)

జ్ఞానం అజ్ఞానాన్ని దాన్నించి పుట్టిన కర్త, కర్మ, ఫలం – వంటి వాటిని నశింపజేస్తుంది. "కాని ఆత్మజ్ఞానికి అంతా బ్రహ్మమయమవుతుంది. అప్పుడతడు వీక్షించేదేమిటి? వేటి ద్వారా..." మొ. (బృహ. 4–5–15) ఆత్మజ్ఞానం సకల కర్మలకూ విరుద్ధం కాబట్టి, అది (జ్ఞానం) కర్మకు ఎంతమాత్రమూ సహాయపడేది కాదు.

17. వేదాలలో (చతుర్థాశ్రమం పేర్కొబడింది) కాబట్టి సన్యాసాశ్రమాన్ని అవలంబించిన వారికి (సన్యాసులకు) జ్ఞానం చెందుతుంది.

"మునిగా జీవించే సన్యాసాశ్రమం లేదా చతుర్థాశ్రమం జీవిత దశలోనే జ్ఞానలబ్ధి కలుగుతుందని శ్రుతులు ప్రకటిస్తున్నాయి. సన్యాసాశ్రమం స్వీకరించిన వాడికి అతని విచక్షణను తప్ప ప్రత్యేకించి ఏ కర్మా విధించలేము. కాబట్టి జ్ఞానం కర్మకు ఏ విధంగా లోబడి ఉంటుంది? శ్రుతుల వల్ల సన్యాసాశ్రమం అనే జీవిత దశ ఉన్నట్లుగా మనకు తెలుస్తోంది: 'విధి శాఖలు మూడున్నాయి. వానిలో యజ్ఞం' అధ్యయనం, దానమనేవి ప్రధానమైనవి... ఇవన్నీ పుణ్య లోకాలు పొందటానికే. కాగా బ్రహ్మనిష్టుడైన వాడు మాత్రమే అమరత్వాన్ని పొందుతాడు." (ఛాంగో2 33.1–2) "ఈ ప్రపంచాన్ని (ఆత్మను) మాత్రమే ఆకాంక్షిస్తూ సన్యాసులు స్వగృహాల్ని పరిత్యజిస్తున్నారు." (బృహ. 4–4–22) ముగన్ 1–2–11 చాంధో 5.10 శ్లోకాలను కూడా చూడండి. గృహస్థుడు కాకుండా కూడా ప్రతి వ్యక్తీ ఈ (సన్యాసి) జీవితాన్ని స్వీకరించవచ్చుమొ. జ్ఞాన స్వతంత్రతని నిరూపిస్తున్నాయి.

పరస్పరం రెండు దృక్పథాలకు చెందిన ఆలోచనలను సూచించే ఇటువంటి అనేకం బాదరాయణుని సూత్రాల్లో ఉన్నాయి. కానీ అదొక లక్షణమనడానికి ఒక్కటి చాలు. ఈ సంగతి గురించి ఆలోచించటం మానేసినట్లయితే వాస్తవ స్థితి పూర్తిగా స్పష్టమౌతుంది. వేదాంతాన్ని ఒక తప్పుడు శాస్త్రంగా, వలగా, భ్రాంతిగా, పైపైన బోధించిన అనావశ్యకమైనదిగా, అసంతృప్తికరమైనదిగా జైమిని భావించాడు. బాదరాయణుడు ఈ దాడిని దృష్టిలో పెట్టుకొని ఏమి చేసాడు? ఆయన తన వేదాంతశాస్త్రాన్ని సమర్థించుకున్నాడు. జైమిని కర్మకాండ ఖండనం ఒక తప్పుడు మతంగా బాదరాయణుడు అధిక్షేపిస్తాడని ప్రతి ఒక్కడు ఆశిస్తాడు. అయితే బాదరాయణుడు అటువంటి ధైర్యాన్ని ప్రదర్శించలేదు. దానికి భిన్నంగా బాదరాయణుడు సంజాయిషీ ధోరణి అనుసరించాడు. శ్రుతుల ఆధారంగా జైమిని కర్మకాండ ఉందనీ, దాన్ని నిరసించ పనిలేదని ఆయన అంగీకరించాడు. తన వేదాంత సిద్ధాంతం కూడా శ్రుతులే ఆధారంగా కలది కాబట్టి అది కూడా సత్యమేనని ఆయన పట్టుపడతారు. బాదరాయణుని ఈ దృక్పథాన్ని వివరించటానికి కొంత విశదీకరణ అవసరం.

## భగవద్గీత

మహాభారత మహేతిహాసంలోని భీష్మపర్వంలోని భాగంగా భగవద్గీత రూపొందింది. ఈ దాయాదుల ఇతిహాసం ధృతరాష్ట్రు పుత్రులు అయిన కౌరవులు పాండు తనయులైన పాండవుల మధ్య సార్వభౌమాధికారం కోసం జరిగిన సంఘర్షణకు సంబంధించింది. పాండురాజు ధృతరాష్ట్రుని తమ్ముడు. కానీ ధృతరాష్ట్రుడు గుడ్డివాడు కాబట్టి సింహాసనం పాండురాజుకు లభించింది. పాండురాజు మరణానంతరం అతని కుమారులకు ధృతరాష్ట్రుని పుత్రులకు మధ్య వారసత్వ హక్కు కోసం తగాదా ఏర్పడింది. సార్వభౌమత్వం కోసం జరిగిన ఆ సంఘర్షణే (నేటి

పానిపట్టు దగ్గర ఉన్న) కురుక్షేత్ర యుద్ధంగా పరిణమించింది. ఈ యుద్ధంలో కృష్ణుడు పాండవులను సమర్ధించాడు. వారి మార్గదర్శకుడిగా, స్నేహితుడిగా, తాత్వికుడుగా వ్యవహరించాడు. అంతేకాదు. పాండవ సోదరులలో ఒకడైన అర్జునునికి రథసారధిగా పనిచేశాడు. పాండవుల పక్షంలో ప్రధాన యోధుడుగా పాత్ర వహించాడు.

కౌరవ పాండవుల ఉభయ సేనలు రణరంగంలో యుద్ధం కోసం మొహరించాయి. కృష్ణుడు సారథి కాగా రథస్థుడైన అర్జునుడు వచ్చి పాండవ సేనాగ్ర భాగంలో తన స్థానాన్ని గ్రహిస్తాడు. దృఢ ధైర్య సంపన్నుడైన అతడు కౌరవ ప్రతిపక్ష సైన్యాన్ని వీక్షిస్తాడు. సోదరులను చంపవలసి వచ్చేటటువంటి యుద్ధం; తాను గౌరవించే వారిని, తనకు అత్యంత సన్నిహితంగా ఉన్న వారిని, తాను ఋణపడిన వారిని హత్య చేయవలసి వచ్చేటటువంటి భయంకర యుద్ధ బీభత్సం తలుచుకుని అర్జునుడు మాన్పడిపోయాడు. అతడు విషణ్ణుడయ్యాడు, ఆయుధాలను కిందపడవేశాడు, పోరాడ నిరాకరించాడు. కృష్ణుడు అతనితో వాదించనారంభించాడు. పోరాడవలసిందిగా ప్రేరేపించాడు. ఈ వాదం అర్జున శ్రీకృష్ణ భగవానుల మధ్య ప్రశ్నోత్తర సంభాషణ రూపంలో కొనసాగింది. చివరకు అర్జునుడు పోరాడటానికి అంగీకరిస్తాడు.

భగవద్గీతా ప్రారంభంలో ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి యుద్ధం గురించి ప్రశ్నించటం మనం గమనించవచ్చు. యుద్ధం జరిగే ఆ కాలంలో జీవించి ఉన్నప్పటికీ కౌరవుల తండ్రి అయిన ధృతరాష్ట్రుడు గుడ్డివాడైన కారణంగా స్వయంగా చూడలేదు, విషయాల్ని గ్రహించలేదు. కాబట్టి అలా అడిగాడు. జరుగుతున్న సంఘటనల పరిజ్ఞానానికి అతడు ఇతరుల నివేదికలపై ఆధారపడవలసి ఉంది. ధృతరాష్ట్రునికి ప్రామాణిక గాథను నివేదించటానికి ఎవరో ఒకరిని అతడు సంపాదించుకోవటంలోని కష్టాన్ని ముందుగా ఊహించి మహాభారత కర్త అయిన వ్యాసుడు ధృతరాష్ట్ర సారథి అయిన సంజయునికి ధృతరాష్ట్రునికి విశ్వసనీయ నివేదికని ఇచ్చేటట్లుగా యుద్ధక్షేత్రంలో జరుగుతున్న దాన్నంతటిని–మనుషుల మనసులలోని భావాలను సైతం–తెలుసుకునే శక్తిని ప్రసాదించాడని చెప్పటం జరిగింది. ఈ కారణంగానే ధృతరాష్ట్రుని ప్రశ్నలకు సంజయుడిచ్చే సమాధానంగా భగవద్గీతోదంతం కానీ వాస్తవంగా గీత అర్జునకృష్ణుల మధ్య జరిగిన సంభాషణ. కాబట్టే అది కృష్ణార్జున సంవాదమని సరైన పేరును సంతరించుకుంది.

భగవద్గీత అసలు పేరైన కృష్ణార్జున సంవాదంలో యుద్ధం చేయాలా అక్కర్లేదా అనేదే అసమ్మతికి తావలమయిన ప్రధాన ప్రశ్న. ఇతర ప్రశ్న లేదు. ఇద్దరి మధ్య జరిగిన వాదవివాదం, చర్చకు అంశం ఆ ఏకైక ప్రశ్నే. సామాన్య ప్రజానీకానికి నైతిక బోధ చేయటానికి లేదా మత వ్యవస్థకు సంబంధించిన సైద్ధాంతిక విశదీకరణకు లేదా మత విశ్వాస సంబంధమైన ధార్మిక ప్రశ్నోత్తర గ్రంథంగా వెలువరించటానికి (భగవద్గీత) శ్రీకృష్ణుడు ఉద్దేశించలేదనేది స్పష్టం. కాని మొత్తంమీద గీత ఆ రకంగానే పరిణమించింది. యుద్ధం చేయాలా అక్కర్లేదా అని నిశ్చయించుకోవలసిందే అప్పటి సందర్భమైనప్పటికీ, అర్జునునికి కృష్ణుడు చేసిన బోధనలో అతని మత సిద్ధాంతమే ప్రబోధితమైంది.

మొదటగా కలిగే అనుమానం అసలు ఈ కృష్ణుడెవరనేది? గీత నుంచే ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించే అనేక సమాధానాలు ఈ ప్రశ్నకు లభిస్తాయి. కృష్ణుడు మొదట పూర్తిగా మానవ వ్యక్తిత్వం కలవాడుగా, మానవమాత్రుడుగా కన్పిస్తాడు. వృత్తిరీత్యా అతడు యోధుడు. పార్థుని రథసారథిగా ఉండే వినమ్ర విధిని 38 అతడు ఎన్నుకొన్నా అతడు గొప్ప యోధుడు. యుద్ధాన్ని ఆ యుద్ధాదృష్టాల్ని నిర్దేశిస్తూ నియంత్రిస్తూ అతడు మానవుని నుండి మానవాతీతునిగా ఎదిగాడు. మానవాతీతుని నుండి అవతార పురుషునిగా, నియంతగా పెరిగాడు. పోరాడమని అతడు చేసిన వాదనలన్నీ అర్జునుణ్ణి కదల్చలేనపుడు, అతడు అర్జునుణ్ణి పోరాడవలసిందని ఆదేశించేస్తాడు. భీతుడైన అర్జునుడు లేచి అతని ఆజ్ఞల్ని పాటిస్తాడు. అవతార స్థితి నుండి దైవస్థితికీ ఆతర్వాత స్వయం ఈశ్వరుడుగా కృష్ణుడు ఎదిగాడు.

కృష్ణుని వ్యక్తిత్వం ఎలా ఎదుగుతూ వచ్చిందో ఇది తెలుపుతుంది. కానీ, విశేషమేమంటే అదే గీతలో, కృష్ణుడు ఇతర దైవ రూపాలకు కూడా ప్రతినిధిగా కనిపిస్తాడు. గీతను మామూలుగా చదివే వారికి కూడా కృష్ణుడు అటువంటి నాలుగు ప్రాతినిధ్య రూపాలు ధరించాడని అర్థమవుతుంది.

## కృష్ణుడు వాసుదేవుడు:

### భగవద్గీత:

అధ్యా. 10.37. నేను వృష్ణి వంశీయులలో వాసు దేవుడను, పాండవులలో ధనుంజయుడను, మునులలో వ్యాసుడను, ఋషులలో ఉశను (శుక్రాచార్యు)డను.

## భగవంతునిగా కృష్ణుడు:

అధ్యా. 10.12. నీవు పరబ్రహ్మవు, పరంధాముడవు, పరమ పావనుడవు.

## కృష్ణుడు విష్ణ్వవతారం:

అధ్యా. 10.21. నేను ఆదిత్యులలో విష్ణువును, ప్రకాశింపచేసే వాటిలో కిరణాలు కల సూర్యుడను, వాయువు (మరుత్తు)లలో మరీచిని, నక్షత్రాలలో చంద్రుడను.

అధ్యా. 11.24. ఓ విష్ణుమూర్తీ! ఆకాశాన్ని తాకుతున్నటువంటి, ప్రకాశిస్తున్నటువంటి, పెక్కు రంగులున్నటువంటి, తెరచిన నోళ్ళు కల్గినటువంటి, జలిస్తున్న విశాల నేత్రాలు కలిగినట్టి

నిన్ను చూచి మిక్కిలి భయపడ్డ మనసు కలవాణ్ణై ధైర్యాన్ని శాంతిని పొందలేకున్నాను.

అధ్యా. 11.30. ఓ విష్ణుమూర్తీ! మండుతున్న నీ నోళ్ళతో జనులందర్నీ అంతటా మింగుతూ చప్పరిస్తున్నావు. నీ భయంకర కాంతులు తేజస్సులచే ప్రపంచమంతటా వ్యాపించి మిక్కిలి తపింపచేస్తున్నాయి.

అధ్యా. 10.23. రుద్రులలో నేను శంకరుణ్ణి. యక్ష రాక్షసులలో ధనాధిపతిని (కుబేరుణ్ణి), వసువులలో పావకుణ్ణి (అగ్నిని), పర్వతాలలో మేరువును.

కృష్ణుడు బ్రహ్మ:

అధ్యా. 15.15. నేను అందరి హృదయాలలో (దగ్గరగా) ఉన్నాను, నావల్ల జ్ఞాపకశక్తి, జ్ఞానం, మరపు కలుగుతున్నాయి. సర్వ వేదాలచే తెలియదగ్గ వాడిని నేనే. వేదాంతాన్ని నిర్మించిన వాణ్ణి, వేదాన్ని ఎరిగిన వాణ్ణి నేనే.

అధ్యా. 15.16. ప్రపంచంలో క్షరుడనీ, అక్షరుడనీ ఇద్దరు పురుషులున్నారు. అన్ని భూతాలు (సమస్త ప్రాణుల దేహాలు) క్షరుడనీ, కూటస్థుడు (కూటస్థుడైన జీవుడు) అక్షరుడనీ చెప్పబడుతున్నారు.

అధ్యా. 15.17 ఎవడు ముల్లోకాల్లోను ప్రవేశించి (వాటిని) భరిస్తున్నాడో (అటువంటి) నాశరహితుడైన ప్రభువు, (క్షరాక్షరుల కంటే) వేరైన ఉత్తమ పురుషుడు పరమాత్మ అని చెప్పబడుతున్నాడు.

అధ్యా. 15.18. నేను క్షర స్వరూపిని (కంటే) మించినవాణ్ణి. అక్షర స్వరూపుని కంటే శ్రేష్ఠుణ్ణి అయినందువల్ల లోకంలోను వేదాంతంలోను పురుషోత్తముడు అని ప్రసిద్ధికెక్కి ఉన్నాను.

అధ్యా. 15.19. భరత వంశంలో జన్మించిన ఓ అర్జునా! ఎవడు అజ్ఞానం లేని వాడై ఈ విధంగా నన్ను పురుషోత్తమునిగా తెలుసుకుంటున్నాడో అతడు సమస్తం తెలిసినవాడై పూర్తి మనస్సుతో నన్ను పూజిస్తున్నాడు.

తర్వాతి ప్రశ్నను అడగండి.

కృష్ణుడు అర్జునునికి బోధించిన సిద్ధాంతమేమిటి? కృష్ణుడు అర్జునునికి బోధించిన సిద్ధాంతాన్ని జీవాత్మకు మోక్ష (సాధక) సిద్ధాంతంగా పేర్కొంటున్నారు. మోక్షానికి సంబంధించిన ప్రశ్న గురించి కృష్ణుడు వివరించవలసి ఉండగా కృష్ణుడు మూడు భిన్నమోక్ష సిద్ధాంతాలను బోధించాడు.

1) సాంఖ్య యోగంచే ప్రతిపాదితమైన ధ్యాన మార్గం ద్వారా మోక్షం సాధ్యం.

అధ్యా. 2.39. పృథాపుత్రుడవైన ఓ అర్జునా! సాంఖ్యశాస్త్రంలో చెప్పబడ్డ ఆత్మజ్ఞానం గురించి నీకు చెప్పాను. ఎటువంటి వివేకంతో కూడిన వాడవై కర్మ బంధాన్ని వదులుతావో అటువంటి కర్మయోగ విషయంలో (చెప్పబోయే) బుద్ధిని గురించి విను.

ఇది ద్వితీయాధ్యయం 11 నుండి 16 వరకు, 18 నుండి 30 వరకు, ఉన్న శ్లోకాలలో చర్చితమైన సాంఖ్యయోగ సంవాదనలోని ముగింపు శ్లోకం.

2) కర్మమార్గం ద్వారా మోక్షం సాధ్యం.

అధ్యా. 5.2. కర్మత్యాగం కర్మయోగం అనే రెండూ మోక్షాన్ని కలిగిస్తాయి. ఆ రెండింటి లోనూ కర్మత్యాగం కంటే కర్మయోగమే శ్రేష్టమైనది.

3) భక్తిమార్గం ద్వారా మోక్షం సాధ్యం.

అధ్యా. 9.13. ఓ పృథాపుత్రుడవైన అర్జునా! మహాత్ములైతే దివ్య ప్రకృతిని పొందిన వారై నన్ను సమస్త ప్రాణులకు ఆదికారణునిగాను, నాశరహితునిగానూ ఎరిగి అనన్య మనస్కులై భజిస్తున్నారు.

అధ్యా. 9.14. (వారు) ఎల్లప్పుడూ నన్ను కీర్తిస్తూ, దృఢ వ్రతనిష్ఠులై ప్రయత్నిస్తూ, భక్తితో నాకు నమస్కరిస్తూ, సదా నాయందు చిత్తముంచినవారై ఉపాసిస్తున్నారు.

అధ్యా. 9.15. మరికొందరు కూడా జ్ఞానయజ్ఞంచే (అంటే అందరిలోనూ తమనే చూస్తూ) పూజిస్తున్న వారై ఏకత్వంతోనూ పృథక్త్వంతోనూ నానాత్వంతోను విశ్వరూపుడనైన నన్ను ఉపాసిస్తున్నారు.

అధ్య. 9.17. ఈ ప్రపంచానికి నేనే తండ్రిని, నేనే తల్లిని, సంరక్షకుడను, తాతను, తెలుసుకోదగ వసువును, పావన పదారాన్ని, ఓంకారాన్ని, ఋక్సామయజుర్వేదాల్ని.

అధ్యా. 9.22. ఏ జనులు మమేకమై నన్ను గూర్చి ధ్యానిస్తున్నారో, ఎల్లప్పుడు (నాయందే) నిష్ఠ కలిగి యున్న (అట్టి) వారి యోగక్షేమాలను నేనే వహిస్తున్నాను.

దృష్టిని అరికట్టే భగవద్గీతకు సంబంధించిన రెండు ఇతర ఆకర్షక ముఖ్య లక్షణాలున్నాయి.

(i) వేదాల వైదిక విధుల యజ్ఞయాగాదుల లఘూకరణ భావన (భగవద్గీతలో) ఉంది.

అధ్యా 2.42–42: ఓ పార్థా! సుఖాలపై, అధికారంపై తీవ్రమైన అనురక్తి కలిగిన వారికీ, అవివేకుల తియ్యటి మాటలకు విచక్షణ కోల్పోయే వారికీ, కోరికలతో నిండిపోయి, స్వర్గాన్ని తమ పరమ లక్ష్యంగా భావించే వారికీ, వేదాలలోని స్తోత్రపాఠాలలో మైమరచిపోతూ వాటిలో మరేమీ లేదని ప్రకటించే వారికీ మనో నిశ్చయం అలవడదు. క్రతువుల ద్వారా ఆనందాన్నీ, అధికారాన్నీ సాధించవచ్చుననే వాదనలతో వారి మాటలు ఉద్వేగంగా ఉంటాయి. వాంఛలతో ఆచరించిన కర్మల కారణంగా వారు మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ వుంటారు.

అధ్యా. 2.45. ఓ అర్జునా! వేదాలు త్రిగుణాత్మక విషయాలను తెలిపేవి. నీవు త్రిగుణాల నుంచి ముక్తుడవు కా! ద్వంద్వాలు లేని వాడవు, నిరంతర శుద్ధతత్వాన్ని ఆశ్రయించిన వాడవు, ఆర్జన సంరక్షణల దృష్టి లేని వాడవు, ఆత్మజ్ఞానివికా.

అధ్యా. 2.46. అంతటా వరద ఉన్నప్పుడు జలాశయానికి (నీటివల్ల) ఎంత ప్రయోజనమో ఆత్మ జ్ఞాన సంపన్నుడైన బ్రాహ్మణునకు అన్ని వేదాలలోని ప్రయోజనం ఆమాత్రమే.

అధ్యా. 9.21. (స్వర్గాభిలాషులైన) వారు విశాల స్వర్గలోకాన్ని అనుభవించి పుణ్యం క్షీణం కాగా మర్త్య లోకాన్ని (మరల) ప్రవేశిస్తున్నారు. ఈ ప్రకారంగా మూడు వేదాలలో చెప్పబడ్డ కర్మల్ని సకామంగా అనుష్ఠించేటటువంటి వారు (నిరంతరం) వస్తూపోతూ ఉంటారు.

(అసంపూర్ణం)

అనువాదం: డా. పి.ఆపదరావు, ఆచార్య లకంసాని చక్రధరరావు.

## :అధస్సూచికలు:

1. చూ. అతని "ఇంట్రడక్షన్ టు భగవద్గీత" ఇంగ్లీషు అనువాదం. -ప్రొఫెసర్ ఉట్గీగార్.

2. గీత అధ్యాయ XIII. శ్లో. 4.

3. ప్రొఫెసర్ హాప్‌కిన్స్. "ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా" పే. 389.

4. హిందీ సంస్కృతీ అనీ అహింస. పే. 156.

5. ప్రొఫెసర్ హాప్‌కిన్స్. "ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా" పే. 62.

6. "ది రిడిల్ ఆఫ్ ది రామాయణ". అధ్యా. 11. పే. 6.

7. చూ. అనుబంధం. A. ప్రొఫెసర్ హాప్కిన్స్-"ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా". ఈ రెండు ఇతిహాసాలలోని సమాంతర విషయాల వివరణ దానిలో వుంది.

8. "సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్" గ్రంథ మాలికలో అతని భగవద్గీత అనువాదం పీఠిక.

9. "గీతా రహస్య" (ఇంగ్లీషు అనువాదం). వాల్యూమ్. II. పే. 800. తిలక్ అభిప్రాయంలో మూల గీత రచనా కాలం ఎన్నో శతాబ్దాలకు ముందు.

10. ప్రొఫెసర్ ఉట్గీకర్ భగవద్గీత ఆంగ్లానువాద పీఠిక.

11. గీత. అధ్యాయ. XIII. శ్లో. 4.

12. గీత. అధ్యాయ XIII. పు. 3.

13. భండార్కర్ మెమోరియల్ వాల్యూమ్.

14. వాస్తవంగా వైదిక వాఙ్మయంలోని కర్మకాండ భాగ క్రమబద్ధీకరణం రెండు రకాలైన గ్రంథాల రచనకు అవకాశం కల్పించింది. అవి (1) కల్పసూత్రాలు. (2) పూర్వమీమాంస సూత్రాలు. మొదటివి బ్రాహ్మణాలలో పేర్కొనబడిన కర్మకాండల లఘు వివరణతో కూడినవి. ఇక రెండవ గ్రంథాలైన పూర్వ మీమాంస సూత్రాలు. కల్పసూత్రల కర్త సాధారణ సిద్ధాంతాలను అనుసరిస్తూ, వాటిని విపులంగా వ్యాఖ్యానిస్తాయి. వేదవిహితంగా ఆ సూత్రాలను పాటించవలసిన తీరును వివరిస్తాయి.

15. ఇవి పూర్వ మీమాంస లేక కర్మ మీమాంస అని కూడా పిలవబడతాయి.

16. వీటికి ఇంకా ఇతర పేర్లు అనేకం ఉన్నాయి. ఉత్తర మీమాంస, బ్రహ్మ సూత్రాలు, శారీరక సూత్రాలు లేక శారీరక మీమాంస సూత్రాలు అనే పేర్లవి.

17. కాణే ఇలా చెప్పాడు. "జైమిని గురించి తెలిసింది దాదాపు ఏమీలేదు. జైమిని రచనలుగా ఒక బ్రాహ్మణం, ఒక శ్రౌత సూత్రం, ఒక సూత్రం కన్పిస్తాయి. కానీ ఇవి పూర్వ మీమాంస స్థాపకుడివే అని చెప్పటం కష్టం. ఆశ్వలాయన గృహ్య సూత్రంలో-తర్పణలో- జైమిని-సుమంత, వైశంపాయనులతో కనబడతాడు. భాగవత పురాణంలో జైమిని సుమంతుని గురువుగా; సామ వేద ప్రచారకుడుగా పేర్కొనబడ్డాడు. మీమాంసా కర్త అయిన జైమిని ఒక ఏనుగుచేత తొక్కి

చంపబడ్డాడని పంచతంత్రం చెబుతోంది–"ఎ బ్రీఫ్ స్కెచ్ ఆఫ్ ది పూర్వ మీమాంస సిస్టమ్'–పే. 12.

18. చూ. బెల్వాల్కర్: బాసు మల్లిన్ లెక్చర్ ఆన్ వేదాంత లెక్చర్. IV.

19. చూ. రాధాకృష్ణన్: ఇండియన్ ఫిలాసఫీ. వాల్యూమ్. II. పే. 430. దీనిలో ఈ విషయానికి సంబంధించి సాక్ష్యాలన్నీ సేకరించి ఒక్కచోట ప్రదర్శించబడ్డాయి.

20. ప్రొఫెసర్ హాప్కిన్స్. "ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా." పే. 389.

21. హిందీ సంస్కృతీ అని అహింసా. (మరాఠీ).

22. హాప్కిన్. "ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా." పే. 62

23. "ది రిడిల్ ఆఫ్ ది రామాయణ". అధ్యా. II. పే. 6.

24. చూ. అనుబంధం-A ప్రొఫెసర్ హాప్కిన్స్ "ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా"–ఈ రెండు ఇతిహాసాలలోని సమాంతర విషయాల వివరణ దీనిలో వుంది.

25. నేను పురాణాల గురించి చేసిన వివరణ అంతా కాలే 'పురాణ నిరీక్షణ' (మరాఠీ); పార్టిగర్ 'ఏన్షియంట్ ఇండియన్ హిస్టారికల్ ట్రెడిషన్' అనే గ్రంథాల నుంచి సేకరించినటువంటిది.

26. ఆది పురాణమనేది ఆ పేరుగల ఒక ప్రత్యేక పురాణం కాదు. అష్టాదశ పురాణాల్లో ప్రతిదాని మొదటి కూర్పును ఆ పేరుతో పిలుస్తారు.

27. విక్రమాదిత్యుడు ఎవరు? ఎవరు చెప్పలేరు.

28. హజారా కల్పజోక్తి (కల్పశుద్ధికి బదులుగా) గురించి చెప్పాడు. దీనికి అర్థం అనేక యుగాలుగా సంక్రమించిన విజ్ఞానమని. చూ. క్రోనాలజీ ఆఫ్ పురాణాస్. పే. 4.

29. 'కల్ప' శబ్దం అనేక అర్థాల్లో ఉపయోగించబడింది. (1) శక్యమైన (2) తగిన. (3) సమర్థమైన. కల్పశబ్దం ఇంకా అనేక ఇతర అర్థాల్లో ప్రయోగించబడింది. (1) పవిత్ర శాసనం (2) నిర్ణీత ప్రత్యామ్నాయం. (3) మతాచార విధులను నిర్వహణతో సిద్ధించేది. (4) విశ్వ ప్రళయం. యుగాంతం. (5) బ్రహ్మయుగంలో ఒకరోజు. (6) రోగికి వైద్య చికిత్స. (7) వేదషడంగాలలో ఒకటి–మతాచార విధులు, కర్మకాండలు, యజ్ఞయాగాది విధులు విధించబడినటువంటిది.

30. (1) విష్ణు (2) భాగవత (3) నారద (4) వామన (5) గరుడ పురాణాలు.

31. (1) శివ (2) బ్రహ్మ (3) లింగ (4) వరాహ (5) స్కాంద (6) మత్స్య (7) కూర్మ (8) బ్రహ్మాండ పురాణాలు.

32. పద్మ పురాణం.

33. అగ్ని పురాణం.

34. పార్టిగర్.

35. బాసుమల్లిక్ లెక్చర్స్. పే. 152.

36. స్వామి వీరేశ్వరానంద–బ్రహ్మ సూత్రాలు (అద్వైతాశ్రమ ప్రతి. 1936) పేజీలు 408–411.

37. స్వామి వీరేశ్వరానంద– బ్రహ్మసూత్రాలు. పేజీలు 411–416.

38. కౌరవుల నాయకుడు దుర్యోధనుడు. అతనికి కృష్ణునికి మధ్య జరిగిన ఒప్పందం ఫలితమిది. వాస్తవంగా యుద్ధానికి ముందు దుర్యోధనుడు కృష్ణుని దగ్గరకు వెళ్ళ కౌరవుల తరఫున చేయమని కోరాడు. కృష్ణుడు తనను గానీ; లేక యాదవ సైన్యాన్ని గానీ కోరుకోమన్నాడు. దుర్యోధనుడు యాదవ సైన్యాన్ని కోరుకున్నాడు. ఈ కారణం చేత కృష్ణుడు, యాదవ సైన్యం విరోధులుగా పోరాడుకోవటం జరిగింది.

# అధ్యాయం – 11

# బ్రాహ్మణ మత విజయం : రాజహత్య లేదా ప్రతివిప్లవావిర్భావం

[ఈ శీర్షికన టైప్ చేసిన పేజీలు మూడు మాత్రమే మాకు లభించాయి. అదృష్టవశాత్తు శ్రీ యస్.యస్.రెజ్ దగ్గర ఈ వ్యాసం ప్రతి లభించింది. అయితే ఆయన అందజేసిన వ్యాసంలో అక్కడక్కడా కొన్ని పేజీలు (మూడు నుంచి ఏడు, తొమ్మిది నుంచి పదిహేడు పేజీలు) లేవనే విషయం తెలిసింది. దొరకని పుటలతో కూడా కలిపి ఈ వ్యాసం మొత్తం తొంభై రెండు టైప్డ్ పేజీలు. రెజ్ ఇచ్చిన వ్యాసం ప్రతి "బ్రాహ్మణ మత విజయం" అనే శీర్షికతో ఉంది. కానీ మా వద్ద ఉన్న పేజీల్లోని మొదటి పేజీలో "రాజహత్య లేక ప్రతివిప్లవావిర్భావం" అని ఉంది. మా ప్రతిలో ఈ విషయాన్ని పదకొండు అధ్యాయాలుగా విభజించినట్లు ఉంది. కానీ రెజ్ ఇచ్చిన ప్రతిలో ఆ ప్రస్తావన లేదు. శీర్షిక, అధ్యాయాలు–రెండూ డా. అంబేద్కర్ స్వీయ దస్తూరీతోనే ఉన్నాయి. అందుకే ఈ ముద్రణలో వాటిని యధాతథంగా ఉంచాము. అనుకోకుండా, 9 నుంచి 17 వరకు ఉన్న పేజీలు ఇంకో ఫైలులో కన్పించాయి. ఆ పేజీలన్నిటినీ ఈ వ్యాసంలో సరైన స్థానంలో పొందుపరచి, ప్రకటిస్తున్నాం. 4 నుంచి 7 దాకా ఉండాల్సిన పేజీలు తప్ప మిగిలిన వ్యాసమంతా సమగ్రమైందే. –సంపాదకులు.]

## I

I. బౌద్ధమతంపై బ్రాహ్మణుల తిరుగుబాటు.

II. బ్రాహ్మణమత దూత (ప్రవర్తకుడు) మనువు.

III. బ్రాహ్మణమతం – బ్రాహ్మణుల పరిపాలన హక్కు – రాజహత్య హక్కు.

IV. బ్రాహ్మణమతం – బ్రాహ్మణుల విశేష హక్కులు.

V. బ్రాహ్మణమతం – కులాల సృష్టి.

VI. బ్రాహ్మణమతం – బ్రాహ్మణేతరుల న్యూనీకరణ.

VII. బ్రాహ్మణమతం – శూద్రుల అణచివేత.

VIII. బ్రాహ్మణమతం – స్త్రీల అణచివేత.

IX. బ్రాహ్మణమతం – సాంఘిక వ్యవస్థా న్యాయ బద్ధీకరణం.

ప్రొఫెసర్ బ్లూంఫీల్డు వైదిక మతంపై తన ప్రసంగాలను ప్రారంభిస్తూ భారతదేశం గురించి

ఇలా అంటాడు: "అనేకార్థాలలో హిందూదేశం మతాల భూమి. ఇది తన వనరులతో అనేక విశిష్ట వ్యవస్థలను శాఖలను సృష్టించింది.....

ఇంకో విధంగా చెప్పాలంటే హిందూదేశం మతాల భూమి. మతాచారాలను అవలంబించే విషయంలో కాని, సంప్రదాయాల్ని పాటించే విషయంలో కాని హిందూదేశంలాంటిది ప్రపంచంలో మరెక్కడా కనిపించదు."[1]

ఈ పరిశీలనలో ఎంతో సత్యముంది. హిందూ దేశం పరస్పరం పోరాడుకునే మతాల భూమి అని చెప్పి ఉంటే అతడు ఇంకా ప్రగాఢంగా, ఆకర్షకంగా సత్యాన్ని చెప్పినట్లుండేది. వాస్తవానికి హిందూదేశ చరిత్రలో మతం తన పాత్రను నిర్వహించినంత గొప్పగా మరే దేశంలోను మతం ఆదేశ చరిత్రలో ఇంత ప్రధానమైన పాత్రను నిర్వహించలేదు. హిందూదేశ చరిత్ర బౌద్ధ మత బ్రాహ్మణ మతాల మధ్య జరిగిన ప్రాణాంతక పరస్పర సంఘర్షణల చరిత్ర మాత్రమే. ఎవ్వరూ వెంటనే అంగీకరించలేనంతగా ఈ సత్యం ఉపేక్షకు గురయింది. ఇటువంటి సూచనను నిరాకరించే వ్యక్తులకు నిజంగానే కొదవలేదు.

కాబట్టి హిందూదేశ చరిత్రకు సంబంధించిన ముఖ్య వాస్తవాలను సంగ్రహంగా నన్ను చెప్పనివ్వండి. ఎందుకంటే అది (చరిత్ర) బ్రాహ్మణ మత, బౌద్ధ మతాల మధ్య ఆధిక్యం కోసం జరిగిన సంఘర్షణల చరిత్ర మాత్రమే అని హిందూదేశ చరిత్రను అర్థం చేసుకొనే శక్తిగల ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసి ఉంది. ఇది చాలా ముఖ్యం.

భారతదేశాన్ని జయించిన, స్వగృహంగా చేసుకొని మత సంస్కృతిని స్థాపించుకున్న ఆర్యుల రాకతో భారత హిందూ దేశ చరిత్ర ప్రారంభమైనట్లుగా చెప్తారు. ఆర్యుల గుణగణాలు, సంస్కృతి, మతం, సంఘ వ్యవస్థ ఎంత గొప్పవైనప్పటికీ, వారి రాజకీయ చరిత్రను గురించి మనకు తెలిసింది తక్కువే. ఆర్యేతరులపై ఆర్యులు చెప్పుకునే చెప్పుకునే ఆధిక్యంతో నిమిత్తం లేకుండా, చరిత్ర ఆధారంగా ఆర్యుల రాజకీయ సాఫల్యాలను గురించి తెలిసింది చాలా తక్కువే. బలాఢ్యులయిన నాగాలని వ్యవహరించబడే ఆర్యేతర ప్రజల ఆధిక్యంతో భారతదేశ చరిత్ర ప్రారంభమవుతుంది. వీరిని ఆర్యులు జయించలేకపోయారు. వీరితో ఆర్యులు సంధి చేసుకోవలసి వచ్చింది. దానితో వారిని ఆర్యులు తమతో సమానులుగా గుర్తించవలసిన అగత్యం ఏర్పడింది. ప్రాచీన కాలంలో రాజకీయ రంగంలో భారతదేశం ఏమాత్రం పేరు ప్రఖ్యాతులు, వైభవం గడించినా ఆ ప్రతిష్ఠ అంత పూర్తిగా ఆర్యేతర నాగాలకే దక్కుతుంది. ప్రపంచ చరిత్ర పుటలలో భారతదేశ ఘనతను, వైభవాన్ని సుస్థిరపరచిన వారు నాగాలే.

క్రీ.పూ. 642 సంవత్సరంలో బీహారులో మగధ స్థాపన భారతదేశ రాజకీయ చరిత్రలో తొలి మైలురాయిగా చెప్పవచ్చు. శిశునాగ[2] పేరుతో ప్రసిద్ధుడైన మగధ రాజ్యస్థాపకుడు ఆర్యేతర నాగజాతికి చెందినవాడు.

మగధ సామ్రాజ్యం ప్రారంభంలో చిన్నదే అయినా ఆతర్వాత సమర్థులైన శిశునాగ వంశీయులు దాన్ని బాగా అభివృద్ధి చేశారు. ఈ వంశంలోని ఐదవ తరం వాడయిన బింబి సారుని హయాంలో ఈ రాజ్యం సామ్రాజ్యమైంది; మగధ సామ్రాజ్యంగా పేరు ప్రఖ్యాతుల్ని పొందింది. శిశు నాగవంశీకుల పాలన క్రీ.పూ. 413 దాకా కొనసాగింది. ఆ సంవత్సరంలో శిశునాగవంశ చక్రవర్తి మహానందుడు మహా సాహసికుడైన నందుని చేతిలో మరణించాడు. నందుడు మగధ సింహాసనాన్ని ఆక్రమించి నంద వంశాన్ని స్థాపించాడు. నంద వంశం మగధ సామ్రాజ్యాన్ని క్రీ.పూ. 322 దాకా పరిపాలించింది. మౌర్య వంశ స్థాపకుడైన చంద్రగుప్తుడు చివరి నందరాజును పదవీచ్యుతుణ్ణి కావించాడు. చంద్రగుప్తుడు శిశునాగ వంశంలో చివరి పాలక చక్రవర్తి కుటుంబానికి చెందినవాడు. చంద్రగుప్తుడు సాధించిన విప్లవం వాస్తవంగా మగధ నాగ సామ్రాజ్య పునఃస్థాపన అని చెప్పవచ్చును.

తమకు వారసత్వంగా సంక్రమించిన మగధ సామ్రాజ్య సరిహద్దులను మౌర్యులు తమ విజయాల వల్ల అధికంగా విస్తరించారు. అశోకుని (పరిపాలనా కాలంలో అతని) ఆధీనంలోని సామ్రాజ్యమెంత వృద్ధి పొందిందంటే ఆ సామ్రాజ్యం దానికున్న పేరుతో కాక మరో పేరుతో ప్రసిద్ధమైంది. అదే మౌర్య సామ్రాజ్యం లేదా అశోకుని రాజ్యంగా పేరు పొందింది. *ఇక్కడి నుండి–రాత ప్రతిలో 4 నుండి 7 దాకా ఉన్న పుటలు లభించలేదు. సం.*

ఆనాడున్న అనేక మతాలలో ఒకటిగా అది వుండిపోలేదు. అశోకుడు దాన్ని రాజ్యమతంగా చేశాడు. ఇది బ్రాహ్మణ మతానికి తీవ్ర విఘాతమే. అశోక సామ్రాజ్యంలో బ్రాహ్మణులకు రాజ్యపోషణ కరువైంది. వారిని ద్వితీయ శ్రేణి పౌరులుగా చూడ్డంతో, తీవ్ర నిరాదరణకు గురయ్యారు. బ్రాహ్మణమతంలో ప్రధానమైన జంతుబలుల నిషేధంతో బ్రాహ్మణుల అణచివేతకు శ్రీకారం చుట్టటం జరిగిందని చెప్పవచ్చు. యజ్ఞాచరణ వృత్తిని కూడా వారు కోల్పోయారు. ఈ యజ్ఞాలు తరచుగా చేయటం వల్ల కూడా బ్రాహ్మణులకు సంభావన బాగా ముట్టేది. కాబట్టి మౌర్య సామ్రాజ్యం అంతమయ్యేదాకా అంటే దాదాపు 140 సంవత్సరాలపాటు బ్రాహ్మణులు అణచివేతకు గురయిన వర్గాలుగా బ్రతికారు.[3] బౌద్ధ రాజ్యంపై తిరుగుబాటు ఒక్కటే పీడితులైన ఆ బ్రాహ్మణులకు మిగిలిన ఏకైక మోక్షమార్గం. మౌర్య పాలనపై తిరుగుబాటు జెండాను ఎగరవేయటానికి పుష్యమిత్రునకు ప్రత్యేక కారణముంది. పుష్యమిత్రుడు శుంగ గోత్రీకుడు. శుంగులు పశుబలులను, సోమయాగాలను చేసే సామవేది బ్రాహ్మణులు.[4] కాబట్టి అశోకుని శిలా శాసనంలో ప్రకటించిన విధంగా మౌర్య సామ్రాజ్యమంతటా జంతుబలుల నిషేధం వల్ల శుంగులు తీవ్రంగా బాధపడటం సహజం కూడా. సామవేది బ్రాహ్మణుడయిన పుష్యమిత్రుడు బ్రాహ్మణుల హీనస్థితికి కారణమైన బౌద్ధరాజ్య నాశనం ద్వారా బ్రాహ్మణుల హీనస్థితికి మంగళం పాడాలని,[5] బ్రాహ్మణ మతాన్ని ఆచరించేటందుకుగాను వారికి స్వేచ్ఛను ప్రసాదించాలని ప్రథమంగా వాంఛించాడనటంలో ఆశ్చర్యం లేదు.

అప్పటిదాకా రాజ్యమతం హోదాలో ఉన్న బౌద్ధమతాన్ని నాశనం చేయటం, బ్రాహ్మణులను

భారతదేశ సార్వభౌమ పరిపాలకులుగా రూపొందించటం పుష్యమిత్రుని రాజహత్యల లక్ష్యం. రాజ్య రాజకీయ శక్తి వెనుక ఉండగా బ్రాహ్మణమతం బౌద్ధమతంపై విజయం సాధించగలుగు తుంది. దీన్ని రెండు ఇతర పరిస్థితులు నిర్ధారిస్తున్నాయి.

మొదటిది పుష్యమిత్రుని ప్రవర్తనకు సంబంధించింది.

పుష్యమిత్రుడు సింహాసనం అధిష్ఠించిన తర్వాత అశ్వమేధ యజ్ఞం నిర్వహించాడనటా నికి సాక్ష్యముంది. అశ్వమేధ యజ్ఞం సర్వోన్నత సార్వభౌముడు మాత్రమే నిర్వహించవలసిన వైదిక విధి. ఈ విషయంలో విన్సెంట్ స్మిత్ పరిశీలన ఇది.

బౌద్ధమత ప్రధాన లక్షణమైనటువంటిది. అశోకుని శాసనాలలో నిర్దేశింపబడునటువంటిది అయిన జీవకారుణ్య పవిత్ర భావన—బ్రాహ్మణ ప్రభువులకు అత్యావశ్యకమైనటువంటిదీ మోక్ష మార్గంగా సనాతన బ్రాహ్మణులు భావించేది అయిన జంతుబలి నిషేధానికి కారణమయింది. దీనికి వ్యతిరేకంగా బ్రాహ్మణుల ప్రతిస్పందన పుష్యమిత్రుని అశ్వమేధ యజ్ఞంలో తొలిసారి కన్పి స్తుంది. అదే 500 సంవత్సరాల తర్వాత తిరిగి సముద్రగుప్తుడు అతని వారసుల హయాంలో పరాకాష్టకు చేరింది.

సింహాసనాన్ని అధిరోహించిన తర్వాత పుష్యమిత్రుడు బౌద్ధ మతస్తులకు, బౌద్ధమతానికి వ్యతిరేకంగా తీవ్ర హింసాత్మక దాడి ఆరంభించాడనటానికి సాక్ష్యముంది.

పుష్యమిత్రుని బౌద్ధమత హింస ఎంత నిర్దయగా ఉందో బౌద్ధ సన్యాసులకు వ్యతిరేకంగా అతడు వేయించిన దండోరా పట్ల అర్థమవుతుంది. ఒక్కో బౌద్ధ భిక్షువు తలకు 100 బంగారు నాణాలను వెలకట్టటం[6] పుష్యమిత్రుని బౌద్ధమత వ్యతిరేకతకు పరాకాష్ట.

పుష్యమిత్రుని హాయంలోని బౌద్ధ మతస్థుల(పై జరిగిన) హింసను గూర్చి తెలుపుతూ డాక్టర్ హరిప్రసాద్ శాస్త్రిగారు ఈ విధంగా పేర్కొన్నారు.[7]

"ఛాందసులు, పరమత సహనం లేనివారు అయిన శుంగుల సామ్రాజ్య పాలనలో బౌద్ధ మతస్తుల స్థితి ఎలా వుండేదో ఊహించుకోవచ్చు. చాలామంది బౌద్ధ భిక్షువులు ఇప్పటికీ పుష్యమిత్రుడంటే చాలు మండిపడతారు. తిట్టడానికి తప్ప ఆ పేరు ఉచ్చరించరనేది చైనా యాత్రికుల వల్ల తెలిసింది.."

# II

పుష్య మిత్రుని విప్లవం కేవలం రాజకీయ పరమైనది కాదు. అదే నిజమైతే అతడు అంత క్రూరంగా బౌద్ధ భిక్షువుల్ని హతమార్చవలసిన అవసరం లేదు. హిందూమత వినాశనానికి ఒకపుడు గజనీ అవలంబించిన క్రూర పద్ధతులకు ఇది ఏమాత్రం తీసిపోలేదు. దీన్నిబట్టి బౌద్ధమత నాశనమే పుష్యమిత్రుని ప్రధాన ధ్యేయంగా చెప్పవచ్చు.

మౌర్యులకు వ్యతిరేకంగా పుష్యమిత్రుడు చేసిన విప్లవం–మనుస్మృతికి శాసనసరూపం కల్పించటం ద్వారా–బ్రాహ్మణమతాన్ని స్థాపించటానికి మార్గాన్ని సుగమం చేసింది. ఇంతకంటె సాక్ష్యం మరేం కావాలి.

మనుస్మృతి దైవికమయిందని చాలామంది చెప్తారు. స్వయంభువు [సృష్టికర్త] మనువుకి చెబితే, మనువు మానవులకు వెల్లడించాడట. దాన్నే "మనుస్మృతి" అన్నారు. ఈ విషయం మనుస్మృతిలోనే స్పష్టంగా ఉంది. ఇలాంటి ప్రతిపాదన చేయటానికి వెనుక ఉన్న కారణాలను గురించి ఎవరు పట్టించుకోకపోవటం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. భారతదేశ చరిత్రలో మనుస్మృతి ప్రాముఖ్యాన్ని, స్థితిని గురించి తెలుసుకోవటంలో చాలామంది పూర్తిగా విఫలుర య్యారనటానికి ఇది తిరుగులేని సాక్ష్యం. భారతీయ సమాజం పొందిన సాంఘిక పరివర్తనా మహా విప్లవానికి మనుస్మృతి గ్రంథరూపం (రికార్డు) అని చరిత్రకారులు చెప్పడం కద్దు. అయితే మనుస్మృతిలో ప్రతిపాదితమైన గ్రంథకర్తృత్వ విషయం మోసపూరితం. ఈ తప్పుడు ప్రతిపా దన వల్ల వెలువడ్డ విశ్వాసాలు ఏమాత్రం సమర్థనీయాలు కావు. ఈ విషయంలో ఎటువంటి సందేహమూ లేదు.

మనువు అనే పేరుకు ప్రాచీన భారతదేశ చరిత్రలో గొప్ప ప్రతిష్ఠ ఉంది. పురాతన ప్రతిష్ఠ ఆసరాగా తీసుకొని నియమావళికి ఔన్నత్యం కల్పించే ఉద్దేశంతో గ్రంథ కర్తృత్వాన్ని మనువుకు ఆపాదించారు. ఇది ప్రజలను మోసగించటానికి చేసిన వంచన అనటం నిర్వివాదాంశం. (మను) స్మృతి భృగు వంశం పేరుతో కన్పించటం ప్రాచీన సంప్రదాయానికి నిదర్శనం. ఈ గ్రంథం అసలు పేరు[8] 'భృగుకృత సంహిత' "మనుధర్మ నియమావళి" అనే పేరు కూడా ఉంది. ఈ స్మృతి ప్రతి అధ్యాయానికి చివర భృగు నామాంకమై ఉంది. కాబట్టి స్మృతికర్త వంశనామం మనకు లభ్యమైంది. కానీ గ్రంథంలో రచయిత అసలుపేరు ఎక్కడా కన్పించదు. అదే సమయంలో అతని పేరు చాలా మందికి తెలుసు. క్రీ.శ. 4వ శతాబ్దంలో రచించిన నారద స్మృతికర్తకు మనుస్మృతి కర్తృనామం తెలుసు. అతడే ఈ రహస్యాన్ని వెల్లడించాడు. నారద స్మృతికర్త ప్రకారం మనుస్మృతి రచించినవాడు సుమతి భార్గవుడు. 'సుమతి భార్గవ' అనేది కల్పించిన పేరు కాదు. మనువు ప్రత్యేక వ్యక్తి అని అభిప్రాయపడిన మనుస్మృతి మహా వ్యాఖ్యాత అయిన మేధాతిథి[9] ప్రకారం కూడా మనువు 'ఒకానొక వ్యక్తి'. కాబట్టి మనుస్మృతి వాస్తవకర్త అయిన

సుమతి భార్గవుని కల్పితనామం మనువు.

ఈ సుమతి భార్గవుడే ఈ నియమావళి (స్మృతి)ని ఎప్పుడు రచించాడు? దాని రచనకు సంబంధించిన ఖచ్చితమైన తేదీని ఇవ్వటం సాధ్యం కాదు. కానీ ఏ నిర్దిష్ట కాలంలో అది రచించబడిందో చెప్పవచ్చు. ప్రశ్నింపవీలుకాని ప్రామాణ్యం కల పండితుల అభిప్రాయం ప్రకారం-సుమతి భార్గవుడు తాను ఉద్దేశపూర్వకంగా మనుస్మృతి అని తెలిపిన నియమావళిని క్రీ.పూ. 170-క్రీ.పూ. 150 సంవత్సరాల మధ్య రచించాడు. పుష్యమిత్రుని బ్రాహ్మణీయ విప్లవం క్రీ.పూ. 185 సంవత్సరంలో జరిగిందనే దాన్ని ఇప్పుడు మన మనస్సులో పెట్టుకొంటే మౌర్యుల బౌద్ధ రాజ్యానికి వ్యతిరేకంగా బ్రాహ్మణీయ విప్లవ సూత్ర ఘటితంగా మనుస్మృతిగా పేరుగాంచిన నియమావళి పుష్యమిత్రునిచే జారీ చేయబడినదనటంలో సందేహం లేదు. మనుస్మృతి బ్రాహ్మణ మతాన్ని వ్యవస్థీకృతం చేసిందనీ, పుష్యమిత్రుని విప్లవం కేవలం వ్యక్తిగత సాహసకృత్యం కాదనేది మనుస్మృతికి సంబంధించిన ఈ దిగువ విశేషాలను గమనించినట్లయితే రుజువవుతుంది.

మొదటిసారిగా మనుస్మృతి పుష్యమిత్రుని పరిపాలన కాలంలో జారీ చేయబడిన న్యాయ శాస్త్ర సంబంధమైన ఒక కొత్త నియమావళి అనేది గమనించవలసిన విషయం. మనుస్మృతి రచనకు పూర్వం మానవధర్మ సూత్రమనేది ఉండేదనీ మానవ ధర్మ సూత్రాలను అనుసరించే మనుస్మృతి తయారైందని ఇప్పుడు వాడుకలో ఉన్న అభిప్రాయం. అయితే గ్రంథం జాడ ఎక్కడా లేని కారణంగా ఈ అభిప్రాయానికి విలువ లేకుండాపోయింది. ఇప్పటి మనుస్మృతికి పూర్వం రెండు ఇతర గ్రంథాలున్నాయి. ఒకటి మానవార్థశాస్త్రం లేదా మానవరాజ శాస్త్రం లేదా మానవరాజ ధర్మశాస్త్రంగా ప్రసిద్ధికెక్కింది. రెండోది మానవ గృహ్యసూత్రంగా పండితులు మనుస్మృతిని పోల్చి చూచారు. ముఖ్యమైన విషయాలలో ఒక దానితో మరొకదానికి పోలికే లేదు. ఇంకో గ్రంథంలోని నియమనిబంధనలకు విరుద్ధంగా కూడా ఉన్నాయి. నూతన రాచరికంలో అమలులోకి వచ్చే నూతన చట్టాన్ని మనుస్మృతి కలిగి ఉండేదనటానికి ఇది చాలు.

పుష్యమిత్రుని నూతన పరిపాలన కాలం బౌద్ధ మతస్థులకు వ్యతిరేకమని బౌద్ధ మతస్థులకు బౌద్ధ మతానికి వ్యతిరేకంగా మనుస్మృతిలో చేయబడిన స్పష్ట నిబంధనల వల్ల తెలుస్తోంది. మనుస్మృతిలోని ఈ క్రింది నిబంధనలను గమనించండి:

"పాషండస్థ మానవులను రాజు దేశం నుంచి పంపించేయాలి" (9-225)

"ఈకితవాదులు గూఢాచారులు రాజు రాజ్యమందున్న వారై సర్వదా వంచనచే ధనమార్జిస్తూ సజ్జనులను బాధిస్తున్నారు." (9-226)

"వృథా జాతులకు (తమ జాతి ధర్మాలను ఎక్కువగా వదలివెళ్ళిన వారికి) సంకర

జాతులకు (హీన జాతి పురుషుల వల్ల ఉత్తమ జాతి స్త్రీలయందు పుట్టిన వారికి) వేద బాహ్యులయిన సన్యాసులకు, ఆత్మహత్య చేసుకొనే వారికి ఉదక దానాది ప్రేతకృత్యం చేయనక్కరలేదు" (5–89)

"పాషండాన్ని ఆశ్రయించిన స్త్రీలకు--- (ఉదకదానాది శ్రాద్ధాది కర్మలు చేయనక్కరలేదు)" (5.90)

"అతడు (గృహస్థుడు) పాషండులను--- హైతుకులను (వేద విరుద్ధ కర్మలచే తిరిగే వారు)--- నూట మాత్రంగా కూడా అర్చించకూడదు." (4.30)

"వేదమూలాలు కాని సంప్రదాయాలుకు దృష్టి కల (నీచమయిన) తత్వ వ్యవస్థలు మొదలయిన వన్నియు పరలోకంలో నిష్ఫలాలు నరకఫలాలు" (12.95)

"వేదేతర మూలాలయిన కొన్ని శాస్త్రాలు (సిద్ధాంతాలు) పుడుతున్నాయి, నశిస్తున్నాయి, ఆధునికములయిన కారణంగా అవి నిష్ఫలాలు, అనృతాలు" (12.96)

మనువు నిర్దేశించిన సంప్రదాయ వ్యతిరేకులు ఎవరు? మనువు కొత్త రాజును తన రాజ్యం నుంచి బహిష్కరించమన్న వారెవరు? జీవిత కాలంలోను, మరణానంతరం కూడా గౌరవించవద్దన్న గృహస్థుడెవరు? వేద భిన్నమయిన, అజ్ఞానమయమయిన, నశించేటటువంటి ఆధునిక కాలానికి చెందినటువంటి ఈ పనికిరాని తత్వమేమిటి? మనువు పేర్కొన్న పాషండుడు బౌద్ధుడు అనటంలోను, వేదాలకు భిన్నమయిన పనికిరాని తత్వశాస్త్రం బౌద్ధమతం అనటంలోను సందేహం లేదు. మనుస్మృతికి ఇంకో వ్యాఖ్యాత అయిన కుల్లూకభట్టు ఈ శ్లోకాలలో నిర్దేశితులయిన పాషండులు బౌద్ధులనీ, పనికిరాని తత్వం బౌద్ధమతమనీ స్పష్టంగా వ్యాఖ్యానించాడు.

బ్రాహ్మణులకు కేటాయించిన హోదా మనుస్మృతిలో మూడో ప్రధానాంశం. మనుస్మృతిలో బ్రాహ్మణులకు కేటాయించిన ఈ దిగువ సదుపాయాలను గమనించండి:

"(బ్రహ్మ)ముఖం నుంచి పుట్టటం వల్లను, ముందు పుట్టటం వల్లను, వేదాన్ని ధరించటం వల్లను, ఈ జగత్తంతటికి బ్రాహ్మణుడు ప్రభువు." (1–93)

"భూతాలలో ప్రాణులు శ్రేష్ఠాలు; ప్రాణులలో బుద్ధి జీవులు శ్రేష్ఠాలు; వాటిలో (బుద్ధి జీవులలో) మనుష్యులు శ్రేష్ఠులు. మనుష్యులలో బ్రాహ్మణులు శ్రేష్టులు." (1–96)

"ప్రపంచంలో ఏది ఉందో అదంతా బ్రాహ్మణుని ఆస్తియే; ఉన్నతమయిన పుట్టుక వల్ల ఈ సర్వాన్ని గ్రహించటానికి బ్రాహ్మణుడే అర్హుడవుతున్నాడు." (1-100)

"బ్రాహ్మణుడు తన ఆహారాన్నే తింటున్నాడు, తన దుస్తుల్నే ధరిస్తున్నాడు, తన ధనాన్నే ఇస్తున్నాడు. ఇతర మర్త్యులందరూ బ్రాహ్మణ కారుణ్యం చేతనే మనుగడ సాగించగలుగుతున్నారు." (1-101)

"విశేషత వల్లనూ, జన్మశ్రేష్ఠత వల్లను, ప్రత్యేక నిషేధాచరణం వల్లను, ప్రత్యేక సంస్కార విశేషం వల్లను, 'సర్వ'వర్ణాల వారికి బ్రాహ్మణుడు ప్రభువు." (10.3)

"బ్రాహ్మణుడు జగల్స్రష్ట శిక్షకుడు, అధ్యాపకుడు, కాబట్టి సర్వజీవులకు క్షేమాన్ని కలిగించేవాడు; ఎవడూ వానికి (బ్రాహ్మణునకు) అనిష్టమయిన పరుష వాక్కును పలుకరాదు." (11-35)

బ్రాహ్మణులకు అసంతృప్తి కలిగించే రాజును మనువు ఈ క్రింది సూత్రాలలో హెచ్చరించాడు.

"ఎంతటి దుఃఖాన్ని పొందినప్పటికీ (రాజు) బ్రాహ్మణుల్ని కోపింపచేయకూడదు. వారు కోపిస్తే సబల వాహనుడయిన అతన్ని నశింపజేస్తారు." (9-313)

మనువు ఇంకా ఈ విధంగా ప్రకటించాడు:-

"ధర్మవిదుడైన బ్రాహ్మణుడు (అపకారాన్ని) తనకు ఎవరైనా చేస్తే రాజుకు తెలియచేయనక్కరలేదు. స్వశక్తి చేతనే అపకారం చేసిన వానిని అతడు శిక్షించగలడు" (11-31)

"అతని స్వశక్తి రాజశక్తి కంటె బలవత్తరమైనది. కాబట్టి బ్రాహ్మణుడు స్వశక్తి చేతనే తన శత్రువులను శిక్షించాలి." (11-32)

బ్రాహ్మణుని దేవ సమానుని చేయడం, అతనిని రాజు కంటె ఉన్నతునిగా పరిగణించడం రాజు కూడా బ్రాహ్మణుడై ఉంటే తప్ప, మనువు ప్రకటించిన దృక్పథంతో సానుభూతిని కలిగి ఉంటే తప్ప-అసాధ్యమవుతుంది. పుష్యమిత్రుడు, అతని వారసులు బ్రాహ్మణ మతాన్ని స్థాపించటంలో అభిరుచి కల బ్రాహ్మణులైతేనే తప్ప బ్రాహ్మణుల ఔన్నత్యాన్ని కలిగించే వాక్కులను సహించేవారు కారు. వాస్తవంగా పుష్యమిత్రుని ఆజ్ఞానుసారం జరిగింది మనుస్మృతి రచన. అది బ్రాహ్మణ మత గ్రంథంగా రూపొందింది.

ఈ వాస్తవాలన్నింటిని గమనిస్తే నిస్సందేహంగా తెలిసే అంశం: బౌద్ధమతాన్ని నాశనంచేసి బ్రాహ్మణమతాన్ని పునః స్థాపించడమే పుష్యమిత్రుని విప్లవ ఏకైక లక్షణం.

భారతదేశ చరిత్ర రచన నాకు సంతృప్తికరంగా జరిగి వుంటే, నేను పైన ఉల్లేఖించిన భారత రాజకీయ చరిత్ర సారాంశం ఈ అధ్యాయానికి అవసరమై వుండేది కాదు. కానీ, నిర్మొహ మాటంగా చెప్పాలంటే అది నాకు తృప్తికరంగా లేదు. ఎందుకంటే చరిత్ర రచనలో ముస్లిముల దండయాత్రలకు మితిమీరిన ప్రాధాన్యం ఇచ్చారు. హిమపాతంవలె ముస్లిం ఆక్రమణల వెల్లువ ఎలా వచ్చి పడిందో, ప్రజలను చుట్టివేసి, పాలకులను ఎలా పదభ్రష్టం చేసిందో కుప్పలుతెప్పలుగా రాశారు. ముస్లిం ఆక్రమణల చిట్టా తప్ప మరో ముఖ్యమైన విషయం భారతదేశ చరిత్రలో లేనట్టు చరిత్ర రచన సాగింది. పోనీ, ఆ సంకుచిత దృక్పథం నుంచి చూసినా, అధ్యయనం చేయవలసిన ఆక్రమణలు ముస్లింల ఆక్రమణలు మాత్రమే కావు. అంతకంటె ఎక్కువ ప్రాముఖ్యం కలిగినవి కాకపోయినా, సమాన ప్రాధాన్యం కలిగిన ఆక్రమణలు ఇంకా ఉన్నాయి. హిందూ ఇండియాను ముస్లిం ఆక్రమణదారులు ఆక్రమిస్తే – బౌద్ధ ఇండియాను బ్రాహ్మణమత ఇండియా ఆక్రమించింది. ఈ రెండు రకాల ఆక్రమణలకు ఎన్నో సారూప్యాలున్నాయి. హిందూ ఇండియాను ఆక్రమించిన ముసల్మానులు రాజ్యకాంక్షతో తమలో తాము కలహించుకున్నారు. అరబ్బులు, తుర్కులు, మంగోలులు, ఆఫ్ఘనులు ఆధిపత్యం కోసం పరస్పరం ఘర్షణపడ్డారు. అయితే, వారందరిలోనూ ఉమ్మడి లక్షణం – విగ్రహారాధనతత్వాన్ని నాశనం చేసే ప్రయత్నం. అలాగే బౌద్ధ భారతదేశాన్ని ఆక్రమించిన బ్రాహ్మణ మత ఆక్రమణదారులు రాజ్యకాంక్షతో తమలో తాము కలహించుకున్నారు. శుంగులు, కణ్వులు, ఆంధ్రులు ఆధిపత్యం కోసం పరస్పరం ఘర్షణపడ్డారు. ముస్లిం ఆక్రమణదారులందరివలె వారందరికీ కూడా ఉమ్మడి లక్ష్యం ఉంది. 68 బౌద్ధాన్ని, మౌర్య బౌద్ధ సామ్రాజ్యాన్ని నాశనం చేయడం. హిందూ భారతదేశంపై ముస్లిం ఆక్రమణదారులు చేసిన ఆక్రమణలు చరిత్రకారులు అధ్యయనం చేయదగ్గవే అయితే, బౌద్ధ భారతదేశంపై బ్రాహ్మణ మత ఆక్రమణదారులు చేసిన ఆక్రమణలు కూడా అంతే యోగ్యతతో అధ్యయనం చేయదగ్గవి. బౌద్ధాన్ని నాశనం చేయడానికి బ్రాహ్మణమత ఆక్రమణదారులు అనుసరించిన పద్ధతులు హిందూ మతాన్ని అణచివేయడానికి ముస్లిం ఆక్రమణదారులు అనుసరించిన పద్ధతులకు హింసా ద్వేషాలలో ఏమాత్రం తీసిపోవు. ప్రజల సామాజిక, ఆధ్యాత్మిక జీవితంపై వేసిన శాశ్వత ప్రభావం తీవ్రతరమైనది. హిందూ ఇండియాపై ముస్లిం ఆక్రమణల ప్రభావం పైపైన మాత్రమే పడినది, తాత్కాలికమైనది. గుడులు, మఠాల వంటి హిందూమత బాహ్య చిహ్నాలనే ముస్లిం ఆక్రమణదారులు నాశనం చేశారు. వారేమీ హిందూమతాన్ని తుడిచిపెట్టలేదు, ప్రజల ఆధ్యాత్మిక జీవనాన్ని నియంత్రించే సూత్రాలను, సిద్ధాంతాలను నాశనం చేయలేదు. బ్రాహ్మణ మత ఆక్రమణల ఫలితంగా, శతాబ్ద కాలంగా వాస్తవ, శాశ్వత ఆధ్యాత్మిక జీవన సూత్రాలుగా బౌద్ధం ప్రచారం చేసి, జీవన విధానంగా ప్రజలు ఆమోదించిన సిద్ధాంతాలు, సమూలంగా మార్పునకు లోనయ్యాయి. నానుడిని మార్చి చెబితే – ముస్లిం ఆక్రమణదారులు స్నానకుండంలో నీటిని కదిలించారు, అంతే (Only Stirred the waters in the bath). అది కూడా కొద్దిసేపే. తరువాత వారు ఆ పనిలో అలసిపోయి అలాగే వదిలేశారు, నీరు తేరుకోవడానికి. హిందూత్వ

సూత్రాలు ఓ శిశువు అనుకుంటే – వారు శిశువును స్నానకుండం నుంచి బయటకు విసిరేయ లేదు. (They never throw the baby - if one can speak of the principles of Hinduism as a baby - out of the bath.) బ్రాహ్మణ మతం బౌద్ధంతో ఘర్షణలో దాన్ని పూర్తిగా తుడిచిపెట్టింది. బౌద్ధ శిశువుతో సహా స్నానకుండాన్ని ఖాళీచేసిన బ్రాహ్మణ మతం, తన నీటితో ఆ కుండాన్ని తిరిగి నింపి, తన శిశువును అందులో ఉంచింది. మహోన్నతమైన బౌద్ధ మూలం నుంచి జాలువారిన పరిమళభరితమైన, స్వచ్ఛమైన నీటితో పోలిస్తే. తన నీరు ఎంత మురికిగా, లోతుగా వున్నా బ్రాహ్మణ మతం లెక్క చేయలేదు. బౌద్ధ శిశువుతో పోలిస్తే తన శిశువు ఎంత వికృతంగా, అసహ్యంగా వున్నా పట్టించుకోలేదు. దాడుల ద్వారా బౌద్ధాన్ని నిర్మూలించే రాజకీయాధికారాన్ని సంపాదించిన బ్రాహ్మణమతం, ఆ పని పూర్తి చేసింది. ఇస్లాం హిందూ మతాన్ని తొలగించి ఆ స్థానాన్ని ఆక్రమించలేధు. ఇస్లామ్ తన లక్ష్యాన్ని పూర్తి చేయనేలేదు. బ్రాహ్మణమతం చేసింది. బౌద్ధాన్ని మతంగా పారద్రోలి, దాని స్థానాన్ని ఆక్రమించింది.

హిందూ భారతదేశంపై ముస్లిం దండయాత్రల పర్యవసానం కంటె బౌద్ధ భారతంపై బ్రాహ్మణ మత దండయాత్రలు భారతీయ చరిత్రకారునికి అత్యధిక ప్రాముఖ్యం కలిగినవి. అయినా, మౌర్యులు నిర్మించిన బౌద్ధ భారతాన్ని పతనం చేసిన శక్తుల గురించి చరిత్రకారులు స్వల్పంగా మాత్రమే పట్టించుకున్నారు. పట్టించుకున్నచోట కూడా – శుంగులు, కణ్వులు, ఆంధ్రులు ఎవరు? వారు మౌర్యులు నిర్మించిన బౌద్ధ భారతాన్ని ఎందుకు నాశనం చేశారు?– వంటి సహజంగా ఉత్పన్నమయ్యే ప్రశ్నలతో ఖచ్చితమైన అన్వేషణ చేయలేదు. బౌద్ధంపై విజయం తరువాత బ్రాహ్మణమతం రాజకీయ, సాంఘిక వ్యవస్థలో తెచ్చిన మార్పులను అధ్యయనం చేసే ప్రయత్నమూ జరగలేదు.

కొన్ని తప్పుడు అభిప్రాయాల కారణంగా భారతదేశ చరిత్రకు సంబంధించిన ఈ కోణం పరిశీలన జరగలేదు. బ్రాహ్మణమతం, బౌద్ధం, జైనం వివిధ దశలు మాత్రమేనని, వాటి మధ్య ఎన్నడూ మౌలిక శత్రుత్వం ఎన్నడూ లేదని, చరిత్రలో అంతటా భారతీయ సంస్కృతి ఒకటిగానే వుండిందనీ సర్వసామాన్య అభిప్రాయం. భారత రాజకీయ చరిత్రలో జరిగిన ఘర్షణలన్నీ శుద్ధ రాజకీయమైనవనీ, రాజ వంశాల మధ్య జరిగినవనీ, వాటికి సామాజిక, ఆధ్యాత్మిక ప్రాముఖ్య మేమీ లేదని భావించడం మరో తప్పుడు అభిప్రాయం. ఈ పొరపాటు అభిప్రాయాల కారణంగానే, భారత చరిత్ర అంతా ఒక రాజ వంశం స్థానంలో మరొకటి రావడం – ఒక పాలకుని తరువాత మరో పాలకుడు వంటి వివరాల చిట్టాగా, కేవలం యాంత్రికమైనదిగా పరిణమించింది. ఆ వైఖరిని, ఆ చరిత్ర రచనా పద్ధతిని సరిదిద్దాలంటే రెండు నిర్వివాద వాస్తవాలను గుర్తించాలి.

మొదటగా గుర్తించవలసినది – ఉమ్మడి భారతీయ సంస్కృతి అనేదేదీ ఎప్పుడూ లేదనీ, చారిత్రకంగా బ్రాహ్మణవాద భారతదేశం, బౌద్ధ భారతదేశం, హిందూ భారతదేశం అనే మూడు ఇండియాలున్నాయనీ, ప్రతిదానికీ సొంత సంస్కృతి వుందనీ మొదట గుర్తించదగిన విషయం. మహమ్మదీయ దండయాత్రలకు ముందున్న హిందూదేశ చరిత్ర బ్రాహ్మణ, బౌద్ధ మతాల

మధ్య జరిగిన "నైతిక సంఘర్షణ" చరిత్ర అనేది రెండోదిగా గుర్తించవలసి ఉంది. ఎవరైతే ఈ రెండు వాస్తవాలను గుర్తించరో వారు హిందూదేశ వాస్తవ చరిత్రను అంతర్లీనంగా ఉన్న అర్థాన్నీ, ప్రయోజనాన్నీ వెల్లడించే చరిత్రను రచించలేరు. రాయబడిన భారత చరిత్రకు దిద్దుబాటుగానూ, దానిలో అంతర్లీనంగా సాగే అర్థాన్నీ ప్రయోజనాన్నీ ఆవిష్కరించడానికీ – బౌద్ధ భారతంపై బ్రాహ్మణమత దండయాత్రల చరిత్రకు, బౌద్ధంపై బ్రాహ్మణమత విజయం చరిత్రను నేను పునర్ నిర్మించవలసి వస్తున్నది.

కాబట్టి, పుష్యమిత్రుని విప్లవం బౌద్ధాని కూలదోయడానికి బ్రాహ్మణులు నిర్వహించిన రాజకీయ విప్లవమన్న గుర్తింపుతో మనం ప్రారంభం కావాలి.

విజయవంతమైన ఈ బ్రాహ్మణ మతం ఏమి చేసింది? అని ఆసక్తి కలవారు సహజంగా అడుగుతారు. ఈ ప్రశ్నకు ఇప్పుడు నేను సమాధానం చెప్తాను. ఈ విజయవంతమయిన బ్రాహ్మణమత కృత్య అకృత్యాలను 7 శీర్షికలుగా విభజించవచ్చు. 1. బ్రాహ్మణునికి పరిపాలించే హక్కును, రాజహత్య కావించే హక్కును స్థాపించింది. 2. బ్రాహ్మణులను విశేషాధికారాలు కలిగిన వ్యక్తుల శ్రేణిగా మార్చింది. 3. వర్ణాన్ని కులంగా మార్చింది. 4. భిన్న వర్ణాల మధ్య సంఘర్షణను అసాంఘిక భావనను తీసుకువచ్చింది. 5. శూద్రులను, స్త్రీలను తక్కువ వారుగా ముద్రవేసింది. 6. అంచెలవారీ అసమానతా వ్యవస్థను సృష్టించింది. 7. సాంప్రదాయకమైన సర్దుబాటుకు వీలైన సాంఘిక వ్యవస్థను న్యాయబద్ధమైనదిగాను, కఠినమైనదిగా చేసింది.

మొదటిదానితో ప్రారంభిద్దాం.

పుష్యమిత్రుడు తీసుకువచ్చిన విప్లవం తొలుత బ్రాహ్మణులకు ఇబ్బందిని సృష్టించింది. ఈ విప్లవంతో ప్రజలు సమాధానపడలేకపోయారు. ఈ విప్లవాన్ని సూచించేటప్పుడు పుష్యమిత్రుని నీచ జన్మునిగా నిందించటం ద్వారాను, అతని రాజహత్యాకృత్యం అనార్యమనటం ద్వారాను, ప్రజల నిరసనను బాణుడు ప్రకటించాడు. 10 పుష్యమిత్రుని చర్య అనార్యమంటే ఆర్యచట్ట విరుద్ధమని బాణుడు సరిగానే వర్ణించాడు. పుష్యమిత్రుని విప్లవ సమయానికి ఆర్య చట్టం మూడు అంశాలపై సుస్థాపితమై ఉంది. అప్పటి ఆర్య చట్టం ప్రకటించింది. 1. రాజరికం క్షత్రియుని హక్కు మాత్రమే. బ్రాహ్మణుడు రాజు ఎప్పటికీ కాలేడు. 2. ఏ బ్రాహ్మణుడు ఆయుధ సంబంధిత వృత్తి చేపట్టకూడదు. 11 3. రాజు అధికారానికి వ్యతిరేకంగా జరిగే విప్లవం పాపం. విప్లవాన్ని నిర్వహించటం ద్వారా పుష్యమిత్రుడు ఈ మూడు చట్టాలకు వ్యతిరేకంగా ప్రవర్తించి నేరాన్ని చేశాడు. అతడు బ్రాహ్మణుడు. అయినప్పటికీ రాజుకు వ్యతిరేకంగా తిరగబడ్డాడు. ఆయుధ సంబంధ వృత్తినవలంబించాడు, రాజయ్యాడు. చట్టవిరుద్ధమయిన ఈ ఉల్లంఘనకు ప్రజలు సమాధానపడలేకపోయారు. పుష్యమిత్రుడు సృష్టించిన పరిస్థితిని బ్రాహ్మణులు క్రమబద్ధీకరించుకోవలసి వచ్చింది. చట్టాన్ని మార్చటం ద్వారా బ్రాహ్మణులు దీన్ని చేశారు. చట్టంలోని ఈ మార్పు మనుస్మృతిలో స్పష్టంగా కన్పిస్తోంది. స్మృతిలోని సముచితమయిన (దీనికి సంబంధించిన)

శ్లోకాల్ని ఉదహరిస్తాను.

"సేనను నడిపించటానికి (సైన్యాధిపతికి) రాజ్యం చేయటానికి, సర్వభూమండలాధిప త్యాన్ని వహించటానికి బ్రాహ్మణుడు అర్హుడు." (12.100)

ఇక్కడ చట్టంలోని మార్పు కన్పిస్తుంది. నూతన చట్టం బ్రాహ్మణునకు సేనాపతి అయ్యే హక్కు ఉందనీ, రాజ్యాన్ని జయించే హక్కు ఉందనీ, రాజ్య పాలకుడిగా చక్రవర్తిగా, బ్రాహ్మ ణుడు అర్హుడే అని ఈ చట్టం స్పష్టం చేస్తుంది.

"ధర్మవిదుడైన బ్రాహ్మణుడు తనకు జరిగిన అపకారాన్ని రాజుకు తెల్పగూడదు. ఎందు కంటే, స్వశక్తి చేతనే తనకు అపకారం చేసిన వాళ్ళను అతను శిక్షించవచ్చు." (11.31)

"తన మీద ఆధారపడి ఉన్న కారణంగా (బ్రాహ్మణుని) స్వశక్తి, పరాధీనమైన రాజాధి కారం కంటె బలమైనది. కాబట్టి స్వశక్తి చేతనే బ్రాహ్మణుడు శత్రువులను నిగ్రహించవచ్చు." 1.32

"బ్రాహ్మణుడు ముల్లోకాల ప్రజలను చంపినప్పటికీ ఉపనిషత్ సహితంగా ఋగ్వేదం, యజుర్వేదం, సామ వేదాలలో మూడుసార్లు పఠిస్తే సర్వ పాపాల నుంచి విముక్తుడౌతాడు." (11-261, 62)

ఇక్కడ చట్టంలో రెండో మార్పు జరిగింది. ఇది బ్రాహ్మణునికి విస్తృత అధికారాలని స్తుంది. రాజును చంపి రాజ్యాన్ని చేజిక్కించుకోవడమే కాకుండా-తన హోదాను స్థానానికి హాని కలిగించేటట్లయితే అలాంటి మనుషులను మూకుమ్మడిగా హతమార్చే అధికారాన్ని బ్రాహ్మణునికి అది (స్మృతి) కల్పించింది.

"బలప్రయోగంతో నిరోధం ఏర్పడుతుందో, ఏ కాలంలో విహిత వర్ణాశ్రమ ధర్మాలకు దుష్కాలంలో మహావిపత్తు సంభవించినప్పుడు అప్పుడు ద్విజుడు ఆయుధాలు చేపట్టవచ్చు." (8-348)

"బ్రాహ్మణులపై సకల సందర్భాలలో దురుసుగా చెయ్యెత్తే క్షత్రియుడి (సైనికుడు కానీ రాజు కానీ)కి బ్రాహ్మణుడే శిక్ష విధించాలి. ఎందుకంటే సైనికుడు మౌలికంగా బ్రాహ్మణుని నుంచే సంభవించాడు కాబట్టి" (9-320)

ఇది చట్టంలోని మూడో మార్పు. ఇది రాజుపై తిరుగుబాటు చేసే హక్కును, రాజును

హత్య చేసే హక్కును చట్టబద్ధం చేసింది. ఈ కొత్త చట్టాన్ని చాలా జాగ్రత్తగా రూపొందించారు. అది తిరుగుబాటు చేసే హక్కును మూడు అగ్రవర్ణాల వారికిచ్చింది. క్షత్రియులు, వైశ్యులు, విప్లవం తీసుకురావటానికి బ్రాహ్మణునితో కలవని పరిస్థితిని చూపించి, ఆ తిరగబడే హక్కును బ్రాహ్మణులకు ప్రత్యేకంగా సంక్రమింపజేసింది. తిరుగుబాటు హక్కును ఇక్కడ బాగా పరిమితం చేశారు. విభిన్న వర్ణాలకు మనువు నిర్దేశించిన వృత్తులకు రాజు విఘాతం కల్పించి నేరానికి పాల్పడినప్పుడు మాత్రమే దాన్ని ఉపయోగించాలి.

ఈ న్యాయపరమైన మార్పులు ఎంతగా విప్లవాత్మకమైనవో అంతగా అవశ్యకమైనవి. తుది మౌర్య రాజును చంపి పుష్యమిత్రుడు సంపాదించిన స్థానాన్ని చట్టబద్ధం చేయటమూ, క్రమబద్ధం చేయటమూ వారి లక్ష్యం. ఈ న్యాయపరమైన మార్పుల ద్వారా బ్రాహ్మణుడు న్యాయసమ్మతంగా రాజు కాగలడు, న్యాయసమ్మతంగా సాయుధుడు కాగలడు, చాతుర్వర్ణ్య వ్యవస్థను వ్యతిరేకించే రాజును న్యాయసమ్మతంగా సింహాసనం నుంచి దించేయగలడు, లేదా హత్య చేయగలడు. బ్రాహ్మణాధికారాన్ని వ్యతిరేకించే ఏ వ్యక్తినైనా న్యాయసమ్మతంగా చంపగలడు. స్వీయ ప్రయోజన రక్షణార్థం అవసరమయితే ఊచకోత కోసే హక్కును మనువు బ్రాహ్మణులకు ప్రసాదించాడు.

ఈ విధంగా బ్రాహ్మణమతం బ్రాహ్మణులకు పరిపాలించే హక్కును సుస్థాపితం చేసింది. ఈ విషయమై ఏ విధమైన సందేహానికి, తగాదాకు తావు లేకుండా చేసింది. మొత్తంగా తీసుకుంటే ఇది బ్రాహ్మణులను సంతృప్తిపరచలేదు. ఇది గర్వించతగింది కావచ్చు కాని దీనివల్ల ఏ ఉపయోగమూ లేదు. బ్రాహ్మణేతరులతో పాటు సమాన హక్కులు, విధులు ఉండి సామాన్య మానవుడిగా బ్రాహ్మణుడు గౌరవ సత్కారాలను పొందినట్లయితే బ్రాహ్మణ పరిపాలనకు ప్రత్యేక గుణమేమీ ఉండదు. బ్రాహ్మణుడి పరిపాలన బ్రాహ్మణులకు ఒక వర్గంగా ప్రత్యేకాధికారులను రాయితీలను ఇవ్వకపోతే, దానికి అర్థం వుండదు. బ్రాహ్మణుల ఉన్నత స్థితిని గుర్తించనట్లైతే, వారికి ప్రత్యేక ప్రయోజవాలను ప్రసాదించకపోయినట్లైతే వాస్తవానికి పుష్యమిత్రుని విప్లవం నిష్ఫలం అయ్యేది. మనువుకు ఈ విషయం బాగా తెలుసు. దానికి అనుగుణంగా బ్రాహ్మణులకు గుత్తాధికారాల్ని కట్టబెట్టాడు. వారికి కొన్ని మినహాయింపులను, విశేషాధికారాలను ప్రదానం చేశాడు అని మనుస్మృతి నుంచి మనం గమనించవచ్చు.

గుత్తాధికారాల్ని గురించి మొదట చూద్దాం.

బ్రాహ్మణులకు వేదం చదవటం (అధ్యయనం), వేదం చెప్పటం (అధ్యాపనం), యజ్ఞం చేయటం (యజనం), యజ్ఞం చేయించటం (యాజనం), దానం చేయటం, దానం పొందడం వంటివి (బ్రహ్మ) నియోగించాడు." (1.88)

'తమ (విధ్యుక్త) ధర్మాల్ని నిర్వర్తిస్తూ ద్విజులైన మూడు వర్ణాల వారు (వేదాలను)

అధ్యయనం కావించవచ్చు, కాని వారిలో బ్రాహ్మణులు (మాత్రమే) వేదాలు వల్లిస్తారు. ఇతర వర్ణాల వారిద్దరు (క్షత్రియ వైశ్యులు) ఈ పని (అధ్యాపనం) చేయకూడదు. ఇది స్థాపితమైన నియమం." (10-1)

"బ్రాహ్మణుడు అందరి (నిర్ణీత) జీవనోపాధి మార్గాలను యథావిధి తెలుసుకుని ఇతరులకు ఉపదేశించాలి. తాను కూడా తదనుగుణంగా నడచుకోవాలి" (10.2)

"తన విశిష్టత వల్ల శ్రేష్ఠత (బ్రహ్మముఖం నుంచి పుట్టటం చేత కల్గిన శ్రేష్ఠత) వల్ల నిష్ఠ నియమాలు కలిగినందువల్ల, తనదైన సంస్కార విశేషం వల్ల అన్ని వర్ణాలకు బ్రాహ్మణుడు ప్రభువు." (10.3)

"బ్రహ్మధ్యాన నిరతులు, నిష్ఠా గరిష్ఠులు, విధి నిర్వహణలో ప్రముఖులైన బ్రాహ్మణులు (చెప్పబోయే) షట్కర్మల్ని యథాక్రమం అవలంబిస్తూ జీవితం కొనసాగించాలి." (10.74)

"బోధించడం, చదవడం, తనకోసం యజ్ఞం చేయడం, ఇతరుల కోసం యజ్ఞం చేయడం స్వీకరించడం అనే షట్కర్మలు బ్రాహ్మణుని సద్గుణాలు. దానాలు చేయడం."(10.75)

(నియోగించిన) ఆరు కర్మలలో - ఇతరుల కోసం యజ్ఞం చేయడం, బోధించడం, నిర్మలురైన వారి నుంచి దానాలు స్వీకరించడం - ఈ మూడూ అతని జీవనాధారం.

"ఈ మూడు కర్మలు అనుసరించే విషయంలో క్షత్రియులను అనర్హులుగా చేశారు." (10.77)

"ఈ విషయంలో వైశ్యులు కూడా అనర్హులే. ఇది కఠోర నియమం. ప్రజాపతి ఐన మనువు ఆ రెండు వర్ణాల వారికి (బ్రాహ్మణ, క్షత్రియులకు) వాటిని నిర్దేశించలేదు" (10.78)

క్షత్రియునికి శస్త్రాస్త్రధారణం జీవిక; వైశ్యులకు వాణిజ్యం, పశుపాలనం, వ్యవసాయం జీవిక, కానీ వారి విధులు ఔదార్యం, వేదాధ్యయనం, యజ్ఞాలు చేయడం (10.79)

మనువు బ్రాహ్మణులకు గుత్తాధిపత్యంగా ఇక్కడ ప్రసాదించిన విషయాలు మూడు. అవి వేదాలు బోధించడం, యజ్ఞాలు చేయడం, దానాలు స్వీకరించడం అనేవి.

ఈ కింద ఇవ్వబడ్డవి బ్రాహ్మణులకు కల్పించబడ్డ రాయితీలు. ఇవి రెండు రకాలుగా ఉన్నాయి. పన్నుల విషయంలో స్వేచ్ఛ, నేరాలకు సంబంధించిన కొన్ని శిక్షల నుంచి మినహాయింపు.

"(ధనాభావం చేత) మరణిస్తున్నప్పటికీ రాజు శ్రోత్రియ బ్రాహ్మణునిపై పన్ను వేయకూడదు, స్వీయ రాజ్యంలో ఏ శ్రోత్రియుడూ ఆకలితో అలమటించగూడదు." (7.133)

"ధర్మం లోపించకుండా ఉండటానికి అధర్మాన్ని నివారించటానికి కూడ సాక్ష్య విషయమై రూపొందించిన నిర్ణీతాలైన ఈ శిక్షలను వారు (మన్వాదులు) చెప్పారు." (8.122)

ధార్మికుడైన రాజు అబద్ధపు సాక్ష్యమిచ్చే (క్షత్రియాదులయిన) మూడు వర్ణాల వారికి జరిమానా విధించి, దేశ బహిష్కారాన్ని విధించాలి. కాని బ్రాహ్మణులకు దేశ బహిష్కారాన్ని (మాత్రమే) విధించాలి." (8.123)

"స్వాయంభువుని కుమారుడైన మనువు (క్షత్రియాది) మూడు వర్ణాల వారిని శిక్షించే పది స్థానాలను పేర్కొన్నాడు. బ్రాహ్మణుడు (మాత్రం) అక్షతుడై (దేశాంతరానికి) వెళ్ళిపోవాలి." (8.124)

"ప్రాణాంతక దండన (వధ)కు బదులుగా బ్రాహ్మణునికి గుండు గీయించి శిక్షించవచ్చు. కాని ఇతర వర్ణాల వారికి (క్షత్రియాదులకు) ప్రాణాంతక దండన తప్పదు." (8.379)

"(సాధ్యమైన) అన్ని పాపాలు చేసినప్పటికీ అతడు బ్రాహ్మణుని వధించకూడదు; అటువంటి (అపరాధి) తన ఆస్తిపాస్తులతో సహా అక్షతుడిగా దేశం నుంచి వెళ్ళగొట్టాలి." (8–380)

బ్రాహ్మణులు ఘోరాపరాధాలు చేసినప్పటికీ సామాన్య నేరశిక్షా చట్టం నుంచి వారిని మినహాయించాడు మనువు. మరణ దండన విధించడానికి దోహదపడిన నేరాలు చేసినా కూడా అతడిని (బ్రాహ్మణుడు) అక్షతుడిగా ఆస్తిపాస్తులతో దేశాంతరానికి అనుమతించాలి. జరిమానాగా (అతని ఆస్తి) జప్తు చేయడం గానీ, లేదా అతనికి మరణ దండన విధించటం కాని లేదు. అత్యంత మహాపరాధం చేసిన తరువాత కూడా అతడు (బ్రాహ్మణుడు) అనుభవించేది హాబెస్ మాటలలో చెప్పాలంటే "గాలి మార్పిడి" వంటి దేశ బహిష్కారం.

బ్రాహ్మణునికి మనువు కొన్ని విశేషాధికారాల్ని కూడా ప్రసాదించాడు.

న్యాయమూర్తి బ్రాహ్మణుడై ఉండాలి.

"ఎప్పుడు రాజు స్వయంగా వ్యాజ్య పరిష్కారానికి హాజరు కాడో అప్పుడు అతను విద్వాంసుడైన బ్రాహ్మణుని ఆ కార్యానికి నియోగించాలి." (8–9)

"ఆ బ్రాహ్మణుడు ముగ్గురు సభ్యులతో సభా ప్రవేశం చేసి సభలో కూర్చుండి లేదా నిలబడి రాజ్యాల్ని పరిశీలించాలి." (8-10)

ఇక ఇతర విశేషాధికారాలు ఆర్థిక సంబంధమైనవి.

"విద్వాంసుడైన బ్రాహ్మణుడికి గతంలో నిక్షేపించిన నిక్షిప్త నిధి ఏదైనా కంట పడితే అతడు దాన్ని మొత్తంగా తీసుకోవచ్చు. కారణం అతను సర్వానికి అధిపతి." (8-37)

"ఎప్పుడో భూగర్భంలో దాచిన నిధిని రాజు కనుగొంటే దానిలో సగభాగాన్ని బ్రాహ్మణులకిచ్చి మిగిలిన సగాన్ని కోశాగారంలో ఉంచాలి." (8-38)

"(మృత్యువు ఆసన్నమౌతుంది అని భావించినపుడు రాజు) పన్నులు జరిమానాల ద్వారా సంపాదించిన సర్వధనాన్ని విప్రులకు ఇచ్చి, పుత్రునికి రాజ్యమిచ్చి, యుద్ధంలో మృత్యువు పొందాలి" (9-323)

"రాజు మరణిస్తే సన్నిహితులయిన సపిండులకు (మూడు తరాల బంధువులకు) ఆస్తి సంక్రమిస్తుంది. ఆతర్వాత సకుల్యుడు ఉత్తరాధికారి ఔతాడు. (ఎవ్వరూ లేనప్పుడు) ఆధ్యాత్మిక ఆచార్యుడు లేదా శిష్యుడు ఉత్తరాధికారి ఔతాడు." (9-187)

"(వారసులు) ఎవరూ లేకపోతే వేదాధ్యయనం చేసిన వారు, పరిశుద్ధులు, ఇంద్రియ నిగ్రహం కలవారు అయిన బ్రాహ్మణులు మృతుని ఆస్తిపాస్తులను స్వీకరించాలి. అలా అయితే న్యాయ ఉల్లంఘన జరగదు." (9-188)

బ్రాహ్మణుల ఆస్తిపాస్తుల్ని రాజు ఎప్పుడూ తీసుకోకూడదు. ఇది శాసన నియమం. వారసులెవరూ లేనపుడు ఇతర వర్ణాలవారి ఆస్తుల్ని తీసుకోవచ్చు." (9-189)

ఇవి బ్రాహ్మణులకు మనువు ప్రసాదించిన కొన్ని ప్రయోజనాలు. మినహాయింపులు. విశేషాధికారాలు. బ్రాహ్మణుడు రాజు కావడానికి ఇంతకన్నా రుజువులేం కావాలి?

బ్రాహ్మణమత సమర్థకులు మనువు బ్రాహ్మణులపై విధించిన అశక్తతలను పేర్కొనడం ఎప్పుడూ మరచిపోరు. (బ్రాహ్మణమత మహత్వంపై నమ్మకం ఎంత దృఢమైనదంటే నేటికీ పశ్చాత్తాపపడుతున్న వారు ఎవరూ లేరు) పేదరికం, పౌరోహిత్య, విద్యాదానాది సేవలను మాత్రమే బ్రాహ్మణులకు మనువు విధించాడని చెప్పడం వారి ఉద్దేశ్యం. మనువు బ్రాహ్మణులకు కొన్ని అశక్తతలను విధించాడనేది వాస్తవమే. కానీ. తద్వారా బ్రాహ్మణులకు పేదరికమూ, సేవలే పర

మాదర్శాలుగా చెప్పాడనడం నిరాధారమైన, ఉద్దేశ్యపూర్వకమైన కల్పన. అందుకు మనుస్మృతిలోనే ఆధారం లేదు.

మనువు ఈ అశక్తతలను విధించటంలోని వాస్తవ ఉద్దేశాల్ని గ్రహించేటప్పుడు రెండు విషయాలను మనసులో వుంచుకోవాలి. సామాజిక చట్రంలో బ్రాహ్మణులకు మనువు కల్పించిన స్థానం మొదటిది. కాగా రెండోది ఆ అశక్తతల స్వభావం. బ్రాహ్మణులకు మనువు కల్పించిన స్థానం అతని చేత అసందిగ్ధ శబ్దాలలో ఉద్ఘోషించబడింది. ఇది చాలా ప్రధానమైన విషయం కాబట్టి గతంలో చెప్పిన శ్లోకాల్నే మళ్ళీ ఉటంకిస్తున్నాను.

"(బ్రహ్మ) ముఖం నుంచి పుట్టటం వల్లను, (క్షత్రియాదు కంటె) ముందు పుట్టడం వల్లను, వేదాల్ని ధరించటం వల్లను, ధర్మానుశాసనం వల్లను ఈ జగత్తంతటికి అతడు ప్రభువు" (1–93)

అశక్తతల స్వభావం చూడండి.

"అనాపద కాలంలో తప్ప బ్రాహ్మణుడు ఇతర భూతాలకు పీడ కలగకుండా లేదా స్వల్పపీడన కలిగేటటువంటి వృత్తినవలంబించి జీవించాలి" (6–2)

"జీవికకు సరిపోయినంతమేరకు, అతను (క్రింద చెప్పిన) అనింద్య వృత్తులను (అతని కులానికి నిర్దేశించినవి), (అమిత) కాయకష్టం లేకుండా అనుసరించి సంపదను ఆర్జించాలి." (6–3)

"దొంగతనం అనే (విషయంలో) శూద్రునికి ఎనిమిది రెట్లును, వైశ్యునికి పదహారు రెట్లును క్షత్రియునికి ముప్పై రెండు రెట్లును దోషం ఉంటుంది." (8–337)

"బ్రాహ్మణునికి అరవైనాల్గు రెట్లు లేదా పూర్తిగా నూరు రెట్లు లేదా నూట ఇరవై ఎనిమిది రెట్లు దోషం ఎక్కువైన కొద్దీ దండన ఎక్కువగా విధించాలి" (8–338)

"రక్షిత వైశ్య క్షత్రియ స్త్రీలను విషయించిన బ్రాహ్మణునికి వెయ్యి పణాల దండన విధించాలి. రక్షిత శూద్ర స్త్రీని విషయించిన క్షత్రియ వైశ్యులకును వెయ్యి పణాళ్ళ దండన విధించాలి." (8–383)

"అరక్షిత క్షత్రియ స్త్రీలను విషయించిన వైశ్యునికి 500 పణాల దండనాన్ని విధించాలి. (అదే నేరానికి) క్షత్రియుడు (గార్ధభ) మూత్రంచే ముండనం పొందాలి లేదా అదే దండనను

(500 పణాలను) చెల్లించాలి." (8–384)

"అరక్షిత క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలను విషయించిన బ్రాహ్మణుడు 500 పణాలను దండనగా చెల్లించాలి. అతడు అంత్యజ స్త్రీని విషయిస్తే 1000 పణాలను దండనగా చెల్లించాలి." (8–385)

మనువు అతనికి ప్రసాదించిన స్థానానికి నేపథ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ అశక్తతలను పరిశీలిస్తే, ఈ అశక్తతల లక్ష్యం బ్రాహ్మణుడు బాధ పడడానికి కల్పించినట్టిది కాదని స్పష్టమవుతుంది. ఇంకో విధంగా చూచినట్లయితే తాను ఉన్నత శిఖరంలో ఉంచిన బ్రాహ్మణుడు దాని నుండి పతనం పొందకుండా ఉండేటట్లు చేసి, బ్రాహ్మణేతరుల నుండి అవమానాన్ని చవిచూడకుండేటట్లు చేసి రక్షించటం మనువు లక్ష్యమని స్పష్టమవుతుంది.

మనుస్మృతిలో వున్న ఇతర సదుపాయాల్ని బట్టి బ్రాహ్మణులకు దారిద్ర్యాన్ని, నిరాశ్రయాన్ని కల్పించటం మనువు లక్ష్యం కాదు. బ్రాహ్మణుడు దురవస్థలో ఉన్నపుడు అతడు అవలంబించవలసిన నడవడిని గురించి మనుస్మృతిలో ఉన్న నియమాల్ని ఈ సందర్భంలో సూచించవలసి వస్తుంది.

"అనేక వృత్తులలో ప్రశస్తాలయినవి, బ్రాహ్మణునికి వేదాధ్యయనం, క్షత్రియునికి రక్షణం, వైశ్యునికి వాణిజ్యం." (10–80)

"బ్రాహ్మణుడు తనకు సంబంధించిన యథోక్త స్వకర్మల (అధ్యాపన యోజనాదుల) చేత జీవించలేకపోతే తనకు దగ్గర జాతిది కాబట్టి క్షత్రియ కర్మ చేత జీవించాలి" (10–81)

"(బ్రాహ్మణుడు) ఈ రెండు వృత్తులలో జీవించలేకుంటే మరి ఏ విధంగా (జీవించాలి) అని ప్రశ్నిస్తే (సమాధానం) అతడు (బ్రాహ్మణుడు) వ్యవసాయం, గోరక్షణ వంటి వైశ్యుల వృత్తులను అవలంబించి జీవించాలి." (10–82)

"బ్రాహ్మణుడు లేదా క్షత్రియుడు వైశ్య వృత్తితో జీవించవలసి వస్తే వ్యవసాయాన్ని మాత్రం వర్జించాలి. ఎందుకంటే అది అనేక ప్రాణులకు హానిజ కలిగిస్తుంది, పరాధీనమూ." (10–83)

"వ్యవసాయం మంచిదని కొందరు తలుస్తున్నారు. (కాని) భూమిని దున్నేందుకు వాడే (నాగలి) దానికి అమర్చిన కర్రు భూమిని గాయపరచడంతో పాటు భూమిగత జీవుల్ని బాధిస్తుంది. కాబట్టి ఆ వృత్తి కొందరి విమర్శకు గురయింది." (10–84)

"కాని స్వవృత్త్య భావంలో యథోక్తధర్మ నైపుణ్యం లేనప్పుడు వక్ష్యమాణ నిషిద్ధ వస్తు వర్జ్యంగా వైశ్యులు అమ్మే వస్తువులను ధనార్జన నిమిత్తం అతడు అమ్ముకోవచ్చు." (10-85)

హక్కుగా సంక్రమించిన వృత్తుల ద్వారా అభివృద్ధి చెందుతున్నపుడు మాత్రమే బ్రాహ్మణు నిపై విధించిన అశక్తతలు కొనసాగుతాయి. ఆపదలో ఉన్నపుడు శక్తిసామర్థ్యాలు అదృశ్యమైనపుడు అతడు బ్రాహ్మణత్వం కోల్పోకుండా తనకిష్టమైన ఏ పనినైనా చేసుకోవటానికి స్వేచ్ఛ ఉంది. అంతేగాకుండా అతడు విపత్తులలో ఉన్నాడా లేదా అనే విషయాన్ని విచక్షణతో నిశ్చయించు కోవలసింది ఆ బ్రాహ్మణుడే. అంతరాత్మను సంతృప్తిపరచుకుంటూ విపత్తులో ఉన్నపుడు తన ఆదాయానికి అనుబంధంగా అందుబాటులో వున్న ఏ ఇతర వృత్తినైనా అవలంబించి తన ఆదాయాన్ని వృద్ధిపరుచుకుంటున్న సమృద్ధ బ్రాహ్మణున్ని వారించే ప్రతిబంధకం ఏమీ లేదు.

బ్రాహ్మణులకు భౌతికంగా లాభం కూర్చడానికి ఉద్దేశించిన ఇతర సదుపాయాలు మను స్మృతిలో అనేకం ఉన్నాయి. అవి దక్షిణ, దానాలు. ధార్మిక కర్మకాండ జరపటానికి పిల్చినప్పుడు బ్రాహ్మణుడు విధిగా గ్రహించే రుసుం దక్షిణ. సంస్కార, ధార్మిక కర్మకాండలతో నిండి వుంది. ప్రతి బ్రాహ్మణునికి ఆదాయ ఎంత ఎక్కువో ఊహించటం కష్టసాధ్యం కాదు. అతనికివ్వవలసిన దక్షిణ నుండి బ్రాహ్మణున్ని మోసగించటానికి అవకాశం ఏమీ లేదు. దక్షిణ వెనుక ఉన్న ధార్మిక స్పృహ వల్ల చెల్లింపు సక్రమంగా జరిగి తీరుతుంది. అయినా సరే, తన రుసుమును వసూలు చేసుకునే హక్కును మనువు బ్రాహ్మణులకు ఇవ్వదలిచాడు.

"(ఆదానం చేసి) సంపన్నుడైనప్పటికి ప్రజాపతి దేవతాకమయిన అశ్వాన్ని అగ్న్యాధేయ నిర్వహణకు దక్షిణగా ఇవ్వని బ్రాహ్మణుడు అనాహతాగ్నియే ఔతున్నాడు" (11-38)

"విశ్వాసంతో జితేంద్రియుడై ఇతర పుణ్యకర్మలను అతడు చేయాలి కాని (నిర్ణయించిన వాటి కంటె) తక్కువ దక్షిణాలతో యజ్ఞాల్ని ఏ పరిస్థితిలోను (ఇక్కడ) చేయగూడదు." (11-39)

దక్షిణలను స్వల్పమొత్తంలో ఇచ్చి చేసే యజ్ఞాల వల్ల పంచేంద్రియాలు, గౌరవం, స్వర్గ సుఖం, దీర్ఘాయుష్షు, కీర్తి, సంతానం, పశు సంపద నాశనమవుతాయి కనుక, తాహతు లేని వారు (శ్రౌత) యజ్ఞం చేయకూడదు. (11-40)

"తన దక్షిణను వసూలు చేసుకోవటానికి బ్రాహ్మణుడు అనుసరించే పద్ధతి కూడా చట్ట పరిధిలో నేరం కాదని చెప్పేంతవరకు వెళ్ళాడు మనువు."

ఆత్మరక్షణార్థమూ, దక్షిణ కోసం స్త్రీలని బ్రాహ్మణులని రక్షించేందుకూ (ఈ పరిస్థితు

లలో) మంచికోసం హత్యకు పాల్పడినా అతడు పాపం చేసిన వాడు కాడు. (8–349)

దాన విధి బ్రాహ్మణులకు మంచి ఆదాయాన్నిచ్చే మార్గం. బ్రాహ్మణులకు దానాలు చేయమని మనువు రాజును ఆదేశిస్తాడు.

"రాజు బ్రాహ్మణులకు ఉదారంగా దక్షిణలు ఇచ్చేందుకు రకరకాల (శ్రౌత) యజ్ఞాలను చేయాలి. తాను ఔన్నత్యం పొందేందుకు వారికి భోగభాగ్యాలు కల్పించాలి." (7–79)

"(వేదాలు చదివి) గురుకులం నుంచి తిరిగి వచ్చిన బ్రాహ్మణులను సత్కరించాలి. బ్రాహ్మణులకు (దానంగా) ఇచ్చిన ధనం రాజులకు అక్షయనిధి అని (శాస్త్రం) ఘోషిస్తుంది." (7–82)

"దొంగలు కాని, శత్రువులు కాని దానిని హరించలేరు. అది నశించదు. కాబట్టి రాజు బ్రాహ్మణుల యందు అక్షయ నిధిని ఉంచాలి." (7–83)

"కాని రాజు సకల రత్నాలను కానుకలను యజ్ఞాల నిమిత్తం వేదాంగ పారాయణులైన బ్రాహ్మణులకు ఇవ్వాలి." (11–4)

మనువు రాజుకు చేసిన ఉద్బోధ బ్రాహ్మణునికి కేవలం ఆశగా మిగలలేదు. పురావస్తు శాస్త్రజ్ఞులు కనుగొన్న దానపత్ర సంఖ్య సూచించిన దానిని బట్టి ఈ ఉద్బోధను బ్రాహ్మణులు పూర్తిగా వినియోగించుకున్నారని చరిత్ర తెలుస్తోంది. జిత్తులమారులు, సోమరిపోతులు, చురుకుదనం లేనట్టి బ్రాహ్మణులకు గ్రామం తర్వాత గ్రామాన్ని దానం ఇచ్చేటట్టుగా చేయటం ద్వారా రాజులే విధంగా బ్రాహ్మణుల వల్ల మోసపోయారో తెలుసుకుంటే మనకు ఆశ్చర్యం కల్గుతుంది. నేటి బ్రాహ్మణుల సంపదలో అధిక భాగం జిత్తులమారి ఎత్తులు వేసి మూఢులు – మత ధర్మావలంబులైన రాజులను, మోసగించటం ద్వారా పొందిందే. దానం కోసం బ్రాహ్మణుడు రాజును కొల్లగొట్టటంతో మనువు తృప్తి పడలేదు. ఆయన దాని విషయంలో జన సామాన్యాన్ని దోపిడీ చేయటానికి కూడి బ్రాహ్మణుని అనుమతించాడు. దీన్ని మనువు మూడు భిన్న మార్గాలలో సాధించాడు. తమ నిమిత్తం పవిత్ర విధిలో భాగంగా భావించి దానాల్ని చేయవలసిందిగాను, అదే సమయంలో బ్రాహ్మణునికిచ్చేది ఉత్తమోత్తమ దానంగా సూచిస్తూ అతడు ప్రజలకు ఉద్బోధించాడు.

"బ్రాహ్మణేతరులకిచ్చిన దానం సాధారణ ఫలమిస్తుంది. బ్రాహ్మణ బ్రువునికిచ్చిన దానం ద్విగుణ ఫలమిస్తుంది, అధీత బ్రాహ్మణునికిచ్చిన దానం శత సహస్రగుణ ఫలమిస్తుంది. వేద పారంగునికి (సాంగ వేదధ్యాయికి) ఇచ్చిన దానం అనంత ఫలమిస్తుంది." (7–85)

"గ్రహీత ప్రత్యేక విశిష్టతల ప్రకారం, (దాత) శ్రద్ధాసక్తుల రీత్యా చిన్నదైనా దానం పరలోకంలో ఫలాన్నిస్తుంది" (7–86)

కొన్ని సందర్భాలలో బ్రాహ్మణునికి దానం ఇవ్వడం తప్పనిసరి అని కూడా మనువు చెబుతాడు:

సంతానార్థికి (సంతానార్థం వివాహం చేసుకునేవాడికి), యజ్ఞం చేయగోరేవాడికి, పాంథునికి, సమస్తం దానం చేసినవాడికి, తన గురువు కోసం, తండ్రి కోసం, తల్లి కోసం, పేద విద్యార్థి కోసం, రోగి కోసం దానం అడిగేవాడికీ.. (11–1)

"పైని చెప్పిన తొమ్మిది మందిని ధర్మార్థం భిక్షకోరే స్నాతక బ్రాహ్మణులుగా గుర్తించాలి. ఆ నిర్ధనులకు వారి విద్యాస్థాయికి తగ్గట్టుగా దానాలివ్వాలి." (11–2)

"ఈ (తొమ్మిది మంది) బ్రాహ్మణ శ్రేష్ఠులకు సదక్షిణాన్ని పెట్టాలి. ఇతరులకు బహిర్వేది (సిద్ధమైన) అన్నాన్ని పెట్టాలి అని స్పష్టపరచారు." (11–3)

ఒంటరిగా జీవిస్తున్న వేద పారాయణుడైన బ్రాహ్మణునికి యథాశక్తి ధనాన్ని ఇవ్వాలి.(ఈ విధంగా చేస్తే) మరణానంతరం (దాత) స్వర్గ సుఖమనుభవిస్తాడు. (11–6)

భద్రత, స్థిరాదాయాలకు మూలమైన దాన నియమాన్ని మనువు చాలా తెలివితేటలతో కట్టుదిట్టలు చేసాడనటంలో సందేహం లేదు. మనువు దానాన్ని ప్రాయశ్చిత్తంతో ముడేశాడు. మనువు ప్రణాళికలో దుష్కర్మ అపరాధం కాకపోయినా పాపం లేదా పాపం+అపరాధం రెండూ ఔతాయి. పాపంగా దాని శిక్ష మత చట్టం పరిధిలోకి వస్తుంది. అపరాధంగా దాని శిక్ష లౌకిక చట్ట పరిధిలోకి వస్తుంది. పాపంగా దుష్కర్మ పాతకం అవుతుంది. దాని శిక్ష ప్రాయశ్చిత్తం. మనువు ప్రణాళిక ప్రకారం ప్రతి పాతకాన్ని ప్రాయశ్చిత్తం ద్వారా తొలగించుకోవచ్చు.

"నిర్దేశించిన నియమాలను ఉల్లంఘించి, నిందకు దారి తీసే తప్పు చేసి, ఇంద్రియాలు పట్టుదప్పి భోగలాలసుడైన నరుడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి." (11–44)

"అనుకోకుండా చేసిన పాపానికే ప్రాయశ్చిత్తమని (అందరు) ఋషులు చెప్పారు. అయితే శృతి నిదర్శనం వల్ల బుద్ధిపూర్వకంగా చేసిన దానికి కూడా ప్రాయశ్చిత్తముంది అని కొందరు తెలిపారు." (11–45)

"అనుద్దేశపూర్వకంగా చేసిన పాపం వేదాభ్యాసం వల్ల నశిస్తుంది, (మనుష్యుల) బుద్ధి

పూర్వక కృతపాపం వేర్వేరు (ప్రత్యేక) ప్రాయశ్చిత్తాదుల వల్ల నశిస్తుంది." (11-46)

(మొదటి రకం) దోషా శేషాల పర్యవసానంగా మూర్ఖులుగా, మూగవారిగా, గుడ్డివారిగా, చెవిటివారిగా, వికారులుగా, నింద్యులుగా జన్మిస్తారు.

"కాబట్టి కల్మషాన్ని కడిగేసుకోవడానికి ప్రాయశ్చిత్తం ఎల్లప్పుడూ చేసుకోవాలి. ఎవరి పాపాలు ప్రాయశ్చిత్తం వల్ల నశించవో అలాంటివారు వికృత చిహ్నలతో (మళ్ళీ) జన్మిస్తారు." (11-54)

మనువు విధించిన ప్రాయశ్చిత్తాదులు అనేకం. అవి ఏమిటో తెలుసుకోవటం కోసం జిజ్ఞాసువులు మనుస్మృతిని సంప్రదించవచ్చు. గమనించదగ్గ విషయమేమిటంటే ఈ ప్రాయశ్చి త్తాదులు కూడా బ్రాహ్మణునికి భౌతికంగా లాభం కలిగించే విధంగా రూపొందించడము. కొన్ని ప్రాయశ్చిత్తాలు బ్రాహ్మణునికి సామాన్య దానంగా రూపొందాయి. ఇంకొన్ని ధార్మిక సంస్కార క్రియల్ని విధించాయి. ధార్మిక సంస్కార క్రియలు బ్రాహ్మణులు తప్ప మరెవ్వరూ చేయగూడదు కాబట్టి, ధార్మిక కర్మకాండ నిర్వహణకు దక్షిణ (తప్పకుండా) ఇవ్వాలి కాబట్టి, దాన వ్యవస్థలో బ్రాహ్మణుడు మాత్రమే లాభపడతాడు.

కనుక నమ్రత, దారిద్ర్య సేవా (భావా) దర్శాల్ని మనువు బ్రాహ్మణుల ముందుంచాడని సూచించటం అసంగతం. బ్రాహ్మణులు నిశ్చయంగా మనువును ఆ రకంగా అర్థం చేసుకోలేదు. వాస్తవంగా వారు తాము విశేషాధికారాలు కలిగిన వర్గంగా సృజించబడ్డట్లు విశ్వసించారు. వారు నమ్మటమే కాకుండా ఇతర దిశలకు కూడా తమ విశేషాధికారాలను విస్తరించారు. ఈ విషయం తర్వాత చర్చిస్తాను. వారు తమను తాము పూర్తిగా సమర్ధించుకున్నారు. మనువు బ్రాహ్మణుల్ని 'భూసురులు'గా పేర్కొన్నాడు. వారు అలా కొనసాగేటట్టు (చట్టాన్ని) నిర్మించాడు.

బ్రాహ్మణ పరిపాలనకు, బ్రాహ్మణాధిక్యానికి పూర్తిగా ఏర్పాట్లు చేసిన మనువు తర్వాత అతని (బ్రాహ్మణుని) ప్రయోజనానికి అనుగుణంగా సంఘాన్ని మార్చటానికి శ్రీకారం చుట్టాడు.

వర్ణాల్ని కులాలుగా మార్చటం, బ్రాహ్మణ మతం తన విజయానంతరం మొదలుపెట్టిన తొలి స్వార్థపూరిత, విస్తృత ప్రయత్నం. బ్రాహ్మణమతం ఈ మార్పును తీసుకురావడానికి తీసుకున్న చర్యలకు సంబంధించిన ఖచ్చితమైన రికార్డు మనకు లభించదు. పైపెచ్చు దానికి విరుద్ధంగా వర్ణానికి కులానికి సంబంధించిన గొప్ప గందరగోళపు ఆలోచన మనకు వుంది. వర్ణం, కులం ఒకటే అని కొందరు భావిస్తున్నారు. అవి వేర్వేరు అని భావించే వారు సామాజిక వ్యవస్థలో అంతర్వివాహాల నిషేధం భాగమైనపుడు వర్ణం కులంగా మారిందని విశ్వసిస్తున్నట్లుగా కన్పిస్తోంది. కాకపోతే ఇదంతా తప్పు. ఇది తప్పుడు అభిప్రాయం ఎందుకంటే, వర్ణాన్ని కులంగా

మార్చేటప్పుడు మనువెక్కడా తన గమ్యాన్ని వివరించటం కాని, తన గమ్యానికి తన సాధనాలు ఏ విధంగా సంబంధించి ఉన్నాయో కాని తెలియజేయలేదు. గ్రాహ్యంగా ఉండటం ఎందుకంటే గ్రహింపబడడానికే అనేది ఆస్కార్ వైల్డ్ అభిప్రాయం. మనువుకు గ్రహింపబడాలనే ఉద్దేశం లేదు. కాబట్టి అతడు తన గమ్యాలను, అగమ్యాలను సాధించటానికి గాను తాను అవలంబించిన సాధ నాలను గురించి ప్రజల ఊహకు వదిలివేసి మౌనంగా ఉన్నాడు. (ఈ) విషయం హిందువులకు చాలా ముఖ్యమైంది. ఈ విషయమై స్పష్టీకరణ ప్రయత్నం పూర్తిగా ఆవశ్యకం. భిన్న వ్యక్తులు భిన్నభిన్న విధాలుగా ఊహించుకొని గందరగోళంలో పడాలి అని అనుకొన్న మనువు పన్నాగాన్ని బహిర్గతం చేయాలి. సంఘానికి పునాదిగా ఉన్న వర్ణ మౌలిక భావానను బ్రాహ్మణ మతం ఏ విధంగా ప్రమాదకరమైన తప్పుడు మలుపు తిప్పిందో తెలిపి వాస్తవ విషయాల్ని వెలుగుబాటలోనికి తీసుకురావాలి.

నేను చెప్పినట్లుగా మనువు పద్ధతులు మౌనంగాను అంతర్లీనంగానూ ఉంటాయి. కాలా నుక్రమంగా వర్ణ–కుల పరివర్తన చరిత్రను వివరంగా మనం ఇవ్వలేము కాని అదృష్టవశాత్తు ఈ మార్పు ఏ విధంగా జరిగిందో సూచించే స్పష్టమైన మైలురాళ్లున్నాయి.

ఈ మార్పు ఏ విధంగా జరిగిందో వివరంగా తెలియజేయటానికి ఉపక్రమించే ముందు వర్ణం – కులాల గందరగోళాన్ని స్పష్టం చేయనివ్వండి. ఈ రెంటి మధ్య వున్న భేద సాదృశ్యాలను గమనించటం ద్వారా ఈ పనిని బాగా చేయవచ్చు. వాస్తవానికి వర్ణం, కులం రెండూ ఒకే రకంగా స్ఫురిస్తాయి. రెండూ హోదాను, వృత్తిని స్ఫురింపజేస్తాయి. హోదా, వృత్తి అనే రెండు భావనలు వర్ణం, కులం రెంటిలో కనిపిస్తాయి. అయితే వర్ణం, కులం ఒక ముఖ్య విశేషంలో భేదిస్తున్నాయి. హోదాపరంగా కానీ, వృత్తిపరంగా కానీ వర్ణం వంశపారంపర్యం కాదు. కులం మాత్రం హోదాపరంగా, వృత్తిపరంగా వంశ పారంపర్యం. తండ్రి నుంచి కొడుకుకు సంక్రమించేది.

బ్రాహ్మణమతం వర్ణాన్ని కులంగా మార్చిందని నేనంటున్నానంటే నా ఉద్దేశ్యం అది హోదాను, వృత్తిని వంశపారంపర్యం చేసిందనే.

ఈ మార్పు ఏ విధంగా కార్యరూపం దాల్చింది? ఇంతకుముందు నేను చెప్పినట్టు, ఈ మార్పును నెరవేర్చుకోవటానికి బ్రాహ్మణమతం తీసుకున్న చర్యల అడుగుజాడలు లేవు కావి ఈ కార్యం ఏ విధంగా జరిగిందో స్పష్టం చేసే కొండ గుర్తులున్నాయి.

దశలవారీగా ఈ మార్పు జరిగింది. వర్ణం కులంగా మార్పు పొందేటప్పుడు మూడు దశల్ని కొట్టొచ్చినట్టుగా కనిపిస్తారు. మొదటి దశలో వర్ణకాలం అంటే వ్యక్తి హోదా, వృత్తి నిర్ణీత కాల వ్యవధికి సంబంధించి మాత్రమే. రెండో దశలో హోదా వృత్తులు వ్యక్తి వర్ణాన్ని జీవితకాలానికి మాత్రమే ప్రమేయపరిచాయి. మూడో దశలో వర్ణం తాలూకూ హోదా వృత్తులు వంశపారంపర్యంగా వచ్చేవి అయ్యాయి. న్యాయ భాషలో చెప్పాలంటే వర్ణం వల్ల లభించే

ఆస్తి ఆదిలో కాల పరిమితికి సంబంధించిన ఆస్తిగా ఉండేది. ఆతర్వాత అది జీవిత ఆస్తి అయింది. తుట్టతుదకు అది వర్ణం కులంగా మారటంతో సమానమయిన వారసత్వపు ఆస్తి అయింది. వర్ణం కులంగా మారటంలోని దశలు ఇవీ అని చెప్పటానికి ధార్మివాఙ్మయంలో[12] నమోదైన సంప్రదాయం నుంచి బోలెడంత ఆధారం లభిస్తోంది. విషయం పొందుపరిచిన ఈ సంప్రదాయాన్ని అంగీకరించకపోవటానికి కారణం ఏమీలేదు. దీనిని అనుసరించి వ్యక్తి వర్ణాన్ని నిశ్చయించే ప్రయత్నం మనువు – సప్తఋషులు అనే అధికార మండలి చేత జరిగింది. ప్రజల్లో నుంచి క్షత్రియులుగా, వైశ్యులుగా ఎవరు తగినవారో మనువు ఎంపిక చేయగా బ్రాహ్మణులుగా తగినవారిని సప్తఋషులు ఎంపిక చేశారు. మనువు, సప్త ఋషులచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల ఎంపిక జరిగిన తర్వాత మిగిలినవారు శూద్రులు. ఈ విధంగా నిర్ణయించిన వర్ణం ఏర్పాటు ఒక యుగం అంటే నాలుగు సంవత్సరాల పాటు కొనసాగుతుంది. నాల్గో సంవత్సరంలో కొత్త ఎంపిక కోసం అదే మనువు, సప్తర్షులు అనే హోదా కల్గిన అధికారులతో కొత్త మండలి ఏర్పాటవుతుంది. కిందటిసారి శూద్రులుగా ఉండటానికి మాత్రమే అర్హత పొందిన వారిలో కొందరు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులుగా ఎంపిక కాగా, కిందటిసారి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులుగా ఎంపికైన మరికొందరు ఈసారి శూద్రులుగా ఉండటానికి మాత్రమే అర్హత పొందగలిగేవారు. ఈ విధంగా వర్ణం సభ్య సిబ్బంది మారేది. సమాజ జీవితానికి అత్యవసరమయిన మానసిక శారీరికాభిరుచులకు, వృత్తులకు అనుగుణంగా ఉన్న వారిని తీసుకోవటానికి గాను ఒక పద్ధతి ప్రకారం నిర్ణీత కాలవ్యవధిలో జరిపే ఎంపిక పద్ధతి ఇది. వర్ణాల పునస్సమ్మేళన కాలాన్ని వ్యుత్పత్తిపరంగా వర్ణం మార్పు అని అర్థం వచ్చే మన్వంతరం అని వ్యక్తిగత వర్ణాన్ని స్థిరీకరించే కాల వ్యవధిని కూడా మన్వంతరం తెలుపుతోంది. మన్వంతరం అనే పదం విషయపరంగా సంపన్నమైంది; ఇది వర్ణ ప్రధానాంశాలను రెంటిని స్పష్టపరుస్తుంది. మనువు, సప్త ఋషులు అని వ్యవహరించే స్వతంత్ర ప్రజా మండలి చేత వర్ణ నిర్ణయం జరుగుతుందనే దాన్ని మొదటి తెలియపరుస్తుంది. వర్ణం కాలవ్యవధికి చెందిందని, కొంతకాలం తరువాత మనువు[13] చేత మార్పు జరుగుతుందని రెండోది తెలుపుతుంది. పురాణాలు తెలిపే ప్రాచీన సంప్రదాయం ప్రకారం మనువు సప్త ఋషుల చేత స్థిరపరిచిన వ్యక్తి వర్ణ కాలావధి 4 సంవత్సరాలు. యుగమని దీనికి వ్యవహారం. నాలుగు సంవత్సరాల కాలావధి చివర నాల్గో సంవత్సరంలో మన్వంతరం జాబితా సవరణ జరిగేది. కొందరు తమ పాత వర్ణాన్ని మార్చుకునేవారు. కొందరు అట్టిపెట్టుకొనేవారు. ఇంకొందరు కోల్పోయేవారు. మరికొందరు వర్ణాన్ని పొందేవారు.[14]

మూల వ్యవస్థ యుక్త వయస్కుల వర్ణ నిర్ణయానికి సంబంధించింది. అది పూర్వ శిక్షణపై కాని, పక్షపాతాలని, అభిరుచిని గానీ సూక్ష్మ పరిశీలన చేయడంపై కానీ ఆధారపడలేదు. మనువు, సప్తర్షులు ముఖాముఖి పరీక్షా మండలిగా వ్యవహరించేవారు. ఆ మౌఖిక పరీక్షలో సదరు వ్యక్తి నెగ్గుకురాగలిగిన తీరును బట్టి ఎంపిక జరిగేది. వర్ణ నిర్ణయం మొరటుగా గందరగోళంగా జరిగేది. ఈ వ్యవస్థ క్రమంగా కాలగర్భంలో కలిసిపోయింది. దాని స్థానంలో కొత్త వ్యవస్థ ఏర్పడింది. అది గురుకుల వ్యవస్థగా రూపొందింది. గురుకులం అనగా ఆచార్యుడు (విద్వాంసుడ)ని కూడా వ్యవహరించే గురువు నిర్వహించే పాఠశాల. అందరు పిల్లలు ఈ గురుకులానికి చదువుకునేందుకు వెళ్ళేవారు. విద్యా కాల వ్యవధి 12 సంవత్సరాలు. గురుకులం

బాలుణ్ని బ్రహ్మచారిగా వ్యవహరించేవారు. చదువు పూర్తయిన తర్వాత గురుకులంలో ఆచార్యులే విద్యార్థులకు ఉపనయనం జరిపేవారు. ఉపనయన సంస్కారం చాలా ముఖ్యమైన ధార్మికకాండ. అది ఆచార్యుడు విద్యార్థి వర్ణాన్ని నిర్ణయించి దానికి అనుగుణంగా లౌకిక విధి నిర్వహణ చేసేందుకు పంపే ఉత్సవం ఉపనయనం. మనువు, సప్తర్షుల నిర్ణయ పద్ధతి స్థానంలో వర్ణ నిర్ణయం కోసం ఉపయోగించిన నూతన విధానం ఇది. నిస్సందేహంగా ఈ నూతన విధానం పాత పద్ధతి కంటే గొప్పది. నిరాసక్తమయిన స్వతంత్రమయిన మండలి ద్వారానే నిర్ణయం జరగడం అనే పాత పద్ధతి ప్రధాన లక్షణాన్ని ఈ నూతన విధానం అట్టే పెట్టుకుంది. కాని వర్ణం అప్పగింతకు పూర్వపరంగా శిక్షణ అనేదాన్ని అది నూతన ప్రధాన లక్షణంగా చేర్చింది. వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దటంలో మాత్రమే శిక్షణ వ్యక్తిని వికసింపజేస్తుందనే భూమిక ఆధారంగా వ్యక్తి వర్ణాన్ని నిశ్చయించటంలో ఏకైక సురక్షిత మార్గం కాబట్టి అతని వ్యక్తిత్వాన్ని తెలుసుకోవడాన్ని వర్ణ నిర్ణయంలో ఈ ప్రధాన లక్షణంగా చేర్చటం నిస్సందేహంగా గొప్ప మెరుగుదలగా చెప్పవచ్చు.

ఆచార్య గురుకుల వ్యవస్థను రంగ ప్రవేశం చేయించడంతో వర్ణ కాల వ్యవధి కూడా మార్పునకు గురి అయింది. ఒక కాలావధికి సంబంధించిన వర్ణం జీవిత కాల పర్యంతం అయింది. కాని అది వంశ పారంపర్యం కాదు.

ఈ కొత్త వ్యవస్థ బ్రాహ్మణ మతానికి మింగుడుపడలేదు. దీనికి కారణం చాలా స్పష్టమే. వ్యాప్తిలో వున్న పద్ధతి ప్రకారం ఆచార్యుడు బ్రాహ్మణుని పుత్రుణ్ణి శూద్రుడిగా మాత్రమే అర్హుడని ప్రకటించే అవకాశం ఉంది. బ్రాహ్మణమతం సహజంగానే దాన్ని నివారించడానికి ఆత్రత పడింది. వర్ణాన్ని వంశపారంపర్యంగా చేయటంద్వారా మాత్రమే బ్రాహ్మణ పుత్రుల్ని శూద్రులుగా ప్రకటించే బెడద నుంచి రక్షించగలరు. దీన్ని సాధించటం కోసం బ్రాహ్మణ మతం ఎంతకు తెగించిందో ఊహించడం పెద్ద కష్టమేమీ కాదు.

# III

శిశువుల వర్ణాలను నిర్ణయించే పద్ధతిలో బ్రాహ్మణమతం మూడు విప్లవాత్మక మార్పుల్ని చేసింది. మొదట బాలురకు శిక్షణ పూర్తయ్యాక వర్ణ నిర్ణయం చేసే గురుకుల పద్ధతి దీనితో రద్దయింది. మనువుకు గురుకులం గురించి తెలుసు. అతడు గురువాసాన్ని[15] అంటే గురు పర్యవేక్షణలో గురుకుల శిక్షణను నివాసాన్ని ప్రస్తావించాడు. కానీ ఉపనయన సందర్భంగా మాత్రం దాన్ని సూచించలేదు. ఉపనయన సందర్భంగా గురువును గురించిన పరోక్ష ప్రస్తావన కూడా చేయకుండా త్యజించటం ద్వారా, ఉపనయన నిర్వహణాధికారం నుంచి గురువును మనువు తొలగించాడు. గురువుకు బదులుగా ఇంటి దగ్గర ఉపనయనాన్ని శిశువు తండ్రి నిర్వహించటానికి మనువు అనుమతించాడు.[16] రెండోది – ఉపనయనం సంస్కార కర్మగా మార్చబడింది. ప్రాచీన కాలంలో విశిష్ట వర్ణ విధి ప్రావీణ్య ధృవపత్రాలను పంపిణీ చేసే గురుకులంలో, విద్యార్థులకు పట్టాలను ప్రదానం చేసే గురువు నిర్వహించే ఉపనయనం

స్నాతకోత్సవం వంటిది.[17] మనువు చట్టంలో ఉపనయనం అత్యంత ముఖ్యమైన క్రతువు. ఒక ముఖ్యమైన వ్యవస్థ. దాని అర్థాన్నీ, ప్రయోజనాన్నీ మను చట్టం మార్చింది. మూడోది – ఉపనయనానికి శిక్షణకు వున్న సంబంధం పూర్తిగా తారుమారు అయింది. పాత వ్యవస్థలో ఉపనయనానికి ముందు శిక్షణ ఉండేది. బ్రాహ్మణ మతంలో శిక్షణకు పూర్వం ఉపనయనం ఉంటుంది. శిక్షణకుగాను బిడ్డను గురు కులానికి ఉపనయనానంతరం[18] అంటే, తండ్రి చేత వర్ణ నిర్ణయం జరిగాక పంపవలసిందిగా మనువును నిర్దేశించాడు.

ఉపనయన నిర్వహణను గురువు నుంచి తండ్రికి బదలాయించటమనేది బ్రాహ్మణ మతం చేసిన ప్రధానమయిన మార్పు. దీని ఫలితంగా బ్రాహ్మణుడు తన బిడ్డకు తానే ఉపనయనం చేసే హక్కు కల్గి ఉన్న కారణంగా తన వర్ణాన్నే బిడ్డకు ఇచ్చి దాన్ని వంశపారంపర్యం చేశాడు. వర్ణాన్ని నిర్ణయించే అధికారాన్ని గురువు నుంచి తొలగించటం ద్వారాను, తండ్రికి అధికారాన్ని సంక్రమింపజేయటం ద్వారాను బ్రాహ్మణమతం అంతిమంగా వర్ణాన్ని కులంగా మార్చింది.

వర్ణం కులంగా మార్పు పొందటం వెనుక ఇంత కథ వుంది. ఒకదాని నుండి ఇంకోదానిలోనికి మార్పు పొందే సంధి కాలాన్ని పునర్నిర్మించటం జరిగింది. ఇంతకు పూర్వమే పేర్కొన్న కారణాల వల్ల ఆశించిన విధంగా అన్ని వివరాలు ఖచ్చితంగా ఉండకపోవచ్చు. వర్ణం తన ఉనికిని కోల్పోయి కులం ఆవిర్భవించటానికి మధ్య వివిధ దశలు, మార్గాలు, పైన సూచించినట్టు జరిగి ఉంటుందనటంలో నాకు సందేహం లేదు.

బ్రాహ్మణమతం వర్ణాన్ని కులంగా మార్చటంలోని లక్ష్యాన్ని ఊహించటం కష్టంకాదు. ప్రాచీన కాలం నుంచి బ్రాహ్మణులు అనుభవిస్తున్న ఉన్నత స్థాయిని యోగ్యతా గుణాలతో సంబంధం లేకుండా బ్రాహ్మణులకు, వారి సంతతికి విశేషాధికారంగా కట్టబెట్టడమే దీని లక్ష్యం. మరోరకంగా చెప్పాలంటే, సద్గుణాల కారణంగా బ్రాహ్మణులలో కొందరు పొందిన ఉన్నత స్థాయిని – ఎంత నీచుడైనా, ఎంత పనికి మాలిన వాడైనా – ప్రతి బ్రాహ్మణునికి కట్టబెట్టి, కులీనునిగా చేసి అతనికి ఉన్నత స్థాయి కల్పించడమే దీని లక్ష్యం. ఎలాంటి మినహాయింపులు లేకుండా మొత్తం బ్రాహ్మణ జాతినంతటినీ ఉన్నతంగా చేసే ప్రయత్నమే ఇది.

బ్రాహ్మణమతం లక్ష్యం ఇదేనని మనువు ఆదేశాల బట్టి స్పష్టమవుతుంది. వర్ణాన్ని వంశపారంపర్యంగా చేయటం ద్వారా అజ్ఞానియైన[19] బ్రాహ్మణుడు కూడా మహా విద్వాంసుడైన బ్రాహ్మణుని స్థాయిని పొందగలడని మనువుకు తెలుసు. అజ్ఞాని అయిన బ్రాహ్మణుడు విద్వాస బ్రాహ్మణునితో సమంగా గౌరవం పొందడేమోనని మనువు భయపడ్డాడు, అందుకే మొత్తం బ్రాహ్మణవర్గాన్ని కులీనం చేయ ప్రయత్నించాడు. అజ్ఞాని బ్రాహ్మణుని గురించి మనువు అతిగా పట్టించుకున్నాడు – ఇదొక కొత్త అంశం – అజ్ఞానులు, కుటిలులు అయిన బ్రాహ్మణులను అగౌరవపరచకుండా అతను హెచ్చరికలు చేశాడు.

"ఏ రూపంలో ఉన్నా, అగ్ని ఏ విధంగా శక్తశాలి దైవమో – అదేవిధంగా అజ్ఞాని అయినా, విద్వాంసుడైనా బ్రాహ్మణుడు కూడా దైవశక్తి స్వరూపుడు" (9–317)

"కాబట్టి ఎంత నీచవృత్తిలో ఉన్నా, జన్మతః దైవ స్వరూపులైన బ్రాహ్మణులు పూజ్యులే" (9–139)

మొత్తం బ్రాహ్మణ జాతినంతటినీ కులీనం చేయాలని మనువుకు లేకపోతే, ఇటువంటి హెచ్చరిక అనవసరం. మంచి పట్ల చెడు ప్రదర్శించే కపట గౌరవం కూడా ఇక్కడ కరువైంది. బ్రాహ్మణుడు దుష్టుడైనా సరే, అజ్ఞాని అయినా సరే అతనిని పూజించాలని మనువు పట్టుబట్టడం కంటె నైతిక పతనం ఏముంటుంది?

వర్ణం కులంగా మారటంలోని లక్ష్యం గురించి చాలా చర్చించాము. అయితే, ఈ మార్పు పర్యవసానాలేమిటి?

ఆధ్యాత్మిక దృష్ట్యా పర్యవసానాలు, మనం స్థిరచిత్తంతో సంభావించలేనంత ప్రమాదకరమైనవి. మనుస్మృతి కారణంగా ఏర్పడ్డ బ్రాహ్మణ పురోహితుని స్థాయినీ, ఇంగ్లండ్ చర్చిలో మతాధికారుల చట్టం (Law of clergy) ఫలితంగా రూపొందిన పురోహితవర్గం స్థాయినీ పోల్చడం ద్వారా దీన్ని మెరుగుగా అర్థం చేసుకోవచ్చు. ఇంగ్లండ్‌లోని మతాధికారులు ఇతర పౌరులవలెనే నేర శిక్షాస్మృతికి లోబడినవారు. పైగా, వారు చర్చి క్రమశిక్షణ నియమాల చట్టానికి కూడా లోబడవలసి వుంటుంది. అర్హత సాధించకుండా మతాధికారిగా నియమతుడైతే అతను చర్చి క్రమశియణా నియమాల చట్టం ప్రకారం అనర్హత పొందుతాడు. ఆ అనైతికవర్తన నేరం కాకపోయినా సరే. ప్రజల ఆధ్యాత్మిక అవసరాలను తీర్చవలసిన మతాధికార వృత్తికి విద్వత్తు, నైతికత అవసరం కాబట్టి మతాధికారులపై ఈ రెండు రకాల అదుపు సమర్థనీయంగా భావించారు. బ్రాహ్మణమతంలో తాను మాత్రమే మతాధికారి కాగలిగిన బ్రాహ్మణుడు జ్ఞానవంతుడు కానీ, నీతిమంతుడు కానీ కానక్కరలేదు. అయినా సరే, ప్రజల ఆధ్యాత్మిక వ్యవహారాలకు గుత్తాధిపత్యం అతనిదే! దీన్ని అనుమతించే మత సూత్రాల ఘనత గురించి వేరే వ్యాఖ్య అనవసరం.

లౌకిక దృష్టితో చూస్తే, వర్ణం కులంగా మారినా దాని పర్యవసానాలు హిందువులలో వినాశకర ప్రవృత్తిని ప్రవేశపెట్టాయి. ప్రతిభకే ప్రాముఖ్యం లేదు. పుట్టుకకే పట్టం. ఏ ప్రతిభా లేకున్నా, ఎంత పనికిమాలిన వాడైనా సరే ఉన్నత కులంలో పుడితే చాలు గౌరవం లభిస్తుంది. యోగ్యత విషయంలో అల్పుడైనా సరే, పెద్ద కులంలో పుట్టిన వాడు – యోగ్యతలో అధికుడైన తక్కువ కులస్థుని కంటె గొప్పవాడవుతాడు. జన్మపైనైనా, ప్రతిభపైనైనా బ్రాహ్మణమతంలో జన్మే నెగ్గుతుంది. ప్రతిభ స్వయంగా ఎప్పుడూ గెలవదు. హోదా నుంచి ప్రతిభను వేరుచేసిన ఘనత బ్రాహ్మణమతందే. కులీన హోదా అనే బలిపీఠంపై తెలివితేటలను బలి ఇచ్చే తిరోగమన

సమాజాన్ని సృష్టించడం మరొకదానివల్ల కాదు.

బౌద్ధంపై విజయం తరువాత బ్రాహ్మణమతం చేసిన ఘన కార్యాల చిట్టాలో మూడో దానికి వద్దాం. అది బ్రాహ్మణులను బ్రాహ్మణేతరుల నుంచి వేరు చేయడం; బ్రాహ్మణేతరులలోని భిన్న సామాజిక శ్రేణులను వేరు చేయడం.

బౌద్ధ పరిపాలనలో నీరుకారిపోయే స్థితిలో ఉన్న చాతుర్వర్ణ్య ప్రాచీన సంఘ వ్యవస్థను పునరుద్ధరించే ప్రయోజనంలో పుష్యమిత్రుడు బ్రాహ్మణమత విప్లవం నిర్వహించాడు. కాని ఎప్పుడు బ్రాహ్మణ మతం బౌద్ధమతంపై విజయం సాధించిందో అప్పుడు పాత చాతుర్వర్ణ్య వ్యవస్థను యథాతథంగా పునరుద్ధరించడంతో మాత్రమే సంతృప్తి పడలేదు. ప్రాక్ బౌద్ధ మతదినాల నాటి చతుర్వర్ణ్య వ్యవస్థ చాలా సరళమయింది. బహిరంగంగా ఇది ఉండేది. వర్ణవ్యవస్థకు వివాహవ్యవస్థకు సంబంధం లేక పోవటమే దీనికి కారణం. చతుర్వర్ణ్యం నాలుగు విభిన్న తరగతులను గుర్తించినప్పటికీ అది వాటి మధ్య అంతర్వివాహాల (Inter marriages)ను నిషేధించ లేదు. ఒక వర్ణంలోని మగవాడు ఇంకో వర్ణంలోని ఆడదానిని న్యాయబద్ధంగా వివాహం చేసుకోవచ్చు. ఈ అభిప్రాయాన్ని సమర్థించే ఉదాహరణలు కోకొల్లలు. హిందూ పవిత్ర వాఙ్మయంలో పేరు ప్రఖ్యాతులు పొందిన ప్రసిద్ధులయిన గౌరవనీయ వ్యక్తులకు సంబంధించిన కొన్ని ఉదాహరణలను క్రింద ఇస్తున్నాను.

| భర్త | అతని వర్ణం | భార్య | ఆమె వర్ణం |
|---|---|---|---|
| 1. శంతనుడు | క్షత్రియుడు | గంగ | శూద్ర, అనామిక |
| 2. శంతనుడు | క్షత్రియుడు | మత్స్యగంధి | శూద్ర–జాలరి |
| 3. పరాశరుడు | బ్రాహ్మణుడు | మత్స్యగంధి | శూద్ర–జాలరి |
| 4. విశ్వామిత్రుడు | క్షత్రియుడు | మేనక | అప్సర |
| 5. యయాతి | క్షత్రియుడు | దేవయాని | బ్రాహ్మణి |
| 6. యయాతి | క్షత్రియుడు | శర్మిష్ట | అసురి–ఆర్యేతర |
| 7. జరత్కారుడు | బ్రాహ్మణుడు | జరత్కారి | నాగ,ఆర్యేతర |

చాతుర్వర్ణ్య విభజన నాలుగు వర్ణాల మధ్య అంతర్వి వాహాల్ని నిషేధించలేదనే విషయం మీద ఎవరికైనా సందేహముంటే బ్రాహ్మణోత్తముడయిన వ్యాస మహర్షి వంశ వృక్షాన్ని చూడ మనటం సబబు.

## వ్యాసుని వంశవృక్షం

వరుణ మిత్ర = ఊర్వశి

వశిష్ఠ = అక్షమాల

శక్తి =

పరాశర = మత్స్యగంధ

= వ్యాస

బ్రాహ్మణమతం పాశవిక కోపోద్రేకంతో విభిన్న వర్ణాల మధ్య అంతర్వివాహానికి అడ్డు కట్టవేసింది. మనువు నూతన న్యాయశాస్త్రాన్ని ప్రకటించాడు. ఇది ఈ క్రింది నియమాలతో ఉంది:

"ద్విజ వర్ణాల పురుషులు మొదట సవర్ణ స్త్రీలను వివాహమాడాలి." (3–12)

"శూద్రుడికి శూద్ర స్త్రీ మాత్రమే భార్య కాగలదు." (3–13)

"ఎంత కష్ట కాలంలోనైనా బ్రాహ్మణ క్షత్రియులు ప్రథమ కళత్రంగా శూద్ర స్త్రీని పొంది నట్లు (పురాణ) కథల్లో కూడా ప్రస్తావించలేదు." (3–14)

"ద్విజులు, మూర్ఖత్వంతో, శూద్ర స్త్రీని వివాహం చేసుకుంటే వారి సంతానం శూద్ర త్వాన్ని పొందుతారు." (3–15)

"అత్రి, ఉతథ్య పుత్రుడైన గౌతముల ప్రకారం శూద్ర స్త్రీని వివాహమాడినవాడు భ్రష్టు డౌతున్నాడు. శూద్ర స్త్రీ ద్వారా మగ సంతానం కలిగి పతితుడౌతాడని శౌనక ముని అభిమతం. కేవలం శూద్ర స్త్రీ నుండి మాత్రమే మగ సంతతి కలిగితే పతితుడౌతాడని భృగుమతం." (3–16)

"బ్రాహ్మణుడు శూద్ర స్త్రీని శయ్య మీదకు చేర్చుకుంటే నరకానికి పోతాడు. ఆమె వల్ల పుత్రుడ్ని పొందితే బ్రాహ్మణత్వాన్ని కోల్పోతాడు." (3–17)

"శూద్ర స్త్రీని వివాహమాడిన బ్రాహ్మణుడు తన భార్య సహాయంతో క్రతువులు నిర్వహించి అర్పించే నైవేద్యాన్ని పితృదేవతలు, దేవతలు స్వీకరించరు. పైపెచ్చు అలాంటి బ్రాహ్మణులకు స్వర్గ ప్రాప్తి లభించదు." (3–18)

"శూద్రస్త్రీ అధరపానం చేసినవాడు, దాని ఊపిరి సోకినవాడు, దానియందు సంతానాన్ని కన్నవాడు ఎవడో అట్టి వాడికి ప్రాయశ్చిత్తం లేదు." (3-19)

బ్రాహ్మణమతం అంతర్వివాహాల నిషేధంతో తృప్తి పడలేదు. ఇంకా కొంచెము ముందుకు వెళ్ళి అంతర్భోజనాలను సైతం నిషేధించింది.

మనువు ఆహారంపైన కూడా కొన్ని విధి నిషేధాలను విధించాడు. కొన్ని ఆరోగ్య సంబంధమయినవి. కొన్ని సాంఘికమయినవి. సాంఘికమైన వాటిలో ఈ క్రిందివి గమనించతగ్గవి:

"రాజాన్నం తేజస్సును, శూద్రాన్నం బ్రహ్మ వర్చస్సును; స్వర్ణకారుని అన్నం ఆయుష్షును, చర్మకారుని అన్నం కీర్తిని నశింపచేస్తాయి." (4-218)

"వంటవాళ్ళు, చేతివృత్తుల వారి అన్నం సంతతిని, రజకుని అన్నం బలాన్ని నశింపచేస్తాయి." (4-219)

"పైని క్రమంలోని ఇతరుల అన్నాన్ని, తింటే చర్మాన్ని ఎముకల్ని తల వెంట్రుకల్ని తిన్న దోషాన్ని పొందుతారని ప్రాజ్ఞులు చెబుతారు." (4-221)

"ఈ చెప్పిన వారిలో ఒకవేళ ఎవరి అన్నాన్నైనా తెలియక తింటే మూడు రోజుల ఉపవాసం చేయాలి. తెలిసి తింటే తీవ్ర ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. మలమూత్రాదులను తింటే ఏ ప్రాయశ్చిత్తం చేసుకుంటారో అటువంటి ప్రాయశ్చిత్తాన్ని చేసుకోవాలి." (4-22)

అంతర్వివాహాలను, అంతర్భోజనాలను నిషేధించే ప్రయత్నంలో బ్రాహ్మణమతం పాశవిక క్రౌర్యంతో వ్యవహరించిందని నేను చెప్పాను. ఈ విషయంలో ఎవరికైనా సందేహముంటే వారు మనువు భాషను చూడండి.

శూద్ర స్త్రీని గూర్చి మనువు చూపే అసహ్యాన్ని గమనించండి.

అలాగే శూద్రుల ఆహారాన్ని గురించి కూడా మనువు ఏమి చెప్పాడో గుర్తు పెట్టుకోండి. అది వీర్యం, మలం, మూత్రం వలె అపరిశుభ్రమైనదని అతడు చెప్తున్నాడు.

ఈ రెండు చట్టాలు కుల వ్యవస్థను రూపొందించాయి. అది అంతర్వివాహాల, అంతర్భోజనాల నిషేధం అనే రెండు స్తంభాలపై నిలబడి వుంది. కుల వ్యవస్థకూ, అంతర్ వివాహాల సహభోజనాల విధి నిషేధాలకూ ఉన్న సంబంధం గమ్యానికీ సాధనాలకూ ఉన్న సంబంధం

వంటిది. నిజానికి మరే సాధనం ద్వారానూ ఆ గమ్యం సాధ్యం కాదు.

బ్రాహ్మణమతం లక్ష్యం, ధ్యేయం కులవ్యవస్థను స్థాపించడమేనని-ఈ సాధనాల కల్పన ప్రదర్శిస్తోంది. బ్రాహ్మణమతం అంతర్వివాహాల అంతర్భోజనాలకు వ్యతిరేకంగా నిషేధాల్ని విధించింది. కానీ, బ్రాహ్మణమతం సామాజిక వ్యవస్థలో ఇతర మార్పులను కూడా చేసింది. ఆమార్పుల వెనుక ఉన్న ఉద్దేశాలు నేను చెప్పినవే అయితే కనుక, కుల వ్యవస్థను శాశ్వతం చేయాలని బ్రాహ్మణమతం దానికోసం నీతి న్యాయాల విచక్షణ లేకుండా మార్గాలను తీవ్రంగా ప్రయోగించిందని అంగీకరించాలి. బాలికా వివాహాల గురించి, వితంతువుల జీవితాల గురించి మనుస్మృతిలో చెప్పిన నియమాలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

స్త్రీల వివాహం గురించి మనువు విధించిన నియమాలను చూడండి.

"సముచిత సమయంలో కూతురుకి వివాహం చేయని తండ్రి నింద్యుడౌతాడు." (9-4)

"ఈడు రాకున్నా అంటే-రజస్వలా వయస్సు రాకున్నా- ఉత్కృష్టుడు, సురూపుడు, సహ కులస్థుడు అయిన వరుడు లభించినప్పుడు తండ్రి తన కుమార్తెకు విధిగా వివాహం చేయాలి." (9-88)

ఈ నియమం ప్రకారం బాలికకు యుక్త వయస్సు రానప్పటికి అంటే శిశువుగా ఉన్నప్పటికి వివాహం చేయాలి-అని మనువు శాసిస్తున్నాడు.

ఇప్పుడు వితంతువులకు సంబంధించి మనువు ఈ కింది నియమాన్ని విధిస్తున్నాడు.

"భర్త చనిపోయినట్లయితే (వితంతు స్త్రీ) పుష్పమూల ఫలాలచే స్వచ్ఛందంగా, శరీరం కృశింపజేసుకోవాలి కానీ, పర పురుషుల పేరు కూడా పలుకకూడదు." (5-157)

ఏ వితంతు స్త్రీ చనిపోయిన భర్తను ధిక్కరించి సంతాన వాంఛతో తిరిగి వివాహం చేసుకుంటుందో, ఆ స్త్రీ లోకంలో నిందురాలై పరలోకంలో (స్వర్గంలో) స్థానాన్ని కోల్పోతుంది." (5-161)

"భర్తతో కాక పర పురుషుని వల్ల కలిగిన సంతానాన్ని ఆమె వారసులుగా పరిగణించరు. భార్య యందు పుట్టించబడే సంతానం కాబట్టి పుట్టించిన వాడికీ సంతానం చెందదు. ఉత్తమ స్త్రీకి ద్వితీయ భర్తను ఎక్కడా అనుమతించలేదు." (5-162)

ఇదీ స్త్రీపై రుద్దిన వైధవ్య నియమం. సతీసహగమనం గురించి కూడా ప్రస్తావన చేసి ఉండవచ్చు కానీ దీన్ని గురించి మనువు మౌనం వహించాడు.

ఆమె వేరుగా లేదా ఒంటరిగా జీవించకూడదు అని దాదాపు మనువంతటి పరమ ప్రామాణికుడైన యాజ్ఞవల్క్యుడు[20] చెప్పాడు.

"భర్తను కోల్పోయినప్పుడు ఆమె (వితంతువు) తండ్రిని, తల్లిని, కొడుకును, సోదరుని, అత్తను, మేనమామను విడిచి దూరముగా ఉండగూడదు. ఇట్లా ఉంటే ఆమె నిందార్హురాలు." (86)

ఇక్కడ కూడా యాజ్ఞవల్క్యుడు వితంతువు సతి కావాలని సూచించలేదు. కాని యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యానమైన 'మితాక్షర' గ్రంథాన్ని రచించిన విజ్ఞానేశ్వరుడు పై శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ ఈ క్రింది విమర్శ చేశాడు.

"ఇది బ్రహ్మచర్య జీవితానికి ప్రత్యామ్నాయంగా సూచించినట్లయితే చూడండి, విష్ణుస్మృతి పాఠం[21]: భర్త మరణానంతరం బ్రహ్మచర్యమాచరించాలి. లేదా భర్తతో పాటు చితిపై కెక్కాలి."

"అతని (భర్త)తో పాటు చితిపైకెక్కితే గొప్ప ప్రయోజనం ఉంటుంద"ని విజ్ఞానేశ్వరుడు[22] తన అభిప్రాయంగా తెలిపాడు.

దీన్నిబట్టి సతి ఏ విధంగా కల్పించబడిందో సులభంగా స్పష్టంగా గ్రహించవచ్చు. వితంతువు పునర్వివాహం చేసుకోగూడదనేది మాత్రమే మనువు నియమం. కాని విజ్ఞానేశ్వరుని ప్రకారం స్మృతి కాలం నాటి నుంచి మనువు నియమానికి భిన్న వ్యాఖ్యానం ఇవ్వడం ప్రారంభమైనట్టు కనిపిస్తుంది. ఈ నూతన అన్వయంలో మను నియమాన్ని వితంతువుకు రెండు ప్రత్యామ్నాయాలలోను ఏదో ఒకదాన్ని ఎంచుకోవలసిందిగా వ్యాఖ్యానించడం జరిగింది. (1) నీ భర్తతో పాటు చితిలో కాలు లేదా (2) అలా గనక కాలేకపోతే అవివాహితగా ఉండిపో. ఇది పూర్తిగా తప్పు అన్వయం. మనువు ఈ అర్థంలో ఎక్కడా ఆ శబ్దాలను వాడలేదు. ఎలాగో అది అంగీకరాన్ని పొందింది. విష్ణుస్మృతి కాలం దాదాపు క్రీ.శ. 3.4 శతాబ్దాలు కాబట్టి సతి నియమం ఈ కాలం నుంచి మొదలయిందని చెప్పవచ్చు.

ఇవి కొత్త నియమాలనేది మాత్రం నిశ్చయం. బాలిక పుష్పవతి కాక పూర్వమే వివాహం జరిపించాలనే మను నియమం కొత్తదే. బౌద్ధమత పూర్వకాలానికి చెందిన బ్రాహ్మణమతంలో[24] రజస్వలానంతరం మాత్రమే కాదు యుక్త వయస్కులైన తరువాతే వారికి పెళ్ళిళ్లు చేసేవారు. ఇందుకు తగిన ఆధారముంది. అలాగే, భర్తను కోల్పోయిన స్త్రీ పునర్వివాహం

చేసుకోకూడదనే నియమం కూడా కొత్తదే. బౌద్ధమతం పూర్వమున్న బ్రాహ్మణమతంలో వితంతు వివాహాల నిషేధం లేదు. సంస్కృత భాషలోని 'పునర్భు' (రెండవ పర్యాయం వివాహమాడిన స్త్రీ), 'పునర్భవ' (రెండవ భర్త) అనే శబ్దాలు వాస్తవంగా బౌద్ధపూర్వ బ్రాహ్మణమతంలో[24] ఇటువంటి వివాహాలు సర్వసాధారణం అనే విషయాన్ని తెలియచేస్తున్నాయి. ఇక 'సతి'కి సంబంధించిన విషయం. అది ఎప్పటి నుంచి అమలులోకి వచ్చింది అనే విషయంలో,[25] అది ప్రాచీన కాలంలోనే ఉంది అనేదానికి తగిన ఆధారాలు ఉన్నాయి. అయితే తరువాత అది అంతరించిదనడానికి కూడా ఆధారాలున్నాయి. కానీ, దాని పునరుజ్జీవనం పుష్యమిత్రుని నాయకత్వంలో బ్రాహ్మణమతం బౌద్ధంపై విజయం సాధించిన తరువాతే జరిగింది. అయితే, పునరుజ్జీవనం జరిగింది మనువుకు కొద్దికాలం తరువాత.

అసలు ప్రశ్న ఏమిటంటే–బ్రాహ్మణ మత విజయం తర్వాత ఇలాంటి మార్పులు ఎందుకు చేశారని? యుక్త వయస్సు రాకపూర్వమే లేక రజస్వల కాక పూర్వమే వివాహం చేయాలని నిర్ణయించటంలో బ్రాహ్మణమతం సాధించదలచిన ప్రయోజనం ఏమిటి? భర్తను కోల్పోయిన స్త్రీ పునర్వివాహం చేసుకోరాదని; చనిపోయిన భర్త చితిపైకెక్కి అగ్నిజ్వాలల్లో తననుతాను ఆహుతి చేసుకోవాలని నిర్దేశించటం ద్వారా బ్రాహ్మణమతం సాధించిందేమిటి? ఈ మార్పులకు ఎలాంటి వివరణలు ఇప్పటిదాకా లేవు. సి.వి.వైద్య మాత్రం బాల్య వివాహాల కారణాలను ప్రస్తావించారు.[26] ఆయన అభిప్రాయం ప్రకారం: స్త్రీలు బౌద్ధ సన్యాసినులుగా మారకుండా ఉండటానికే బాల్య వివాహాలు చేశారు. ఈ వివరణ నాకు సంతృప్తి కలిగించలేదు. అయితే ఇక్కడ వైద్య–మనువు వివాహానికి తగిన వయస్సు విషయంలో నిర్దేశించిన నియమాన్ని పరిగణనలోకి తీసుకోలేదు. ఆ నియమం ప్రకారం:

"ముప్పై సంవత్సరాలు వయసుగల పురుషుడు, పన్నెండు సంవత్సరాల మనోహరాకృతి గల కన్యకనూ; ఇరవై నాలుగు సంవత్సరాల వయసుగల పురుషుడు ఎనిమిది సంవత్సరాల వయస్సుగల బాలికను వివాహం చేసుకోవాలి." (9–94)

బాల్య వివాహాలను ఎందుకు ప్రవేశపెట్టారనేది కాదు ప్రశ్న. మరి వివాహ వయస్సు విషయంలో వధూవరుల మధ్య ఇంతటి అంతరాన్ని మనువు ఎందుకు నిర్దేశించాడనేదే ప్రశ్న.

'సతి'ని వ్యాఖ్యానించటానికి కాణే[27] ఒక ప్రయత్నం చేశాడు. అతని వివరణ ప్రకారం సతిలో కొత్త అంశం ఏమీలేదు. ప్రపంచంలోని కొన్ని ఇతర ప్రాంతాల్లోలాగానే భారతదేశంలో కూడా, ప్రాచీన కాలంలో సతి ఉంది. ఈ వివరణ కూడా సంతృప్తికరంగా లేదు. ఈ సతి ఆచారమే భారతీయేతర ప్రపంచ దేశాల్లో ఉంటే గనక, అది ఇక్కడున్నంత తీవ్ర స్థాయిలో మాత్రం లేదు. క్షత్రియులలో ఇది ప్రాచీన కాలంలోనే ఉండి వుంటే–తిరిగి ఎందువల్ల ఇది పునరుద్ధరించబడింది? ఇది ఎందువల్ల సార్వజనీనం చేయబడలేదు? దీనికి సంతృప్తికరమైన వివరణ లభించదు. వారసత్వ చట్టాల నేపథ్యంలో సతి గురించి కాణే ఇచ్చిన వివరణ నాకు

సంతృప్తి కలిగించలేదు. బెంగాల్‌లో అమలులో ఉన్న హిందూ వారసత్వ చట్టాల ప్రకారం స్త్రీలకు ఆస్తి హక్కు ఉండడం ఆ వివరణకు కారణం కావచ్చు. ఆస్తిలో ఒక వాటాదారుని వదిలించుకోవడం కోసం భర్త తరపు బంధువులు వితంతువుపై సతిని ఆచరించమని వత్తిడి తెస్తారు కాబట్టి, బెంగాల్‌లో సతి ఆచారం ఎందుకు విస్తృతంగా ఉందో అర్థమవుతుంది. కానీ భారతదేశంలోని ఇతర ప్రాంతాల్లో ఆ ఆచారం ఎలా తలెత్తిందో, ఎలా అమలులోకి వచ్చిందో మాత్రం ఆ వివరణ మనకు తెలియజెప్పలేదు.

ఇక విధవా పునర్వివాహ నిషేధ విషయానికి మళ్ళీ వస్తే, దానికి ఏ విధమైన వివరణా లేదు. అమలులో ఉన్న ఆచారానికి భిన్నంగా విధవా పునర్వివాహంపై నిషేధం ఎందుకు వచ్చింది? అత్యంత బాధాకరమైన జీవితాన్ని ఆమె ఎందుకు గడపవలసి వచ్చింది? ఎందువల్ల ఆమెను అనాకర్షణీయంగా చేశారు?

సతి ఆచారానికి సంబంధించి, నిర్బంధ వైధవ్యం గురించి, సతి గురించి నా వివరణలో భిన్నమైనవి. వాటిని పరిశీలన కోసం సమర్పిస్తున్నాను.[28]

"కులం వెలుపల వివాహ సంబంధాలు పెట్టుకోవడం లేదా అంతర్వివాహం విధానం (Exogamy)పై కులంలో మాత్రమే వివాహ సంబంధాలు ఏర్పరచుకోవడం లేదా సకుల వివాహ విధానం (Endogamy)పైచేయి కావడమే కులం సృష్టి. కానీ ఈ మార్పు సులువైనదేమీ కాదు. ప్రత్యేకమైన కులంగా రూపొందాలనుకునే ఒక ఊహాజనిత సమూహాన్ని తీసుకుని, సకుల వివాహ విధానాన్ని అమలుపరిచేందుకు ఆ సమూహం ఏ పద్ధతులు అనుసరిస్తుందో విశ్లేషిద్దాం. ఒకవేళ సకుల వివాహ విధానం కాళ్ళూనక ముందు అంతర్ వివాహ విధానం ఏదైనా సమూహంలో పాతుకుపోయి ఉన్నట్టయితే, కేవలం నిషేధ లాంఛనాల ద్వారా ఆ సమూహంలో అంతర్వివాహాన్ని నిరోధించడం సాధ్యం కాదు. పరస్పరం సన్నిహిత సంబంధాలు కలిగిన సమూహాలలో ఒకదానితో ఒకటి సమ్మిళితమై, వారు వీరై ఒక సజాతీయ సమాజంగా రూపొందడానికి ప్రయత్నించే ధోరణి వుంటుంది. కుల వ్యవస్థాపక ప్రయోజనం రీత్యా ఆ ధోరణిని బలంగా ఎదుర్కోవాలంటే, వివాహ సంబంధాల విషయంలో ప్రజలు అతిక్రమించకూడదని ఓ లక్ష్మణరేఖను నిర్ణయించడం అవసరం."

"అయితే, అంతర్వివాహాలను నిరోధించే నిషిద్ధ రేఖను నిర్ణయించేటప్పుడు సమూహం లోపల కొన్ని సమస్యలు ఎదురవుతాయి. వాటికి పరిష్కారాలు సులువుగా లభించవు. ఒక సాధారణ సమూహంలో స్త్రీ పురుషుల సంఖ్య దాదాపు సమానంగా ఉంటుంది. వారిలోని సమ వయస్కుల సంఖ్య కూడా స్థూలంగా సరిసమానంగానే వుంటుంది. కానీ, వాస్తవ సమాజాలలో ఈ సరిసమానత ఎప్పుడూ ఖచ్చితంగా ఉండదు. ఒక కులంగా రూపొందాలనుకునే సమూహానికి, స్త్రీ పురుషుల సంఖ్యను సరిసమానంగా ఉండేట్టు చూసుకోవడం పరమ లక్ష్యం అవుతుంది. అలా లేకపోతే, సకుల వివాహ విధానం అమలు జరపడం కష్టమవుతుంది. ఆ సమూహంలోని

సభ్యులకు సమూహంలోనే వివాహ వ్యక్తులను అందించలేకపోతే, వారు సామూహం నిర్ణయిం చిన రేఖను అతిక్రమించి ఇష్టానుసారం ఇతరత్రా తమ అభీష్టాలను నెరవేర్చుకోవచ్చు. తమ సమూహంలోనే వివాహ సంబంధాలను కల్పించేందుకు, స్త్రీ పురుషులలోని వివాహ యోగ్యులైన వారి సంఖ్యను సరిసమానంగా ఉంచడం, కులంగా ఏర్పడాలనుకునే ఆ సమూహానికి అత్యవ సరం. అలా సరిసమానంగా ఉంచడం ద్వారానే సమూహం సకుల్య వివాహ విధానం దృఢంగా ఉంటుంది; సంఖ్యలో ఎక్కువ తేడా వుంటే ఆ విధానం విచ్ఛిన్నమవుతుంది.

కులానికి సంబంధించిన ఈ సమస్య, అంతిమంగా స్త్రీ పురుషులలోని వివాహ యోగ్య వయస్కుల సంఖ్యలో తేడాను సరిదిద్దడంగా పరిణమిస్తుంది.

ఒక జంటలోని ఇద్దరు ఒకేసారి మరణించినప్పుడు యిరువర్గాల సమతూకం కొన సాగుతుంది. అయితే ఇది అరుదు. భార్యకంటే భర్త ముందుగా మరణించవచ్చును. దీని పర్యవసానంగా సమూహంలో ఒక అదనపు మహిళ చేరినట్లవుతుంది. ఈ అదనపు మహిళ సమస్యను పరిష్కరించకపోయినట్లయితే, ఆమె అంతర్వివాహానికి పాల్పడి, సమూహానికి చెందిన సకుల వివాహ వ్యవస్థను ఛేదించే అవకాశం ఉంది. ఇదే విధంగా, భార్య ముందుగా మరణించి నట్లయితే సమూహంలో ఒక అదనపు పురుషుడు సమూహంలో చేరినట్లవుతుంది. ప్రారంభంలో ఈ పురుషుని యెడల సమూహంలో సానుభూతి లభించినప్పటికీ, అతని సమస్యను సరైన రీతిలో పరిష్కరించకపోయినట్లయితే కులాంతర వివాహం చేసుకుని అంతర్వివాహ చట్రాన్ని అతిక్రమించే అవకాశం ఉంది. ఈ విధంగా చోటు చేసుకున్న యీ అదనపు స్త్రీ, పురుషులి ద్దరూ సమూహానికి గుదిబండలుగా మారతారు. వీరికి సరైన భాగస్వాములను చూపించటంలో సమూహం విఫలమైతే వారు తమ భాగస్వాములను యితర కులాల నుంచి దిగుమతి చేసుకునే అవకాశం ఉంది. ఈ అదనపు స్త్రీ పురుషుల సమస్యకు పరిష్కారం కనుగొనడంలో యిదివరకు ఊహా సమూహం ఏ విధంగా ప్రవర్తిస్తుందో చూద్దాం. ముందుగా అదనపు మహిళ విషయాన్ని తీసుకుందాం. ఆమె సమస్యను పరిష్కరించి, సకుల వివాహ విధానాన్ని కాపాడటానికి రెండు మార్గాలున్నాయి."

"మొదటి మార్గం: మరణించిన భర్త చితిమంటలలో ఆమెను కూడా కాల్చి వదిలిం చుకోవటం. అయితే, ఇది స్త్రీ పురుష సంఖ్యాభేదాన్ని పరిష్కరించే ఆచరణీయ పద్ధతి కాదు. కొన్ని సందర్భాలలో యీ పద్ధతి ఫలితాన్ని ఇస్తుంది. కొన్నిసార్లు ఇవ్వదు. ఇది సులభమైన పరిష్కారంగా కనిపించినప్పటికీ కఠినమైన పద్ధతి కావడం వల్ల ప్రతి అదనపు మహిళనూ ఈ విధంగా వదిలించుకోవడం కుదరదు. అయితే, అదనపు మహిళ (విధవ) సమస్య పరిష్కారం కాకపోతే సమూహంలోనే మిగిలిపోతుంది; అప్పుడు రెండు ప్రమాదాలను ఎదుర్కోవాలి. ఆమె సకుల వివాహ నిబంధనలను అతిక్రమించి కులాంతర వివాహాన్ని చేసుకునే ప్రమాదం ఉంది. లేదా తన కులంలోని వ్యక్తినే వివాహం చేసుకోవచ్చును. తద్వారా, ఆమె ఆ కులంలోని వివాహంకాని మరో స్త్రీ వివాహ అవకాశాలకు తీవ్రమైన పోటీనిస్తుంది. అంటే ఏ విధంగా

చూసినా సరే ఈ అదనపు మహిళ ఒక పెద్ద సమస్యగా మిగిలిపోతుంది. ఆమెను కాల్చివేయడం అనే పరిష్కారం ఆచరణయోగ్యం కాదు కాబట్టి సమస్యను పరిష్కరించేందుకు మరో విరుగుడు కోసం ప్రయత్నించాలి."

"ఆమెపై జీవితాంతం బలవంతంగా వైధవ్యాన్ని రుద్దడం అనేది రెండవ పరిష్కారం. ఫలితాలను పోల్చిచూస్తే, యీ పరిష్కారం కంటె కాల్చి చంపడమే మెరుగైనదిగా కనిపిస్తుంది. అదనపు మహిళ వల్ల ఎదురయ్యే మొత్తం మూడు నష్టాలనూ నివారించవచ్చును. చచ్చిపోయిన స్త్రీ కులానికి లోపల గానీ, వెలుపలగానీ పునర్వివాహానికి పాల్పడి సమస్యను సృష్టించలేదు. కానీ ఆచరణయోగ్యతరీత్యా నిర్బంధ వైధవ్యమే గొప్పది. మానవత్వం రీత్యా కూడా మెరుగైనదైన ఈ పద్ధతి పునర్వివాహ ప్రమాదాన్ని కూడా సహగమనంవలె నివారిస్తుంది. కానీ, సమూహం నైతికతను ఇది కాపాడలేదు. నిర్బంధ వైధవ్యంలో మగ్గే స్త్రీ, భవిష్యత్తులో న్యాయబద్ధమైన భార్య కాగల సహజ హక్కును కోల్పోయిన స్త్రీ వల్ల అనైతికవర్తనకు అవకాశం పెరుగుతుంది. అయితే, ఇదేమంత అధిగమించలేని ఇబ్బంది కాదు. అటువంటి స్త్రీకి ఆకర్షణీయం కానంతగా హీనత్వాన్ని ఆపాదించవచ్చు."

"కులంగా రూపొందాలనుకున్న సమూహంలోని అదనపు మహిళ సమస్యకంటే, అదనపు పురుషుని (విధురుడు) సమస్య మరింత జటిలమైనది. అనాది నుంచి స్త్రీ కంటే పురుషునిదే పైచేయిగా ఉంటూ వచ్చింది. ప్రతీ సమూహంలోనూ పురుషుని పాత్ర ప్రబలమైనదీను, స్త్రీకంటే ఎక్కువ గౌరవాన్ని కలిగి ఉన్నదీను, సాంప్రదాయకమైన ఈ ఆధిక్యం వలన పురుషుని ప్రతి కోరికనూ సమూహం ప్రత్యేక శ్రద్ధతో పరిగణించవలసి వచ్చింది. ఇందుకు భిన్నంగా, తనపై విధించిన సామాజిక, ఆర్థిక మతపరమైన నిషేధాజ్ఞలను స్త్రీ సులువైన ఎర కావలసి వచ్చింది. అయితే నిషేధాలను రూపొందించే పురుషుడు మాత్రం వాటికి ఎల్లప్పుడూ అతీతంగానే ఉండేవాడు. ఈ రకమైన అనుకూల వాతావరణం కలిగిన అదనపు పురుషునికి, అదనపు మహిళపై చూపిన వైఖరినే అవలంబించడం సాధ్యం కాదు."

"మరణించిన భార్యతోనే, భర్తను కాల్చివేయడం రెండు విధాలుగా ప్రమాదకరమైంది. మొదటిగా: అతను పురుషుడు కాబట్టి ఆవిధంగా చేయడం అసంభవం. రెండవది: ఆ విధంగా అదనపు పురుషుణ్ని కాల్చివేసినట్లయితే కులం ఒక బలిష్టమైన వ్యక్తిని కోల్పోతుంది. ఇక ఆ సమస్యను హాయిగా పరిష్కరించటానికి, రెండు మార్గాలున్నాయి. హాయిగా అని ఎందుకు అంటున్నానంటే, అతను సమూహానికి ఒక ఆస్తి కాబట్టి."

"సమూహానికి అతని ఉనికి ఎంత అవసరమో, సకుల వివాహ విధానం కూడా అంతే అవసరం. అందువల్ల అదనపు పురుషుని సమస్యా పరిష్కారం యీ రెండు లక్ష్యాలను సంతృప్తిపరచే విధంగా ఉండాలి. వైధవ్యం పొందిన స్త్రీ విషయంలో అనుసరించిన విధానాన్ని అంటే బలవంతంగా విధురత్వాన్ని అనుసరించేటట్టు చేయటం, పురుషుని విషయంలో కూడా అమలు

జరపడాన్ని ఒక పరిష్కారంగా చూపించవచ్చు. ఈ పరిష్కారం అమలు అంత కష్టమైంది కాదు. ఎందుకంటే యిటువంటి నిర్బంధమేదీ లేకుండానే భౌతిక సుఖాలను త్యజించి, స్వచ్ఛందంగా బ్రహ్మచర్యాన్ని కొందరు పాటిస్తారు. మరికొందరు సన్యాసం తీసుకుంటారు. మానవ స్వభావాన్ని పరిశీలించి చూసినట్లయితే ఈ పరిష్కారం ద్వారా సమస్య సాధనను ఆశించడం చాలా కష్టం. పైగా, సమూహ కార్యకలాపాలలో ఉత్సాహంగా పాల్గొనే యీ అదనపు పురుషుడు సమూహ నైతిక విలువలకు భంగం కలిగించే అవకాశం ఉంది.

ఇంకో కోణంలోంచి చూస్తే, బ్రహ్మచర్యం పాటించటం విజయవంతమైన సందర్భాలలో సులువైనదైనప్పటికీ, కులం తాలూకు భౌతిక అభివృద్ధి దృష్ట్యా అంత ఉపయుక్తం కాదు. ఒకవేళ అతను సంపూర్ణ బ్రహ్మచర్యాన్ని పాటించి, ప్రాపంచిక సుఖాలను త్యజించినా; లౌకిక వ్యక్తిగా మిగిలినా అతను సకుల వివాహ విధానానికి గాని, కులం నైతిక విలువలకు గాని ఎటువంటి విఘాతాన్ని కలిగించడు. భౌతిక అభివృద్ధి దృష్ట్యా చూసినపుడు, మొదటి పరిష్కారమైన కాల్చి వేయటం ద్వారా ఎంత నష్టం జరుగుతుందో, అతను సర్వసంగ పరిత్యాగం చేసి బ్రహ్మచర్యం చేపట్టినపుడు కూడా అంతే నష్టం జరుగుతుంది. ఒక కులం సాంఘిక జీవనాన్ని సక్రమంగా, నడిపేందుకు చాలినంత సంఖ్యాబలం అవసరం. కాని ఒకవైపు బ్రహ్మచర్యాన్ని ప్రోత్సహిస్తూ, దీనిని ఆశించడం జల్లడలో నీటిని భద్రపరచడం వంటిది."

"అందువల్ల అదనపు పురుషునిపై బ్రహ్మచర్యాన్ని విధించడం అనేది సిద్ధాంతపరంగాను, ఆచరణపరంగానూ విఫలమౌతుంది. కులం ప్రయోజనాల దృష్ట్యా ఇతనిని గృహస్థుగా ఉంచ వలసిన అవసరముంది. కాని సమస్యంతా అతనికి అదే కులంలో ఒక జీవిత భాగస్వామిని చూడటంలోనే ఉంది. స్థూలంగా చూస్తే, కులంలో స్త్రీ, పురుష నిష్పత్తి సమానంగా ఉండటం వల్ల, ఏ వ్యక్తికీ రెండుసార్లు వివాహం చేసుకునే అవకాశం లేదు. తన చుట్టూ గిరి గీసుకున్న కులంలో వివాహ వయస్కులైన స్త్రీలు వివాహ వయస్కులైన పురుషులకు సరిపోయినంత మంది మాత్రమే వుంటారు. అందుచేత, యీ సమస్యను పరిష్కరించాలంటే, అతనికి తన కులంలోంచే ఇంకా వివాహ వయస్సును పొందని పెళ్ళికుమార్తెను చూసి వివాహం చేయడ మొక్కటే మార్గం. అతనిని కులంలోనే ఉంచడానికి లభ్యమయ్యే అన్ని పరిష్కారాలలో యిదే లాభదాయకమైంది. సకుల వివాహ విధానాన్ని రక్షించడంలోనూ, నైతిక విలువల పరిరక్షణలోనూ, కులం సంఖ్యాబలం తగ్గిపోకుండా వుండటంలోనూ ఈ పరిష్కారం ఉపయోగపడుతుంది."

"కులంలో స్త్రీ పురుషుల సమతూకాన్ని కాపాడటానికి యిప్పటివరకు నాలుగు మార్గాలను పరిశీలించాం: అవి (1) మరణించిన తన భర్తతో పాటుగా, భార్యను కూడా కాల్చివేయడం. (2) వైధవ్యాన్ని బలవంతంగా పాటించేటట్లు చేయటం. (3) భార్య చనిపోయిన పురుషుడ్ని బ్రహ్మచర్యం పాటించేటట్టు చేయడం. (4) ఇంకా వివాహయోగ్యతను పొందని బాలికనిచ్చి అతనికి వివాహం చేయటం.

విధవా దహనం, విధురునికి బ్రహ్మచర్య విధి సకుల వివాహ విధానాన్ని పరిరక్షించడంలో ఉపయోగపడతాయనే నమ్మకం లేదని నేను పైన చెప్పినప్పటికీ, ఆ నాలుగు మార్గాలూ సాధనాలుగా ఉపయోగిస్తాయి. ఆ సాధనాలు శక్తులుగా వెలువడితే లేదా చెలామణీలోకి వస్తే ఒక గమ్యాన్ని సృష్టించుకుంటాయి. ఈ మార్గాలు సృష్టించే గమ్యం ఏమిటి? అవి సకుల వివాహ విధానాన్ని సృష్టించి, కొనసాగిస్తాయి. కులం గురించిన వివిధ నిర్వచనాలపై మన విశ్లేషణ ప్రకారం కులం, సకుల వివాహ విధానం రెండూ ఒకటే. అంటే, ఈ నాలుగు మార్గాల అర్థం కులం, కులంలో భాగం ఈ మార్గాలు.

"వివిధ కులాలు ఉండే వ్యవస్థలో ఒక కులం తాలూకు అంతర్గత స్వరూపం యీ విధంగా వుంటుందనేది నా ఉద్దేశ్యం. ఇపుడు మనం హిందూ సమాజంలోని కులాలను, వాటి పనితీరును పరిశీలిద్దాం. భారతదేశంలో కులమనేది అతి పురాతనమైన వ్యవస్థ అని చెప్పడానికి, గతాన్ని తేటతెల్లం చేయడానికి ప్రయత్నించే వారి మార్గంలో ఎన్నో అవాంతరాలున్నాయని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

చెప్పడానికి, గతాన్ని తేటతెల్లం చేయడానికి ప్రయత్నించేవారి మార్గంలో ఎన్నో అవరోధాలున్నాయని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ప్రామాణికమైన లేదా లిఖితమైన చరిత్ర కానీ, ఆధారాలు కానీ లేని చోట; ప్రపంచమే భ్రమ కాబట్టి చరిత్రరచన పిచ్చిపని అని భావించే హిందువుల వంటి వారున్న చోట గతాన్ని శోధించడం మరింత కష్టం. చాలాకాలం పాటు నమోదు కాకుండా ఉండిపోయినప్పటికీ; తరచు ఆచారాలు, నీతి నియమాలు శిలాజాలవలె స్వయంగా తమ చరిత్రను వెల్లడించగలిగేవి కాకపోయినప్పటికీ; సామాజిక వ్యవస్థలో మాత్రం సజీవంగా ఉంటాయి. ఇదే నిజమైతే, అదనపు పురుషుడి సమస్యను, అదనపు స్త్రీ సమస్యను హిందువులు పరిష్కరించుకున్న తీరును శోధించగలిగితే మన ప్రయత్నానికి సాఫల్యం సిద్ధిస్తుంది.

"పైపైన పరిశీలించే వారికి కూడా చాలా సంక్లిష్టంగా కనిపించే హిందూ సమాజంపై సమస్యను పరిష్కరించడానికి మూడు ఆచారాలను సూచిస్తుంది. 1. సతీ సహగమనం లేదా మరణించిన భర్త చితిపై విధవను దహనం చేయడం. 2. పునర్వివాహాన్ని అనుమతించకుండా నిర్బంధ వైధవ్యం. 3. బాలికా వివాహం.

ఇవికాక, అదనపు పురుషుడిని సన్యాసం తీసుకునేట్టు చేసే గట్టి ప్రయత్నం కూడా ఉంది. అయితే, కొన్ని సందర్భాలలో అది కేవలం మానసిక ప్రవృత్తిరీత్యా మాత్రమే తీసుకున్న నిర్ణయంగా మాత్రమే కనిపిస్తుంది.

"ఈ ఆచారాల మూలానికి సంబంధించి, నాకు తెలిసినంతవరకు, నేటివరకు, శాస్త్రీయమైన వివరణ ఏదీ రాలేదు. ఈ ఆచారాలు ఎందుకు ఆమోదం పొందాయో తెలిపే తత్వశాస్త్రం సమృద్ధిగా ఉంది. [ఎ.కె. కుమారస్వామి – ("Sati; a Defence of the Eastern Woman")

– బ్రిటిష్ సోషియాలజికల్ రివ్యూ, 6వ సంపుటం, 1913] అది భార్యాభర్తల మధ్య "దేశం ఆత్మల వంటి గాఢ ఐక్యత"కు, "మరణాతీతమైన అంకితభావానికీ" రుజువు; "యజమానికి అంకితం కావడం స్త్రీకి గౌరవప్రదం, అదే ఆమెకు శాశ్వత స్వర్గం: ఓ మహేశ్వరా!" అవి, "నువ్వు నా వల్ల సంతృప్తి చెందకపోతే నేను స్వర్గానికే తగినదానిని కాదు" అంటూ చలింపజేసే మానవీయ ఆవేశాన్ని ప్రకటించిన ఉమాదేవి మాటల్లోని పతీధర్మానికి ఆ ఆచారం మూర్తీభావం. ఇక నిర్బంధ వైధవ్యం ఎందుకు ఆమోదం పొందిందో నాకు తెలియదు, దాన్ని పాటించేవారు చాలా మందే ఉన్నప్పటికీ, దాన్ని కీర్తించేవారెవరూ నాకు తారసపడలేదు. బాలికా వివాహాన్ని స్తోత్రం చేయడం డాక్టర్ కేట్కర్‌లో కనిపిస్తుంది: పాణిగ్రహణం జరిగిన స్త్రీతో తప్ప పరస్త్రీతో సాన్నిహిత్యాన్ని స్త్రీ కోరుకోకూడదు. విశ్వాసంతో మెలిగే స్త్రీ పురుషులకు అది నియమం. ఈ స్వచ్ఛత పెళ్ళి తరువాతే కాదు, పెళ్ళికి ముందు కూడా తప్పనిసరి, ఎందుకంటే అదొక్కటే నిజమైన శీలం. తాను వివాహం చేసుకోబోయే పురుషుడు కాక మరో పురుషునిపై ప్రేమ ఏర్పరచుకునే బాలిక శీలవతి కాదు. తానెవరిని వివాహం చేసుకోబోతున్నదో తెలియదు కనుక ఆమె ఏ పురుషునితోనూ వివాహానికి ముందు సాన్నిహిత్యం కోరుకోకూడదు. కోరుకుంటే గనుక, అది పాపం. అందువల్ల, బాలికతో లైంగిక భావనలు తలెత్తే వయస్సుకి ముందే, ఎవరిని ఆమె ప్రేమించాలో తెలిసిపోవడం మంచిది." అందుకే బాలికా వివాహం.

"ఈ వాగాడంబరమూ, పకడ్బందీ కుతర్కమూ ఈ ఆచారాలు ఎందువల్ల గౌరవం పొందాయో చెబుతాయి కానీ, ఎందువల్ల అవి పాటించబడ్డాయో చెప్పవు. అందుకు నా వివరణ ఏమిటంటే, వాటిని తరతరాలుగా ఆచరిస్తున్నారు కాబట్టి వాటికి గౌరవం లభించింది అని. 18వ శతాబ్దంలో తలెత్తిన వ్యక్తివాదంతో పరిచయం వున్న వారెవరైనా నా వివరణతో ఏకీభవిస్తారు. అన్నివేళలా, ఉద్యమమే అత్యంత ప్రధానమైనది, ఆతరువాత చాలాకాలం దాకా తాత్వికతలు వాటి చుట్టూ పెరిగి, దానిని సమర్థిస్తాయి, నైతికబలం ఇస్తాయి. ఈ ఆచారాలు ఎందుకు పుట్టాయన్న ప్రశ్నకు నా సమాధానం – కుల వ్యవస్థ నిర్మాణానికి అవి అవసరమయ్యాయి. మద్దతుగా తాత్విక సమర్థనలు వాటికి జనామోదం సాధించడానికి లేదా మెరుగుపూత పూయడానికి ఉద్దేశించినవి. ఎందుకంటె అవి అనాగరకమనిపించేంత హేయంగా, దిగ్భ్రాంతికరంగా ఉండడంతో వాటికి తీపిపూత పూయవలసి వచ్చింది. ఈ ఆచారాలను ఆదర్శాలుగా చెబుతున్నప్పటికీ సారాంశంలో అవి సాధనాల స్వభావం కలిగినవి. అయితే, దాన్నిబట్టి వాటి నుంచి ఉత్పన్నమయ్యే ఫలితాలను చూడ నిరాకరించకూడదు. సాధనాలను ఆదర్శీకరించడం అవసరమవీ, ఈ ప్రత్యేక సందర్భంలో ఖచ్చితమైన అమలుకోసం అలా చేసి వుండవచ్చునని ఎవరైనా అనవచ్చు. లక్ష్య సాధనాలనే లక్ష్యంగా చెప్పడం వల్ల వాటి వాస్తవ స్వభావం మరుగుపడడం తప్ప మరో ప్రమాదం ఏమీ లేదు. ఆ స్వభావాన్ని ఆ సాధనం కోల్పోవడం జరగదు. సాధనమే లక్ష్యమన్న పద్ధతిలో పిల్లులన్నీ కుక్కలని మీరో చట్టం జారీ చేయవచ్చు. పిల్లులను కుక్కలుగా మార్చలేనట్టే సాధనాల స్వభావాన్ని కూడా మీరు మార్చలేరు; అదేవిధంగా; అవి లక్ష్యాలైనా కానివ్వండి, సాధనాలైనా కానివ్వండి, సతి, నిర్బంధ వైధవ్యం, బాలికా వివాహం అనే ఆచారాలు ఒక కులంలోని అదనపు స్త్రీ, అదనపు పురుషుడు సమస్యను

పరిష్కరించుకోవడానికి, సకుల వివాహ విధానాన్ని కాపాడుకోవడానికి మౌలికంగా ఉద్దేశించవని నేను అభిప్రాయపడడంలో తప్పులేదు. ఈ ఆచారాలు లేకుండా సకుల వివాహ విధానాన్ని కఠినంగా అమలు చేయడం కుదరదు. సకుల వివాహ విధానం లేకుండా కులం కులం కాదు."

అంతర్వివాహాలను విషేధించడం ద్వారా బ్రాహ్మణమతం నెలకొల్పదలచిన కుల వ్యవస్థకు సహాయపడడం తప్ప బాలికా వివాహానికి, నిర్బంధ వైధవ్యానికి, సతికి మరో ప్రయోజనం లేదని నా అభిప్రాయం. అంతర్వివాహాలను ఆపడం కష్టం. ప్రేమ వల్లగాని, యితర అవసరాల వల్లగాని కులాంతర వివాహాలు జరిగే ప్రమాదం ఉండటం వల్ల ఈ నియమాలను బ్రాహ్మణమతమే సృష్టించింది. బ్రాహ్మణమతం చేసిన కొత్త నియమాలకు నా వివరణ ఇది. ఈ అభిప్రాయం అందరికీ ఆమోదయోగ్యం కాకపోవచ్చును. వివిధ వర్గాల మధ్య జరిగే వివాహాలను నిరోధించడానికి బ్రాహ్మణమతం అందుబాటులో ఉన్న అన్ని మార్గాల ద్వారా ప్రయత్నించిందనడంలో ఏమాత్రం సందేహం లేదు.

ఈ బ్రాహ్మణమత ఆకాంక్షను మనువు విధించిన కుల బహిష్కార శిక్ష నియమంలో చిత్రించారు.

ఒక కులంచేత బహిష్కారానికి గురైన వ్యక్తిని కులభ్రష్టునిగా మనువు పేర్కొన్నాడు.[29] మనువు ప్రకారం కులభ్రష్టుడు మృతునితో సమానం. అటువంటివ్యక్తి శ్రాద్ధకర్మలను కూడా జరిపించాలని అందుకు దిగువ పేర్కొన్న పద్ధతులను మనువు సూచించాడు.

కులభ్రష్టుడైన వ్యక్తి సంపిండేయులు, సమానోదకులు, ఒక అశుభదినాన, సాయంత్రం వేళ, (గ్రామం) వెలుపల, బంధువులు, పురోహితులు, ఆచార్యుల సమక్షంలో (అతనికి, మృతుడైనట్టు భావించి) తర్పణం విడవాలి. (11–183)

(మృత వ్యక్తికి చేసినట్టుగా) ఒక బానిస స్త్రీ నీళ్ళ కుండను కాలితో పడదోయాలి, (అతని సంపిషేయులు), సమానోదకులు కూడా ఒకరాత్రి, ఒక పగలు మైల పాటించాలి. (11–184)

అయితే, భ్రష్టత్వం చెందిన వ్యక్తి ప్రాయశ్చిత్తం ద్వారా తిరిగి కులంలోకి ప్రవేశించడాన్ని ఈ కింది నియమాలలో చెప్పినట్టు మనువు అనుమతించాడు.

"కానీ, అతను ప్రాయశ్చిత్తం చేసుకుంటే, వారు అతనితో పాటుగా పవిత్ర జలాశయంలో స్నానం చేసి, నీళ్ళ కుండను పడదోయాలి." (11–187)

"అతను నీళ్ళ కుండను నీటిలో విసరేసి, ఇంటికి చేరి యథావిధిగా తన విధులను

నిర్వహించుకోవచ్చును." (11–188)

"బహిష్కరణకు గురైన స్త్రీల విషయంలో కూడా ఇదే పద్ధతిని అనుసరించాలి. బహిష్కరణకు గురైన వారికి బట్టలు, ఆహారం, నీరు అందించవచ్చును. అయితే వారు తమ (కుటుంబానికి చెందిన) యింటికి దగ్గరలో నివసించవలసి ఉంటుంది." (11–189)

"కులభ్రష్టులు పశ్చాత్తాపం చెందకుండా, ధిక్కార ధోరణిలో ఉంటే వారిని శిక్షించేందుకు మనువు కొన్ని నియమాలను పొందుపరచారు.

బహిష్కరణకు గురైన వ్యక్తికి మనువు స్వగృహ ప్రవేశాన్ని నిషేధించాడు."

"(బహిష్కరణకు గురైన వారికి) బట్టలు, ఆహారం, నీరు అందించవచ్చును. అయితే వారు తమ (కుటుంబానికి) చెందిన యింటికి దగ్గరలో నివసించవలసి ఉంటుంది. (11–189)

"కుక్కలకు, కులభ్రష్టులకు, ఛండాలురకు, పాపకర్ములకు శిక్షగా వ్యాధులు సంక్రమించిన వారికి, కాకులకు, క్రిమి కీటకాలకు (గృహస్థుడు) కొంత ఆహారాన్ని నేలపై విడవాలి." (3–92)

"కులభ్రష్టత్వాన్ని పొందిన వ్యక్తితో సాంఘిక సంపర్కాన్ని కలిగి ఉండడాన్ని ఒక పాపంగా మనువు పేర్కొన్నాడు. స్నాతకుని మనువు ఈ క్రింది విధంగా హెచ్చరిస్తున్నాడు:

"కులభ్రష్టత్వానికి గురైన వ్యక్తితో కలసి వుండవద్దు." (4–79)

"...వారు యిచ్చిన ఆహారాన్ని తీసుకోరాదు." (4–213)

గృహ యజమానికి మనువు ఈ క్రింది విధంగా హితబోధ చేస్తున్నాడు:

"శ్రాద్ధకర్మలు ఆచరించేటపుడు అతనిని (గృహ యజమానిని) అనుమతించరాదు." (3–151)

"అదే విధంగా, తల్లిదండ్రులను, గురువును (సరైన) కారణం లేకుండా వదలివేసిన వారిని, కులభ్రష్టత్వం పొందిన వారితో వేదం ద్వారా కానీ, వివాహం ద్వారా కానీ సంబంధం పెట్టుకున్న వారిని కూడా అనుమతించరాదు." (3–157)

భ్రష్టత్వాన్ని పొందిన వారితో సంబంధాలు పెట్టుకున్న వారిని శిక్షించడం ద్వారా మనువు కులభ్రష్టుల సాంఘిక వెలివేతను ప్రమాణీకరించగలిగాడు.

"భ్రష్టత్వాన్ని పొందిన వారితో ఒక సంవత్సరం పాటు సంబంధం కలిగి వున్న వ్యక్తి, భ్రష్టత్వాన్ని పొందుతాడు. యజ్ఞంతోనూ, వేదపఠనంతోను, వివాహ సంబంధాలతోనూ సంబంధం పెట్టుకున్న వ్యక్త తన కులాన్ని తక్షణం కోల్పోతాడు. అంతేకాకుండా అతను వాడిన ఆసనాన్ని, బండిని వాడినా, సహపంక్తిలో ఆహారం తీసుకున్నా భ్రష్టత్వం పొందుతాడు." (11-181)

"ఇందుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలంటే, ఆ పాపానికి నిర్దేశించబడిన విధంగా చేయాలి." (11-182)

తన కుల నియమాలను ఉల్లంఘించి, భ్రష్టునిగానే ఉండిపోవాలనుకునే వారికి పరలోకంలో ఎదురయ్యే కష్టాలను మనువు వివరించాడు.

"కుల భ్రష్టులతో సంబంధం కలిగి వున్నవారు బ్రహ్మ రాక్షసులుగా పుడతారు." (12-60)

కులభ్రష్టుని మనువు యిక్కడితో వదలివేయలేదు. ఇంకా తీవ్రమైన శిక్షలను విధించడానికి వెనుకాడలేదు. కులభ్రష్టులను శిక్షించే మనుస్మృతి భాగాలు ఇవి.

"....కులభ్రష్టులు, నాస్తికులు అయిన బ్రాహ్మణులు దేవునికి, పితృదేవతలకు అర్పించిన ప్రసాదాలలో భాగం పంచుకునేందుకు అనర్హులు." (3-150)

"(వారసత్వంగా వచ్చే ఆస్తిలో) కులభ్రష్టునికి భాగం తీసుకునే అర్హతలేదు." (9-201)

కులభ్రష్టునిగా గుర్తించిన వ్యక్తిపేర, (శ్రద్ధక్రియలు ఒకసారి జరిపిన తర్వాత) అతనితో మాట్లాడటం, కూర్చోవటం, వారసత్వంగా ఆస్తిలో భాగాన్ని ఇవ్వడం అటువంటి సంపర్కాన్నేదైనా కలిగి ఉండడం నిషేధించడం జరిగింది." (11-185)

"(ఒకవేళ కుటుంబంలోని పెద్ద కుమారుడే కులభ్రష్టత్వాన్ని పొందితే) ఇంటికి పెద్ద కుమారునిగా అతనికి లభ్యమయ్యే హోదా అతని తమ్మునికి లభిస్తుంది. అంతేకాకుండా, అతనికి వచ్చే ఆస్తిలో భాగం కూడా తమ్మునికే (కుల నియమం పాటించేవానికి) చెందుతుంది." (11-186)

అదీ కులభ్రష్టునిపై మనుచట్టం. కులభ్రష్టునికి విధించిన తీవ్రమైన యీ శిక్షల అంతర్యం

స్పష్టంగా తెలిసిపోతుంది. అతనిని అన్ని సాంఘిక కార్యకలాపాలలో పాల్గొనకుండా ఏకాకిని చేయడం ఒక లక్ష్యం. ఆస్తి వారసత్వంలో భాగం లేకుండా చేసి, ప్రతి పౌర విధి నుంచి తొలగించి, ఏ పదవికీ అర్హత లేకుండా చేసి ఆ వ్యక్తిని అశక్తుడను చెయ్యడమే పై శిక్షల అంతర్యం. నిజానికి యిన్ని శిక్షలతో, మనువు పరిగణించి, శ్రాద్ధకర్మలు చేయమని చెప్పినట్టు భ్రష్టత్వానికి గురైన వ్యక్తి మరణించిన వ్యక్తితో సమానమే. ఈ శిక్షలు కేవలం కులభ్రష్టత్వం పొందిన వ్యక్తికే కాకుండా అతనితో సంబంధం పెట్టుకోవాలనుకునే ఎవ్వరికైనా వర్తిస్తాయి. శిక్ష కులభ్రష్టునికి మాత్రమే కాదు, కేవలం పురుషులకే పరిమితమూ కాదు. ఈ వెలికి స్త్రీపురుషులు ఇద్దరూ గురి అవుతారు. వారి సంతానం కూడా ఈ శిక్షకు గురవుతారు. కులభ్రష్టత్వాన్ని పొందక ముందు జన్మించిన సంతానానికి వారసత్వపు ఆస్తి లభిస్తుంది. ఎందుకంటే భ్రష్టత్వాన్ని పొందిన వ్యక్తి మరణించిన వానితో సమానం కాబట్టి, సంతానానికి వెంటనే అతని ఆస్తిని వారసత్వంగా పొందే అవకాశం ఉంటుంది. అలా కాకుండా బహిష్కరణకు గురైన తర్వాత జన్మించిన సంతానానికి యీ సదుపాయం లభించదు. తండ్రితో పాటు అతని సంతానం కూడా భ్రష్టత్వం పొందినట్టు పరిగణిస్తారు.

కుల భ్రష్టత్వానికి సంబంధించి మనువు తయారు చేసిన చట్టాలు మానవత్వం, న్యాయం అనే ధర్మాలకు వ్యతిరేకంగా ఉన్నాయనే విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఇందులో పెద్దగా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదని కొందరనుకోవచ్చు. ఎందుకంటే, మతానికి, సంఘం చేత సమ్మతి పొందిన భావాలకు వ్యతిరేకంగా నడిచే వారిని శిక్షించడానికి అన్ని మతాల స్మృతులలోనూ ఉన్న నియమాలకు, మనువు రాసిన నియమాలకు దగ్గరి పోలికఉంది. ఒక్క బౌద్ధమతం తప్ప మిగిలిన అన్ని మతాలూ వారసత్వ చట్టాలను తమ నియమావళులకు విధేయతను, కట్టుబాటును సాధించడం కోసం వినియోగించాయి లేదా దుర్వినియోగం చేశాయి. క్రైస్తవ మతానికి చెందిన ఒక వ్యక్తి 'యూదుమతం' లేదా పేగనిజంలోకో లేదా యితర మతాలలోకి మారడాన్ని కాన్‌స్టాంటిన్, వంటి చక్రవర్తులు శిక్షలతో అడ్డగించేవారు. థియోడొనిసియస్, వలెంటినియస్ వంటి చక్రవర్తులు, మతం మారినవాడు ఇతరులను అందుకు ప్రేరేపిస్తే మరణశిక్ష కూడా విధించేవారు. క్రైస్తవ విశ్వాసాన్ని కాపాడేందుకు ఈ శిక్షల పద్ధతి యూరప్‌లోని యితర దేశాలకు కూడా విస్తరించింది.[30]

కులభ్రష్టత్వానికి చెందిన చట్టాన్ని ఆ దృష్టితో చూడడం పైపై పరిశీలన అవుతుంది. అసలు 'వెలి' బ్రాహ్మణమత సృష్టి. అది కులానికి అవసరమైన ప్రమాణం. కుల వ్యవస్థను సృష్టించాలని నిశ్చయించుకున్నాక బ్రాహ్మణ మతానికి యీ భ్రష్టత్వ చట్టాలు అనివార్యమవుతాయి. కులభ్రష్టుడ్ని శిక్షించడం ద్వారా కులవ్యవస్థ కొనసాగింపు సాధ్యమవుతుంది. రెండవదేమిటంటే క్రైస్తవ మహమ్మదీయ మతాలలో ఉన్న మతభ్రష్టతకు (Law of Apostacy) బ్రాహ్మణమతంలోని కుల చట్టాని (Law of Caste)కి భేదం ఉంది. క్రైస్తవ, మహమ్మదీయ మతభ్రష్టత్వ నియమాల ప్రకారం మత విశ్వాసం లోపించిన వారికీ, తప్పుడు మతవిశ్వాసాలను ప్రచారం చేసే వారికీ మాత్రమే వెలి వర్తిస్తుంది. చట్టంతో విశ్వాసంతో గాని, విశ్వాసం లేకపోవడం గాని ప్రధానమైన

సమస్య కాదు. అది ముఖ్యంగా కులం అనే సామాజిక సంస్థారూపం పవిత్రతతో ముడిపడి ఉంది. తాముండే కుల నియమాలకు వ్యతిరేకంగా ప్రవర్తించిన వారిని బ్రాహ్మణమతం శిక్షిస్తుంది. ఇది చాలా ముఖ్యమైన బేధం.

ఇతర మతాలలోని భ్రష్టత్వ నియమాలలో, ఈ బ్రాహ్మణ మతం సృష్టించిన కులభ్రష్టత్వ నియమాలను పరిశీలిస్తే, దేవునిపై విశ్వాసం బ్రాహ్మణ మతానికే అంత ముఖ్యం కాదు. చావు తర్వాత జీవితం మీద నమ్మకం వుండటం, మంచి కార్యాలు చేయడం ద్వారా మోక్షాన్ని సాధించవచ్చునే నమ్మకం కలిగి వుండటం, మతప్రవక్తపై విశ్వాసం కలిగి ఉండటం అనే విషయాలను బ్రాహ్మణమతం ఆవశ్యకంగా పరిగణించదు. అయితే, వేదాలపట్ల పూజ్యభావం కలిగి ఉండడం చాలా అవసరంగా భావిస్తుంది. అదొక్కటే బ్రాహ్మణ మతానికి ఆవశ్యకం. అందుచేతనే కుల నియమాలను ఉల్లంఘించడాన్ని బ్రాహ్మణమతం శిక్షిస్తుంది. మిగతా అన్నిటినీ అతిక్రమించవచ్చు.

ఈ సమైక్యతా శక్తులను చూడడానికి నిరాకరించని వారు కులాంతర వివాహాలను (Inter-marriage) కులాంతర పంక్తి భోజనాలను (Inter-dinning) బ్రాహ్మణమతం నిషేధించడం, సమాజాన్ని పూర్తిగా విభజించడమేనని అంగీకరిస్తారు. ఈ విధమైన నిషేధాలు ఐక్యతకు చావు దెబ్బలాంటివి. ఇవి ఐక్య కార్యాచరణకు తీవ్రమైన అడ్డంకులుగా తయారయ్యాయి. ముందు చెప్పబోఁ. ్లట్టు, బ్రాహ్మణమతాన్ని కూలదోసేందుకు బ్రాహ్మణేతర వర్గాలు ఏకమవకుండా బ్రాహ్మణమతం సమాజాన్ని ఈ విధంగా ముక్కలు ముక్కలుగా విభజించింది. కానీ, ఈ ప్రాణాంతకమైన విష ప్రభావం కేవలం విషప్రయోగం చేసిన వాడి ఉద్దేశం పరిమితులలో ఉండిపోదు. కుల విషయంలో కూడా అదే జరిగింది. బ్రాహ్మణులపై తిరుగుబాటు చేయకుండా బ్రాహ్మణేతరులను అశక్తం చేయడం బ్రాహ్మణమతం ఉద్దేశం, అంతేకానీ వారు ఒక జాతిగా విదేశీయులను ఎదిరించకుండా అశక్తం చేయడం కాదు. కానీ, కులం విషం వల్ల వారు బ్రాహ్మణులకు వ్యతిరేకంగానూ, విదేశీయుల విషయంలోనూ అశక్తులయ్యారు. మరో రకంగా చెబితే, కుల వ్యవస్థను నెలకొల్పడం ద్వారా బ్రాహ్మణమతం జాతీయత ఎదగకుండా పెద్ద అవరోధాన్ని నిలిపింది.

కుల వ్యవస్థ గురించి ఎవరేమి చెప్పినా హిందువు మాత్రం అందులోని చెడును ఒప్పకోడు. ఒకరకంగా అతనిది నిజం. కుటుంబంలో సభ్యుల మధ్య ప్రేమ, ఐక్యత పరస్పర సహకారం వుంటాయి. దొంగలు కూడా పరస్పరం గౌరవించుకుంటారన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి. వారి ప్రయోజనాలు, అవసరాలు, ఒకటే కాబట్టి వారిలో భ్రాతృత్వ సంబంధాలు వుంటాయి. అయితే, వారికి ఇతర సమూహాలతో విరోధాలుండవచ్చును. కాబట్టి ఒక సమాజానికి ఉండవలసిన ప్రశంసనీయ లక్షణాలు అన్నీ కులానికి ఉన్నాయని ఎవరైనా అనవచ్చు.

కుటుంబానికి ఉన్న ప్రేమ, ఐక్యత, సంఘీభావం వంటి సుగుణాలన్నీ కులంలో కూడా ఉన్నాయి. దొంగలు పరస్పరం చూపుకునే గౌరవం కూడా కులంలో ఉంటుంది. ముఠాలలో ఉండే

విశ్వాసం, భ్రాతృత్వ భావనలు కూడా ఉంటాయి. బందిపోట్లలో ఉండే ఉమ్మడి ప్రయోజనాల భావన కూడా దానిలో వుంది.

ఇలాంటి మెచ్చుకోదగిన లక్షణాలు కలిగిన కులవ్యవస్థపై ఒక హిందువు సంతృప్తిని వ్యక్తం చేసి, అందులోని చెడు గుణాలను ఒప్పుకోకపోవచ్చును. జాతులు తమను తాము అనుకున్నట్టు ప్రతి కులమూ తనకొక స్వతంత్ర సమాజంగా భావించడానికి వీలుంటే తప్ప కులం ఆదర్శ సామాజిక వ్యవస్థా రూపం అనే సిద్ధాంతం నిలవదని హిందువు మరచిపోతాడు. కానీ హిందూ సమాజం దానిలోని కుల వ్యవస్థ అన్న పద్ధతిలో చూస్తే ఆ సిద్ధాంతం కూలిపోతుంది.

అప్పటికీ కుల వ్యవస్థ చెడ్డదని హిందువు ఒప్పుకోడు. కుల వ్యవస్థలోని చెడుగులకు హిందూమతందే బాధ్యత అని ఆరోపిస్తే– "యూరోపులోని వర్ణవ్యవస్థ సంగతేమిటి?" అని హిందువు వెంటనే గద్దిస్తాడు. గాఢ ఐక్యత, దానికి తోడుగా ప్రశంసనీయ ఉమ్మడి ప్రయోజనాల భావన, పరస్పర సానుభూతి, ప్రజా ప్రయోజనాలపై విధేయత, సార్వజనిక సంక్షేమాల గురించిన పట్టింపు – వంటి లక్షణాలన్నీ ఉన్న తతి, కుల ఆదర్శ ప్రపంచం ఎక్కడా ఉండదన్నంత వరకు ఆ హిందువు సవాల్ సరైనదే. ప్రతి సమాజంలోనూ గిరిగీసుకుని ఉండేవి, బయటి వారిపై అనుమానంతో అసూయతో మెలిగేవి అయిన వరగాలు, కుటుంబాలు ఉంటాయని, బందిపోట్లు, ముఠాలు, ట్రేడ్ యూనియన్లు, ఉద్యోగ సంఘాలు, వ్యాపార కూటములు, వాణిజ్య మండలులు, రాజకీయ పార్టీలు అన్ని సమాజాల్లోనూ ఉంటాయని పోలిక కోసం హిందువు వాదిస్తే అనతితో పేచీ లేదు. పైన చెప్పిన వాటిలో కొన్ని ఉమ్మడి ప్రయోజనాల కోసం, ఉమ్మడిగా దోచుకోవడం కోసం ఏర్పడ్డవీ, మరికొన్ని ప్రజలకు సేవ చేయాలని ఆశిస్తూనే వారిని ఎరగా వాడుకోవడానికి సంకోచించనివీ ఉన్నాయి.

గతంలో కానీ, ప్రస్తుతం కానీ ఎక్కడైనా సరే ఉన్న అసలు సమాజం ఏకశిలాసదృశం (Single Whole) కాదనీ వివిధ తక్షణ, ప్రత్యేక లక్ష్యాలకు కట్టుబడి వున్న చిన్న సమూహాల సమాహారమని అంగీకరించవచ్చు. హిందూ కుల వ్యవస్థకు, హైందవేతర వర్గ వ్యవస్థకూ పోలిక తెచ్చి, ఈ విషయంలో చెప్పవలసిందింకేమి లేదన్నట్టు హిందువు తప్పించుకోలేడు. హిందువు ఎదుర్కొనవలసిన చాలా పెద్ద ప్రశ్న మరొకటి ఉన్నది. ప్రతి సమాజంలోనూ సమూహాలున్నప్పటికీ, కొన్ని సమాజాలలో అసాంఘిక (Non-Social) సమూహాలు మాత్రమే; మరికొన్ని సమాజాలలో సంఘ వ్యతిరేక (anti-Social) సమూహాలు ఉన్నాయి. వర్గవ్యవస్థ ఉన్న సమాజానికీ కుల వ్యవస్థ ఉన్న సమాజానికీ తేడా ఇందులోనే వుంది. వర్గ వ్యవస్థ కేవలం అసాంఘికం కాగా, కుల వ్యవస్థ తప్పనసరిగా సంఘ వ్యతిరేకం.

కొన్ని సమాజాలలో సమూహ వ్యవస్థ కేవలం అసాంఘిక భావనను, కొన్ని సమాజాలలో సమూహ వ్యవస్థ సంఘ వ్యతిరేక భావనను కలిగించడానికి కారణం ఏమిటో తెలుసుకోవడం అవసరం. ఈ తేడాను ప్రొఫెసర్ జాన్ డెవె కంటె మించి మరెవరూ విప్పి చెప్పలేరు. ఆ

సమూహాలు విడిగా వుంటాయా, సంబంధాలలో వుంటాయా; వాటి మధ్య ఇచ్చిపుచ్చుకోవడం వున్నదా–లేదా అన్న దానిపై ప్రతిదీ ఆధారపడి వుంటుందని ఆయన అంటారు. ఆ సమూహాల మధ్య కలిసి పనిచేయడం వుంటే, ఇచ్చిపుచ్చుకోవడం వుంటే వాటి మధ్య అసాంఘిక భావన మాత్రమే ఉంటుంది. ఒకవేళ ఆ సమూహాలు విడివిడిగా వుండి, ఇచ్చిపుచ్చుకోవడం లేకపోతే వారి మధ్య సంఘ వ్యతిరేక భావన ఉంటుంది. ప్రొఫెసర్ డెవే మాటల్లో:[31]

"ఒక ముఠా లేదా కూటమిలోని ఏకాకితనం, గిరి గీసుకున్నతనం దాని సంఘ వ్యతిరేక భావనను ప్రస్ఫుటం చేస్తాయి. అయితే, అదే రకమైన భావన "స్వంత" ప్రయోజనాలుండి, ఇతర సమూహాలతో సంపర్కాన్ని కూడదనుకునే సమూహం విషయంలోనూ కనిపిస్తుంది. అంటే, విస్తృత సంబంధాల ద్వారా పురోగతిని, పునర్నిర్మాణాన్నీ కోరుకోకుండా, తనకున్న దానిని కాపాడుకోవడమే దాని ప్రయోజనం. ఇదే స్ఫూర్తిని పరస్పర సంబంధాలు లేని జాతుల మధ్య; విస్తృత జీవితంతో సంబంధం లేని విషయాలన్నట్టు తమ కౌటుంబిక వ్యవహారాలను గుట్టుగా దాచుకునే కుటుంబాలలో; గృహ, సమూహ అవసరాల నుంచి వేరైన పాఠశాలలో; ధనికులు బీదల మధ్య; పండితులు అపండితుల మధ్య చూడవచ్చు. సమూహంలోని జడ, స్వార్థపూరిత లక్ష్యాల కోసం జీవితాన్ని వెసులుబాటు లేని కాఠిన్యంతోనూ, మూసపోసినట్టు వ్యవస్థీకరించడానికి ఈ ఏకాకితనం అనువైనదన్నది సారాంశం."

అడగవలసిన ప్రశ్న – సమాజంలో సమూహాలున్నాయా లేవా అనే కాదు, ఆ సమాజం ఏకశిలా సదృశం (Single Whole)గా ఉందా అనీ కాదు. వివిధ సమూహాల మధ్య పరస్పర సహకారం, సామీప్యం, సంపర్కం ఎంతమేరకు ఉంది అన్నది అడగవలసిన ప్రశ్న; ఆ సమూహాల మధ్య ఉద్దేశ్యపూర్వకంగా పంచుకునే ఉమ్మడి ప్రయోజనాలు ఎన్ని వున్నాయి, ఎంత వైవిధ్యంతో వున్నాయి? ఇతర భాగస్వామ్య రూపాలలో పరస్పర ఆచరణ ఎంత సంపూర్ణంగా, ఎంత స్వేచ్ఛగా వుంది? సమూహాలున్నంత మాత్రాన ఒక సమాజాన్ని సంఘటిత వ్యవస్థగా నిరాకరించవలసిన పనిలేదు. ఆ సమూహాలు ఏకాకితనంతో వుంటే, గిరిగీసుకుని బతుకుతూ వుంటే నిరాకరించవచ్చు. ఎందుకంటే సహకారకృషిని అసాధ్యం చేసేది ఏకాకితనం నుంచి ఉత్పన్నమయ్యే సంఘ వ్యతిరేక భావన.

వర్ణాల మధ్య వేర్పాటు బ్రాహ్మణమతం సృష్టి. పురాతన కాలంలో నాలుగు వర్ణాల వారి మధ్య అమలులో ఉన్న అంతర్వివాహాలను, సహ పంక్తి భోజనాలను నిషేధించడం ఇంతకుముందే చర్చించాను. అయితే, ఈ కథలో మరోభాగం మిగిలిపోయింది. వర్ణ వ్యవస్థకు వివాహంతో నిమిత్తం లేదని నేను చెప్పాను. అంటే, వివిధ వర్ణాలకు చెందిన స్త్రీ పురుషులు పెళ్ళి చేసుకోవచ్చు. అలా చేసుకున్నారు కూడా. అంతర్ వర్ణ వివాహాలకు ధర్మశాస్త్రం అడ్డుపడలేదు. అటువంటి వివాహాలకు సంఘనీతి ప్రతికూలం కాదు – సవర్ణ వివాహాలే జరగాలని చట్టమూ చెప్పలేదు, సంఘమూ కోరలేదు. వరుడు తక్కువ వర్ణం అయినా – ఏ రకమైనది అయినా – వివిధ వర్ణాల మధ్య అన్నిరకాల వివాహాలు జరిగాయి. – అవన్నీ చెల్లుబాటు అయ్యాయి.

ప్రొఫెసర్ కాణే చెప్పినట్టు – అనులోమ, ప్రతిలోమ వివాహాల మధ్య తారతమ్యమేమిటో తెలియదు, అసలు అనులోమ, ప్రతిలోమ అన్న పదాలే అప్పుడు ఉనికిలో లేవు. వాటిని కూడా బ్రాహ్మణమతమే సృష్టించింది. అగ్రవర్ణ స్త్రీకి, తక్కువ వర్ణం పురుషునికి మధ్య వివాహాన్ని – అంటే ప్రతిలోమ వివాహాన్ని బ్రాహ్మణ మతం నిలిపివేసింది. వర్ణాల మధ్య సంబంధాన్ని తెంపివేసి వాటిని ప్రత్యేక, పరస్పర సంఘ వ్యతిరేక భావన కలిగిన వాటిగా మార్చే దిశగా తీసుకున్న చర్య అది. అయితే, ప్రతిలోమ వివాహం అనే అంతస్సంబంధ ద్వారం మూసివేసినప్పటికీ, మరో అంతస్సంబంధ ద్వారం అనులోమ వివాహం తెరిచే వుండింది. దాన్ని మూయలేదు. శ్రేణులవారీ అసమానత్వం గురించి చర్చించిన విభాగంలో సూచించినట్టు – అగ్రవర్ణ పురుషునికీ, నిమ్నవర్ణాల స్త్రీలకూ మధ్య వివాహాన్ని బ్రాహ్మణమతం కొనసాగనిచ్చింది. అనులోమ వివాహం అనే ద్వారం పెద్దగా గౌరవప్రదమైనదీ, రెండోవైపు రాకపోకలు గల ద్వారమూ కాకపోయినప్పటికీ, వర్ణాలను పూర్తిగా విడగొట్టకుండా నివారించగల అంతస్సంబంధ ద్వారంగా అది వుండింది. అయితే, బ్రాహ్మణమతం ఇక్కడ కూడా హేయమైన కుతంత్రం పన్నింది. ఆ కుతంత్రం ఎంత హేయమైనదో చూపాలంటే, శిశువు వర్ణాన్ని నిర్ణయించడానికి అమలులో ఉండిన నియమాల గురించి మొదట చెప్పాలి. అతి పురాతన కాలం నుంచీ ఉన్న నియమం ప్రకారం సంతానం వర్ణం తండ్రి వర్ణం బట్టి నిర్ణయమవుతుంది. తల్లి వర్ణానికి ఏమీ ప్రాముఖ్యం లేదు. ఈ కింది ఉదాహరణలు దాన్ని నిస్సందేహంగా నిరూపిస్తాయి.

| తండ్రిపేరు | తండ్రివర్ణం | తల్లిపేరు | తల్లివర్ణం | సంతానంపేరు | సంతానంవర్ణం |
|---|---|---|---|---|---|
| 1. శంతనుడు | క్షత్రియుడు | గంగ | శూద్ర(అనామిక) | భీష్ముడు | క్షత్రియుడు |
| 2. శంతనుడు | క్షత్రియుడు | మత్స్యగంధి | శూద్ర(జాలరి) | విచిత్రవీర్యుడు | క్షత్రియుడు |
| 3. పరాశరుడు | బ్రాహ్మణుడు | మత్స్యగంధి | శూద్ర(జాలరి) | కృష్ణద్వైపాయనుడు | బ్రాహ్మణుడు |
| 4. విశ్వామిత్రుడు | క్షత్రియుడు | మేనక | (అప్సర) | శకుంతల | క్షత్రియుడు |
| 5. యయాతి | క్షత్రియుడు | దేవయాని | బ్రాహ్మణి | యదు | క్షత్రియుడు |
| 6. యయాతి | క్షత్రియుడు | శర్మిష్ఠ | అసురి(అనార్య) | ద్రుహ్యు | క్షత్రియుడు |
| 7. జరత్కారుడు | బ్రాహ్మణుడు | జరత్కారి | నాగ(అనార్య) | అనిత | బ్రాహ్మణుడు |

ఈ నియమాన్ని పితృ సవర్ణ్య నియమం అంటారు. అనులోమ, ప్రతిలోమ వివాహ విధానాలపై పితృ సవర్ణ్య నియమం ప్రభావాన్ని పరిశీలించడం ఆసక్తికరంగా ఉంటుంది.

ప్రతిలోమ వివాహంపై ఆ నియమం ప్రభావం ఇలా ఉంటుంది. అగ్రవర్ణ స్త్రీల సంతానం వర్ణం, తండ్రులైన నిమ్నవర్ణం వారి వర్ణానికి దిగిపోతుంది. అనులోమ వివాహంపై ఈ ప్రభావం దానికి భిన్నంగా వుంటుంది. నిమ్నవర్ణాలకు చెందిన తల్లుల పిల్లలు తండ్రుల అగ్రవర్ణానికి ఎదుగుతారు.

ప్రతిలోమ వివాహాలను మనువు నిషేధించి, తద్వారా అగ్రవర్ణం వారు నిమ్నవర్ణ స్థాయికి పతనం కాకుండా నివారించాడు. విమర్శించదగినవే అయినప్పటికీ, అనులోమ వివాహం, పితృ సవర్ణ్య నియమం కొనసాగినంత కాలం పెద్దగా నష్టం జరగలేదు. ఆ రెండూ కలిసి ఎంతో ప్రయోజనకారి అయిన వ్యవస్థగా ఏర్పడ్డాయి. అనులోమ వివాహం వర్ణాల మధ్య అంతస్సంబంధాన్ని కొనసాగించింది; పితృ సవర్ణ్య నియమం అగ్రవర్ణాలను సమ్మిశ్రమంగా రూపొందేట్టు చేసింది. ఎందుకంటే వారంతా వివిధ వర్ణాలకు చెందిన తల్లుల సంతానం. వర్ణాల మధ్య ఉన్న ఈ అంతస్సంబంధ ద్వారాన్ని బ్రాహ్మణమతం ఇక తెరిచి ఉంచాలనుకోలేదు. మూసేయాలనుకుంది. కానీ, మూసివేసిన పద్ధతి అప్రతిష్టాకరమైనది. సూటి పద్ధతి, గౌరవప్రదమైన పద్ధతి అనులోమ వివాహాన్ని నిలిపివేయడం. కానీ బ్రాహ్మణ మతం ఆ పని చేయలేదు. అనులోమ వివాహాన్ని అది కొనసాగనిచ్చింది. సంతనం వర్ణాన్ని నిర్ణయించే నియమాన్ని మార్చింది. పితృ సవర్ణ్య నియమం స్థానంలో, తల్లి వర్ణం ప్రకారం శిశువు వర్ణ నిర్ణయం జరిగే మాతృ సవర్ణ్య నియమాన్ని ప్రవేశ పెట్టింది. ఈ మార్పులో, అంతకుముందు విధానంలో సామాజిక అంతస్సంబంధాల సాధనంగా ఉన్న పెళ్ళికి ఆ స్వభావం పోయింది. నిమ్నవర్ణానికి చెందిన తల్లికి పుట్టిన కారణం చేత ఆ పిల్లల బాధ్యత నుంచి అగ్రవర్ణ తండ్రులను ఆ మార్పు తప్పించింది. అది అనులోమ వివాహాన్ని నిమ్నవర్ణాలకు కేవల లైంగిక వ్యవహారంగా, అవమానంగా, కించపరచడంగా; అగ్రవర్ణాలకు నిమ్నవర్ణ స్త్రీలతో చట్టబద్ధ వ్యభిచారం చేసే సదుపాయంగా మార్చింది. మరింత విశాలమైన సామాజిక దృష్టితో చూస్తే, ఆ మార్పే హిందూ సమాజానికి శాపమైన వర్ణాల పూర్తి వేర్పాటును సృష్టించింది. ఆయన సరే, సాంప్రదాయ హిందువు కులవ్యవస్థ ఆదర్శ వ్యవస్థ అని ఇంకా నమ్ముతాడు. సాంప్రదాయ హిందువు గురించే ఎందుకు చెప్పుకోవడం? మేధావులైన రాజకీయ వాదులలోనూ, చరిత్రకారులలోనూ అటువంటి వారున్నారు. జాతీయవాదానికి కుల వ్యవస్థ అవరోధంగా ఉందని అంటే తీవ్రంగా వ్యతిరేకించే భారతీయ రాజకీయవాదులు, చరిత్రకారులు ఉన్నారనుకోండి. భారతదేశం ఒక జాతి అని వాళ్ళు భావిస్తారు. భారత జాతి గురించి కాకుండా భారత ప్రజల గురించి ఎవరైనా మాట్లాడితే వాళ్ళు చాలా బాధపడతారు. ఈ వైఖరిని అర్థం చేసుకోవచ్చు. రాజకీయవాదుల్లో, చరిత్రకారుల్లో అధికులు బ్రాహ్మణులు, తమ పూర్వీకుల అకృత్యాలను బట్టబయలు చేయడానికి గానీ, సాగించిన దుర్మార్గాలను అంగీకరించడానికి గానీ వారికి ధైర్యం ఉంటుందని ఆశించలేం. 'భారతదేశం ఒక జాతియా?' అని ఎవరినైనా అడగండి, అందరూ ముక్త కంఠంతో 'అవును' అంటారు. 'ఎందుకు' అని అడగండి. మొదటిదిగా భారతదేశం భౌగోళిక ఐక్యత ఉన్న దేశమని, రెండోదిగా మౌలిక సాంస్కృతిక ఐక్యత ఉన్న దేశమని కాబట్టి భారతదేశం ఒక జాతి అని వారు కారణాలు చెబుతారు. వాదం కోసం వాటిని ఒప్పుకున్నా, ఈ వాస్తవాల ఆధారంగా భారతదేశం నిజంగా ఒక జాతి అని అర్థం చెప్పడం భ్రమల్లో విహరించడమే. జాతి అంటే ఏమిటి? ఎంత స్థాయిలో భౌగోళిక ఐక్యత ఉన్నప్పటికీ ఆ భౌతిక అర్థంలో – జాతి అంటే దేశం కాదు. ఉమ్మడి భాష, ఉమ్మడి మతం, లేదా ఉమ్మడి నరవర్ణం (Common race) వీటి నుంచి సంక్రమించిన ఉమ్మడి సంస్కృతి వల్ల సమీకృతులైన ప్రజలూ కాదు జాతి అంటే, మరొకచోట నేను చెప్పినదాన్ని ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. "జాతీయత ఒక స్వీయ మానసిక భావన (Subjective Psychological feeling). అంతా ఒకటే అనే సమష్టి మనోభావం అది. ఆ మనోభావాన్ని నింపుకున్న వారందరూ ఒకరినొకరు బంధువుల వలె

భావిస్తారు. జాతీయ భావన రెండంచుల కత్తి వంటిది. అది ఏక కాలంలో అస్మదీయులపై సుహృద్భావనను, పరాయి వారిపై తద్వ్యతిరేక భావనను కలిగిస్తుంది. అదొక "సజాతి చైతన్యం" (Consciousness of kind). సజాతీయ పరిమితులలోని వారిని అది కలుపుతుంది, సజాతీయ పరిమితికి వెలుపలి వారి నుంచి విడదీస్తుంది. తన స్వంత సమూహానికే తాను చెంది వుండాలని, మరే ఇతర సమూహానికి చెందకూడదన్న తపన అది. జాతీయత, జాతీయ భావన సారాంశం ఇదే. తన సజాతీయులకే తాను చెంది వుండాలన్న తపన నేను చెప్పినట్టుగా ఒక స్వీయ మానసిక భావన. ఈ సజాతీయతకే చెందాలన్న తపనకూ భౌగోళ శాస్త్రానికీ, సంస్కృతికీ లేదా ఆర్థిక సామాజిక ఘర్షణకూ సంబంధం లేదనేది గుర్తుంచుకోవలసిన ముఖ్య విషయం. భౌగోళిక ఐక్యత వుండి కూడా 'ఫలానా దానికే చెందాలనే తపన' వుండకపోవచ్చు. భౌగోళిక ఐక్యత లేకపోయినా 'ఫలానా దానికే చెందాలనే తపన' తీవ్రంగా వుండవచ్చు. సాంస్కృతిక ఐక్యత వుండి కూడా ఆ తపన లేకపోవచ్చు. ఆర్థిక సంఘర్షణలు, వర్ణ విభేదాలూ వున్నప్పటికీ 'ఆ తపన' తీవ్రంగా వుండవచ్చు. విషయం ఏమిటంటే జాతీయత అనేది ప్రాథమికంగా భౌగోళిక, సాంస్కృతిక విషయం కాదు. లేదా......"

వైదిక హయాం క్షీణ కాలంలో32 శూద్రులూ స్త్రీలూ కూడా హీనస్థాయిలో ఉండే వారు. వారి స్థాయిలో గొప్ప మార్పు తెచ్చింది బౌద్ధమత వెల్లువ. క్లుప్తంగా చెప్పాలంటే, బౌద్ధం హయాంలో శూద్రుడు సంపదనీ, జ్ఞానాన్నీ సంపాదించుకోగలిగేవాడు. రాజు కూడా కాగలిగే వాడు. వేదకాలంలో బ్రాహ్మణుడు ఆక్రమించిన అత్యున్నత సామాజిక స్థానాన్ని కూడా అతను అందుకోగలిగేవాడు. బౌద్ధంలోని భిక్షుక సంఘం వైదికంలోని బ్రాహ్మణ సంఘం సమానమైనవి. ఎవరి మత వ్యవస్థల్లో వారు హోదాలోను, గౌరవంలోనూ సమాన స్థాయిలో వుండేవారు. వైదిక హయాంలో శూద్రుడు బ్రాహ్మణునిగా మారాలని ఆశించలేదు, కానీ అతను భిక్షువుగా మారి బ్రాహ్మణునితో సమానమైన హోదాను, గౌరవాన్ని పొందగలడు. ఎలాగంటే, వైదిక బ్రాహ్మణ సంఘంలో శూద్రునికి ప్రవేశం లేకపోగా, బౌద్ధ భిక్షుక సంఘం అతనికి ప్రవేశాన్నిచ్చింది. వైదిక కాలంలో బ్రాహ్మణులతో సమానస్థాయి పొందారు. మహిళల విషయంలో కూడా అటువంటి మార్పే కనిపిస్తుంది. బౌద్ధం హయాంలో స్త్రీ స్వేచ్ఛా జీవి అయింది. వివాహం ఆమెను బానిస చేయలేదు. బౌద్ధ నియమం ప్రకారం పెళ్ళి ఒక పరస్పర ఒడంబడిక. బౌద్ధం హయాంలో ఆమె సంపదను సమకూర్చుకోవచ్చు, జ్ఞానార్జన చేయవచ్చు, బౌద్ధ సన్యాసినుల సంఘంలో చేరి బ్రాహ్మణులతో సమస్థాయిని పొందవచ్చు. బౌద్ధ ప్రచారం వల్ల శూద్రుల, స్త్రీల హోదా ఎంతగా పెరిగిందంటే, బౌద్ధాన్ని ప్రత్యర్థులు శూద్రమతమని అనేవారు.

బ్రాహ్మణ మతానికి ఇదంతా ఎంతో కంటగింపుగా వుండి వుండాలి. బౌద్ధం చేసిన చైతన్యపూరిత బోధల ఫలితంగా కలిగిన విప్లవాత్మక మార్పుల వల్ల – శూద్రులు, స్త్రీలు పొందిన ఉన్నతస్థాయిని సంపూర్ణంగా కూలదోయడంలో బ్రాహ్మణ మతం చూపి విధ్వంసోన్మాదంలో ఆ కంటగింపు ఏ స్థాయిలో వుందో తెలుస్తుంది.

ఈ నేపథ్యంలో శూద్రులకు వ్యతిరేకంగా మనువు విధించిన నియమాలలోని క్రౌర్యాన్ని, అమానుషత్వాన్ని చూస్తే ఎవరైనా చలించిపోతారు. ప్రత్యేక శీర్షికల కింద వాటిని కొన్నిటిని ఉటంకిస్తాను.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య గృహస్థులను మనువు ఇలా ఆదేశిస్తున్నాడు:

"శూద్రులు పాలకులైన దేశంలో తను నివాసముండకుండును గాక" (4–61)

శూద్రుడు పాలకుడైన దేశాన్ని బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు వదిలివెళ్ళారని కాదు దీని అర్థం. శూద్రుడు రాజైతే అతన్ని చంపాలని మాత్రమే దాని అర్థం. శూద్రుడు రాజు కావడానికి అర్హుడిగా గుర్తింపబడకపోవడమే కాదు, అతడొక గౌరవాస్పద వ్యక్తి కూడా కాదు. మనువు ఇలా శాసిస్తాడు:

"యజ్ఞాదుల వంటి మత ప్రయోజనాల (నిర్వహణ)కు శూద్రుని సంపద నుంచి బ్రాహ్మణుడు యాచించకూడదు" (11–24)

శూద్రునితో అన్నిరకాల వైవాహిక సంబంధాలూ నిషిద్ధం. మూడు అగ్రవర్ణాల స్త్రీతో అతనికి వివాహం నిషిద్ధం. అగ్రవర్ణాల స్త్రీతో శూద్రుడు ఏ సంబంధమూ పెట్టుకోగూడదు. ఆమెతో శూద్రుడు వ్యభిచరిస్తే మనువు ప్రకారం అది మరణశిక్ష వేయదగిన నేరం.

అగ్రకులానికి చెందిన రక్షిత33 లేదా, అరక్షిత స్త్రీతో సంభోగించిన శూద్రుని ఈ విధంగా శిక్షించాలి: ఆమె అరక్షిత అయితే నేరం చేసిన అవయవాన్ని అతడు కోల్పోతాడు, ఆమె రక్షిత అయితే అతనికి మరణశిక్ష విధించాలి, అతని ఆస్తి స్వాధీనం చేసుకోవాలి. (8–374)

శూద్రుడు బానిసలాగా వుండాలని, పదవులకు, విద్యకు, సంపదకు అయోగ్యుడిగా వుండాలని, చీదరించుకోదగ్గ వ్యక్తిగా వుండాలని, అతను, అతని ఆస్తి ఎప్పుడైనా జప్తు చేసుకోదగ్గవిగా వుండాలని మనువు వక్కాణిస్తాడు.

పదవి గురించి మనువు నిర్దేశం:

జన్మరీత్యా మాత్రమే బ్రాహ్మణుడైన వాడు, అంటే వేదాలను చదవని, వేదకర్మలను చేయని బ్రాహ్మణుడు కూడా, రాజుకోసం, న్యాయమూర్తిగా వ్యవహరించి చట్టానికి భాష్యం చెప్పవచ్చును. కానీ శూద్రుడు మాత్రం ఆ పని చేయరాదు. (అతడెంత విద్వాంసుడైనప్పటికీ) (8–20)

శూద్రుడు తీర్పరి అయితే చూస్తే ఊరుకునే రాజ్యం ఊబిలో దున్నవలె మునిగిపోతుంది. (8-21)

శూద్రుడు కనుక అహంకారంతో బ్రాహ్మణులకే మతబోధ చేయ సాహసిస్తే రాజు అతని నోటిలోనూ, చెవులలనూ మరుగుతున్న నూనెను పోయించాలి. (8-272)

ప్రాచీన కాలంలో వేదాధ్యనమే విద్యగా భావింపబడేది. వేదాధ్యయనం హక్కుకు సంబంధించిన అంశం కాదని, పరిమిత సదుపాయానికి సంబంధించినదని మనువు ప్రకటిస్తాడు. శూద్రునికి వేదం చదివే హక్కును మనువు నిరాకరించాడు. దాన్ని మూడు అగ్రవర్ణాలకే పరిమితమైన సదుపాయంగా చేశాడు. వేదాధ్యయనానికి శూద్రుడిని అనుమతించకపోవడమే కాదు, వేదజ్ఞానం సంపాదించుకోవడానికి శూద్రునికి సహాయపడేవారికి శిక్షలను కూడా మనువు విధించాడు. మనువు ఇలా శాసిస్తాడు:

"అతనెప్పుడూ వేదాలను చదవకూడదు... చూద్రుల సమక్షంలో." (4-99)

ఇంకా ఇలా నిర్దేశిస్తాడు:

శూద్ర శిష్యులకు విద్యను బోధించేవాడు, శూద్రునికి శిష్యుడైనవాడు శ్రాద్ధకర్మలకు ఆహుతుడు కావడానికి అనర్హుడు. (3-156)

వేదం చదివితే శూద్రునికి శిక్ష విధించే క్రౌర్యంలో మనువు వారసుడు మించిపోయాడు. ఉదాహరణకు – వేదాన్ని యాదృచ్ఛికంగా విన్న, వేదంలని ఒక పదాన్నైనా ఉచ్ఛరించే సాహసం చేసిన శూద్రుని నాలుకను రాజు రెండుగా చీల్చాలని, చెవులలో కరిగించిన సీసం పోయాలని కాత్యాయనుడు చెప్పాడు.

ఇక సంపద విషయంలో మనువు నిర్దయగానూ, నిర్లజ్జగానూ ఉన్నాడు. మనుస్మృతి ప్రకారం:

సమర్థత ఉన్నప్పటికీ శూద్రుడు అవసరానికి మించి ఆర్జించకూడదు. ఎందుకంటే, దాసుడు సంపదను కూడబెడితే గర్విష్ఠియై, అహంకారంతోనో, అలక్ష్యంతోనో బ్రాహ్మణులను బాధిస్తాడు. (10-29)

పై నియామకం కంటె, నియమానికి చెప్పిన కారణం భయంకరమైనది. శూద్రుడు సంపదను ఆర్జించకుండా నిరోధించేందుకు నిషేధాజ్ఞ మాత్రమే చాలుతుందని మనువు నమ్మ

లేదు. సంపన్నుడైన శూద్రుడు బ్రాహ్మణులను బాధించడానికి ఏమాత్రం అవకాశం లేకుండా తన స్మృతిలో మనువు మరో విభాగాన్ని జోడించాడు. అందులో అతను ఇలా చెప్పాడు:

జీవిక గడవని పరిస్థితులు వస్తే శూద్రుని సామగ్రిని బ్రాహ్మణుడు నిస్సంకోచంగా స్వాధీనం చేసుకోవచ్చు. (8–417)

శూద్రుని ఆస్తి మాత్రమే కదు, శూద్రుని శ్రమ కూడా... జప్తు చేసుకోదగినవేనని మనువు ప్రకటిస్తాడు.

శూద్రుడిని కొన్నా, కొనకపోయినా అతనిచేత బ్రాహ్మణుడు చాకిరీ చేయించుకోవచ్చును. ఎందుకంటే అతడిని సృష్టికర్త బ్రాహ్మణుని బానిసగానే సృష్టించాడు. (8–413)

సంభాషణలో కూడా శూద్రుడు బానిసతనం ప్రకటించాలని మనువు ఆశించాడు. శూద్రుడు ఎంతగా దాసభావంతో వుండాలో ఈ మను నియమాలలో చూడవచ్చు.

శూద్రుడు ద్విజుడిని దూషించి అవమానిస్తే అతని నాలుక కోసేయాలి, ఎందుకంటే అతను నీచ జన్ముడు కాబట్టి. (8–270)

ద్విజుల పేర్లను, కులాలను తిరస్కారభావంతో అతడు ప్రస్తావిస్తే – పది అంగుళాల ఇనుప చువ్వను కాల్చి నోట్లో దూర్చాలి. (8–271)

శూద్రుడ్ని కేవలం బానిసగానే కాకుండా నిందార్హునిగా చేయడమే మనువు ఉద్దేశం. శూద్రునికి ఉన్నతంగా స్ఫురించే పేరు ఉండడాన్ని మనువు ఒప్పుకోడు. ఈ రకమైన నియమాలను మనువు క్రోడీకరించి ఖచ్చితమైన ఋజువులను మిగల్చకపోతే బ్రాహ్మణమతం శూద్రులను యింత నిర్దయతో వెంటాడి వేధించేదని నమ్మడం కష్టమయ్యేది. వివిధ కులాలు తమ సంతానానికి ఏ విధమైన పేర్లు పెట్టాలో మనువు ఎలా నిర్దేశిస్తున్నాడో గమనించండి.

"బ్రాహ్మణుని పేరులో మొదటి భాగం పవిత్రతను నిర్దేశించే విధంగాను, క్షత్రియులైతే అధికారాన్ని తెలియజేసే విధంగాను, వైశ్యుల విషయంలో సంపదను సూచించే విధంగాను వుండాలి. అదే శూద్రుని విషయంలో అయితే తిరస్కారభావం కలిగించేట్టు వుండాలి." (2–31)

"పేరులో రెండవ భాగం బ్రాహ్మణుల విషయంలో సంతోషాన్ని సూచించే విధంగాను, క్షత్రియులలో రక్షణను ప్రతిబింబించే విధంగాను, వైశ్యులలో వర్థిల్లేతత్వాన్ని తెలియజేసే విధంగా ఉండాలి. అదే శూద్రుల దగ్గరకు వచ్చేటప్పడికి సేవను అందించే భావం కలిగి ఉండాలి."

(2–32)

శూద్రుల గురించి మనువు సృష్టించిన సిద్ధాంతమే ఈ అమానుష నియమాలకు ప్రాతిపదిక.

తన స్మృతిలో మొదటి నుంచీ దాన్ని నిర్మొహమాటంగా వక్కాణిస్తున్నాడు: "అగ్ర కులాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలకు సేవ చేయడమే దేవుడు శూద్రులకు నియోగించిన ఏకైక వృత్తి." (1–91)

బానిసగా వుండటానికే శూద్రుడు పుట్టాడని చెబుతూ, అతన్ని ఆ విధంగా ఉంచడానికి చట్టాలు మనువు తయారు చేశాడు. బౌద్ధ యుగంలో శూద్రుడు తాను బ్రాహ్మణమతంలో ఎన్నటికీ చేరలేని స్థాయికి అంటే న్యాయమూర్తి, పూజారి, రాజు వంటి పదవులను కూడా ఆశించడానికి అవకాశం ఉండింది. మనువు శూద్రుని ముందుంచిన ఆదర్శంతో పై అవకాశాలను పోల్చిచూస్తే బ్రాహ్మణమతం కింద అతని పరిస్థితి ఎంత దారుణంగా వుంటుందో అర్థమవుతుంది.

"(బ్రాహ్మణులకు సేవ చేసినా శూద్రుడు తన పొట్ట గడవటానికి ఇబ్బందిపడుతూ ఉంటే), అతడు క్షత్రియులకు, ధనవంతుడైన వైశ్యుడుకి సేవచేసి జీవనాధారాన్ని ఏర్పాటు చేసుకోవచ్చు." (10–121)

"ఇహపరాల కోసమో శూద్రుడు బ్రాహ్మణులకు సేవ చేయవచ్చును. ఎందుకంటే బ్రాహ్మణుని సేవకునిగా గుర్తింపు పొందిన వారికి అన్ని రకాలైన ఫలితాలు లభిస్తాయి." (10–122)

"బ్రాహ్మణునకు సేవ చేసే వృత్తే శూద్రునకు అత్యంత శ్రేష్టమైన వృత్తి, మిగతా ఏ వృత్తీ శూద్రునకు ఫలాన్ని ఇవ్వదు." (10–123)

"అటువంటి సేవలో ఉన్నవారికి అతని సామర్థ్యం, పరిశ్రమ, అతనిపై ఆధారపడ్డవారి సంఖ్యను బట్టి స్వంత కుటుంబం (ఆస్తి) నుంచి బ్రాహ్మణుడు అందచేయాలి." (10–124)

"మిగిలిన ఆహార పదార్థాలను, పాత గృహోపకరణాలను అతనికి ఇవ్వాలి." (10–125)

మనువు స్త్రీకి, శూద్రుని యెడల చూపించిన ఆదరణకంటే ఎక్కువేమీ చూపలేదు. మొదలుపెట్టడమే స్త్రీ గురించి తక్కువ అభిప్రాయంతలో మొదలుపెడతాడు.

మనువు ఇలా చెప్తున్నాడు. "పురుషుడ్ని ప్రలోభానికి గురి చేయడమే స్త్రీ ప్రాథమిక నైజం. అందుచేతనే విజ్ఞులైన పురుషులు స్త్రీల విషయంలో జాగ్రత్తగా మెసలుకుంటారు."

(2-213)

"మూఢులను మాత్రమే కాకుండా విద్యావంతులైన పురుషులను కూడా స్త్రీలు పెడతోవ పట్టించి కోరికకు, కోపానికి బానిసగా చేయగలరు." (2-214)

"ఏ పురుషుడు కూడా ఏకాంతంగా ఉన్నపుడు తల్లితో గాని, అక్క చెల్లెళ్ళతో గాని కూర్చుండరాదు. ఎందువలనంటే ఇంద్రియాల శక్తి విద్యావంతుడ్ని కూడా లొంగదీసుకోగలదు." (2-215)

"స్త్రీలకు అందంతో గాని, వయస్సుతో గాని పనిలేదు. పురుషుడైతే (చాలును అని ఆలోచిస్తారు.) సొగసైన వారినే కాక హీనులను కూడా వారు తమనుతాము అర్పించుకుంటారు." (9-14)

"స్త్రీలు పురుషులపై తమకుగల మోహంవల్ల, చపలచిత్తమైన స్వభావం వల్ల సహజ కాఠిన్యం వల్ల, ఎంత జాగ్రత్తగా సంరక్షించినప్పటికీ తమ భర్తల విషయంలో అవిధేయులుగా ప్రవర్తిస్తారు." (9-15)

వారి చంచల స్వభావాన్ని దేవుడు కూడా గుర్తించాడు. వారిని హద్దులో పెట్టేందుకు పురుషుడు తన శక్తియుక్తిలన్నిటినీ ప్రదర్శించేలా చేసేటట్లు సృష్టించాడు." (9-16)

"మనువు స్త్రీలకు పాన్పు, ఆసనం, ఆభరణాలు, మలినమైన కోరికలు, చెడు ప్రవర్తన, క్రోధం, ద్వేషం, దుష్ప్రవర్తన అనే గుణాలను జన్మతః నియోగించాడు." (9-17)

స్త్రీలపై మనువు చేసిన నియమాలు ఈ అభిప్రాయంతో రూపొందినవే. స్త్రీలు ఏ పరిస్థితిలోనూ స్వేచ్ఛగా ఉండరాదన్నదే మనువు చేసిన చట్టాల అసలు ఉద్దేశం. మనువు అభిప్రాయం ప్రకారం:

"స్త్రీలు, పగలూ రాత్రీ (కుటుంబలోని) పురుషులపై ఆధారపడి ఉండాలి. ఒకవేళ వారు ఇంద్రియ సుఖాలకు అలవాటు పడితే అవి తమ అదుపు తప్పిపోకుండా చూడాలి." (9-2)

"స్త్రీని బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కుమారుడు రక్షిస్తాడు. ఆమె ఎప్పుడూ స్వేచ్ఛకు అర్హురాలు కాదు." (9-3)

"ఎంత చిన్నవైనప్పటికీ చెడు ప్రవృత్తుల జోలికి స్త్రీలను పోనీయకుండా జాగ్రత్తపడాలి.

ఎందుకంటే అజాగ్రత్తగా వుంటే రెండు కుటుంబాలకూ వారు దుఃఖాన్ని కలుగజేస్తారు." (9–5)

"ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని అన్ని కులాల స్త్రీలను జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత ఉంది. బలహీనులైన భర్తలు కూడా తమ భార్యలను కట్టుదిట్టంగా వుంచుకోవాలి." (9–6)

"బాలికగాని, యువతిగాని, వృద్ధాప్యంలో ఉన్న స్త్రీ అయినా ఆమె ఇంట్లోనైనా స్వతంత్రంగా వ్యవహరించకూడదు." (5–147)

"బాల్యంలో తండ్రికి, యవ్వనంలో భర్తకు, భర్త చనిపోతే కుమారులకు, స్త్రీ లోబడి వుండాలి. స్త్రీ ఎన్నటికీ స్వతంత్రంగా ఉండరాదు." (5–148)

"తండ్రి నుంచిగాని, భర్త నుంచిగాని, లేదా పుత్రుల నుంచి ఆమె ఎప్పుడూ విడిపోవాలనే ఉద్దేశం పెట్టుకోరాదు. ఆవిధంగా చేస్తే తన కుటుంబాన్ని, భర్త కుటుంబాన్ని అగౌరవపరచేటట్టు చేస్తుంది. స్త్రీలకు విడాకుల హక్కు లేదు." (5–149)

"వివాహం చేసుకున్న తర్వాత భర్తతో భార్య మమేకం చెందినట్టు భావిస్తారు. అందువల్ల ఒకసారి వివాహం జరిగిన తర్వాత స్త్రీకి విడిపోయే అవకాశం లేదు." (9–45) చాలామంది హిందువులు ఇక్కడితో ఆగిపోయి, మనువు వివాహాన్ని ఒక పవిత్రమైన బంధంగా భావించాడని అందుచేతనే అతడు విడాకులను అనుమతించలేదని వాదిస్తూ మను నియమాన్ని ఆదర్శీకరించుకుంటూ ఆత్మసంతృప్తి పొందుతారు. విడాకులకు వ్యతిరేకంగా మనువు చేసిన చట్టానికి వేరే ఉద్దేశాలు వున్నాయి. అది ఒక పురుషుడ్ని స్త్రీకి కట్టివేసేది కాదు. స్త్రీని పురుషుడితో కట్టివేసి, పురుషుడ్ని మాత్రం స్వేచ్ఛగా వదలివేసింది. భార్యను వదిలివేయకుండా నిరోధించడానికి మనువు ఎటువంటి ప్రయత్నం చేయలేదు. తన భార్యను కేవలం వదలివేయడానికే కాకుండా అమ్మివేయడానికి కూడా పురుషుడికి మనువు అవకాశం కల్పించాడు. కానీ భార్య స్వతంత్రురాలు కాకుండా మాత్రం అతను ప్రయత్నం చేశాడు. మనువు ఏమి చెప్పున్నాడో గమనించండి.

"అమ్మివేస్తే, వదిలేసినా, గాని స్త్రీ, ఆమె భర్త నుంచి విముక్తి పొందలేదు." (9–46)

దీని అర్థం ఏమిటంటే భర్తచేత అమ్ముడుపోయిన లేదా నిరాకరణకు గురయిన స్త్రీ ఏనాటికీ కొనుక్కున పురుషుడికైనా, తిరస్కృతను చేరదీసే పురుషుడికైనా చట్టబద్ధమైన భార్య కాలేదు. ఇది రాక్షసత్వం. తన చట్టాలలోని న్యాయబద్ధతను మనువు ఏనాడూ పట్టించుకోలేదు. బౌద్ధ మతంలో ఆమెకు లభించిన హక్కులన్నింటినీ స్త్రీకి లేకుండా చేయడమే మనువు ముఖ్యోద్దేశం. ఆమెకు లభించిన స్వేచ్ఛను దుర్వినియోగపరచడం వల్లనే, శూద్రులను వివా

హామాడటానికి సిద్ధం కావడం వల్లనే, వర్ణాశ్రమ తరగతులు నాశనం అయ్యాయని మనువుకు తెలుసు. ఆమెకు లభించిన అనుమతుల విషయంలో మనువు తీవ్రంగా స్పందించి యీ పద్ధతిని విరోధించేందుకు ఆమె స్వేచ్ఛను హరించడానికి చట్టాలను చేశాడు.

ఆస్తి విషయంలో మనువు స్త్రీని బానిస స్థాయికి చేర్చాడు.

భార్యకు, పుత్రునికీ, బానిసకీ ఎటువంటి ఆస్తి ఉండదు. వారు సంపాదించినదంతా, వారు ఏ పురుషుడికి చెందుతారో అతనికి చెందుతుంది." (9-146)

స్త్రీ విధవరాలైనపుడు ఆమె భర్త ఉమ్మడి కుటుంబంలోని భాగస్వామ్యుడైతే భరణాన్ని ఇవ్వడానికి, విడిగా ఉంటే అతని ఆస్తిలోని కొంత భాగాన్ని ఆమె నిర్వహణకై యివ్వడానికి మనువు అనుమతించాడు. అంతేకాని ఆస్తిపై స్వతంత్ర అధికారాన్ని చెలాయించే అవకాశాన్ని మాత్రం కల్పించలేదు.

మనుస్మృతి ప్రకారం స్త్రీని భౌతికంగా శిక్షించవచ్చు. భార్యను కొట్టడానికి భర్తకు మనువు అనుమతిని యిచ్చాడు.

"తప్పులు చేసిన భార్య, పుత్రుడు, బానిస, విద్యార్థి, తమ్ముడు వంటి వారిని తాడుతో గాని వెదురుబద్దతో కొట్టవచ్చును." (8-299)

ఇంకోవిధంగా చెప్పాలంటే మనువు స్త్రీని శూద్రుని స్థాయికి చేర్చాడు.

శూద్రునిలాగా స్త్రీ కూడా వేదాలు చదవకుండా నిషేధం ఉంది.

"స్త్రీకి కూడా సంస్కారాలను నిర్వహించాలి. కాని వాటిని ఆచరించేటపుడు వేద మంత్రాలు ఉండకుండా చెయ్యాలి." (2-66)

వేదాలను చదివేందుకు ఆమెకు హక్కు లేదు. అందువల్లనే ఆమె సంస్కారాలను నిర్వహించేటపుడు వేదమంత్రాలు దొర్లకుండా చేయాలనే నిబంధన వుంది. స్త్రీలకు వేదాలు చదివే హక్కు లేకపోవడం వల్ల మతంపై వారికి సరియైన అవగాహన లేకపోయింది. పాపాల నుంచి నిష్కృతి పొందేందుకు వేద మంత్రోచ్చారణ ఉపయోగకరం. స్త్రీలకు ఆ అవకాశం లేదు కాబట్టి వారు అసత్యమంత కల్మషులై ఉంటారు.

యజ్ఞాలను చెయ్యడం మతానికి ప్రాణప్రదాలని బ్రాహ్మణపతం చెప్తోంది. అయినప్పటికీ

మనువు స్త్రీలకు వాటిని నిర్వహించేందుకు అనుమతినీయలేదు.

మనువు నిర్దేశిస్తాడు:

"వేదంలో నిర్దేశించిన దైనందిన యజ్ఞాలను నిర్వహించడం స్త్రీ చేయరాదు." (11–36)

"ఒకవేళ ఆ విధంగా చేసినట్లయితే ఆమె నరకానికి వెళ్తుంది." (11–37)

యజ్ఞకర్మలకు ఆమెను అశక్తురాలిని చేసేందుకుగాను బ్రాహ్మణ పురోహితుని సేవలు ఆమెకు లభించకుండా మనువు నిరోధించాడు.

"స్త్రీ నిర్వహించిన యజ్ఞాది పూజా కార్యక్రమాలలో ఏ బ్రాహ్మణుడూ భోజనం చేయరాదు." (4–205)

"స్త్రీ నిర్వహించే యజ్ఞాది పూజా కార్యక్రమాలు అశుభమైనవి, దైవామోదానికి అర్హత లేనివి. అందువల్ల వాటిని నివారించాలి." (4–206)

స్త్రీకి విజ్ఞాన సంబంధమైన జిజ్ఞాస ఉండరాదు. అదేవిధంగా స్వేచ్ఛాయుతమైన ఆలోచనలు, సంకల్పాలు ఉండరాదు. సంప్రదాయానికి వ్యతిరేకమైన–బౌద్ధమతం వంటి వాటిలో ఆమె ప్రవేశింపరాదు. ఒకవేళ ఆమె అటువంటి వాటికి యింకా దాసురాలై ఉంటే మరణించిన వారి పేర ఇచ్చే తర్పణం ఆ స్త్రీకి యివ్వరాదు.

చివరగా జీవితాదర్శంగా స్త్రీ ముందు మనువు వుంచుతున్న విషయాన్ని ఆయన మాటల్లోనే చూద్దాం.

"తండ్రిగాని, తండ్రి అనుమతితో సహోదరుడు గాని తనకు వరుడుగా నిర్ణయించిన వ్యక్తికి అతను జీవించినంతవరకు, లోబడి స్త్రీ జీవించాలి. అతను మరణించిన తర్వాత అతని స్మృతిని అవమానపరచకూడదు." (5–151)

"మంచి గుణాలు కొరవడినప్పటికీ లేదా ఇతరత్రా సుఖాన్ని పొందే వాడైనప్పటికీ ఒక విశ్వాసపాత్రురాలైన భార్య తన భర్తను దేవునివలె ఆరాధించాలి." (5–154)

"తన భర్త సమక్షంలో కాకుండా, స్త్రీ ఏ యజ్ఞాన్నీ, నోమునీ, ఉపవాసాన్నీ చేయరాదు.

భర్త అదుపు ఆజ్ఞలకు లోబడి వున్న స్త్రీకి కేవలం అందువల్లే స్వర్గంలో ఉన్నతమైన స్థానం లభిస్తుంది." (5–155)

మనువు స్త్రీ ముందుంచిన ఈ ఆదర్శంలోని అసలు సారాంశం ఏమిటో తెలిపే భాగాలు చూద్దాం:

"పవిత్రమైన మంత్రాల సమక్షంలో వివాహం చేసుకున్న భర్తే సుఖదుఃఖాలలోనూ ఇహ పరలోకాలలోనూ స్త్రీకి సంతోషాన్ని కలిగించే వాడిగా ఉంటాడు." (5–153)

ఆమె ఎప్పుడూ చిరునవ్వులు చిందుస్తూ గృహ సంబంధమైన వ్యవహారాలలో తెలివిగా నడుచుకుంటూ, వస్తువులను శుభ్రపరచడంలో జాగ్రత్త వహిస్తూ, ఆర్థికపరమైన వ్యవహారాలను పొదుపుగా నిర్వహించాలి. (5–150)

ఇదీ స్త్రీలకు హిందువులు చూపించిన ఉన్నతమైన ఆదర్శం!

బౌద్ధమత ప్రాబల్యం బాగా ఉన్న రోజుల్లో శూద్రులు, స్త్రీలు సాధించిన ఉన్నతి బ్రాహ్మణులకు కోపాన్ని తెప్పించడమే కాకుండా సహింపరానిదిగా చేసింది. వారి పవిత్ర సాంఘిక వ్యవస్థను అది ఆసాంతం తలకిందులు చేసింది. మొదటిది చివరకు, చివరనుండేది మొదటికి మారింది. శూద్రుల, స్త్రీల స్థాయిని తిరిగి వెనుకటి స్థితికి తగ్గించేందుకు బ్రాహ్మణులు రాజకీయ బలాన్ని కూడా ఉపయోగించారని మనువు రచించిన చట్టాలు వివరిస్తాయి. విజయం సాధించిన బ్రాహ్మణీకం పూర్వ ఆశయాలను అంటే బానిసత్వం వంటి వాటిని తిరిగి అమలులోకి తెచ్చేందుకు శూద్ర, స్త్రీ వర్ణాలపై విరుచుకుపడింది. శూద్రులను, స్త్రీలను బానిసవర్గాలుగా చేయడంలో సఫలమైంది. శూద్రులు మిగతా మూడు వర్ణాలకు బానిసలైతే, స్త్రీలు వారి భర్తలకు బానిసలయ్యారు. బౌద్ధమతంపై విజయం సాధించిన తర్వాత బ్రాహ్మణులు చేసిన అకృత్యంలో యిది అత్యంత క్రూరమైంది. వర్గాధిపత్యం కోసం అక్రమ విజేతలు కొన్ని వర్గాలను హీనపర్చేందుకు చేసిన ఈ అకృత్యాలకు సరితూగే చారిత్రక సంఘటన ప్రపంచంలో యింకొకటి లేదు. బ్రాహ్మణమతం సాగించిన ఈ న్యూనీకరణ విశ్వరూపం ఏమిటో దురదృష్టవశాత్తూ పూర్తిగా అర్థం చేసుకోవడం లేదు. స్త్రీ, శూద్ర అనే రెండు చిన్నమాటల వెనక అది దాచబడింది. ఈ రెండు మాటల వెనుక ఉన్న సంఖ్య గురించి ఆలోచిస్తే, దాని విస్తృతి గురించి బోధపడుతుంది. ఈ చట్టాల ప్రభావం ఎంతమంది ప్రజలకు వర్తిస్తుంది? జనాభాలో స్త్రీలు సగభాగం ఉంటారు. మిగిలిన దాంట్లో మూడింట రెండు వంతులు శూద్రులు వుంటారు. ఈ రెండు వర్గాలు కలిస్తే జనాభాలో దాదాపు 75% శాతం వుంటుంది. ఇంత పెద్ద మొత్తంలో వున్న ప్రజలను బ్రాహ్మణమతం శాశ్వతమైన బానిసత్వానికీ, భ్రష్టతకూ గురిచేసింది. ఈ భ్రష్టత్వం వల్లనే 75 శాతం మంది ప్రజలు జీవించడానికి గల హక్కును, స్వేచ్ఛను, సుఖ జీవనయత్నావకాశాలను కోల్పోయి తద్వారా భారతదేశం మృత జాతికాకపోయినా, క్షీణ జాతిగా మారింది.

మనుస్మృతి అంతటా శ్రేణీయ అసమానత (graded inequality) అనే సూత్రం అంత ర్లీనంగా వుంది. జీవితంలో ఏ భాగాన్ని కూడా యీ సూత్రం లేకుండా మనువు వదలలేదు. ఈ విషయాన్ని పూర్తిగా వెల్లడి చేయాలంటే మనుస్మృతినంతటినీ యిక్కడ వుంచాలి. కానీ సామాజిక జీవితంలో ఈ శ్రేణీయ అసమానత మనువు ఏ విధంగా నిక్షేపించాడో చూపడానికి కొన్నింటిని మాత్రం మీ ముందుంచుతాను.

వివాహ విధానాన్ని గురించి మనువు ఏం చెప్తున్నాడంటే:

"శూద్రునికి శూద్ర స్త్రీ మాత్రమే భార్య కాగలదు. శూద్ర స్త్రీ, వైశ్య స్త్రీ మాత్రమే వైశ్యునికి భార్య కాగలదు; శూద్ర, వైశ్య స్త్రీలు, క్షత్రియ స్త్రీ మాత్రమే క్షత్రియునికి భార్యలు కాగలరు. ఆ ముగ్గురూ, కులకాంత బ్రాహ్మణునికి భార్యలు కాగలరు." (3-13)

అతిథి సత్కారాల గురించి మను నియమాలు చూడండి:

"బ్రాహ్మణునికి ఇంటికి వచ్చిన క్షత్రియుడు గానీ, వైశ్యుడుగాని శూద్రుడుగాని, వ్యక్తిగత మిత్రుడుగాగాని, బంధువుగాగాని, గురువుగాగానీ అతిథిగా గౌరవం పొందరు." (3-110)

"ఒకవేళ బ్రాహ్మణుని యింటికి క్షత్రియుడు అతిథిగా వచ్చినట్లయితే ఆ యింట్లోని బ్రాహ్మణులందరూ భోజనం చేసినతర్వాత వారి యిష్టప్రకారం అతిథికి ఆహారాన్ని అందివ్వవచ్చును." (3-111)

"శూద్రుడు, వైశ్యుడు అతిథులుగా వస్తే బ్రాహ్మణుడు తన సేవకులతో కలపి భుజించే అవకాశం కల్పించి ఆదరణ చూపవచ్చును." (3-112)

ఒక బ్రాహ్మణుని ఇంట్లో మరో బ్రాహ్మణునికి మాత్రమే అతిథిగా గౌరవం పొందే అర్హత వుంది. 34 క్షత్రియుడు అతిథిగా వస్తే ఆ యింట్లోని బ్రాహ్మణులందరూ భుజించిన తర్వాత మాత్రమే అతనికి ఆహారాన్ని యిస్తారు. అదే శూద్రుని, వైశ్యుని విషయంలో అయితే వారికి బ్రాహ్మణుని సేవకులతో మాత్రమే ఆహారాన్ని తీసుకునే అవకాశం ఉంది.

సంస్కారాలు నిర్వహించే విషయంలో మనువు నిర్దేశించిన నియమాలు పరిశీలించండి.

"సంస్కారాలను స్వీకరించే హక్కు శూద్రునికి లేదు." (10-126)

"మిశ్రమ వర్ణాలకు చెందిన భార్యాభర్తలు సంస్కారాలను స్వీకరించడానికి అనర్హులని

చట్టం నిర్దేశిస్తుంది. ఎందుకంటే అందులో ఒకరి తల్లిదండ్రులు తక్కువ కులానికి చెందటం వల్లనూ యిది కుల నియమాలకు వ్యతిరేకంగా ఉండటం వల్లనూ యీ విధంగా నిర్దేశించడం జరిగింది." (10-68)

"శరీరాన్ని శుద్ధిపరచుకోడానికి స్త్రీలు నిర్ణీత సమయాలలో నిర్దేశించిన క్రమంలో అన్ని సంస్కారాలను 35 వేదమంత్రాలు ఉచ్చరించకుండా నిర్వహించవలెను." (2-66)

మనువు యింకా ఇలా అంటున్నాడు:

"గృహ సంబంధమైన నియమాలను సంతృప్తికరంగా అమలుపరచిన ద్విజ స్నాతకుడు, తన ఇంద్రియాలను అదుపులో వుంచుకుంటానని ప్రమాణం చేసి (ఈ కింది నియమాలు పాటిస్తూ) అడివిలో నివసించాలి." (6-1)

జీవితంలో మూడవ భాగాన్ని విజయవంతంగా పూర్తి చేసుకున్న తర్వాత ప్రాపంచిక విషయాలలో అనుబంధాన్ని త్రెంచివేసి నాల్గవ భాగంలో కూడా సన్యాసివలె జీవితాన్ని గడపవచ్చును. (6-33)

న్యాయంలో కూడా మనువు ఈ శ్రేణీయ అసమానతను అనుసరించాడు. పరువు నష్టం విషయంలోనూ (defamation) నిందారోపణ (abuse) దౌర్జన్యం (assault)లకు సంబంధించిన చట్టాలను పరిశీలిద్దాం.

"ఒక బ్రాహ్మణునికి పరువు నష్టం కలిగించిన క్షత్రియుడికి నూరు పణాలు, వైశ్యుడికి నూట యాభై నుండి రెండు వందలు, శూద్రునికి కొరడా దెబ్బలు శిక్షలుగా నిర్ణయించారు." (8-267)

"క్షత్రియుడికి పరువు నష్టం కలిగించిన బ్రాహ్మణునికి ఏభై పణాలు, వైశ్యునికి పరువు నష్టం కలిగించిన బ్రాహ్మణుడికి ఇరవై ఐదు, శూద్రునికి పరువు నష్టం కలిగించిన బ్రాహ్మణునికి పన్నెండు పణాలు జరిమానాగా విధించాలి." (8-268)

"ద్విజులలో సకులాలవారిని నిందించిన వారికి కూడా 12 పణాలు జరిమానా విధించాలి. అనకూడని మాటలలో నిందిస్తే ఈ జరిమానాను రెట్టింపు చేయాలి." (8-269)

"పరస్పర నిందారోపణలు చేసుకున్న బ్రాహ్మణ క్షత్రియులపై రాజు వివేకంతో జరిమానాను విధించాలి. బ్రాహ్మణునికి అత్యంత చిన్న శిక్షను, క్షత్రియునికి మాధ్యమిక శిక్షలలో కాస్త

పెద్ద శిక్ష విధించాలి." (8–276)

"వైశ్యుడు, శూద్రుని విషయంలో వారి కులాలననుసరించి శిక్షను విధించాలి. శూద్రుని నాలుకను కత్తిరించనక్కరలేదు." (8–277)

"తక్కువ కులానికి చెందిన వ్యక్తికి చెందిన ఏ శరీర భాగం అగ్రకులాల వారిని బాధపెడ్తుందో ఆ శరీర భాగాన్ని తీసివేయాలి." ఇదీ మనువు చేసిన ఉపదేశం. (8–279)

"చెయ్యినిగాని కర్రనుగాని ఎత్తినవాని చేయి తీసివేయాలి. కోపంలో పాదంతో తన్నిన వ్యక్తి పాదాన్ని నరికివేయాలి." (8–280)

ప్రతిచోటా యీ శ్రేణీయ అసమానత అన్న సూత్రాన్ని ఉపయోగించారు. మనువు ఈ సూత్రాన్ని ఎక్కడైతే కాలేకపోయాడో, అక్కడ ప్రభావం చూపించే విధంగా అతని వారసులు నిబంధనలను తయారు చేశారు. అంత ఎక్కువగా ఈ సూత్రం సాంఘిక వ్యవస్థలో చొప్పించారు. ఉదాహరణకు మనువు బానిసత్వాన్ని గుర్తించాడు గాని దీనికి సంబంధించిన లావాదేవీలను శ్రేణీయ అవిధేయతా సూత్రాల (graded order of insubordination)ననుసరించి విచారించాలా వద్దా అనే విషయంలో విఫలయ్యాడు.

అంటే శ్రేణీయ అసమానత అనేది బానిసత్వం విషయంలో అమలు కాదనీ, ఒక బ్రాహ్మణుడు శూద్రునికి బానిస కావచ్చని కానీ కాదు. యాజ్ఞవల్క్యుడు ఈ సందేహాన్ని క్రింది మాటలలో నివృత్తి చేశాడు.

వర్ణాలలో బానిసత్వం అవరోహణ క్రమంలో ఉంటుంది. ఆరోహణ క్రమంలో కాదు.(16–183)

విజ్ఞానేశ్వరుడు యాజ్ఞవల్క్య స్మృతిపై వ్యాఖ్యానం చేస్తూ ఈ విషయాన్ని మరింత స్పష్టంగా వివరించాడు.

"వర్ణాలలో బానిసత్వం అనులోమేయన పద్ధతి అంటే అవరోహణ క్రమంలో వుంటుంది. బ్రాహ్మణునికి, క్షత్రియుడు మిగతా రెండు వర్ణాల వారు బానిసగా వుండవచ్చు. క్షత్రియునికి వైశ్యులు, శూద్రులు: వైశ్యునికి శూద్రులు బానిసలుగా ఉండవచ్చును. ఈ విధంగా బానిసత్వం అనేది అవరోహణ క్రమంలో ఆచరణలో ఉంటుంది."

ఈ సమానత్వం అసమానత్వం అనే పరిభాషలలో బ్రాహ్మణుడు చాలా హెచ్చు స్థాయిని

గలిగి ఉన్నాడు. అతను ఎవ్వరికీ బానిస అయ్యే యిబ్బంది లేకపోవడమే కాకుండా ఎవ్వరినైనా తనకు బానిసగా వుంచుకోగలిగిన అవకాశం అతనికి వుంది. మిగతా మూడు కులాల దగ్గర బానిసగా వుండాలని శాస్త్రం నిర్ణయించడం వలన, శూద్రుని తప్ప మరొకరిని తాను బానిసగా ఉంచుకోలేదు కనుక, శూద్రుడు ఈ శ్రేణిలో చాలా తక్కువ స్థాయిని కలిగి ఉన్నాడు. క్షత్రియులకు, వైశ్యులకు కేటాయించిన స్థాయి శ్రేణీయ అసమానతను ప్రవేశపెట్టింది. క్షత్రియుడు బ్రాహ్మణునికంటే తక్కువ స్థాయికి చెందినవాడవటం వలన అతడిని బ్రాహ్మణుని దగ్గర బానిసగా వుంచేందుకు అవకాశం వుంది. కానీ అదే సమయంలో అతను వైశ్యులు, శూద్రులుకంటే అధికుడు కాబట్టి ఆ రెండు వర్గాలవారిని తన దగ్గర బానిసలుగా చేసుకోవచ్చును. ఇదే విధంగా వైశ్యుడు, బ్రాహ్మణులు క్షత్రియుల కంటే తక్కువ కావడం వలన వారి వద్ద బానిసగా ఉండేటట్టుగానే శూద్రుడు కంటే అధికుడు కావడం వల్ల శూద్రుడ్ని తన దగ్గర బానిసగా వుంచుకునే అవకాశం కల్పించడం జరిగింది. కనీసం శూద్రుడికంటే అధికుడు కావడం, శూద్రుడు వైశ్యుడిని బానిసగా చేసుకోలేకపోవడం, వైశ్యుడికి గర్వకారణం.

ఇటువంటి లక్షణాలు కలిగిన శ్రేణీయ అసమానతా సూత్రాన్ని బ్రాహ్మణమతం ప్రజల నరనరాల్లోకి చొప్పించింది. సమాజాన్ని నిర్వీర్యం చేయడానికి యింతకంటే ఏం చేయాలి? దీని ఫలితాలను స్పష్టంగా చూడలేనప్పటికీ, దీని మూలంగానే హిందువులు అశక్తులయ్యారని చెప్పడానికి సందేహించనక్కరలేదు. సామాజిక నిర్మాణాన్ని అధ్యయనం చేస్తున్న విద్యార్థులు కేవలం సమానత్వం, అసమానత్వం అనే విషయాల మధ్య భేదాలను కనుక్కొని సంతృప్తి చెందుతున్నారు. ఈ సమానత్వం, అసమానత్వం అనే భావనలకు అదనంగా "శ్రేణీయ అసమానత్వం" అనే భావనను ఎవరూ గుర్తించలేదు. అయినప్పటికీ అసమానత్వం అనేది-శ్రేణీయ అసమానత్వంలోని సగభాగమంత ప్రమాదకరమైంది కూడా కాదు. తన వినాశనానికి కావలసిన బీజాలను అసమానత్వం తనలోనే కలిగి ఉంది. అసమానత్వం అనేది ఎక్కువ కాలం కొనసాగదు. స్వచ్ఛమైన, సాధారణమైన అసమానత్వంలో రెండు విషయాలు జరుగుతాయి. అది అసంతృప్తికి కారణమై విప్లవానికి బీజం వేస్తుంది. రెండవదేమిటంటే బాధితులందరూ ఉమ్మడి శత్రువును, ఉమ్మడి కష్టాన్నీ ఎదుర్కోవడానికి ఐక్యమయ్యేందుకు దోహదపడ్తుంది. కానీ శ్రేణీయ అసమానత్వం స్వరూపం-అది సృష్టించిన పరిస్థితులు యీ రెండింట్లో ఏది జరగటానికీ అవకాశం కల్పించదు. శ్రేణీయ అసమానత్వ వ్యవస్థ తాను చేస్తున్న అన్యాయానికి వ్యతిరేకంగా అసంతృప్తిని పుట్టకుండా నిరోధిస్తుంది. అందుచేతనే అది విప్లవానికి కేంద్ర బిందువుగా మారదు. రెండోది, ఇందులో బాధితులు శ్రమలోనూ, ఫలితాలను పొందడంలోను కూడా అసమానులు. అంతేకాకుండా తమకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించి ఓడించడానికి అన్ని వర్గాల ఐక్యత కూడా ఇందులో సాధ్యం కాదు. ఉదాహరణకు - బ్రాహ్మణమతంలో వివాహ చట్టం పూర్తిగా అన్యాయమైనదిగా వుంది. తక్కువ కులాల నుంచి ఒక స్త్రీని, బ్రాహ్మణునికి వివాహం చేసుకునేందుకు వీలు కల్పించి, బ్రాహ్మణ స్త్రీలను ఈ విధమైన మార్పిడికి అంగీకరించకపోవడం అన్యాయం. కానీ, యీ పరిస్థితి నాశనం చెయ్యడానికి క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు చేయిచేయి కలపరు. బ్రాహ్మణునికి లభించిన హక్కులను క్షత్రియుడు నిరసిస్తాడు. అంతేకానీ,

వైశ్యులు, శూద్రులతో చేతులు కలపడు. దీనికిరెండు కారణాలు వున్నాయి. ఎందుకంటే బ్రాహ్మ ణునికి మూడు కులాల స్త్రీలను వివాహం చేసుకునే హక్కు వుంటే, క్షత్రియునికి మిగతా రెండు కులాల వారి స్త్రీలను వివాహం చేసుకోవచ్చును. మిగతా రెండు కులాలు పడినంత బాధ క్షత్రియుడికి వుండదు. రెండవ కారణమేమిటంటే, ఒకవేళ వివాహ వ్యవస్థలో ఉన్న యీ అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడితే తనక్కూడ బ్రాహ్మణులకు వుండే స్థాయి లభిస్తుందని క్షత్రియునికి తెలుసు. అయితే అన్నికులాల వారికీ సమాన అవకాశాలు లభించటం వలన వైశ్య, శూద్ర కులాల వారు తన కులానికి చెందిన స్త్రీలను వివాహం చేసుకోవడం ద్వారా తనతో సమాన స్థాయికి వస్తే తన స్థాయి పడిపోతుంది. వ్యవస్థల్లోని ఇతర అన్యాయాలను, తిరు గుబాటు అవకాశాలను పరిశీలించండి. పైన చూపినటువంటి మనస్తత్వమే తిరుగుబాటులను అసాధ్యం చేస్తుంది.

బ్రాహ్మణమతానికి, దానిలోని అన్యాయాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు రాకపోవడానికి ఈ 'శ్రేణీయ అసమానత్వం' అనే సూత్రం ఒక కారణం. లూటీ వ్యవస్థకు సమర్ధనను కూడగ ట్టుకోవాలంటే, లూటీ చేసిన దాంట్లో కొంత భాగాన్ని పంచితే సరిపోతుంది. తాము చేస్తున్న అన్యాయానికి శాశ్వత ప్రాతిపదిక కల్పించి, లాభం పొందడానికి మోసంతో మనిషి సృష్టించిన వ్యవస్థ ఇది. ఇవి తాము చేస్తున్న అన్యాయమైన మార్గాలను సమర్ధించడానికి ఆ అన్యాయంలో కొంత భాగాన్ని పొందడానికి యితరులను ఆహ్వానించడం తప్ప యింకేమి కాదు.

ఇప్పుడు బ్రాహ్మణమతం నాటకంలో ఆఖరి అంకానికి తెరతీయడం మిగిలింది. వైదిక కాలం నుంచి చాతుర్వర్ణ్య వ్యవస్థను బ్రాహ్మణమతం వారసత్వంగా పొందింది. తమ పూర్వీ కులైన ఆర్యులు సృష్టించిన ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థ అద్వితీయమైనదని హిందువులంటారు. అద్వితీయం ఏమీ లేదు. ప్రాచీన ప్రపంచమంతా ఆ తప్పటడుగు వేసింది. ఈజిప్టు, పర్షియా దేశాలలో కూడా యిటువంటి వ్యవస్థ ఉండేది. ఈ వ్యవస్థ మహత్యంపై ప్లేటోకి ఎంతగా గురి కుదిరిందంటే, అన్ని సామాజిక వ్యవస్థలలో యిదే శ్రేష్టమైనదని పేర్కొన్నాడు. చాతుర్వర్ణ్యం అనే భావనే లోపభూయిష్టమైంది. కొంతమంది వ్యక్తులను స్పష్టంగా విభజించగలిగే వర్ణాలుగా కూర్చడం మనిషినీ అతని శక్తినీ తక్కువగా అంచనా వెయ్యడమే! ఇతరులతో పోల్చదగని లక్షణాలు ప్రతి వ్యక్తికీ వుంటాయనీ, ప్రతి వ్యక్తికీ విశిష్టతలుంటాయనీ, ప్రాచీన ఆర్యులు, ప్లేటో తెలుసుకోలేకపోయారు. మనిషిలోని ఉన్న అనంతమైన భిన్న ప్రవృత్తులను, ప్రవృత్తుల మేలుకలయికనీ వీరు గుర్తించలేకపోయారు. మనిషిలో కొన్ని వర్గీకరించదగిన సమర్ధతలు, శక్తులు వుంటాయని సామాజిక వ్యవస్థ నిర్మాణానికి వీరిని వర్గాలుగా విభజించవలసి వుంటుందని వారి అభిప్రాయం. సోదాహరణంగా వీటిని తప్పు అని నిరూపించవచ్చును. వ్యక్తులను కొన్ని స్పష్టంగా విభజించగల వర్గాలుగా చెయ్యడం వ్యక్తికీ, సమాజానికీ అన్యాయం చెయ్యడమేనని ఆధునిక విజ్ఞానశాస్త్రం రుజువు చేస్తోంది. సమాజాన్ని వర్ణాలుగా, వృత్తులుగా విభజించటం సమాజాభివృద్ధికై మనిషిలోని అంతర్గత శక్తులను, గుణాలను సంపూర్తిగా వినియోగించడానికి వ్యతిరేకంగా ఉంటుంది. వ్యక్తి, సమాజం, భద్రతకు, రక్షణకు కూడా అడ్డంకిగా ఉంటుంది.[36]

ప్రాచీన హిందువులు, ప్లేటో యింకో తప్పను కూడా చేశారు. క్రిమి కీటకాదుల్లాగ మనుషులలో కూడా వైవిధ్యం ఉంటుందనడంలో కొంత నిజం లేకపోలేదు. అయితే క్రిమికీటకాలలో యీ తేడా శారీరకంగా, మానసికంగా వుంటే మనుషులలో మాత్రం కేవలం మానసికమైంది. కానీ యీ విషయాన్ని అడ్డంగా పెట్టుకుని, కొంతమంది మనుషులు కొన్ని పనులను చేయడానికే పుట్టారని కొందరు ఆజ్ఞలు జారీచేసే యజమానులుగా, మరికొందరు ఆజ్ఞలను పాటించే విధేయులుగా, బానిసలుగా జన్మించారనడం చాలా తప్పు. ప్రతి వ్యక్తిలోనూ అన్ని గుణాలూ వుంటాయనేది వాస్తవం. అయితే, కొందరిలో ఒక్కొక్క గుణం ప్రస్ఫుటంగా కనిపించి, అదే ఏకైక గుణంగా భాసిస్తుందనుకుంటే, ఆ వాస్తవం విలువ తగ్గిపోదు. ఒక మనిషిలో ఒక సమయంలో ఒక ప్రవృత్తి పైచేయిగా వుండగా మరొక సమయంలో దానికి భిన్నమైన, ఒక్కోసారి పూర్తి వ్యతిరేకమైన ప్రవృత్తి పైచేయి కావచ్చు. 'మనుషులు' – 'బానిసల' నీషే తప్పుడు వాదనపై ప్రొఫెసర్ బెర్గ్‌సన్ ఇలా అన్నారు.[37]

"ఇటువంటి పొరపాటు భావన విప్లవాలు జరిగేటప్పుడు ఏ విధంగా తప్పు అవుతుందో మనకు తెలుసు, అప్పటివరకు విధేయులుగానూ, వినయంగానూ వున్న పౌరులు ఏదో ఒకరోజు ప్రజలకు నాయకుల వలె ఉద్యుక్తులవుతారు."

ప్లేటో, ఆర్యుల సిద్ధాంతాలు తప్పని ముస్సోలిని, హిట్లర్ ఉదాహరణలు ద్వారా నిరూపిస్తాయి.

ఇదివరకే వివరించిన విధంగా వైదిక చాతుర్వర్ణ్య వ్యవస్థ ఒక ఆదర్శ వ్యవస్థగా వుండకపోగా, బ్రాహ్మణమతం చేసిన మార్పుల వలన అధ్వాన్నమైంది. అది చేసిన ప్రతి మార్పు నిస్సందేహంగా కుత్సితమైంది. వైదికమతంలో బ్రాహ్మణులను, బౌద్ధమతంలో భిక్షువులను ఒకే ప్రయోజనాన్ని నెరవేర్చడానికి సృష్టించారు. సమాజానికి నాయకత్వం వహించడం, పథ నిర్దేశం చేయడం వారి కర్తవ్యంగా నిర్ణయించారు. ఒకే కర్తవ్యాన్ని నిర్వహించవలసినా బౌద్ధ భిక్షువు స్థానం ఉన్నతంగా లిఖించడం జరిగింది. ఎందుకంటే తనకు ముందుగానీ, తర్వాతగానీ ఎవరూ గుర్తించని విషయాన్ని బుద్ధుడు గుర్తించాడు. సమాజానికి నిజమైన నాయకత్వం అందించడానికే విశ్వసనీయ మార్గదర్శిగా వుండడానికీ ఆ వ్యక్తి బౌద్ధికంగా స్వతంత్రుడై వుండాలి, అంతేకాదు, అతను బౌద్ధికంగా వుండేందుకు గాను మరీ ముఖ్యంగా వ్యక్తిగత ఆస్తి లేని వాడై వుండాలి. వ్యక్తిగత సంపదపై దృష్టిని కేంద్రీకరించిన శిష్టుడు సమాజాన్ని సరైన మార్గంవైపు మళ్ళించడానికి నాయకత్వం వహించే బాధ్యతను సక్రమంగా నిర్వర్తించలేడు. అందువల్లనే బుద్ధుడు క్రమశిక్షణా నిబంధనలు రూపొందించినపుడు, భిక్షువులు వ్యక్తిగతమైన సంపదను కలిగి వుండటాన్ని నిషేధించాడు. వైదిక మతంలోని బ్రాహ్మణులకు అటువంటి నిబంధన ఏమీ లేదు. వ్యక్తిగతమైన సంపదను కలిగి వుండటానికి బ్రాహ్మణునకు సంపూర్ణ స్వేచ్ఛ ఉంది. ఈ భేదమే బౌద్ధ భిక్షువుల బ్రాహ్మణుల స్వభావంలో ద్యక్షథంలో నిలుస్తుంది. ఒక మేధావి వర్గంగా భిక్షువులు రూపొందారు. బ్రాహ్మణులు కేవలం విద్యావంతుల వర్గంగా మాత్రమే రూపొందారు. మేధావి వర్గానికీ,

విద్యావంతుల వర్గానికి చాలా భేదం వుంది. ఒక ప్రత్యేకమైన వర్గానికి గానీ, ప్రయోజనానికి గాని అనుబంధంగా ఉండడం వల్ల ఉత్పన్నమయ్యే పరిమితులు మేధను పెంపొందించుకున్నప్పటికీ మేధావి వర్గానికి ఉండవు. విద్యావంతుల వర్గం మేధావి వర్గంతో సమానం కాలేదు. ఎందుకంటే తాను అనుబంధంగా ఉన్న వర్గ ప్రయోజనంతో విద్యావంతుల వర్గం మమేకం అవుతుంది. దానివల్ల ఆ వర్గం దృక్ పరిధి, నూతన భావజాలంపై సానుభూతి పరిమితమైపోతాయి.

కాబట్టి ఆది నుంచి బ్రాహ్మణులు పూర్తి విద్యావంతుల వర్గంగా, స్వార్థపరులైన విజ్ఞాను లుగా రూపొందడానికి మొగ్గుచూపారు. ప్రాచీన వైదిక వ్యవస్థలో చేసిన మార్పుల వల్ల వైదిక బ్రాహ్మణ వ్యవస్థలో ఈ దుర్మార్గం మరింత తీవ్రం అయింది. పరిపాలించడానికి ప్రత్యేకమైన అధికారాలు, మినహాయింపులు పొందడానికి గల హక్కులు మరింత స్వార్థపరులుగా మారి విద్యను సమాజ ఉన్నతికి కాకుండా సమాజ అవసరాలను దెబ్బతీసే విధంగా వారి వర్గం అభివృద్ధికి ఉపయోగించాలన్న కోరికను బ్రాహ్మణులలో పెంచాయి.

వారి విజ్ఞానాన్ని శక్తులను ప్రజావిహితానికి వ్యతిరేకంగా వారి ప్రత్యేక సదుపాయాలను కాపాడుకునేందుకు మాత్రమే వాడుకున్నారు. భారత నాగరికత ప్రపంచంలోకెల్లా పురాతనమైన దని చాలామంది హిందూ రచయితలు గొప్పలు చెప్పుకుంటారు. అన్ని విజ్ఞాన శాఖలకూ వారి పూర్వీకులే ఆద్యులని వారు వాదిస్తారు. ప్రొఫెసర్ వినయ్‌కుమార్ సర్కార్ రచించిన "The Positive Background of Hindu Sociology" అనే పుస్తకాన్ని గానీ, డాక్టర్ బ్రజేంద్రనాథ్ సీల్ రచించిన "The Positive Science of the Anicient Hindus" అనే పుస్తకాన్ని గాని తెరచి చూడండి. వివిధ శాస్త్రాలపై వారి పూర్వీకులకు గల జ్ఞానాన్ని గురించి వారు పొందుపరచిన సమాచారం మిమ్మల్ని ముంచెత్తుతుంది. ఈ పుస్తకాల ద్వారా తెలిసేదేమిటంటే, ప్రాచీన భారతీ యులకు ఖగోళ, జ్యోతిష్య, జీవ, రసాయన, గణిత, వైద్య, ఖనిజ, భౌతిక శాస్త్రాలలో ప్రవేశం వుందని. వారికి విమానయానంలో కూడా ప్రవేశం ఉండేదని సామాన్య ప్రజలు అభిప్రాయం. ఇవన్నీ యదార్థాలు అయి వుండవచ్చు కూడా! అయితే యీ వాస్తవిక శాస్త్రాల(Positive Science)ను గురించి ప్రాచీన భారతీయులు ఏ విధంగా తెలుసుకోగలిగారన్నదే ప్రధానమైన ప్రశ్న. తాము ఆద్యులైన యీ శాస్త్ర రంగాలలో పురోగతిని సాధించడంలో వారు ఎందుకు విఫలమయ్యారు? శాస్త్ర రంగంలో పురోగతి హఠాత్తుగా నిలిచిపోవడం ఎంత గర్హనీయమో అంతగా ఆశ్చర్యకరం కూడా. శాస్త్ర రంగంలో భారతదేశం పురాతన దేశాలన్నింటిలో ప్రథమ స్థానం సంపాదించినప్పటికీ నాగరిక జాతులలో చివరిస్థానాన్ని పొంది వుంది. శాస్త్ర అభివృద్ధిని ప్రారంభించిన ప్రజలు మార్గమధ్యంలోనే అసంపూర్ణ స్థితిలో ఎలా వుండిపోవలసి వచ్చింది? ప్రాచీన భారతీయులకు ఏమి తెలుసు అన్నది కాదు ప్రశ్న, వారు ఎందుకు పై విధమైన స్థితికి చేరుకున్నారన్న ప్రశ్నను గమనించి, సమాధానం చెప్పవలసిన అవసరం వుంది.

ఈ ప్రశ్నకు ఒకే ఒక సమాధానం వున్నది, అది కూడా చాలా తేలిక సమాధానం. ప్రాచీన భారతదేశంలో బ్రాహ్మణ వర్గం ఒక్కటే విద్యావంతమైన వర్గం. మిగతా అన్ని వర్గాలకంటే

తామే అధికులమన్న వర్గం కూడా అదే. బుద్ధుడు వారి వాదనను, ఆధిపత్యాన్ని తిరస్కరించి బ్రాహ్మణులపై యుద్ధాన్ని ప్రకటించాడు. మేధావి వర్గం కంటె భిన్నమైన విద్యావంతుల వర్గం ఆ పరిస్థితులలో ఎలా వ్యవహరిస్తుందో బ్రాహ్మణులు అలాగే వ్యవహరించారు. శాస్త్ర సంబంధమైన జిజ్ఞాసను ప్రక్కకు నెట్టి, తన ఆధిపత్యాన్ని, సామాజిక, ఆర్థిక రాజకీయ ప్రయోజనాలను కాపాడుకోవడంలో బ్రాహ్మణవర్గం పూర్తిగా నిమగ్నమైపోయింది. వారు విజ్ఞాన, శాస్త్ర గ్రంథాలను రచించడం మానివేసి, స్మృతుల రచనను చేపట్టారు. భారతదేశంలో శాస్త్ర పురోగతి ఎందుకు నిలిచిపోయిందో ఇక్కడ వివరణ వుంది. సామాజిక సమానత్వం అనే బౌద్ధ సిద్ధాంతాన్ని తిప్పికొట్టడమే అధిక ప్రధానమైనదిగానూ, అధికతర విధిగానూ బ్రాహ్మణులు భావించారు.

బ్రాహ్మణులు రచించిన స్మృతులెన్ని?

స్మృతి సాహిత్యంలో క్షుణ్ణమైన జ్ఞానాన్ని కలిగిన కేన్ వాటి సంఖ్యను 128గా నిర్ణయించాడు. అవన్నీ ఎందుకు? స్మృతులను న్యాయ గ్రంథాలని పిలుస్తారు. ఆ పేరు వాటి అసలు స్వభావాన్ని కప్పివేస్తుందనుకోండి. అవి నిజానికి బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని, ప్రత్యేక సదుపాయాలను కాపాడే గ్రంథాలు. శాస్త్ర పురోగతి కంటే, బ్రాహ్మణమత రక్షణే వాటి ప్రధాన లక్ష్యం. కేవలం తన సదుపాయాలను రక్షించుకోవడమే కాకుండా, వాటిని సభ్యతగల మనిషి సిగ్గుపడే విధంగా విస్తరించడం జరిగింది. మనువు తమకు యిచ్చిన విశేష హక్కుల అర్థాన్ని వారు క్రమంగా విశాలం చేస్తూ వచ్చారు.

మనువు బ్రాహ్మణులకు దానం పొందే హక్కును యిచ్చాడు. ఈ దానం ధనరూపంలో గాని, వస్తు రూపంలో గాని వుండవచ్చును. కాలక్రమేణా స్త్రీ దానం కూడా దానంలో భాగంగా దానం పొందిన స్త్రీని బ్రాహ్మణుడు ఉంపుడుగత్తెగా ఉంచుకోవచ్చు లేదా పరిహారంగా ధనం తీసుకుని ఆమెను విముక్తం చేయవచ్చు.38

మనువు బ్రాహ్మణులను భూమికి ప్రభువులుగా భూదేవులుగా గుర్తించాడు. ఈ ప్రకటనా పరిధిని విస్తరించి, యితర వర్గాల స్త్రీలతో శృంగార సంపర్కాన్ని కలిగి వుండే హక్కును కోరసాగారు. వీరి దృష్టి నుంచి రాణులు కూడా తప్పించుకొనే అవకాశం లేదు. క్రీ.శ. 1502లో భారతదేశాన్ని సందర్శించిన లుడొవికొ డి వార్తెమా అనే విదేశీ యాత్రికుడు కాలికట్‌లోని బ్రాహ్మణుల గురించి ఈ విధంగా రాస్తున్నాడు:

"ఈ బ్రాహ్మణులు ఎవరో, తెలుసుకోవడం మంచిదీ, ఆనందకరమైనదీ. మనలో వుండే పూజారుల వలె, వీరు యిక్కడి మత విశ్వాసానికి ముఖ్యమైన వ్యక్తులని మీరు తెలుసుకోవాలి. రాజు వివాహం చేసుకున్నపుడు అతని దగ్గరున్న బ్రాహ్మణులందరిలో గొప్పవాడినీ ఎక్కువ గౌరవం పొందేవాడినీ ఎంచి తన భార్యతో మొదటి రాత్రిని జరిపించి, ఆమెను కన్యత్వం నుంచి విడిపిస్తాడు."39

ఇదేవిధంగా హామిల్టన్[40] అనే యింకో రచయిత ఏమంటున్నాడంటే:

"సమోరిన్ వివాహం చేసుకుంటే, ముందుగా నంబోరి (నంబూదరి బ్రాహ్మణుడు) అతని భార్యను అనుభవించిన తర్వాత, యిష్టపడితే మూడు రాత్రులు ఆమెతో సహవాసం చేసిన పిదపే తన భార్యతో కలిసి జీవించవచ్చును. ఎందుకంటే తన వివాహ ప్రథమ ఫలాలు ఆమె పూజించే దేవునికి పవిత్ర నైవేద్యాలు."

బొంబాయి ప్రెసిడెన్సీలోని వైష్ణవ పూజారులు తమ తెగకు చెందిన స్త్రీలకు కన్నెరికం చేసే హక్కు తమకు వుందని అంటారు. 1869లో కరోసోండాప్ ముల్జి అనే వ్యక్తిపై ఆ తెగకు చెందిన ప్రధాన పూజారి నడిపిన సుప్రసిద్ధ మహారాజా నిందారోపణ వ్యాజ్యంను పరిశీలిస్తే ఆ సంవత్సరం వరకూ కూడా మొదటిరాత్రికై తమ హక్కును గురించి వారు అడిగే వారని తెలుస్తుంది.

మొదటిరాత్రి శృంగార సహవాసం పొందే హక్కును తక్కువ వర్గాల వారిపై కూడా అమలుబరిచే అవకాశం వస్తే అందుకు వారు వెనుకాడలేదు. మలబారు ప్రాంతంలో అలాచేశారు. బ్రాహ్మణులను భూసురులుగా పరిగణించేవారు. ఈ ప్రకటన పరిధిని విస్తరించి, మిగతా వర్ణాల స్త్రీలతో సంకర శృంగార సంపర్కం పొందే హక్కును గలిగి వున్నామని వాదించారు. మలబారులో సరిగ్గా యిదే జరిగింది. అక్కడ[41] "బ్రాహ్మణ కులాల వారు మకత్వమ్ అనే విధానాన్ని అనుసరించే వారు. దీని ప్రకారం బిడ్డ తండ్రికి చెందిన కుటుంబానికి చెందుతాడు. న్యాయపరమైన, మతపరమైన నిబంధనలకనుగుణంగా వారు తమ కులంలోనే వివాహాలను కుదుర్చుకొనే వారు. అయితే బ్రాహ్మణులు తక్కువ కులాలకు చెందిన స్త్రీలతో "సంబంధాలు" (Sanbandhan Unions) పెట్టుకోవడం కూడా అలవాటు."

అంతేకాదు. రచయిత యింకా ఏం చెప్తున్నాడో చూడండి:

"ఈ 'సంబంధం'లోని ఉభయులూ అవతలి వారి కుటుంబంలో సభ్యులు కాలేరు; వారి సంబంధ ఫలితంగా కలిగే సంతానం తల్లుల ధార్వాదే (కుటుంబం)కే చెందుతుంది. తండ్రి ఆస్తిలో వాటా కోసం కానీ, పోషణ భృతి కోసం కానీ అడిగే హక్కు చట్టప్రకారం సంతానానికి వుండదు."

ఈ ఆచారం మూలం గురించి ఆ రచయిత చెబుతూ, ఆ రకం వ్యవస్థ మూలాల గురించి కూడా పరిశీలన చేశాడు.

"తక్కువ కులాల స్త్రీత్వం ప్రథమ ఫలాలను భూసురులు (అంటే బ్రాహ్మణులు),

కొంతవరకు క్షత్రియులు లేదా పాలకవర్గాలు భుక్తం చేసుకోవడానికి, పాలేర్ల నవవధువులతో ప్రథమ సమాగమం కోరే భూస్వాముల మధ్యయుగాల హక్కు (droit de Seigneurie)తో పోలిక కనిపిస్తుంది."

ఐరోపాలో మధ్య యుగాలలోని "మొదటి రాత్రి హక్కు"తో పోల్చడం ఈ ప్రథమ ఫలాల హక్కును తక్కువ చేసి చెప్పడమే అవుతుంది. దానికంటే ఇది ఎక్కువది. వివాహ సంబంధమైన బరువు బాధ్యతలేవీ లేకుండా బ్రాహ్మణుడు కేవలం తన కామతృష్ణను తీర్చుకోవడానికి, కేవలం వ్యభిచారం చేయడానికి నిమ్న కులానికి చెందిన ఏ స్త్రీపైనైనా చెలాయించగల హక్కు ఇది.

ఇవీ జన సామాన్యానికి వ్యతిరేకంగా ఆధ్యాత్మిక ఉపదేశాలు ఇచ్చే బ్రాహ్మణులు కోరిన హక్కులు. పీటర్ సింహాసనాన్ని అధిరోహించిన బోర్జిస్ పోపులు ఎక్కువగా వ్యభిచరించిన ఆధ్యాత్మిక ఉపదేశకులుగా చరిత్రలో స్థానం పొందారు. అయితేవారు భారతదేశంలోని బ్రాహ్మణులు చేసిన దానికంటే నిజంగా ఎక్కువ చేసారా అని సందేహం కలుగుతుంది. బుద్ధుడు చెప్పిన మేధావి వర్గం, అంటే ఏ వర్గ ప్రయోజనాన్నీ దృష్టిలో పెట్టుకోకుండా సార్వజనీన శ్రేయస్సును పరిగణించే స్వచ్ఛమైన మేధావి వర్గం ఎక్కడా వుండదు. శిష్టుల మేధోస్వేచ్ఛపై ఆస్తి విధించే పరిమితులను ఇటీవలి వరకూ ఎవరూ గుర్తించలేదు. అయితే, ఇతర దేశాలలో సమాజంలోని ప్రతి శ్రేణిలోనూ విద్యావంతులైన వర్గం ఉండడం వల్ల ఆయా దేశాలలో మేధావివర్గం లేని కొరత తను పూరించుకోగలిగారు. ఖచ్చితమైన మార్గదర్శకత్వం లేకున్నా సమాజంలోని భిన్న శ్రేణులకు చెందిన విద్యావంతుల భిన్న వర్గాలు వ్యక్తం చేసే అభిప్రాయ బాహుళ్యంలో భద్రత వున్నది. సమాజంలోని ఒకేఒక వర్గం నుంచి వచ్చిన ఒకేఒక విద్యావంతుల వర్గం అభిప్రాయాలతో సమాజం తప్పుదోవ పట్టే ప్రమాదం ఉన్నది. ఎందుకంటే ఆ వర్గం సహజంగానే దేశ ప్రయోజనాలకన్నా తన వర్గ ప్రయోజనాలనే మిన్నగా భావిస్తుంది. బ్రాహ్మణ మతం చేసిన మార్పుల వలన సురక్షితమైన ఖాయమైన నిర్దేశకత్వం చేపట్టే ఒక మేధావి వర్గం ఉండే అవకాశాన్ని భారతదేశం కోల్పోయింది. ఇంకా దౌర్భాగ్యం ఏమిటంటే, సమాజంలోని భిన్న శ్రేణుల నుంచి సమకూరే విద్యావంతుల వివిధ వర్గాలు వ్యక్తం చేసే అభిప్రాయ బాహుళ్యం వల్ల సమకూరే రక్షణను, భద్రతను హిందువులు కోల్పోయారు.

శూద్రులకు విద్యను నేర్చుకునే అవకాశాన్ని తిరస్కరించి, క్షత్రియులను సైనికపరమైన బాధ్యతలు కల్పించి, వైశ్యులకు వ్యాపారాన్ని అందించి తమకు మాత్రమే విద్యను పరిమితం చేసుకుని – బ్రాహ్మణులు తామొక్కరే మొత్తం సమాజాన్ని తప్పుదోవ పట్టించగల, తప్పుడు పథ నిర్దేశం చేయగల విద్యావంతులుగా ఏర్పడ్డారు. వర్ణాన్ని కులంగా మార్చి మనిషి విలువను గుర్తించడానికి ఆతని పుట్టుకే ఆధారమని ప్రకటించారు. కులం, శ్రేణీయ అసమానత అనైక్యతను, విభేదాలను సహజసిద్ధం చేశాయి.

వర్ణ వ్యవస్థ మూల లక్షణాల రూపురేఖలను సామాజిక అలవాట్లకు సంబంధించినంత

మేరకు మార్పితే సహించదగ్గదిగా వుండేది. కానీ బ్రాహ్మణమతం అక్కడితో తృప్తి చెందలేదు. తాను మార్చిన, వికృతం చేసిన చాతుర్వర్ణ్య వ్యవస్థకు అది న్యాయబలాన్ని ఇవ్వాలనుకున్నది. బ్రాహ్మణమత సృష్టి అయిన ఈ నవీన చాతుర్వర్ణ్యం వ్యక్తుల చట్టంగా, కుటుంబ చట్టంగా మనుస్మృతిలో స్థానం పొందింది. దాని విషయంలో ఎవరూ తప్పు చేయరాదు. అగ్రకుల హోదాను తనకు సంక్రమింపజేసుకోవడం గానీ, అగ్ర కులస్తునిగా వ్యవహరించడం గానీ నిమ్నకులస్తుడు చేస్తే దాన్ని మనువు నేరంగా పరిగణించాడు.

"తక్కువ కులానికి చెందిన వ్యక్తి, ప్రలోభంతో అగ్రవర్ణాల వారికి కేటాయించిన వృత్తిని చేపట్టి జీవనం కొనసాగిస్తే రాజు అతని ఆస్తులను అతనికి కాకుండా చేసి బహిష్కరించాలి." (10–96)

"ఉన్నత జన్మను పొందినట్టు తప్పుగా చెప్పుకున్నా, ఒక నేరం గురించి రాజుకు సమాచారాన్ని అందించినా, గురువుపై ఆరోపణలు చేసినా అవి బ్రాహ్మణ వధతో సమానమైన అపరాధాలు." (11–56)

ఇక్కడ రెండు రకాలైన అపరాధాలు వున్నాయి. మొదటిది ఒకరు మరొకరుగా వ్యవహరించే సాధారణ అపరాధం. (10–96) రెండవది శూద్రుడు చేసే అదే రకం అపరాధం. (11–56) వాటికి శిక్షలు ఎంత తీవ్రంగా ఉన్నాయో చూడండి. మొదటి అపరాధానికి ఆస్తిని జప్తు చెయ్యటం, బహిష్కారం శిక్షలుగా వుంటాయి. రెండవ అపరాధానికి, బ్రాహ్మణ వధకు విధించే శిక్షకు సమానమైన శిక్షను విధిస్తారు.

ఒకరు మరొకరుగా వ్యవహరించే అపరాధం ఆధునిక న్యాయ వ్యవస్థకు తెలియందేమి కాదు. దానిని భారతీయ శిక్షాస్మృతి సెక్షన్ 419 ద్వారా గుర్తించింది. కానీ, ఈ అపరాధానికి భారతీయ శిక్షాస్మృతి విధించిన శిక్ష ఏమిటి? జరిమానా లేక మూడు సంవత్సరాల ఖైదు లేదా రెండింటినీ విధించవచ్చును. తన చట్టాన్ని బ్రిటిష్‌వారు అంత తేలికగా తీసుకున్నందుకు మనువు ఆత్మ ఎంతగా క్షోభిస్తుందో!

తన చట్టాన్ని అమలుపరిచేందుకు రాజుకు కొన్ని మార్గదర్శక నియమాలను మనువు విధించాడు. మొదట రాజు నెరవేర్చవలసిన పవిత్ర బాధ్యతను గురించి నివేదిస్తున్నాడు.

"కులసంకరాన్ని నివారిస్తే రాజు శక్తులు పెరగడమే కాకుండా అతనికి ఇహపర లోకాలలో సౌఖ్యం లభిస్తుంది." (8–172)

అయితే కుల సంకర చట్టాలను రాజు అంతరాత్మకు పూర్తిగా ఆమోదయోగ్యం కాకపోతే

వాటిని అమలు జరుపకుండా ఉపేక్షించే అవకాశం వుంది. అందుకే యీ చట్టాలను అమలు జరిపేందుకై రాజు ఏం చేయాలో మనువు చెబుతాడు.

"తన యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా రాజు యముని లాగా ప్రవర్తించాలి." (8–177)

అంటే, మరణించిన వారిని విచారించే యముని లాగా రాజు నిష్పక్షపాతంగా వ్యవహరించాలి.

అయితే మనువు యీ విషయాన్ని రాజు పవిత్ర బాధ్యతగానే వదలివేయలేదు. దానిని రాజు విధిగా కూడా పేర్కొన్నాడు.

"వైశ్యుడ్ని వర్తకం చేయాలని, ధనాన్ని ఋణంగా యిచ్చేటట్టు చేయాలని, వ్యవసాయం చేయాలని లేదా పశు సంపదను యివ్వాలని; శూద్రుడ్ని ద్విజులకు సేవ చేయాలని రాజు ఆదేశాలు యివ్వాలి." (8–410)

అలా నిర్ణయించి మనువు అసలు విషయానికి వచ్చాడు.

"శూద్రుడు, వైశ్యులు వారికి కేటాయించిన విధులను నిర్వహించేటట్టు రాజు జాగ్రత్త వహించాలి. ఎందుకంటే, ఒకవేళ విధులను విస్మరిస్తే వారు యీ ప్రపంచాన్ని అరాచక స్థితిలోకి నెట్టివేస్తారు." (8–418)

అయితే తన విధిని రాజు పాటించకపోతే ఏం జరుగుతుంది? మనువు దృష్టిలో యీ చాతుర్వర్ణ్య వ్యవస్థ ఎంత గొప్పదంటే, కర్తవ్యాన్ని నిర్వహించని రాజు వలన తన చట్టాలకు అవరోధాలు కల్గటం మనువుకు యిష్టం లేదు. అందుకే అటువంటి రాజును పదవీచ్యుతుడ్ని చేయాలని ఒక కొత్త చట్టాన్ని రూపొందించినాడు. దీనిద్వారా బ్రాహ్మణ మతానికి, మనువుకు యీ చాతుర్వర్ణ్య వ్యవస్థ ఎంత ప్రియమైనదో అర్థమౌతుంది.

నేనింతకుముందే చెప్పినట్లుగా వైదిక మతంలోని చాతుర్వర్ణ వ్యవస్థ కులవ్యవస్థ కంటె మెరుగైనదే అయినా, అది ఒక ఆదర్శవంతమైన ఐక్య సమాజం ఏర్పడటానికి పెద్దగా సానుకూలమైనది కాదు. చాతుర్వర్ణ్య సిద్ధాంత నాలుగు వర్ణాలు పుట్టుకకు కారణమైంది. ఈ నాలుగు కులాలు పఖ్యతకు చాలా దూరంగా ఉండిపోయాయి. తరచు ఘర్షణ పడేవి. వీటి మధ్య జరిగే పోరాటాలు వర్గ పోరాటాలుగా తప్ప మరో రకంగా అభివర్ణించలేనంత తీవ్ర స్థాయిలో వుండేవి. అయితే యీ ప్రాచీన చాతుర్వర్ణ్య వ్యవస్థలో రెండు రక్షక లక్షణాలు వుండేవి. వీటిని

బ్రాహ్మణమతం తొలగించింది. అవి ఏమిటంటే, మొదటిది, వర్ణాల మధ్య ఒంటరితనం వుండేది కాదు. ఐక్యతకు, సహజీవనానికి రెండు బలమైన బంధాలుగా వుంటే వర్ణాంతర వివాహాలు, భోజనాలు, వారిలో సమాజం పునాదులను విచ్ఛిన్నం చేసే సామాజిక వ్యతిరేక భావాలు అభివృద్ధి చెందే అవకాశం ఏ కోశానా వుండేది కాదు. క్షత్రియులు బ్రాహ్మణులతోను; బ్రాహ్మణులు క్షత్రియులతోను పోరాటాలు చేసినా బ్రాహ్మణులకు సహాయపడేందుకు క్షత్రియులకు వ్యతిరేకంగా పోరాడిన క్షత్రియులు,[42] క్షత్రియులకు సహాయపడేందుకు బ్రాహ్మణులకు వ్యతిరేకంగా పనిచేసిన బ్రాహ్మణులు[43] వున్నారు.

ఇక రెండవది ఏమిటంటే యీ చతుర్వర్ణ వ్యవస్థ కేవలం పరంపరాగతంగా మాత్రమే వుండేది. అది సమాజానికి చెందిన ఒక ఆదర్శ భావన మాత్రమే. అంతేకాని అది రాజచట్టం కాదు. బ్రాహ్మణ మతం వివిధ వర్ణాల మధ్య ఒంటరితనాన్ని పెంచి, వాటి మధ్య శతృత్వానికి బీజాలను వేసింది. పరంపరాగతమైన చట్టంగా దాన్ని చేసింది. చట్టబద్ధతను కల్పించడం ద్వారా ఈ అన్యాయాన్ని శాశ్వతం చేసింది. వైదిక చాతుర్వర్ణ్య వ్యవస్థ దుష్టమైనదే అయితే కాలగమనంలో పరిస్థితుల ప్రాబల్యంలో అది అంతరించి వుండేది. కానీ, చట్టరూపాన్ని కల్పించడం ద్వారా బ్రాహ్మణమతం దానికి శాశ్వతత్వం ప్రసాదించింది. హిందూ సమాజానికి బ్రాహ్మణమతం చేసిన అన్యాయాలలో బహుశా ఇదే ఘోరమైనది.

శ్రేణీయ అసమానతలకు మారుపేరైన చాతుర్వర్ణ్య పరిరక్షణ విధులను బ్రాహ్మణులపై, క్షత్రియులపై రాజు అమలుపరచనవసరం లేదు. రాజు ఈ చట్టాన్ని వైశ్యులు, శూద్రుల విషయంలో మాత్రమే అమలు చేయాలి. ఈ వ్యవస్థకు చట్టరూపం ఇవ్వాలన్న బ్రాహ్మణ మత సంకల్ప తీవ్రత ఫలితం–తక్కువలో చెప్పాలంటే–ఎంతో పేలవంగా వుంది. చట్టబద్ధత ప్రయత్నాలతో నిమిత్తం లేకుండా వ్యవస్థ సగం చట్టబద్ధంగానూ, సగం పరంపరాగతంగానూ మారింది. వైశ్యులకూ, శూద్రులకూ అది చట్టబద్ధం. బ్రాహ్మణ క్షత్రియులకు అది పరంపరాగతం.

ఈ తేడాని పరిశీలించవలసిన అవసరం వుంది. వ్యవస్థకు చట్టబద్ధత కల్పించడంలో బ్రాహ్మణమతం నిజాయితీగా వ్యవహరించిందా? నాలుగు వర్ణాల వారూ ఆ చట్టానికి బద్ధులై వుండాలని అనుకున్నదా? తాను చేసిన చట్టానికి బ్రాహ్మణ క్షత్రియులు కట్టుబడకుండా చేయడంలో బ్రాహ్మణ మతానికి చిత్తశుద్ధి లోపించిందని తెలుస్తోంది. వ్యవస్థను ఆదర్శంగా అది నమ్మి వుంటే దాన్ని సార్వజనీనమైన కట్టుబాటుగా చేసి వుండేది.

ఈ తప్పుడు ఆటలో మరింత కపటం వుంది. చట్టం సంకెళ్ళ నుంచి బ్రాహ్మణులను ఎందుకు స్వేచ్ఛగా వుంచారో అర్థం చేసుకోవచ్చు. మనువు వారిని భూదేవులని అన్నాడు. దేవుళ్ళు చట్టానికి అతీతులు. కానీ, బ్రాహ్మణుల మాదిరిగా క్షత్రియులను కూడా ఎందుకు మినహాయించారు? క్షత్రియులు బ్రాహ్మణుల ముందు తలవంచరని అతనికి తెలుసు. అప్పటికి అతను హెచ్చరికలు మొదలుపెట్టాడు. క్షత్రియులు అహంకరిస్తే, తిరుగుబాటు చేస్తే బ్రాహ్మణులు

వారినెలా శిక్షించవచ్చో చెబుతాడు.

బ్రాహ్మణులపై క్షత్రియులు ఏ రకంగానైనా పెత్తనం చెలాయిస్తే, బ్రాహ్మణులే వారిని తగిన విధంగా నిగ్రహించాలి. ఎందుకంటే క్షత్రియులు బ్రాహ్మణుల నుంచి ఉద్భవించిన వారు కాబట్టి. (9–320)

నీటి నుంచి అగ్ని పుడుతుంది. బ్రాహ్మణుల నుంచి క్షత్రియులు పుడతారు. రాయి నుంచి ఇనుము పుడుతుంది. ఈ మూడింటి తీక్షణశక్తి జన్మ కారకులైన వారిపై ఏ ప్రభావమూ వేయలేదు. (9–321)

రాజు చేయవలసిన కుల వ్యవస్థా చట్టాల పాలన నుంచి క్షత్రియుడిని ఎందుకు మినహాయించడానికి కారణం – రాజు సాయం లేకుండానే క్షత్రియులతో తామే స్వయంగా వ్యవహరించగల సమర్థులమని బ్రాహ్మణులు భావించడమే అనుకోవచ్చు. సమయం అనుకూలించినప్పుడు, పర్యవసానాలు భయం లేకుండా క్షత్రియులపై ఆంక్షలు విధించవచ్చునని బ్రాహ్మణులు భావించి వుంటారు. ఇదంతా మనువు ఉద్దేశించి వుండకపోవచ్చు. ప్రతీకార శపథాలు చేసి, క్షత్రియుల సహకారం గురించీ, బ్రాహ్మణ క్షత్రియుల ఉమ్మడి పొత్తు గురించీ అర్థింపులు ఆరంభిస్తాడు. క్షత్రియులకు హెచ్చరికలు చేసిన శ్లోకం తరువాత శ్లోకంలో మనువు వారినిలా అభ్యర్థిస్తాడు:

"(అవసానం సమీపిస్తున్నదని తెలిసిన రాజు) జరిమానాల రూపంలో సేకరించిన సొమ్మునంతా బ్రాహ్మణులకు ఇచ్చి, రాజ్యాన్ని కుమారుడికి అప్పగించి, రణరంగంలో మరణాన్ని పొందాలి." (9–323)

గద్దింపుల నుంచి అర్థింపులకి దిగడంలో ఏదో విశేషం వుంది. క్షత్రియుల పట్ల మనువు ఇంత ప్రవర్తనలోని అనూహ్యమైన మలుపునకు అర్థం ఏమిటి? ఈ బ్రాహ్మణ క్షత్రియ సహకారం లక్ష్యం ఏమిటి? ఎవరికి వ్యతిరేకంగా ఈ పొత్తు? మనువు వివరించదు. ఈ చిక్కుముడిని విప్పే ముందు, ఈ ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానం చెప్పే ముందు వెయ్యి సంవత్సరాల చరిత్రనంతా చెప్పాలి.

ఈ చిక్కుముడికి పరిష్కారం లభించే చిట్కా బ్రాహ్మణ క్షత్రియుల నడుమ జరిగిన వర్గపోరాటాల చరిత్రలో వుంది.

కారల్ మార్క్స్ ఉద్బోధించిన వర్గపోరాట సిద్ధాంతంపై వైముఖ్యం కలిగిన ఛాందస హిందువులు, మార్క్స్ తన సిద్ధాంతానికి సమర్థన కోసం అన్వేషించిన సాక్ష్యాధారాలు తమ

పూర్వీకుల చరిత్రలోనే ఉన్నాయంటే దిగ్భ్రాంతి చెంది తీరుతారు. బ్రాహ్మణులకు క్షత్రియులకు నడుమ అసంఖ్యాకంగా వర్గపోరాటాలు జరిగయి కానీ, ప్రాచీన హిందూ వాంగ్మయంలో కొన్ని ముఖ్యమైనవి మాత్రమే నమోదయ్యాయి.[44] బ్రాహ్మణులకు, క్షత్రియ రాజులకు మధ్య జరిగిన ఘర్షణల చరిత్ర మన వద్ద వుంది. ఈ ఘర్షణల్లో మొదటిది వేనరాజుతో జరిగినది. రెండవది పురూరవునితో, మూడవది నహుషునితో, నాలుగవది నిమితో, ఏడవది సుముఖునితో. బ్రాహ్మణుడైన వశిష్టునికి, రాజుకాని సాధారణ క్షత్రియుడైన విశ్వామిత్రునికి జరిగిన ఘర్షణల చరిత్ర వుంది. భృగు వంశ బ్రాహ్మణులను ఊచకోత కోసిన కార్తవీర్య క్షత్రియుల గురించి, క్షత్రియులను మొత్తంగా నిర్మూలించిన బ్రాహ్మణ పరశురాముని గురించి వివరాలున్నాయి. వారి మధ్య ఘర్షణలకు కారణమైన సమస్యలు విస్తృతమైనవి. బ్రాహ్మణ క్షత్రియుల మధ్య విరోధి భావనలు ఎంత తీవ్రంగా వుండేవో అవి చెబుతాయి. క్షత్రియుడికి బ్రాహ్మణుడయ్యే హక్కుందా అన్న ప్రశ్నపై ఘర్షణలు జరిగాయి. బ్రాహ్మణులు అధికారానికి లోబడవలసిన వారా కాదా అన్న అంశంపైనా పోరాటాలు జరిగాయి. ఎవరు ఎవరికి అభివాదం చేయాలి, ఎవరు ఎవరికి దారి ఇవ్వాలి అన్న అంశాలపైనా ఘర్షణలు జరిగాయి. ఈ యుద్ధాలు ఆధిపత్యం కోసం, హోదా కోసం, స్థాయి కోసం జరిగిన యుద్ధాలు.[45]

ఈ సంఘర్షణల ఫలితాలు ఎలా వుంటాయో స్పష్టమే. తాము ఎంతగా ప్రగల్భాలు పలికినప్పటికీ క్షత్రియులను అణచివేయడం సాధ్యం కాదనీ, ఎన్ని క్షత్రియ నిర్మూలన యుద్ధాలు చేసినా తగిన సంఖ్యలో వారు మిగిలే వుంటారనీ బ్రాహ్మణులకు అర్థమైంది. పరుశురాముడు ఊచకోత కోసిన పాత క్షత్రియుల వితంతువులకు బ్రాహ్మణుల ద్వారా జన్మించిన వారు కొత్త క్షత్రియులనీ, మనువు కాలంనాడున్నది అసలు క్షత్రియులు కాదనీ బ్రాహ్మణులు చెప్పే, మనువు ప్రస్తావించిన అసహ్యకరమైన కథను పట్టించుకోనక్కరలేదు. స్వార్థ ప్రయోజనాల సాధనకై బ్లాక్‌మెయిల్ చేయడానికి బ్రాహ్మణమతం ఎన్నడూ సంకోచించలేదు. క్షత్రియులపై బ్రాహ్మణ మతం చేసిన పోరాటం మూర్ఖునికీ మొద్దుబలం కలవాడికీ జరిగిన పోరాటమే. చాతుర్వర్ణ్యం కొనసాగించడానికి బ్రాహ్మణులు క్షత్రియులపై పోరాడారు. అదే చాతుర్వర్ణ్యం క్షత్రియులకు ఖడ్గాలను ఇచ్చింది, బ్రాహ్మణులను నిరాయుధులను చేసింది. ఈ సిద్ధాంతం కింద బ్రాహ్మణులు క్షత్రియులతో పోరాడి ఎలా గెలవగలరు? కత్తులను ఇవ్వడం తేలికే కానీ వాటిని ఎదుర్కోవడం కష్టమని టాలీ రాండ్ నెపోలియన్‌కు చెప్పిన నిజాన్ని తెలుసుకోవడానికి బ్రాహ్మణులకు చాలాకాలం పట్టింది. క్షత్రియుల వద్ద ఆయుధాలున్నాయి, బ్రాహ్మణుల వద్ద లేవు, క్షత్రియులతో యుద్ధం అంటే నాశనమైపోవడమే. బ్రాహ్మణ క్షత్రియ యుద్ధాల ప్రత్యక్ష పర్యవసానాలు అవి. బ్రాహ్మణులూ క్షత్రియులూ కలహిస్తూ ఉంటే, వైశ్యులనూ శూద్రులనూ అదుపులో పెట్టే నాథుడు లేడు. వారు దాదాపుగా బ్రాహ్మణ క్షత్రియుల స్థాయికి దగ్గరగా సామాజిక సమానత్వ మార్గంలో ఉన్నారు. క్షత్రియులను అణచివేసే అవకాశం అతి తక్కువ కాగా, వైశ్యులు శూద్రులు మించిపోయే ప్రమాదం వాస్తవంగా, అత్యంత వాస్తవంగా బ్రాహ్మణ మతానికి కనిపించింది. క్షత్రియులతో పోరాడుతూ, వైశ్య శూద్రుల ప్రమాదాన్ని బ్రాహ్మణుడు నిర్లక్ష్యం చేయాలా? లేక, గెలిచే ఆశలేని పోరాటాన్ని విరమించి క్షత్రియునితో మైత్రి చేసుకుని

వైశ్యులనుంచి శూద్రుల నుంచి ముంచుకువస్తున్న ప్రమాదాన్ని అణచివేయడానికి జట్టుకట్టాలా? క్షత్రియులతో యుద్ధంలో అలసిపోయిన బ్రాహ్మణ మతం రెండో మార్గాన్నే ఎంచుకున్నది. వైశ్యులు, శూద్రులు అనే రెండు కింది వర్ణాల వారిని బానిసలు చేసుకొని దోచుకోవడం అనే కొత్త ఆదర్శం కోసం అది తన ప్రస్తుత శత్రువులతో స్నేహం ఆశించింది. శతపథ బ్రాహ్మణం సంకలనం జరుగుతున్న కాలంలోనే ఎప్పుడో ఈ ఆదర్శం రూపుదీసుకుని ఉంటుంది. శతపథ బ్రాహ్మణంలో మనం ఈ ఆదర్శం స్థిరపడిపోవడం చూస్తాం. అక్కడ వాడిన భాష, చేసిన అన్వయం ఎంత ఆకట్టుకునేలా ఉన్నాయంటే దాన్నిక్కడ యదాతథంగా ఉల్లేఖించలేకుండా ఉండలేకపోతున్నాను. శతపథ [46] బ్రాహ్మణ రచయిత ఇలా చెప్పాడుః

"వాళ్ళపుడు యజ్ఞ పశువును (ఆహవనీయ [47] దగ్గరకు) వెళ్ళేట్టు చేస్తారు. అప్పుడు మగమేక ముందు నడుస్తుంది. తరవాత గాడిద, ఆతరువాత గుఱ్ఱం ఈ ఆహవనీయ నుంచి మరలేటప్పుడు గుఱ్ఱం మొదట, తరువాత గాడిద, తరువాత మగమేక వెడతాయి. గుఱ్ఱం క్షత్రియునికి, గాడిద వైశ్యునికి, శూద్రునికి ; మగ మేక బ్రాహ్మణునికి చిహ్నాలు. అంటే క్షత్రియుడు ముందు నడిస్తే తక్కిన మూడు కులాలు అనుసరిస్తాయి. అటునుంచి ఇటైనా, ఇటునుంచి అటైనా గాడిద ముందు నడువదు. అలాగే బ్రాహ్మణుడు క్షత్రియుడు ఎప్పుడూ వైశ్యశూద్రుల వెనుకవెళ్లరు. మంచి చెడుల సంకరం జరగకుండా వాళ్ళలా నడుస్తారు. పైగా ఆయన ఆరెండు కులాలను (వైశ్య శూద్ర కులాలను) పురోహిత క్షేత్ర కులాల నడుమ ఉంచి వారిని ఆధీనులుగా చేస్తాడు."

దెబ్బ తీయాలనుకుంటూనే భయంతో వెనుకంజ వేయడం, ఆదేశించాలనుకుంటూనే స్నేహం కలుపుకోవాలనుకోవడం - అనే వింత వైఖరిని మనువు క్షత్రియుల పట్ల ప్రదర్శించడం పై ఇదే వివరణ.

బ్రాహ్మణుల ఆధిపత్యానికి క్షత్రియుడిని లొంగదీయాలనుకోవడం వ్యర్థ ప్రయత్నమని ఈ యుద్ధాలూ, రాజీయే మనువుకు నేర్పాయి. పైచేయిగా వుండడం ఆశయంగా సరే, కానీ ఆచరణాత్మక రాజకీయంగా అదొక అసాధ్యం.

సాధ్య విషయాల క్రీడే రాజకీయమని బిస్మార్క్ వలె మనువుకు కూడా తెలుసు. వైశ్యులకు శూద్రులకు వ్యతిరేకంగా బ్రాహ్మణ క్షత్రియుల మధ్య ఉమ్మడి అవసరాన్నీ, పొత్తునీ నిర్ధారించడమే ...ధ్యం. మనువు అదే చేశాడు. ఇదంతా మతం పేరిట జరగడమే దయనీయం. బ్రాహ్మణమతం ...ంతరంగాన్ని, ప్రేరక శక్తిని అధ్యయనం చేసిన వారికి ఇది ఆశ్చర్యం కలిగించదు. ఐహిక ప్రలోభాల రాజకీయాలను కప్పి పుచ్చేందుకు బ్రాహ్మణ మతానికి మతం ఒక ముసుగు.

**అనువాదం ఆచార్య లకంసాని చక్రధరరావు,**
**డా. పి.ఆపదరావు, బాబివర్ధన్**

# :అథస్సూచికలు:

1. ది రెలిజియన్ ఆఫ్ వేదా పే. 1

2. ఇతన్నే 'శిశునాక' (SISUNAK) అని కూడా అంటారు.

3. హరికృష్ణదేవ్. స్మిత్‌చేత ఉట్టంకితం. "ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా" (1924) పే. 44. అథోజ్ఞాపిక 1

4. మౌర్యుల పాలనలో బ్రాహ్మణుల ఆత్మన్యూనతాభావం మనుస్మృతిలో మనువు బ్రాహ్మణుల కోసం అడిగిన ప్రత్యేక సదుపాయాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ ఆత్మన్యూనతా భావం వారి దీనస్థితి కారణంగా ఏర్పడి వుండాలి.

5. చూ. హరప్రసాద్‌శాస్త్రి: 'బుద్ధిస్టిన్ స్టడీస్' (సం.లా) అధ్యా. 34. పే. 819.

6. 'బర్నాఫ్: ఎల్.ఇంట్రడక్షన్ ఎ ఎల్' హిస్టరీ ఆన్ బుద్ధిస్మె ఇండిఎన్. (సెకండ్ ఎడిషన్) పే. 388

7. బుద్ధిస్టిక్ స్టడీస్. (సం.లా) అధ్యా. 34. పే. 820.

8. ఈ విషయాన్ని గురించి చూ: జైస్వాల్స్ వాల్యూమ్ ఆన్ మను అండ్ యాజ్ఞవల్క్య.

9. కామెంటరీ ఆన్ మను. 1.1

10. హర్షచరిత్ర: స్మిత్ చేత ఉట్టంకితం. (1924) పు. 208.

11. ఈ శాసనం అనుల్లంఘనీయం, ఆపస్తంబ ధర్మసూత్రం ప్రకారం పరీక్షించి చూద్దామనైనా సరే బ్రాహ్మణుడు ఆయుధాన్ని చేతిలోకి తీసుకోకూడదు, బ్రాహ్మణుడైన పుష్యమిత్రుడు ఈ పని ఎలా చేశాడనేది ఆశ్చర్యకరమైన విషయం. సైనిక తెగలో సభ్యుడైనటువంటి వాడు చేయవలసిన పని ఇది. ఈ చిక్కును హరప్రసాద్ శాస్త్రి చక్కగా వివరించారు. ఆయన అభిప్రాయం ప్రకారం శుంగులు బ్రాహ్మణులే అయినప్పటికీ, వారు సైనిక తెగకి చెందినవారే! యుద్ధవీరులైన బ్రాహ్మణులలో, ఇద్దరు వేరుపరచదగినవారు. వారు విశ్వామిత్రులు, భరద్వాజులు. విశ్వామిత్ర బ్రాహ్మణుని భార్య గొడ్రాలు కావటం చేత; ప్రాచీన సంప్రదాయ పద్ధతైన 'నియోగం' ద్వారా విశ్వామిత్రులకు ఒక కుమారుని ప్రసాదించమని ఒకానొక భరద్వాజుని అర్థించటం జరిగింది. అప్పుడు పుట్టినవాడే శుంగుడు. అతడు గోత్రమూల పురుషుడు. ఆ గోత్రీకులు సామవేదీయులు. శుంగులు 'ద్వైయ ముష్యమ్' గోత్రీయులుగా పిలువబడ్డారు. అంటే రెండు గోత్రాల మూలంగా జన్మించినవారు అని అర్థము. విశ్వామిత్రుడు, భరద్వాజుడు ఇద్దరు సైనిక వృత్తిని (ఆయుధ వృత్తని) చేపట్టారు."–చూ. "బుద్ధిస్టిక్ స్టడీస్. (సం.లా). అధ్యా. 34. పే. 820.

12. దఫ్తరీ; ప్రజ్ఞానేశ్వర్‌ల పరిశీలనలోని కొన్ని ఆచూకీలను ఇక్కడ నేను ప్రదర్శిస్తున్నాను. దఫ్తరీ 'ధర్మ రహస్యం'; ప్రజ్ఞానేశ్వర్ 'చాతుర్వర్ణ్య' గ్రంథాలు ఎంతో విలువైనవి. అవి వాటికి సంబంధించినంతవరకు అత్యంత మౌలికమైనవి. వాటిలోని విషయం వాళ్ళు సూచించిన మార్గంలో మరింత పరిశీలించవలసినటువంటిది.

13. దీనివల్ల ఎవరికైనా 'సుమతి భార్గవుడు' తన ధర్మశాస్త్రాన్ని 'మను ధర్మశాస్త్రం'గా ఎందుకు పేర్కొన్నాడో స్పష్టంగా అర్థమవుతుంది. ప్రాచీన ధర్మప్రవక్త మనువు అధికారాన్ని, గౌరవాన్నీ దీనికి అంటగట్టాలనుకున్నాడు అతడు.

14. వేదాలలోని కొన్ని మంత్రాలు ఎలా శూద్ర కృతాలయ్యాయో చెప్పటానికి ఇదొక్కటే సిద్ధాంతం. అయితే దీన్ని దృష్టిలో పెట్టుకున్న ఎవరికైనా శూద్రులు వేద మంత్రాలను వల్లె వేయటం గానీ, వినటం గానీ చేయరాదని మనువు ఎందుకు నిషేధించాడనేది విడని చిక్కు ప్రశ్న.

15. మనుధర్మశాస్త్రం. 2–67. మనువు ఎక్కడ–

16. మను. 2–36, 37.

17. ఈ విషయాన్ని గూర్చి చూడండి. ప్రజ్ఞానేశ్వర్ యతి 'ఉపనయనం' మీద రాసిన చిన్న పుస్తకం.

18. మనుధర్మ: 2–69.

19. వర్ణ సిద్ధాంతంలో అజ్ఞాని అయిన బ్రాహ్మణుడు లేడు. వర్ణం–కులం అయినప్పుడు మాత్రమే అజ్ఞాన బ్రాహ్మణుడు వుండే, చేయబడే అవకాశం కలుగుతుంది. అప్పుడు కేవలం పుట్టుక వలన మాత్రమే ఒకడు బ్రాహ్మణుడు అవుతాడు.

20. యాజ్ఞవల్క్య స్మృతి కాలం క్రీ.శ. 150–200 సం.ల మధ్య కాలం కావచ్చు.

21. విష్ణుస్మృతి. అధ్యా. 25. పే. 14.

22. ఇతడు తన మితాక్షరిని క్రీ.శ. 1070–1100 మధ్య కాలంలో రచించాడు.

23. చూ. కాణే. "హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర". పార్ట్ 1. పే. 1.

24. చూ. కాణే. "హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర". వాల్యూమ్ II పార్ట్ II అధ్యాయం II

25. 'సతి'ని గురించి లభించే సమాచారం అంతా 'కాణే' చేత సేకరించబడింది. చూ. "హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర" వాల్యూ II పార్ట్ I పేజీలు 617–636.

26. హిస్టరీ ఆఫ్ ఇండియా. వాల్యూ II

27. హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర

28. ఈ విషయానికి సంబంధించిన సమాచారం నా "కాస్ట్స్ ఇన్ ఇండియా" వ్యాసంలో చూడవచ్చు. "ఇండియన్ యాంటిక్వరీ" మే. 1917 సంచికలో ప్రచురితమైంది అది.

29. కులభ్రష్టులు అస్పృశ్యులకంటే భిన్నమైనవారు. దాన్ని తరువాత వివరిస్తాను.

30. చూ. స్టీఫెన్స్ కామెంటరీస్ ఆన్ ది లాస్ ఆఫ్ ఇంగ్లాండ్. (15వ ముద్రణ) వాల్యూ 4. పే. 179.

31. డెమోక్రసీ అండ్ ఎద్యుకేషన్. పే. 99.

32. పతనకాలం నుంచి అంటే బ్రాహ్మణులు తాము ఆధిక్యం కోసం చాతుర్వర్ణ్య వ్యవస్థ సమతుల్యాన్ని చెడగొడుతున్న కాలం నుంచి అని.

33. '(సం)రక్షిత' అంటే బంధువుల రక్షణలో ఉన్నది. 'అరక్షిత' అంటే ఒంటరిగా జీవించేది.

34. 'అతిథి' అనే మాటను మనువు ఒక పారిభాషిక పదంగా వాడాడు. అతని అర్థంలో ఒకరాత్రి ఉండే బ్రాహ్మణుడు–అతిథి. చూ. మనుధర్మ. 3–102

35. స్త్రీలకు నిషేధించిన ఒక్క ఉపనయనం తప్ప.

36. ఇంకా ఈ విషయానికి సంబంధించిన ఇతర సమాచారానికి చూ. నా వ్యాసం "ఎన్హిలేషన్ ఆఫ్ కాస్ట్" ("కుల నిర్మూలన")

37. "టు సోర్సెస్ ఆఫ్ మోరాలిటీ" (హోల్ట్) పే. 267.

38. ధనాన్ని చెల్లించినా దానం ద్వారా పొందిన స్త్రీని వదిలివేయడానికి ఇష్టపడని బ్రాహ్మణుని ఉదంతాన్ని చదివినట్లు నాకు బాగా జ్ఞాపకం.

39. ది ట్రావెల్స్ ఆఫ్ ఎడోవికో డివార్తెమా." (పబ్లిష్డ్ బై హాకీత్ సొసైటీ). పే. 141. వార్తెమా ఇంకా ఇలా అంటాడు. "బ్రాహ్మణుడు ఈ కార్యాన్ని నిర్వహించటానికి ఇష్టంతో స్వచ్ఛందంగా వెళ్తాడని అనుకోకండి. రాజు అతనికి నాలుగు వందలు లేక ఐదు వందలు రూపాయిలు (దుకత్‌లు) దీని కోసం చెల్లించేవాడు."

40. "ఎ న్యూ ఎకౌంట్ ఆఫ్ ఈస్ట్ ఇండీస్" (1744) వాల్యూ. I. పే. 310.

41. గజెటర్ ఆఫ్ మలబార్ అండ్ అంజెంగో డిస్ట్రిక్ట్: సి.ఎ.ఇన్నెస్. వాల్యూ I. పే. 95.

42. క్షత్రియులపై పరశురాముడు ఎందుకు యుద్ధం చేశాడో నేను వ్యాఖ్యానించిన తీరు ఇది.

43. బ్రాహ్మణులకు, బ్రాహ్మణ మతానికి వ్యతిరేకంగా తిరుగుబాటుగా వచ్చింది బౌద్ధమతం. అయినా బుద్ధుని బౌద్ధమతానికి తొలి అనుచరులు చాలామంది బ్రాహ్మణులే.

44. ఈ రికార్డంతా సేకరించనవాడు ప్రొఫెసర్ మూర్."ఒరిజినల్ శాన్‌స్క్రిట్ టెక్ట్స్" వాల్యూ.I

45. చూ. హాప్కిన్స్: హిస్టరీ ఆఫ్ ది రూలింగ్ రేసెస్.

46. ఎజ్లింగ్: శతపథ బ్రాహ్మణ. పార్ట్ III పేజీలు. 226–27

47. అహావనీయ.

# అధ్యాయం – 12

# గృహధర్మ సూత్రాలు

[ఇది అరవై ఒక్క పేజీల టైపు చేసిన వ్యాసం. ఇది రెండో ప్రతి అయినా డా. అంబేద్కర్ స్వయంగా చేసిన దిద్దుబాట్లూ, సవరణలూ ఇందులో ఉన్నాయి. వాటన్నిటితో సహా ఆ రచనను ఈ దిగువనిస్తున్నాము. విడిగా మరొక ఫైలు కూడా లభించింది. దాని పేరు "మనుస్మృతి లేదా ప్రతివిప్లవ ప్రామాణిక గ్రంథం" (Manusmruti or the Gospel of Counter-revolution) ఆ కాపీలో మనుస్మృతిపై వివిధ వర్గీకరణల క్రింద డా. అంబేద్కర్ నోట్సు తీసుకొన్నారు. ఆ నోట్సు అంతటినీ గృహధర్మ సూత్రాలు (The Morals of the house) అనే ఈ వ్యాసంలో అంబేద్కర్ పొందుపరిచారు. అందువల్ల మాకు లభించిన ఆ రెండో వ్యాసాన్ని మళ్లీ ప్రచురించడం చర్వితచర్వణం అవుతుంది గనుక దాన్ని విడిగా ప్రచురించడం లేదు. –సంపాదకులు.]

## I

హిందువుల ధర్మాలను, మత విశ్వాసాలను 'స్మృతులు' నిర్దేశిస్తున్నాయి. ఇవన్నీ హిందువుల పవిత్ర సాహిత్యంలో ఒక భాగం. హిందూ మతాన్నీ, నీతులనూ అర్థం చేసుకోవాలంటే, ముందు మనం స్మృతులను ఆశ్రయించాలి. సంఖ్యలో స్మృతులు చాలానే వున్నాయి. సాంప్రదాయంగా వస్తున్న అంచనా ప్రకారం మొత్తం స్మృతుల సంఖ్య 108. ఎక్కువ సంఖ్యలో వున్నంత మాత్రాన అవి మన సమస్యను జటిలం చేయలేవు. అధిక సంఖ్యలో వున్నా అవి సారాంశంలో ఒకదానితో వేరొకటి విభేదించవు. ప్రతి స్మృతిలోనూ చెప్పిందే మళ్ళీ చెప్పడం వల్లనూ, వాటన్నింటినీ ఒకే సాధారణ మూలాధారం నుంచి గ్రహించడం వల్లనూ, వాటిని చదవడం బాగా విసుగు పుట్టిస్తుంది. అదే–ఆ మూలమే–మనుస్మృతి. అదే మానవధర్మ శాస్త్రంగా గూడా పేరు పొందింది. మిగతా స్మృతులన్నీ మనుస్మృతికి విశ్వసనీయమైన పునరుక్తులుగా చెప్పకోవచ్చు. అందుచేత హిందువుల నైతిక ప్రమాణాలను గురించీ, మతోద్దేశాల గురించీ స్పష్టమైన అవగాహనకు రావాలంటే ఒక్క మనుస్మృతిని అధ్యయనం చేస్తే సరిపోతుంది.

మనుస్మృతినీ ఇతర స్మృతులను కూడా న్యాయసూత్రాల సంహితలుగా చెప్పవచ్చు. ఇవన్నీ నీతిసూత్రాల గ్రంథాలు కావు. మత గ్రంథాలు అంతకన్నా కావు. కానీ న్యాయసూత్రాల గ్రంథాలను తీసుకొని దాన్ని నీతి సూత్రాల గ్రంథంగా, మత గ్రంథంగా భావించడం అంటే దాని అర్థం నీతిసూత్రాలనూ, మతాన్నీ న్యాయనిబంధనలనూ ఒకటిగా భ్రమింపజేయడం.

ఆధునిక కాలంలోనే తొలిసారి న్యాయశాస్త్రం మతం నుంచి వేరు చేయబడింది. ప్రాచీన సమాజాలన్నింటా, న్యాయశాస్త్రమూ, మతమూ ఒకటే. ప్రొ. మాక్స్ ముల్లర్[1] ఇలా ఎత్తి చూపారు:

"న్యాయశాస్త్రం సహజంగానే సమాజానికి పునాదిగానూ, జాతిని (nation) ఏకసూత్రంతో బంధించేదిగానూ కనిపిస్తుంది. న్యాయశాస్త్రమే–కనీసం ప్రాచీన న్యాయశాస్త్రం–ప్రామాణికతనూ, శక్తినీ, జీవశక్తినీ మతం నుంచే గ్రహించిందన్న విషయం సమాజ ఉపరితలంకంటే కాస్త లోతుగా చూస్తే అర్థమవుతుంది... న్యాయ నిబంధనలను రూపొందించేవారు ఇతర సాధారణ ప్రజానీకం కంటే కాస్త ఎక్కువ దేవునితో సాన్నిహిత్యం కలిగి ఉంటారని ఎన్నో జాతుల, దేశాల ప్రాచీన సంప్రదాయాలలో బలమైన విశ్వాసం వుంది. డయోడరిస్ సెక్యులస్‌లోని ఓ సుప్రసిద్ధ ఉల్లేఖన ప్రకారం ఈజిప్షియన్లు తమ న్యాయసూత్రాలను మెర్విస్, హెర్మెస్ దేవత నుంచి అందుకున్నాడని నమ్ముతారు. మినోస్, న్యాయసూత్రాలను జియస్ (Zeus) నుంచి అందుకున్నాడని క్రేటన్లు (Creataus), లైకుర్గస్, అపోలోన్ నుంచి పొందాడని లాసిడెమోనియన్లు నమ్ముతారు. ఏరియన్‌ల ప్రకారం, వారి న్యాయ ప్రదాత జరాతుష్ట్ర, న్యాయసూత్రాలను సదాత్మ (Good Spirit) నుంచి అందుకున్నాడు. స్టో (Stoe) ప్రకారం, జమోలిక్సిస్, హెస్టియా దేవత నుంచి న్యాయసూత్రాలను పొందాడు. యూదుల నమ్మకంలో మోసెస్ న్యాయసూత్రాలను ఇయాస్ దైవం (God Ias) నుంచి విన్నాడు."

ఒక దైవిక ప్రభావంగా భావించబడిన మతం, ప్రాచీన కాలంలోని అన్ని జీవిత సంబంధాలకీ, అన్ని సామాజిక సంస్థలకీ ఆలంబనగా, సమర్థనగా ఉండేదన్న విషయాన్ని సర్ హెన్రీ మెయిన్స్[2] చెప్పినంత బలంగా చెప్పిన వారెవరూ లేరు. ఆయన మాటల్లో మతం:

"ఆనాటి ప్రధాన సామాజిక సంస్థలన్నిటినీ–అంటే రాజ్యాన్నీ, తెగనీ, కుటుంబాన్నీ – పవిత్రీకరించి, కలిపి వుంచవలసిన మానవాతీత అధికారం."

చాలాకాలం తర్వాత న్యాయసూత్రాలు మతం నుంచి పూర్తిగా తెగతెంపులు చేసుకునేవరకూ మతం యొక్క మానవతీత ఆధిపత్యం నుంచి న్యాయసూత్రాలు తప్పించుకోలేకపోయాయి. కానీ అప్పుడు కూడా అవి, మానవ చరిత్ర ప్రారంభంలో వాటికి మతంతో ఉండిన సంబంధం తాలూకు ఛాయలను పూర్తిగా వదిలించుకోలేకపోయాయి.

ఇప్పుడు – ఆధునిక కాలంలో మాత్రం మతానికీ, సద్వర్తనా నియమావళి (Ethics)కీ స్పష్టమైన వ్యత్యాసం పాటించబడుతోంది. మతమూ, నైతిక సూత్రాలూ (moral principles) కలగలిసిపోయి వున్నాయి. నైతికతా (Morality), సద్వర్తనా నియమావళీ – ఈ రెండూ ఆచరణకు సంబంధించినవి. సద్వర్తనా నియమాల సమస్య కేవలం మంచిని అర్థం చేసుకోవడమే కాక దానిని సాధించడం అనీ; సరైనదానిని శాస్త్రీయ పునాది మీద నిలబెట్టడం కాక దానిని

ఆచరించడం అసలు సమస్య అనీ, ప్రొ. జాక్స్ నొక్కి చెబుతాడు. నైతికత అంటే కేవల మంచి చెడుల్ని నిర్వచించడానికి సంబంధించినది. అందుకే ప్రొ. జాక్స్ సరిగా చెప్పినట్లు:

"అన్వయించడం గురించి ఎలాంటి శ్రద్ధ తీసుకోకుండా నైతికత గురించి మనం అధ్యయనం చేయడానికి పూనుకోవడం అంటే మనం మాట్లాడుకునేది నైతికత గురించి కాదని నేననుకోవలసి వస్తుంది. అన్వయించేంతవరకూ, నైతికత గురించిన ప్రశ్నే ఉత్పన్నం కాదు. దాని ఆచరణకు కావలసిన బలమైన ప్రేరణలను జోడిస్తేనే తప్ప నైతిక సూత్రాలను ప్రపంచం మీదికి విడుదల చేయడం వల్ల ఏ ప్రయోజనమూ ఉండదు. అరిస్టాటిల్ ఎత్తి చూపినట్టు, మంచి జీవితం గడపడం కష్టంతో కూడుకున్న పని. కేవలం ఉనికిలో వున్న సంప్రదాయాలను అనుసరించడమే మంచి జీవితం అనుకున్నా కూడా అది కష్టమే. అలాంటప్పుడు ఉత్తమ జీవితం సమకాలీన ప్రమాణాలను అధిగమించవలసిన అవసరాన్ని నొక్కి చెబుతున్నప్పుడు అపారమైన శక్తి సామర్థ్యాలను వెచ్చించకుండా దాన్ని సాధించడం ఎలా సాధ్యం? మనుషులు సరైన పనులే ఎందుకు చెయ్యాలి – అనే అంశంపై కేవలం సమచారాన్ని ఇవ్వడం, చెడుగు చేయాలనే వారి మనః ప్రవృత్తి ముందు నిష్ప్రయోజనమవుతుంది. అది ఉత్తమ జీవితాన్నెదుర్కొనే కష్టాలకూ, కడగళ్లకూ సాటిరాదు."

ఏదో ఒక ప్రేరక శక్తి ముందుకు వస్తే తప్ప నైతికత స్తబ్ధుగా వుండిపోతుంది. నైతికతకు ప్రేరణ అందించేది మతమేనన్న విషయంలో ఎలాంటి సందేహమూ లేదు. మళ్ళీ ప్రిన్సిపాల్ జాక్స్ మాట్లలో చెబితే, మతం, ఒక చోదకశక్తిగా పని చేస్తూ....

"ఉత్తమ జీవితాన్ని – దాని సులభతర రూపంలోనైనా – గడపడంలో ఎదురయ్యే కష్టాలను అధిగమించేటంత శక్తివంతమైనటువంటివీ, నైతిక ఆదర్శపు అవిచ్ఛిన్నమైన అభివృద్ధికి తగినటువంటివీ" అయిన ప్రేరణలను సృష్టిస్తుంది.

ప్రేరక శక్తిగా మతం, నైతికోద్దేశాన్ని పరిపరి విధాలుగా బలోపేతం చేస్తుంది. ఒకొక్కసారి అది (మతం) చనిపోయిన తర్వాత పొందబోయే వరాలూ, శిక్షలూ ఆధారంగా పనిచేసే నిషేధాల రూపంలోనూ; వేరొకసారి దేవుని ఆదేశాలుగానూ నైతిక సూత్రాల్ని మన ముందుంచుతుంది. ఇంకొకసారి ఆ సూత్రాలకు పవిత్రత కల్పించి, వాటికి మన స్వంత ఇచ్ఛతో విధేయత చూపేలా చేస్తుంది. అయితే ఇవన్నీ మతం ద్వారా వుత్పన్నమైన ప్రేరకశక్తి, నైతిక జీవితాచరణను నిలబెట్టడానికి అనుసరించే విభిన్న మార్గాలు మాత్రమే. నైతికతను నడిపే చోదకశక్తి మాత్రమే.

సద్వర్తనా నియమాలూ, నైతికతా – ఇవి విధులయితే, మనుస్మృతి ప్రవర్తనా నియమాల గ్రంథమనడానికి ఎలాంటి సందేహమూ లేదు. మనుస్మృతిని అధ్యయనం చేస్తే ప్రధానంగా దానిలో ముందుకొచ్చే అంశం విధులను గురించేనని ఎవరైనా అంగీకరిస్తారు. ఒక హిందువు అనుసరించాల్సిన విధులను మొదటిసారిగా వ్యవస్థీకరించిన వాడూ, సూత్రబద్ధం చేసినవాడూ

మనువు. అతడు వర్ణాశ్రమ ధర్మాలనూ, సాధారణ ధర్మాలనూ విడదీశాడు. వర్ణాశ్రమ ధర్మాలనేవి జీవితంలో ఒకరి స్థానాన్ని బట్టి – అంటే ఆ వ్యక్తి వర్ణం లేదా కులం ద్వారా, ఆశ్రమం లేదా నిర్దిష్ట జీవిత దశను బట్టి నిర్ణయించిన స్థానం ప్రకారం – నిర్వహించవలసిన ప్రత్యేక విధులు. సాధారణ ధర్మాలంటే ఒక వ్యక్తి వయసు, కులం, విశ్వాసాలతో పనిలేకుండా నిర్వహించే విధులు. అంటే – ఒక ప్రత్యేకమయిన తెగకు లేదా ఒక సాంఘిక వర్గానికి లేదా ప్రత్యేకమయిన స్థితికి లేదా వయసుకు చెందినవాడని కాకుండా మనిషి, మనిషిగా అనివార్యంగా నిర్వహించాల్సిన విధులు. మొత్తం గ్రంథమంతా విధులు తప్ప మరి దేని గురించీ చర్చించలేదు.

ఈ విధంగా మనుస్మృతి న్యాయసూత్రాలూ, మతమూ, నీటి సూత్రాలు – ఇవన్నీ ఒకటిగా కలగలిసిపోయిన గ్రంథం. అది మనిషి విధులను చర్చిస్తుంది కాబట్టి నీతిశాస్త్రం. అది కులం గురించి చెబుతుంది కాబట్టి అది మతం–ఎందుకంటే హిందూ మతానికి ఆత్మకులమే. అది న్యాయస్మృతి (law). ఎందుకంటే విధులు చేయడంలో లోపం జరిగితే ఏయే శిక్షలు విధించాలో అది నిర్దేశిస్తుంది. ఈ దృష్టితో చూస్తే హిందువుల నైతిక ప్రమాణాలనూ, మత భావాలనూ నిర్ధారించడానికి మనుస్మృతి దగ్గరకు వెళ్ళడంలో తప్పులేదు.

మనుస్మృతి మత గ్రంథం అనే విషయం అంత స్పష్టంగా కనబడకపోవచ్చు. కారణం – హిందూ మతమనేది చాలా భ్రమ గొల్పే పదం. వివిధ రచయితలు దాన్ని వివిధ రకాలుగా నిర్వచించారు.

సర్ డి. ఇబ్బెట్సన్[4] హిందూ మతాన్ని ఇలా నిర్వచించాడు. "కులం అనే సాంఘిక వ్యవస్థ ద్వారా పరిరక్షించబడే బ్రాహ్మణుల వారసత్వ పౌరోహిత్య అధికారం ద్వారా పనిచేసే మతం. అది భారతదేశపు స్థానిక మతం యొక్క అన్ని ఛాయలనీ, మత ముఖ్యాన్నీ కలుపుకుని; దిగుమతి అయిన విదేశీ మతాలయిన క్రైస్తవం, ఇస్లాంలకూ, అర్వాచీన బౌద్ధ శాఖలకూ ఖచ్చితంగా భిన్నంగా ఉండి, సిక్కు మతంతో సందేహాస్పదమైన తేడానూ, జైన మతంతో మరింత సందేహాస్పదమైన తేడాను కలిగి వుంటుంది."

సర్ జె.ఎ.బైన్స్[5] హిందూ మతాన్ని ఇలా నిర్వచించాడు:

"సిక్కులూ, జైనులూ, బౌద్ధులూ, అతీత శక్తుల్ని నమ్మే వారూ కాకుండా; విదేశీ మతాలయిన ఇస్లాం, మజ్దాయిజం, క్రైస్తవం, హిబ్రూయిజంలలో దేనిలోనూ చేరకుండా మిగిలిన అధిక సంఖ్యాక భారతీయుల మతం."

సర్ ఎడ్వర్డ్ గెయిట్[6] దృష్టిలో హిందూమతం ఇలా వుంది:

"వివిధ మత విశ్వాసాల, సిద్ధాంతాల సంక్లిష్టమైన కలయిక ఏకేశ్వరవాదుల్నీ, బహుదేవతా

రాధకుల్నీ, సర్వేశ్వరవాదుల్ని, శివుడు అనే గొప్ప దేవుణ్నీ, విష్ణువునీ, లేదా వారి భార్యల్నీ పూజించేవారినీ, అలాగే అమ్మ దేవతలనూ, చెట్ల, రాళ్ల నదుల, ప్రవాహాల ఆత్మలనూ గ్రామ దేవతలనూ కొలిచేవారిని, క్షుద్రదేవతని ప్రసన్నం చేసుకొనేందుకు రక్తబలులను యిచ్చేవారినీ, జీవహింస చేయకపోవడమే గాకుండా 'బలి' అనే పదాన్ని సయితం ఉపయోగించని వారినీ, ప్రార్థనలూ, మంత్రాలూ చదవడం ప్రధానంగా గల కర్మకాండలు చేసేవారినీ, మతం పేరిట చెప్ప నలవిగాని లైంగికమైన, హింసాత్మకమైన పూజలు చేసే వారినీ అందరినీ తన నీడన చేర్చుకున్నటు వంటిది."

ఈ వర్ణన పూర్తిదే అయినా, మొత్తం సంక్లిష్టతను వివరించడంలో అసంపూర్ణమే! ఈ పట్టి కకు ఆవులను పూజించే వారినీ, ఆవు మాంసం తినే వారినీ; ప్రకృతి శక్తుల్ని ఆరాధించేవారూ, ఏకేశ్వర ఆరాధన చేసే వారినీ; విగ్రహాలనూ, రాక్షసులనూ, దయ్యాలనూ, పితృదేవతలనూ, సాధువులనూ, సన్యాసులనూ, వీరులనూ పూజించే వాళ్లనూ కూడా చేర్చాల్సి వుంటుంది.

హిందూ మతం అంటే ఏమిటి? అనే సాధారణ ప్రశ్నకి ముగ్గురు జనాభా గణాంక అధికారులు యిచ్చిన సమాధానాలు ఇలా వున్నాయి. ఇతరులకు కూడా ఈ ప్రశ్నకి జవాబు చెప్పడం తక్కువ కష్టంగా కనిపించలేదు. సర్ ఎ.ల్యాల్ (Lyall) ఈ ప్రశ్నకేం జవాబు చెప్పాడో కాస్త చూద్దాం.[7] కేంబ్రిడ్జ్ విశ్వ విద్యాలయంలో 1891లో యిచ్చిన 'రేడే' ఉపన్యాసంలో యిలా అన్నాడు.

"ఇప్పుడు నన్నెవరయినా హిందూ మతాన్ని నిర్వచించమని అడిగితే సరైన సమాధానం యివ్వలేను. మహత్తరమైన చారిత్రక మతాలను గురించి వివరించినట్టుగా, సంగ్రహంగా దాని ప్రధాన సిద్ధాంతాన్ని బట్టీ, మత విశ్వాసానికి సంబంధించిన మౌలిక విషయాలను బట్టీ నిర్వచిం చజాలను. హిందూ అనే పేరు కేవలం మతపరమయిన పేరు మాత్రమే కాదు. ఒక దేశాన్ని కూడా సూచిస్తుందా పేరు. అంతేకాదు–కొంతవరకు ఒక జాతిని కూడా. అదే మనం ఒక క్రైస్తవుని గురించి గానీ, ఒక మహమ్మదీయుని గురించి గానీ ఒక బౌద్ధుని గురించి గానీ చెప్పుకున్నపుడు, విస్తృతార్థంలో – ప్రత్యేకంగా ఒక తెగ లేక ఒక స్థలం కాకుండా – ఒక ప్రత్యేక మత సమూహం అనే అర్థంలో వాడతాం. అదే మనం ఒక రష్యన్ గురించి గానీ, పర్షియన్ గురించి గానీ చెబుతున్నపుడు మత సాంప్రదాయం గురించి కాకుండా, ఒక దేశాన్ని సూచిస్తున్నాం లేక ఒక వంశాన్ని తెలుపుతున్నాం. కానీ ఒక వ్యక్తి తాను హిందువునని చెబితే, అతను ఈ మూడింటినీ ఉద్దేశిస్తున్నాడు – మతం, వంశం, దేశం."

హిందూ మతాన్ని ఒక మతంగా వివరిస్తూ సర్ ఆల్ఫ్రెడ్ ల్యాల్ యిలా అన్నాడు.

"హిందూ మతమంటే బ్రాహ్మణీయ బోధనల ద్వారా ప్రచారమయ్యే బ్రాహ్మణుల పవిత్ర

రంథాల, ఆ దేశాల ద్వారా నిర్దేశించబడే మూఢ నమ్మకాలూ, హక్కులూ, పూజలూ, విశ్వాసాలూ, సంప్రదాయాలూ ఒక పద్ధతి లేకుండా కలగలిసిపోయి ఉండే చిక్కుముడుల సమాహారం."

చివరగా ఒక హిందువయిన శ్రీ జి.పి.సేన్ ఇచ్చిన నిర్వచనాన్ని ఇక్కడ చేరుస్తున్నాను. శ్రీ సేన్ కేవలం హిందువు మాత్రమే కాదు, హిందూ మతం గురించి అధ్యయనం చేసే విద్యార్థి కూడా. "హిందూ మతాధ్యయనానికి ప్రవేశిక" (Introduction to the Study of Hinduism) అనే పుస్తకంలో ఆయన ఇలా రాశారు:

"హిందూ మతం అంటే హిందువులు – లేక హిందూ సమాజంలో అర్వధికులు – ఆచరించేది."

మరి ఎన్ని భేదాలున్నా హిందువులందరూ తమంతట తాముగా విధేయత కలిగి కట్టుబడి వుండే ఏ సిద్ధాంతమూ హిందూ మతంలో లేదా అంటే ఒక సూత్రం ఉందనిపిస్తుంది. అదే కుల నియమం. హిందూ మతానికి సంబంధించిన మౌలికమైనదేమిటన్న విషయంలో అభిప్రాయ భేదాలెన్నయినా ఉండవచ్చును. కానీ హిందూమతంలో కుల నియమం ఒక ప్రధానమయిన, విడదీయరాని అంశం అనడానికి ఎటువంటి సందేహమూ లేదు. ప్రతి హిందువుకీ – చట్టం ముందు తాను హిందువును కానని చెప్పినా, తాను హిందువునని సగర్వంగా చెప్పినా – ప్రతి హిందువుకీ కులం వుంది. ఒక హిందువు హిందూ మతంలో పుట్టినట్టే ఒక కులంలోనూ పుడతాడు. ఏదో ఒక కులంలో పుట్టకపోతే అతను హిందూ మతంలో పుట్టడం కుదరదు. కులమూ, హిందూ మతమూ విడదీయరానివి. ప్రొ. మాక్స్ ముల్లర్ 8 చెప్పినట్టు:

"ఏ వాదనా కదిలించలేని శిలవంటి కుల వ్యవస్థపై ఆధునిక హిందూ మతం నిలిచి వుంది."

ఈ చర్చ వల్ల తేలేదేమిటంటే మనువు, కుల నియమాలనే నిర్దేశించాడు కాబట్టీ; హిందూ మతం – దాని అంతస్సారంలో – కుల నియమావళే కాబట్టీ మనుస్మృతిని హిందువుల మత గ్రంథంగా ఆమోదించాలి.

# II

హిందువులు పాటించడానికీ, ఆచరించడానికీ మనువు నిర్దేశించిన ప్రవర్తనా నియమాలూ, మత నియమాలూ ఏమటి?

మొదట మనువు హిందువులను నాలుగు వర్ణాలుగా విభజించాడు. ఆయన అలా హిందువులను విభజించడమే గాకుండా, వాటి హెచ్చుతగ్గులను నిర్దేశించాడు. ఆయన నిర్దేశించిన ప్రణాళిక యిలా వుంది.

"గొప్ప వాడవుట వల్లనూ, శ్రేష్టమయిన పుట్టుక వల్లనూ, కొన్ని నియమ నిషేధాలను అనుసరించడం వల్లనూ, నిర్దిష్టమైన కర్మకాండ వల్లనూ, బ్రాహ్మణుడే (అన్ని) వర్ణాలకు ప్రభువు." (10-3)

మనువు తన కారణాలను వివరిస్తూ అత్యంత స్వాభావికంగా ఇలా చెప్పాడు:

"బ్రాహ్మణుడు (ప్రజాపతి అంటే భగవంతుని) నోటి నుంచి పుట్టుటవల్లనూ, తాను (క్షత్రియాదుల కన్నా) ముందు పుట్టుట వల్లనూ, వేదమును కలిగి వుండుట వల్లనూ, ధర్మశాసనము వల్లనూ అతడు సృష్టికంతటికీ ప్రభువయివున్నాడు." (1-93)

"బ్రహ్మ (స్వయంభువు అయిన) తపస్సు చేసి, తన నోటి నుంచి తొలిసారిగా అతణ్ణి (బ్రాహ్మణున్ని) పుట్టించెను. తద్వారా అతను దేవుళ్లకు హవ్యములనూ, పితృదేవతలకు కవ్యములనూ అందజేస్తూ, ఈ ప్రపంచాన్ని రక్షించును." (1-94)

"సృష్టిలో ఏ జీవి అతణ్ణి (బ్రాహ్మణున్ని) అధిగమించగలదు? అతని నోటి ద్వారా నిరంతరమూ దేవతలు హవ్యములనూ, పితృ దేవతలు కవ్యములనూ తింటూ వుంటారు." (1-95)

"సృష్టిలో ప్రాణులు శ్రేష్ఠములు. ప్రాణుల్లో బుద్ధిగల జీవులు శ్రేష్ఠములు. బుద్ధిగల జీవుల్లో మనుషులు శ్రేష్ఠులు. మనుషులందరిలోనూ బ్రాహ్మణులు శ్రేష్ఠులు, అత్యుత్తములు." (1-96)

"దేవుడు అతణ్ణి తన నోటి నుంచి పుట్టించడం వల్లనూ, దేవతలకూ, పితృదేవతలకూ, హవిస్సులూ, కవ్యములూ తీసుకుపోవుట వల్లనూ బ్రాహ్మణులు సృష్టిలో గొప్పవాళ్ళు అవడంతో పాటు బ్రాహ్మణుల ఆధిక్యతకు మనువు మరొక కారణం చెబుతున్నాడు అది: "బ్రాహ్మణుని పుట్టుకే నాశనం లేని పవిత్ర ధర్మం (వేదం) యొక్క అవతారం. ఎందుకంటే అతను ధర్మం ఆచరించడానికీ, బ్రహ్మలో ఐక్యంకావడానికీ జన్మిస్తాడు." (1-98)

"బ్రాహ్మణుడు సృష్టిలో అత్యుత్తమునిగా, సర్వప్రాణి కోటికి ప్రభువుగా, న్యాయమనే కోశాగారాన్ని రక్షించడానికి పుట్టాడు." (1–99)

మనువు ఈ క్రింది విధంగా చెబుతూ ముగించాడు:

"బ్రాహ్మణుడు తన తిండినే తింటాడు. తన ఆహార్యాన్నే ధరిస్తాడు. తన ముష్టే ఇస్తాడు. ఇతర జీవులన్నీ బ్రాహ్మణుని ఔదార్యం వల్ల బ్రతుకుతున్నాయి." (1–101)

ఎందుకంటే మనువు దృష్టిలో:

"ప్రపంచంలో వున్నదంతా బ్రాహ్మణుని ఆస్తే. తన పుట్టుకలోని ఆధిక్యం వల్ల బ్రాహ్మణుడు వాటన్నిటినీ అనుభవించడానికి అర్హుడు." (1–100)

మనువు దృష్టిలో సృష్టికంతటికీ బ్రాహ్మణుడే ప్రభువని చెప్పడం వాస్తవాన్ని తక్కువచేసి చెప్పడమే అవుతుంది. ఎందుకంటే మనువు యీ క్రింది విధంగా హెచ్చరించాడు:

"అగ్ని (అది) యజ్ఞవేదిక యందు ఉపయోగపడినా, ఉపయోగపడకపోయినా – ఎలా మహాదేవత అవుతుందో అదేవిధంగా మూర్ఖుడయినా, విద్యావంతుడయినా బ్రాహ్మణుడు కూడా గొప్ప దేవుడని గ్రహించాలి." (9–317)

"ఈ విధంగా, బ్రాహ్మణులు అన్ని (రకాలయిన) నికృష్ట వృత్తులు చేసినప్పటికీ, వారిలో (ప్రతి ఒక్కరూ) మహా దేవతలే." (9–319)

దేవుడు కావడం వల్ల బ్రాహ్మణుడు న్యాయానికీ, రాజుకీ అతీతుడు. మనువు నిర్దేశం ప్రకారం:

"రాజు ఉదయమే లేచి–మూడు శాస్త్రాలనూ చదివిన, (రాజ్యతంత్రం) తెలిసిన–బ్రాహ్మణులను పూజించి, వారిచ్చే సలహాలను, సూచనలనూ అనుసరించు గాక." (7–37)

"తను (రాజు) ప్రతి రోజూ వేదం తెలిసిన, పవిత్ర వృద్ధ బ్రాహ్మణులను పూజించు గాక." (7–38)

చివరిగా మనువు యిలా అన్నాడు.

"బ్రాహ్మణుణ్ణి (దీని ద్వారా) సృష్టికర్తగా, దండనకర్తగా, బోధకునిగా (అందువల్ల యావ జ్జీవ రాశులకూ) హితునిగా ప్రకటించడమైనది. అతన్నితో ఎవరు కూడా అమర్యాదకరంగా గానీ, కఠినంగా గానీ మాట్లాడకుందురు గాక." (11–35)

మనుస్మృతిలో వివిధ వర్ణాల వారికి సంబంధించి వివిధ వృత్తులు చెప్పబడి వున్నాయి. వాటిని వారు తు.చ. తప్పకుండా అనుసరిస్తూ వుండాలి.

"వేదాలను చదవమనీ, వాటిని (యితరులకు) బోధించమనీ, యజ్ఞం చేయమనీ, అది చేసేవారికి సహకరించమనీ, ధనికులైతే దానమివ్వమనీ, డబ్బు లేకపోతే బహుమతులు స్వీకరించ మనీ, అతడు (స్వయంభు మనువు) బ్రాహ్మణునికి విధులను కేటాయించాడు." (1–88)

"ప్రజలను రక్షించడం, దానధర్మాలు చేయడం, యజ్ఞం, వేదపఠనం చేయడం, ఇంద్రియ సుఖాలను అనుభవించాలనే కోర్కెను తిరస్కరించడం–క్లుప్తంగా ఒక క్షత్రియుడు చేయాల్సిన పనులు ఇవీ." (1–89)

"పశుపోషణ, దానం, యజ్ఞం, శ్రుతులను చదవడం; వర్తకం, వడ్డీ వ్యాపారం, వ్యవ సాయం చేయడం, ఇవి వైశ్యునికి నిర్ణయించిన లేదా అనుమతించిన పనులు. (1–90)

"బ్రహ్మ, శూద్రునికి ఆదేశించిన ప్రధానమయిన పని యేమిటంటే–ఎలాంటి ఈర్ష్య అసూయలకు లోను కాకుండా పైనుదహరించిన మూడు వర్ణాల వారికీ వారివారి అర్హతలను బట్టి వారి గొప్పతనానికి భంగం కలుగకుండా సేవ చేస్తూ వుండడం." (1–91)

"బ్రాహ్మత్త్వం సాధించాలనే ఉద్దేశ్యం వున్నటువంటి, తమ విధులను నిష్ఠతో నిర్వర్తించే టటువంటి, బ్రాహ్మణులు, ఈ దిగువ ఆరు కర్మలూ వరుసగా చేస్తూ వుండాలి." (10–74)

"తాము వేదాలను చదవడం, ఇతరులను చదవమని బోధించడం, తాము యజ్ఞం చేయడం, ఇతరులు చేసే యజ్ఞానికి సహాయ సహకారాలు అందించడం, తమ దగ్గర ధనం వుంటే బీదలకి ధర్మం చేయడం, తాము బీదవారయితే పుణ్యాత్ముల నుంచి దానం పట్టడం–ఈ ఆరు పనులూ ప్రథమజులైన బ్రాహ్మణులు చేయాల్సినవి." (10–75)

"కాని, బ్రాహ్మణులు చేసే ఆరు పనుల్లో మూడు–యజ్ఞం చేసేందుకు సహకరించడం, వేదాల్ని బోధించడం, పరిశుద్ధుడైన దాత నుండి దానాలు పట్టడం–అతని బ్రతుకు తెరువుకి సంబంధించినవి." (10–76)

"బ్రాహ్మణుడు చేయాల్సిన మూడు విధులూ బ్రాహ్మణునికే పరిమితం. అవి క్షత్రియునికి సంబంధించినవి కావు. అవి: వేదాల్ని బోధించుట, యజ్ఞాలను చేయించడం, మూడోది-దానాలు పట్టడం." (10-77)

"మానవులందరికీ ప్రభువయిన మనువు యోధ, వ్యాపార వర్గాలకు వీటిని నిర్దేశించలేదు. కాబట్టి ఆ మూడు పనులూ (మార్చరాని అనుశాసనం ద్వారా) వైశ్యునకు కూడా నిషిద్ధం." (10-78)

"క్షత్రియులకు మాత్రమే పరిమితమయిన బ్రతుకు తెరువు అస్త్రాలనూ, శస్త్రాలనూ ధరించడం. సరకులు అమ్మడం, పశుపాలన, వ్యవసాయం చేయడము, వైశ్యులకు పరిమితం. కానీ మెరుగైన మరు జన్మ కోసం క్షత్రియ వైశ్యులకిరువురికీ దానధర్మాలు చేయడం, చదవడం, యజ్ఞాలు చేయటం విధులుగా నిర్దేశింపబడ్డాయి." (10-79)

హోదానీ, వృత్తినీ నిర్ణయించడమే గాకుండా, మనువు కొన్ని వర్ణాలకు ప్రత్యేక అధికారాలు, మరికొన్నింటిపై శిక్షలూ విధించాడు.

ప్రత్యేక అధికారాలలో వివాహాలకు సంబంధించిన కొన్నిటి గురించి ముందుగా చెప్పకొందాం. మనువు యిలా చెప్పాడు:

"తొలి వివాహంలో ద్విజులు, తమ వర్ణానికి చెందిన స్త్రీనే చేసుకోవడం వుత్తమం. కాని ఆతర్వాత కూడా మళ్లీ పెళ్లి చేసుకోవాలనే బలమయిన కోరిక కలిగితే వరుస క్రమంలో తక్కువ వర్ణాలకి చెందిన స్త్రీలను చేసుకోవచ్చును." (3-12)

"ఒక శూద్ర స్త్రీ శూద్రునికే భార్య కావాలి. తనూ (శూద్ర స్త్రీ) వైశ్య స్త్రీ వైశ్యునకూ, ఈ ఇద్దరూ (శూద్ర వైశ్య స్త్రీలు) క్షత్రియ స్త్రీ క్షత్రియునకూ, ఆ ముగ్గురూ, బ్రాహ్మణ స్త్రీ, బ్రాహ్మణునకు, భార్యలు కావచ్చును." (3-13)

ఇహ వృత్తులకు సంబంధించిన ప్రత్యేక సౌకర్యాల గురించి మాట్లాడుకుందాం. ఒకవ్యక్తి ఆపదలో చిక్కుకున్నపుడు, దురవస్థలో వున్నపుడు ఏం చేయాలి? అన్న విషయం గురించి మనువు చర్చించేటపుడు ఈ సౌకర్యాలు మరింత స్పష్టంగా కనిపిస్తాయి:

"అయినా ఒక బ్రాహ్మణుడు జీవనోపాధి కోసం పైనుదహరించిన పనుల ద్వారా సాగించలేనపుడు, ఒక యోధునిగా పనిచేస్తూ బ్రతుకవచ్చును. కారణం-అది అతని అంతస్తులో రెండోది." (10-81)

"ఆ రెండు వృత్తుల (బ్రాహ్మణ, క్షత్రియ) వల్లనూ, జీవనం గడవనపుడు ఏం చేయాలి? అని ప్రశ్నిస్తే, దానికి ఇవ్వాల్సిన జవాబు వైశ్య వృత్తి చేపట్టి వ్యవసాయం చేయడం. పశువుల్ని కాయడం అని." (10–82)

"బ్రాహ్మణ క్షత్రియులు, వైశ్య వృత్తిని చేసుకొని పొట్ట పోసుకొంటూ కూడా, వీలయినంత వరకూ కొన్ని పనులను చేయకుండా జాగ్రత్తపడాలి. వీలయితే సేద్యం చేయడానికి దూరంగా ఉండాలి. కారణం–వాటి వల్ల వివేకంగల ప్రాణులకు చాలా కష్టం కలగడమే కాక వాటిలో ఎద్దులవంటి ఇతరుల కష్టం మీద ఆధారపడవలసి వుంటుంది." (10–83)

"సేద్యం ఉత్తమమని కొందరి అభిప్రాయం. కాని ఇనుప కర్రుగల నాగలితో దున్నడం వల్ల, అది భూమినే గాకుండా, భూమిలోని నివసించే జీవరాశులను సయితం గాయపరుస్తుంది. అందువలన ఉదార స్వభావం గలవారు ఈ వృత్తిని నిందిస్తూ వుంటారు." (10–84)

"గౌరవప్రదమైనంత ఆర్జన లేని కారణంగా వారు (బ్రాహ్మణ, క్షత్రియులు) తమ మంచి మంచి వృత్తులను అనుసరించలేకపోతే వారు వ్యాపారులుగా సాధారణంగా అమ్మే వస్తువులను – అమ్మకూడని వస్తువులను మినహాయించి – అమ్ముతూ ధనార్జన చేయవచ్చు" (10–85)

"అన్ని రకాల మద్యాలను, వండిన అన్నాన్ని, నువ్వులనూ, రాళ్లనూ, ఉప్పునూ, పశువులనూ, మనుషులనూ వారు అమ్మకూడదు." (10–86)

"ఎర్రని నేత వస్త్రాలనూ, నార, పట్టు, ఊలు వస్త్రాలను–అవి ఎరుపు రంగువి కాకున్నా కూడా–పళ్లనూ, మూలికలనూ, మందుల కోసం వుపయోగించే మొక్కలనూ (అమ్మకూడదు)." (10–87)

"నీటిని, ఇనుమును, విషాన్నీ, మాంసాన్నీ, సోమ (రసానికి ఉపయోగడమే) మొక్కలనీ, అన్ని రకాలయిన పరిమళ ద్రవ్యాలనూ, పాలనీ, తేనెనీ, మజ్జిగనూ, నేతినీ, నువ్వుల నూనె, మైనం, బెల్లం, దర్భ గడ్డినీ (అమ్మకూడదు)." (10–88)

"లేడి వంటి అన్ని అడవి జంతువులనూ, కోరలు గల క్రూర మృగాలనూ, పక్షులనూ, చేపలనూ, మత్తెక్కించే మద్యాలనూ, నీలి మందునీ– లక్కనూ, ఒంటి గిట్టలు గల జంతువులనూ (అమ్మరాదు)." (10–89)

"కానీ బ్రాహ్మణ రైతు తాను పండించిన నువ్వులను వాటిని ఎక్కువ ధరకు అమ్మాలనే ఆపేక్షతో ఎక్కువ కాలం నిలువ వుంచకుండా–పండిన వెంటనే ధర్మ కార్యాలకు అమ్మవ

చ్చును." (10–90)

"నువ్వులను తినడానికీ, అభిషేకానికీ, దానాలకీ కాకుండా, ఇతర పనులకు వుపయోగిస్తే–అతను తన తల్లిదండ్రులతో పాటు కుక్క అశుద్ధంలో పురుగులై పుడతాడు." (10–91)

"మాంసాన్నీ, లక్కనీ, ఉప్పనీ అమ్మడం వల్ల బ్రాహ్మణుడు తక్షణం పతితుడవుతాడు; అదే పాలను వరుసగా మూడు రోజుల పాటు అమ్మితే అతను శూద్రుని స్థాయికి పతనమవుతాడు." (10–92)

"ఏడు రోజులపాటు తనంతతానుగా ఇతర నిషిద్ధ అమ్మకపు సరుకులను అతను (బ్రాహ్మణుడు) అమ్మకం చేస్తే, ఒక వైశ్యుని స్వభావాన్ని పొందుతాడు." (10–93)

"ద్రవ పదార్థాలను ఇతర ద్రవ పదార్థాలకి బదులుగా మార్పిడి చేసుచ్చును. కాని ద్రవంతో ఉప్పని మార్పిడి చేయరాదు. అలాగే వండిన అన్నాన్ని ధాన్యంతోనూ, నువ్వులను పొట్టుగల ధాన్యంతోనూ, సమతూకానికి కానీ, కోలతకి గానీ మారకానికి యిచ్చిపుచ్చుకోవడం చేయవచ్చును." (10–94)

"కష్టాల్లో వున్న బ్రాహ్మణుడు ఎవరి నుంచయినా దానాలు పొందవచ్చును. ఎందుకంటే ఏ సూత్రప్రకారమైనా సరే నిక్కమయిన పవిత్రత కళంకితమవుతుందని చూపలేము." (10–102)

"వేదాలను విశ్లేషిస్తున్నప్పుడు గానీ, యజ్ఞాలకు పౌరోహిత్యం వహిస్తున్నపుడు గానీ, దానాలు పడుతున్నపుడు గానీ, కష్టాలలో ఉన్న పురోహితులు చేసే సాధారణంగా ఆమోదయోగ్యంకాని పనులు చేస్తున్నప్పుడు గానీ బ్రాహ్మణులు చేసేదేదీ పాపం కాదు. కారణం వారు నిప్పులాగా, నీరులాగా స్వచ్ఛమయిన వారు." (10–103)

మనువు ఇతర వర్ణాల వారు అత్యవసర పరిస్థితిలో ఏమి చేయవచ్చునో చెప్పినదాన్ని దీనితో పోల్చి చూడండి. మనువు ఇలా అన్నాడు:

"అధమశ్రేణికి చెందిన ఒక వ్యక్తి, దురాశకు లోనయి, ఉత్తమ శ్రేణి వారు చేసే పనులు చేస్తూ జీవిస్తున్నపుడు, రాజు తక్షణం అతని ధనమంతటినీ గుంజుకొని, అతణ్ణి దేశ బహిష్కరణ చేయాలి." (10–96)

"స్వధర్మాన్ని లోపభూయిష్టంగా నిర్వర్తించినా అది ఇతరుల ధర్మాన్ని చక్కగా నిర్వర్తించడం కంటే ఉత్తమమైనదే. ఎందుకంటే ఇతరుల ధర్మాన్ని నిర్వర్తించే వారు వెంటనే స్వధర్మాన్ని

కోల్పోతారు." (10–97)

"స్వవృత్తి చేయడం వల్ల జీవనం గడవనప్పుడు వైశ్యుడు శూద్రుల సేవక వృత్తి చేసేందుకు దిగజారవచ్చును. అయితే శూద్రుడు చేసే చేయకూడని పనులు చేయకుండా జాగ్రత్త పడాలి. పరిస్థితి మెరుగుపడినపుడు వైశ్యుడు శూద్ర వృత్తిని విడిచిపెట్టాలి." (10–98)

"ద్విజుల సేవచేసే వృత్తి దొరకక, తన భార్య, కొడుకు ఆకలితో అలమటించిపోతున్నపు స్థితిలో శూద్రుడు ఏదైనా చేతివృత్తి చేసుకొని బ్రతుకవచ్చు." (10–99)

"బ్రాహ్మణునికి సేవ చేయడం వల్ల శూద్రునికి జీవనం గడువనపుడు, అతను క్షత్రియుణ్ణి గాని, ఆ అవకాశం దొరకక పోతే ధనవంతుడయిన వైశ్యుణ్ణి గాని సేవించి బ్రతుకవచ్చును." (10–121)

"శూద్రుడు స్వర్గం చేరుకోవాలని గానీ, ఈ జన్మనూ, వచ్చే జన్మనూ బాగుచేసుకోవాలని గానీ బ్రాహ్మణుణ్ణి ఆశ్రయిస్తే, అతని సేవక నామానికి బ్రాహ్మణ శబ్దం జోడించబడడం (బ్రాహ్మణుని సేవకుడు) ద్వారా అతనికి తప్పక విజయం కలుగుతుంది." (10–122)

"బ్రాహ్మణునికి సేవ చేయడమే శూద్రునికి అత్యుత్తమమయిన పని. దానితో పోల్చితే మరే ఇతర పనులైనా నిష్ఫలమైనవి." (10–123)

"శూద్రునికి తమ స్థితిని బట్టి, అతని సామర్థ్యాన్ని బట్టి, అతను చేసే కష్టాన్ని బట్టి, అతనిమీద ఆధారపడిన వారి సంఖ్యను బట్టి సరిపోయేంత భుక్తి బ్రాహ్మణులు కల్పించాలి." (10–124)

"బ్రాహ్మణులు తాము తినగా మిగిలిన అన్నాన్నీ, ఉపయోగించిన దుస్తులనూ, ధాన్యములో ఏరివేసిన చోళ్లు మొదలయిన వాటినీ, పాతబడిపోయిన తమ యింటి సామానులను శూద్రులకు యివ్వాలి." (10–125)

"శూద్రుడు వెల్లుల్లి వంటి నిషిద్ధమైన కూరగాయలు తినడంలో తప్పులేదు. అతడు పవిత్ర కర్మలు చేయరాదు. అగ్నిహోత్ర సంస్కారం వంటి మతకర్మలతో శూద్రులకు ఎలాంటి సంబంధమూ లేదు. అయితే తన విధ్యుక్త ధర్మంగా బలిగా అర్పించడంపై నిషేధం లేదు." (10–126)

"శూద్రులు సయితం తాము చేయవలసిన విధులన్నీ చేయాలనే ఆతురతతో ఉండి తన

ధర్మాన్ని తెలుసుకొని ఉంటే గృహస్థ సంస్కారాలు నిర్వహించడంలో (మిగతా మూడు వర్ణాల) ఉత్తముల ఆచరణలననుసరించవచ్చు. కానీ ప్రార్థనలు, కీర్తనలు తప్ప మరే ఇతర పవిత్ర మంత్రాలనూ వాడరాదు. అటువంటి వారికి ఏ పాపమూ రాకపోగా వారు ప్రశంసాపాత్రులవుతారు. (10–127)

"శూద్రునిగా, ఒకరిని కష్టపెట్టకుండా, ద్విజుల పట్ల ఆచరించాల్సిన విధులను తు.చ. తప్పకుండా ఆచరించడం వల్ల కూడా తాను ఏ నిందలూ పడకుండా ఇహపరములు రెంటిలోనూ ప్రశంసలు పొందుతాడు." (10–128)

"శూద్రుడు తన అవసరానికి మించి సంపద పోగు చేయరాదు. సేవక వృత్తి చేసేవాడు గనక, అట్లా అత్యధిక ధనం సంచయం చేస్తే వాడు తలకి పొగరెక్కి, అహంకారంతో లేక అశ్రద్ధ చేయడం ద్వారా బ్రాహ్మణుల మనసులను బాధపెడతాడు." (10–129)

ఈ విషయాన్ని ఆయన (మనువు) ఇలా ముగించాడు:

"ఈ విధంగా నాలుగు వర్ణాలు వారికీ ఆపదలో చేయదగిన వివిధ ఆపద్ధర్మాలను పూర్తిగా ప్రకటించడమైనది. వీటిని చక్కగా ఆచరించడం ద్వారానే వీరు ఉత్తమ సౌభ్యాలను పొందుతారు." (10–130)

కొందరికి (కొన్ని వర్ణాల వారికి) లభించిన ఈ సౌకర్యాలు సాంఘికమైనవి మాత్రమే కావు, ఆర్థికపరమయినవి కూడా. మనువు ఇలా అంటాడు.

"ఇక్కడ లభించిన నిధి నాది" అని నిజం చెప్పిన వ్యక్తి నుంచి, రాజు–దానిని సంరక్షించినందుకు గాను ఆ సొమ్ము నుంచి ఆరవ భాగాన్ని గాని, పన్నెండవ భాగాన్ని గాని తీసుకోవచ్చు." (8–35)

"తనది కానిదాన్ని (నిధిని) తనదని అబద్ధం చెప్పినట్లయితే రాజు అతని ఆస్తిలో ఎనిమిదో వంతు శిక్షగా వసూలు చేయవచ్చు. లేదా తానిలా అబద్ధం చెప్పి పొందిన వస్తువుల విలువను న్యాయంగా లెక్కకట్టి, అందులో కొంతభాగం అతన్నుంచి రాజు తీసుకోవచ్చు." (8–36)

"విద్యావంతుడయిన బ్రాహ్మణుడు, తనకి భూమిలో ఎవరో పాతిపెట్టిన నిధి లభిస్తే, దానిలో ఎలాంటి తగ్గింపూ లేకుండా మొత్తాన్ని తీసుకోవచ్చు. కారణం–బ్రాహ్మణుడు సర్వానికీ ప్రభువు గనక." (8–37)

"కానీ భూమిలో నిక్షిప్తమయి వున్న నిధిని ఇతరులు (బ్రాహ్మణేతరులు) గానీ, రాజుగానీ

కనుగొన్నట్టయితే, అందులో సగభాగాన్ని బ్రాహ్మణులకు పంచియిచ్చి, మిగతా సగభాగాన్ని రాజు కోశాగారానికి జమ కట్టించవచ్చు." (8–38)

"ఎంతకీ నయంకాని రోగం వల్ల రాజు చావుకి దగ్గరయినపుడు, తన సిరిసంపదల న్నింటినీ పురోహితులకు పంచిపెట్టి, రాజ్యాన్ని కొడుకుకి కట్టబెట్టి, తాను యుద్ధం చేస్తూ ప్రాణత్యాగం చేయవచ్చు. ఒకవేళ యుద్ధం లేకపోతే ఆహారం తీసుకోవడంమానివేసి చావుని వరించవచ్చు." (9–323)

"రాజు–వస్తువుల కొనుగోలు, అమ్మకం ధరలను తెలుసుకొని, సరుకు ఎంత దూరం నుంచి తెచ్చిందీ, దారి భత్యానికి అయిన ఖర్చు, రక్షణకి అయిన ఖర్చు, నికర లాభమెంతో తెలుసుకొని, అమ్మకపు సరుకు మీద వర్తకుల నుంచి పన్నులు వసూలు చేయవచ్చు." (7–127)

"అన్ని అంశాలను క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాత, రాజు తన రాజ్యంలో క్రమం తప్పకుండా ఈ పన్నులు వసూలు చేయాలి. అయితే తమ వివిధ విధులను నిర్వర్తించినందుకు గాను రాజూ, వర్తకుడూ ఎవరికి రావలసిన పరిహారాన్ని వారు పొందవచ్చు." (7–128)

"జలగ రక్తాన్నీ, గిత్త తల్లిపాలనీ, తేనెటీగ తేనెనీ ఎలా కొద్దికొద్దిగా తీసుకొంటాయో, అదే విధంగా రాజు తన రాజ్యం నుంచి వార్షిక పన్నులు వసూలు చేయాలి." (7–129)

"ప్రతి ఏడాదీ మూలం కన్నా ఎక్కువయిన పశుధనాన్నించీ, మణుల నుంచీ, బంగారం నుంచీ, వెండి నుంచీ ఏభయ్యో వంతూ, ధాన్యం నుంచి ఎనిమిదో వంతూ లేదా ఆరోవంతూ లేదా పన్నెండో వంతూ రాజు (పన్నుగా) వసూలు చేయవచ్చు. అయితే భూసారాన్ని బట్టి, పండించడానికి అయిన కూలిని బట్టి యీ వంతుని నిర్ణయించాలి." (7–130)

"వృక్షాలు, మాంసం, తేనె, నెయ్యి, పరిమళ ద్రవ్యాలు, ఔషధ పదార్థాలు, మదిరలు, పుష్పాలు, మూలికలు, పళ్లు–ఏటికేడాది వీటిపై జరిగే అభివృద్ధిలో ఆరోవంతును కూడా వసూలు చేయవచ్చు." (7–131)

"ఏరుకొని వచ్చిన విస్తరాకుల మీద, కుండల్లో వుంచే మూలికలు మీద, గడ్డి మీద, చర్మంతో లేదా వెదురుతో చేసిన పాత్ర మీద, మట్టికుండల మీద, రాతితో చేసిన అన్ని వస్తువుల మీద పన్నులను రాజు (పైవిధంగానే) వసూలు చేయవచ్చు." (7–132)

"రాజు ఆర్థికలోపం వల్ల చస్తున్నప్పటికీ వేద పండితుడైన బ్రాహ్మణుని నుంచి పన్ను వసూలు చేయరాదు. ఆ రాజ్యంలో నివసించే శ్రోత్రియ బ్రాహ్మణులకు ఆకలి బాధ కలుగనీ

యరాదు." (7-133)

"ఏ రాజు రాజ్యంలో అయితే శ్రోత్రియ బ్రాహ్మణుడు ఆకలితో అలమటిస్తాడో అవతి కాలంలోనే ఆ రాజ్యం కరువు వాతను పడుతుంది." (7-134)

"తన రాజ్యంలో చిన్నచిన్న వర్తకాలు చేసుకొని జీవించే పంచార బడుగు వ్యాపారస్తుల నుంచి వార్షిక పన్ను రూపేణా రాజు బహు స్వల్పంగా పన్ను విధించవచ్చు." (7-137)

"కాయకష్టంతో బతికే చేతివృత్తుల వారు, శిల్పులు, సేవలు చేసేవారి నుంచి రాజు ప్రతి నెలా ఒకరోజు పాటు వెట్టి చాకిరీ చేయించుకోవచ్చు." (7-138)

"గ్రుడ్డివాడు, పిచ్చివాడు, కుంటివాడు, డెబ్బయి ఏళ్లపైబడిన ముసలివాడు, పండితులైన పురోహితులకు గొప్పగా ప్రయోజనం చేకూర్చేవాడు వీరెవరినీ పన్నులు కట్టమని ఏరాజూ నిర్బంధించరాదు." (8-394)

"యుద్ధం, ఆక్రమణల వంటి అత్యవసర పరిస్థితులలో, ప్రజలను తన శాయశక్తులా రక్షించేటటువంటి రాజు పంటలో నాలుగోవంతు పన్ను తీసుకున్నా అది పాపం కాదు." (10-118)

"రాజు చేయాల్సిన ప్రత్యేకమయిన పని యుద్ధంలో విజయం సాధించడము. ఎట్టి పరిస్థితిలోనూ, రాజు యుద్ధ భూమిలో వెనుకంజ వేయరాదు. ఆయుధాలు ఉపయోగించి వైశ్యులనూ, గృహస్థులను రక్షిస్తూ, అలా వారిని పరిరక్షించేందుకు మూల్యం రూపంలో రాజు న్యాయమయిన పన్ను వసూలు చేయవచ్చు." (10-119)

"రాజ్యం సౌభాగ్యవంతంగా వున్నపుడు వర్తక వ్యాపార వర్గాల నుంచి, పండిన పంటలలో పన్నెండో వంతు; వ్యక్తిగత లాభాలలో ఏభయ్యో వంతు పన్నుగా వసూలు చేయవచ్చు." అదే రాజ్యం క్లిష్ట పరిస్థితిలో వున్నపుడు పండిన పంటలో ఎనిమిదవ వంతు, లేక మధ్యస్థంగా ఆరవ వంతు, గొప్ప ఆపద సంభవించినపుడు నాల్గో వంతు దాకా పన్నుగా వసూలు చేయవచ్చు. కానీ పెట్టుబడి మీద, యితర చరాస్తుల మీద వచ్చే లాభాల్లో ఇరవయ్యో భాగమే అత్యధిక పన్ను వసూలు చేయాలి. ఇంక శ్రామికులు, చేతివృత్తుల వారు, మెకానిక్కులు, తాము శ్రమచేసి రాజుకు సహాయపడాలి. కానీ ఎన్నడూ పన్నుకట్టరు. (10-120)

"ఔరసపుత్రుడు మొదలయిన సగోత్రులను సపిండులు అంటారు. చనిపోయిన వారి ఆస్తిని సపిండులలో సన్నిహితుడైన పురుషుడుగానీ, స్త్రీగానీ పొందాలి. వారు లేకపోతే

చనిపోయిన వారి ఆస్తి అధమం వంశపారంపర్యంగా చెందవలసిన వారికి దక్కాలి. ఆతర్వాత సపిండులు, వారి సంతతి లేక దాయాదులు వారసులవుతారు, లేదా గురువుగారు లేదా శిష్యుడు లేదా సహాధ్యాయులు ఆ ఆస్తిని తీసుకోవాలి." (10–187)

"పై చెప్పిన వారెవరూ లేకుండా వున్నట్లయితే, మూడు వేదాలనూ అధ్యయనం చేసి, శారీరకంగానూ, మానసికంగానూ, పవిత్రులయిన, ఇంద్రియోద్రేకాలను జయించిన బ్రాహ్మణులు ఆ మృతుని ఆస్తిని పొందాలి. చనిపోయినవారికి ఆ బ్రాహ్మణులు పిండదానాలు చేయాలి. అలా చేయడం వల్ల శ్రాద్ధం వంటి విషయాల్లో ధర్మహాని జరగదు." (9–188)

"చనిపోయిన బ్రాహ్మణునికి వారసులు లేకపోయినా, ఆ ఆస్తిని రాజు ఎన్నడూ తీసుకోరాదు. ఇది ఒక శాశ్వత సూత్రం. కాని వారసులు లేని ఇతర వర్ణాల మృతుల ఆస్తుల్ని రాజు కోశాగారంలో కలిపేసుకోవచ్చును." (9–189)

వివిధ వర్ణాల మధ్య పరస్పర సంబంధాలలో అనుసరించాల్సిన నియమ నిబంధనలను గురించి– మనువు కొన్ని సూత్రాలను నిర్దేశించాడు. అవి హిందూ గృహ్యాధర్మసూత్రాలలో ముఖ్యమైన భాగం.

మనువు యిలా విధిస్తున్నాడు:

"ఉత్తమ జన్మ వల్లనూ, ఉన్నతమైన జన్మ మూలం వల్లనూ, ధర్మ శాస్త్రాల పట్ల సరైన జ్ఞానం అధికంగా ఉండడం వల్లనూ, యజ్ఞోపవీతపు విశిష్టత వల్లనూ బ్రాహ్మణుడు అన్ని వర్ణాలకూ ప్రభువు." (10–3)

"అగ్ని–అది (యజ్ఞ వేదిక యందు) వుపయోగపడినా, ఉపయోగపడకపోయినా–ఎలా మహాదేవత అవుతుందో, అదే విధంగా మూర్ఖుడయినా, విద్యావంతుడయినా బ్రాహ్మణుడు కూడా గొప్ప దేవుడని గ్రహించాలి." (9–317)

"ఈ విధంగా, బ్రాహ్మణులు అన్నిరకాలయిన నికృష్టమయిన వృత్తులు చేపట్టినప్పటికీ, వారిలో ప్రతి ఒక్కరూ మహోన్నత దేవతయే. కాబట్టి వారిని తప్పక గౌరవించాలి." (9–319)

"క్రమం తప్పకుండా తమతమ విధులను నిర్వర్తించే అన్ని వర్ణాలనీ, తొలి వర్ణం (బ్రాహ్మణ) నుంచి అంతిమవర్ణం (శూద్ర) దాకా అందర్నీ పరిరక్షించేందుకు రాజు సృష్టింపబడినాడు." (7–35)

"ఉత్తములయిన మంత్రుల సహాయ సహకారాలతో ప్రజలను రక్షించడానికి రాజు చేయాల్సిన దానిని క్రమంగా ధర్మసందేశం ప్రకారము నేను చెబుతున్నాను." (7–36)

"రాజు ఉదయాన్నే లేచి, మూడు వేదాలనూ చదివిన, రాజ్యతంత్రము బాగా తెలిసిన బ్రాహ్మణులను పూజించి, వారిచ్చే సలహాలనూ, సూచనలనూ అనుసరించాలి." (7–37)

"ధర్మ నిష్ఠ గల, వృద్ధులయిన, ధర్మశాస్త్ర గ్రంధాలను అధ్యయనం చేసిన, పవిత్రముల యిన శరీరమూ, మనసూ గల బ్రాహ్మణులను రాజు నిరంతరమూ గౌరవించాలి. వృద్ధులను గౌరవించే వారిని క్రూరమయిన రాక్షసులు సయితం నిత్యమూ సగౌరవంగా చూస్తారు." (7–38)

"అతి తీవ్రమైన ఆర్థిక లేమి కారణంగా కూడా రాజు బ్రాహ్మణుల ఆస్తులను స్వాధీనం చేసుకొని వారికి కోపం తెప్పించరాదు. బ్రాహ్మణులకు కోపం వస్తే వారు వెంటనే యజ్ఞం చేసి సబలవాహనుడైన రాజును కూడా శపించి, నాశనం చేయగలరు." (9–313)

రాజకీయ జీవితంలో సంబంధాలు యిలా ఉన్నాయి. వివిధ వర్ణాల వారి మధ్య వుండాల్సిన సాధారణ సాంఘిక సంబంధాలను గురించి, మనువు ఈ దిగువ సూత్రాలను రూపొందించాడు:

"గృహస్థు యింట్లో ఐదు వధ్య స్థానాలు, లేక చిన్న చిన్న జీవులను చంపే అవ కాశం ఉన్నచోట్లు ఉన్నాయి. అవి–పొయ్యి, సన్నెకల్లు, చీపురు, రుబ్బురోలు, నీళ్లకుండ. వీటిని వుపయోగించడం ద్వారా గృహస్థు పాపాలకు బద్ధుడవుతున్నాడు." (3–68)

"గృహస్థు యింట్లో ఆయాచోట్ల అజ్ఞానంతో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ప్రతిరోజూ ఐదు సంస్కార కర్మలు చేయాలని మహర్షులు నిర్ణయించారు." (3–69)

"వేదాల బోధన, అధ్యయనం, వేదకర్మ లేక బ్రహ్మకర్మ; పిండ, జల ప్రదానాలు పితృకర్మ. హోమము దేవకర్మ. జీవులకు తిండి పెట్టడం భూతకర్మ. అతిథి పూజ మనుష్య కర్మ." (3–70)

"ఈ ఐదు సంస్కార కర్మలను తమ సామర్థ్యాన్ని బట్టి ఎవరైతే చేస్తారో, వారికి ఇంట్లో నివసిస్తున్నందువల్ల కలిగే సూనదోషాలు అంటవు." (3–71)

"దేవతలందరికీ యింట్లో ముట్టించిన అగ్ని మీద అన్నం వండి, హోమం చేసి, రోజూ

బ్రాహ్మణుడు ఈ దిగువ విధంగా దేవతలకు నైవేద్యం పెట్టాలి." (3-84)

ఈ విధంగా దేవతలకు ఆహారాన్ని అర్పించిన తర్వాత మనువు యిలా ఆదేశిస్తున్నాడు.

"కుక్కలకు; జాతిభ్రష్టులకు, కుక్క మాంసం తినేవారికి; బోదకాలు, క్షయ రోగాలతో శిక్షించబడే-పాపులకు, కాకులు, పాముల వంటి పాకుడు జంతువులకు పెట్టవలసిన అన్నాన్ని కొద్ది కొద్దిగా బ్రాహ్మణుడు నేల మీద పడవేస్తూ వుండాలి." (3-92)

ఆతిధ్యానికి సంబంధించిన నియమాలను యింటి యజమాని ఎలా నిర్వర్తించాలో మనువు యిలా చెబుతాడు:

"ఒకరి యింటికి వచ్చి ఒకే రాత్రి వుండే బ్రాహ్మణుణ్ని అతిథంటారు. అతను చాలా స్వల్ప కాలమే నివసిస్తాడు. తిథంతా, అంటే చాంద్ర దినం అంతా, పూర్తిగా వుండడు." (3-102)

"నిజమైన జ్ఞానమూ, పవిత్ర తలతో జ్వలించే బ్రాహ్మణుని జిహ్వాగ్నికి అర్పించిన నైవేద్యం, గృహస్థును తీవ్ర వ్యధ నుంచీ, భయంకరమైన పాపం నుంచీ కూడా విముక్తి చేస్తుంది." (3-98)

"అత్యుత్తమ అతిథికి శ్రేష్టమయిన స్థాయిలోనూ, అట్టడుగు వ్యక్తికి నికృష్టమయిన రీతి లోనూ, సమాన స్థాయి వ్యక్తికి సమాన స్థాయిలోనూ, వారివారి అర్హతలను బట్టి వారికి ఆసనాలు, విశ్రాంతి తీసుకొనేందుకు మంచాలు, పరుపులు చూపించి వారు యింట్లో వున్నంత కాలమూ గౌరవించి, వారు వెళ్లిపోయేటప్పుడు ఉచితరీతిన సాగనంపవలెను." (3-107)

"బ్రాహ్మణుని యింట ఓ క్షత్రియుడు నిర్దేశిత అతిథి గాడు; అలాగే వైశ్యుడూ, శూద్రవర్ణానికి చెందినవాడు కూడా. అలాగే అతని (బ్రాహ్మణుని) ఆత్మీయ మిత్రుడు, రక్త సంబంధీకుడూ అతిథులు కారు. అలాగే అధ్యాపకుడు కూడా కాడు." (3-110)

"కాని ఒకవేళ అతని (బ్రాహ్మణుని) యింటికి క్షత్రియుడు అతిథిగా వస్తే, బ్రాహ్మణులు భోజనం చేసిన తర్వాతనే క్షత్రియునికి కావలసిన విధంగా ఆహారము వండించి పెట్టాలి." (3-111)

"బ్రాహ్మణుని యింటికి వైశ్యుడూ, శూద్రుడూ అతిథులుగా వస్తే, తన దాతృత్వ గుణం చూపి అతను వారికి తప్పక తిండిపెట్టాలి. అయితే తన యింటి నౌకరులతో పాటు మాత్రమే

పెట్టాలి." (3–112)

ఒక వర్ణానికీ మరొక వర్ణానికీ మధ్య సాంఘిక హోదాకి సంబంధించి మనువు ఎంతో ఆపత్తికరమయిన కొన్ని ఆదేశాలను కొన్ని ఇచ్చాడు. ఆయన రూపొందించిన సమీకరణం యిలా వుంది.

"పదేళ్ల బ్రాహ్మణుణ్నీ, నూరేళ్ల క్షత్రియుణ్నీ, తండ్రీ కొడుకుల్లా భావించాలి. ఆ యిద్దరిలోనూ బ్రాహ్మణ బాలుణ్ని తండ్రిగానే గౌరవించాలి." (2–135)

"ధనం, బంధుత్వం, వయోధిక్యత, నైతిక ప్రవర్తన, చివరగా వేదార్థతత్వ జ్ఞానం—యివన్నీ మనుషుల్ని గౌరవనీయుల్ని చేస్తాయి. కాని పైన ఉదహరించిన వాటన్నిటిలోనూ చివరి అంశం అత్యంత గౌరవాస్పదమైనది." (2–136)

"తొలి మూడు ఉత్తమ (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య) వర్ణాలకు చెందిన ఏ వ్యక్తయినా పైన చెప్పిన ఐదు అర్హతల్లోనూ—ఎక్కువ అర్హతలూ, స్థాయి సంపాదించితే అత్యుత్తమ గౌరవాన్ని పొందుతాడు. అలాగే పదవ దశాబ్దంలోకి అడుగు పెట్టిన శూద్రుడు కూడా." (2–137)

"రథం మీద వేళ్ళేవారికీ, తొంభై ఏళ్లు పైబడిన వానికీ, రోగిష్టికీ, బరువు మోస్తున్న వానికీ, స్త్రీకీ, గురువు యింటి నుంచి తిరిగి వస్తున్న పురోహితునికీ, రాజుకీ, పెళ్ళి కొడుక్కీ పక్కకు తొలిగి దారినివ్వాలి." (2–138)

"పైన చెప్పిన వారంతా ఒకేసారి ఎదురైతే, యింటికి తిరిగి వస్తున్న పురోహితుడ్నీ, రాజునీ మిగిలిన వారికన్నా ఎక్కువగా గౌరవించాలి. ఆ యిద్దరిలోనూ యింటికి తిరిగి వస్తున్న పురోహితుడు రాజుకన్నా ఎక్కువ గౌరవనీయుడు." (2–139)

సాంఘిక హోదాకి సంబంధించిన సూత్రాలను ఉదహరిస్తున్నపుడు, అభివందనకు సంబంధించిన నియమాలను గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి:

"పెద్దవాళ్లని చూడగానే లేచి నమస్కరించే స్వభావం, వారి పట్ల అచంచలమైన గౌరవం వున్న యువకునికి నాలుగు విధాల అభివృద్ధి కలుగుతుంది. అవి ఆయుష్షు, విద్య, పేరుప్రఖ్యాతులు, బలం." (2–221)

"నమస్కారము' అన్న వెంటనే బ్రాహ్మణుడు పెద్దవారితో యిలా అనాలి.—"ఫలానా పేరు గల నేను....." అని తన పేరు చెప్పుకోవాలి. (2–122)

"కొందరు సంస్కృత భాష తెలియనివారు తన పేరు యొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించ కపోతే వారితో విజ్ఞుడు యిలా చెబుతాడు.-"అంటున్నది నేను" అని అన్ని వర్ణాల స్త్రీలను అదేవిధంగా అతడు సంబోధిస్తాడు." (2-123)

అదేవిధంగా అతడు అన్ని వర్ణాల స్త్రీలనూ సంబోధిస్తాడు.

"అభివాదం చేసి తన పేరు చెప్పిన తర్వాత 'భో' అంటూ శబ్దం చేయాలి. విజ్ఞుల అభిప్రాయంలో 'భో' ధాతువుకు పూర్తి పేరుతో సమాన లక్షణాలున్నాయి." (2-124)

"ఒక బ్రాహ్మణుడు, తనకు చేసిన నమస్కారానికి మారుగాయిలా చెప్పాలి: "ఆయుష్మాన్భవ, సౌమ్య" అని ఆశీర్వదించాలి. అతని పేరుకు చివర అచ్చును దీర్ఘంగా వుచ్చరించాలి. ఆ పేరు హలంత పదమయితే ఆ పొల్లు అక్షరానికి ముందున్న అచ్చును దీర్ఘంగా మూడు మాత్రల కాలం పాటు పలుకవలెను.(2-125)

"అభివాదానికి ప్రత్యభివాదం చేయడం తెలియని బ్రాహ్మణుడు శూద్రునితో సమానము. అందువల్ల అతనికి విద్యావంతుడు అభివాదము చేయరాదు." (2-126)

"విద్యావంతుడు, తనను కలిసిన పురోహితుణ్ని "మీ భక్తి అభివృద్ధి చెందుతుందా" అనీ, క్షత్రియుణ్ని (యుద్ధంలో) 'మీరు గాయపడలేదు గదా' అనీ, వైశ్యుణ్ని 'మీ ఆస్తి భద్రమే గదా' అనీ; శూద్రుణ్ని 'ఆరోగ్యంగానే వున్నావు గదా' అనీ ప్రశ్నించాలి. వారిని వరుసగా కుశలమా, అనామయమా, క్షేమమా, అనారోగ్యము లేదు గదా! అని అడుగవలెను." (2-127)

మతం గురించి, మత సంస్కారాలను గురించీ, యజ్ఞం గురించి మనువు నిర్దేశించిన నియమాలు గుర్తు పెట్టుకోదగ్గవి.

మత సంస్కారం గురించి, యజ్ఞాలను గురించి మనువు యీ క్రింది విధంగా ఆదేశాలు జారీ చేశాడు.

"గృహస్థుడు ఐదు ప్రదేశాలలో వధ చేస్తాడు. లేక చిన్నచిన్న జంతువులను చంపుతాడు. ఆ ప్రదేశాలు ఏవంటే-అతని పొయ్యి, సన్నెకల్లు, చీపురుకట్ట, రోలు, రోకలి, నీళ్ళ బిందె-అనేవి. వీటిని ఉపయోగించేటప్పుడు పాపంచేత బద్ధుడు అవుతాడు." (3-68)

"పై వాటివల్ల కలిగే పాపాన్ని తొలగించుకోవడానికి గృహస్థులు వరుసగా పంచ సంస్కార కర్మలు ప్రతిరోజూ ఆచరించాలని గొప్పవారైన ఋషులు నిర్దేశించారు." (3-69)

"వేదాల్ని చదవటం, చెప్పటం–వేద (బ్రాహ్మం) కర్మ. పిండమూ నీటితో తర్పణాన్ని వదలటం పితృకర్మ. హోమం చేయటం దేవకర్మ. ధాన్యాన్ని గాని లేక ఇతర తినే పదార్థాలు జంతువులకు ఇవ్వటం భూతకర్మ. అతిథిపూజ మనుష్య కర్మ. ఇవీ పంచయజ్ఞాలు." (3–70)

"పంచ సంస్కార కర్మ క్రమం తప్పకుండా రోజూ ఎవరి శక్త్యనుసారం వారు ఆచరించాలి. వీటిని విడువకుండా ఎవడైతే చేస్తాడో అతడు ఇంట్లో వున్న సూనదోషాల్ని పొందడు." (3–71)

దీని తర్వాత–అందరూ ఈ కర్మల ఫలాన్ని పొందటానికి అర్హులు కారనీ; వీటిని ఆచరించటానికి అందరికీ హక్కు లేదని మనువు చెబుతాడు.

ఈ సంస్కార కర్మలు చేయటంలో శూద్రుల, స్త్రీల స్థితిని మనువు ఇలా నిర్వచిస్తాడు. మనువు దృష్టి ప్రకారం స్త్రీలు:

"స్త్రీల శరీరాలు పరిపూర్ణతను సంతరించుకోవాలి. అంటే జంధ్యం మినహా, అవే సంస్కారం స్త్రీలకు కూడా అదే వయసులో, అదే క్రమంలో నిర్వహించాలి. అయితే స్త్రీలకు వాటిని నిర్వహించేటప్పుడు వేదమంత్రాలు చదవవలసిన అవసరం లేదు." (2–66)

శూద్రుల విషయంలో, మనువు యిలా చెప్పాడు:

"శూద్రులు సయితం తాము చేయవలసిన విధులను తెలుసుకొని పూర్తిగా వాటిని ఆచరిస్తూనే, గృహస్థ సంస్కారాలు నిర్వహించడంలో (మిగతా మూడు వర్ణాల) ఉత్తముల ఆచరణను అనుసరించవచ్చు. ఏ పవిత్ర మంత్రాలూ వాడకుండా కేవలం ప్రార్థనలూ, కీర్తనలతోనే వారు ఈ కర్మలు చేయాలి. అందులో ఎలాంటి పాపమూ లేదు. పైగా వారు (ఆ శూద్రులు) ప్రశంసాపాత్రులవుతారు.

ఒక వ్యక్తికి జంధ్యం వేసే కర్మకాండ, అతి ముఖ్యమైన మత సంస్కారం.

"గర్భాష్టకమనగా, ఏడవ సంవత్సరంలో బ్రాహ్మణునికీ, పదకొండవ సంవత్సరంలో క్షత్రియునికీ, పన్నెండవ సంవత్సరంలో వైశ్యునికీ, తండ్రి ఉపనయనం చేయాలి." (2–36)

"తన కొడుకు బ్రహ్మజ్ఞానం పొందాలని కోరే బ్రాహ్మణుడు బాలుని అయిదవ ఏట; తన కొడుకు శక్తివంతుడు కావాలని కోరే క్షత్రియుడు బాలుని ఆరవ ఏట; తన పుత్రుణ్ణి వర్తకంలోకి దింపాలనుకునే వైశ్యుడు పిల్లవాని ఎనిమిదవ ఏట కూడా ఉపనయనం చేయించవచ్చు."

(2-37)

"బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు వరుసగా పదహారు, ఇరవై రెండు, ఇరవై నాలుగేళ్లు దాటకుండానే గాయత్రీ మంత్రం ఉపదేశించాలి." (2-38)

"ఆతర్వాత, ఉపనయనం కాని పై మూడు వర్ణాల బాలకులు 'వ్రత్యులు' లేక వర్ణభ్రష్టులవుతారు. 'గాయత్రి'కి దూరమై విజ్ఞుల నిందలకు గురియౌతారు." (2-39)

'గాయత్రి' ఒక మంత్రం. దాని ప్రాధాన్యాన్ని మనువు యిలా చెబుతాడు:

"బ్రహ్మ మూడు వేదాల అకార, ఓకార, మకారాలను పితికాడు. అవి కలిసి ఓంకారమయ్యాయి. వాటితోపాటు "భూః భువః సువః" అంటే భూమి, ఆకాశం, స్వర్గం చేరాయి." (2-76)

"మూడు వేదాల నుంచీ, పరమ స్థానంలో సృష్టికర్త అయిన బ్రహ్మ 'తత్' అనే పదం మొదలుగాగల సావిత్రి లేక గాయత్రి మంత్రం మూడు పాదాలనూ కూడా పితికేడు. (2-77)

"ఓంకారయుక్త త్రిపద గాయత్రిని ఉభయ సంధ్యల్లోనూ జపించే వేదాధ్యాయి అయిన పురోహితునికి మూడు వేదాలు పఠించడం వల్ల కలిగే పుణ్యఫలం లభిస్తుంది." (2-78)

"వెయ్యి పర్యాయాలు చొప్పున ఆ మూడింటినీ (ఓం, వ్యాహృతి, గాయత్రి) జపించే ద్విజుడు నెలరోజులపాటు అలా జపిస్తే, పాము కుబుసం విడిచినట్టుగా, మహాపాపం నుంచి సయితం విముక్తుడవుతాడు." (2-79)

"బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు గనుక సకాలంలో సంధ్య వార్చడం, గాయత్రిని జపించడం విడిచినట్లైతే సజ్జనుల నిందకు గురవుతారు." (2-80)

"ఓంకారము మొదలైన వ్యావృత్తులు మూడు, మూడు పాదాలు గల గాయత్రి వేదానికి ముఖం వంటిది లేక వేదం తాలూకు ప్రధాన భాగం." (2-81)

"మూడు సంవత్సరములపాటు ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఎవరైతే ప్రణవ వ్యాహృతితో కూడిన గాయత్రిని జపిస్తాడో, అతను పరబ్రహ్మకు చేరువవుతాడు. వాయు సమానమైన చలనం, కామచారుడైన బ్రహ్మ స్వరూపం పొందుతాడు." (2-82)

"స్వరూపం ఓంకారం పరమాత్మ. పరమాత్మ మీద మనసును నిలిపిన ప్రాణాయామం ముక్తిహేతువు. అయితే ఏదీ కూడా గాయత్రి కంటే గొప్పది కాదు. మౌనంకంటే సత్యవచనం ఉత్కృష్టం." (2-83)

"వేదవిహితమైన యాగాలూ, హోమాలూ అన్నీ స్వరూపం చేతనూ, ఫలం చేతనూ నశించును. అలా నాశనం కానిది 'ఓం' కారం. అందుకే దానిని అక్షరం (నాశనం లేనిది) అంటారు. అది భగవంతునికి చిహ్నం. అతను సర్వజీవరాశులకూ ప్రభువు."(2-84)

"దేవుని నామాన్ని మాటిమాటికీ ఉచ్చరించడం యజ్ఞాన్ని పదిసార్లు చేయడం కన్నా వుత్తమమైనది. ఏ మనిషి దానిని వినకపోతే వందసార్లు చేయడంకన్నా శ్రేష్ఠం. అదీ కేవలం మనసులోనే జపిస్తే వెయ్యి యజ్ఞాలకంటే వుత్తమం." (2–85)

"సవ్యంగా చేసిన నాలుగు గృహ కర్మలూ కలిపి కూడా గాయత్రిని జపించడమనే యజ్ఞంలోని పదహారవ భాగంతో సమానం కావు." (2–86)

ఉపనయనం నూతన జన్మతో సమానం.

"తల్లిదండ్రులు తమ పరస్పర ఆనందం కోసం కలియడం వల్ల తల్లి గర్భంలో పడడం ద్వారా పొందేది కేవలం మానవ జన్మ మాత్రమేనని తెలుసుకోవాలి". (2–147)

"కాని వేదజ్ఞాని అయిన ప్రధానాచార్యుడు దైవమాత 'గాయత్రి' ద్వారా ప్రసాదించేది నిజమయిన జన్మ. ఆజన్మ జరా, మరణాలకు అతీతమయినది." (2–148)

"ద్విజునికి మొదటి జన్మ తల్లి వల్ల, రెండవది ఉపనయనం వల్ల, మూడవది యజ్ఞదీక్ష వల్లనూ కలుగుతాయి. ఇది వేద విహితము." (2–169)

"వీటిలో పవిత్రమయినది, మౌంజీబంధం, జంధ్యముల ద్వారా గుర్తించబడే ఉపనయవం, ఈ జన్మకి తల్లి గాయత్రి; తండ్రి ఆచార్యుడు." (2–170)

ఈ సంస్కారాన్ని శూద్రులకూ, స్త్రీలకూ మనువు అనుమతించలేదు:

"కానీ ఎవడైతే (బ్రాహ్మణుడు) సాయం ప్రాతస్సంధ్యల్లో చేయాల్సిన జపాల్ని ఆచరించడో అతడు శూద్రునిలా ద్విజుల కర్మలన్నిటిని కోల్పోతాడు." (2–103)

విద్యకీ, జ్ఞానానికీ సంబంధించి సూత్రాలను మనువు నిర్దేశించడం మర్చిపోలేదు. మనువు సార్వజనిక విద్య గురించి పన్నెత్తి మాట్లాడలేదు. ఆయన దాని (సార్వజనిక విద్య) ప్రయోజనాన్ని గుర్తించడం గానీ, దాన్ని అమలు చేయాలని రాజుకి గాని, రాజ్యానికి గాని బాధ్యతగా నిర్దేశించాలని గాని గుర్తించలేదు. పవిత్రమయిన మత సాహిత్యం (అంటే వేదాల అధ్యయనాన్ని) గురించి మాత్రమే మనువు పట్టించుకున్నాడు.

వేదం గురువు వద్ద, ఆయన అనుమతితో నేర్చుకోవాలి. వేదాలను సొంతంగా (గురువు సహాయం లేకుండా) చదవడం గాని, అధ్యయనం చేయటం గాని చేయకూడదు. అలా చేస్తే అది దొంగతనం అవుతుంది.

"గురువు అనుమతి తీసుకోకుండా వేద జ్ఞానం సంపాయించడం, వేదాన్ని దొంగిలించిన దోషంగా భావించాలి. అతను నరకహింస అనుభవిస్తాడు." (2–116)

"స్త్రీలకు వేద మంత్రాలతో ఎలాంటి సంబంధం లేదు. ఆ విధంగా శాస్త్రాన్ని నిర్ణయించడం జరిగింది. మంత్రయుక్త సంస్కారం, పాపం పోగొట్టే మంత్రాల జ్ఞానం లేకపోవడం వల్ల, పాపులయిన స్త్రీలు అసత్యంతో సమానమైన హీనులు. ఇది తిరుగులేని సత్యం." (9-18)

"వేదాధ్యాత వేదాన్ని సస్వరంగా, వర్ణాలను స్పష్టంగా వుచ్చరించకుండా చదువరాదు; శూద్రుని సమక్షంలో కూడా వేదం చదువకూడదు. అలాగే రాత్రి చరమ ఆయామంలో వేదాధ్యయనం మొదలుపెడితే అలసిపోయినా కూడా ఆపి నిద్రపోరాదు." (4-99)

ఈ నిషేధం వ్రాత్యులకూ అంటే మూడు ఉన్నత వర్ణాల నుంచి కుల బహిష్కరణకి గురి అయిన వారికీ వర్తిస్తుంది. మనువు యిలా చెబుతున్నాడు.

"అపవిత్రులయి, వ్రాత్యులయిన వారితో ఏ బ్రాహ్మణుడు కూడా దురవస్థలో బ్రతుకుతెరువు కోసమయినా, భౌతిక సంబంధమున్ననూ బాంధవ్యం వల్ల గాని, వేదాధ్యయనం చేయరాదు. (2-40)

అయోగ్యుల కోసం వేదబోధ, యజ్ఞం చేయడం మనువు నిషేధించాడు.

"వేదం రానివాడు యజ్ఞం చేసినా; స్త్రీగానీ, నపుంసకుడు గానీ యజ్ఞం చేసినా; పురోహితుడు ఆ యాగం ముగిసిన తర్వాత బలిని భుజించడం గానీ, వేదమంత్రాలు చదవడం గానీ చేయరాదు." (4-205)

"యజ్ఞంలో ఆయాజకులు వేసే హవిస్సు సజ్జనులకు దురదృష్టాన్నీ, దేవతలకు అయిష్టతనీ కలిగిస్తుంది గనుక వారిచేత హోమాలు వగయిరాలు చేయించకూడదు." (4-206)

"వర్ణ బహిష్కృతులు చేసే యజ్ఞాన్ని నిర్వహించడం, ముక్కూ మొహం తెలియనివానికి దహనక్రియలు చేయడము, ఒక అమాయకుణ్ణి నాశనం చేయడానికి కర్మకాండలు నిర్వర్తించడం, అహింస అనే పేరుగల అపవిత్ర యజ్ఞాన్ని నిర్వహించడం వంటి పాపాలు చేసినవాడు మూడు ప్రాజాపత్య తపస్సుల ద్వారా ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చును." (10-198)

చట్టం ముందు సమానత్వం గురించి చూద్దాం. సాక్షులుగా వచ్చిన వారు మనువు నిర్దేశించిన ప్రకారం ఈ క్రింది విధంగా ప్రమాణ స్వీకారం చెయ్యాలి.

"న్యాయాధిపతి ఉదయమే తాను స్నానాధికాలు ముగించుకొని శుచిగా వుండి, శుచిగా వున్న ద్విజుణ్ణి పిలిచి, దేవుని చిహ్నమయిన విగ్రహం ఎదుట బ్రాహ్మణుల సమక్షంలో అతని

సాక్ష్యం వినాలి. సాక్షి ఉత్తరానికో, తూర్పుకో తిరిగి ఉండాలి. ఆవిధంగా పర్యాప్తి నిర్ధారించి తీర్పు వినిపించాలి." (8-87)

"'చెప్ప'మని బ్రాహ్మణుణ్ని, 'నిజం పలుక'మని క్షత్రియుణ్ని, అబద్ధం చెబితే పాడి ఆవునీ, ధాన్యాన్నీ, బంగారాన్ని దొంగిలించిన పాపం చుట్టుకుంటుందని వైశ్యుణ్ని, అబద్ధం చెబితే అన్ని పాపాలు నీకే చుట్టుకుంటాయని శూద్రుణ్ని (న్యాయాధికారి) అడగాలి." (8-88)

"సత్యం మీద ఒట్టు వేసి చెప్పు" అని పురోహితుణ్నీ, తన గుర్రంమీద లేదా ఏనుగు మీద లేదా ఆయుధాల మీద ఒట్టువేసి చెప్పు అని క్షత్రియుణ్నీ, తన పాడి పశువుల మీద, ధాన్యం మీద, బంగారము మీద ఒట్టు పెట్టమని వైశ్యుణ్నీ, అబద్ధ సాక్ష్యం చెబితే అన్ని పాపాలూ తనకే చుట్టుకొనుగాక అని శ్రామికుణ్ణి ఒట్టు పెట్టించాలి న్యాయాధిపతి." (8-113)

తప్పుడు సాక్ష్యం యిచ్చేవారితో ఎలా వ్యవహరించాలో మనువు నిర్దేశించాడు. తప్పుడు సాక్ష్యం చెప్పడం నేరం అంటాడు మనువు. ఇంకా యిలా చెబుతాడు.

"న్యాయం చేకూర్చడంలో అపజయాన్ని నివారించేందుకు గామా, న్యాయ విచారణలో గతిరోధాన్ని తొలగించేందుకుగాను, తప్పుడు సాక్ష్యాలు చెప్పేవారికి ప్రాచీన రుషులు ఈ శిక్షలు నిర్దేశించారు." (8-122)

"క్షత్రియులు, వారికంటే క్రింద ఉన్న మూడు వర్ణాల వారికీ తప్పుడు సాక్ష్యం యిస్తే రాజు ముందుగా జరిమానా విధించి, ఆతర్వాత వారిని దేశం నుంచి బహిష్కరించవలెను. అదే బ్రాహ్మణుడయితే కేవలం దేశం నుంచి వెళ్లగొట్టవలెను." (8-123)

కాని మనువు ఒక మినహాయింపునిచ్చాడు.

"స్త్రీలతో సరసమాడుతున్నపుడూ, వివాహ ప్రస్తావన తెచ్చినపుడూ, గడ్డినిగానీ, పళ్లనిగానీ ఆవు మేసేసినపుడూ, యజ్ఞం చేయడానికి చెక్కలు తీసుకు వెళ్లినపుడూ, బ్రాహ్మణున్ని రక్షిస్తానని చెప్పినపుడూ, తేలికయిన ఒట్టు పెట్టుకోవడం తీవ్రమయిన నేరం." (8-112)

వ్యాజ్యాలలో పక్షాలుగా ఉండే వివిధ వర్ణాల వారి సాపేక్ష స్థితులను గురించి కొన్ని నేరాలను చర్చిస్తూ మనువు వివరించాడు.

పరువునష్టం అనే నేరాన్నే తీసుకుందాం. మనువు యిలా అంటాడు:

"క్షత్రియుడు బ్రాహ్మణునికి మానహాని కలిగిస్తే అతనికి వంద పణాలు జరిమానా, అలాగే వైశ్యునికైతే నూట యాభై పణాలు లేక రెండు వందల పణాలు, అదే నేరం ఒక కర్మకారుడు గానీ, శూద్రుడు గానీ చేస్తే కొరడా దెబ్బలు కొట్టవలెను." (8–267)

"బ్రాహ్మణుడు క్షత్రియుణ్ని దూషించి మానహాని కలిగిస్తే, అతనికి యాభై పణాలు, అదే వైశ్యుని తీవ్రంగా అవమానిస్తే పాతిక పణాలు, శూద్రుణ్ణయితే పన్నెండు పణాలు దండనగా విధించాలి." (8–268)

ఇహ అవమానపరచడమనే నేరం గురించి–మనువు ఇలా అంటాడు:

"శూద్రుడు ద్విజుణ్ని పాపపు తిట్లు తిట్టి అవమానిస్తే శూద్రుని నాలుకను చీరెయ్యాలి. కారణం వాణు బ్రహ్మపాదం నుంచి పుట్టినవాడు–అధముడు గనుక." (8–270)

"శూద్రుడు బ్రాహ్మణాదులను "ఓరీ దేవదత్తా! బ్రాహ్మణాధముడా!" అనే దూషణలోవలె తిరస్కారంతో పేరు, జాతి ఎత్తిగనక తిడితే వాడి నోటిలో యెర్రగా కాల్చిన పది అంగుళాల ఇనుప చువ్వను దూర్చాలి." (8–271)

"తనకి కొద్దిగా ధర్మం గురించి తెలుసునన్న అహంకారంతో శూద్రుడు ఏఏ విధులు బ్రాహ్మణులు చెయ్యాలో వారికి ఉపదేశిస్తే, దానికి దండనగా రాజు వేడివేడి నూనెను ఆ శూద్రుని నోట్లోనూ, చెవుల్లోనూ పోయించెయ్యాలి." (8–272)

దూషించడమనే నేరం గురించి మనువు ఇలా అన్నాడు:

"బ్రాహ్మణుడూ, క్షత్రియుడూ పరస్పరం తిట్టుకొన్నపుడు, దండ శాస్త్రజ్ఞుడయిన రాజు అతి స్వల్ప దండన బ్రాహ్మణునికీ; క్షత్రియునకు మధ్యమంగా వున్న దండన విధించాలి." (8–276)

"వైశ్యుడూ, శూద్రుడూ, తిట్టుకుంటే, బ్రాహ్మణ క్షత్రియులకిచ్చిన దండన మల్లేనే వారి వారి వర్ణ స్థాయిని బట్టి దండన విధించాలి. శూద్రునికి నాలుక తెగగోయనవసరము లేదు. ఇది నిర్ధారిత దండన." (8–277)

దౌర్జన్య నేరానికి మనువు విధించిన శిక్షలు ఇవి:

"శూద్రుడు ఏ అవయవంతో అగ్రవర్ణాల వారిని కొడతాడో, ఆ అవయవాన్ని రాజు

గాయం పరిస్థితిని బట్టి చీల్చడం గాని, కోసి వేయించడం గానీ చేయాలి. ఇది మనుశాసనం." (8–279)

"శూద్రుడు చెయ్యెత్తిగాని, కర్రెత్తిగాని కొడితే, ఆ చేతిని నరికివేయించడమూ, కాలెత్తి తంతే, ఆ కాలు తీయించివేయడమూ రాజు చేయాలి." (8–280)

అహంకార నేరానికి శిక్ష మనువు యిలా చెబుతున్నాడు.

"పొగరుబోతు తనంతో శూద్రుడు అగ్రవర్ణాల వారితో పాటుగా ఒక ఆసనం మీద కూర్చుంటే అతని వీపుపై కాలుతున్న లోహంతో వాతలు వేసి, అతణ్ణి దేశం నుంచి బహిష్కరించాలి. లేదా రాజు ఆ శూద్రుని పిర్ర కోయించాలి–వాడు చావకుండే విధంగా." (8–281)

"శూద్రుడు గర్వంతో అగ్రవర్ణులపై ఉమ్మివేస్తే–అతని రెండు పెదాలూ, ఉచ్చపోస్తే–అతని జననాంగాన్నీ, వారివైపుగా అపానవాయువు వదిలితే అతని ముడ్డినీ రాజు కోయించాలి." (8–282)

"గర్వంతో బ్రాహ్మణుణ్ణి బాధించాలని శూద్రుడు అతని జుట్టునీ, పాదాలనూ, గెడ్డాన్నీ, గొంతునీ, వృషణాలను పట్టుకుంటే, వెనకా ముందూ ఆలోచించకుండా రాజు అలాచేసిన శూద్రుని చేతులను కోయించాలి." (8–283)

వ్యభిచార నేరం విషయంలో మనువు యిలా చెప్పాడు:

"శూద్రుడు బ్రాహ్మణుని భార్యతో వ్యభిచరిస్తే, అతను మృత్యు దండనకి అర్హుడు. నాలుగు వర్ణాలవారి భార్యలూ ఎక్కువగా రక్షింపతగినవారు." (8–359)

"ఉత్తమజాతి కన్యతో అధమజాతి పురుషుడు శృంగారం జరిపితే, పద్ధతిననుసరించి అతనికి శిక్ష విధించాలి. కాని అదే సజాతీయమైన కన్యను పొందితే ఆమె తండ్రి యిష్టపడితే శుల్కం యిచ్చి, ఆమెను పెళ్లి చేసుకోవచ్చును." (8–366)

(ఆమె యింట్లో కుటుంబ రక్షణలో వున్న లేక లేని బ్రాహ్మణ స్త్రీతో శూద్రుడు వ్యభచరించితే శూద్రున్ని యిలా శిక్షించాలి:) "ఆమె రక్షణలో లేకపోతే అతని జననాంగ ఛేదనమూ, అతని యావదాస్తి జప్తు చేయడం జరుగుతుంది. అదే రక్షణలో వున్న బ్రాహ్మణ స్త్రీ అయితే, సర్వస్వమూ, అతని జీవితం సయితం పోగొట్టుకుంటాడు." (8–374)

"రక్షణలో వున్న బ్రాహ్మణ స్త్రీతో వైశ్యుడు వ్యభిచరిస్తే, అతని యావదస్తినీ స్వాధీనం చేసుకోవడమే, గాకుండగా అతనికి ఒక ఏడాదిపాటు కారాగారవాస శిక్ష విధించడం జరుగుతుంది. అదే క్షత్రియుడయితే, అతనికి వేయి పణాలు జరిమానా, మీదుమిక్కిలి గాడిద ఉచ్చపోసి అతని తల గొరిగించడమూ శిక్ష." (8–375)

"కాని, భర్త రక్షితకాని పురోహితుని భార్యతో వైశ్యుడుగాని, క్షత్రియుడుగాని వ్యభిచరించెనేని రాజు వైశ్యునికి అయిదు వందల పణాలూ, క్షత్రియునికి వెయ్యి పణాలు దండన విధించాలి." (8–376)

"ఆ ఇద్దరు, రక్షణలో వున్న సుగుణవతి అయిన బ్రాహ్మణ స్త్రీతో విషయవాంఛలు తీర్చుకుంటే ఆ ఇద్దరికీ శూద్రునికిచ్చే శిక్షలాంటి శిక్ష విధించాలి. లేదా రెల్లుగడ్డితో తగలబెట్టి అయినా మరణదండన విధించాలి." (8–377)

"రక్షణలో వున్న క్షత్రియతో వైశ్యుడు లేదా వైశ్య స్త్రీతో క్షత్రియుడు శరీర సుఖం అనుభవిస్తే, ఇద్దరికీ రక్షణలేని బ్రాహ్మణ స్త్రీ విషయంలో విధించిన శిక్షే వీరికీ విధించాలి." (8–382)

"కాని ఒక బ్రాహ్మణుడు రక్షణలో వున్న రెండు వర్ణాల (క్షత్రియ, వైశ్య) స్త్రీలతో వ్యభిచారం చేస్తే అతనికి వెయ్యి పణాలు శిక్ష విధించాలి. అదే రక్షణలో వున్న శూద్ర స్త్రీతో క్షత్రియుడుగానీ, వైశ్యుడుగానీ శరీర సుఖం అనుభవిస్తే వారికి కూడా చెరో వెయ్యి పణాలు జరిమానా విధించాలి." (8–383)

"రక్షణలో లేని క్షత్రియ స్త్రీతో వైశ్యుడు సంయోగం చేస్తే, అతనికి జరిమానా ఐదు వందల పణాలు, కాని అదే తప్పుని ఒక క్షత్రియుడు చేస్తే ఉచ్చపోసి బుర్ర గొరిగించడం గానీ, అదే జరిమానా కట్టడంగానీ చేయాలి." (8–384)

"ఒక బ్రాహ్మణుడు అరక్షిత క్షత్రియ, వైశ్య, శూద్ర స్త్రీలతో సంయోగం చేస్తే ఐదేసి వందల పణాలు చొప్పున జరిమానా. చండాలస్త్రీతో వ్యభిచరిస్తే, వెయ్యి పణాలు జరిమానా కట్టాలి." (8–385)

వివిధ నేరాలకి దండన పద్ధతిలో మనువు పథకంలో ఈ అంశం మీద చాలా ఆసక్తికరమయిన వెలుతురు ప్రసరిస్తోంది. ఈ దిగువ అత్యవసర ఆదేశాలను పరిశీలించాలి:

"వ్యభిచార నేరం చేసిన పురోహిత వర్గంలోని వారికి, మరణ దండనకి బదులుగా

అవమానకరమయిన శిరోముండన దండన విధించడం జరుగుతుంది. ఇదే ఇతర వర్ణాల వారికి విధించే శిక్ష మరణ దండన వరకూ సాగుతుంది." (8–379)

"బ్రాహ్మణుడు ఎన్ని పాపాలు చేసినా రాజు అతణ్ని చంపరాదు. అతణ్ని రాజు తన రాజ్యం నుంచి బహిష్కరించవచ్చు. అయితే బ్రాహ్మణుని యావదాస్తి భద్రంగా వుంచాలి. అతని శరీరాన్ని ఏమీ చేయరాదు." (8–380)

"ఉద్దేశపూరకంగా యోగ్యుడయిన క్షత్రియుణ్ని చంపితే, దీనికి ప్రాయశ్చిత్తం, బ్రాహ్మణున్ని చంపితే చేసే ప్రాయశ్చిత్తంలో నాల్గవ వంతు. అదే వైశ్యుణ్నయితే, ఎనిమిదో వంతు ప్రాయశ్చిత్తం, తన ధర్మం సరిగా చేసుకొనే శూద్రుణ్ని చంపితే పదహారవ భాగం ప్రాయశ్చిత్త దండన." (11–127)

"కానీ ఒక బ్రాహ్మణుడు ఎలాంటి ఉద్దేశమూ లేకుండా క్షత్రియుణ్ని చంపితే, శుద్ధికి అతను మత సంస్కారాలను ముగించి, ఉత్తమ బ్రాహ్మణునికి ఒక ఎద్దునీ, వేయి ఆవుల్నీ దానంగా యివ్వాలి." (11–128)

"లేక బ్రాహ్మణుని చంపినందులకు మూడు ఏళ్లపాటు జ్ఞాన, కర్మేంద్రియాలను బంధించి గెడ్డాలనూ, మీసాలనూ పెంచి, గ్రామానికి దూరంగా, ఓ చెట్టు క్రింద బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తం ఆచరించి శుద్ధి పొందవచ్చు." (11–129)

"అతను మంచి నడవడి గల వైశ్యుణ్ని ఎలాంటి దుర్బుద్ధి లేకుండా చంపితే, ఆ ప్రాయశ్చిత్తం ఒక సంవత్సరంపాటు ఆచరించవచ్చు. లేదా పురోహితులకు నూరు గోవులనూ, ఒక ఎద్దునూ దానంగా యివ్వాలి." (11–130)

"అదే యాదృచ్ఛికంగా ఒక శూద్రుణ్ని చంపితే, ఆ ప్రాయశ్చిత్త వ్రతం పూర్తిగా ఆరు మాసాలు చేయాలి. లేదా పది తెల్లావులనూ, ఒక ఎద్దునూ పురోహితులకు దానంగా యివ్వాలి." (11–131)

"బ్రాహ్మణున్ని చంపడం కన్నా ఘోరమైన నేరం ఈ భూమి మీద మరొకటి లేదు. గనుక రాజు, బ్రాహ్మణున్ని చంపాలన్న ఆలోచనని సయితం మనసులోకి రానీయరాదు." (8–381)

"ఒకే నేరం ఎన్నిసార్లు పునరావృతం అవుతోంది? ఏ చోట్లో? ఏ కాలంలో? నేరస్తుడు శిక్ష అనుభవించే శక్తి కలవాడా? విధించిన జరిమానా కట్టే సామర్థ్యం అతనికుందా? నేరం ఏమిటి? మొదలయిన అంశాలను పరిశీలించి రాజు శిక్షకు అర్హమైన వారిని దండించాలి."

(8-126)

"స్వయంభూ మనువు క్షత్రియుడు మొదలైన మూడు వర్ణాల వారికినీ పది శిక్షించే స్థానాలను నిర్దేశించాడు. కాని బ్రాహ్మణుడు మాత్రం వాటిలో ఏ నేరంలోనూ, శరీరానికి హాని జరుగకుండా, దేశాన్ని విడిచివెళ్లిపోవాలి." (8-124)

"(ఆ శిక్షించే స్థానాలు) జననాంగం, కడుపు, నాలుక, రెండు చేతులూ, రెండు కాళ్లూ, కళ్లూ, ముక్కూ, రెండు చెవులూ, ధనమూ తీవ్రమయిన నేరంలో మొత్తం శరీర మంతానూ." (8-125)

మత సంస్కార కర్మల, యజ్ఞ హోమాదుల నిర్వహణలో హక్కులు, బాధ్యతల విషయంలో మనువు వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనంలోకి తీసుకోదగ్గవి.

"వేదాధ్యయనం చేతనూ, మత నియమాలను తు.చ. తప్పకుండా పాటించడం వల్లనూ, హోమాల్లో బలిపిండదానాల చేతనూ, త్రయీవిద్య చేతనూ, దేవ, పితృ తర్పణలు చేతనూ, పుత్రోత్పాదన చేతనూ, పంచ కర్మల చేతనూ, అగ్నిష్టోయాది యజ్ఞాల చేతనూ, దివ్య స్థితికి యోగ్యమయినదిగా మానవ శరీరం చేయబడుతోంది." (2-28)

"గృహస్థు యింట్లో ఆయాచోట్ల అజ్ఞానంతో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా మహర్షులు ప్రతిరోజూ ఐదు సంస్కార కర్మలు చేయాలని నిర్ణయించారు." (3-69)

"బోధన, అధ్యయనం వేదం లేక బ్రహ్మ సంస్కారం. పిండమూ, జలమూ, పితృ సంస్కారం. హోమం దేవ సంస్కారం. బలి భూత సంస్కారం. అతిథి పూజ మనుష్య సంస్కారం." (3-70)

"ఈ ఐదు మహాయజ్ఞాలనూ తన సామర్థ్యాన్ని బట్టి ఎవరైతే చేస్తారో, అతనికి ఇంట్లో నివసిస్తున్న సూన దోషాలు అంటవు." (3-71)

ఇలాంటివీ మనువు ఆదేశాలు. ప్రతి అంశాన్నీ వివరించడానికి ధర్మ సూత్రాలెన్నడూ సమగ్రంగా ఉండవు. వివాదాస్పదమయిన ప్రశ్నలు ఎప్పుడూ లేస్తూనే వుంటాయి. వాటిని గురించిన స్పృహ మనువుకి వుంది. అలాంటి సంభావ్యతలకి అవకాశం కల్పిస్తూ వచ్చాడు మనువు.

"కొన్ని ప్రత్యేకమయిన కేసులు ఏ సామాన్య విధుల పరిధిలోకీ రానప్పుడు, న్యాయాన్ని పొందడం ఎలా? అని ఎవరైనా ప్రశ్నిస్తే, దానికి సమాధానం యిది:

"శిష్ట బ్రాహ్మణులు ప్రతిపాదించినది, తిరుగులేకుండా న్యాయమవుతుంది." (12–108)

"శిష్ట బ్రాహ్మణులు ఎవరంటే, ఎవరైతే వేదం నుంచే ప్రత్యక్ష ప్రమాణం నివేదించగలరో, వారు న్యాయసూత్రాలు ఆజ్ఞాపించినట్టుగా వేదాలనూ, వాటి విస్తరించిన శాఖలనూ, లేక వేదాంగాలనూ, మీమాంసలనూ, న్యాయ, ధర్మ, శాస్త్రి, పురాణాలను అధ్యయనం చేసేవారు." (12–109)

"వేదాలనూ, సూత్రాలను క్షుణ్ణంగా తెలిసిన పురోహితుడు ఒక్కరయినా, ఎక్కువ మంది లేనప్పుడు ఆయన నిర్ణయాన్ని అత్యుత్తమ నియమంగా ధర్మశాసనంగా ఎంచాలి. పవిత్ర గ్రంధాల జ్ఞానం లేని వేలాది మంది అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకోరాదు." (12–113)

మనుధర్మ సూత్రాలు శాశ్వతమయినవి. అందువల్ల వాటిలో మార్పు ఎలా చేయాలనే ప్రశ్నను పరిశీలించే సమస్యే ఉదయించదు. ఈ వ్యవస్థను ఎలా స్థిరపరచి, కొనసాగించాలన్నదే మనువు ఆలోచించాల్సిన అంశం. ఈ ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకొనే ధర్మసూత్రాల్లో చాలా నిబంధనలను ఆయన వుంచాడు.

సాంఘిక సూత్రాలకు సంబంధించినంతవరకూ వాటిని పరిరక్షించి, నిర్వహించే బాధ్యతను మనువు రాజుకి అప్పగించాడు.

"వైశ్య వర్ణానికి చెందిన ప్రతి ఒక్కరినీ, వారు వాణిజ్యం చేయాలనీ, లేక డబ్బు వడ్డీలకు తిప్పుతూ వుండాలని, లేక వ్యవసాయం చేయాలనీ, లేక పశుపోషణ చేయాలనీ రాజు ఆజ్ఞాపించాలి. అలాగే శూద్రులలో ప్రతి ఒక్కరూ ద్విజుల సేవ చేస్తూ వుండాలని నిర్దేశించాలి రాజు." (8–410)

"ఎంతో జాగ్రత్తగా ప్రయాసపడి రాజు వైశ్యులనూ, శూద్రులనూ, వారికి నిర్దేశించిన విధులను తు.చ. తప్పకుండా నిర్వర్తించుతూ వుండేటట్లు చూడాలి. లేకపోతే వారు విధుల్ని వదిలేసి ప్రపంచాన్ని గందరగోళంలోనికి నెట్టేస్తారు.." (8–418)

ఈ వ్యవస్థ నిర్వహణలో ఎదురయ్యే వైఫల్యాలకు బాధ్యుడు దేశపాలకుడు. ధర్మసూత్రాల ప్రకారం ఆయన శిక్షకు పాత్రుడు.

"తమ తమ విధుల్లో ఎలాంటి వూగిసలాట లేకుండా స్థిరంగా పనులు చేసుకోకపోతే, తండ్రినయినా, గురువునయినా, స్నేహితుడనయినా, తల్లినయినా, భార్యనయినా, కొడుకయినా, కుటుంబ పురోహితుడైనా వారిని రాజు శిక్షించాల్సిందే." (8–335)

కూడా కొలుస్తూ వారి ప్రభువుల్ని సంతోషపరచడానికి ఆ దేవుణ్ని ఉన్నతమైన, శక్తివంతమైన పరమేశ్వరునిగా నిరూపించారు. ఇదే సరియైన వివరణ అయినట్టయితే-ఈ ఆరుకును మూల భగవద్గీతకు క్రీ.శ. 400–464 మధ్య కాలంలో తగిలించి వుండాలి.

భగవద్గీతను బౌద్ధమతానికన్నా ముందుగా నిలబెట్టే ఆలోచన, సఫలం కాలేదని రుజువయింది. అలాంటి ఆలోచన బుద్ధుడన్నా అతని విప్లవతత్వ బోధన అన్నా అంతరాల్లో ఒక విధమైన వ్యతిరేక భావాల్ని పెంచుకున్న వారి ఇచ్ఛాపూర్వక ఆలోచన మాత్రమే. దీన్ని చరిత్ర ఆమోదించదు. ఏది ఏమయినా సైద్ధాంతిక విలువలు గల ఆ గీతాభావాలు, కాలానికి సంబంధించి, బౌద్ధ సూత్రాలకు, జైమిని బాదరాయణ సూత్రాలకు చాలాతర్వాత వచ్చినవన్న విషయాన్ని చరిత్ర ఖచ్చితంగా చాలా అసాధారణంగా నిరూపిస్తుంది.

భగవద్గీత హీనయాన బౌద్ధం కన్నా తర్వాతదే కాదు. మహాయాన బౌద్ధం కన్నా కూడా తర్వాతదేనని, ఈ కాల చర్చ రుజువు చేస్తుంది. మహాయాన బౌద్ధం, తర్వాత పుట్టిందని ఒక అభిప్రాయం ఉంది. దానిప్రకారం బౌద్ధ సంఘాల్లో తలెత్తిన సమస్యలను పరిష్కరించడానికి కనిష్కుడు క్రీ.శ. 100వ సంవత్సరంలో ఏర్పాటుచేసిన మూడవ బౌద్ధ మహాసభ తర్వాత మహాయానం ఉనికిలోకి వచ్చిందని భావించబడుతుంది. ఇది శుద్ధ తప్పు.[44] ఆ బౌద్ధ మహాసభ తర్వాత ఓ కొత్త బౌద్ధ తెగపుట్టుకొచ్చిందనడం సరికాదు. అతి ప్రాచీనమైన సమూహాలను దుయ్యబట్టడానికి కొత్త పేర్లు ఉనికిలోకి వచ్చాయి. మహాసాంఘిక అనే బౌద్ధ సమూహానికి కేవలం మరోపేరు మహాయానమని కిమూరా నిరూపిస్తాడు. ఈ మహా సాంఘికుల సమూహంపైన చెప్పినదానికన్నా చాలా ముందు నుంచే ఉంటున్నది. పరంపరను విశ్వసిస్తే ఈ సమూహం (మహా సాంఘికులు) బుద్ధుని మహాపరినిర్వాణం అనంతరం 236 ఏళ్ళ తర్వాత పాటలీపుత్రంలో జరిగిన తొలి బౌద్ధ మహాసభ కాలం నాటికే వున్నారు. అంటే క్రీ.పూ. 307లో[45] బౌద్ధ సమూహాల సూత్రాలను పరిష్కరించడానికి తొలి మహాసభ జరిగింది. ఈ మహాసభ బౌద్ధులలోని థేరవాద సమూహంపై ధ్వజమెత్తింది. థేరవాద తెగనే తదనంతర కాలంలో హీనయానంగా ముద్రవేశారు. (అంటే హీనమార్గాల్ని అనుసరిస్తున్న వారని అర్థం) మహా సాంఘికులు, మహాయానులుగా, పేరుమారుతున్న తరుణంలో భగవద్గీత ఆవనాలే లేదు.

ఇదిగాక అసలు భగవద్గీత నుండి మహాయాన బౌద్ధులు ఎరువు తీసుకున్నదేమిటి? వాస్తవానికి వారు భగవద్గీత నుండి ఎరువు తీసుకోడానికేముంది? కిమురా చెప్పినట్టుగా బౌద్ధ మతానికి చెందిన అన్ని శాఖల్లోని సిద్ధాంతాల్ని మూడు విధాలుగా విభజించవచ్చు. (1) విశ్వ ఉనికిని గూర్చి చర్చించేది (2) బుద్ధతత్వం గురించి చర్చించేది (3) మానవ జీవిత భావన గూర్చి చర్చించేవి. మహాయానం వాటికి మినహాయింపు కాదు. బుద్ధతత్వం విషయంలో తప్ప మహాయానులు, భగవద్గీతను ఏ రకంగానూ ఉపయోగించుకునే అవకాశం లేదు. మిగిలిన సిద్ధాంతాల విషయంలో ఈ రెండింటి దృక్పథంలో ఎంతో భేదం వుంది. ఆ ఒక్క విషయంలో కూడా కాల అంతరం రీత్యా ఆ అవకాశం లేదు.

భగవద్గీత చాలా పురాతనమైనది, బౌద్ధం కంటె ముందు పుట్టింది. కాబట్టి దాన్ని జైమిని పూర్వ మీమాంసతో ముడిపెట్టకూడదని – ప్రతి విప్లవ సిద్ధాంతాలకు తాత్విక సమర్ధన ఇచ్చే ప్రయత్నంగా దాన్ని భావించకూడదన్న వాదం – నా ప్రతిపాదనకు వ్యతిరేకంగా నిలబెట్టే ఏకైక మార్గం. ఆ వాదాన్ని పైన జరిగిన చర్చ పూర్తిగా కూల్చివేసింది.

మొత్తంమీద నా ప్రతిపాదన త్రిముఖమైంది. మరో విధంగా చెప్పాలంటే ఇది మూడు భాగాలు కలది. మొదటిది మౌలికంగా భగవద్గీత ప్రతీఘాత విప్లవానికి ప్రామాణిక గ్రంథమైన జైమిని పూర్వ మీమాంస తరగతికి సంబంధించిన ప్రతీఘాత విప్లవ గ్రంథం. భగవద్గీత ద్వితియాధ్యాయంలోని 40–46 వరకూ ఉన్న శ్లోకాలను బట్టి కొందరు రచయితలు ఒక అభిప్రాయాన్ని విశ్వసిస్తున్నారు. దాన్నిబట్టి భగవద్గీత————————————————

(మాకు లభించిన అన్ని ప్రతుల్లో ఈ వ్యాసం ఇలాగే పైన పేర్కొన్న వాక్యంతోనే అసంపూర్తిగా ముగిసింది.)

అనువాదం: యం.వి.రమణ

# :అధస్సూచికలు:

1. భగవద్గీత (ఇండియన్ ఆంటీక్వరీ, 1918 సప్లిమెంట్)కు తన పరిచయ వాక్యాలలో గార్బ్ ఉటంకించారు.

2. రిలీజియన్ ఆఫ్ ఇండియా 390–400 పేజీలు.

3. గార్బ్ ఉటంకించారు.

4. భగవద్గీతకు ముందు మాట.

5. భగవద్గీత (ఎస్.ఇ.బి) ముందు మాట. పే. 11

6. జ్ఞాని తనకు 'ఇష్టుడని' కృష్ణుడు చెప్పిన 7 అధ్యాయం 17 శ్లోకం చూడండి.

7. గీతా రహస్యం (రెండో ఎడిషన్) సంపుటి II, XIV అధ్యాయం

8. భగవద్గీత 4–13.

9. భగవద్గీత 2–39–53

10. భగవద్గీత 2–47

11. భగవద్గీత 2–48లో ఇది చక్కగా క్రోడీకరించబడింది.

12. పరిచయం (ఇండియన్ ఆంటిక్వరీ సప్లిమెంట్) పే. 30.

13. గీతా రహస్యం 2 సం. 916–922

14. భగవద్గీత 2–(42–46) – 17–66

15. భగవద్గీత 13–4

16. గీతారహస్య 2 – పే. 749

17. భగవద్గీత (ఎస్.బి.ఇ.) పరిచయం. పే. 31

18. హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిట్‌రేచర్. పే. 242.

19. బ్రహ్మసూత్రాలు చాలా ప్రాచీన గ్రంథమని తన అభిప్రాయం కాబట్టి కూడా తిలక్ ఈ ప్రస్తావనను సులువుగా స్వీకరించి వుంటాడు. చూ. గీతా రహస్య – 2వ సం.

20. ఎస్సేస్ ఆఫ్ సాంస్క్రిట్ లిటరేచర్ సం 3 – పే. 150.

21. మా గీతా గేయ గ్రంథం పరిచయ వ్యాసంలో ఈ అంశంపై చేసిన మా వ్యాఖ్యలను చూడండి. పే. II

22. ఆంగ్ల గేయాల్లోని గీతకు ముందు మాట.

23. మాక్స్‌ముల్లర్ హిబ్బర్ట్ లెక్చర్స్ పే. 137, వెబెట్స్ ఇండియన్ లిటరేచర్ పే 288–289, రైస్ డేవిడ్స్ బౌద్ధంపై రాసిన చిన్న గ్రంథం పే – 151. డేవిడ్ పుస్తకంలో 83 పేజీ కూడా చూడండి.

24. వెబర్ – హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిటరేచర్ పే. 285. డేవిడ్–బుద్ధిజమ్ పే. 74.లో ఆత్మ ఉనికిని స్పృశించే ఓ ప్రమాణ బౌద్ధ గ్రంథం నుంచి ఉల్లేఖన వుంది. దాన్నీ, గీతలోని సంబంధిత సిద్ధాంతాన్నీ పోల్చి చూడండి. ఇంద్రియ జ్ఞానాన్నీ, ఆత్మనీ ఒకటిగా చూడడాన్ని రెండూ వ్యతిరేకిస్తాయి. ఇంద్రియాల కంటె ఆత్మ భిన్నమైనదని గీత అంటుంది. బౌద్ధం దాన్ని కూడా వ్యతిరేకించి ఇంద్రియ జ్ఞానం తప్ప మరేదీ లేదంటుంది.

25. భగవద్గీత (ఎస్.డి. బుధిరాజా, ఎం.ఎం.ఎల్.ఎల్.బి, చీఫ్ జడ్జి, కాశ్మీర్)లో ఈ విషయాన్ని చూడండి. గౌతమా, బౌద్ధానికి ఉన్న పాఠ సాదృశ్యాల గురించి రచయిత అడుగడుగునా సూచిస్తాడు.

26. మాక్స్ ముల్లర్ – మహా పరినిబ్బాణ సుత్త – పే – 63.

27. మహాపదన సుత్త.

28. తెవిజ్జ సుత్త.

29. హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిటరేచర్ (ఆంగ్లానువాదం) సం. 2, పే. 229 పాదసూచిక.

30. మాన్యువల్ ఆఫ్ ఇండియన్ బుద్ధిజమ్ పే. 122 – పాదసూచిక.

31. గీతా రహస్య సం. 2 – పే. 791–800

32. ద గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా పే. 398

33. ద గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా పే. 398

34. ద గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా పే. 395

35. ద గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా పే. 395

36. గీతారహస్య 2 – పే. 79

37. గీతారహస్య 2 – పే. 789

38. గీతా రహస్య 2 – పే. 789

39. ధర్మానంద్ కోశాంబి – హిందీ సంస్కృతి అని అహింసా (మరాఠీ) పే. 156.

40. 'శైవిజమ్ అండ్ వైష్ణవిజమ్'లో డాక్టర్ భండార్కర్ ఇలా అంటారు. "ప్రథమ మౌర్య పాలకుని కాలం నాటికే వాసుదేవ కృష్ణ ఆరాధన ఉండి వుంటే గనుక మౌర్య వంశపాలన కంటె చాలా కాలం ముందే అది ఆవిర్భవించి వుండాలి." ఇది తిరుగులేని ప్రకటన. అయితే, గిరిజన దేవుడైన కృష్ణుడికీ, విశ్వీకరించిన ఈశ్వర కృష్ణునికీ తేడా చూడాలని నా అభిప్రాయం. మొదటి రకం కృష్ణుని విషయంలో డాక్టర్ భండార్కర్ చెప్పే తేదీ సరైనది కావచ్చు కానీ రెండో కృష్ణుని విషయంలో కాదు. గీతలో మనం చూస్తున్నది రెండో కృష్ణుడిని.

41. శ్యామ్‌శాస్త్రి మెమోరియల్ వాల్యూమ్ చూడండి.

42. కృష్ణతత్వానికి వ్యతిరేకత శంకరాచార్యుని వంటి అనంతర కాలం వ్యక్తి కూడా ప్రకటించాడు.

43. బ్రహ్మ వేదాంత సూత్రాల కాలం – అమెరికన్ ఓరియంటల్ సొసైటీ జర్నల్, పం – 31, 1911.

44. ఈ విషయంపై సంపూర్ణ వివరాల కోసం చూడండి: ఎ హిస్టారికల్ స్టడీ ఆఫ్ ది టర్మ్స్ హీనయాన్ అండ్ మహాయాన్ అండ్ ద ఆరిజన్ ఆఫ్ మహాయాన బుద్ధిజమ్ – ర్యుకవ్ కిమురా, కలకత్తా యూనివర్సిటీ, 1927.

45. బుద్ధుని నిర్మాణ సంవత్సరం క్రీస్తుపూర్వం 543గా తీసుకుంటే ఇది వర్తిస్తుంది. క్రీ.పూ. 453ను తీసుకుంటే ఇది క్రీస్తుపూర్వం 217 అవుతుంది.

అధ్యాయం - 14

# విరాట, ఉద్యోగపర్వాలు-విశ్లేషణాంశాలు

విరాటపర్వం:

1. పాండవుల ఉనికిని వెతకడానికి కౌరవులు పంపించిన గూఢచారులు, దుర్యోధనుని వద్దకు వచ్చి, తాము పాండవులను కనుగొనలేకపోయామని చెప్పారు. ఏం చేయాలో సెలవిమ్మని అతనిని అడుగుతారు. -విరాట పర్వం-అధ్యాయం-25.

2. దుర్యోధనుడు తన సలహాదారులను సంప్రదిస్తాడు. వేరే చారులను పంపించమని కర్ణుడు అంటాడు. పాండవులు సముద్రాలు దాటి వెళ్ళిపోయి వుండవచ్చుననీ, అయినా వారిని వెదికించమని దుశ్శాసనుడు చెప్పాడు. -పైదే- అధ్యాయం-26.

3. పాండవులు ఓడిపోవడంగాని, వారిని నిర్మూలించటం గాని సాధ్యం కాకపోవచ్చునంటాడు ద్రోణుడు. వారు తాపసులుగా ఉంటున్నారేమోననీ, అందువల్ల సిద్ధుల్నీ, బ్రాహ్మణుల్నీ చారులనుగా పంపమని చెప్పాడు. -పైదే- అధ్యాయం - 27.

4. ద్రోణుని భీష్ముడు సమర్ధిస్తాడు. -పైదే- అధ్యాయం - 28.

5. కృపాచార్యుడు భీష్మని సమర్ధిస్తూ, పాండవులు గొప్ప శత్రువులు- వివేకవంతులు చిన్న శత్రువులనైనా అలక్ష్యం చేయరు. వాళ్ళు అజ్ఞాతవాసంలో ఉంటూ ఉండగానే యిప్పట్నుంచీ నువ్వు సైన్యాన్ని సమకూర్చుకోవాలి, అని కూడా అంటాడు. -పైదే- అధ్యాయం - 29.

6. అప్పడు త్రిగర్త దేశపు రాజైన సుశర్మ వేరే విషయాన్ని లేవనెత్తాడు. 'విరాటరాజు సేనాపతి అయిన కీచకుడు చనిపోయాడని నేను విన్నాను. విరాటరాజు మనకు పెద్దగా ప్రమాదం కలిగించేవాడే. కీచకుడు మరణించడం వలన విరాటుడు చాలా బలహీనుడైపోతాడు. విరాటరాజ్యంపై దండయాత్ర ఎందుకు చేయకూడదు? ఇదే చాలా అనుకూలమైన సమయం' అన్నాడు. కర్ణుడు కూడ సుశర్మను సమర్ధించాడు. 'పాండవుల గురించి ఎందుకు చింత? ఈ పాండవులు సంపదనీ, సైన్యాన్ని పోగొట్టుకొని భ్రష్టులయ్యారు. వాళ్ళ గురించి పట్టించుకోవడమెందులకు? ఈపాటికి వాళ్ళు చనిపోయారేమో కూడా. వాళ్ళని వెతికించడం మానివేసి సుశర్మ సూచించిన ప్రణాళికను పాటించుదాం' అన్నాడు. -పైదే- అధ్యాయం - 30.

7. విరాట రాజ్యంపై సుశర్మ దండయాత్ర. విరాటరాజు గోవులను సుశర్మ తరలించుకుపోతాడు. పశువుల కాపరులు విరాటరాజుకీ విషయం చెప్పి సుశర్మను వెంట తరిమి గోవులను రక్షించమని చెప్పారు. -అదే- అధ్యాయం 31.

8. విరటుడు యుద్ధానికి సిద్ధమవుతాడు. ఈలోగా విరటుని తమ్ముడు శతానీకుడు

ఒక్కడే వెళ్ళడం కంటె తనతోపాటు కంకు (సహదేవుడు), బల్లవ (యుధిష్ఠర), శాంటిపాల (భీముడు), గ్రాంధికు (నకులు)లను కూడా సుశర్మపై యుద్ధానికి సాయం వెళ్ళమని సలహా ఇస్తాడు. విరటుడందుకు అంగీకరిస్తాడు. అందరూ వెళ్తారు. -అదే- అధ్యాయం - 31.

9. సుశర్మ విరటుల మధ్య యుద్ధం. -అదే- అధ్యాయం 32.

10. యుధిష్ఠిరుడు విరటుని రక్షిస్తాడు. -అదే- అధ్యాయం - 31.

11. వారి రాజు క్షేమంగానే ఉన్నాడని విరాటనగరిలో చాటింపు. -అదే- అధ్యాయం - 34.

## కౌరవుల విరాటనగర ప్రవేశం

12. సుశర్మ మీదికి విరాటరాజు యుద్ధానికి వెళ్ళిన సమయంలోనే-భీష్మ, ద్రోణ, కర్ణ, కృప, అశ్వత్థామ, శకుని, దుశ్శాసన, వివింశతి, వికర్ణ, చిత్రసేన, దుర్ముఖ, దుశ్శలుడు యితర వీరులతో దుర్యోధనుడు విరాటనగరిలో ప్రవేశించి విరటుని గోవులను పట్టుకొని తోలుకుపోతారు. పశువుల కాపరులు విరాటరాజు సౌధంలోకి వచ్చి ఆ వార్త చెబుతారు. -అదే- అధ్యాయం 35.

13. ఉత్తరుడు తాను అర్జునుని కంటె గొప్ప వీరుడిననీ, వాళ్ళ పని పట్టగలననీ ప్రగల్భాలు పలకడం మొదలుపెడతాడు. కాని తనకు సారథిగా ఉండదగ్గవాడు లేడన్నదే లోటు అంటాడు. ద్రౌపది వెళ్ళి బృహన్నల ఒకప్పుడు అర్జునుని సారధి అని చెబుతుంది. అతన్నెందుకు అడక్కూడదు అంటుంది. తనకా సాహసం లేదనీ, ద్రౌపదినే వెళ్ళి కోరమనీ ఆమెను అర్థిస్తాడు. మీ చెల్లెలు మనోరమను ఎందుకు అడగరాదు-అంటుంది ద్రౌపది. అలా ఉత్తరుడు బృహన్నలను తీసుకొని రమ్మని మనోరమతో చెబుతాడు. -అదే- అధ్యాయం - 36.

14. మనోరమ బృహన్నలను తన సోదరుల వద్దకు తీసుకువెళ్తుంది. ఉత్తరుడు అతనిని తన సారథిగా ఉండమని ఒప్పిస్తాడు. బృహన్నల అందుకు ఒప్పుకొని ఉత్తరుని రథాన్ని కౌరవుల ఎదుటకు తోలుకొని వెళ్తాడు. -అదే- అధ్యాయం - 37.

15. కౌరవ సైన్యాన్ని చూడగానే, ఉత్తరుడు రథం విడిచి పారిపోసాగాడు. అర్జునుడు అతనిని ఆపేడు.. కౌరవులిది చూచి అతడు అర్జునుడై ఉంటాడని అనుమానింపసాగారు. అర్జునుడు ఉత్తరునికి భయపడవద్దని చెబుతాడు. -అదే- అధ్యాయం - 38.

16. అర్జునుడు తన రథాన్ని జమ్మి చెట్టు వద్దకు తోలుకొని వెళ్తాడు. ఇది చూచి ద్రోణుడు అతడు అర్జునుడే అయి వుండాలని అంటాడు. అది వినగానే కౌరవులు ఎంతో వ్యాకులపాటు చెందారు. ద్రోణుడన్నదే వాస్తవమైతే అది మనకు మంచిదే అని దుర్యోధనుడన్నాడు. ఎందువల్లనంటే పదమూడవ ఏడుకు ముందుగానే పాండవుల్ని కనుక్కున్నట్లు అవుతుంది. కనుక వాళ్ళు మళ్ళీ పన్నెండేళ్ళు వనవాసం అనుభవించవలసి ఉంటుంది. -అదే- అధ్యాయం - 39.

17. అర్జునుడు ఆ జమ్మి చెట్టునెక్కి అస్త్రాలను దింపమని ఉత్తరుని కోరతాడు. -అదే- అధ్యాయం - 40.

18. ఆ జమ్మి చెట్టుపై వున్న శవం గురించి ఉత్తరుని సందేహాలు.-అదే-అధ్యాయం41.

19. అస్త్రాలను చూచి ఉత్తరుడు పొందిన ఉద్వేకం. -అదే- అధ్యాయం - 42.

20. అర్జునుడు ఆ అస్త్రాలను వివరించాడు. -అదే- అధ్యాయం - 43.

21. పాండవుల ఉనికిగురించి ఉత్తరుడు భోగట్టా చేస్తాడు.-అదే-అధ్యాయం-44.

22. చెట్టుపై నుండి ఉత్తరుడు దిగడం. -అదే- అధ్యాయం 45.

23. వానరం గుర్తుతో ఉన్న రథం. అతను అర్జునుడేనని ద్రోణుడు నిర్ధారణకు వస్తాడు. కౌరవ సైన్యాలకు కొన్ని అపశకునాలు కనిపిస్తాయి. -అదే- అధ్యాయం - 46.

24. అతను అర్జునుడేనని ద్రోణుడన్న మాటలకు భయపడిన సైన్యాన్ని దుర్యోధనుడు ఉత్సాహపరుస్తాడు. కర్ణుడు ద్రోణుని అవమానపరచి అతనిని సర్వ సైన్యాధ్యక్ష పదవి నుండి తొలగించాలని సూచిస్తాడు. -అదే- అధ్యాయం - 47.

25. కర్ణుని ప్రగల్భాలు, అర్జునుని ఓడిస్తానన్న ప్రతిజ్ఞా -అదే- అధ్యాయం - 48.

26. డంబములాడవద్దనీ ప్రగల్భాలు పలకవద్దనీ కృపాచార్యుడు కర్ణుని మందలించడం- యుద్ధం చెడ్డదని శాస్త్రాలు చెబుతున్నాయి. -అదే- అధ్యాయం - 49.

27. ద్రోణుని అవమానించినందుకు కర్ణుని, దుర్యోధనుడ్ని, అశ్వత్థామ తూలనాడడం. -అదే- అధ్యాయం - 50.

28. ద్రోణుని గురించి చెడ్డగా మాట్లాడినందుకు కర్ణుణ్నీ, దుర్యోధనుడ్నీ అశ్వత్థామ దూషిస్తాడు. 'నేను కేవలం సూతమాత్రుడివి కదా' అంటాడు కర్ణుడు. కాని రాముడు వాలిపట్ల ప్రవర్తించినంత దుర్మార్గంగానే అర్జునుడు కూడా వ్యవహరించాడు. -అదే- అధ్యాయం - 50.

29. భీష్మ, ద్రోణ కృపులు అశ్వత్థామను శాంతపరచేరు. దుర్యోధనుడు, కర్ణుడూ ద్రోణునికి క్షమాపణ చెప్తకుంటారు. -అదే- అధ్యాయం - 51.

30. పాండవులు తమ పదమూడేళ్ళనూ పూర్తి గావించారని భీష్ముడు నిర్ధారిస్తాడు. -అదే- అధ్యాయం - 52.

31. అర్జునుడు కౌరవ సైన్యాన్ని ఓడిస్తాడు. -అదే- అధ్యాయం - 53.

32. అర్జునుడు కర్ణభ్రాత నోడించాడు. అర్జునుడు కర్ణుని ఓడించాడు. కర్ణుడు పారి పోయాడు. -అదే- అధ్యాయం - 54.

33. అర్జునుడు కౌరవ సైన్యాన్ని నాశనం చేసి కృపాచార్యుని రథాన్ని విరగగొడతాడు. –అదే– అధ్యాయం – 55.

34. అర్జునునికీ కౌరవ సైన్యానికీ జరుగుతున్న సమరాన్ని చూడడానికి స్వర్గం నుండి దేవతలు బయటకు వస్తారు. –అదే– అధ్యాయం – 56.

35. కృపాచార్యార్జునుల మధ్య జరిగిన యుద్ధం. కృపాచార్యుడు పారిపోవడం. –అదే– అధ్యాయం – 57.

36. ద్రోణార్జునుల మధ్య జరిగిన యుద్ధం. ద్రోణుడు పారిపోవడం –అదే– అధ్యాయం – 58.

37. అశ్వత్థామార్జునుల మధ్య యుద్ధం. –అదే– అధ్యాయం – 59.

38. కర్ణార్జునుల మధ్య యుద్ధం, కర్ణుని ఓటమి. –అదే– అధ్యాయం – 60.

39. భీష్మునిపై అర్జునుడు తలపడడం. –అదే– అధ్యాయం – 61.

40. కౌరవ సైన్యాన్ని అర్జునుడు హతమార్చడం. –అదే– అధ్యాయం – 62.

41. భీష్ముని ఓటమి, రణరంగం నుండి అతను పారిపోవడం.–అదే–అధ్యాయం–64.

42. కౌరవ సైన్యం మూర్ఛపోవడం–భీష్ముడు వారిని తిరిగి యిళ్ళకు పొమ్మని చెప్పడం. –అదే– అధ్యాయం – 66.

43. అర్జునునికి కౌరవ సైన్యం లొంగిపోయి శరణు వేడటం. ఉత్తరుడూ, అర్జునుడూ, విరాట నగరికి తిరిగి వెళ్ళడం. –అదే– అధ్యాయం – 67.

44. విరటుడు తన రాజధానికి చేరుకోగా ప్రజలాతనిని సత్కరించడం. –అదే– అధ్యాయం – 68.

45. పాండవులు కొలువు కూటమికి ప్రవేశించడం. –అదే– అధ్యాయం – 69.

46. విరటునికి తన తక్కిన సోదరులను అర్జునుడు పరిచయం చేయడం. –అదే– అధ్యాయం – 71.

47. అర్జునుని కుమారునికీ, విరటుని కూతురికీ వివాహం –అదే– అధ్యాయం – 72.

48. ఆ పిమ్మట పాండవులు విరాటనగరం విడిచి ఉపప్లావ్యంలో నివసించడం. –అదే– అధ్యాయం – 72.

49. ఆ పిమ్మట అర్జునుడు తన కుమారుడు అభిమన్యునీ, వసుదేవునీ, యాదవునీ అన్యతదేశం నుంచి రప్పించడం –అదే– అధ్యాయం – 72.

50. కాశీరాజు, శల్యుడు మొదలగు యుధిష్ఠిర మిత్రులు రెండు అక్షౌహిణుల సైన్యంతో వస్తారు. అలాగే యజ్ఞసేన ద్రుపదరాజులు ఒక అక్షౌహిణి వస్తారు. ద్రుపదుని అందరూ కొడుకులూ అజింక్య, శిఖండి, ధృష్టద్యుమ్నుడు కూడా వస్తారు. –అదే– అధ్యాయం – 72.

## ఉద్యోగపర్వం

1. అభిమన్యుని వివాహం అయిన తర్వాత యాదవులూ, పాండవులు విరటుని సభలో సమావేశమయ్యారు. కృష్ణుడు భవిష్యత్ కార్యక్రమం గురించి వారితో ప్రసంగిస్తాడు. కౌరవ పాండవులిద్దరికీ శ్రేయస్కరమైనదానిని మనం చేయాలి. ధర్మరాజు దేనికైనా ఒప్పుకుంటాడు–ఒక్క గ్రామం యిచ్చినా సరే–ధర్మానికి కట్టుబడి–అతనికి దుర్యోధనుని సమస్త రాజ్యం యిచ్చినా, దానిని పుచ్చుకోడు. ఇంతవరకూ పాండవులు నీతిని పాటించారు. కాని కౌరవులు అవినీతికి పాల్పడితే కౌరవులను చంపడానికి వారు సంకోచించరు. పాండవుల సంఖ్య తక్కువని ఎవరూ జంకవలసిన అవసరం లేదు. వాళ్ళ సహాయానికి రావడానికి వారికెందరో స్నేహితులున్నారు. కౌరవుల ఉద్దేశాలేమిటో కనుక్కోడానికి ప్రయత్నించాలి. దుర్యోధనుని వద్దకు ఒక రాయబారిని పంపి, రాజ్యంలోని ఒక భాగాన్ని పాండవులకిమ్మని చెప్పించాలని నా సూచన. –ఉద్యోగపర్వం– అధ్యాయం – 1.

2. బలరాముడా కృష్ణుని సూచనను ఆమోదిస్తూ శకుని చేతుల్లో ఓడిపోతుండడం తెలిసి కూడా (ద్యూతమాడడం) ధర్మరాజు చేసిన తప్పని చెపుతాడు. అందుచేత కౌరవులతో పోరు సల్పకుండా సంధి ద్వారా సాధ్యమైనంత రాజ్యం పుచ్చుకోమంటాడు. –అదే– అధ్యాయం – 3.

3. సాత్యకి లేచి బలరాముని వైఖరిని ఖండిస్తాడు. –అదే– అధ్యాయం – 3.

4. ద్రుపదుడు సాత్యకిని బలపరుస్తాడు. ద్రుపదుడు తన పురోహితుని రాయబారిగా పంపడానికి అంగీకరిస్తాడు. –అదే– అధ్యాయం – 4.

5. కృష్ణుడు ద్రుపదుని సమర్థించి ద్వారకకు వెళ్తాడు. ద్రుపద విరాటులు ఆహ్వానించిన రాజులు వస్తారు. అదేవిధంగా దుర్యోధనుడు పిలిపించిన రాజులు వస్తారు. –అదే– అధ్యాయం – 5.

6. సభలో ఎలా మాట్లాడాలో, ఎలా వ్యవహరించాలో తన పురోహితునికి ద్రుపదుడు బోధపరుస్తాడు.

7. అర్జునుడూ, దుర్యోధనుడూ యుద్ధంలో సహాయాన్ని అర్థించడానికి ద్వారకకు వెళ్తారు. యిద్దరికీ సాయం చేస్తానని ఆయన అన్నాడు–ఒకనికి నా సైన్యాన్ని యివ్వగలను

ఒకనికి నేనొక్కడినే సాయం రాగలను. మీకేది కావాలో కోరుకోండి. దుర్యోధనుడు సైన్యాన్ని కోరుకున్నాడు–అర్జునుడు కృష్ణుని కోరుకున్నాడు. –అదే– అధ్యాయం – 7.

8. శల్యుడు పెద్ద సైన్యంతో పాండవుల వద్దకు వస్తాడు. దుర్యోధనుడతనిని తన్నుకుపోగా తలచేడు. శల్యుడు పాండవుల్ని కలియడం. పాండవులు యుద్ధంలో కర్ణుని నిరుత్సాహపరచమని శల్యుని కోరుట. శల్యుని సమ్మతి –అదే– అధ్యాయం – 8.

| | | | |
|---|---|---|---|
| 9. | అధ్యాయం | 9 | అప్రస్తుతం |
| 10. | అధ్యాయం | 10 | అప్రస్తుతం |
| 11. | అధ్యాయం | 11 | అప్రస్తుతం |
| 12. | అధ్యాయం | 12 | అప్రస్తుతం |
| 13. | అధ్యాయం | 13 | అప్రస్తుతం |
| 14. | అధ్యాయం | 14 | అప్రస్తుతం |
| 15. | అధ్యాయం | 15 | అప్రస్తుతం |
| 16. | అధ్యాయం | 16 | అప్రస్తుతం |
| 17. | అధ్యాయం | 17 | అప్రస్తుతం |
| 18. | అధ్యాయం | 18 | అప్రస్తుతం |

19. అధ్యాయం సాత్యకి తన సైన్యంతో పాండవుల వద్దకు వస్తాడు.
భగదత్తుడు దుర్యోధనుని వద్దకు వెళ్తాడు.

20. అధ్యాయం – 20 – ద్రుపద పురోహితుడు కౌరవ సభలో ప్రవేశిస్తాడు. పాండవులు తమకు జరిగిన ఎగ్గులు సైచి కౌరవులతో సఖ్యానికి సిద్ధంగా వున్నారని పురోహితుడు చెప్తాడు. పాండవులకు పెద్ద సైన్యం వున్నప్పటికీ సంధి చేసుకోడాన్నే కోరుకుంటున్నారనీ చెప్తాడు.

21. అధ్యాయం 21–భీష్ముడు పురోహితుని సమర్థిస్తాడు. కర్ణుడు అభ్యంతరం చెప్తాడు. భీష్ముడూ, కర్ణుడూ కలహించుకుంటారు. తమ తరఫున సంజయుని రాయబారానికి పంపమని ధృతరాష్ట్రుడు సూచిస్తాడు.

22. అధ్యాయం 22–ధృతరాష్ట్రుడు పాండవులకు తన ఆశీస్సులందజేయమనీ, ఏది ఉత్తమమనీ, యిద్దరికీ వైరం పెంచకుండా వుండేదనీ ఆ పరిస్థితులలో తనకు తోస్తే ఆ ప్రకారం చెప్పమనీ సంజయుని పంపిస్తాడు.

23. అధ్యాయం 23–సంజయుడు పాండవుల కడకు వెళ్ళుట.

24. అధ్యాయం 24–సంజయ, యుధిష్ఠిరుల సంవాదము.

25. అధ్యాయం 25–సంజయుడు యుద్ధాన్ని నిరసించుట.

26. అధ్యాయం 26–ధర్మరాజంటాడు "కౌరవులు మా ఇంద్రప్రస్థ రాజ్యాన్నిస్తే చాలు

నేను సంధికి యిష్టపడతాను."

27. అధ్యాయం 27-గురుజనాన్ని చంపి రాజ్యాన్ని పొందడం అధర్మం. యుద్ధం లేకుండా కౌరవులు రాజ్యాన్ని యివ్వనిరాకరిస్తే వృష్ణి, అంధక రాజ్యంలో అడుక్కొని బ్రతకడం మేలు.

28. అధ్యాయం 28-అంటాడు ధర్మరాజు "మేము ధర్మం తప్పి సంచరించామని గాని, సంచరిస్తున్నామని గాని నీవు తలిస్తే మమ్ము నిందించు-సంజయుడు స్వధర్మమో సామమో కోరుకుంటున్నానంటాడు.

29. అధ్యాయం 29-యుద్ధం ఎందుకు న్యాయసమ్మతమో కృష్ణుడు సంజయునికి చెప్పి, తన అభిప్రాయాలను వెళ్ళి ధృతరాష్ట్రునికి చెప్పమంటాడు.

30. అధ్యాయం 30-సంజయుడు కౌరవుల వద్దకు తిరిగి వెళ్ళి ఇంద్రప్రస్థాన్ని తిరిగి పాండవులకు ఇచ్చివేయడమో, యుద్ధానికి సిద్ధం కావడమో చేయాలని దుర్యోధనునితో చెప్తాడు.

31. అధ్యాయం 31-బ్రతికి యితరులను బ్రతకనివ్వమని చెప్తాడు. ఇంద్రప్రస్థాన్ని యివ్వ లేకపోతే అయిదూళ్ళిమ్మని చెప్తాడు.

32. అధ్యాయం 32-ఆ రాత్రి సంజయుడు ధృతరాష్ట్రుని కలిసి, ధర్మరాజు సందేశాన్ని నీకు ఉదయాన్నే చెప్తాను అంటాడు.

33. అధ్యాయం 33-ధృతరాష్ట్రుడు ఆత్రుతతో, సంజయుడు తెచ్చిన సందేశాన్ని వెంటనే తెలుసుకొనగోరతాడు. కనుక వెంటనే సంజయుని రప్పించుకుంటాడు. సంజయుడా సందేశాన్ని తెలిపి, రాజ్యంలోని భాగం వారికిచ్చివేసి వివాదాన్ని పరిష్కరించుకోమంటాడు.

34. అధ్యాయం 34-ధృతరాష్ట్రుడు విదురుని పిలిపించుకొని అతని సలహాను అడుగుతాడు. అతని సలహా పాండవులకు వారి రాజ్యభాగాన్ని యిమ్మని.

35. అధ్యాయం 35-అప్రస్తుతం.

36. అధ్యాయం 36-అప్రస్తుతం-రెండు పక్షాల వారికీ మైత్రి కూర్చమని ధృతరాష్ట్రుడు విదురునికి చెబుతాడు.

37. అధ్యాయం 37-అప్రస్తుతం.

38. అధ్యాయం 38-అప్రస్తుతం.

39. అధ్యాయం 39-దుర్యోధనుడు చెడ్డవాడైనప్పటికీ అతనిని నేను విడిచిపెట్టుకోలేనని ధృతరాష్ట్రుడు విదురునితో చెప్తాడు.

40. అధ్యాయం 40-చతుర్వర్ణాలను విదురుడు వివరిస్తాడు.

41. అధ్యాయం 41–ధృతరాష్ట్రుడు బ్రహ్మ గురించి విదురుని అడుగుతాడు. నేను శూద్రుణ్ణి, కాబట్టి నేను చెప్పలేనంటాడు. అప్పుడు సనత్సుజాతుడు వస్తాడు.

42. అధ్యాయం 42–బ్రహ్మ విద్య గురించి సనత్సుజాత ధృతరాష్ట్రులకు జరిగిన సంభాషణ.

43. అధ్యాయం 43–అదే విషయంపై సనత్సుజాత ధృతరాష్ట్రుల సంవాదం.

44. అధ్యాయం 44–బ్రహ్మ విద్య గురించి సనత్సుజాతుడు చెబుతాడు.

45. అధ్యాయం 45–సనత్సుజాతుడు యోగాన్ని బోధిస్తాడు.

46. అధ్యాయం 46–ఆత్మ విషయంపై సనత్సుజాతుడు.

47. అధ్యాయం 47–సంజయుడు తెచ్చిన సందేశాన్ని వినడానికి కౌరవులు సభకు వస్తారు.

48. అధ్యాయం 48–సంజయుడు సందేశాన్ని చెప్పడం. (ప్రత్యేకించి అర్జునుడు చెప్పిన సందేశభాగం?)

49. అధ్యాయం 49–భీష్ముడు అర్జునునీ, కృష్ణునీ పొగడడం. కర్ణునికి కోపం వస్తుంది. ద్రోణుడు భీష్ముని సమర్ధించి, సంధి చేసుకొమ్మని సలహా యిస్తాడు.

50. అధ్యాయం 50–పాండవుల పక్షాన వున్న వారెవరు, వారి బలమెంత అని సంజయుని ధృతరాష్ట్రుడు అడుగుతాడు. సంజయుడు కోపంగా సమాధానం చెబుతాడు.

51. అధ్యాయం 51–భీష్ముని (బల) పరాక్రమాలను తలచుకొని ధృతరాష్ట్రుడు నిట్టూరుస్తాడు.

52. అధ్యాయం 52–అర్జునుని (బల) పరాక్రమాన్ని తలచుకొని ధృతరాష్ట్రుడు నిట్టూర్చుతాడు.

53. అధ్యాయం 53–ధర్మరాజు, అతని మిత్రుల బలపరాక్రమాలను తలచుకుంటాడు. పాండవులతో సంధి చేసుకొమ్మని తన కుమారులతో చెప్తాడు.

54. అధ్యాయం 54–కౌరవుల ఓటమిని (పరాజయాన్ని) సంజయుడు ఊహిస్తాడు.

55. అధ్యాయం 55–మన సైన్యం వారి సైన్యం కంటె పెద్ద కనుక పాండవులు మనల్ని జయించలేరని దుర్యోధనుడంటాడు.

56. అధ్యాయం 56–పాండవుల సైన్య వ్యూహరచనా విధానాన్ని సంజయుడు వర్ణిస్తాడు.

57. అధ్యాయం 57–కౌరవవీరుల్ని ఎలా హతమార్చాలని పాండవులు వ్యూహం పన్నేరో

సంజయుడు వర్ణిస్తాడు. పాండవులకంటె పెద్ద సైన్యమున్న కౌరవులను వాళ్ళు ఓడించగలరన్న భయం తనకు లేదని దుర్యోధనుడు చెబుతాడు.

58. అధ్యాయం 58-పోరు వద్దని దుర్యోధనునితో ధృతరాష్ట్రుడు చెబుతాడు. యుద్ధం నుండి తొలగేది లేదని దుర్యోధనుడు ప్రతిజ్ఞ (శపథం) చేస్తాడు. ధృతరాష్ట్రుడు దుఃఖిస్తాడు.

59. అధ్యాయం 59-కృష్ణార్జునులు ఏం మాట్లాడుకున్నారో తనకు చెప్పమని ధృతరాష్ట్రుడు సంజయుని అడుగుతాడు.

60. అధ్యాయం 60-దేవతలు పాండవులకు సహాయపడతారనీ కౌరవుల్ని నాశనం చేస్తారనీ దుర్యోధనునితో ధృతరాష్ట్రుడంటాడు.

61. అధ్యాయం 61-తనకా భయం లేదంటాడు దుర్యోధనుడు.

62. అధ్యాయం 62-తానొక్కడే అర్జునుణ్ణి చంపగల సమర్థుణ్ణని కర్ణుడంటాడు.

63. అధ్యాయం 63-కర్ణునిపై విశ్వాసంతోనే తాను పోరాడుతున్నాననీ, భీష్మ ద్రోణాదులను నమ్ముకొని కాదనీ, దుర్యోధనుడంటాడు.

64. అధ్యాయం 64-విరోధాన్ని విడిచిపెట్టమని విదురుడు దుర్యోధనునికి చెప్తాడు.

65. అధ్యాయం 65-ధృతరాష్ట్రుడు దుర్యోధనుని మందలిస్తాడు.

66. అధ్యాయం 66-అర్జునుని సందేశాన్ని సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్తాడు.

67. అధ్యాయం 67-కౌరవ సభలో కొలువు తీర్చిన రాజులు తమతమ నివాసాలకు తిరిగి వెళ్తారు-వ్యాసుడూ, గాంధారీ విదురునితో వస్తారు. కృష్ణార్జునుల నిజ స్వరూపాల గురించి తనకు తెలిసిందంతా ధృతరాష్ట్రునికి చెప్పమని సంజయునితో వ్యాసుడు చెప్తాడు.

68. అధ్యాయం 68-కృష్ణుని గురించి సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్తాడు.

69. అధ్యాయం 69-కృష్ణుని శరణు వేడుమని దుర్యోధనునితో ధృతరాష్ట్రుడు చెప్తాడు. దుర్యోధనుని తిరస్కారం. గాంధారి దుర్యోధనుని మందలిస్తుంది.

70. అధ్యాయం 70-కృష్ణునికి గల వేర్వేరు పేర్లు; అవి ఎలా వచ్చాయి-వివరణ.

71. అధ్యాయం 71-ధృతరాష్ట్రుడు కృష్ణునికి లొంగిపోవడం.

72. అధ్యాయం 72-యుధిష్ఠిర కృష్ణుల సంభాషణ:

ధృతరాష్ట్రునిపై ఆధారపడవద్దని సంజయుడు తనతో చెప్పినట్లు యుధిష్ఠిరుడు చెప్తాడు. ఆస్తియొక్క ప్రాముఖ్యాన్ని యుధిష్ఠిరుడుగ్గడిస్తాడు. క్షాత్ర ధర్మం దానిని పాటించవలసిన ఆవశ్యకత గురించి చెప్తాడు. కృష్ణుడు కౌరవుల వద్దకు వెళ్తానని అంటాడు. యుధిష్ఠిరునికి ఆ ఉద్దేశం

నచ్చలేదు. అయినా నీవేది తలపోస్తే అదే ఉత్తమమైనది అంటాడు.

73. అధ్యాయం 73-కృష్ణుడు తన మనసులోని మర్మాన్ని ధర్మరాజుకు చెబుతాడు. పాండవులతో మెత్తని మాటలు మాట్లాడకు అని ధర్మరాజుతో కృష్ణుడంటాడు. కౌరవులతో నీవు సంధి చేసుకోకూడదనటానికి బోలెడు కారణాలున్నాయి. వారు ద్రౌపదిని పరాభవించిన తీరును నొక్కి చెబుతాడు. అందుచేత 'ఓ ధర్మరాజా! వాళ్ళని చంపడానికి వెనుదీయకు'-అంటాడు.

74. అధ్యాయం 74-కౌరవులతో మెత్తగా మాట్లాడమని కృష్ణునితో భీముడంటాడు.

75. అధ్యాయం 75-భీముని కృష్ణుడెగతాళి చేస్తాడు.

76. అధ్యాయం 76-యుద్ధం చేయటానికి భీముడు నిశ్చయించుకుంటాడు.

77. అధ్యాయం 77-దైవ, పౌరుషాల మధ్య గల భేదాన్ని కృష్ణుడు భీమునికి చెప్తాడు.

78. అధ్యాయం 78-శమాన్ని పాటించమని అర్జునుడు కృష్ణునితో చెప్తాడు-అది తప్పితే యుద్ధం గురించి యోచించవచ్చును అంటాడు.

79. అధ్యాయం 79-అర్జునునితో కృష్ణుని మాటలు-శాంతియుతంగా పరిష్కారాన్ని రాబట్టటానికి ప్రయత్నిస్తాను. అది సాధ్యపడకపోతే యుద్ధానికి సిద్ధంగా ఉండు. అయిదూళ్ళిస్తే ఒప్పుకుంటాననే ధర్మజుని అంగీకారాన్ని దుర్యోధనునికి నేను తెలియజెప్పను.

80. అధ్యాయం 80-ఏది తనకు ఉత్తమమో దానిని చేయమని కృష్ణునితో నకులుడు చెప్తాడు.

81. అధ్యాయం 81-సహదేవుడు కృష్ణుని కలిపి కౌరవులతో యుద్ధం వచ్చేటట్లు చేయమంటాడు. అక్కడ సమావేశమైన వీరులందరూ సహదేవుని అభిప్రాయాన్నే ఆమోదిస్తున్నారని సాత్యకి చెప్తాడు.

82. అధ్యాయం 82-ద్రౌపది కృష్ణుని కలుసుకొని, దుర్యోధనుడు శిక్షింపబడే వరకూ తాను స్వస్థపడలేనని చెబుతుంది. కృష్ణుడామెకు వాగ్దానం చేస్తాడు.

83. అధ్యాయం 83-అర్జున శ్రీకృష్ణుల మలి సమావేశం. శమం గురించి తీవ్ర యత్నాలు చేస్తాడు అర్జునుడు-కుంతిని అనునయించమని కృష్ణునితో యుధిష్ఠిరుడు చెబుతాడు. కృష్ణుడు బయలుదేరుతాడు.

84. అధ్యాయం 84-హస్తినాపురం వెళ్ళే మార్గంలో కృష్ణునికి కన్పించిన శుభాశుభ శకునాలు.

85. అధ్యాయం 85-కృష్ణుని హస్తినాపుర ప్రయాణంలో విశ్రాంతికి దుర్యోధనుడు స్థావరాలు ఏర్పాటు చేస్తాడు. కృష్ణుడు హస్తినాపురం ప్రవేశించడం.

86. అధ్యాయం 86-కృష్ణుని సత్కరించడానికి ఏ కానుకలు సమర్పించాలో విదురునికి ధృతరాష్ట్రుడు చెప్తాడు.

87. అధ్యాయం 87-పాండవుల నుండి కృష్ణుని వేరు చేయడం తనకు సాధ్యం కాదని విదురుడు ధృతరాష్ట్రునితో చెప్తాడు.

88. అధ్యాయం 88-కృష్ణుని పూజించడానికి యిది సమయం కాదని అంటాడు. పాండవులతో సంధి చేసుకోమని దుర్యోధనునితో భీష్ముడు చెప్తాడు. కృష్ణుని బాధింపతలపోస్తాడు దుర్యోధనుడు. భీష్ముడు అతనిని తీవ్రంగా ప్రతిఘటిస్తాడు.

89. అధ్యాయం 89-కృష్ణుని హస్తినాపుర ప్రవేశం-ధృతరాష్ట్రునితో సమావేశం. విదురునితో విడిది.

90. అధ్యాయం 90-కుంతీకృష్ణుల సమావేశం-కుంతి విచారం. కృష్ణుడామెను ఓదార్చడం. (1) రాజ్యం కోసం సంగ్రామం చేయమని నా కుమారులతో చెప్పు. (2) ద్రౌపదికి నా సానుభూతిని చెప్పు అని కృష్ణునితో కుంతి అన్నది.

91. అధ్యాయం 91-కౌరవులు విందుకు కృష్ణునాహ్వానిస్తారు. కృష్ణుడు తిరస్కరిస్తాడు. విదురుని యింటికి భోజనానికి కృష్ణుడు వెళ్తాడు.

92. అధ్యాయం 92-కౌరవుల వద్దకు అతను వెళ్ళడం తనకు నచ్చదని కృష్ణునితో విదురుడంటాడు.

93. అధ్యాయం 93-కౌరవులందరూ కలిసినా తనకు హాని చేయలేరని విదురునితో కృష్ణుడు చెప్తాడు. శమం పుణ్య కారకం కాబట్టి మాత్రమే తాను వచ్చానని చెప్తాడు.

94. అధ్యాయం 94-కౌరవ సభా మందిరాన్ని కృష్ణుడు ప్రవేశిస్తాడు.

95. అధ్యాయం 95-కృష్ణ రాయబారము. సంధికైనా సరే, సమరానికైనా సరే పాండవులు సంసిద్ధమేనని కృష్ణుడు సభలో ప్రకటిస్తాడు. వారి అర్ధరాజ్యం వారికివ్వండి-అంటాడు.

96. అధ్యాయం 96-దర్పం (అహంభావం) చెడ్డదని జమదగ్ని ఒక కథ చెప్తాడు.

97. అధ్యాయం 97-నుండి 105-మాతలీ ఆఖ్యానం.

98. అధ్యాయం 106-దుర్యోధనునికి నారదుని హితవు.

99. అధ్యాయం 106-123-గాలవాఖ్యానం.

100. అధ్యాయం 124-దుర్యోధనునికి హితవు చెప్పమని కృష్ణుని ధృతరాష్ట్రుడర్థించుట.

101. అధ్యాయం 125-దుర్యోధనునికి భీష్ముని హితవు. ద్రోణుని సమర్థన. దుర్యోధనుని విదురుడు నిందించుట. ధృతరాష్ట్రుని హితవు.

102. అధ్యాయం 126-భీష్మద్రోణులు రెండవసారి దుర్యోధనునికి హితవు చెప్పట.

103. అధ్యాయం 127-పాండవులకు ఏమీ యివ్వనని దుర్యోధనుడు ప్రకటిస్తాడు.

104. అధ్యాయం 128-కృష్ణుడు దుర్యోధనుని నిందించుట, దుర్యోధనుని సభా నిష్క్రమణ. దుశ్శాసనుని ప్రసంగం. భీష్మునికి కృష్ణుని హెచ్చరిక.

104. అధ్యాయం 129-గాంధారిని సభలోనికి తీసుకొని రమ్మని విదురుని ధృతరాష్ట్రుడాదేశించటం - దుర్యోధనుడు తిరిగి వస్తాడు. పాండవులకు అర్ధరాజ్యమిమ్మని గాంధారి అతనిని అడుగుతుంది.

104. అధ్యాయం 130-దుర్యోధనుడు సభను విడిచి వెడతాడు. కృష్ణుని చంపే ఆలోచన. ఆరహస్య మంత్రాంగం గురించి ధృతరాష్ట్రునికి సాత్యకి తెలియపరచటం. శ్రీకృష్ణుని ప్రసంగం. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని సభకు తిరిగి పిలిపించటం. హెచ్చరించటం. విదురుడా తనిని అభిశంసించటం.

105. అధ్యాయం 131-భగవానుని విశ్వరూపదర్శనము. ధృతరాష్ట్రునికి దివ్య చక్షువులు రావడం. కృష్ణుడు సభను విడిచి కుంతి వద్దకు వెళ్ళడం.

106. అధ్యాయం 132-సభలో ఏమి జరిగినదో కుంతికి కృష్ణుడు చెబుతాడు. క్షత్రియులకు యుద్ధం సహజమని కుంతి అతనితో చెబుతుంది. అంతకు మించిన ధర్మం లేదు అంటుంది.

107. అధ్యాయం 133-తానన్న అంశానికి బలాన్ని చేకూర్చేందుకు విదుల కథను కృష్ణునకు కుంతి చెబుతాడు.

108. అధ్యాయం 134-విదుల గాథ.

109. అధ్యాయం 135-విదుల గాథ.

110. అధ్యాయం 136-విదుల గాథ.

111. అధ్యాయం 137-కుంతి తన కుమారులకిచ్చిన సందేశం. కర్ణునికి కృష్ణుని సలహా. ఉపప్లావ్య నగరికి తిరుగు ప్రయాణం.

112. అధ్యాయం 138-భీష్మద్రోణులు దుర్యోధనునికిచ్చిన హితవు.

113. అధ్యాయం 139-భీష్మని సంతాపము. ద్రోణుదు మళ్ళీ దుర్యోధనునికి హితవు చెప్పడం.

114. అధ్యాయం 140-ధృతరాష్ట్ర సంజయుల సంభాషణ. కర్ణునికి కృష్ణుడు సలహా ఇవ్వడం.

115. అధ్యాయం 141-కృష్ణునికి కర్ణుని సమాధానము.

116. అధ్యాయం 142-పాండవులు గెలిచి తీరతారని కర్ణునికి కృష్ణుడు నొక్కి చెబుతాడు.

117. అధ్యాయం 143-కర్ణునికి అపశకునాలు కన్పించడం. పాండవులను కడతేర్చడానికి దృఢ నిశ్చయానికి రావడం-ఇంటికి పోవడం.

118. అధ్యాయం 144-విదుర ప్రథల సంభాషణ, దుర్యోధనుడు యుద్ధానికే నిశ్చయించుకున్నట్లు తెలుస్తుంది. కుంతి సంతాపము. కర్ణుని పుట్టుక గురించి అతనికి చెప్పాలనుకుంటుంది. నదీ తీరానికి కుంతి వెళ్తుంది.

119. అధ్యాయం 145-కర్ణుని కుంతి కలుసుకొని అతని జననం గురించి తెలిపి పాండవులతో కలిసిపొమ్మని కోరడం.

120. అధ్యాయం 146-కుంతి సూచనను సూర్యుడు సమర్థిస్తాడు. కర్ణుని తిరస్కారం. అర్జునుని తప్ప పాండవులనందరిని రక్షిస్తానని వాగ్దానం చేయటం.

121. అధ్యాయం 147-కృష్ణుడు పాండవులను కలిసికొనడం. కౌరవ సభలో ఏమి జరిగినదీ చెప్పమని యుధిష్టిరుడడుగుతాడు.

122. అధ్యాయం 147, 148, 149, 150-కృష్ణుడు సర్వ వృత్తాంతాన్ని చెప్పటం.

123. అధ్యాయం 151-పాండవ సైన్యానికి సేనాపతి నియామకం. పాండవసేన కురుక్షేత్రంలో ప్రవేశించటం.

124. అధ్యాయం 152-సైన్యానికి సంభారాలు అందించడానికి చేసిన ఏర్పాట్ల వర్ణనం.

125. అధ్యాయం 153-కౌరవ పక్షంలో సన్నాహం. మన సైన్యం రేపు వేకువనే కురుక్షేత్రమును ప్రవేశించాలి.

126. అధ్యాయం 154-యుద్ధానికి వెళ్ళడం వల్ల ధర్మ భ్రష్టుడనవుతానేమోనని ధర్మజుని భీతి, కృష్ణుడతనిని సమాధానపరిచాడు. నీవు యుద్ధం చేయాలి అని అర్జునుడన్నాడు.

127. అధ్యాయం 155-దుర్యోధనుని సేనా వర్ణన.

128. అధ్యాయం 156-కౌరవ సేనకు భీష్ముని సేనాపతిని చేసారు. కర్ణుడలిగేడు. భీష్ముడు గతించే వరకూ తాను యుద్ధం నిశ్చయానికి వచ్చాడు. కౌరవ సైన్యం కురుక్షేత్రంలో ప్రవేశించింది.

129. అధ్యాయం 157-కృష్ణుడు పాండవ సేనాధిపతి కావడం.

130. అధ్యాయం-కౌరవ నాశనం నాకిష్టం లేదని చెప్పి బలరాముడు తీర్థయాత్రకు పోవడం.

131. అధ్యాయం 158–అర్జునునికీ అక్కరలేక దుర్యోధనునికీ అక్కరలేక రుక్మి యింటికి మరలడం.

132. అధ్యాయం 159–సంజయ ధృతరాష్ట్ర సంవాదం. సంజయుడు ధృతరాష్ట్రుని నిందించుట.

133. అధ్యాయం 160–హిరణ్యవతీ నదీ తీరాన పాండవ సైన్యం–దుర్యోధనుడు పాండవులకు పరుషంగా సందేశాలు పంపడం–కృష్ణుడు సత్తువ ఉంటే యుద్ధం చేయమనడం.

134. అధ్యాయం 161–ఉలూక సందేశం.

135. అధ్యాయం 162–కోపగించిన పాండవులు–కుపిత సందేశాలు పంపటం. రేపు ఉదయమే యుద్ధమని ప్రకటించటం.

అనువాదం: 'కళాప్రపూర్ణ' డా. గణపతిరాజు అచ్యుతరామరాజు,
డా. పి.ఆపదరావు.

# అధ్యాయం – 15

# బ్రాహ్మణ క్షత్రియ పోరాటాలు

[ఈ రాత ప్రతిలో టైపు చేసిన నలభైమూడు పూర్తి పేజీలు ఉన్నాయి. విడిగా వున్న పేజీలనన్నింటిని గుదిగుచ్చారు. దీని మూల శీర్షిక "బ్రాహ్మణులూ, క్షత్రియులూ–ప్రతి విప్లవం" కాని, దీనిని డాక్టర్ అంబేద్కర్ స్వదస్తూరీతో "బ్రాహ్మణ క్షత్రియ పోరాటాలు" అని సవరించారు. ఈ వ్యాసం సంపూర్ణమేననిపిస్తోంది –సంపాదకులు.]

హిందువుల పవిత్ర గ్రంథాలలో బ్రాహ్మణులకు క్షత్రియులకు మధ్య సంఘర్షణలే కాదు నెత్తుటేర్లు పారిన యుద్ధాలు కూడా జరిగాయని తెలియజేసే ఉదంతాలు కోకొల్లలు.

అలాంటి వాటిలో మనకు తెలుస్తున్న మొదటి వివాదం వేనరాజుది. వేనుడు క్షత్రియుడు. రాజు. బ్రాహ్మణులతో అతని సంఘర్షణకు సప్రామాణికంగా ఎన్నో గ్రంథాలలో ప్రస్తావించటం జరిగింది. ఈ క్రింది వృత్తాంతం హరివంశంలోనిది.

"[1]శక్తి సామర్థ్యాల్లో అత్రేయుని పోలిన అతని వంశం వాడే అయిన అంగుడు అనే ధర్మ రక్షకుడైన ప్రజాపతి (జీవులకు ప్రభువు) వుండేవాడు. మృత్యువు కుమార్తె అయిన సునీత అతని భార్య. వీరి కుమారుడే ప్రజాపతి అయిన వేనుడు. అతడు విధి నిర్వహణలో నిర్లక్ష్యం చూసేవాడు – తన తాత అయిన కాలుని (మృత్యువు) వల్ల సంక్రమించిన అవలక్షణాలతో వేనుడు తన విధులను తోసిరాజని, కామప్రభావంతో మోహావేశుడై జీవించాడు. వేదవిహిత కర్మల్ని నిరాకరించి, అరాచకత్వాన్ని ఆశ్రయించి, మతరహితమైన వర్తనను నెలకొల్పాడు వేనుడు. అతడి పాలనలో వేదాధ్యయనం, వషట్కారం లోపించాయి. యజ్ఞాలు మొదలైన కర్మలవల్ల లభించే హవిస్సులు తాగటానికి దేవతలకు అవకాశం లేకపోయింది.

'బలిగానీ, హవిస్సుగానీ నివేదించకూడదు'–అన్నది వేనుని కఠోర శాసనం. "నేనే హోతను, నేనే భోక్తను! ఈ బలులూ–హవిస్సులూ నాకే చెందేవి" అని పోగాలం సమీపించిన వేనుడు ఆజ్ఞాపించాడు. తనకులేని అధికారాలను తనకు తానే ప్రకటించుకొని, ధర్మాన్ని అతిక్రమించి ప్రవర్తిస్తున్న వేనుని దగ్గరకు మరీచి నాయకత్వంలో ఋషులంతా వెళ్ళారు. వేనునితో మరీచి "ఓ వేనా! అధర్మాన్ని ఆచరించకు. కొన్నేళ్ళు పట్టే యజ్ఞాన్ని ఒకదాన్ని నిర్వహించతలపెట్టాం. నువ్వు ప్రజాపతి అత్రివంశంలో పుట్టినవాడివి. ప్రజా సంరక్షణ కోసం నీ జీవితం వినియోగం కావాలి. ఈ కార్య నిర్వహణలో నీవూ పాలుపంచుకోవాలి" అన్నాడు. ఏది మంచో, ఏది చెడో గ్రహించలేని మూర్ఖుడైన వేనుడు హేళనగా వారితో "ధర్మ నిర్దేశం జేయగలవాడు నాకంటే

మరొకడు ఎవడున్నాడు? ఎవడి ఆజ్ఞల్నో నేనెందుకు పాటించాలి? జ్ఞాన సంపత్తిలో, సంస్కార నిర్వహణల్లో, శమదయాదుల్లో, సత్యపాలనలో నాతో సమానమైనవాడు భూమ్మీద వేరొకడు ఉన్నాడా? మీరంతా ఒక భ్రమతో జ్ఞానశూన్యులై–సర్వసృష్టి చైతన్యానికీ; సమస్త ధర్మాలకీ మూల కారకుణ్ణి నేనేనన్న విషయం తెలుసుకోలేకపోతున్నారు. నేనే గనక తలచుకుంటే భూమిని తలక్రిందులు చేయగలను. జలప్రళయాన్ని కల్పించగలను. భూమ్యాకాశాలను మూసివేయగలను– అని అంటే నమ్మటానికి సందేహించకండి"–అన్నాడు. అహంకారంతో కన్నూమిన్నూ కానకుండ విర్రవీగే వేనుని మాటలకు కోపగించుకున్న ఆతపస్య పుణ్యులైన మహర్షులు అతణ్ణి పట్టుకొని తమ ఎడమ తొడపై వేసి రుద్దారు. అప్పడా తొడలోంచి నల్లని రంగుతో ఒక పొట్టివాడు పుట్టాడు. వాడు భయం భయంగా చేతులు జోడించి నిలబడ్డాడు. అప్పుడు అత్రివాడితో "కూర్చో! (నిషిదా!)" అన్నాడు. వేనుని కల్మషంలోంచి పుట్టిన అతను నిషాద జాతికి మూల పురుషుడయ్యాడు. అంతేకాదు 'ధివర'ల (జాలరుల)కు మూల పురుషుడయ్యాడు."

ఇక రెండోది పురూరవునికి సంబంధించినది. ఇళకు కుమారుడు, వైవస్వత మనువుకు మనవడు అయిన పురూరవుడు క్షత్రియుల్లో మరో ముఖ్యమైన రాజు. ఇతడు బ్రాహ్మణులతో పడిన ఘర్షణకు సంబంధించి భారతం ఆదిపర్వంలో పేర్కొన్న అంశాల గురించి ప్రస్తావిద్దాం.

"2మనకు తెలిసి తల్లిగాను, తండ్రిగాను కూడ తానే ప్రసిద్ధికెక్కిన ఇళకు జన్మించిన మేధావి పురూరవుడు. దాదాపు పదమూడు ద్వీపాలను దేదీప్యమానంగా పరిపాలించాడు. ఎంతో ప్రతిభావంతుడైన అతని కొలువులో మహా మేధావులు కొందరు ఉండేవారు. ఈ అధికార మదంతో పురూరవుడు బ్రాహ్మణులతో ఘర్షణకు దిగేవాడు. ఎంత అరచి గీపెట్టినా వదలకుండా హింసించి వాళ్ళ నగానట్రా దోచుకునేవాడు. సనత్కుమారుడు రంగప్రవేశం జేసి, పురూరవుణ్ణి బ్రహ్మలోకం నుంచి హెచ్చరించాడు. అయితే పురూరవుడు దీన్ని లెక్క చేయలేదు. చివరకు ఋషులే దిగివచ్చి శపించటంతో అందాక అధికార గర్వంతో విర్రవీగిన పురూరవ చక్రవర్తి అంతరించకతప్పలేదు."

బ్రాహ్మణుల మీద కత్తికట్టిన క్షత్రియ రాజుల్లో మూడవ వాడు నహుషుడు. పురూరవుని మనవడితడు. మహాభారతంలో రెండుచోట్ల ఇతని ప్రస్తావన వస్తుంది. అరణ్య పర్వంలో ఒకసారి, ఉద్యోగపర్వంలో మరోసారి, నహుషుని కథ ఉంది. ఉద్యోగ పర్వంలోంచి గ్రహించిన కథను ఇక్కడ చూద్దాం.

"3ఆవిధంగా వృత్తాసురుణ్ణి వధించిన తరువాత ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకం చుట్టు కుంటుందేమోనని (వృత్తుని బ్రాహ్మణునిగా పరిగణించారు) భయపడి పారిపోయి నీటిలో దాక్కు న్నాడు. అర్థాంతరంగా ఇంద్రుడు మాయం కావటంతో తీవ్ర విఘాతమేర్పడింది. దేవ, భూలోకాల వ్యవహారాలన్నిటికీ ఋషులు, దేవతలు నహుషుని ఇంద్రసింహాసనం అధిష్టించాల్సిందిగా కోరారు. మొదట్లో ఇష్టపడకపోయినప్పటికీ నచ్చచెప్పేసరికి నహుషుడు మనసు మార్చుకున్నాడు. ఇంద్ర

పదవి చేపట్టాడు. అప్పటిదాకా ఎంతో గౌరవంతో మంచిగా బ్రతికిన నహుషుడు భోగభాగ్యాల మోహంలో పడిపోయాడు. యాదృచ్ఛికంగా ఒకసారి ఇంద్రుని భార్య అయిన ఇంద్రాణిని చూడటంతో నహుషుని కన్ను ఆమె మీద పడింది. ఎలాగైనా ఆమెను పొందాలనుకున్నాడు. దీనికి భయపడిన ఇంద్రాణి దేవతా సంరక్షకుడైన అంగీరస బృహస్పతి శరణు కోరింది. ఇది తెలిసిన నహుషునికి ఆగ్రహం కలిగింది. పరపురుషుని భార్యను కోరటం మహాపాతకం అని నహుషునికి దేవతలు నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. దానిని పెడచెవిని పెట్టి నహుషుడు ఇంద్రుడంత నీచుణ్ణి కాను అని వ్యభిచార కుతంత్రాలలో తాను వాదించాడు.

బృహస్పతితో నహుషుని వాదన ఇంకా ఇలా కొనసాగింది. "పరమ పవిత్రుడైన గౌతముని భార్య అహల్యను ఇంద్రుడు చెరచినప్పుడు ఇంద్రుణ్ణి మీరు ఎందుకు వారించలేకపోయారు? గతంలో ఇంద్రుడు ఎన్నో హీనమైన, అధర్మ వర్తనాలకీ, మోసాలకీ పాల్పడ్డాడు. అప్పుడతనిని మీరెందుకు వారించలేదు?" దీనితో దేవతలు ఇంద్రాణిని తీసుకొని రావటానికి వెళ్ళారు. బృహస్పతి మాత్రం పట్టు విడువలేదు. అతని సలహాతో ఇంద్రాణి నహుషుని కొంత గడువు అడిగింది. తన భర్తను వెదకటానికి వెళుతున్నాననీ, ఒకవేళ అతడు కన్పించకపోతే నీ కోరికను తీరుస్తాను అన్నది. ఆమె అభ్యర్థనను నహుషుడు అంగీకరించాడు. నిశాదేవి (ఉపశ్రుతి, రహస్యభేది) సహాయంతో తన భర్తను వెదకటానికి ఇంద్రాణి బయలుదేరింది. హిమాలయాల ఉత్తరాన సముద్ర మధ్య భూఖండంలోని ఒక సరోవరంలో ఒక తామరతూడులో సూక్ష్మరూపంలో ఇంద్రుడు దాక్కొని ఉండటం ఇంద్రాణి చూచింది. నహుషుని దురాలోచన గురించి భర్తకు వివరించింది. అతని శక్తియుక్తులు ఉపయోగించి నహుషునిబారి నుంచి తనను రక్షించమని తన ఆధిపత్యాన్ని నెలకొల్పమని ఇంద్రాణి అర్థించింది. నహుషుడు మహా బలశాలి అంటూ వెంటనే రంగప్రవేశం చేయడానికి ఇంద్రుడు నిరాకరించాడు. అయితే నహుషుని పదభ్రష్టుని చేయడానికి ఓ ఉపాయాన్ని ఇంద్రాణికి సూచించాడు. "ఋషులు మోసే దివ్య వాహనంలో నన్ను దర్శిస్తే కోరిక తీరుస్తాను" అని నహుషునితో చెప్పమని ఆమెకు ఇంద్రుడు సలహా ఇచ్చాడు.

"ఓ దేవతల రాజా! విష్ణువు కానీ, రుద్రుడు కానీ, అసురులు గానీ, రాక్షసులు కానీ మున్నెన్నడూ ఎరుగని వాహనంలో నిన్ను చూడాలని వుంది. మహా ఋషులందరూ కలిసి నిన్ను పల్లకీలో మోయాలి, అది నాకు ఆనందదాయకం." నహుషుడు ఈ విన్నపాన్ని సానుకూలంగా ఆలకించాడు. ఆ సందేశానికి సమాధానమిస్తూ తనను తానే ఇలా అభినందించుకున్నాడు.

"మహర్షుల చేతనే పల్లకి మోయించబోయే పరాక్రమశాలీ! నహుషా! నీ ధీరత్వం ఎంత గొప్పది. గతం వర్తమానం, భవిష్యత్ అంతా నీదే! ప్రపంచం అంతా నీ మీదే ఆధారపడి ఉంది. నువ్వు ఆగ్రహిస్తే ప్రపంచమే లేదు.... దేవీ ఇంద్రాణీ! సందేహం లేకుండా నీ కోరిక తీరుస్తాను. సప్తర్షులు, బ్రహ్మర్షులు పల్లకిలో నన్ను మోసుకొస్తారు. వేచి ఉండు. అందాల రాశీ! నా అదృష్ట దేవతా! నా భాగ్యరాశీ"....... ఇంకా ఇలా కొనసాగింది. 'ఈ విధంగా మదాంధుడు, దురాచారుడు కామంతో కళ్ళు మూసుకుపోయినవాడు, గుణహీనుడు అయిన నహుషుడు

మహాత్ములైన మునీశ్వరుల్ని తన పల్లకి మోయవలసిందిగా ఆజ్ఞాపించాడు.' ఇంద్రాణి తిరిగి బృహస్పతి దగ్గరకు వెళ్ళింది. బృహస్పతి ఆమెతో-నహుషునికి తగిన శాస్తి తప్పక జరుగుతుందని హామీ యిచ్చాడు. అహంకారంతో విర్రవీగిన నహుషుని పతనం కోసం, ఇంద్రుడు దాగివున్న రహస్య స్థావరం తెలుసుకోవడం ఓ యజ్ఞం చేస్తానని చెప్పాడు. ఆ తరువాత ఇంద్రుని జాడ తెలుసుకోవటం కోసం అగ్నిని పంపించటం, అగ్నితో కలసి ఇంద్రుడు రావటం జరుగుతాయి. ఇంద్రుడు వచ్చాక అతను లేని సమయంలో ఏయే సంఘటనలు జరిగాయో బృహస్పతి వివరించాడు. ఇంద్రుడు, కుబేరుడు, యముడు, సోముడు, వరుణులతో సమావేశమై నహుషుని పతనానికి సన్నాగం సన్నుతుండగా అగస్త్యుడు అక్కడికి వచ్చాడు. శత్రువైన నహుషుడు పతనం చెందినందుకు ఇంద్రుణ్ణి అభినందించి, నహుషుడు చివరకు ఎలా పతనం చెందినదీ, పదవీ భ్రష్టుడైనదీ చెప్పటం ప్రారంభించాడు:

మదాంధుడు మహాపాపి అయిన నహుషుని-మహామహులైన దేవర్షులు, విష్కల్మషులైన బ్రహ్మర్షులు, పల్లకీ మీద మోసుకెళుతున్న సందర్భంలో ఒక ధర్మ సందేహాన్ని తీర్చమని ఇలా అడిగారు. "ఓ రాజా! వాసవా! (నహుషా) అసమాన విజేతా! గోవధా సమయంలో బ్రాహ్మణులు పఠించే మంత్రాలు నీకు ప్రమాణాలా? కావా?" మూఢ చేతస్కుడై, అజ్ఞానం చేత "కావు" అని సమాధానం యిచ్చాడు నహుషుడు. అపుడు ఋషీశ్వరులు "నీవు అధర్మ ప్రవర్తకుడవు. నీవు ధర్మాన్ని చేరుకోలేవు. పూర్వ మహామునీశ్వరులే ఇవి ప్రమాణాలని మాకు చెప్పారు"-అని అన్నారు. అప్పుడు నహుషునికి ఋషులకు వివాదం జరిగింది. ఆగ్రహించిన నహుషుడు మును లతో వివాదపడుతూ, నన్ను కాలితో తన్నాడు. దానితో నహుషుడి తేజస్సు సమస్తం నశించింది. ప్రాభవం బూడిద అయిపోయింది. వెంటనే భయంతో కలవరపడిపోయాడు. నేను "మూర్ఖుడా? నీవు పరమ పూజ్యమైన, ప్రాచీనమునులు పొందుపరిచిన బ్రహ్మర్షులు అనుష్ఠించే వేదాన్ని అధ ర్మవర్తనతో నిందించావు. పైగా నా తలపై కాలితో తన్నావు. బ్రహ్మసమానులైన మహర్షుల చేత పల్లకి మోయించుకున్నావు. కాబట్టి నీవు తక్షణమే ఇంద్రపద భ్రష్టుడవై పదివేల సంవత్సరాలు ఘోరసర్పమై భూమి మీద పడి ఉండు. ఆ తరువాత మరల నీకు స్వర్గప్రాప్తి కలుగుతుంది" అని శపించాను. వెంటనే ఆ మూర్ఖ నహుషుడు స్వర్గలోకం నుండి తలక్రిందులుగా భూతలంపై పడిపోయాడు" అని సంతోషంగా అగస్త్యుడు ఆ తరువాత కథ ఇలా చెప్పాడు. "కనుక ఇంద్రా! ఇపుడు బ్రాహ్మణులకు శత్రువైన నహుషుడు నాశనం అయ్యాడు మనమిక వర్ధిల్లుతాం. కాబట్టి మూడు లోకాల్ని నీ ఆధీనంలోకి తెచ్చుకో. ముల్లోకాల జనుల్ని రక్షించేందుకు కంకణం కట్టుకో! ఓ శచీపతీ! ఇంద్రియాలను జయించు. శత్రువులను నిర్మూలించు. ఋషులచేత ఆశీస్సులు, మన్ననలు పొందు" అని అగస్త్యుడు ఆ కథను ముగించాడు.

ఇక నాలుగవది నిమిరాజ వృత్తాంతం. ఇక్ష్వాకుని కుమారులలో నిమి ఒకడు. బ్రాహ్మ ణులతో అతని సంఘర్షణకు సంబంధించిన వివరాలు విష్ణు పురాణంలో కనిపిస్తాయి. దాని ప్రకారం:

"4వెయ్యి సంవత్సరాలు కొనసాగే ఒక యజ్ఞాన్ని చెయ్యటానికై బ్రహ్మర్షి వశిష్టుణ్ణి (హోత) యజ్ఞ నిర్వాహకుడుగా పిలిచాడు నిమి. అంతకు పూర్వమే 500 సం.లు పట్టే యజ్ఞాన్ని ఇంద్రునికి నిర్వహించటానికి ఒప్పుకున్నాననీ, అందువల్ల ముందుగా దాన్ని పూర్తిచేసి తరువాత వస్తానని వశిష్టుడు చెప్పాడు. దానికి నిమి ఏమీ బదులీయలేదు. అతను ఒప్పుకున్నాడని భావించి వశిష్టుడు వెళ్ళిపోయాడు. అతను తిరిగి వచ్చేటప్పటికి మరో బ్రహ్మర్షి అయిన గౌతముడు హోతగా యజ్ఞం జరుగుతుండడాన్ని చూచాడు. తన ఉద్దేశ్యాన్ని తెలియజేయకుండా నిర్లక్ష్యం చేసినందుకు ఆగ్రహించి వశిష్టుడు నిమిని "అశరీరుడవు" (విదేహుడవు) కమ్మని శపించాడు. ఈలోపు నిద్ర నుంచి మేల్కొన్న నిమి ఎలాంటి హెచ్చరిక చేయకుండానే శపించినందుకు వశిష్టునికి ప్రతిశాపం ఇచ్చి మరణించాడు. నిమి శరీరం భద్రపరచబడింది. యజ్ఞానంతరం హవిస్సును అందుకోవటానికి వచ్చిన దేవతలు, పురోహితుల కోరికపై నిమిని తిరిగి బ్రతికించటానికి ఒప్పుకున్నారు. కాని నిమి అందుకు అంగీకరించలేదు. అతని కోరిక మేరకు అతనికి అన్ని జీవుల కళ్ళలో నివసించే విధంగా వరమిచ్చారు–దేవతలు. ఫలితంగా అప్పటి నుంచి కళ్ళు ఎపుడూ మూసుకొని తెరచుకుంటూ ఉండటం సంభవించింది. ("నిమిష" అంటే రెప్పపాటు.")"

ఐదవ వృత్తాంతం వశిష్ట విశ్వామిత్రులకు సంబంధించినది. వశిష్టుడు బ్రాహ్మణ పూజారి. విశ్వామిత్రుడు క్షత్రియుడు. బ్రహ్మర్షి కావాలనేది విశ్వామిత్రుని ప్రగాఢ వాంఛ. ఆ కోరిక అతనికి ఎందుకు కలిగిందో తెలిపే వృత్తాంతాన్ని మనం రామాయణంలో చూడవచ్చు.

"5విశ్వామిత్రుని వంశవృక్షం చాలా పెద్దది. ప్రజాపతి కొడుకు కుశుడు. అతని కుమారుడు కుశనాభుడు. ఈతని కొడుకు గాధి. గాధి కొడుకే విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు వేలకు వేల సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలించాడు. ఒకసారి అతను భూప్రదక్షిణ చేస్తుండగా వశిష్టుని ఆశ్రమం కన్పించింది. ప్రశాంత వాతావరణం. శాంతం మూర్తీభవించిన మహర్షులు, సన్యాసులు, భక్తులతో కళకళలాడుతున్న ఆ ఆశ్రమ ప్రాంగణంలో విశ్వామిత్రుడు అడుగుపెట్టాడు. మొదట తిరస్కరించినా, తన పరివారంతో బాటు ఆ బ్రహ్మపుత్రుని ఆతిథ్యం స్వీకరించడానికి విశ్వామిత్రుడు అంగీకరించాడు. అందరికీ షడసోపేతమైన భోజనాలను ప్రసాదించిన వశిష్టుని ధేనువుపై విశ్వామిత్రుడి కన్నుపడింది. లక్ష గోవులను ఇస్తానన్నప్పటికీ వశిష్టుడు కామధేనువును ఇవ్వడానికి అంగీకరించలేదు. దానికి విశ్వామిత్రుడు "కామధేనువు రత్నం లాంటిది. దేశంలో ఉన్న మణులన్నీ రాజు సొత్తే కనుక ధేనువును పొందే హక్కు తనకుంద"ని వాదనకు దిగాడు. వశిష్టుడు ఒప్పుకోకపోతే విశ్వామిత్రుడు తన ధరను విపరీతంగా పెంచాడు. ఫలితం లేకపోయే సరికి అతని కోపం తారాస్థాయిని చేరింది. ఉచ్చ, నీచాలు మరిచి, కృతఘ్నుడై బలవంతాన ధేనువును హరించబోయాడు. ఆ పవిత్రమైన ఆవు కట్లు తెంచుకొని వశిష్టుని వద్దకు వచ్చి తనను త్యజించినందుకు వశిష్టుణ్ణే నిందించింది. అప్పుడు వశిష్టుడు "నిను వదిలిపెట్టాలన్న కోర్కె నాకే మాత్రమూ లేదు. కానీ ఏం చేయను? విశ్వామిత్రుడు శక్తివంతుడు" అన్నాడు. అప్పుడా ధేనువు "ఎవరూ క్షత్రియుణ్ణి శక్తివంతునిగా పరిగణించరు. బ్రాహ్మణుల కంటే శక్తివంతులెవరూ లేరు వారి శక్తి అనంతమైనది, దైవదత్తమైనది. క్షత్రియుల శక్తి కంటె ఉన్నతమయినది. నీ

బలం అపరిమితం. విశ్వామిత్రుడు వీరుడు కావచ్చు గానీ మీకంటే శక్తివంతుడు కాడు. మీ శక్తి అజేయమైనది. నన్ను ఆజ్ఞాపించండి మీ బ్రాహ్మణీయ శక్తులతో మీరు సాధించిన నేను గర్వంతో విర్రవీగుతున్న విశ్వామిత్రుని పొగరు అణుస్తాను" అని శపథం చేసింది. తన శరీరం నుంచి వంద మంది పహ్లవులను సృష్టించింది. వారు విశ్వామిత్రుని సేనను చెల్లాచెదరు చేసినా అతని ధాటికి తట్టుకోలేక మరణించారు. అప్పుడు వివిధ ఆయుధాలు ధరించిన యవనుల్ని, శకుల్ని సృష్టించి విశ్వామిత్రుని పైకి పంపింది కామధేనువు. విశ్వామిత్రుని సైన్యాన్ని వీరు నాశనం చేశారు. అయితే అతని ధాటికి తట్టుకోలేక మరణించారు. ఈసారి యుద్ధ కళలో ఆరితేరిన వివిధ తెగల బలశాలురను కామధేనువు సృష్టించింది. వారు విశ్వామిత్రుని కాల్బలాన్నీ అశ్వబలాన్నీ, గజబలాన్నీ – మొత్తం సైన్యాన్ని సంహరించారు. అప్పుడు విశ్వామిత్రుని నూరుగురు పుత్రులు వశిష్టుని ఆశ్రమంపై దండెత్తి ధ్వంసం చేశారు. కానీ వారంతా వశిష్టుని మంత్ర మహిమకు మాడి మసై పోయారు. దీంతో చలించిన విశ్వామిత్రుడు తన కుమారుల్లో ఒకరికి రాజ్యభారాన్ని అప్పగించి, హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేశాడు. మహాదేవుని అనుగ్రహం వల్ల ఎలాంటి వారినైనా ఓడించగల అన్ని శస్త్ర విద్యలనూ నేర్చుకోవడంతో పాటు ఆ దేవదేవుని నుంచి అపూర్వ శక్తి గల అస్త్రాలను పొందాడు. నేరుగా వశిష్టుని ఆశ్రమానికి వచ్చి దాన్ని సర్వనాశనం చేశాడు. అక్కడి ఆశ్రమవాసులను తరిమాడు. తీవ్ర ఆగ్రహంతో వశిష్టుడు తన బ్రహ్మ దండాన్నెత్తాడు. విశ్వామిత్రుడు తన అస్త్రాన్నెత్తి, శత్రువును సవాలు చేశాడు. అతని పరాక్రమం చూపమని చెబుతూ వశిష్టుడు "బ్రాహ్మణ శక్తితో, క్షత్రియుని శక్తికి పోలిక ఎక్కడ? దివ్యమైన నా శక్తిని చూడు, క్షత్రియాధమా!" అని, విశ్వామిత్రుని గర్వాన్ని అణుస్తానని ప్రకటించాడు. నిప్పును నీరు ఆర్పినట్టు విశ్వామిత్రుడి శస్త్రాన్ని బ్రహ్మదండం ఓడించింది. బ్రహ్మపాశం, కాలపాశం, వరుణపాశం, విష్ణుచక్రం, శివుని త్రిశూలం వంటి అనేక దివ్యాస్త్రాలను విశ్వామిత్రుడు ప్రయోగించాడు. బ్రహ్మపుత్రుడైన వశిష్టుడు వాటన్నిటినీ తన దండంలో లీనం చేశాడు. ఆఖరికి విశ్వామిత్రుడు మహా శక్తి సంపన్నమయిన బ్రహ్మాస్త్రాన్ని వశిష్టుని పైకి వదిలాడు. దాన్ని కూడా వశిష్టుడు ఎదుర్కొన్నాడు. అప్పుడు వశిష్టుడు ఉగ్రరూపం దాల్చాడు. "ఆయన నవ రంధ్రాల నుండీ అగ్నిజ్వాలలు ఎగిశాయి. అతని చేతిలోని బ్రహ్మదండం పొగలేని జ్వాలవలె, యముని మరియొక రాజదండము వలె మెరిసింది." అయితే అతని శత్రువు ఓటమిని చాటుతూ, మునులు నచ్చజెప్పగా వశిష్టుడు ప్రతీకార వాంఛను విడిచిపెట్టాడు. "క్షత్రియ శక్తి సిగ్గుపడాలి. బ్రాహ్మణ శక్తే నిజమైన శక్తి. ఒకే ఒక బ్రహ్మదండం నా అస్త్ర శస్త్రాలన్నింటినీ నాశనం చేసింది" అని విశ్వామిత్రుడు కుమిలిపోయాడు.

విశ్వామిత్రునికి ఏమీ పాలుపోలేదు. రెండు ప్రత్యామ్నాయాలు కనిపించాయి. ఒకటి, ఓటమిని అంగీకరించడం. మరొకటి, తాను కూడా బ్రాహ్మణత్వాన్ని సాధించడం. రెండో మార్గాన్ని ఎన్నుకున్నాడు విశ్వామిత్రుడు. "నేను ఇంద్రియాలనూ, బుద్ధినీ నియంత్రించి, నియమబద్ధమైన జప, తపాదులతో బ్రాహ్మణస్థాయిని అందుకోవాలి." తీవ్రమైన నిసుగుతో, భయంతో, మూలుగుతూ, తన శత్రువుపై తీవ్రమైన కోపంతో దక్షిణానికి వెళ్ళి తన నిర్ణయాన్ని అమలుచేశాడు. ఒక వెయ్యి సంవత్సరాల క్రితం బ్రహ్మ ప్రత్యక్షమై అతనికి రాజర్షిత్వాన్ని ప్రసాదించాడు. ఆతర్వాత

తన తపోబలం వల్ల విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయ్యాడు."

విశ్వామిత్రునికి, వశిష్టునికీ మధ్య వివాదానికి మరో కారణం వున్నట్లు తెలుస్తోంది. ఇక్ష్వాకుని వంశం వాడైన సుదాసువి రాజ్యపాలన కాలంలో ఈ గొడవ మొదలైంది. వశిష్టుడు సుదాసునికి కుల పురోహితుడు. ఇదమిద్ధంగా తెలియని కారణం వల్ల సుదాసుడు, విశ్వామిత్రుణ్ణి తన పురోహితునిగా నియమించాడు. ఇది వశిష్ట, విశ్వామిత్రుల మధ్య ఘర్షణకు దారితీసింది. అది చాలాకాలం కొనసాగింది.

వీరిద్దరి ఘర్షణ చిత్రమైన మలుపులు తిరిగింది. విశ్వామిత్రుడు ఎవరితోనైనా ఘర్షణ పడితే అక్కడల్లా వశిష్టుడు రంగప్రవేశం చేసి వ్యతిరేక వర్గంలో చేరేవాడు. అలాగే విశ్వామిత్రుడూను. ఈ విధంగా ఇద్దరూ ఒకరినొకరు దెబ్బ తీసుకునేవారు.

త్రిశంకుగా పేరు పొందిన సత్యవ్రతుని వృత్తాంతం ఇందులో మొదటిది. హరివంశంలోని కథ ఇలా సాగుతుంది.

"6వశిష్టుడు రాజు (సత్యవ్రతుని తండ్రి)తో తనకున్న గురుశిష్య సంబంధాన్ని పురస్కరించుకొని – అయోధ్యను, దేశాన్ని, అంతఃపురాన్ని తన ఆజ్ఞలలో నడిపేవాడు.

అయితే సత్యవ్రతునికి మూర్ఖత్వం వల్లనో లేక విధివశం వల్లనో వశిష్టునిపై చెప్పలేని కోపం.

(సకారణంగానే) తండ్రి తనను పదవీచ్యుతుణ్ణి చేసి ఇంటి నుంచి వెళ్ళగొడుతున్న సమయంలో అక్కడే ఉన్న వశిష్టుడు కనీసం పల్లెత్తు మాట కూడా అనలేదు. సరికదా, తన మౌనంతో ఈ చర్యను సమర్థించాడు. అందువల్ల సత్యవ్రతునికి వశిష్టుడంటే వల్లమాలిన కోపం. "సప్తపది పూర్తయినప్పుడే వివాహం జరిగినట్టు లెక్క. కానీ ఏడవ అడుగు వేయక ముందే నేను ఆ కన్యను ఎత్తుకొచ్చాను, ధర్మసూక్ష్మాలు తెలిసిన వశిష్టుడు కూడా ఈ విషయాన్ని గుర్తించి నన్ను సమర్థించడం లేదు." ఆవిధంగా ఔచిత్యాన్ని దృష్టిలో ఉంచుకుని ప్రవర్తించిన వశిష్టునిపై సత్యవ్రతుడు మనసులో కోపాన్ని పెంచుకున్నాడు. తన తండ్రి తన మీద విధించిన మౌన తపస్సు పవ్యతను కూడా అతను అర్థం చేసుకోలేదు... ఆ తపస్సు పూర్తయ్యాక తాను తిరిగి తన కుటుంబంలో తన స్థానాన్ని పొందానని అతను భావించాడు. కానీ సత్యవ్రతుణ్ణి పక్కకు నెట్టి తన కుమారుణ్ణి రాజుగా నియమించడాన్ని వశిష్టుడు ఆపలేదు. పరాక్రమవంతుడైన సత్యవ్రతుడు పన్నెండు సంవత్సరాల తపస్సు ముగించి ఆకలితో కళ్ళు తెరిచేసరికి కామితార్థాలను తీర్చే వశిష్టుని పాడి ఆవు కనిపించింది. ఆకలివల్లా, మైకంవల్లా, అలసటవల్లా, ఆగ్రహంతోనూ సత్యవ్రతుడు దశ కర్మలనూ విస్మరించి ఆ గోవును వధించి...

ఆ మాంసాన్ని తినడమే కాక విశ్వామిత్రుని పుత్రులచే కూడా తినిపించాడు. ఇది తెలిసి వశిష్టుడు ఆగ్రహించాడు. మూడు పాపాలు చేసిన కారణంగా త్రిశంకు నామాన్ని సత్యవ్రతునిపై విధించాడు. దేశ సంచారం నుంచి తిరిగి వచ్చిన విశ్వామిత్రుడు తాను లేనిరోజుల్లో ఎన్నో కష్టాలు పడి తన భార్యాబిడ్డలను పోషించిన సత్యవ్రతునికి కృతజ్ఞతతో ఒక వరమిస్తానన్నాడు. బొందితోనే స్వర్గానికెళ్ళే వరం కోరాడు త్రిశంకు. పన్నెండు సంవత్సరాలు కరువు అనంతరం, తండ్రి సామ్రాజ్యానికి సత్యవ్రతుణ్ని రాజుగా చేశాడు విశ్వామిత్రుడు. అతని తరఫున యజ్ఞాన్ని నిర్వహించాడు. దేవతల్నుంచి, వశిష్టుని[7] నుంచి ఎంత వ్యతిరేకత ఎదురయినప్పటికీ బొందితోనే (రాజును) సత్యవ్రతుణ్ణి స్వర్గానికి పంపించాడు."

2. హరివంశంలో చెప్పబడిన కథ ఇది:

"[8]జరిగిన దుర్మార్గానికి ఫలితంగా ఆ రాజ్యంలో పన్నెండు సంవత్సరాల పాటు ఇంద్రుడు వర్షాలు కురిపించలేదు. ఆ సమయంలో విశ్వామిత్రుడు తన భార్యాబిడ్డలను వదలి, తపస్సు చేసుకోవటానికి సముద్ర తీరానికి వెళ్ళిపోయాడు. దుర్భర దారిద్ర్యాన్ని భరించలేని అతని భార్య వంద గోవులకు తన రెండవ కుమారుని అమ్మటానికి ప్రయత్నిస్తున్న సందర్భంలో సత్యవ్రతుడు ఆమె ప్రయత్నాన్ని విరమింపచేసి, అడవి జంతువుల మాంసంతో వారిని పన్నెండు సంవత్సరాల పాటు పోషించాడు. సత్యవ్రతుడు ఆ పన్నెండు సంవత్సరాలు తండ్రి ఆదేశం మేరకు మౌన తపస్సు చేసి శుద్ధుడయ్యాడు."

వశిష్టుడు, విశ్వామిత్రుడు ప్రత్యర్థులుగా కనిపించే మరో వృత్తాంతం కూడా ఉంది. అది త్రిశంకు కుమారుడైన హరిశ్చంద్రుని కథ. విష్ణు మార్కండేయ పురాణాల్లో ఈ కథ వుంది. ఆ కథ ఇలా సాగుతుంది.

"ఒక సందర్భంలో హరిశ్చంద్రుడు వేటకు వెళ్లాడు. అతడు వేటాడుతున్నప్పుడు స్త్రీ ఆర్తనాదాలు వినిపించాయి. ఆ ఆర్తనాదాలు, తమను ఇంతకు ముందు ఎవ్వరూ సాధించనంత స్థాయిలో విశ్వామిత్రుడు వశం చేసుకుంటున్నాడని కొన్ని తంత్రశక్తులు చేస్తున్న హాహాకారాలు. విఘ్నేశ్వరుడి వల్ల ప్రేరేపితుడై, బలహీనులకు అండగా రాజు ఉండాలనే క్షత్రియ ధర్మాన్ని అనుసరించి హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడి దగ్గరకెళ్ళి ఇలా అన్నాడు. "దేదీప్యమైన శక్తితోను, అగ్నితుల్యమైన పరాక్రమంతోను అందరికి ప్రభువునైన నేనిక్కడ ఉండగానే గుడ్డలో అగ్నిని మూటగట్టడానికి ప్రయత్నిస్తున్నదెవరు? వాడికి ఈరోజుతో నూకలు చెల్లాయి. నా అమ్ములపొది నుంచి భూమ్యాకాశాలు మిరుమిట్లు గొలిపేలా నా ధనుస్సు నుంచి వచ్చిన బాణాలు వాడి సర్వాంగాలనూ తూట్లు పొడుస్తాయి" అన్నాడు. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని మాటలు విని రెచ్చిపోయాడు. అతని కోపంలో ఆ తంత్ర శక్తులన్నీ వెంటనే నశించాయి. ఇది చూచి అశ్వత్థవృక్షం ఆకుల్లాగా హరిశ్చంద్రుడు గజగజా వణికిపోయాడు. వినయంగా అర్హులైన బ్రాహ్మణులకు, పేదలకు దానధర్మాలు చేయడం, దుర్బలులను రక్షించడం, శత్రువులతో యుద్ధం చేయడం వంటి

రాజధర్మాలను అనుసరించి నేను అలా అన్నాను అని హరిశ్చంద్రుడు అన్నాడు. ఆ మాటలు విన్న విశ్వామిత్రుడు బ్రాహ్మణునకు దానం ఇస్తానన్నావు కాబట్టి నాకూ దానం ఇవ్వు అన్నాడు. అప్పుడు రాజైన హరిశ్చంద్రుడు విశ్వామిత్రునితో ఏది అడిగినా ఇవ్వడానికి నేను సిద్ధమేనన్నాడు. బంగారము, భార్య, శరీరం, సామ్రాజ్యం, యావదాస్తి ఏదైనా కోరమన్నాడు. అయితే అందుకు విశ్వామిత్రుడు రాజసూయయాగం నిర్వహించేందుకు అవసరమైంది కోరాడు. 'మొత్తం భూమండలమే నాపరం కావాలన్న వరం లాంటి కోరిక' కోరాడు. దానికి ఒప్పుకుని ఇంకా కోరుకొమ్మని రాజు అడగగా హరిశ్చంద్రుడు అతని భార్యా బిడ్డలు, పుణ్య సంపదా తప్ప మొత్తం సామ్రాజ్యాన్ని కోరాడు. దానికి హరిశ్చంద్రుడు ఎంతో ఆనందంగా అంగీకరించాడు. అప్పుడు విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని ఒంటిపైనున్న ఆభరణాలన్నింటినీ వొలిచి ఇవ్వమన్నాడు. నార బట్టలు ధరించి భార్యాబిడ్డలతో రాజ్యాన్ని వదిలిపొమ్మన్నాడు. అలాగేచేసి హరిశ్చంద్రుడు అడవులకు బయల్దేరి వెళ్తుండగా విశ్వామిత్రుడు మరల అడ్డగించి యజ్ఞానికి అవసరమైన ధనం చెల్లించమన్నాడు. తాను, తన భార్యాబిడ్డల శరీరాలు తప్ప తన దగ్గర ఏమీ లేదని హరిశ్చంద్రుడు అన్నాడు. కానీ విశ్వామిత్రుడు ఇచ్చిన వాగ్దానం తీర్చవలసిందేనని అన్నాడు. "బ్రాహ్మణులకు ఇచ్చిన మాట తప్పడం వినాశనానికి దారి తీస్తుంది" అని హెచ్చరించాడు. విశ్వామిత్రుని శాపానికి హరిశ్చంద్రుడు భయపడి ఇస్తానన్న పైకాన్ని నెల రోజులలో చెల్లిస్తానని గడువు తీసుకున్నాడు. కష్టమంటే ఏమిటో తెలియకుండా, సకల సౌకర్యాలతో గడిపిన చంద్రమతిని, బిడ్డను తీసుకొని ప్రజలు, సిబ్బంది వద్దువద్దని విలపిస్తూ వేడుకున్నా వినకుండా బయలుదేరాడు. తన ప్రజలు తనపై ప్రేమతో రాజ్యాన్ని వదిలినందుకు నిష్ఠూరాలు ఆడుతుంటే వింటూ నెమ్మదిగా ప్రయాణిస్తున్న హరిశ్చంద్రుని ఆలస్యానికీ, సంకోచానికీ ఆగ్రహించిన విశ్వామిత్రుడు దూషించడమే కాక, భర్త ఆసరాతో కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్న చంద్రమతిని తన దండంతో కొట్టాడు. అప్పుడు హరిశ్చంద్రుడు భార్యాబిడ్డలతో వారణాసికి – అది శివుని ప్రత్యేక క్షేత్రం కనుక మానవుల ఆస్తి కాదనే ఉద్దేశ్యంతో బయలుదేరాడు. కానీ అక్కడ విశ్వామిత్రుడు ఎదురై ఇచ్చిన గడువు పూర్తి కాక ముందే తన డబ్బు చెల్లించమని అడిగాడు. పరిస్థితిని అర్థం చేసుకున్న హరిశ్చంద్రుని భార్య శైవ (చంద్రమతి) తనను అమ్మివేసి విశ్వామిత్రుని బాకీ తీర్చమని దుఃఖంతో ప్రాధేయపడింది. ఈ ప్రతిపాదన విన్న హరిశ్చంద్రుడు మూర్ఛపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లి, దుఃఖంతో కుమిలిపోయాడు. మరలా మూర్ఛపోయాడు. భర్త పరిస్థితిని భరించలేని చంద్రమతి కూడా మూర్ఛపోయింది. భార్యాభర్తలిద్దరూ అపస్మారక స్థితిలో ఉండగా, తీవ్రమైన ఆకలితో బాధపడుతున్న వారి కుమారుడు (లోహితాస్యుడు) భోజనం కోసం ఆక్రందనలు చేయటం మొదలుపెట్టాడు. "నాన్నా! ఆకలవుతుంది. అమ్మా! తినటానికి ఏమైనా పెట్టమ్మా. ఆకలితో, దాహంతో నా నాలుక పిడచకట్టుకపోతుందమ్మా." అంటూ ఏడుస్తున్న సమయంలో విశ్వామిత్రుడు అక్కడికి తిరిగి వచ్చాడు. మొహమ్మీద నీళ్ళుజల్లి హరిశ్చంద్రుని మూర్ఛ నుండి లేపి, తక్షణమే తన బాకీ తీర్చమని అడిగాడు. ఈ మాట విని హరిశ్చంద్రుడు మళ్ళీ మూర్ఛపోయాడు. మళ్ళీ విశ్వామిత్రుడు అతనికి స్పృహ తెప్పించాడు. సూర్యాస్తమయమయ్యేలోగా బాకీ తీర్చని పక్షంలో శపిస్తానని బెదిరించాడు-విశ్వామిత్రుడు. భయపడిన చంద్రమతి అభ్యర్ధన మీద హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మడానికి ఒప్పుకున్నాడు. "నా నోటి వెంట అటువంటి మాట వస్తే, ఏ దేవతలు నన్ను క్షమిస్తారు? అంతకంటే అమానుషం ఏముంటుంది?" అన్నాడు. కానీ తప్పక

భార్యను విక్రయించే పనిమీద నగరంలోకి వెళ్ళాడు. తననుతాను నిందించుకుంటూ తన రాణిని బానిసగా అమ్మకానికి పెట్టాడు. ధనవంతుడైన బ్రాహ్మణుడొకడు-తన యింటిపని చేయటానికి తగిన వెల ఇచ్చి చంద్రమతిని కొనుక్కోటానికి ముందుకొచ్చాడు. కొన్నదే తడవుగా ఆమెను బరబరా ఈడ్చుకెళ్ళటం ప్రారంభించాడు. అది చూసిన లోహితుడు భోరున విలపిస్తూ "అమ్మా! అమ్మా!" అంటూ వెంటపడసాగాడు. బ్రాహ్మణుడతడ్ని కసరివిసరి కొట్టాడు. "అమ్మా! అమ్మా!" అంటూ లోహితుడు ఇంకా వెంటబడసాగాడు. అప్పుడు చంద్రమతి "దయచూపండి బాబూ! ఈ పనిదాని మీద దయ చూపండి. వీడు లేకుండా నేను బ్రతకలేను. మీరు నన్ను కొమక్కున్న మాట వాస్తవమే! కానీ పసిబిడ్డను వదిలేస్తే అంతకంటే నన్నుకొన్న ఉపయోగం ఉండదు. ఆవు వెంట దూడలాగ నన్నూ, వాడ్ని కలపండి." అంటూ దుఃఖంతో ప్రాధేయపడింది. బ్రాహ్మణుడు అంగీకరించాడు. బిడ్డకు కూడా వెలకట్టాడు.

డబ్బిచ్చి చంద్రమతిని, లోహితుడ్ని బ్రాహ్మణుడు తీసుకువెళ్ళిన మరుక్షణమే విశ్వామిత్రుడు ప్రత్యక్షమయ్యాడు. తన బాకీ తీర్చమన్నాడు. సజల నయనాలతో-ఉన్న సొమ్మంతా హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని చేతిలో పోసాడు. ఆ సొమ్మును అతి తక్కువగా భావించిన విశ్వామిత్రుడు కోపంతో ఊగిపోయి "ఉచ్చనీచాలు తెలియని ఓ క్షత్రియుడా! బ్రహ్మర్షినయిన నేను చేసే యజ్ఞానికి ఇంత తక్కువ సొమ్మునిస్తే ఇప్పుడే నా మానవాతీత తపశ్శక్తినీ, విశృంఖలమైన నా బ్రాహ్మణత్వపు భయంకర ప్రభావాన్నీ, నా పవిత్ర జ్ఞానాన్నీ చూపుతాను" అన్నాడు. దీనితో ఆందోళన చెందిన హరిశ్చంద్రుడు మరింత సొమ్ము ఇస్తానని వాగ్దానం చేశాడు. బాకీ తీర్చేందుకు హరిశ్చంద్రునికి అరపూట గడువిచ్చాడు విశ్వామిత్రుడు. ఎంతో గొప్పగా బ్రతికిన హరిశ్చంద్ర మహారాజు కడు దీన పరిస్థితికి దిగజారి చివరకి తననుతాను అమ్ముకోవడానికి కూడా సిద్ధపడ్డాడు. అతని త్యాగాన్ని చూచిన ధర్మదేవత మారువేషంలో దుష్టుడూ, దుర్మార్గుడూ అయిన ఛండాలుని రూపంలో వచ్చి ఎంత వెల ఇచ్చి అయినా హరిశ్చంద్రుడ్ని కొంటానన్నాడు. హరిశ్చంద్రుడు ససేమిరా ఒప్పుకోలేదు. ఛండాలుడుగా అమ్ముడుపోయే కంటే విశ్వామిత్ర శాపాగ్నిలో దహించుకుపోవటమే మంచిదన్నాడు హరిశ్చంద్రుడు. అది విని విశ్వామిత్రుడు ఛండాలుడు అంత సొమ్మునిస్తానంటే నీవు ఎందుకు అంగీకరించవు? అని అడిగాడు. ఇది చాలా నీచమైన పని అని, సూర్య వంశానికే అవమానమని హరిశ్చంద్రుడు చెప్పడంతో విశ్వామిత్రుడు మరింత మండిపడ్డాడు. చండాలునికే అమ్ముడుపోయి తన అప్పు తీర్చని పక్షంలో శాపానికి గురి కావలసి ఉంటుందని మళ్ళీ బెదిరించాడు. ఈ హైన్యతను తప్పించమనీ, కావాలంటే ఇవ్వవలసిన ధనానికి బదులు తాను విశ్వామిత్రుని బానిసగా ఉంటాననీ హరిశ్చంద్రుడు వేడుకున్నాడు. అన్నాడు. ఇదే అదనుగా తీసుకొని "నువ్వు ఇపుడు నా బానిసవు. కోటి రూపాయలకు నిన్ను నేను ఛండాలునికి అమ్ముతున్నాను" అని విశ్వామిత్రుడు ప్రకటించాడు.

ఛండాలుడు అమితానందం పొందాడు. విశ్వామిత్రునికి సొమ్ము చెల్లించి దీనస్థితిలో ఉన్న హరిశ్చంద్రుణ్ణి కట్టివేసి, కొట్టుకుంటూ తీసుకువెళ్ళాడు. ఛండాలుడు హరిశ్చంద్రుణ్ణి. స్మశానంలో కాపలా ఉండి సుంకం వసూలు చేయటం, శవాల మీద కప్పిన వస్త్రాలను హరించడం

చేయమన్నాడు. వాటి నుండి వచ్చే ఆదాయంలో ఒక కాసు మాత్రమే తీసుకొని మిగతాది ఛండాలునకు ఇవ్వడమనేది నియమం. ఈ నీచ వృత్తిలో గడిపిన సంవత్సరకాలం హరిశ్చంద్రునికి వందేళ్ళుగా అనిపించింది. ఇలా ఉండగా ఒకరోజు హరిశ్చంద్రుడు ఆ స్మశానంలో నిద్రిస్తున్నాడు. కలలో తన జీవితం కళ్ళ ముందు మెదిలింది. మేల్కొనేసరికి చంద్రమతి పాముకాటుకు మరణించిన కొడుకుని దహనం చేయటానికి తీసుకువచ్చింది. బాధలతో-కాలం తీసుకువచ్చిన మార్పులతో-మొదటి భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు గుర్తించుకోలేదు. ఆమె రోదనా స్వరం వల్ల ఎదురుగా ఉన్నది తన భార్య అని తెలుసుకున్న హరిశ్చంద్రుడు మూర్ఛపోయాడు. చంద్రమతిది కూడా అదే పరిస్థితి. మూర్ఛ నుండి తేరుకున్నారు ఇద్దరు. ఉన్న ఒక్కగానొక్క కొడుకు మరణించినందువల్ల హరిశ్చంద్రుడూ; పుత్ర మరణాన్ని కూడా మరపించే భర్త దుస్థితి వల్ల చంద్రమతీ దుఃఖ సముద్రంలో మునిగిపోయారు. భర్త అక్కున చేరి "నాథా! ఇది కలా నిజమా? లేక నేనే అలా ఆలోచిస్తున్నానా? నేను చూస్తున్నది నిజమైతే ధర్మానికి ద్రోహం జరిగినట్లే! ధర్మాన్ని ఆచరించే వాళ్ళకు శిక్ష ఇంత తీవ్రంగా ఉంటుందా" అని శోకంతో నిట్టూర్పు విడిచింది. యజమాని అనుజ్ఞ లేకుండా ఏ పని చేయటం ఇష్టంలేని హరిశ్చంద్రుడు పుత్రశోకభారంతో అన్నిటికీ తెగించి కొడుకు చితిపై ప్రాణ త్యాగానికి సిద్ధపడ్డాడు. "నేను దానధర్మాలను చేసిన వాడనే అయితే, యజ్ఞ యాగాదులను నిర్వహించిన వాడనే అయితే మరో లోకంలో అయినా భార్యాబిడ్డలను కలుసుకొందునుగాక" అని తనకుతాను సముదాయించుకున్నాడు. చంద్రమతి కూడా భర్త మార్గం అనుసరించడానికే నిశ్చయించుకుంది. ఇద్దరూ కలసి కుమారుడైన లోహితా స్యుని మృతదేహాన్ని చితిమీదకు చేర్చి పరమాత్మ అయిన నారాయణ కృష్ణుని ధ్యానిస్తూ వుండగా విశ్వామిత్రునితో పాటు ధర్మదేవత నాయకత్వంలో దేవతలందరూ ప్రత్యక్షమయ్యారు. తన ప్రయత్నాన్ని మానుకొమ్మని ధర్మదేవత హరిశ్చంద్రుణ్ణి కోరాడు. తాము నిర్వహించిన సత్కార్యాల ఫలితంగా హరిశ్చంద్రుడు, అతని భార్యాబిడ్డలు జయించారని ఇంద్రుడు ప్రకటించాడు. ఆకాశం నుండి అమృతం, పూలవర్షం కురిసింది. చితిమీది లోహితాస్యుడు జీవితాన్నీ, యవ్వనాన్నీ పొందాడు. రాజుకు రాణికి అపురూప ఆభరణాలు అలంకరణలుగా వచ్చాయి. అభినందనల మాలలు మెళ్ళో పడ్డాయి. అమితానందంతో ఇద్దరూ బిడ్డను కౌగిలించుకున్నారు. అయితే హరి శ్చంద్రుడు తన యజమాని ఛండాలుని అనుమతి లేనిదే తాను స్వర్గానికి రాలేనని అతను తనని కొనుక్కున్నాడని చెప్పాడు. అపుడు ధర్మదేవత తానే ఛండాలుని రూపంలో వచ్చి నిజాయితీని పరీక్షించానని చెప్పడంతో హరిశ్చంద్రుడు ఒక షరతుతో స్వర్గానికి వెళ్ళడానికి ఒప్పుకున్నాడు. తన ధర్మ నిర్వహణలో తన ప్రజలు పాలుపంచుకున్నారని, వారిని కూడా తనతో కనీసం ఒక్క రోజుకయినా వచ్చేందుకు అనుమతిస్తేనే తాను స్వర్గానికి వస్తానని హరిశ్చంద్రుడు అన్నాడు. అందుకు ఇంద్రుడు ఒప్పుకున్నాడు. తర్వాత విశ్వామిత్రుడు లోహితాస్యుడ్ని పట్టాభిషిక్తుడ్ని చేశాడు. సతీ పరివార సమేతంగా హరిశ్చంద్రుడు స్వర్గానికి వెళ్ళాడు.

సుఖాంతమయిందని భావిస్తున్న సమయంలో పన్నెండేళ్ళ పాటు గంగలో నివాసమేర్పరచు కొని దూరంగా ఉన్న వశిష్టునికి ఈ సంగతి తెలిసింది. హరిశ్చంద్రుని కుల గురువైన వశిష్టుడు ఇపుడిది తెలుసుకొని తీవ్రంగా మండిపడ్డాడు. బ్రాహ్మణులంటే ఎనలేని గౌరవం, దేవతల పట్ల

వల్లమాలిన భక్తి, విశ్వాసం కలిగిన మచ్చలేని మహారాజైన హరిశ్చంద్రుని పట్ల ఇంత అమానుషంగా ప్రవర్తించిన విశ్వామిత్రుని మీద పట్టరాని కోపం వచ్చింది. తన నూర్గురు పుత్రుల్నీ వధించినప్పుడు కూడా విశ్వామిత్రునిపై తనకింత ఆగ్రహం కలగలేదని వశిష్టుడు ప్రకటించాడు. "దీనితో ఆ దుష్టుడు, బ్రాహ్మణ శత్రువు నా శాపంతో జ్ఞానం గల జీవుల సమూహం నుంచి వెలివేయబడి, వివేకశూన్యుడై కొంగగా మారిపోవు గాక" అని శపించాడు. విశ్వామిత్రుడు కూడా వశిష్టుణ్ని 'ఆరి' జాతికి చెందిన పక్షిగా మారిపోతావని ప్రతిశాపమిచ్చాడు. రెండు వేల యోజనాల (18 వేల మైళ్ళ) ఎత్తున్న ఆరి, 3090 యోజనాల భయంకర రూపంలో బకము తీవ్రంగా పోరాడుకోవడం మొదలుపెట్టాయి. పొడవాటి రెక్కలతో ఒకదానికొకటి ఢీకొనడంతో మొదలయ్యింది పోరు. ఆరి తన గోళ్ళకు పని కల్పించింది. వాతావరణం భీకరంగా తయారయ్యింది. గోళ్ళు తాకిడికి కొండలు బ్రద్దలౌతున్నాయి. రెక్కల కదలిక సుడిగాలిని సృష్టిస్తోంది. భూమి కంపించిపోయింది. సముద్రాలు పొంగిపొర్లాయి. భూమి తన ఆధారాల నుండి తప్పి పాతాళంలోకి జారిపోయింది. ఈ విపత్తును పసిగట్టిన బ్రహ్మ సకల దేవతలు వెంటరాగా పోరాట స్థలానికి చేరుకున్నాడు. విశ్వ క్షేమాన్ని కోరి పోరు విరమించుకోవలసిందిగా విశ్వామిత్ర వశిష్టులను ఆదేశించాడు. అయినా వారిద్దరూ బ్రహ్మ జారీచేసిన హుకుంను లెక్క చేయలేదు. పోరాటం ఆపలేదు. వారిద్దరికీ సహజ రూపాలను తెప్పించడం ద్వారా ఈ పోరుకు అడ్డుకట్టవేశాడు–బ్రహ్మ. శాంతించి రాజీ పడమని సలహా ఇచ్చాడు.

విశ్వామిత్ర, వశిష్టుల మధ్య శతృత్వం తిరిగి అయోధ్య రాజైన అంబరీషుని వృత్తాంతంలో కనిపిస్తుంది.[9]

ఒకప్పుడు అంబరీషుడు యజ్ఞం చేస్తుండగా ఇంద్రుడు యజ్ఞపశువును అపహరించుకు పోయాడు. ఈ దుర్ఘటనకు కారణం రాజు పరిపాలనలో లోపమేననీ, ఒక నర పశువుని తెచ్చి యాగం పూర్తి చేయకపోతే మహా ప్రాయశ్చిత్తం అవసరమవుతుందనీ యాజకుడు చెప్పాడు. నరమేధం చేయటానికి అవసరమైన మనిషి కోసం తిరిగి తిరిగి అంబరీషుడు చివరకు భృగు వంశానికి చెందిన బ్రహ్మర్షి రుచికుడి దగ్గరకు వచ్చి అతని కుమారులలో ఒకరిని యజ్ఞపశువుగా అమ్మమని కోరాడు. అందుకు ప్రతిగా లక్ష గోవులను ఇస్తానన్నాడు. పెద్ద కొడుకును అమ్మనని రుచికుడు అన్నాడు. చివరి కొడుకును అమ్మనని ఆయన భార్య అంది. "పెద్ద కుమారుని మీద తండ్రికి, చిన్న కుమారుని మీద తల్లికి ప్రేమ ఉండటం సహజం" అని కూడా అంది. ఆ మాటలు విన్న రెండవ కొడుకు శునశ్శేపుడు, అలాంటప్పుడు తావే విక్రయించబడవలసిన వాణ్ణనీ, ఇస్తానన్న డబ్బు ఇచ్చి తనను తీసుకువెళ్ళమని అంబరీషుణ్ని కోరాడు. లక్ష గోవుల్ని, కోటి బంగారు నాణాల్ని, చెల్లించి శునశ్శేపుణ్ని తీసుకుని అంబరీషుడు బయలుదేరాడు. పుష్కర సమీపంలో ఋషులతో కలసి తపస్సు చేసుకుంటున్న మేనమామ విశ్వామిత్రుణ్ని చూడగానే శునశ్శేపునికి దుఃఖం ముంచుకొచ్చింది. అతని అక్కున చేరాడు. తన నిస్సహాయ అనాథ స్థితిని తెలియచేసి రక్షించమని వేడుకున్నాడు. విశ్వామిత్రుడు అతని మాటలకు జాలిపడ్డాడు. శునశ్శేపుణ్ని ఓదార్చి, తన కుమారులను పిలిచి వారిలో ఒకడ్ని అంబరీషుని వెంట యాగపశు

వుగా వెళ్ళమని ఆజ్ఞాపించాడు. విశ్వామిత్రుని ఆజ్ఞను మధుచ్ఛందసుడు తదితర పుత్రులు తిరస్కరించి పొగరుగా, వెక్కిరింతగా "ఇతరుల బిడ్డలను రక్షించడానికి, సొంత కొడుకులను బలియిచ్చేవాళ్ళు లోకంలో ఎవరైనా ఉంటారా? ఎవరి మాంసాన్ని వారు తినేటంతటి తప్పగా దీన్ని మేము పరిగణిస్తున్నాం." అని అన్నారు. తన ఆజ్ఞ తిరస్కరించటంతో విశ్వామిత్రుడు తీవ్ర ఆగ్రహం చెంది–"వశిష్టుని కొడుకుల్లాగా కుక్కమాంసం తినే నీచ జాతుల్లో మీరూ పుడతారు. ఈ శాపం వెయ్యేళ్ళు ఉంటుంది." అని శపించాడు. అటుతర్వాత శునశ్శేపునితో విశ్వామిత్రుడిలా అన్నాడు. "అంబరీషుని యజ్ఞవాటికలో యూపస్తంభానికి తాళ్ళతో బంధించి ఎర్రపూలమాలను మెడకు అలంకరించి, బలికి నిన్ను సిద్ధం చేస్తున్నపుడు అగ్నిని స్తుతిస్తూ నీవు ఈ రెండు శ్లోకాలను పఠించు. నీకు జయం కలుగుతుంది." విశ్వామిత్రుడి నుంచి శ్లోకాల్ని గ్రహించిన శునశ్శేపుడు అంబరీషునితో తమ గమ్యానికి బయలుదేరాడు. యజ్ఞ ప్రదేశంలో శునశ్శేపుణ్ణి యూపస్తంభానికి కట్టివేసి, ఎర్రపూల మాలతో అలంకరించి బలి యివ్వడానికి సమాయత్తమవుతున్న సమయంలో శునశ్శేపుడు ఇంద్రుడు, విష్ణువునూ అందమైన శ్లోకాలతో స్తుతించాడు. సంతోషించి ప్రత్యక్షమై శునశ్శేపుడికి దీర్ఘాయువు ప్రసాదించాడు."

వశిష్ఠ విశ్వామిత్రులు శత్రువులుగా కనిపించే ఆఖరి వృత్తాంతం కల్మషపాదుడిది. మహాభారతం ఆదిపర్వంలో ఈ వృత్తాంతం ఉంది.

"[10]కల్మషపాదుడు ఇక్ష్వాకు వంశానికి చెందినరాజు. విశ్వామిత్రుడు కల్మషపాదుని యాజకత్వం ఆపేక్షించాడు. కానీ రాజు వశిష్టుణ్ణి ఎన్నుకున్నాడు. ఇలా ఉండగా, ఒకరోజు రాజు వేటకు వెళ్ళాడు. అసంఖ్యాకంగా జంతువుల్ని వేటాడి అలసిపోయాడు. ఆకలి దాహం వేశాయి. వశిష్టుని నూరుగురు కుమారుల్లో పెద్దవాడైన శక్త్రి కల్మషపాదునికి ఎదురయ్యాడు. అలా తనకు ఎదురుగా వస్తున్న శక్త్రిని కల్మషపాదుడు అహంకారంతో రాజాభిమానంతో తనదారికి అడ్డుతొలగమని అన్నాడు. అందుకు శక్తి "రాజా! ఈ త్రోవ నాది. బ్రాహ్మణులు ఎవరైనా ఎదురు వస్తే రాజులు భక్తితో నమస్కరించి, వారికి త్రోవ యిచ్చి, తాము తొలగిపోవడం చిరకాల న్యాయం. అని బదులిచ్చాడు. ఇద్దరూ ఎవరికివారు దారి నుంచి తొలగకుండా ఉన్నారు. అప్పుడు కల్మషపాదుడు కోపం తెచ్చుకొని తన చేతి చెర్నాకోలతో శక్త్రిని కొట్టాడు. దెబ్బలిన్న అందరి మునుల్లాగానే, శక్తి కూడ ఆగ్రహంతో అతన్ని నరమాంస భక్షకుడవు కమ్మని శపించాడు. కల్మషపాదుడికి యాజకత్వం విషయంలో వశిష్ట, విశ్వామిత్రుల మధ్య వైరం నెలకొని ఉన్న సమయంలో ఇది జరిగింది. కల్మషపాదుడు తన శత్రువైన వశిష్టుని కుమారుడితో గొడవపడుతున్నపుడు–అదృశ్య రూపంలో అనుసరిస్తూ అవకాశం కోసం కాచుకుని ఉన్నాడు విశ్వామిత్రుడు. రాజు శక్తిని క్షమాభిక్ష ప్రసాదించమని వేడుకున్నాడు. అలాంటి పరిష్కారం జరగడం ఇష్టంలేని విశ్వామిత్రుడు ఒక రాక్షసుణ్ణి కల్మషపాదుడి దేహంలో ప్రవేశించమని ఆజ్ఞాపించాడు. బ్రహ్మర్షి శాపప్రభావం వల్ల, విశ్వామిత్రుడి ఆజ్ఞవల్ల ఆ రాక్షసుడు కల్మషపాదునిలో ప్రవేశించాడు. తన అభీష్టం నెరవేరిన విశ్వామిత్రుడు దేశాన్ని వదలి వెళ్ళిపోయాడు. ఒకనాడు ఆకలితో ఉన్న ఒక బ్రాహ్మణుడు రాజుని కలుసుకోవడం జరిగింది. రాజాజ్ఞ మేరకు అతని

వంటవాడు (వేరే ఏమీ దొరక్క) నర మాంసం వండి ఆ బ్రాహ్మణునికి భోజనం పెట్టాడు. దాంతో ఆగ్రహించిన బ్రాహ్మణుడు నరమాంస భక్షకుడివవుతావని కల్మషపాదుణ్ణి శపించాడు. ఈ విధంగా శక్తి ద్వారా ఆ బ్రాహ్మణ శాపం నిజమైంది. కల్మషపాదుడి నరభక్షణకు శక్తే మొదటి సమిధ అయ్యాడు. ఈ విధంగా కల్మషపాదుడు విశ్వామిత్రుడి వల్ల ప్రభావితుడై రాక్షసుడిగా సంచరిస్తూ వశిష్టుని మిగిలిన కుమారులను కూడా – అడవిలో సింహం చిన్న జంతువుల్ని తిన్నట్టు – తినేశాడు. విశ్వామిత్రుడు తన నూర్గురు కుమారుల్నీ చంపించాడని తెలుసుకున్న వశిష్టుడు – కుల పరతనం భూభారాన్ని మోపినట్టు – పుత్రశోకాన్ని భరిస్తూ కూడా ఆత్మహత్య గురించి ఆలోచించాడు తప్ప కౌశికులను నాశనం చేసే ప్రతిక్రియ తలపెట్టలేదు. వశిష్టుడు మేరు పర్వం పై నుంచి కింద ఉన్న బండరాయిపైకి దూకాడు. కానీ ఆ మహర్షి దూదిమీద పడ్డట్టు ఆ బండరాయి మీద పడ్డాడు. ఆయన మండుతున్న అగ్నిలో దూకితే అది ఆయనను కాల్చకపోగా చల్లగా మారింది. ఆ రుషి పుంగవుడు మెడకు పెద్దరాయి కట్టుకుని సముద్రంలో దూకితే అలలు ఆయన్ని ఒడ్డుకు నెట్టేశాయి. చేసేది లేక వశిష్టుడు తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళి అక్కడ నిర్జనత్వాన్ని, ఖాళీని భరించలేక తిరిగివచ్చాడు. వానాకాలంలో పొంగి, గట్లపై వున్న చెట్లను పెకిలించుకుంటూ ప్రవహిస్తున్న ఒక నదిని చూసి, గట్టి తాళ్ళతో తనను తాను బంధించుకుని ఆ నదిలో దూకాడు. ఆ నది ఆ మహాముని తపో మహిమకు భయపడి అలలతో ఆయన బంధాలను (పాశాలను) విప్పి ఒడ్డుకు చేర్చింది. అందుకని దానికి 'విపాశ' అనే పేరు వచ్చింది. మరో నదిలో పడి ప్రాణాలు తీసుకోవడానికి వశిష్టుడు ప్రయత్నించగా అది అగ్ని వంటి అతని తేజస్సుకు భయపడి నూరుపాయలై చీలి ప్రవహించింది. అప్పటి నుంచీ దానికి 'శతద్రు' (సట్లెజ్) అనే పేరు వచ్చింది. విఫలుడైన వశిష్టుడు తనకు ఇక చావురాదని నిశ్చయించుకుని, తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోయాడు."

ఇవి వశిష్ట, విశ్వామిత్రుల శత్రుత్వానికి సంబంధించిన కొన్ని ఉదాహరణలు మాత్రమే. వారి శత్రుత్వం ఎంత తీవ్రమైనదంటే, ఒకసారి విశ్వామిత్రుడు వశిష్టుణ్ణి హత్య చేయడానికి ప్రయత్నించాడు. మహాభారతంలోని శల్య పర్వంలో దీనికి సంబంధించిన కథ వుంది.

మహాభారత కర్త ఆ కథను ఇలా చెప్పాడు.

"11తపస్సు విషయంలో ప్రారంభమైన విరోధం వశిష్ట విశ్వామిత్రుల మధ్య శత్రుత్వానికి దారితీసింది. వశిష్ట మహర్షి ఆశ్రమం స్థాణు తీర్థంలో ఉంది. దానికి తూర్పున (కొంత దూరంలో) విశ్వామిత్రుని ఆశ్రమముంది. వీళ్ళిద్దరు తమతమ తపస్సుల గొప్పదనాన్ని ఒకరికొకరు ప్రదర్శించుకోటానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉండేవారు. కానీ వశిష్టుని గొప్పతనాన్ని చూస్తే విశ్వామిత్రునికి తీవ్రమైన అసూయ. వశిష్టుణ్ణి ఏం చేద్దామా అనేది అతని నిరంతర ఆలోచన. ఈ విషయానికి సంబంధించి ధర్మ పరాయణుడైన (!) అతని మనసులో ఒక ఆలోచన సాగింది. "నదీమతల్లి అయిన సరస్వతి మంత్రోచ్చారణలో అసమానుడయిన వశిష్టుని తన ప్రవాహపు అలలమీద నా వద్దకు శీఘ్రంగా మోసుకువస్తుంది. ఆ బ్రాహ్మణశ్రేష్టుడు వచ్చీరావటంతోనే

తప్పకుండా అతన్ని చంపివేయాలి" ఈ ఆలోచనలు మనసులోకి వచ్చిన మరుక్షణమే క్రోధంతో అతని కళ్ళు ఎర్రబడ్డాయి. మనసులోనే సరస్వతిని పిలిచాడు. ఈ విషయాన్ని తెలుసుకున్న సరస్వతి విశ్వామిత్రుని ఆగ్రహం గురించి, శక్తియుక్తుల గురించి ముందే తెలిసినటువంటిది కాబట్టి ఆందోళనతో వణికిపోయింది. పాలిపోయిన ముఖంతో చేతులు జోడించి భర్తనెవరో నరికివేస్తే ఘోరున విలపించే భార్యలా విశ్వామిత్రుని ఎదుట నిలబడింది. "నేను మీకు ఏం చేయాలి మహర్షి" అని అడిగింది. ముక్కోపి అయిన విశ్వామిత్రుడు తన గంభీర స్వరంతో "వశిష్టుని వేగిరమే ఈడ్చుకొనిరా. అతణ్ణి నేను చంపివేయాలి" అన్నాడు. పద్మాక్షి, దేవత అయిన ఆ సరస్వతి చేతులు జోడించి, సుడిగాలికి కదిలిపోయే లతలా వణికిపోతూ, మౌనంగా నిలుచుండిపోయింది..... ఆమె పరిస్థితిని పూర్తిగా గమనించినప్పటికి విశ్వామిత్రుడు మళ్ళీ తన ఆదేశాన్ని పునరుద్ఘాటించాడు. ఏం చేయాలో సరస్వతికి తోచలేదు. తను చేయబోతుంది ఎంత పాపకార్యమో కూడా ఆమెకు తెలుసు. ఇద్దరూ మహర్షులే. శక్తివంతులే. ఎవరిని నొప్పించినా శాపం తప్పదు. గత్యంతరం లేక వశిష్టుని దగ్గరకు వెళ్ళి అతని శత్రువైన విశ్వామిత్రుని ఆశాన్ని తెలియచేసింది. పాలిపోయిన వదనంతో, ఆతృత, ఆందోళనలతో ఉన్న ఆమె పరిస్థితిని గమనించిన వశిష్టుడు ఈ విధంగా అన్నాడు. "నదీ దేవతా! నీకప్పగించిన పని నీవు చేయి. నిరభ్యంతరంగా నన్ను తీసికెళ్ళు లేకుంటే విశ్వామిత్రుడు నిన్ను శపిస్తాడు." అన్నాడు. ఎంతో దయార్ద్ర హృదయంతో వశిష్టుడు అన్న ఈ మాటలు సరస్వతికి ఊరట కలిగించాయి ఇంతటి మహనీయుణ్ణి ఎలాగయినా రక్షించాలి అన్న నిర్ణయానికి వచ్చింది. నా మేలు కోరిన వారి క్షేమం కోరటం నా విధి అని తలంచింది. తన (నది) ఒడ్డున యజ్ఞం చేస్తున్న విశ్వామిత్రుణ్ణి చూచింది. అదే వశిష్టుణ్ణి తీసుకెళ్ళటానికి తగిన అదనని తలంచి గట్టులు పొంగి ప్రవహించింది. ఆ ప్రవహ వేగంలో మిత్రవరణుల కుమారుడైన వశిష్టుని దిగువ భాగానికి మోసుకుపోయింది. మార్గమధ్యంలో వశిష్టుడు నదీదేవతను ఉద్దేశించి "ఓ సరస్వతీ! బ్రహ్మ సరోవరం నుండి పుట్టినదానా! సప్తలోకాల్ని అద్భుత ప్రవాహంతో పునీతం చేస్తున్నదానా! ఆకాశంలో కొలువుండి, నీటితో మేఘాన్ని నింపుతున్నదానా! సమస్త జల స్వరూపిణీ! నీ మహిమ అమోఘం" నీవే పోషణ. నీవే వెలుగు. నీవే కీర్తి. నీవే సర్వోత్తమరావు. నీవే జ్ఞానం, నీవే కాంతి. నీవే చతుర్విధ రూపమై అన్ని జీవులలో ఉన్నావు" అని స్తుతించాడు...

వశిష్టుడు దగ్గరకు రావడం చూసిన విశ్వామిత్రుడు అతన్ని వధించడానికి ఆయుధం కోసం వెతికాడు. బ్రహ్మహత్య జరగవచ్చుననే భయంతో సరస్వతి అతన్ని తూర్పుకు తీసుకువెళ్ళింది. ఆవిధంగా ఇద్దరు మునుల ఆజ్ఞల్నీ పాటిస్తూనే విశ్వామిత్రుని తప్పించుకుని వెళ్ళింది. అది చూసిన విశ్వామిత్రుడు అసహనంతో, కోపంతో "ఓ మహానదీ! నన్ను తప్పించుకుని వెనక్కు తిరిగావు గనుక రాక్షసులు మాత్రమే మునగడానికి పనికొచ్చే విధంగా నెత్తుటేరువైపోతావు!" అని శపించాడు. ఆవిధంగా శాపానికి గురైన సరస్వతి నెత్తుటి (తో కలసిన) ప్రవాహమై ఏడాదిపాటు ప్రవహించింది. అది రాక్షసులకు యాత్రాస్థలమయింది. నెత్తుటేరుని చూసిన రాక్షసులు పరమానంద భరితులయ్యారు. పగలబడినవ్వారు. గంతులేశారు. స్వర్గాన్ని జయించినంత సంబరపడ్డారు. ఆ సందర్భంలో అక్కడకు వచ్చిన కొందరు ఋషులు ఈ రక్తపుటేరును చూసి

భయభ్రాంతులయ్యారు. సరస్వతిని రక్షించి ఆమెకు తిరిగి పూర్వరూపం తేవడానికి అనేక ప్రయాసలు పడ్డారు."

ఇప్పటివరకు వివరించిన వృత్తాంతాలన్నీ కేవలం ఒక బ్రాహ్మణుడికి, ఒక క్షత్రియుడికి మధ్య జరిగిన వ్యక్తిగత సంఘర్షణలకు సంబంధించినవి. ఇకమీదట చెప్పబోయేవి వర్గ లేక కులపరంగా బ్రాహ్మణులకు, క్షత్రియులకు మధ్య జరిగినటువంటివి. ఇవి కేవలం ఘర్షణలు కావు. వాటిని గుంపుల మధ్య పోరాటాలు (Communal riots) అనడం కూడా సరికాదు. ఇవన్నీ మూలాన్ని శాఖల్ని కూడా నాశనం చేయాలనే ప్రస్ఫుట లక్ష్యంతో ఒక వర్గంమీద మరో వర్గం సాగించిన యుద్ధాలు. అలా నాశనం చేసుకోవాలనే ఉద్దేశంతో సాగిన రెండు యుద్ధాల ప్రస్తావన మహాభారతంలో ఉంది. భార్గవ కుల బ్రాహ్మణుల మీద హైహయవంశ క్షత్రియులు సాగించిన పోరాటం మొదటిది. ఇది హైహయరాజు కృతవీర్యుని పరిపాలనా కాలంలో జరిగింది. మహాభారతం ఆదిపర్వంలో ఆ యుద్ధ వర్ణన ఈ క్రింది విధంగా ఉంది:

"[12]పూర్వం కృతవీర్యుడనే పేరుగల రాజు ఒకడుండేవాడు. వేదవిదుడైన భృగుడు అతని పూజారిగా పనిచేసి ఆయన దాతృత్వం వల్ల విశేషమైన ధనధాన్యాలను ఆర్జించాడు. అతను మరణించిన తరువాత, ఆ కృతవీర్యుని వంశీయులు ధనాభావానికి గురై భృగు వంశయుల దగ్గర ధనం అపారంగా ఉందని తెలిసినవారు, వారి వద్దకు వచ్చి ధనాన్ని యాచించారు. అప్పుడు కొందరు భార్గవులు ఆ రాజధనాన్ని భూమిలో పాతిపెట్టారు. మరికొందరు క్షత్రియులకు భయపడి బ్రాహ్మణులకు దానం చేశారు. ఇంకొందరు వాళ్ళు అడిగినంత మేరకు తాము దాచుకున్న ధనం తిరిగి వారికే ఇచ్చివేశారు. ఇది జరిగిన తర్వాత క్షత్రియుడొకడు భూమిని తవ్వుతుండగా ఒక భృగువు ఇంటిలో దాచిపెట్టిన ధనం బయటపడింది. క్షత్రియులందరూ గుమికూడి ఆ నిధిని చూచారు. అపుడు రాజులు ఆగ్రహం చెంది, భృగు వంశీయులందరినీ, గర్భస్థ శిశువుతో సహా వధించారు. వితంతువులైన ఆ భార్గవ వంశస్త్రీలు భయపడి హిమాలయ పర్వత ప్రాంతాలకు పారిపోయారు. వారిలో ఒకామె తన గర్భంలో ఉన్న శిశువును తీసి, తన తొడలో దాచుకొన్నది. ఒక బ్రాహ్మణి ద్వారా ఈ విషయం తెలుసుకున్న క్షత్రియులు ఆ పిండాన్ని చంపబోయారు. కానీ అది తన తల్లి తొడ నుండి మహత్తరమైన తేజస్సుతో ప్రకాశిస్తూ బయటకు వచ్చాడు. ఆమెను వెంటాడుతున్న రాజులు–కనులు మిరుమిట్లు గొలిపే ఆ పిల్లవాడి ప్రకాశానికి గుడ్డివాళ్ళయ్యారు. అపుడు వాళ్ళకి ఎటు పోవడానికి దిక్కుతోచక, ఆ భార్గవ స్త్రీని చూపు ప్రసాదించమని అనేక రకాలుగా వేడుకున్నారు. అపుడు ఆ భార్గవ స్త్రీ ఆ రాజులతో నాల్గు వేదాలు, ఆరు వేదాంగాలు కలిగిన తన అద్భుత పుత్రుడు ఔర్వుడే (తన బంధువుల హత్యకు ప్రతీకారంగా) వారి దృష్టిని హరించాడనీ, అతడే దానిని తిరిగి ఇవ్వగలడనీ చెప్పింది. అలాగే ఆ రాజులు వేడుకోగా ఔర్వుడు వారికి దృష్టి ప్రసాదించాడు. కానీ భృగువుల హత్యకు ప్రతిగా సర్వ ప్రాణులనీ నాశనం చేయదలచి ఔర్వుడు ఘోరమైన తపస్సు మొదలుపెట్టాడు. ఆ తపో ప్రభావం దేవ దానవులనీ, మానవులనీ భయపెట్టింది. అయితే ఔర్వుని పితృ దేవతలు ప్రత్యక్షమై అతని ప్రయత్నాన్ని మాన్పించబోయారు. అందుకోపం

తమకు క్షత్రియులపై ప్రతీకారం తీర్చుకోవాలనే కోరిక లేదని చెప్పారు: "భృగువులు అశక్తత చేత క్షత్రియుల హత్యాకాండను సహించలేదు. వయోభారంతో కుంగిపోవడం వల్ల మేమే వారి చేతిలో వధించబడాలని కోరుకున్నాం. క్షత్రియులను రెచ్చగొట్టాలనుకున్న వారు ద్వేషాన్ని పెంచే ఉద్దేశ్యంతోనే ఒక భృగువు ఇంట్లో ధనాన్ని పాతిపెట్టారు. స్వర్గ కాంక్ష గల మాకు ఆ ధనంతో ఏమి పని?" తమకు ఆత్మహత్యా పాతకం రాకుండా వుండేందుకే ఈ పని చేశామని చెపుతూ వారు ఔర్వుణ్ణి తన ఆగ్రహాన్ని నిగ్రహించుకొమ్మనీ, అతడు తలపెట్టిన పాపకార్యాన్ని ఆపమనీ కోరారు. "క్షత్రియులనీ, సప్తలోకాలనీ నాశనం చేయకు పుత్రా. నీ తపశ్శక్తిని నిశ్శేషం చేసే నీ క్రోధాన్ని అణచుకో" అని చెప్పారు. కానీ తన ప్రతిజ్ఞని నెరవేర్చకుండా ఉండలేననీ, తన క్రోధాన్ని ఏదో ఒక దానిపై తీర్చుకోకపోతే అది తననే దహించివేస్తుందనీ అన్నాడు. పితృదేవతలు చెప్పే దయాగుణాన్ని తిరస్కరిస్తూ అతను న్యాయం, అవసరం, విధుల ఆధారంగా వాదించాడు. అయితే చివరకు పితృదేవతలు చెప్పినట్టుగా క్రోధాన్ని సముద్రంలో వదిలిపెట్టడానికి అంగీకరించాడు. వారి సలహా ప్రకారం అది తన ప్రతాపాన్ని జల ధాతువుపై చూపుతుంది గనుక ఔర్వుని ప్రతిజ్ఞ నెరవేరుతుంది."

రెండవ వర్గ యుద్ధం కూడా నిర్మూలనాత్మకమైన యుద్ధమే. ఇది భార్గవ బ్రాహ్మణులు హైహయ వంశ క్షత్రియుల మీద ప్రకటించినటువంటిది. దీనిలో భార్గవ బ్రాహ్మణుల నాయకుడు పరశురాముడు. పరశురాముని జన్మ వృత్తాంతం విష్ణు పురాణంలో ఈ విధంగా ఉంది.

"[13]గాధి కూతురు సత్యవతి. ఆమె భృగు వంశానికి చెందిన వృద్ధ బ్రాహ్మణుడు రుచికుని పెళ్ళాడింది. తన భార్యకు ఉత్తమ బ్రాహ్మణ లక్షణాలతో కొడుకు పుట్టాలని, రుచికుడు ఆమెకోసం (బియ్యం, బార్లీ, పప్పులు, వెన్న, పాలతో చేసిన) 'చారు' అనే భోజన పదార్థాన్ని తినటానికి తయారుచేసి ఇచ్చాడు. అలాంటిదే మరొకటి వీర్యవంతుడైన యోధుడు పుట్టాలని అత్తగారికి (సత్యవతి తల్లికి) కూడా తయారు చేసి ఇచ్చాడు. సత్యవతి తల్లి తను, తన కుమార్తె ఆ తినుబండారాల్ని పరస్పరం మార్చుకొని తినేటట్లు తన కుమార్తెను ఒప్పించింది. ఆవిధంగా మార్చుకొని తిన్నారు. ఇంటికి తిరిగివచ్చిన రుచికుడు జరిగిన సంగతి తెలుసుకొని భార్యపై మండిపడ్డాడు. మూలంలో ఉన్న మాటల్నే ఉదహరిస్తే అతను ఇలా అన్నాడు:

"పాపాత్మురాలా! నువ్వు చేసిన పని ఎంత అనౌచిత్యమైంది? నీ దారుణ రూపాన్ని చూడటానికి కూడా నేను అసహ్యించుకుంటున్నాను. నువ్వు తప్పకుండా మీ అమ్మకి తయారుచేసి ఇచ్చిన 'చారు'ని తిని ఉంటావు. ఇది తప్పు. దాంట్లో నేను ధీరత్వం, పౌరుషం, బలపరాక్రమాలు మొదలైన గుణాలన్నీ ఉండేటట్లు నిక్షేపించాను. నీకు ఇచ్చిన దాంట్లో జ్ఞానం, శమదమాలు మొదలైన ఉత్తమ బ్రాహ్మణ లక్షణాలు ఉండేటట్లు నిక్షేపించాను. నా అభీష్టానికి వ్యతిరేకంగా నువ్వు వ్యవహరించావు. దానివల్ల క్షత్రియుని భయంకరమైన, యోధత్వం కలిగిన, హింసాత్మక జీవితం గడిపే కొడుకు పుడతాడు. మీ అమ్మకు పుట్టే పిల్లవాడు శాంతి స్వరూపు

డైన బ్రాహ్మణోచితమైన ప్రవర్తన గలవాడు పుడతాడు." ఈ మాటలు విన్న సత్యవతి తన భర్త పాదాలమీద పడి "స్వామీ! నేను అజ్ఞానంతో అలా ప్రవర్తించాను. నా మీద దయచూపండి. మీరు వర్ణించి చెప్పినటువంటి పుత్రుడు నాకు వద్దు. మీకు దయ వుంటే, ఆ లక్షణాలున్న మనవణ్ణి ప్రసాదించండి" అంది– పర్యవసానంగా ఆమె జమదగ్నికి జన్మనిచ్చింది. ఆమె తల్లికి విశ్వామిత్రుడు పుట్టాడు. సత్యవతి కౌశిక నదిగా మారిపోయింది. ఇక్ష్వాకు వంశానికి చెందిన రేణు కూతురు రేణుకను జమదగ్ని పెండ్లాడాడు. వీరి కొడుకే పరశురాముడు.

మహాభారతం వేనపర్వంలో పరశురాముని కుటుంబ చరిత్రకు సంబంధించిన ఇతర విషయాలు మరికొన్ని లభిస్తాయి:

"14రేణుక జమదగ్నులకు ఐదుగురు కొడుకులు. వారిలో చిన్నవాడైన పరశురాముడు జగత్ప్రసిద్ధుడు. (పర పురుషునితో మాట్లాడటం వల్ల పవిత్రతను కోల్పోయిన) రేణుకను చంపివే యమని జమదగ్ని తన కుమారులను ఆదేశించాడు. మాతృహత్య మహా పాతకమని మొదటి నలుగురు కుమారులు అందుకు తిరస్కరించి తండ్రి శాపం వల్ల తార్కిక జ్ఞానాన్ని కోల్పో యారు.. కడపటి వాడైన పరశురాముడు ఆ పనిని తాను చేసి తండ్రి మాటను గౌరవించాడు. శాపానికి గురైన నలుగురు పుత్రుల తర్క జ్ఞానాన్ని, భార్య రేణుక ప్రాణాన్నీ పరశురాముని కోరిక మేరకు జమదగ్ని తిరిగి ప్రసాదించాడు. పరశురామునికి అజేయత్వాన్నీ, దీర్ఘాయుష్షునీ ప్రసాదించాడు.

హైహయ వంశానికి చెందిన కార్తవీర్యుని కుమారుడైన అర్జునుని హయాంలో రెండవ వర్గ పోరాటం జరిగింది. ఇది రెండు దశలుగా జరగటం వల్ల, దీన్ని రెండు భాగాలుగా అధ్య యనం చేస్తే సరిగా అర్థమవుతుంది. బ్రాహ్మణులు తమను ప్రత్యేక వ్యక్తులుగా గుర్తించాలని తమకు విస్తృతాధికారమివ్వాలని కోరడంతో, రాజైన అర్జునుడు వారిని నీచంగా నిందించడంతో సమస్య ప్రారంభమౌతుంది. ఈ వృత్తాంతం మహాభారతంలోని అనుశాసన పర్వంలో ఉంది.

"15ఈ విధంగా దేదీప్యమానంగా వెలుగుతున్న సూర్యునిలా–దివ్యరథాన్ని ప్రవేశించి, బల గర్వంతో అర్జునుడు ఇలా అన్నాడు. 'శౌర్యంలోనూ వీరంలోనూ, ధైర్యసాహసాల్లోనూ, శక్తి ప్రాబల్యాల్లోనూ నన్ను మించిన వారెవరున్నారు....' ఇలా అర్జునుని ప్రసంగం కొనసాగుచుం డగా, ఆకాశం నుండి ఆకాశవాణి "ఓయీ! మూర్ఖుడా! క్షత్రియులకంటే బ్రాహ్మణులెపుడూ అధికులేనని నీకు తెలియదు. బ్రాహ్మణుల సహాయంతోనే క్షత్రియులు రాజ్యాన్నేలుతున్నారు." దానికి అర్జునుడు "నేను అనుగ్రహిస్తే భూతకోటిని సృష్టించగలను. ఆగ్రహిస్తే వాటిని సంహ రించగలను. మనోవాక్కర్మలలో ఏ బ్రాహ్మణుడూ నన్ను మించిన వాడు కాడు. బ్రాహ్మణులు గొప్పవారనీ, క్షత్రియులు గొప్పవారనీ – రెండు వాదనలున్నాయి. రెంటినీ వాటి ఆధారాలతో మీరు చెప్పారు. కానీ వాటి మధ్య ఒక తేడా ఉన్నది. బ్రాహ్మణులు క్షత్రియులను ఆశ్రయించి జీవిస్తున్నారు. కానీ క్షత్రియులు బ్రాహ్మణులనాశ్రయించి అలా బ్రతకటం లేదు. వేదాలను

సాకుగా చూపి, క్షత్రియుల మీదపడి బ్రాహ్మణులు బతుకుతున్నారు. ప్రజల రక్షణ చేయాల్సిన ధర్మం క్షత్రియులలో వుంది తప్ప బ్రాహ్మణులలో లేదు. క్షత్రియుడు లేనపుడు, బ్రాహ్మణులకు జీవాధారమే లేదు. అలాంటప్పుడు వాళ్ళు గొప్పవాళ్ళు ఎలా అవుతారు. తమను తాము గొప్ప వాళ్ళుగా భావించే ఈ బిచ్చమెత్తుకునే పర్వజీవుల ప్రభువుల్ని నేను నా క్రింద అధీనులుగా ఉంచుకుంటాను. ఆకాశం నుంచి ఆ గాయత్రి అనే ఆడది సరిగ్గానే చెప్పింది. దొంగ వేషాలు వేసే దుష్ట బ్రాహ్మణులందర్నీ నేను అణచేస్తాను. ఈ ముల్లోకాల్లో మనిషి గానీ, దేవుడుగానీ నన్నెదిరించలేడు. నా రాజ్యాధికారాన్ని ప్రశ్నించేవాడు లేడు. అందుకే బ్రాహ్మణులందరికంటే నేనే గొప్పవాణ్ణి" అని సమాధానం చెప్పాడు.

అర్జునుని మాటలు విన్న వాయువు వచ్చి యిలా అన్నాడు.

"[16]రాజా! ఇలాంటి పాపపు ఆలోచనలు మానివేయి. బ్రాహ్మణులను పూజించు. వాళ్ళపట్ల తప్పులు చేసినవాళ్లు రాజ్యాన్ని కోల్పోతారు. వాళ్లెంతో శక్తివంతులు. వాళ్లు నిన్ను జయిస్తారు. దేశం నుంచి భ్రష్టుని చేయగలరు" అని అనగా 'ఇంతకీ నీవెవర'ని అర్జునుడడిగాడు. "నేను దేవదూతను...... నా పేరు వాయువు. నీ క్షేమం కోరి నేను వచ్చాను" అని చెప్పాడు. అర్జునుడు "బ్రాహ్మణుల పట్ల చాలా భక్తి చూపుతున్నావు గాని, బ్రాహ్మణులు కూడా అన్ని జీవరాసుల్లానే జన్మించలేదా? వాళ్ల గొప్పతనం ఏమిటో చెప్పు. వాళ్లేమైనా నిప్పూ, నీరూ, గాలి, సూర్యుడు, ఆకాశంలాంటి అతీత శక్తులా" అంటూ ఆగ్రహంతో పలికాడు.

అప్పుడు వాయువు బ్రాహ్మణులు ఏ విధంగా గొప్పవారో తెలియజేసే అనేక ఉదంతాలను వివరించాడు.[17] తర్వాత అర్జునుడు బ్రాహ్మణుల పట్ల తన శత్రుత్వాన్ని మానేసి వారితో స్నేహం కట్టాడు. అనుశాసన పర్వంలో ఇలా ఉంది.

నేను ఎల్లప్పుడూ బ్రాహ్మణుల కోసమే జీవిస్తాను. వారికి ఎప్పుడూ భక్తితో సాష్టాంగ ప్రణామం చేస్తాను. (బ్రాహ్మణుడైన) దత్తాత్రేయుని దయవల్లనే నేనింత శక్తి సామర్థ్యాలను, ప్రతిష్టనూ పొందగలిగాను. పుణ్యమార్గాన్ని అనుసరించాను."

ఇక రెండవ దశలో పరశురాముడు రంగప్రవేశం చేస్తాడు. ఇతడు క్షత్రియులను నిర్మూలనం చేసే దృష్టాంతం 'శాంతి పర్వం'లో ఇలా ఉంది:

"[18] వినయం, పవిత్రత, దయ, దాన మొదలైన గుణాలు మూర్తీభవించిన సాహసోపేతుడైన కార్తవీర్యార్జునుడు, శాపం గురించి అసలు పట్టించుకోలేదు. కానీ అహంకారులు, క్రూరులు, అయిన కార్తవీర్యుని కుమారుల వల్ల ఆ శాపం అతని మరణానికి దారితీసింది. కార్తవీర్యునికి తెలియకుండా, జమదగ్ని ఆశ్రమానికి వెళ్లి, జమదగ్ని ధేనువు అపహరించుకో

నిపోయారు. ఆ కారణం వల్ల పరశురాముడాగ్రహంతో కార్తవీర్యుని వేయి చేతులను తన గండ్రగొడ్డలితో నరికాడు. ఆ కక్షతో కార్తవీర్యుని కొడుకు జమదగ్నిని చంపాడు. పరశురాముడు తండ్రి మరణానికి ఆగ్రహించి భూమి మీద వున్న రాజులందర్నీ చంపివేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. కార్తవీర్యుని పుత్రులు, మనుమలతో పాటు, వేలాది హైహయుల్ని వధించి, భూమిని నెత్తుటి ముద్దగా చేశాడు. ఈ విధంగా క్షత్రియులందర్నీ హతమార్చిన పరశురామునిలో కరుణ కలుగగా అరణ్యాలకు వెళ్లిపోయాడు. ఇలా వేల సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకనాడు విశ్వామిత్రుని పౌత్రుడు, రైభ్యుని కొడుకు అయిన పరావశుడు వచ్చి "ప్రవర్ధనుడు, మరికొంతమంది అయోధ్య నగరంలో యాయతి చేస్తున్న యజ్ఞం దగ్గర బ్రాహ్మణులకు వ్యతిరేకంగా సమావేశమయ్యారు. వాళ్లు క్షత్రియులు కారా? క్షత్రియులకు భయపడి ఇక్కడకు వచ్చి దాక్కున్నావా? భూమంతా మళ్ళీ వేలకు వేలు క్షత్రియులతో నిండిపోయింది. ఇదేనా ప్రతిజ్ఞ చెల్లించటం." అని అందరి ముందు గేలిచేసి రెచ్చగొట్టాడు. ముక్కోపి అయిన పరశురాముడు ఈ మాటలు విని మహా క్రోధంతో తిరిగి ఆయుధాలు చేపట్టాడు. ఇంతకుముందు అతడు వదలిపెట్టిన క్షత్రియులు అప్పటికి బాగా బలవంతులైన రాజులయ్యారు. వారందర్నీ పరశురాముడు చంపాడు. వారి పిల్లలనూ, అప్పటికి పుట్టని అసంఖ్యాక గర్భస్థ శిశువులను వారు పుట్టగానే సంహరించాడు. అయినా కొందరు తల్లులు తమ పిల్లల్ని జాగ్రత్తగా కాపాడుకున్నారు."

ఆతర్వాత క్షత్రియుల చరిత్ర తెలుసుకోవాలనే ఆసక్తి ఉన్న వారికి 'ఆదిపర్వం' నుంచి ఈ క్రింద ఉదహరించిన పంక్తులు ఉపకరిస్తాయి.

"19క్షత్రియుడనేవాణ్ని భూమ్మీద లేకుండా చేయడానికి ఇలా ఇరవై ఒక్క పర్యాయాలు వెతికివెతికి క్షత్రియులను సంహరించిన తర్వాత జమదగ్ని కుమారుడైన పరశురాముడు కుల పర్వతమైన మహేంద్రగిరి మీద తపస్సు చేసుకోడానికి వెళ్లిపోయాడు. పరశురాముడు క్షత్రియుల్ని సంహరించిన తర్వాత వితంతువులైన వారి భార్యలు బ్రాహ్మణుల దగ్గరకు వచ్చి సంతానం కోసం ప్రార్థించారు. కుల పురోహితులు నిష్కాముకులై ఋతు సమయాల్లో ఆ క్షత్రియ స్త్రీలతో కలియగా వారు గర్భవతులయ్యారు. ధైర్యసాహసోపేతులైన క్షత్రియ బాలురు, బాలికలు పుట్టారు. ఈ విధంగా క్షత్రియ జాతి ధర్మబద్ధమైన బ్రాహ్మణులకూ క్షత్రియ స్త్రీలకూకూ పుట్టి, పెరిగింది. అప్పుడు బ్రాహ్మణులకన్నా తక్కువైన నాలుగు కులాలు బయలుదేరాయి."

బ్రాహ్మణ క్షత్రియ శత్రుత్వానికి సంబంధించిన ఈ ఉదాహరణలతో పాటు ఒకరికొకరు చేసుకున్న హెచ్చరికలూ, సవాళ్ళూ, తిట్లూ ఉన్నాయి. ఇరుపక్షాలూ ఎంత వేడిమీద ఉన్నాయో వీటి నించి తెలుసుకోవచ్చు. తన రథానికి గుర్రాలకు బదులు బ్రాహ్మణుల్ని పూన్చి, లాగించిన రాజు—విమి—ప్రవర్తన బ్రాహ్మణుల్ని అవమానించాలనే క్షత్రియుల స్థిర నిశ్చయాన్ని చూపిస్తుంది. బ్రాహ్మణుల్ని కించపరచాలనే కార్తవీర్యార్జుని నిశ్చయం, బ్రాహ్మణులకు అతను చేసిన సవాళ్ళు చూస్తే తెలుస్తుంది. తమ పరంగా బ్రాహ్మణులూ ఆలస్యం చేయకుండా ఈ సవాళ్ళను స్వీకరించి బ్రాహ్మణులను రెచ్చగొట్టవద్దని ప్రతి సవాలు చేశారు. కార్య వీర్యార్జునుని సవాలు తర్వాత

బ్రాహ్మణుల రాయబారిగా వచ్చిన వాయువు చెప్పే మాటల్లో ఇది స్పష్టమవుతుంది.

బ్రాహ్మణులపై క్షత్రియుల ఆధిపత్యాన్ని నిరూపించేందుకు 'నిమి' అనే రాజు గుఱ్ఱాలకు బదులుగా బ్రాహ్మణులను పూన్చి రథాన్ని నడిపించాడు. రాజ్యంపై బ్రాహ్మణుల ప్రాబల్యాన్ని తగ్గించేందుకు వారిపై కార్తవీర్యార్జునుడు ధ్వజమెత్తి సవాలు చేసిన సంగతి యీ సందర్భంగా ఉదహరించవచ్చు. తమపై క్షత్రియులు జరుపుతున్న ఈ దాడిని త్రిప్పికొట్టే విషయంలో బ్రాహ్మ ణులు వెనుకపడలేదు. తమ అహాన్ని దెబ్బతీస్తే జరిగే పరిణామాలను వివరిస్తూ వారు స్పష్టమైన సందేశాన్ని అందించడానికి వాయువును అర్జునుని దగ్గరకు రాయబారిగా పంపారు. బ్రహ్మర్షి అయిన అత్రి మూత్ర విసర్జన ద్వారా సముద్రపు నీటిని ఉప్పగా మార్చిన వైనాన్ని, బ్రాహ్మణుల వల్ల దండకీయులు పదవీచ్యుతులైన విధాన్ని వాయువు యీ సందర్భంగా గుర్తు చేస్తాడు. ఔర్వుడనే ఒంటరి బ్రాహ్మణుడు తాళజేష క్షత్రియులను సర్వనాశనం చేసిన విధానాన్ని కూడా వాయువు అర్జునునికి తెలియజేస్తాడు. క్షత్రియులకంటే మాత్రమే కాదు, దేవతలకంటే కూడా బ్రాహ్మణులే శక్తి సంపన్నులు అని చెప్తూ దీనికి ఋజువుగా కొన్ని ఉదాహరణలను వాయువు తెలియజేస్తాడు. సోమదేవుని కూతురు, అంగీరస సంతతికి చెందిన ఉతత్యునికి భార్య అయిన భద్రను వరుణ దేవుడు బలవంతంగా తీసుకువెళ్లినపుడు ఉతత్యుని శాపం వల్ల భూమి ఎండిపోగా వరుణుడు భద్రను తిరిగి ఆయనకు అప్పగించిన దృష్టాంతాన్ని వాయువు అర్జునునకు విపులీకరిస్తాడు. ఒకసారి దానవుల చేతిలో ఓడిపోయిన దేవతలు తమ బలుల్ని పొందలేక, తమకున్న గౌరవాన్ని పోగొట్టుకుని, భూమి మీదకు వచ్చి బ్రాహ్మణుడైన అగస్త్యుని శరణు వేడగా అగస్త్యుడు జ్వాలలను సృష్టించి దానవులను స్వర్గం నుంచీ, భూమి నుంచీ వెళ్ళగొట్టి, దక్షిణం వైపుకు తరిమి దేవతలను వారి రాజ్యంలో పునః ప్రతిష్టించిన వైనాన్ని కూడా వాయులవు వివిపిస్తాడు. యజ్ఞాన్ని నిర్వహిస్తున్న ఆదిత్యులను సంహరించడానికి కొన్ని వేల సంఖ్యలో ఖలీ ములు అనే దానవ సంతతి దాడి చేసినపుడు, ఆదిత్యులు రక్షణకై ఇంద్రుని ఆశ్రయించగా దైత్యుల దాడిని ఎదుర్కొంటున్న ఇంద్రుడు వారికి రక్షణ కల్పించడంలో నిస్సహాయుడై వశిష్టుని ఆశ్రయించినప్పుడు వశిష్టుడు దానవులను నిలువునా దహించి, నాశనం చేసినట్టు అర్జునునికి వాయువు చెప్పాడు. దానవులు దేవతలతో యుద్ధం చేసి వారి చుట్టూ గాఢాంధకారాన్ని కల్పించి నిర్దాక్షిణ్యంగా చంపుతున్నపుడు దేవతలు బ్రాహ్మణుడైన అత్రిని ఆశ్రయించగా, అత్రి చంద్రుని రూపం దాల్చి సూర్యుని చుట్టూ ఉన్న పొరలను విడదీసి దానవుల బారి నుంచి దేవతలను రక్షించిన వైనాన్ని కూడా వాయువు అర్జునునికి విశదీకరిస్తాడు. బ్రాహ్మణుల శక్తి సామర్థ్యాలను వివరించే సందర్భంలో చివరిగా చ్యవనుడనే బ్రాహ్మణునకు ఇంద్రునికి మధ్య జరిగిన వివాదాన్ని వాయువు యిలా వివరిస్తాడు. అశ్వనీ దేవతలకు సముచిత స్థానాన్ని ఇవ్వమని, యిందుకు గుర్తుగా వీరితో పాటు సోమరసాన్ని సేవించవలసిందిగా చ్యవనుడు ఇంద్రుని అడిగినపుడు ఇంద్రుడు అందుకు నిరాకరిస్తాడు. దీనికి ప్రతిగా చ్యవనుడు, భూమిని, స్వర్గాన్ని అదుపులోకి తీసుకొని, మాదుడనే రాక్షసుణ్ణి సృష్టించి ఇంద్రునితో సహా దేవతలనందరినీ రాక్షసుల నోటిలో బంధించి ఇంద్రుడ్ని వివశుణ్ణి చేసి, తన సూచనను పాటించేటట్టు చేస్తాడు.

వాయువు కేవలం బ్రాహ్మణుల విజయాల గురించి మాత్రమే చెప్పి ఊరుకోడు. బ్రాహ్మణ శక్తిని గురించి చెప్పే ప్రతి దృష్టాంతం చివరా "అతని (ఆ కథలో నాయకుడైన బ్రాహ్మణుని) కంటే గొప్పవాడైన క్షత్రియుణ్ణి చూపించగలవా" అనో, "అతనికంటే గొప్పవాడైన క్షత్రియుడున్నా డేమో నీవే చెప్ప చూద్దాం" అనో "అత్రిని మించిన క్షత్రియుడుంటే చెప్పు" అనో అడుగుతూ వుంటాడు.

"సౌఖ్యాన్ని కాంక్షించే ఏ వ్యక్తి కూడా క్షత్రియుణ్ణి, సర్పాన్ని, బ్రాహ్మణ పండితుణ్ణి వారెంత బలహీనులైనా తక్కువచేసి చూడకూడదు." (4–135)

"ఎందుకంటే వారిని అగౌరవ పరచిన వారిని పై ముగ్గురు సర్వనాశనం చేయగలరు. అందువల్ల విజ్ఞత కలిగిన ఏ వ్యక్తీ పై ముగ్గురినీ తక్కువ చేయరాదు." (4–136)

"బ్రాహ్మణుల సహాయం లేకుండా క్షత్రియులుకాని, క్షత్రియుల సహాయం లేకుండా బ్రాహ్మణులు కాని, సుఖసౌఖ్యాలు పొందలేరు. ఐకమత్యం ద్వారా బ్రాహ్మణులు, క్షత్రియులు ఇహ, పరలోకాలలో సుఖ సౌఖ్యాలను పొందగలరు." (10–322)

బ్రాహ్మణ క్షత్రియుల మధ్య సయోధ్య కుదర్చడానికి మనువు చేసిన స్పష్టమైన ప్రయత్నమిది. బ్రాహ్మణులూ, క్షత్రియులూ ఎవరికి వ్యతిరేకంగా ఏకం కావాలని మనువు కోరిక? ఈ ఐక్యత గతంలో జరిగిన వాటిని క్షమించి మరిచిపోయే ప్రయత్నమా లేక ఏదైనా తప్పుడు ప్రయోజనాల కోసం జరిగిన కుట్రా? యుగాల శత్రుత్వాన్ని మరచి క్షత్రియులతో చేతులు కలపమని బ్రాహ్మణులకు బోధించేందుకు మనువును నెట్టిన పరిస్థితులేవి? ఆ పరిస్థితులేవో చాలా కఠినమైనవీ, పీకల మీదకు వచ్చినవీ అయి వుండాలి. ఎందుకంటే వారిరువురి మధ్యా సయోధ్యకు ఏ మార్గమూ మిగిలి లేదు. క్షత్రియులందరూ తమకూ, క్షత్రియ విధవలకూ పుట్టిన అక్రమ సంతానమేనని బహిరంగంగా చెప్పి బ్రాహ్మణులు, క్షత్రియులందరినీ దారుణంగా అవమానించి వారి అహాన్ని గాయపరిచారు. క్షత్రియుల భావాలను గాయపరిచే మరొక పని బ్రాహ్మణులు చేశారు. అదేమిటంటే క్షత్రియులకంటే బ్రాహ్మణులే యుద్ధ విద్యలలో ఉత్తములనే ఒప్పదలను క్షత్రియుల నుంచే రాబట్టడం. వాళ్ళు భీష్ముని చేత ఇలా చెప్పించారు:

"20 బ్రాహ్మణుల శక్తి దేవతలనే నాశనం చేయగలదు. ఆ జ్ఞానులు ముల్లోకాలనూ చూడగలరు; తాము గంధం పూసుకున్నామా, మురికితో వికారంగా ఉన్నామా అనేది వారికి పట్టదు. తిన్నా, ఉపవాసమున్నా; పట్టుబట్టలు కట్టుకున్నా గోనె గుడ్డలో, తోళ్ళో కప్పుకున్నా వారికి ఒకటే. వారు సాధారణమైన వాటిని దివ్యమైనవిగానూ, దివ్యమైన వాటిని సాధారణ మైనవిగానూ మార్చగలరు. ఆగ్రహిస్తే దిక్పాలకులతో సహా కొత్త లోకాల్ని సృష్టించగలరు. వారు దేవతలకే దేవుళ్ళు. కారణానికే కారకులు. అజ్ఞాని అయిన బ్రాహ్మణుడు దేవుడు. జ్ఞాని అయిన బ్రాహ్మణుడు పూర్ణసాగరం వలె అంతకంటె గొప్ప దేవుడు."

ఇంతా జరిగాక హఠాత్తుగా బ్రాహ్మణులు దిగి వచ్చి, క్షత్రియుల మద్దతు పొందడానికి పాకులాడడం ఎందుకు జరిగిందనేది అంతుబట్టని సమస్య. ఈ చిక్కు ప్రశ్నకు పరిష్కారమేది?

అనువాదం: డా. పి.ఆపదరావు, బాబివర్ధన్.

## :అథస్సూచికలు:

1. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 302–303.
2. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 307.
3. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 310–313.
4. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 316.
5. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 397–400.
6. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 377–378.
7. హరి వంశంలో ఇంకోచోట ఈ వృత్తాంతం మరో రకంగా ఉంది: సత్యవ్రతుడు అంతకు ముందే పెళ్ళయిన (వివాహిత అయిన) యువతిని బలాత్కారంగా భార్యగా తెచ్చుకొన్నాడు. ఆ కారణం చేత తండ్రి అతణ్ణి నగరం విడిచి వెళ్ళిపొమ్మని ఆదేశించాడు. అప్పుడు వశిష్టుడు దానిలో జోక్యం చేసుకొని శిక్షను రద్దు చేయించటానికి ప్రయత్నించలేదు. ఈ వృత్తాంతాన్నే ఇతర గ్రంథాలు కూడా పేర్కొన్నాయి.
8. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 376–377.
9. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 405–407.
10. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 415–417.
11. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 420–422.
12. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 448–449.
13. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 349–350.
14. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 450.
15. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 454.
16. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 454.
17. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 473.
18. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 454–455.
19. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 451–452.
20. ముయి. వాల్యూమ్ I. పేజీలు. 473–474.

# అధ్యాయం - 16

# "శూద్రులు - ప్రతి విప్లవం

[ఇది ఇరవై ఒక్క ఫుల్‌స్కేప్ పేజీల టైపుచేసిన రాతప్రతి. మొదటి పేజీ పై భాగంలోను, తర్వాత పేజీలోను ఈ వ్యాస శీర్షిక "శూద్రులు-విప్లవం" అనే ఉంది. విడివిడి పేజీలుగా వున్న ఇవన్నీ ఒక టాగ్‌కి గుచ్చి వున్నాయి. దురదృష్టవశాత్తు ఈ వ్యాసంలో ఇరవైఒక్క పేజీలే ఉన్నాయి. మిగిలిన వ్యాస భాగంలోని పేజీలు పోయినట్లున్నాయి. -సంపాదకులు]

శూద్రుల స్థాయి గురించి మనువు నిర్దేశించిన సూత్రాలు చదవటానికి ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి. దానికి కారణం చాలా సామాన్యమైంది. అవి హిందువుల మనస్తత్వాన్ని తీర్చిదిద్దాయి. హిందూ సమాజంలో నేడే కాదు, అన్ని కాలాల్లోనూ సమాజంలో అత్యధిక సంఖ్యాకులైన ఈ శూద్రుల పట్ల హిందువుల దృక్పథాన్ని అది నిర్ణయించటం కూడా మన ఆసక్తికి మరో ప్రబలమైన కారణం. మనువు శూద్రులకు నిర్ణయించిన స్థాయిని పాఠకులు స్పష్టంగా అర్థం చేసుకొనేందుకు వీలుగా ఆ నిబంధనల్ని, సూత్రాల్ని వేర్వేరు శీర్షికల్లో ఈ దిగువున ఉదహరిస్తున్నాము.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతులకు చెందిన గృహస్థులకు ఈ క్రింది నియమాల్ని మనువు విధించాడు.

"శూద్రుడు గౌరవ ప్రదమైన వ్యక్తికాదు. కావున శూద్రుడు పరిపాలించే దేశంలో పై మూడు వర్ణాల వారు నివసించరాదు." (4-61)

"మతపరమైన యజ్ఞయాగాదులకు పౌరోహిత్యం నెరపినప్పటికీ, శూద్రుని నుండి ఏవిధమైన ఫలితాన్ని యాచించరాదు." (11-24)

శూద్రులతో వివాహ సంబంధాలు నిషేధం, మూడు శక్తులకు చెందిన ఏ స్త్రీతోనయినా సరే శూద్రుని వివాహం నిషిద్ధం. అగ్రకులానికి చెందిన స్త్రీలతో లైంగిక సంబంధం పెట్టుకుంటే శూద్రునికి ఉరిశిక్ష విధించాలని మనువు ప్రకటించాడు." (11-24).

"అరక్షిత అయిన లేదా రక్షిత అయి వున్న[1] అగ్రకుల స్త్రీని సంభోగిస్తే-శూద్రుణ్ణి యీ క్రింది విధంగా శిక్షించాలి.

ఆమె అరక్షిత అయితే శూద్రుని మర్మాంగాన్ని ఛేదించాలి. ఇతరుల సంరక్షణలో వున్నదైతే శూద్రుని సంహరించి అతని ఆస్తిపాస్తుల్ని స్వాధీనం చేసుకోవాలి." (8-374)

అధికార పదవులకు సంబంధించి మనువు ఈ క్రింది నిషేధాజ్ఞల్ని రూపొందించాడు.

"వేదంలో నిర్దేశించిన, విద్యను, విజ్ఞానాన్ని సముపార్జించకపోయినా అందుకు సంబంధించిన క్రతువులు వగైరా నిర్వర్తించలేకపోయినా పుట్టుకతో బ్రాహ్మణుడైతే చాలు. అనగా బ్రాహ్మణుడై పుడితే చాలు-అతణ్ణి చట్టాన్ని వ్యాఖ్యానించమని రాజు కోరవచ్చు. కాని శూద్రుడుగా జన్మించిన వాడు ఎంతటి పాండిత పటిమ కల్గి వున్నప్పటికీ అందుకు అర్హుడు కాడు. తీర్పు చెప్పే న్యాయాధిపతి కాకూడదుదు." (8-20)

"శూద్రుడు ధర్మశాస్త్రాలను వ్యాఖ్యానిస్తే తెలిపి ఉపేక్షించే రాజు రాజ్యం ఊబిలో కూరుకుపోయిన దున్నపోతులా అడుగంటిపోతుంది." (8-21)

"శూద్రుడెవరైనా పొగరుమోతుతనంతో బ్రాహ్మణునికి ధర్మబోధ చేయదలిస్తే రాజు ఉపేక్షించక ఆ శూద్రుని నోటిలోను చెవుల్లోను సలసలా కాగుతున్న నూనె పోయించాలి." (8-272)

విజ్ఞానార్జనకు, జ్ఞానానికి సంబంధించి యీ దిగువ విధంగా నిర్దేశించాడు.

"శూద్ర విద్యార్థులకు విద్యను బోధించేవాడు, శూద్రుడు గురువుగా విద్యనభ్యసించేవాడు ఇందుకు శూద్రులను ప్రోత్సహించి ఆహ్వానించేవాడు ఆ విద్యలకు అనర్హుడౌతాడు." (3-156)

"శూద్రుల సమక్షంలో బ్రాహ్మణులు ఎన్నడూ వేదాన్ని పఠించరాదు." (4-99)

మనువు తరువాత వచ్చినవారు శూద్రులు వేదాలు చదివితే విధించే శిక్షను మరీ విపరీతం జేశారు. శూద్రుడు పొరపాటుగానైనా, చాటుగానైనా, వేదాలు విన్నా, వేదవాక్యం ఉచ్చరించ సాహసించినా వాని నాలుకను చీల్చి వాని చెవుల్లో కరిగే సీసాన్ని పోయాలి, అని కాత్యాయనుడు నిర్దేశించాడు.

శూద్రుల ఆస్తి హక్కుకు సంబంధించి మనువు ఈ విధంగా నిర్దేశించాడు.

సంపాదనను కూడబెట్టుకొనే శక్తి సామర్థ్యాలు కలిగి వున్నప్పటికీ శూద్రుడు ఆ పవివి చేయకూడదు. సంపద గర్వాన్ని పెంచుతుంది. బ్రాహ్మణులను నిర్లక్ష్యం చేసి కించపరిచే స్థితికి ఎదగొచ్చు. అందుచేత అతడు దైనందిన అవసరాలకు మించి సంపాయించరాదు. (10-129)

తన అవసరాలను తీర్చుకొనే స్థితిలో లేనప్పుడు ఏ సంకోచం లేకుండా బ్రాహ్మణుడ శూద్రుని ఆస్తిని స్వాధీనం చేసుకోవచ్చు. (8–417)

శూద్రుడు ఒక వృత్తిని మాత్రమే చేయాలని, ఈ నియమాన్ని ఎంతమాత్రం ఉల్లంఘించ రాదని మనువు శాసించాడు.

భగవంతుడు శూద్రునికి ఒకే ఒక వృత్తిని కేటాయించాడు. అది బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకులాల వారిని విధేయంగా సేవించడం. (1–91)

శూద్రుడు (బ్రాహ్మణులను సేవించి జీవితావసరాలు తీర్చుకోలేకపోతే) క్షత్రియుణ్ని లేదా సంపన్నుడైన వైశ్యుణ్ని సేవించి, తన భృతిని సంపాదించుకోవాలి. (10–121)

ఇహపరలోక సుఖాల కోసం శూద్రుడు బ్రాహ్మణ సేవకుడుగా బతకాలి. అలా అయితే తాను ఆశించినవి పొందగలుగుతాడు. (10–122)

బ్రాహ్మడికి సేవ చేయడమే శూద్రుని ఉత్కృష్టమైన వృత్తి. మరేదైనా అతనికి నిష్ఫలం. (10–123)

శూద్రుల సేవక వృత్తిని కూడా మనువు స్వేచ్ఛాయుత ఒడంబడికగా వదలలేదు. సేవించడానికి నిరాకరించే శూద్రుని ఎలా శిక్షించాలో కూడా చెప్పాడు.

బ్రాహ్మణునికి సేవ చేయడానికే భగవంతుడు శూద్రుణ్ణి సృష్టించాడు. కాబట్టి శూద్రుణ్ని బానిసగా కొనుక్కోకపోయినా తన సేవకోసం శూద్రుణ్ని ఒత్తిడి చేయవచ్చు. (8–413)

శూద్రుడు చేసే కష్టానికి ఫలితాన్ని అతని పనితనాన్ని బట్టి, శ్రమను బట్టి అతడు పోషించవలసిన కుటుంబ సభ్యులను బట్టి తన కుటుంబ ఆస్తి నుంచి చెల్లించాలి. (10–124)

తాము తినగా మిగిలిన ఆహారాన్ని, పాత గృహోపకరణాల్ని శూద్రునికివ్వాలి. (10–125)

శూద్రుడు పై వర్ణాల వారికి బానిసగా మాటల్లోను చేతల్లోను విధేయుడిగా వుండాలి.

తాను నీచజన్ముడు కాబట్టి ద్విజులను అవమానిస్తే వాని నాలుకను కత్తిరించాలి. (8–270)

ద్విజుల్ని కులం పేరుతో దూషించిన శూద్రుని నోటిలో బాగా కాలుతున్న పది అంగుళాల మేకును దూర్చాలి. (8-271)

మనువు అంతటితో తృప్తిపడలేదు. శూద్రుల పేర్లు, ఇంటి పేర్లు బానిసభావాన్ని సూచించేదిగా వుండాలన్నాడు. (8-271)

బ్రాహ్మణుల పేర్ల ముందు శుభ సూచకాలు, క్షత్రియుల పేర్ల ముందు శౌర్య సూచకాలు, వైశ్యుల పేర్ల ముందు ఐశ్వర్య సూచకాలు వుండాలి. శూద్రుని విషయంలో అధమ నీచ సూచకాలు వుండాలని నిర్దేశించాడు. (11-31)

బ్రాహ్మణుని పేరులోని రెండో భాగం శుభాన్ని, క్షత్రియుని పేరులో శక్తినీ, బలాన్నీ, వైశ్యుని పేరులో సంపదనూ, శూద్రుని పేరులో మాత్రం సేవాతత్వాన్ని, బానిస భావాన్ని సూచించేదిగా వుండాలి. (11-32)

మనువు ముందు శూద్రుల పరిస్థితి ఏమిటి? ఆర్యులు అనుభవించే మత సాంఘిక హక్కులు గౌరవాలకు అర్హతలేని పరాయివారిగా, అనార్యులుగా మనువు పరిగణించాడు. శూద్రులు అనార్యులనే దాన్ని నిస్సంకోచంగా జనులందరూ ఆమోదిస్తూ వచ్చారు. కాని ప్రాచీన ఆర్య వాఙ్మయంలో ఇందుకు ఆధారాలేమి లేవు.

ఆర్యుల పురాతన వాఙ్మయం చదివితే మొట్టమొదటి ఆర్యులలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర అనే నాలుగు వర్ణాలు వుండేవి. ఈ విభజనే కాక (1) అసుర (2) సురలు లేక దేవతలు (3) యక్షులు (4) గంధర్వులు (5) కిన్నెరలు (6) చారణులు (7) అశ్వినులు (8) నిషాదులు కూడ కనిపిస్తారు. నిషాదులు అనాగరికులు. అత్యంత ప్రాచీనులైన ఆటవికులు, గంధర్వులు, యక్షులు, కిన్నెరలు, అశ్వినులు వృత్తిపరమైన వర్గాలుగ ఆకనిపిస్తారు. అంతేగాని వర్ణాలు కావు. దైత్యులు, దానవులు, దస్యులు, కాలంజనులు, కాలెయ్యులు, కాలిందులు, నాగులు, నివాత కవచులు, పౌలోమలు, నిశాచులు, రాక్షసులు వంటి పేర్లతో పిలువబడే వర్గాలన్నింటినీ కలిపి అసురులు అనే జాతి సంబంధమైన పేరుపెట్టారు. అసురుల్లాగే సురలు, దేవతలు కూడ వివిధ తెగల కూటమి కావచ్చేమో మనకు తెలియదు. దేవతల జాతికి చెందిన నాయకులు మాత్రమే మనకు తెలుసు. బ్రహ్మ, విష్ణు, రుద్ర, సూర్య, ఇంద్ర, వరుణ, సోమ మొదలగు వారు.

సాయణాచార్యుడు చేసిన కొన్ని అసంబద్ధ, అవివేక వ్యాఖ్యలు ఆర్యులు, అసురులు, దేవతలు, వారి మధ్యనున్న సంబంధ బాంధవ్యాల గురించి మేధావులకు కూడ కొన్ని వింత నమ్మకాలు కలిగించాయి. అసురులు అనేవారు అసలు మానవులే కారని నిశాచరులని ఆర్యుల్ని

పీడించే దయ్యాలు, భూతాలు, పిశాచాలని నమ్మకం ఏర్పడ్డది. సురలు, దేవతలు ప్రకృతి శక్తుల దైవిక ప్రతీకలనీ; ఆర్యుల శరీరం రంగు గొప్పదని పొడవైన ముక్కులు కలిగి వుంటారని, చాలా వర్ణాహంకారం కలిగిన వారనీ నమ్మకం ఏర్పడ్డది. శూద్రులకు మరోపేరు దస్యులు, భారతదేశంలో ఆదిమవాసులు శూద్రులు అని చెప్పడం జరిగింది. వీరు నల్లనివారు, చప్పిడి ముక్కులు కలిగి వుంటారని చెప్పారు. భారతదేశంపై దండెత్తి వచ్చిన ఆర్యులు వారిని జయించి వారిని దస్యులుగా పిలిచారని ఒక భావన. దస్యు అనే మాటలో పుట్టినదే దాస[2] శబ్దం.

ఈ నమ్మకాలకు ఆధారమేదీ లేదు. ఆర్యుల్లాగే సురలు, అసురలు కూడ మానవజాతికి చెందినవారే. అసురులు, సురలు కూడా ఒక తండ్రి బిడ్డలే. ఆ తండ్రి పేరు కాశ్యపుడు. అసలు కథ ఏమిటంటే "దక్ష ప్రజాపతికి 60 మంది కుమార్తెలు. వారిలో పదమూడు మందిని కాశ్యపుడికిచ్చి పెళ్లి చేశాడు. వారిలో దితి, అదితి అనేవారు యిద్దరు. దితి సంతానాన్ని అసురులుగాను, అదితి సంతాన్ని సురలుగాను పిలిచేవారు. ప్రపంచాధిపత్యం కోసం యిరువురూ ఘోర యుద్ధాలు చేశారు. ఇది పురాణగాథ అనడంలో సందేహం లేదు. అయినా పురాణాలు – అతిశయోక్తులతో చెప్పిన చరిత్ర అయినప్పటికీ - అవి కూడా చరిత్రే.

ఆర్యులు ఒక జాతికాదు. వివిధ ప్రజల కలయిక. వారిని కలిపిన శక్తి ఏమిటంటే ఆర్య సంస్కృతిగా పిలవబడిన సంస్కృతిని కొనసాగించాలనే ఆసక్తి. ఆర్య సంస్కృతిని ఆమోదించిన ప్రతి వ్యక్తి ఆర్యుడే. వారు ఒక జాతికి చెందిన వారు కానందున ఒక ప్రత్యేకమైన రంగు, శారీరక లక్షణాలు వారికి లేవు. ఆర్యులు తమను తాము వేర్పరచుకోటానికి వారికంటె భిన్నమైన నల్లరంగు వున్న లేక చప్పిడి ముక్కు వున్న ప్రజలు ఎవరూ లేరు.[3] ఆర్యులకూ, దస్యులకూ మధ్య విభజనకూ శత్రుత్వానికీ, రంగుపై ఆధారపడిన దురూహలు కారణమనుకోవడం దస్యుల గురించి వాడే వర్ణ, అనాస అనే పదాలను తప్పగా అర్థం చేసుకోవడం వల్ల జరిగిన పొరపాటు. వర్ణ అంటే రంగు అనీ, అనాస అంటే ముక్కు లేకపోవడమనీ అర్థం చెపుతున్నారు. ఈ రెండూ తప్పుడు అర్థాలు. వర్ణ అంటే కులం లేక సమూహం. అనాసను అన్–ఆస్‌గా అర్థం చేసుకుంటే సంస్కరించబడని భాష. ఆర్యులకు రంగుపై ఆధారపడిన ద్వేషభావం ఉందనీ, అదే వారి సామాజిక వ్యవస్థను నిర్ణయించిందనీ అనడం శుద్ధ అర్థంలేని మాట. ప్రపంచంలో రంగుపై ఆధారపడిన ద్వేషభావాలు లేని ప్రజలు ఆర్యులే. ఇందుకు కారణం, తమను తాము వేరుగా గుర్తించుకోవడానికి వారందరికీ ఒకే ప్రధానమైన రంగు లేకపోవడం.

దస్యులు జాతిని బట్టి ఆర్యేతరులు అనడం తప్పు. దస్యులు భారతావనిలో ఆర్యులకు ముందు నివసించిన స్థానిక జాతులు కారు. ఆర్య సమాజంలోని వారే. ఆర్య సంస్కృతిలో ముఖ్య భాగమైన కొన్ని పూజా విధానాల్ని, నమ్మకాల్ని అంగీకరించనందువల్ల ఆర్య అనే బిరుదును కోల్పోయారు. దస్యులు ఆర్యేతరులనే నమ్మకం ఆధారరహితం. ఋగ్వేదం (1–49)లో ఇంద్రుడు యిలా అన్నాడు. "నేను కవి అనే మానవుణ్ణి నా వజ్రాయుధంతో సంహరించాను. కుపను ఉపాయాలతో సంరక్షించాను. సుష్ణను చంపడానికి వజ్రాయుధం చేబట్టాను. దస్యులకు

ఆర్య నామధేయం లేకుండా చేశాను."

దస్యులు కూడా ఆర్యులేనన్న వాదనను బలపరచడానికి ఈ ఇంద్రుని మాటలకు మించిన ఖచ్చితమైన సాక్ష్యం అక్కరలేదు. మరింత ముందుకు వెళ్ళి, మెరుగైన ఆధారం కావాలంటే ఇంద్రుడు తను చేసిన అత్యాచారాలకు ఫలితంగా అభిశంసనను ఎదుర్కొన్న సందర్భాన్ని చూడ వచ్చు. ఇంద్రుడు అభిశంసన ఎదుర్కొనడానికి కారణమైన అత్యాచారాలలో వృత్తుని సంహారం ఒకటి. వృత్తుడు దస్యుల నాయకుడు. దస్యులు ఆర్యులు కాకపోతే, ఇంద్రునిపై అటువంటి ఆరోపణ చేయడం అసాధ్యం.

ఆర్యుల దండయాత్రలో శూద్రులు ఓడిపోయి వారికి లొంగిపోయారన్నది లోపభూయిష్టమైనది. ఆర్యులు భారతదేశం ఆవలి నుండి వచ్చి అనాదిగా నివసిస్తున్న వారిని ఓడించి ఆక్రమించుకొన్నారనడానికి సరైన ఋజువు కానరాదు. ఆర్యులకి భారతదేశమే పుట్టిల్లు అనడానికి అనేక ఆధారాలున్నాయి. ఇక రెండో విషయం: ఆర్యులకు దస్యులకు మధ్య యుద్ధాలు జరిగినట్టు ఎక్కడా ఆధారాలు లేవు. పైగా దస్యులకూ, శూద్రులకు ఏమీ సంబంధం లేదు. మూడో విషయం ఆర్యులు చాలా బలవంతులనీ, యుద్ధ తంత్రంలో ఆరితేరిన వారనీ నమ్మడం కష్టం. దేవతలకూ, ఆర్యులకూ గల సంబంధాలను గురించిన చరిత్ర చదివిన వారికి ఫ్యూడల్ వ్యవస్థలో ప్రభువులకూ, వారి అర్ధబానిస-రైతులకూ (Viellens) మధ్య ఉన్న సంబంధాలు వీళ్ళ మధ్య కూడా ఉన్నాయని తెలుస్తుంది. దేవతలు ప్రభువులూ, ఆర్యులు వరి అర్ధ బానిస రైతులు. వారు చేసే అనేకానేక యజ్ఞాలు, తద్వారా సమర్పించుకునే బలులూ దేవతలకు ఆర్యులు సమర్పించిన ఫ్యూడల్ సుంకాలనిపిస్తాయి. ఆర్యులు దేవతలకు బానిసలుగా ఉండడానికి కారణం, వాళ్ళు దేవతల సహాయం లేకుండా అసురుల దండయాత్రల్ని ఎదుర్కోలేకపోవడమే కారణం. అంతటి బలహీనులయిన ఆర్యులు శూద్రులను జయించారనుకోవడం వట్టి భ్రమ. చివరిగా అసలు శూద్రుల్ని జయించాల్సిన అవసరం లేదు. ఆర్య సంస్కృతిని పాటించే వారు ఆర్యులనే అసలు అర్థంలో శూద్రులు కూడా ఆర్యులే. శూద్రులు నల్ల రంగుతో, చప్పిడి ముక్కు కలిగి ఉండేవారనీ, ఆర్యుల చేత ఓడిపోయి వారికి బానిసలయ్యారనీ ఎవరూ, ఎక్కడా, ఎప్పుడూ పేర్కొనలేదు. దస్యులూ, శూద్రులూ ఒకరేనని భావించడం తప్ప. వాళ్ళంతా ప్రజలుగా ఒకటే కావచ్చు కానీ సాంస్కృతికంగా భిన్నమైన వారు. ఆర్య సంస్కృతిని వ్యతిరేకించి, దానిపై తిరుగుబాటు చేశారు అనే అర్థంలో దస్యుల్ని ఆర్యేతరులుగా పరిగణించవచ్చు. శూద్రులు ఇందుకు భిన్నమైన వారు. వారు ఆర్యులే. అంటే ఆర్యుల జీవన విధనాన్ని నమ్మి ఆచరించేవారు కాబట్టి శూద్రులు ఆర్యులుగా పరిగణిపబడ్డారు. కౌటిల్యుడు అర్ధశాస్త్రం రాసిన కాలం నాటికి కూడా శూద్రుల్ని ఆర్యులుగానే వ్యవహరించేవారు.

ఆర్య సమాజంలో శూద్రుడు విడదీయరాని, సహజమైన, విలువగల సభ్యుడనే విషయం, యజుర్వేదంలోని 4 ఒక ప్రార్థనవల్ల తెలుస్తుంది. యజ్ఞం చేసేవాడు ఇలా అంటాడు:

"ఓ దేవతలారా! మా పవిత్ర పూజారులకు తేజాన్నివ్వండి. మా ప్రభువులలో తేజాన్ని నింపండి. వైశ్యులు, శూద్రులలో తేజాన్ని నింపండి. తద్వారా నాకూ తేజస్సునివ్వండి."

ఇది చాలా ముఖ్యమైన ప్రార్ధన. ఎందుకంటే, ఇది, శూద్రుడు కూడా ఆర్యుల సమాజంలో గౌరవ స్థానాన్ని కలిగి ఉండేవాడని రుజువు చేస్తుంది.

రాజుకు పట్టాభిషేకం జరిగేటప్పుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులతో పాటు శూద్రులూ ఆహ్వానింపబడేవారన్న సంగతి మహాభారతంలోని యుధిష్ఠిరుని పట్టాభిషేక వర్ణన మంచి తెలుస్తుంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులతో పాటు శూద్రులు కూడా రాజును సంప్రోక్షిస్తారు. నీలకంఠుడనే ప్రాచీన రచయిత పట్టాభిషేకం గురించి చెపుతూ, "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలకు చెందిన నలుగురు ప్రధానమంత్రులూ రాజును సంప్రోక్షించిన వారిలో ఉన్నారు. అనంతరం అంతకంటే కింది కులాల నాయకులు రాజును పవిత్ర జలాలతో సంప్రోక్షించారు. అనంతరం బ్రాహ్మణులు స్తోత్ర పాఠాలు ప్రారంభించారు.

వేదయుగం తర్వాత, మనువుకు ముందు కాలంలో రతులు అని పిలువబడే ప్రజా ప్రతినిధుల సముదాయం ఒకటి వుండేది. రాజును పట్టాభిషిక్తున్ని చేసే సందర్భంలో వారికి చాలా ప్రాముఖ్యత వుండేది. సార్వభౌమత్వానికి చిహ్నంగ రత్నం వారి వద్దనుండడం వల్ల, వారు అంత ప్రాముఖ్యత సంతరించుకొన్నారు. ఆ రత్నాన్ని రాజుకు సమర్పించడం వల్ల ఆయనకు సార్వభౌమత్వం ప్రాప్తిస్తుంది. తరువాత రాజు ప్రతి 'రత్ని' యింటికి వెళ్ళి వారికి సంభావనలిచ్చేవాడు. ఆ రత్నిలు సముదాయంలో శూద్రుడు కూడా ఒకడనేది ముఖ్యమైన విషయం.

పురాతన కాలంలోని జానపద, పౌర అనే శాసన సభలు రెండింటిలోను శూద్రులు సభ్యులుగా వుండి, బ్రాహ్మణుల నుండి కూడ గౌరవం పొందే అర్హత కలిగి వుండేవారు.

పూర్వపు ఆర్య సమాజంలో శూద్రులు ఉన్నత రాజకీయ స్థాయిని పొందారన్నది తిరుగులేని సత్యం. వారు మంత్రి పదవులు అధిష్ఠించారు. ఇందుకు మహాభారతం సాక్షి. తన జ్ఞాపకాలను బట్టి మహాభారత రచయిత రాసిన సమాచారం ప్రకారం వివిధ వర్ణాలకు చెందిన మంత్రుల పట్టికలో[5] అప్పటి 37 మంది మంత్రుల్లో నలుగురు బ్రాహ్మణులు, ఎనిమిది మంది క్షత్రియులు, ఇరవై ఒక్క మంది వైశ్యులు, ముగ్గురు శూద్రులు, ఒక సూతుడు వుండేవారని వ్రాశారు.

శూద్రులు మంత్రులు కావడంతో తృప్తిపడలేదు. వారు రాజులయ్యారు. మనువు అభిప్రాయాలకు భిన్నంగా శూద్రుడు రాజు కావడం ఋగ్వేదంలోని శూద్రుల గాథలు పరిశీలిస్తే

ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. సుదాసుడి పాలన గురించి ప్రస్తావన వస్తేగిస్తే ఆయన కొలువులో పురోహితులుగా వుండేందుకు వశిష్ట విశ్వామిత్రుల మధ్య జరిగిన తీవ్రమైన పోటీ సందర్భంలో వస్తుంది. అంతవరకు రాజు కొలువులో వశిష్ఠుడు పురోహితుడుగా వున్నాడు. రాజుకు పురోహితుడుగా వుండేందుకు ఒక్క బ్రాహ్మణునికి మాత్రమే హక్కు వుందని ఆయన వాదించాడు. క్షత్రియులు కూడా ఇందుకు అర్హులేనని విశ్వామిత్రుడు వాదించాడు. విశ్వామిత్రుడే గెలిచి సుదాసుడికి పురోహితుడయ్యాడు.

యిది చాలా గుర్తుంచుకోదగ్గ ఉదాహరణని చెప్పుకోవచ్చు. శాశ్వతంగా బ్రాహ్మణుల్ని తొలగించకపోయినా పౌరోహిత్యం కేవలం బ్రాహ్మణుల సొత్తు మాత్రమే కాదని తేలింది. ప్రాచీన సాహిత్యంలో దొరికే సాంఘిక చరిత్రకు సంబంధించిన కథల్లో ఇది ఉత్తమమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చు. కానీ దురదృష్టవశాత్తూ దీన్నెవరూ జాగ్రత్తగా పట్టించుకోలేదు. అసలీ సుదాసుడెవరని కూడా ఎవరూ ప్రశ్నించలేదు. సుదాసుడు కాశీని అనగా వారణాసిని ఏలిన దివోదాసు కుమారుడైన పైజవనుడి కుమారుడు. సుదాసుని వర్ణమేమిటి? సుదాసుడు శూద్రరాజు అనే యదార్థాన్ని నమ్మేవారు తక్కువ. పైజవనుడు శూద్రుడని చెప్పిన మహాభారతము శాంతి పర్వములోని ప్రస్తావన ద్వారా దీనిని ధృఢి పరచుకోవచ్చు.[6] ఇందువల్ల ఆర్య సమాజములో శూద్రులు కూడా పరిపాలకులుగా వున్నారని వారికి సేవ చేయడానికి ఏ విధమైన సంకోచము లేకుండా, అవమానమని భావించకుండా వారికి వైదిక కర్మలు, పూజలు వంటి సేవలు చేయడానికి పోటీ పడ్డారని తేటతెల్లమవుతుంది.

తర్వాతి కాలంలో కూడ శూద్రరాజులు లేరనడానికి వీలులేదు. మనువుకు ముందు రాజ్యమేలిన రెండు వంశాలు కూడ శూద్రులదేనని చరిత్ర చెబుతుంది. క్రీ.పూ. 413 నుండి 322 [7] వరకు రాజ్యమేలిన నందులు; వారి అనంతరం క్రీ.పూ. 322 నుండి 183[8] వరకు పరిపాలించిన మౌర్యులు కూడ శూద్రులే భారతదేశానికి చక్రవర్తి కావడమే కాక, శూద్రులు నిర్మించిన సామ్రాజ్యానికి చక్రవర్తి అయిన అశోకుని చూపించడం కంటే శూద్రులనుభవించిన ఔన్నత్యానికి ప్రబల సాక్ష్యం మరేముంటుంది?

శూద్రులకు వేదాల్ని చదివే హక్కు గురించి ఛాందోగ్యోపనిషత్తులోని ఒక ప్రస్తావన (5–1–2) నుంచి తెలుసుకోవచ్చు. అందులో జనశ్రుతి అనే శూద్రునికి రైక్వ అనే మత బోధకుడు వేద విద్యను గడిపాడన్న కథ వుంది. ఈ కథ నిజమైతే దాని ఆధారంగా ఆ కాలపు శూద్రులు వేదాధ్యయనం చేయడానికి యే విధమైన నిషేధాలు లేవు అని తెలుస్తుంది.

వేదాధ్యయనం చేయడమే కాకుండా ఋషుల స్థాయికి చేరిన వారు కూడా శూద్రులలో వున్నారు. వారు వేదాలలోని కొన్ని శ్లోకాలను కూడా రచించారు. ఋషి కవష అల్యూష[9] ఋగ్వేదంలోని దశమ స్కందంలో అనేక శ్లోకాలు రచించినట్లు ఆయన గాథ వల్ల మనకు విశదమవుతుంది.[10]

వేదవిహిత కర్మలూ, యజ్ఞాలూ చేసే అర్హత శూద్రులకుందా అనే విషయంలో ఈ వివరాలను చెప్పవచ్చు. పూర్వ మీమాంస రచయిత జైమిని ప్రకారం[11] వైదిక పూజలు క్రతువులు చేయడానికి శూద్రుల కుండే ఆధ్యాత్మిక అర్హతల గురించి బదరి అనే ప్రాచీన బోధకుడు ఉద్బోధించినట్లు తెలుస్తుంది. వైదిక యజ్ఞాలకు కావలసిన మూడు అగ్నుల్ని శూద్రుడు సంప్రోదించవచ్చునని చెప్పే సిద్ధాంతాలు కూడా ఉన్నాయని భరద్వాజ శ్రౌత సూత్రం (5-28) అంగీకరిస్తున్నది. వైదిక కర్మకాండ జరిపేందుకు శూద్రులు కూడ అర్హులేనన్న వైదిక గ్రంథాలు న్నాయని కాత్యాయన శ్రౌత సూత్రం (1&5) వ్యాఖ్యాత అంగీకరించాడు. యజ్ఞాలు జరిపి బలులు యిచ్చేటప్పుడు పాటించవలసిన ఒక నియమాన్ని శతపథ బ్రాహ్మణం (1-14-12) చెప్తింది. 'హవిష్కృత్' అనగా క్రతువొనరించే వ్యక్తిని కార్యక్రమం ఆరంభించవలసిందిగా కోరే విధానం పిలుపు గురించిన నియమమది. ఆ నియమం ప్రకారం:

"ఈ పిలుపుకు మూడు రూపాలున్నాయి. బ్రాహ్మణుడినయితే 'ఇటు దయచేయండి' (ఏహి) అనీ, వైశ్యుడినయితే 'చేరుకోండి' (ఆగాహి) అనీ, క్షత్రియుణ్ణి 'ఇటు త్వరగా రండి' (అదర్వ) అనీ, శూద్రుణ్ణి "ఇటు పరుగెత్తు" (అధవ) అనీ పిలవాలి."

శతపథ బ్రాహ్మణంలో[12] శూద్రుడు సోమయాగం చేయవచ్చునని, దివ్యపానీయమైన సోమరసం గ్రోలవచ్చుననే ఆధారం వుంది. సోమయాగంలో శూద్రులకు పాలుమాత్రం తాగు తారనే శపథం (పాయోవ్రత) సాధనంలో తిరిగిన మజ్జిగ నీళ్ళను (మస్తు) చేర్చడం జరిగింది. శతపథ బ్రాహ్మణంలోనే[13] ఇంకోచోట ఇలా చెప్పబడింది.

"సోమరసాన్ని యిష్టపడని వారు నాలుగు కులాల్లో బ్రాహ్మణ, రాజన్య, వైశ్య, శూద్ర ఎవరూ లేరు. అలా యిష్టపడని యెడల ఏదో ఒక ప్రాయశ్చిత్తం చేసుకోవాలి."

అంటే సోమరసాన్ని తాగడం శూద్రులకు కూడా ఆమోదయోగ్యమే కాక తప్పనిసరి కూడా. అశ్వినుల కథలో[14] శూద్రులకు సోమరసం త్రాగే అర్హత వున్నట్టు స్పష్టంగా వుంది. సుకన్య స్నానమాడి, నగ్నంగా ఉన్నపుడు అశ్వినులు చూడ్డం జరిగింది. ఆమె యవ్వనంలో వుంది. చాలా అందమైనది. ఆమెలోని ఆకర్షణకు వారు ముగ్ధులై, ఇలా అన్నారు. "మాలో ఒకరిని నీ భర్తగా స్వీకరించు. నీ యవ్వనాన్ని ఇలా వృధా చేయడం తగదు." (ఆమె అప్పటికే వివాహిత. చావుబ్రతుకుల్లో వున్న చ్యవనుడనే వృద్ధ ఋషికి భార్య.)

నేను నా భర్తకే విధేయురాలిగా వుంటాను' అని ఆమె వారి కోరికను నిరాకరిస్తుంది.

"మేము ప్రఖ్యాత దేవ వైద్యులం. నీ భర్తకు యవ్వనం అందం ప్రతిపాదిస్తాము. మా కోర్కెను తీర్చుమ"ని ఆమెను ఒత్తిడి చేసారు. బేరం సాగించారు. ఆమె వెళ్ళి భర్తకు యీ విషయం వివరిస్తే ఆయన అందుకు అనుమతించాడు. అశ్వినులు చ్యవనునికి అందం,

యవ్వనం ప్రసాదించారు. అశ్వినులు శూద్రులు కావడం వల్ల దేవతలు గ్రోలే సోమరసం సేవించడానికి ఇంద్రుడు అభ్యంతరం పెట్టాడు. చ్యవనుడు ఇంద్రుణ్ని ఒప్పించి అశ్వినులకు సోమరసం ఇప్పించాడు.

శూద్రులు నిజంగా ఈ కథల్లో చెప్పిన వైదిక కర్మల్ని చేస్తూ వుండి వుండకపోతే ఈ ఏర్పాట్లకు అర్థం లేదు. అశ్వమేథం[15] అనే వైదిక యజ్ఞంలో ఒక శూద్ర స్త్రీ పాలు పంచుకున్నట్టు చూపడానికి ఆధారం వుంది.

ఉపనయనం, యజ్ఞోపవీతాలకు శూద్రులు పట్ల స్పష్టమైన నిషేధం లేదు. సంస్కార గణపతిలో ఉపనయనానికిశూద్రుడు అర్హుడనే ప్రకటన వుంది.[16]

క్రింది వర్గాలకు చెందిన వారయినప్పటికీ, మనువుకు ముందు కాలంలో శూద్రులు అన్ని పౌర స్వేచ్ఛల్నీ అనుభవించారనడం అతిశయోక్తి కాదు. కౌటిల్యుని అర్థశాస్త్రం ప్రకారము

"బానిసగా పుట్టని, యుక్తవయస్సు రాని, పుట్టుకతో ఆర్యుడైన శూద్రుణ్ణి బానిసగా తాకట్టు పెట్టడం గాని అమ్మడం గాని చేసే వారికి, రెండు పణాల జరిమానా విధించాలి."

"బానిసకు యివ్వవలసిన ధనాన్ని యివ్వకుండా, ఆర్యునిగా అతనికుండే హక్కుల్ని హరించినా బానిసగా చేసినందుకు విధించే శిక్షలో సగం విధించాలి."

బాకీ తీర్చిన తరువాత కూడా కారణం లేకుండా బానిసగా ఉంచినందుకు 12 పణాలు జరిమానా విధించాలి. కారణం లేకుండా బానిసను బంధిస్తే (సమ్రోధవ్వ కారణాత్) కూడా అదే శిక్ష."

బానిసగా అమ్ముడుపోయిన వ్యక్తి సంతానం ఆర్యులే. బానిస తన యజమాని పనికి కట్టుబడి ఉండాలి కానీ అతడు తన తండ్రి ఆస్తిని వారసత్వంగా పొందడానికి అర్హులే."

మనువు శూద్రుణ్ని ఎందుకు అణచివేశాడు!

ఇది చాలా క్లిష్టమైన చిక్కు ప్రశ్న. ఆర్యులు, ఇతరుల్ని తమ సంస్కృతి పరిధిలోకి తెచ్చి తమలో చేర్చుకోవడానికి కృషి చేశారు. ఆర్యేతరులందర్నీ, పెద్ద సంఖ్యలో పెద్దఎత్తున మార్చుకొనేందుకు 'వ్రత్యస్తోమ' అనే మతపరమైన ఉత్సవాల్ని ఏర్పాటుచేసి, వాటిని పెంపొందించారు. ఈ ఉత్సవాలు గురించి మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రి యిలా రాశారు.

"పంచ వింశ బ్రాహ్మణంలో చెప్పిన వ్రత్యులను శుద్ధి చేసే క్రతువు ఇతర వైదిక క్రతువుల కంటే కవీసం ఒక అంశంలో భిన్నమైనది. యితర క్రతువుల్లో భార్యాభర్తలు మాత్రమే యజ్ఞాలలో ఉంటే యీ వ్రత్యస్తోమలో మాత్రం వేల సంఖ్యలో వుండేవారు. మేధావి, శక్తిమంతుడు లేక ధనవంతుడు అయిన వ్యక్తి గృహపతిగా లేక పితాధికారిగా వుండి, మిగిలినవారు అతన్ని అనుసరించేవారు. గృహపతి ఇతరులకంటే ఎక్కువ రుసుం లేదా దక్షిణ చెల్లించవలసి వుండేది."

"ఇది వేలాది మంది వ్రత్యులను రుషుల సమాజంలోకి చేర్చుకోవడానికి వుపయోగించిన సాధనమని నేను భావిస్తున్నాను. వేలాది వ్రత్యులను ఆర్య సమాజంలోనికి చేర్చుకోవడానికి, తరచూ యీ పుత్పవాల్ని నిర్వహించేవారు. సంచార జాతులుగా వున్న వ్రత్యులను, స్థిర నివాసాల్లోనికి, అధికారికంగా చేర్చుకొనేటప్పుడు, అంతవరకు వారనుభవిస్తున్న ఆస్తిపాస్తుల్ని, స్థిరవాసాలకు తెచ్చుకోవడానికి వీలులేదు. ఆస్తిపాస్తుల్ని అక్కడ వ్రత్యులుగా మిగిలిపోయిన వారికి గాని, మగధ దేశ బ్రాహ్మణులుగా భావిస్తున్న వారికి గాని విడిచిరావాలి. ఇంతకు ముందే నేను వివరించినట్లుగా, మగధ దేశంలో ఆర్యులచేత తక్కువగా చూడబడే వారు ఎక్కువ సంఖ్యలో వుండేవారు."

"వ్రత్యులు ఆర్యులతో బాటు స్థిరవాసాల్లో చేరగానే, వారికి ఆర్యులతో పాటు సమానగౌరవం లభించేది. వారు వండిన వంటకాన్ని రుషులు భుజించేవారు. రుషుల వంటకాల్ని వ్రత్యులు తినేవారు. వారు వేదాలు నేర్చుకోవడానికి, బోధించడానికి అవకాశం ఉండేది. ఆర్యులు, సామ, ఋగ్వేద యజుర్వేదాల్ని వారికి నేర్పించేవారు. తాము యజ్ఞాలు చేసుకోవచ్చు. ఇతరులకోసం చేయవచ్చు. అంటే అందరితో సమానంగా చూడబడేవారు. సమాన స్థాయి పొందడమే కాక ఋషులతో బాటు అత్యున్నత గౌరవార్థం పొందే అవకాశం వారికుండేది. సామలనే కాక రుక్కుల్ని కూడా వారికి వెల్లడించేవారు. పురీతుడైన కౌశీతకి అనే వ్రత్యుడ్ని ఋగ్వేద బ్రాహ్మణాల్నవింటివి, సంగ్రహించేందుకు సంకలనం చేసేందుకు కూడా అనుమతించారు. ఇప్పటికీ ఆ సంహితను అతని పేరుతో పిలుస్తారు."

ఇష్టపడిన ఆర్యేతరుల్ని తమలో కలుపుకోవడమే కాకుండా; తమ పూజల్ని, క్రతువుల్ని పద్ధతుల్ని, విధానాల్ని, చతుర్వర్ణ సిద్ధాంతాన్ని వ్యతిరేకించే అసురులను కూడా తమ సంస్కృతిలోనికి తెచ్చుకోవడానికి శతవిధాలా ప్రయత్నించేవారు. పురాణగాథల ప్రకారం వేదాల్ని అసురులు దొంగిలించినట్లుగా వ్రాయబడింది. హిరణ్య కశ్యపుడనే అసురుడు తన కుమారుడు ప్రహ్లాదుణ్ణి ఆర్య సంస్కృతిని అనుసరించకుండా విరోధించడం; విష్ణుమూర్తి నరసింహావతారమెత్తి అతన్ని సంహరించడం–ఈ కథ ఈ విషయాన్ని నిరూపిస్తుంది.

ఇవి అనార్యులను ఆర్యులుగా కలుపుకోవడానికి, మార్చడానికి ఉదాహరణలు. మరి తర్వాత ఆర్యులుశూద్రుల పట్ల వ్యతిరేకతను ఎందుకు ప్రదర్శించారు? ముఖ్యులుగా ఆర్యులుగా పరిగణింపబడ్డ శూద్రులు హక్కులు కోల్పోయి తిరిగా ఆర్యేతరులుగా ఎలా మారారు?

నిషాదుల పట్ల ఆర్యులు వ్యవహరించిన తీరుతెన్నులు ఈ చిక్కు ప్రశ్నకు సమాధానమిస్తాయి. ప్రాచీన సంస్కృతి సాహిత్యంలో అయిదు తెగల గురించిన ప్రస్తావనలు చాలా వున్నాయి. అవి పంచ–కిష్తాయ, పంచ–క్షితాయ, పంచ–క్షితాస మనుష్య, పచ–చర్మనాయ, పచచ–జనా, పంచి–జన్య అంటే పంచ–భూమ, పంచజాతులు.[17] వాటి అర్థాల విషయంలో ఏకాభిప్రాయం లేదు. ఋగ్వేద భాష్యకారుడైన శాయనాచార్యుడు అది చతుర్వర్ణాలకు, నిషాదులకు వర్తిస్తాయని చెప్పాడు. విష్ణు పురాణంలోని నిషాదుల కథ యీ విధంగా వుంది.

7. "మృత్యు (మరణం) మొదటి కుమార్తె సునీతను అంగ కిచ్చి వివాహం చేశాడు. వారికి వేనుడు జన్మించాడు."

8. "మృత్యు కుమార్తె సునీతకు పుట్టిన వేనుడు తన పితామహుని దుర్బుద్ధిని, దుర్గుణాలను అన్నింటిని పుణికి పుచ్చుకొన్నాడు."

9. మహామునులు వేనుని పట్టాభిషిక్తుణ్ని చేసినపుడు అతడిలా ప్రకటించమని (తన అనుచరుల్ని) ఆదేశించాడు. "ప్రజలు యజ్ఞయాగాదులు చేయరాదు. నైవేద్యాలు బహుమతులు యివ్వరాదు. వీటన్నింటిని అందుకోవడానికి వెరెవ్వరూ కాక నేనే అర్హుణ్ని. ఎల్లప్పుడూ ఈ పూజల్ని నేనే అందుకుంటాను."

10. ఋషులందరూ అతి వినయంతో భక్తి ప్రపత్తులతో సరళమైన భాషలో యిలా మనవి చేసుకున్నారు.

11. ఓ రాజా! మా మనవి ఆలకించండి.

12. దేవతలకు అధినేత రాజు అయిన హరిని మనం, నిత్యం పూజిస్తూ, క్రతువులతో ఆయన్ని ఆరాధించాలి. అందువల్ల, నీకు నీ రాజ్యానికి నీ ప్రజలకు కూడ సత్ఫలితం, ప్రయోజనం కలుగుతుంది. ప్రజలు చేసే పూజలలో నీకు కూడ భాగం వుంటుంది. నీకు ఆ హరి ఆశీస్సులు వల్ల శుభం కలుగుతుంది.

13. మేము చేసే యజ్ఞయాగాదుల వల్ల మన ఆరాధ్య దైవమైన విష్ణువు ప్రసన్నుడై కోరికలన్నింటిని నెరవేరుస్తాడు. పూజ్యనీయుడైన హరి తనను భక్తి ప్రవృత్తులతో పూజించే రాజ్యం కలిగిన రాజును అనుగ్రహించి అన్నింటిని ప్రసాదిస్తాడు." అందుకు వేనుడు కినిసి, ఈ విధంగా అన్నాడు– "నాకంటె గొప్ప వారెవరున్నారు. నాకంటె పూజార్హులెవ్వరు? పూజనీయుడని మీరందరూ పొగిడే ఆ హరి ఎవరు? బ్రహ్మ, జనార్దన, రుద్ర, ఇంద్ర, వాయు, యమ, రవి, అగ్ని, వరుణ, ధాత్రి, పుష్పభూమి, చంద్రుడు లాంటి ఆశీస్సులందజేయగలిగి, శపించగల వారంతా

రాజులో విలీనీకృతమై వున్నారు. వారందరి ప్రతిరూపమే యీ రాజు. ఈ యదార్థాన్ని గ్రహించి మీరందరూ నా ఆజ్ఞ ప్రకారం ప్రవర్తించాలి. కాబట్టి ఓ బ్రాహ్మణులారా! మీరు నాకే పూజలు యజ్ఞాలు చేయుటగాని, బలులు, కానుకలు సమర్పించుట గాని చేయరాదు."

14. భర్తల పట్ల భార్యలు ఏవిధంగా వినయవిధేయతలు కలిగి వుండి భక్తిశ్రద్ధలతోను గౌరవంతోను మెలుగుతారో అదేవిధంగా మీరు కూడా, నా ఆజ్ఞల్ని శిరసావహించి మెలగాలి."

అందుకు వారు ఈ విధంగా హితవు పలికారు– "ఘనుడైన ఓ మహారాజా! ఈ సృష్టి సమస్తం, బలికి ప్రతిరూపం కాబట్టి పూజలు చేయడానికి మాకు అనుమతి ఇచ్చి మతం నాశనం కాకుండా కాపాడండి."

15. "మతం నాశనం అయితే దానితో పాటు సృష్టి నాశనం అవుతుంది" అని ఋషులందరూ ఎన్నో విధాల ఎంతగా మొరపెట్టి మందలించి పదేపదే వేడుకొన్నప్పటికీ వేనుడు అంగీకరించలేదు. అప్పుడు మునులందరూ సహనం కోల్పోయి, పట్టరాని కోపంతో ఉద్రేకంతో "ఈ పాపాత్ముణ్ణి కడతేర్చండి" అని ఒకరితో ఒకరు అరిచారు.

16. "నీచమైన దిగజారిన జీవితాన్ని గడపడమే కాకుండా యజ్ఞ పురుషుడు, ఆది మధ్యాంతర రహితుడు అయిన భగవంతుని దూషించటానికి సాహసించిన యీనాటి దాకా పాలించే అర్హతను పోగొట్టుకున్నాడు" అంటు దర్భగడ్డితో మంత్రాలనుచ్చరించి పాపం వల్ల అప్పటికే అనుభవిస్తున్న వేనుణ్ణి శపించారు.

ఆతర్వాత కొంత కాలానికి మునులు తమ చుట్టు క్రమ్మిన ధూళి చూసి అదేమిటని అక్కడి ప్రజల్ని అడిగారు.

17. ప్రజలిలా చెప్పారు. "రాజు లేని యీ రాజ్యంలో అరాజకం పెరిగి, ప్రజలు చోరులుగా మారి యితరుల ఆస్తుల్ని దోచుకుంటున్నారు.

18. "ఇతరుల ఆస్తిపాస్తుల్ని దోచుకోవటాని, దొంగలు లేపే ఉరుకులు పరుగుల వల్ల దుమ్ము దుమారం లేచి" అలా అందర్నీ క్రమ్ముకుందని చెప్పారు. అప్పుడు మునులందరు కూడబలుక్కొని సంతానహీనుడైన రాజుకు పుత్ర సంతానం కోసం రాజు తొడనొక్కి (కాలుని) బలంగా రుద్దారు. అలా చేయడం వల్ల చప్పిడి ముక్కుతో చాలా పొట్టిగాను నల్లగాను ఉన్న ఒక శిశువు ఉద్భవించాడు.

19. [illegible] "నేనేం చేయమంటా"రని అడిగాడు. "నిషీద!" అంటే

కూర్చొని ఉండు" అని. ఆజ్ఞాపించారు మునులు. ఆ కారణంగా ఆతడు నిషాదుడయ్యాడు.

20. ఆతడి సంతానం మూలంగా దుర్మార్గాలకు దుష్ట కార్యాలకు ప్రసిద్ధి చెందిన నిషాదులై వింధ్య పర్వత శ్రేణుల్లో విస్తరించారు.

21. ఈ విధంగా రాజుకు పాప విముక్తి కలిగింది. వేనుడి పాపం నుంచి నిషాదులు పుట్టుకొచ్చారు.

ఇది నిషాదుల పుట్టుక గురించిన పురాణగాధ. ఇందులో చారిత్రక అంశాలు కూడ ఇమిడి వున్నాయి. నిషాదులు ఆదిమవాసులుగా, అటవీ తెగవారుగా, తక్కువ జాతివారుగా, దుష్టులు అంటే ఆర్య సంస్కృతిని ఎదిరించిన వారుగా, వింధ్య పర్వత అడవుల్లో నివసించే అనాగరికులుగా చిత్రించబడ్డారు. ఆర్య సమాజంతో వారిని ముడిపెట్టేందుకు పుక్కిటి పురాణం అల్లబడింది. వారిని ఆర్య సమాజంలో చేర్చుకొనకపోయినప్పటికీ ఆర్యుల ఆధీనంలో ఇముడ్చడానికి యీ అభూత కల్పనలు చేశారు. ఆతర్వాత నిషాదులను నీచమైన, అనాగరిక, విదేశీ తెగగా చూడడం గానీ ఏరకమైన పరిమితులూ విధించడం గానీ జరగలేదు. అలాంటప్పుడు, ఆర్యులు నాగరికులు, తమలోని వారూ అయిన శూద్రుల మీద ఆంక్షలు ఎందుకు విధించారు? అన్నది శేష ప్రశ్నే.

అనువాదం: మాటూరి అప్పారావు.

# :అధస్సూచికలు:

1. రక్షితలు అంటే బంధువుల సంరక్షణలో ఉన్నవారు. అరక్షితలు అంటే ఒంటరిగా జీవించేవారు.

2. 'విరుక్తం' ప్రకారం దావ అంటే వాళవం చేయుట అని అర్థం.

3. ఈ విషయం సంపూర్ణంగా తెలుసుకోవాలంటే-దీన్ని గురించి సమగ్ర చర్చ చేశారు సర్వాలేకర్ గారు. చూ. పురుషార్థ. వాల్యూ 13. పే. (?).

4. .... శుక్ల యజుర్వేద. పే. 200.

5. జైశ్వాల్ – హిందూ పోలిటీ. పార్ట్ II. పే. 148.

6. ముయిర్ శాంస్క్రిట్ టెక్ట్సు. వాల్యూ I. పే. 366.

7. రాత ప్రతిలో కాలాలు లేవు. అందువల్ల సంపాదకుల చేత కాలాలు పొందుపరచబడ్డాయి.

8. రాతప్రతిలో కాలాలు లేవు. అందువల్ల సంపాదకుల చేత కాలాలు పొందుపరచబడ్డాయి.

9. ఐతరేయ బ్రాహ్మణ. వాల్యూ. II. పే. 112.

10. మాక్స్ ముల్లర్: ఏన్షియంట్ శాంస్క్రిట్ లిటరేచర్. 1860. పే. 58.

11. చూ. కాణే: హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్రాస్.

12. కాణే చేత ఉదాహృతం: హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర.

13. ముయిర్ చేత ఉదాహృతం: శాంస్క్రిట్ టెక్ట్సు I. పే. 367.

14. వి. ఫాస్‌బాయిల్: ఇండియన్ మైథాలజీ. పేజీలు: 128–134.

15. జైశ్వాల్: ఇండియన్ పోలిట్ పార్ట్ II. పే. 17.

16. మాక్స్ ముల్లర్ "ఏన్షియంట్ శాంస్క్రిట్ లిటరేచర్" (1860) పే. 207లో ఈ విషయం ప్రస్తావించమడింది.

17. డా. అంబేద్కర్ ఆధారం చూపించలేదు. – సంపాదకులు.

# అధ్యాయం – 17

# స్త్రీలు – ప్రతి విప్లవం

[‘స్త్రీలూ–ప్రతి విప్లవం’ అనే శీర్షికతో ఒక కాపీ వుంది. ఇదే విషయంతో “స్త్రీ గురించిన చిక్కు ప్రశ్న” అనే శీర్షికతో మరో కాపీ కూడా వుంది. ‘హిందూమతాన్ని గురించి’ అనే సంపుటంలో కంటే ఈ సంపుటంలోనే ఈ వ్యాసం ఉండటం సముచితం అని సంపాదకవర్గం భావించింది.]

శూద్రుల పట్ల ప్రదర్శించిన దాని కంటే, స్త్రీల పట్ల మనువు మరింత మృదుత్వాన్ని ప్రదర్శించాడని చెప్పడం కష్టం. స్త్రీల పట్ల చాలా చులకన దృష్టితో మొదలుపెట్టి మనువు ఈ విధంగా చాటిచెప్పాడు:

“ఈ ప్రపంచంలోని పురుషులను వశపరుచుకోవడమే స్త్రీల స్వాభావిక లక్షణం. అందు చేతనే విద్వాంసులు స్త్రీల సహవాసంలో ఏమరుపాటుతో ప్రవర్తించరు.” (2–213)

“ఎందుకంటే మూఢులైన పురుషుడినే గాక తెలివితేటలు కలిగిన వాడిని సైతం కోరిక లకు, కోపతాపాలకు దాసుణ్ని చేయగలరు స్త్రీలు.” (2–214)

“ఇంద్రియాలు శక్తివంతమైనవీ, విద్వాంసుడి మీద కూడ అజమాయిషీ చేయగలవీ కాబట్టి, పురుషుడు తల్లితోగాని, సోదరితోగాని, కుమార్తెతో గాని ఏకాంతంగా ఉండరాదు.” (2–215)

“పురుషుల రూపలావణ్యాలను గానీ, వయసును గానీ స్త్రీలు పట్టించుకోరు. రూపసి అయినా, కురూపి అయినా కేవలం పురుషుడైతే చాలు అతనికి తమను తాము అర్పించుకుం టారు.” (9–14)

“ఈ లోకంలో భర్తలు ఎంత జాగ్రత్తగా సంరక్షించినప్పటికీ స్త్రీలు పురుషుల పట్ల వ్యామోహం కలిగిన వారవటం చేతను, చంచల స్వభావులు అయి వుండటం చేతనూ, స్వాభివకంగా హృదయం లేని వారవటం చేతనూ, తమ భర్తల పట్ల అవిధేయులుగా ఉంటారు.” (9–15)

“సృష్టి సమయంలో సృష్టికర్త స్త్రీలను చంచల స్వభావులుగా సృష్టించాడు. అందుచేత

పురుషులు స్త్రీలను ఎంత శ్రమకు ఓర్చయినా రక్షించాలి." (9–16)

"శయ్యా, పీఠం, ఆభరణాలు, అపవిత్రమైన వాంఛలు, కోపము, ద్రోహబుద్ధి, చెడు నడత–వాటిని (వారిని సృష్టించినపుడే) మనువు స్త్రీలకు కేటాయించాడు." (9–17)

పైన ఆపాదించిన లక్షణాలకు అనుగుణంగా, స్త్రీలకు వ్యతిరేకంగా ఉండే న్యాయసూత్రాలను రూపొందించాడు మనువు. ఎటువంటి పరిస్థితులలోనైనా స్త్రీలు స్వేచ్ఛగా ఉండరాదన్నది మనువు ఉద్దేశం. అతని ప్రకారం–

"రాత్రింబవళ్ళు స్త్రీలు పురుషులపై ఆధారపడి ఉండాలి. లైంగిక సుఖాలకు స్త్రీలు ఉపయుక్తులౌతున్నపుడు వారు పురుషుని చెప్పుచేతలలో ఉండాల్సిందే." (9–2)

"స్వతంత్రంగా జీవించడానికి స్త్రీ అర్హురాలు కాదు. బాల్యంలో తండ్రి సంరక్షణలోను, యౌవనంలో భర్త సంరక్షణలోను, వృద్ధాప్యంలో కుమారుని సంరక్షణలోను స్త్రీ ఉండాలి." (9–3)

"చెడు వాంఛలకు, అవి ఎంత స్వల్పమైనవైనప్పటికీ ఆకర్షితురాలు కాకుండా, స్త్రీలను ప్రత్యేకంగా కాపాడాలి. ఆ విధమైన అప్రమత్తత లేకపోతే స్త్రీలు దుఃఖాన్ని కలుగచేస్తారు." (9–5)

"ఏ కులానికి చెందినవాడైనా, శారీరకంగా బలహీనుడైనా భార్యలను అదుపాజ్ఞలలో పెట్టుకోడానికి భర్త కృషి చేయాలి." (9–6)

"వారి స్వగృహాలలో సైతం బాలిక అయినా, యువతి అయినా, ముసలి అయినా స్త్రీ స్వతంత్రంగా ఏ పనీ చేయకూడదు." (4–147)

"స్త్రీ జీవితంలో ఎప్పుడూ స్వతంత్రురాలిగా ఉండకూడదు. బాల్యంలో తండ్రికీ, యౌవనంలో భర్తకు వైధవ్యం ప్రాప్తిస్తే పుత్రులకు లోబడి ఉండాలి." (5–148)

"తండ్రి నుంచి గానీ, భర్త నుంచి గానీ, పుత్రుల నుంచి గానీ విడిపోయి వేరుగా నివసించాలని స్త్రీ కోరుకోకూడదు. వారిని వదలిపెట్టినట్లయితే ఆమె (పుట్టిన, మెట్టిన) రెండు కుటుంబాలకూ చెడ్డపేరు తెస్తుంది." (5–149)

స్త్రీకి భర్త నుంచి విడాకులు కోరే హక్కు లేదు. అంటే "భార్యతో కలసి భర్త ఒకే

వ్యక్తిగా పరిగణితుడవుతాడు. స్త్రీకి వివాహమైన తరువాత విడిపోవటానికి వీలులేదు." (9-45)

చాలామంది హిందువులు ఇక్కడే ఆగి మనువు సెలవిచ్చిన ఈ అంశాన్ని ఒక ఆదర్శవంతమైన విషయంగా చెపుతారు. వివాహాన్ని ఒక పవిత్ర బంధంగా భావించబట్టే మనువు విడాకులను అనుమతించలేదనే భావనతో తమ అంతరాత్మల్ని సంతృప్తిపరుచుకుంటారు. కానీ, ఇది చాలా సత్యదూరమైన భావన. ఎందుకనగా మనువు విడాకులను అనుమతించని న్యాయ సూత్రాన్ని వేరే ఉద్దేశ్యంతో రూపొందించాడు. పురుషుడిని స్త్రీతో కలిపే బంధం కాదిది. స్త్రీని పురుషునితో కలిపి బంధిస్తూ పురుషుడిని మాత్రం విశృంఖలమైన స్వేచ్ఛతో వదలివేయడానికి తయారు చేసిన 'న్యాయ' సూత్రమిది.

స్త్రీని విడచిపెట్టడంలో పురుషుడిని మనువు ఏమాత్రం అరికట్టలేదు. స్త్రీని త్యజించడానికి మాత్రమే గాకుండా ఆమెను అమ్ముకోవడానికి సైతం పురుషుడికి అనుమతి ఇచ్చాడు. కేవలం భార్య స్వతంత్రురాలు కావడాన్ని మాత్రమే మనువు అరికట్టాడు. మనువు ఏం చెప్పాడో చూడండి:

"వేరొకరికి విక్రయించటం వలనగానీ, విడిచిపెట్టటం జరిగినంత మాత్రాన గానీ, భార్యకు భర్త నుండి విడుదల లభించదు." (9-46)

దీని అర్థమేమిటంటే-భర్త విక్రయించిన లేదా వదిలివేసిన భార్య ఆమెను కొనుక్కొన్న వ్యక్తికి లేదా పొందిన వ్యక్తికి న్యాయబద్ధమైన భార్య కాజాలదు. ఇది దారుణం కాక మరేమిటి? బౌద్ధమత సూత్రాలు అమలులోకి రావటం వల్ల స్త్రీలు పొందిన స్వేచ్ఛను పోగొట్టడానికి మాత్రమే కృతనిశ్చయుడైన మనువు ఈ విషయంలో న్యాయాన్యాయాల గురించి ఏమాత్రం బాధపడలేదు. స్త్రీ తన స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకొనడం వల్లా, శూద్రుని సైతం వివాహమాడడానికి ఇష్టపడటం వల్లా వర్ణ వ్యవస్థలోని హెచ్చుతగ్గుల పద్ధతి నాశనమవుతున్నదని మనువు గ్రహించాడు. దీని పట్ల ఆగ్రహంతో, దాన్ని ఆపడానికి ఆమె స్వేచ్ఛను అరికట్టాడు.

ఆస్తిహక్కు విషయంలో కూడా మనువు స్త్రీని (భార్యను) బానిస స్థాయికి దిగజార్చాడు.

"భార్య, కుమారుడు, బానిస-ఈ ముగ్గురికీ స్వంత ఆస్తి అనేది ఉండరాదు. (వారు సంపాదించిన ఆస్తి కూడా) వారు ఏ పురుషునికి చెందుతారో, ఆ పురుషునికే చెందుతుంది."(9-416)

స్త్రీకి వైధవ్యం ప్రాప్తించినపుడు మాత్రం ఆమె మనోవర్తిని పొందవచ్చునన్నాడు-మనువు. భర్త ఉమ్మడి కుటుంబంలో సభ్యుడై ఉండగా చనిపోతే భార్యకు మనోవర్తి వస్తుంది. ఒకవేళ

భర్త ఉమ్మడి కుటుంబం నుండి విడిపోయాక చనిపోతే అతని ఆస్తిలో కొంతమాత్రమే 'వితంతు ఆస్తి'గా ఆమెకు సంక్రమిస్తుంది. ఏదిఏమైనా, ఆస్తిపై వితంతువుకు పూర్తి హక్కులను మాత్రం మనువు అనుమతించలేదు.

మనుధర్మ సూత్రాల ప్రకారం స్త్రీ శిక్షకు బద్ధురాలుగా నియంత్రితమైంది. భర్తకు భార్యను కొట్టడానికి హక్కు వుంది.

"భార్య, కుమారుడు, బానిస, విద్యార్థి, తమ్ముడు–వీరు తప్పు చేస్తే పురుషుడు తాడుతో గాని, వెదురుబద్దతో గాని కొట్టవచ్చును." (8–299) ఇక మిగతా విషయాలలో మనువు స్త్రీని శూద్రుని స్థాయికి దిగజార్చాడు. శూద్రునిలాగా స్త్రీ కూడా వేదాలను చదవడానికి అర్హురాలు కాదు.

"స్త్రీలు సైతం పూజా పునస్కారాలను, సంస్కారాలను చేయడం అవసరమే. వారు వాటిని విధిగా పాటించి తీరాలి. కానీ, వాటిని పాటించే సమయంలో వారు వేద మంత్రాలను మాత్రం పఠించకూడదు." (2–66)

స్త్రీలకు వేదాలను చదివే హక్కు లేదు. అందుచేతనే వారు చేసే పూజా పునస్కారాలలో వేద మంత్రోచ్చారణ ఉండదు. వేదాలను గురించి తెలుసుకునే హక్కు లేదు కాబట్టి మతం గురించిన జ్ఞానం స్త్రీలకు లేదు. పాప ప్రక్షాళనకు వేదమంత్ర పఠనం ఉపయోగపడుతుంది. వేదమంత్ర పఠనానికి స్త్రీలు అనర్హులు. కాబట్టి వారు అసత్యంలాగా శుచిలేని వారై ఉంటారు." (9–18)

యజ్ఞయాగాలు చేయటమే మతం తాలూకు అసలు అని బ్రాహ్మణ్యం చెబుతుండగా మనువు స్త్రీ మాత్రం క్రతువులను చేయటానికి అనర్హురాలు అని చెప్పాడు. మనువు ప్రకారం-

"వేదాలలో చెప్పినటువంటి నిత్యక్రతువులను స్త్రీ నిర్వర్తించరాదు." (11–36)

"అలా చేస్తే ఆమె నరకానికి పోతుంది." (11–37)

ఆలాంటి క్రతువులను నిర్వర్తించటంలో స్త్రీని అశక్తురాలుగా చేయటం కోసం ఆమెకు బ్రాహ్మణ పూజారుల సహాయం, సేవలు అందకుండా మనువు నివారించాడు.

"స్త్రీలు నిర్వర్తించే యజ్ఞం దగ్గర ఇచ్చేటటువంటి ఆహార పదార్థాల్ని బ్రాహ్మణుడు భుజిం చరాదు." (4–205)

"స్త్రీలు చేసిన యజ్ఞాలు అపవిత్రమై, దేవతల స్వీకారానికి అర్హమవుతాయి. అందుచేత, అలాంటి వాటిని నిర్వర్తించటం మానుకోవాలి." (4–206)

జ్ఞానవికాస కారకాలు, స్వేచ్ఛాయుత ఉద్దేశాలు, ఆలోచనా స్వాతంత్ర్యాలు స్త్రీలకు ఉండకూడదు. బౌద్ధ ధర్మం లాంటి అన్య మతాలలో స్త్రీలు చేరకూడదు. ఒకవేళ ఆ పద్ధతిలోనే ఆమె చివరివరకూ కొనసాగితే ఆమెకు మరణానంతరం అందరికీ ఇచ్చేటటువంటి తర్పణాలు ఇవ్వకూడదు.

స్త్రీల జీవితాదర్శాన్ని గురించి మనువు ఆఖరుగా ఏం చెప్పాడో ఆయన మాటల్లోనే చూద్దాం:

"తండ్రి లేదా తండ్రి అనుమతితో సోదరుడు స్త్రీని ఎవనికైతే ఇస్తారో వానికే ఆమె వాని జీవితాంతం విధేయురాలై ఉండాలి. వాని మరణానంతరం వాని స్మృతులను ఆమె అవమానించరాదు." (5–151)

"భర్త తిరుగుబోతు అయినా, అవినీతిపరుడయినా, బయటి సుఖాలను వెదుక్కునే వాడయినా, ఎంత చెడ్డ లక్షణాలను కలిగినటువంటి వాడైనా విశ్వాసం వున్న భార్య మాత్రం అతనిని దైవంగా ఎల్లవేళలా ఆరాధించి తీరాలి." (5–154)

"యజ్ఞాలను గాని, ప్రమాణాలను గాని, ఉపవాసాన్ని గానీ భర్తతో కలసి మాత్రమే భార్య నిర్వహించాలి. భర్త పట్ల భార్య చూపించే విధేయతవల్ల మాత్రమే ఆమె స్వర్గంలో ప్రవేశాన్ని పొందుతుంది" (5–155)

ఆతర్వాత స్త్రీలకు మనువు నిర్దేశించే ఆదర్శాల మౌలిక అంశాల్ని చెప్పే శ్లోకాలు వస్తాయి.

"పవిత్ర మంత్రోచ్చారణతో వివాహమడిన భర్తే ఇహపర లోకాల్లోను, అన్ని కాలాల్లోను భార్య సంతోషానికి మూలాధారం." (5–153)

"స్త్రీ అన్నివేళలా సంతోషంగా ఉండాలి. గృహ నిర్వహణలో తెలివితేటలను కలిగి ఉండి పాత్రలను శుభ్రం చేయటంలో శ్రద్ధ చూపి, ఖర్చు పెట్టటంలో జాగ్రత్త వహించాలి." (5–150)

మనువు నిర్ణయించిన స్త్రీల హోదాను, మనువుకు పూర్వమున్న స్త్రీల సామాజిక హోదాతో పోల్చిచూద్దాం.

స్త్రీ కూడా ఉపనయనానికి అర్హురాలేనని బ్రహ్మచర్యం ముగిసిన తరువాత బాలిక వివాహానికి అర్హురాలని అథర్వవేదం చెప్తోంది. శ్రౌత సూత్రాలలో స్పష్టంగా చెప్పినదాన్ని బట్టి వేదాలను నేర్చుకోవడానికి, చదవడానికి, వేద మంత్రాలను వల్లె వేయడానికి స్త్రీలు కూడా అర్హులేనని తేటతెల్లమవుతుంది. స్త్రీలు గురుకులంలో ప్రవేశించి, వేదాలలోని పలు శాఖలను అభ్యసించి, మీమాంసలో విష్ణాతులైనట్లుగా పాణిని అష్టాధ్యాయిలో ఆధారాలు ఉన్నాయి. స్త్రీలు విద్యార్థినులకు వేదాలను బోధించే ఉపాధ్యాయినులుగా ఉండేవారని పతంజలి మహాభాష్యం తెలియజేస్తోంది. మతం, వేదాంతం, తత్వం మొదలైన అతి క్లిష్టమైన విషయాలపై పురుషులతో బహిరంగ చర్చలకు తలపడే స్త్రీల గురించి చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి. జనకునకు సులభకు మధ్య, యాజ్ఞవల్క్యునకు గార్గికి మధ్య, మైత్రేయికి యాజ్ఞవల్క్యునకు మధ్య, శంకరాచార్యునకు విద్యాధరికి మధ్య జరిగిన బహిరంగ వాదోపవాదాలకు సంబంధించిన కథల మూలంగా మనువుకు పూర్వం భారతీయ స్త్రీలు విద్యాభ్యాసములలో మంచి ప్రాభవ స్థితికి చేరగలిగేవారని స్పష్టమవుతోంది.

మనువుకు పూర్వం భారతీయ స్త్రీలు అత్యధిక గౌరవాన్ని పొందారనడం నిర్వివాదాంశం. ప్రాచీన భారతదేశంలో రాజుల పట్టాభిషేక సమయాలలో ప్రధాన భూమిక పోషించే రత్నులలో రాణి కూడా ఒకతె. పట్టాభిషిక్తుడైన రాజు రాణికి సంభావనలిచ్చేవాడు.[1] రాజు కేవలం పట్టమహిషి అయిన రాణిని మాత్రమే గాక తక్కువ కులాలకు చెందిన తన ఇతర భార్యలను సైతం పూజించేవాడు.[2] అదే విధంగా పట్టాభిషేక కార్యక్రమం ముగిసిన వెంటనే గురుముఖ్యుల స్త్రీ జనాలకు రాజు వందనమాచరించే వాడు.[3]

కౌటిల్యుని కాలంలో పన్నెండు సంవత్సరాలు నిండిన స్త్రీలను, పదహారు సంవత్సరాలు నిండిన పురుషులను యౌవనవంతులైనట్లుగా పరిగణించేవారు. యౌవనవంతులయ్యే వయసే వివాహ వయసు కూడా.[4] రజస్వల అయిన తర్వాతే స్త్రీ వివాహయోగ్యురాలుగా పరిగణనలోనికి వస్తుందని బోధాయనుని 'గృహ్య సూత్రాలు' చెబుతున్నాయి.[5] వివాహ సమయంలో నవవధువు బహిష్టయితే చేయవలసిన ఒక ప్రత్యేక కర్మకాండను బోధాయనుడు నిర్దేశించాడు.

కౌటిల్యుని ప్రకారం వివాహానికి అంగీకారాన్ని తెలిపే వయస్సు గురించి ఎటువంటి న్యాయసూత్రం లేదు. ఎందువల్లనంటే వివాహాలు పరిణత దశను దాటిన తరువాతనే జరిగేవి. కాగా పెళ్ళికూతురు లేదా పెళ్ళి కొడుకు వివాహానికి ముందు తాము ఇతరులతో లైంగిక సంబంధాల్ని కలిగి ఉన్నదీ లేనిదీ వెల్లడించకుండా చేసుకునే వివాహాల్ని గురించీ, రజస్వల అయిన స్త్రీకి ఉండదగిన లైంగిక సంబంధాల గురించీ కౌటిల్యుడు ఎక్కువగా చర్చించాడు.

కౌటిల్యుని ప్రకారం మొదటి సందర్భంలో:[6]

“కూతురికి వివాహం చేసే పెద్ద మనిషి ఆమెకు అంతకు ముందు ఇతరులతో ఉన్న

లైంగిక సంబంధాన్ని వెల్లడి చేయకుండా ఉన్న నేరానికి అతనికి జరిమానా విధించడమే కాక, అతను పెండ్లి కుమార్తె తరఫున స్వీకరించిన 'శుల్కాన్ని' మరియు 'స్త్రీ ధనాన్ని' సైతం వాపసు చేయవలసి ఉంటుంది. కుమారుని వివాహం చేస్తున్న పెద్దమనిషి పెండ్లి కుమారునికి అంతకు ముందు ఇతరులతో ఉన్న లైంగిక సంబంధాన్ని వెల్లడి చేయకుండా ఉన్న నేరానికి రెండింతల జరిమానా చెల్లించడమేగాక (పెండ్లి కుమార్తె కొరకై చెల్లించిన) శుల్కాన్ని మరియూ స్త్రీ ధనాన్ని వదులుకోవలసి ఉంటుంది.

కౌటిల్యుని నియమం రెండవ విషయంలో:7

"తమ అంతస్తుకు మరియూ తమతో సరిసమానమైన కులానికి చెంది వుండి రజస్వల అయి మూడు సంవత్సరాలు దాటిన అవివాహిత స్త్రీతో పురుషులు లైంగిక సంబంధాన్ని పెట్టు కొంటే అది అపరాధం కాదు. రజస్వల అయి మూడు సంవత్సరాలు దాటి శరీరం మీద ఏ విధమైన బంగారు నగలు లేని ఇతర కులానికి చెందిన కన్యతో సంబంధం పెట్టుకుంటే కూడా పురుషుడు తప్పు చేసినట్లు కాదు."

మనువు చెప్పినట్లు గాకుండా కౌటిల్యుడు ఏకపత్నీవ్రతాన్ని ప్రతిపాదించాడు. కొన్ని కొన్ని పరిస్థితుల్లో మాత్రమే పురుషుడు ఒకరికంటే ఎక్కువమంది భార్యలను వివాహమాడవచ్చు. అవి ఏవంటే-

"స్త్రీ సంతానవతి కానప్పుడు, లేదా పుత్రులను ప్రసవించనప్పుడు, లేదా ఆమెకు మృత శిశువులు జన్మించిన – ఆమె భర్త ఎనిమిది సంవత్సరాలు వేచి యుండి, తిరిగి ఇంకొకరిని వివాహమాడవచ్చు. స్త్రీ మృత శిశువుకి జన్మనిస్తే-ఆమె భర్త పది సంవత్సరాలు వేచి యుండి తిరిగి మరొకరిని వివాహం చేసుకోవచ్చు. ఆమెకు కేవలం ఆడ సంతతి మాత్రమే కలిగితే అతను పునర్వివాహం కోసం పన్నెండు సంవత్సరాలు వేచి వుండాలి. ఈ నిబంధనలను పురుషుడు ధిక్కరిస్తే భార్యకు కేవలం శుల్కాన్ని మాత్రమే గాకుండా స్త్రీ ధనాన్ని, దానితో పాటు తగినంత నష్టపరిహారాన్ని (అధివేదనిక మర్తం) కూడా ధనరూపంలో చెల్లించాల్సి ఉంటుంది. అంతేకాదు ప్రభుత్వానికి ఇరవై నాలుగు పణాల జరిమానా చెల్లించాలి. ఒకవేళ ఆ భార్య వివాహ సమయంలో శుల్కాన్ని, స్త్రీ ధనాన్ని పొందకుండా ఉంటే ఆమెకు శుల్కం, స్త్రీ ధనం, తగినంత నష్ట పరిహారం, తగినంత జీవనభృతిని సైతం పురుషుడు చెల్లించాలి. అందరికీ ఇన్ని పరిహారాలనూ, తగినంత పోషణా ధనాన్ని (వృత్తి) చెల్లించిన పురుషుడు ఎంతమంది స్త్రీలనైనా వివాహమాడవచ్చు. ఎందుకంటే స్త్రీ సృష్టి జరిగిందే పుత్రులకు జన్మనివ్వడానికే కాబట్టి.

మనువుకు భిన్నంగా, కౌటిల్యుని కాలంలో స్త్రీలు పురుషుల నుండి పరస్పర శతృత్వం, ద్వేషం అనే కారణాల వల్ల విడాకులను పొందవచ్చు.

"భర్తను భార్య ద్వేషించినంత మాత్రాన అతని ఇష్టానికి వ్యతిరేకంగా వివాహాన్ని రద్దు చేసుకోవడానికి వీలులేదు. అదేవిధంగా, భార్య ఇష్టానికి వ్యతిరేకంగా పురుషుడు సైతం తన వివాహాన్ని రద్దుచేసుకొనే వీలులేదు. కానీ వారిరువురికీ పరస్పర ద్వేషభావం ఉన్నట్లయితే వారు విడిపోవడానికి వీలుపడుతుంది (పరస్పరం ద్వేషన్మోక్షః). పురుషుడు తన భార్య నుండి ఆపదను శంకించినప్పుడు, (మోక్షమిచ్ఛేత్) ఆమె నుండి విడాకులు పొందాలనుకున్నప్పుడు ఆమెకు (వివాహ సమయంలో) ముట్టజెప్పిన కట్నకానుకలన్నింటినీ ఆమెకు తిరిగి ఇచ్చివేయాలి. స్త్రీ తన భర్త నుంచి ఆపదను శంకించి విడాకులు కోరుకుంటే ఆమె ఆస్తిపాస్తులపై తనకున్న హక్కులు అన్నింటినీ వదులుకోవాలి. దుశ్శీలుడయిన భర్తను భార్య వదిలిపెట్టవచ్చు.

"ఒక స్త్రీ కాల పరిమితి లేని మనోవర్తిని పొందే హక్కును కలిగి ఉంటే ఆమెకు అవసరమైనంత తిండి, బట్ట (గ్రాసాచ్ఛాదన) లేదా భర్త ఆదాయాన్ని బట్టి (యథాపురుష పరివాపంవా) అంతకంటే ఎక్కువ మనోవర్తి ఇవ్వాలి. ఒక స్త్రీ కాల పరిమితి ఉన్న మనోవర్తిని అడిగేహక్కు గలిగినట్టిదయితే భర్త ఆదాయపు నిష్పత్తిని బట్టి కొంత ధనం ఆమెకు ఇవ్వాలి. ఆమెకు శుల్కం, స్త్రీధనం, ఇంకా నష్టపరిహారం తిరిగి ఇవ్వని సందర్భాలలో (ఆమె భర్త పునర్వివాహానికి అంగీకరించడానికి) కూడా ఇదే విధమైన మనోవర్తి ఇవ్వాలని నిర్ణయం చేశాడు. ఒకవేళ ఆమె మామగారి కుటుంబీకుల సంరక్షణలో (శ్వసురకుల) గాని, తనకు తాను స్వతంత్ర జీవనం గడుపుతున్నపుడు గాని భర్తను మనోవర్తి ఇవ్వమని వివాదం లేవదీయటానికి వీలులేదు. ఈ విధంగా మనోవర్తి నిర్ధారణ సమస్య పరిష్కరించడమైనది."

కౌటిల్యుని కాలంలో ఒక స్త్రీగాని, వితంతువు గాని పునర్వివాహం చేసుకోటానికి ఎలాంటి నిషేధమూ లేదు.

"భర్త మరణానంతరం పవిత్ర జీవనాన్ని గడుపదలచుకున్న స్త్రీ తన ఆభరణాలను, ఆస్తులను, (స్థాప్యాభరణమ్) మాత్రమే కాక తనకు బాకీ వున్న శుల్కాన్ని కూడా పొందుతుంది. ఒకవేళ వీటన్నింటినీ పొందిన పిదప స్త్రీ పునర్వివాహం చేసుకుంటే ఆమె పైవిధంగా పొందిన వాటినన్నింటినీ వడ్డీతో సహా తిరిగి ఇచ్చివేయవలసి ఉంటుంది. స్త్రీ పునర్వివాహం చేసుకోదలిస్తే (కుటుంబకామ) పునర్వివాహ సమయంలో (నివేశకాలే) ఆమెకు మొదటి భర్త మరియు మామగారు ఇచ్చిన ఆస్తిపాస్తులను జాగ్రత్తగా అందజేయాలి. భర్తలు దీర్ఘకాలం పాటు దూర దేశాల్లో ఉండే సమస్యను చర్చించేటప్పుడు, స్త్రీ ఏ పరిస్థితిలో పునర్వివాహం చేసుకోవచ్చో వివరించబడుతుంది.

"ఒకవేళ వితంతువైన స్త్రీ తన మామగారు ఎంచిన వ్యక్తిని (శ్వసురప్రతిలోమ్యేనాని విష్ఠ) గాక మరొకర్ని పునర్వివాహమాడితే ఆమె మామగారి ద్వారా తనకు ధారాదత్తమైన ఆస్తులను మరియు స్వర్గస్థుడైన భర్త ఇచ్చిన ఆస్తిపాస్తులను కోల్పోవలసి ఉంటుంది."

ఆమె పునర్వివాహం చేసుకోటానికి సిద్ధపడినప్పుడు తనకు సంబంధించిన ఏ ఆస్తితో సహా వెళుతుందో దానిని ఆ పునర్వివాహపు బంధువులు ఆమె మొదటి మామగారికి అప్పగించివేయాలి. ఎవరైతే న్యాయబద్ధంగా స్త్రీని తన సంరక్షణలో పెట్టుకుంటారో వారు ఆమె ఆస్తిని కూడా అదేవిధంగా సంరక్షించాలి. మొదటి భర్త ద్వారా సంక్రమించిన ఆస్తిపై హక్కును నిరూపించుకునే ప్రయత్నం పునర్వివాహం చేసుకున్న స్త్రీ చేయరాదు."

ఆమె పునర్వివాహం చేసుకోకుండా పవిత్ర వితంతు జీవితం గడిపితేనే ఆ ఆస్తిని ఆమె అనుభవించవచ్చు. (ధర్మకామ భుంజిత) పుత్రులను కలిగి ఉన్న స్త్రీ తన స్వంత స్త్రీ ధనాన్ని పునర్వివాహం తర్వాత తన ఇష్టం వచ్చిన రీతిలో వినియోగించరాదు. ఆమె ఆ ఆస్తిని తన కుమారులకు అందజేయవలసి ఉంటుంది.

"పునర్వివాహమాడిన స్త్రీ తనకు మొదటి భర్త ద్వారా ప్రాప్తించిన పుత్ర సంతాన రక్షణ కోసం తన స్వంత ఆస్తిని స్వాధీనం చేసుకోదలిస్తే ఆమె ఆస్తిని ఆ కొడుకుల పేరు మీదనే దాచిపెట్టాలి. ఒక స్త్రీకి పలువురు భర్తల ద్వారా పలువురు కుమారులుంటే అప్పుడు కూడా ఇదేవిధంగా ఆయా భర్తల ఆస్తుల్ని ఆయా కొడుకుల పేర పెట్టాలి. వాడుకోవడానికి, దాన, విక్రయాది సర్వహక్కులతో ఆమెకిచ్చిన ఆస్తిని కూడా అదేవిధంగా కొడుకులకివ్వాలి."

చనిపోయిన భర్తకు విశ్వాసపాత్రురాలిగా ఒంటరిగా జీవిస్తున్న వితంతువు ఆమె జీవితాంతం గురువు సంరక్షణలో ఆస్తిని అనుభవించవచ్చు. ఆస్తిని పూర్తిగా స్త్రీకి అప్పగిస్తే కలిగే అనర్థాలను నివారించడానికి ఈ పద్ధతి. ఆమె మరణాంతరం ఆ ఆస్తి ఆమె దాయాదులకు సంక్రమిస్తుంది. భర్త జీవించి ఉండగా భార్య చనిపోతే ఆమె ఆస్తిని ఆమె కొడుకులు, కూతుళ్ళు కలసి పంచుకుంటారు. ఒకవేళ మగ సంతానం లేకపోతే కుమార్తెలు మాత్రమే పంచుకుంటారు. ఆ స్త్రీకి సంతానమే లేకపోతే-వివాహ సమయంలో తానిచ్చిన శుల్కాన్ని భర్త తీసుకుంటాడు. వివాహ సమయంలో తామిచ్చిన కట్నకానుకలను ఆమె బంధువులు తిరిగి తీసుకుంటారు. ఈ విధంగా స్త్రీ ఆస్తిని గురించి వివరించడమైనది."

"సంతానం లేని భార్యలు, భర్త స్వల్పకాలం దేశాంతరవాసం వెళ్ళినప్పుడు-శూద్రస్త్రీ అయితే ఏడాది, వైశ్య స్త్రీ రెండేళ్ళు, క్షత్రియ స్త్రీ మూడు సంవత్సరాలు, బ్రాహ్మణ స్త్రీ అయితే నాలుగు సంవత్సరాలు భర్తకోసం వేచి ఉండాలి. ఒకవేళ వారు సంతానం ఉన్న స్త్రీలైతే ఒక ఏడాదికి పైగా భర్త కోసం వేచి ఉండాలి. వారికి పోషణార్థం మనోవర్తి గనుక ఇచ్చి ఉంటే అప్పుడు పైన పేర్కొన్న నిర్ణీత సమయానికి రెట్టింపు సమయం వేచి ఉండాలి. ఈ స్త్రీలకు పోషణార్థం మనోవర్తి లేనప్పుడు వారి బంధువులు నాలుగూ లేదా ఎనిమిది సంవత్సరాల పాటు వారిని పోషించాలి. ఆతరువాత ఆ బంధువులు పునర్వివాహం చేసుకోడానికి ఆ స్త్రీలకు స్వేచ్ఛనివ్వాలి. వారు పునర్వివాహం గనుక చేసుకుంటే, ఆ స్త్రీలకు మొదటి వివాహ సమయంలో ముట్టజెప్పిన కట్నకానుకలను ఆ బంధువులు తీసుకుంటారు. భర్త బ్రాహ్మణుడై విదేశాలలో చదువుకుంటున్న

వాడైతే సంతానం లేని అతని భార్య అతని కోసం పది సంవత్సరాలు వేచి ఉండాలి. సంతానవతి అయిన భార్య అయితే పన్నెండు సంవత్సరాలు వేచి ఉండాలి. భర్త రాజు గారి సేవకుడై వుంటే భార్య తన జీవితాంతం అతని కొరకు వేచి ఉండాలి. సంతానార్థం ఆమె గనక తన భర్త గోత్రానికి చెందిన మరొక వ్యక్తి ద్వారా సంతానవతి అయితే ఆమె నిందార్హురాలు కాదు (సవర్ణతశ్చ ప్రజాతా న పావదమ్ లభేతా). పోషణార్థం మనోవర్తి లేకుండా, సంపన్నులైన బంధువులచే నిర్లక్ష్యం చేయబడిన స్త్రీ తనకిష్టమైన వాణ్ణి లేదా తనను పోషించి ఆమె కష్టాలు తీర్చగలవానిని పునర్వివాహమాడవచ్చు."

మనువులా కాకుండా వివాహిత స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం కల్పించటానికి అవసరమైన జాగ్రత్త చర్యలన్నీ కౌటిల్యుడు తీసుకున్నాడు. భార్య ఆదాయ వనరుల గురించి, మనోవర్తి గురించి కౌటిల్యుడు అర్థశాస్త్రంలో చెప్పిన ఈ క్రింద పేర్కొన్న అంశాల వల్ల ఈ విషయం స్పష్టమవుతోంది.

"మనోవర్తి (వృత్తి), మరియు ఆభరణాలు (ఆబధ్య) కలిపి స్త్రీ ధనం అవుతాయి. వృత్తిలో రెండు వేలకు పైబడిన విలువ గల ఆదాయవనరులు ఆమె పేరు మీద ఉండాలి. ఆభరణాలకు పరిమితి లేదు. ఎప్పుడైతే ఆమె భర్త మనోవర్తిని కల్పించకుండా దేశాంతరం వెళ్ళిపోతాడు ఆమె ఈ ఆస్తిని-తన కుమారునికీ, కోడలుకీ మరియు తనను తాను పోషించుకోవటానికి వినియోగిస్తే అపరాధం కాదు. ప్రకృతి వైపరీత్యాలు, వ్యాధులు, కరువు కాటకాలు మరియు అపాయాలు సంభవించినప్పుడు దానధర్మ కార్యక్రమాల నిమిత్తం స్త్రీ ధనాన్ని ఆమె భర్త కైనా వినియోగించవచ్చు. కవల పిల్లలు గల దంపతులు పరస్పర అంగీకారంతో ఈ ఆస్తిని అనుభవించినా ఎట్టి అభ్యంతరం ఉండదు. ప్రాచీనులు న్యాయబద్ధమైనవిగా అంగీకరించిన పద్ధతులలో బ్రాహ్మ దైవ, అర్ష మరియు ప్రజాపత్య వివాహమాడిన భార్యాభర్తలిద్దరూ కలిసి ఈ స్త్రీ ధనాన్ని మూడు సంవత్సరాల పాటు అనుభవిస్తే ఎటువంటి ఫిర్యాదు ఉండదు. గాంధర్వ వివాహం లేదా అసుర వివాహం చేసుకున్న జంటలు ఈ ఆస్తిని వినియోగిస్తే వారు దాని వడ్డీతో సహా పునఃసమీకరించాలి. రాక్షస వివాహం లేదా పైశాచిక వివాహం చేసుకున్న జంట ఈ ఆస్తిని వినియోగిస్తే దాన్ని దొంగతనంగా పరిగణిస్తారు. ఈ విధంగా వైవాహిక బాధ్యతల నిర్ధారణ జరిగింది."

కాల పరిమితితో నిమిత్తం లేకుండా జీవితాంతం-పోషణను పొందే హక్కులు భార్యకు ఆమెకు సరిపడినంత తిండి, బట్టగానీ-లేదా అంతకంటే ఎక్కువగా అతని ఆదాయ పరిస్థితిని బట్టి మనోవర్తిగానీ ఇవ్వటం జరుగుతుంది. ఒకవేళ ఆమెకు గల పోషణ హక్కు, కాల పరిమితి గలదైతే ఆమెకు శుల్కం, ఆస్తి మరియు వస్త్ర పరిహారం ఏమీ ఇవ్వనట్లుగా లెక్కించి, భర్త ఆదాయంలో కొంత నిష్పత్తి మనోవర్తిగా ఇవ్వాలి. ఆమె తన మామగారి కుటుంబ సంరక్షణలో ఉన్నట్లయితేను, లేదా స్వతంత్ర జీవనం గడుపుతున్నట్లయితేను భర్తపై ఆమె మనోవర్తి కోసం వ్యాజ్యం చేయలేదు. ఈ విధంగా మనోవర్తిని గూర్చిన నిర్ణయం జరిగింది.

ఆశ్చర్యకర విషయమేమిటంటే, కౌటిల్యుని కాలంలో భర్త కొట్టినందుకు అవమానించినందుకూ భార్య అతనిపై న్యాయస్థానంలో వ్యాజ్యం తేవచ్చు.

క్లుప్తం చెప్పాలంటే-మనువుకు ముందు కాలంలో స్త్రీ స్వేచ్ఛను కలిగి, పురుషునితో సమాన భాగస్వామిగా ఉండేది.

మరి మనువు ఆమెనెందుకు ఇంతగా దిగజార్చాడు?

అనువాదం: విజయలక్ష్మి పరమేశ్వరరావు.

## :అథస్సూచికలు:

1. జయస్వాల్: ఇండియన్ పోలిటీ పార్ట్ II. పే. 16.
2. -అదే- పార్ట్ II. పే. 17.
3. -అదే- పార్ట్ II. పే. 82.
4. శ్యామ్ శాస్త్రి. కౌటిల్యాస్ అర్ధశాస్త్రి. పే. 175.
5. బోధాయన. 1. 7. 22.
6. శ్యామ శాస్త్రి, కౌటిల్యాస్ అర్ధశాస్త్రి. పే. 222.
7. -అదే- పే. 259

# నాలుగో భాగం

# బుద్ధుడు – కారల్ మార్క్స్

బుద్ధుడు – కారల్ మార్క్స్ పై రాసిన వ్యాసం టైప్‌డ్ ప్రతులు విడి కాయితాలలో మాకు లభించాయి. మూడూ వేర్వేరుగా టైప్ చేసినవి. అందులో రెండు ప్రతులపై రచయిత స్వదస్తూరీతో దిద్దుబాట్లున్నాయి. వాటిని క్షుణ్ణంగా పరిశీలించిన తరువాత – సవరణలను చేర్చి ఈ వ్యాసాన్ని అందిస్తున్నాము. ఈ వ్యాసం ఈ కింది ఉప అంశాలుగా విభజింపబడింది.

1. బుద్ధుని సిద్ధాంతాలు
2. కారల్ మార్క్స్ మౌలిక సిద్ధాంతాలు
3. మార్క్సిజంలో ఎంత నిలబడుతుంది?
4. బుద్ధునికీ కారల్ మార్క్స్‌కు పోలిక
5. సాధనాలు
6. సాధనాల మదింపు
7. ఎవరి సాధనాలు ఎక్కువ సమర్ధమైనవి?
8. రాజ్యం అంతర్ధానం కావడం

–సంపాదకులు

## అధ్యాయం – 18

# బుద్ధుడు –కార్ల్ మార్క్స్

కార్ల్ మార్క్స్‌ను బుద్ధుని పోల్చిచూడడం జోక్‌గా అనిపించవచ్చు. ఇందులో ఆశ్చర్యపడవలసింది లేదు. మార్క్స్‌కీ బుద్ధునికీ 2381 ఏళ్ళ కాలవ్యవధి ఉంది. బుద్ధుడు క్రీ.పూ. 563లో జన్మిస్తే మార్క్స్ క్రీ.శ. 1818లో జన్మించాడు. కార్ల్ మార్క్స్ ఒక కొత్త భావజాలానికీ రాజనీతికి–కొత్త ఆర్థిక వ్యవస్థకు రూపకల్పన చేసినవాడు. ఇందుకు భిన్నంగా, బుద్ధుడు కేవలం ఒక మత స్థాపకుడుగా – అదీ ఆర్థిక రాజకీయ విషయాలకు ఏమాత్రం సంబంధంలేని మత స్థాపకుడుగా విశ్వసింపబడ్డాడు. ఈ వ్యాస శీర్షిక "బుద్ధుడు –కార్ల్ మార్క్స్". విభిన్నమైన ఆలోచనలకు చెందినవాళ్ళను, సుదీర్ఘ కాల దూరం గల వ్యక్తులను పోల్చిచూడడం లేక వాళ్ళ మధ్యగల భేదాలను చెప్పడం అని ఈ శీర్షికను అర్థం చేసుకోవచ్చు. ఇది ఎబ్బెట్టుగా కూడా కనిపిస్తుంది. దీనిని చూసి మార్క్సిస్టులు నవ్వవచ్చు. లేదా ఈ యిద్దరినీ సమానస్థాయిలో చూడడాన్ని చూసి వాళ్ళు ఎగతాళి చెయ్యవచ్చు. మార్క్స్ అత్యంత ఆధునికుడు, బుద్ధుడు అత్యంత ప్రాచీనుడు! తమ గురువుతో పోల్చిచూచినప్పుడు బుద్ధుడు చాలా ఆదిమ దశలో ఉంటాడని మార్క్సిస్టులు చెప్పవచ్చు. ఈ ఇద్దరి మధ్య ఎలాంటి పోలిక తీసుకురాగలం! ఒక మార్క్సిస్టు బుద్ధుని నుండి ఏమి నేర్చుకోగలడు? బుద్ధుడు ఒక మార్క్సిస్టుకు ఏమి నేర్పగలడు? ఏమైనప్పటికీ ఈ యిద్దరినీ పోల్చిచూడడం ఆకర్షణీయంగానూ, జ్ఞానదాయకంగాను ఉంటుంది. ఇద్దరినీ చదివి, ఇద్దరి భావజాలాల పట్ల ఆసక్తిగల నన్ను ఈ యిద్దరినీ పోల్చిచూడాలనే తపన వత్తిడి చేస్తుంది. మార్క్సిస్టులు వాళ్ళ దురభిమానాలను పక్కనబెట్టి, బుద్ధుని చదివి ఆయన దేనికోసం నిలబడ్డాడో అర్థం చేసుకుంటే, తప్పకుండా తమ వైఖరిని మార్చుకుంటారనుకుంటాను. బుద్ధుని పట్ల తిరస్కార భావంగల మార్క్సిస్టులు ఆయనని ఆరాధించగలరని ఆశించడం అత్యాశే. అయితే, బుద్ధుని బోధనలలో వాళ్ళు గుర్తించవలసిందేదో ఉందని తెలుసుకోగలరని మాత్రం చెప్పవచ్చు.

## I. బుద్ధుని సిద్ధాంతం

బుద్ధుడనగానే అహింసా సిద్ధాంతంతో జోడించి చూడడం సాధారణం. అదే బుద్ధుని బోధనల సర్వస్వంగా భావించబడింది. అయితే బుద్ధుని బోధన అహింసా సిద్ధాంతం కన్నా విశాలమైందని ఎవరికీ తెలియదు. అందువల్ల ఆయన బోధనల్ని వివరంగా పేర్కొనడం మంచిది. నేను త్రిపిటకాలను చదివి అర్థం చేసుకున్న రీతిలో వాటిని పేర్కొంటాను:

1. స్వేచ్ఛా సమాజానికి మతం అవసరం.
2. ప్రతి మతమూ ఆచరించదగింది కాదు.

3. మతం జీవిత వాస్తవాలతో సంబంధం కలిగుండాలి. అంతేతప్ప దేవుని ఆత్మ, స్వర్గం, భూమిని గురించిన సిద్ధాంతాలతో, ఊహాగానాలతో కాదు.
4. మతానికి దేవుని కేంద్రంగా చెయ్యడం తప్పు.
5. ఆత్మ విముక్తిని (మోక్షాన్ని) మతానికి కేంద్రంగా చెయ్యడం తప్పు.
6. మతానికి పశుబలులను కేంద్రంగా చెయ్యడం తప్పు.
7. అసలైన మతం మనిషి హృదయంలో ఉంటుంది, శాస్త్రాలలో ఉండదు.
8. మనిషి, నైతికత మతానికి కేంద్రం కావాలి. అలా కానప్పుడు మతం క్రూరమైన మూఢ నమ్మకం.
9. నైతికత జీవితాశయం అయితే చాలదు. భగవంతుడు లేడు గనక అది జీవిత నియమం ధర్మం కావాలి.
10. మతం కర్తవ్యం ప్రపంచాన్ని పునర్నిర్మించడం, దానిని ఆనందమయం చెయ్యడం తప్ప దాని ఆద్యంతాలను వివరించడం కాదు.
11. మానవుల్లో ఆనందం లేకపోవడానికి కారణం భిన్న ప్రయోజనాల సంఘర్షణ. దానికి పరిష్కార మార్గం అష్టాంగ మార్గాన్ని అనుసరించడం.
12. సంపద మీద వ్యక్తిగత ఆధిపత్యం ఒక వర్గానికి శక్తిని మరోవర్గానికి దుఃఖాన్ని కలిగిస్తుంది.
13. ఈ దుఃఖానికి గల కారణాన్ని నిర్మూలించడం ద్వారా దుఃఖాన్ని పోగొట్టడం సంఘ శ్రేయస్సు దృష్ట్యా అవసరం.
14. మనుషులందరూ సమానులే.
15. మనిషిని కొలవడానికి ప్రతిభ తప్ప పుట్టుక ప్రమాణం కాదు.
16. ముఖ్యమైంది ఉన్నత ఆదర్శాలు తప్ప ఉత్తమ కులంలో పుట్టుక కాదు.
17. అందరిపట్ల స్నేహభావాన్ని ఎప్పుడూ విస్మరించరాదు. శత్రువు పట్ల కూడా ఈ భావాన్ని కలిగుండాలి.
18. చదువు అందరికీ గల హక్కు. మనిషి బతకడానికి ఆహారం అవసరమైనట్లే విద్యకూడా అవసరం.
19. శీలం లేని విద్య అపాయకరం.
20. ఏదీ లోపరహితం కాదు. ప్రతిదీ విచారణకూ, పరీక్షకు నిలవాలి.
21. ఏదీ అంతిమం కాదు.
22. ప్రతిదీ కార్యకారణ సిద్ధాంతానికి నిలవాలి.
23. ఏదీ శాశ్వతమూ, సనాతనమూ కాదు. ప్రతిదీ మార్పుకులోనౌతుంది. స్థితి ఎల్లప్పుడూ పరిమాణాత్మకం.

24. సత్యం కోసం న్యాయం కోసం కాకపోతే యుద్ధం చెయ్యడం తప్పు.
25. విజేతకు ఓడిపోయిన వానిపట్ల బాధ్యతలున్నాయి.

సంక్షిప్తంగా బుద్ధుని సిద్ధాంతం ఇది. ఇది ఎంత ప్రాచీనం, అయినా ఎంత నవీనం! ఆయన బోధనలు ఎంత విశాలమైనవి, ఎంత లోతైనవి!

## II. కార్ల్ మార్క్స్ మౌలిక సిద్ధాంతం

కార్ల్ మార్క్స్ బోధించిన సిద్ధాంతం చూద్దాం.

కార్ల్ మార్క్స్ ఆధునిక సోషలిజానికి లేక కమ్యూనిజానికి పితామహుడనడంలో సందేహం లేదు. అయితే సోషలిజం సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం వరకే ఆయన ఆసక్తిని పరిమితం చేసుకోలేదు. అది అతనికి ముందే అనేకులు చేశారు. ఆయన తన సోషలిజం శాస్త్రీయ మైందని నిరూపించడానికి ఎక్కువ ఆసక్తి చూపాడు. ఆయన పెట్టుబడిదారుల మీద ఎలా దాడి చేశాడో ఉటోపియన్ (స్వాప్నిక) సోషలిస్టుల మీద కూడా అంతదాడి చేశాడు. ఆయన వాళ్ళిద్దరినీ వ్యతిరేకించాడు. ఈ అంశాన్ని గుర్తించడం చాలా అవసరం. ఎందుకంటే మార్క్స్ తన సోషలిజం యొక్క శాస్త్రీయ స్వభావానికి చాలా ప్రాముఖ్యమిచ్చాడు. మార్క్స్ చేసిన ప్రతిపాదనలన్నీ ఆయన సోషలిజం శాస్త్రీయమైంది, స్వాప్నికం కాదు అని నిరూపించడానికే ఉపయోగించబడ్డాయి.

కార్క్ మార్క్స్ దృష్టిలో శాస్త్రీయ సోషలిజం అంటే అనివార్యమైంది, తప్పించుకోలేనిది అని అర్థం. సమాజం దానికి అనుకూలంగా పయనిస్తున్నదని, దానిని ఎవరూ ఆపలేరని అర్థం. ఈ భావనను నిరూపించడానికే మార్క్స్ ప్రధానంగా కృషిచేశాడు.

మార్క్స్ భావన ఈ కింది సిద్ధాంతాలపై ఆధారపడింది. అవి:

i. తత్వశాస్త్రం ప్రయోజనం ప్రపంచాన్ని పునర్నిర్మించడం తప్ప దాని మూలాన్ని వివరించడం కాదు.
ii. చరిత్ర గతిని నిర్ణయించేది ప్రధానంగా ఆర్థిక శక్తులే.
iii. సమాజం యజమాని శ్రామికులు అని రెండు వర్గాలుగా విభజింపబడింది.
iv. రెండు వర్గాల మధ్య నిరంతరం సంఘర్షణ జరుగుతూ ఉంది.
v. యజమానులు శ్రామికులను దోపిడి చేస్తున్నారు. శ్రామికుల శ్రమ ఫలితమైన అదనపు విలువను దోచుకుంటున్నారు.
vi. ఈ దోపిడీని ఉత్పత్తి సాధనాలను జాతీయం చేయడం ద్వారా అంటే వ్యక్తిగత ఆస్తిని నిర్మూలించడం ద్వారా ఆపవచ్చు.

vii. ఈ దోపిడి శ్రామికులు మరింత, మరింత బీదవాళ్ళుగా మారడానికి దారి తీస్తున్నది.

viii. పెరుగుతున్న శ్రామికుల దారిద్ర్యం శ్రామికులలో విప్లవ స్ఫూర్తిని తెస్తున్నది. వర్గ సంఘర్షణ, వర్గ పోరాటానికి దారితీస్తున్నది. యజమానుల కన్నా శ్రామికులు అధిక సంఖ్యాకులు కాబట్టి శ్రామికులు రాజ్యాన్ని స్వాధీనం చేసుకొని అధికారాన్ని స్థాపిస్తారు. దీనిని మార్క్స్ శ్రామిక నియంతృత్వం అన్నాడు.

ix. ఈ వాస్తవాలు ఎదుర్కోవడానికి వీలులేనివి కనుక సోషలిజం నివారించలేనిది.

మార్క్సియన్ సోషలిజానికి పునాది అయిన ప్రతిపాదనల్ని నేను సరిగ్గానే నివేదించానని అనుకుంటున్నాను.

## III. మార్క్సియన్ సిద్ధాంతంలో

బుద్ధుని భావజాలాన్ని కారల్ మార్క్స్ భావజాలాన్ని పోల్చి చూసేముందు మార్క్సియన్ సిద్ధాంతం యొక్క మూలం ఎంతవరకు నిలిచిందో చూడటం అవసరం. ఆయన సిద్ధాంతాన్ని చరిత్ర ఎంత పూర్వపక్షం చేసిందో ఆయన వ్యతిరేకులు ఎంత పడగొట్టారో గుర్తించాల్సి ఉంది.

మార్క్సియన్ సిద్ధాంతం 19వ శతాబ్దం మధ్యలో ప్రతిపాదించబడింది. అప్పటి నుంచి అది ఎంతో విమర్శకు గురయింది. ఈ విమర్శ ఫలితంగా "కారల్ మార్క్స్" ముచాలా వరకు క్కచెక్కలయింది. మార్క్సియన్ సోషలిజం అనివార్యం అన్నది పూర్తిగా పూర్వపక్షం చేయబడింది అనడంలో ఎలాంటి సందేహమూ లేదు. 'దాస్ క్యాపిటల్' ప్రచురింపబడిన 70 ఏళ్ళ తరువాత 1917లో ఒక దేశంలో మొదటిసారిగా శ్రామిక నియంతృత్వం స్థాపించబడింది. రష్యాలో వచ్చిన 'కమ్యూనిజం' – శ్రామిక నియంతృత్వానికి మరోపేరు కమ్యూనిజం – కూడా ఎటువంటి మానవ ప్రయత్నం లేకుండా అనివార్యంగా రాలేదు. అది రష్యాలోకి అడుగుపెట్టే ముందు విప్లవం జరిగింది. రక్తపాతం హింసలతో కూడిన పర్యత్నపూర్వక వ్యూహం వుంది. మిగతా ప్రపంచం శ్రామిక నియంతృత్వం రాకకోసం ఇంకా ఎదురు చూస్తూ ఉంది. ఇలా సోషలిజం అనివార్యం అనే మార్క్సియన్ సిద్ధాంతం అబద్ధం అని నిరూపించుకోవడంతో పాటు, పట్టిలో ఇచ్చిన అనేక ప్రతిపాదనలు తర్కంద్వారా, అనుభవంచేతా పడగొట్టబడ్డాయి. ఇప్పుడు చరిత్రను ఆర్థిక వ్యాఖ్యానంతో మాత్రమే వివరించటాన్ని ఎవరూ ఒప్పుకోరు. శ్రామికులు మరింత మరింతగా నిరుపేదలు అయిపోతునట్టు ఎవరూ ఒప్పుకోరు. ఇతని ఇతర వాదాల పట్ల కూడా ఇది వాస్తవం.

"కారల్ మార్క్స్" చెప్పిన దాంట్లో ఇక మిగిలింది, అగ్నిశేషం మాత్రమే. అది చిన్నదయినా చాలా ముఖ్యమైంది. ఈ అవశేషంలో నా దృష్టిలో నాలుగంశాలు ఉన్నాయి.

I. తత్వశాస్త్రం కర్తవ్యం ప్రపంచాన్ని పునర్నిర్మించడం తప్ప, దాని మూలాన్ని వివరించడంలో కాలాన్ని వృధా చేయడం కాదు.

II. విభిన్న వర్గాల ప్రయోజనాల మధ్య సంఘర్షణ ఉంది.

III. వ్యక్తిగత ఆస్తిహక్కు దోపిడీ ద్వారా ఒక వర్గానికి శక్తిని అధికారాన్ని, మరో వర్గానికి దుఃఖాన్ని కల్గిస్తుంది.

IV. వ్యక్తిగత ఆస్తిని తీసివేయడం ద్వారా ఈ దుఃఖాన్ని తొలగించడం సమాజశ్రేయస్సు దృష్ట్యా అవసరం.

## IV బుద్ధుడు, కార్ల్ మార్క్స్–పోలిక

మార్క్స్‌వాదంలో సజీవంగా మిగిలిన అంశాలను తీసుకొని బుద్ధుడినీ, కార్ల్ మార్క్స్‌నూ పోల్చి చూడవచ్చు.

మొదటి అంశం మీద బుద్ధుడు, కార్ల్ మార్క్స్ ఇద్దరూ పూర్తి ఏకీభావంతో నిలబడతారు. ఈ సమ్మతి ఎంత దగ్గరగా ఉందో చెప్పటానికి బుద్ధునికి ఒక బ్రాహ్మణ పొత్తపాదునికి జరిగిన సంభాషణలోని ఒక భాగాన్ని ఉదహరిస్తాము.

"అప్పుడు, అదే పద్ధతిలో, పొత్తపాదుడు (బుద్ధుడిని) ఈ కింది ప్రశ్నలు అడిగాడు."

1. ప్రపంచం శాశ్వతం కాదా?
2. ప్రపంచం పరిమితమైనదా?
3. ప్రపంచం అపరిమితమైనదా?
4. ఆత్మ, శరీరం ఒక్కటేనా?
5. ఆత్మ, శరీరం వేర్వేరా?
6. సత్యాన్ని సాధించిన మనిషి మరణానంతరం మళ్ళీ జీవిస్తాడా?
7. అతని మరణానంతరం అతనికి జీవన్మరణాలు రెండు లేకుండా పోతాయా?

ప్రతి ప్రశ్నకు ఆ భగవానుడు ఒకేరకమైన సమాధానం ఇచ్చాడు. అది ఇది.

"పొత్తపాదా! అది కూడా నేను అభిప్రాయం చెప్పని విషయం."

28. "అయితే సర్వోన్నతుడు (బుద్ధుడు) దానిమీద ఎందుకు అభిప్రాయం చెప్పలేదు?"

"(ఎందుకంటే) ఈ ప్రశ్నను లాభదృష్టితో చూడలేదు. దానికి ధర్మంతో పనిలేదు. ఇది

పత్ప్రవచనాంశాలతో గాని, నిర్మమతతో గాని, వ్యామోహక్షాళనం గాని, నిశ్చలత్వం లేక హృదయ శాంతి, లేక వాస్తవ జ్ఞానం లేక అంతర్దృష్టి లేక నిర్వాణం – వీటిలో దేనితోనూ సంబంధం లేదు.

ఎందుకంటే 'ఈ ప్రశ్న ప్రయోజనరహితమైనది. దీనికి (ధమ్మంతో) పని లేదు. సమ్మ కౌపర్తనకీ, వైరాగ్యానికీ, మోహ క్షాళనానికీ గానీ, నిశ్చలతకీ, ప్రశాంత చిత్తతకి గానీ, వాస్తవ జ్ఞానానికి గానీ (అష్టాంగ మార్గానికి చెందిన ఉన్నత దశలలోని) అంతర్దృష్టిని గానీ, నిర్వాణానికి గానీ సంబంధం లేని ప్రశ్న ఇది. అందుకే దానిపై నేనే అభిప్రాయమూ ప్రకటించలేదు.'

రెండో అంశానికి సంబంధించి బుద్ధునికి కోసల రాజుకు మధ్య జరిగిన సంభాషణను ఉదహరిస్తాను:

"పైగా, రాజుల మధ్య మహోన్నతుల మధ్య, బ్రాహ్మణుల మధ్య, గృహస్థుల మధ్య, తల్లికి, కొడుక్కి మధ్య, కొడుక్కి తండ్రికి మధ్య, అన్నకు చెల్లికి మధ్య, అక్కకు తమ్మునికి మధ్య, స్నేహితునికి స్నేహితునికి మధ్య అక్కడ నిరంతరం సంఘర్షణ జరుగుతున్నది.

ఇవి పసేనది మాటలైనప్పటికీ బుద్ధుడు ఆ మాటలు అసలైన సమాజ రూపాన్ని రూపొం దిస్తుండడాన్ని కాదనలేదు.

ఇక వర్గ సంఘర్షణకు సంబంధించి బుద్ధుని వైఖరి చూస్తే ఆయన అష్టాంగ మార్గ పిద్ధాంతం వర్గ సంఘర్షణ ఉనికిని గుర్తిస్తుంది. దుఃఖానికి కారణం వర్గ సంఘర్షణే అని చెబుతుంది.

మూడో అంశానికి సంబంధించి బుద్ధునికి పొత్తపాదునికి జరిగిన సంభాషణను ఉదహరి స్తాను.

"సర్వోన్నతులు అప్పుడేమి నిర్ణయించారు?"

"దుఃఖమూ విషాదమూ ఉన్నాయని వివరించాను, పొత్తపాదా!"

"దుఃఖానికి మూలం ఏమిటో వివరించాను. దుఃఖానికి అంతమేదో వివరించాను. దుఃఖ నివారణకు చేరవలసిన పద్ధతేమిటో వివరించాను."

30. "మహానుభావులు అలా ఎందుకు సెలవిచ్చారు."

"పొత్తపాదా! ఎందుకంటే ఆ ప్రశ్నలు ప్రయోజనకరమైనవి. ధర్మానికి సంబంధించినవి. సరైన ప్రవర్తన, విమోచన, వ్యామోహం నుండి ప్రక్షాళన, శాంతి, హృదయ ప్రశాంతి, సరైన జ్ఞానం అష్టాంగమార్గ ఉన్నత దశలలోని అంతర్దృష్టికీ, నిర్వాణానికీ–వీటికి సంబంధించినవి. అందువల్లనే అలా ప్రకటించాను, పొత్త పాదా!"

భాష వేరుగాని అర్థం ఒక్కటే. దుఃఖాన్ని దోపిడీగా చదువుకుంటే బుద్ధుడు మార్క్స్‌కు దూరంగా లేడు.

వ్యక్తిగత ఆస్తికి సంబంధించి బుద్ధునికి, ఆనందునికీ మధ్య జరిగిన ఈ సంభాషణ అద్భుతమైనది. ఒక ప్రశ్నకు బదులుగా బుద్ధుడు ఆనందునితో ఇలా అన్నాడు.

"సంపద వల్ల అత్యాశ కలుగుతుంది. ఆనందా, అది ఏరూపంలో ఉన్నా, దాన్ని ఈ రకంగానే అర్థం చేసుకోవాలి. ఎవరిదగ్గరైనా, దేనిదగ్గరైనా ఏరకమైన కలిమీ లేకపోతే, వారి వద్ద స్వంతమనేది లేనేలేకపోతే అక్కడ అత్యాశ కనిపిస్తుందా?"

"దేవా! కనిపించదు."

"ఎందుకుంటుంది ఆనందా! అత్యాశకు ఆధారం, మూలం, కారణం సంపదే కదా!"

31. "లోభమే సంపదను కలిగి వుండడానికి మూలం. అది ఏరకమైనదైనా ఈ విధంగానే అర్థం చేసుకోవాలి. దేని విషయంలోనైనా, ఏదో ఒకరకం ప్రలోభం లేకపోతే స్వంతమనేది వుంటుందా?"

"దేవా! ఉండదు."

"ఎందుకుంటుంది ఆనందా! స్వంత సంపదకు ఆధారమూ, మూలమూ, కారణమూ సంపదే కదా!"

నాలుగో అంశానికి విదర్శనం అనవసరం. భిక్షు సంఘ నియమాలే ఈ విషయంలో ఉత్తమ సాక్ష్యంగా పనికివస్తాయి.

భిక్షు నియమాల ప్రకారం, సొంత ఆస్తి అంటూ ఈ క్రింది ఎనిమిది వస్తువులనే కలిగుండాలి, ఇంకేదీ ఉండకూడదు. ఆ ఎనిమిది వస్తువులు ఇవి:

1,2,3. రోజూ ధరించడానికి మూడు తుండుగుడ్డలు.

4. నడుముకు చుట్టుకునే గుడ్డ.

5. భిక్షాపాత్ర.

6. కత్తి.

7. సూది.

8. కమండలం.

అంతేకాక భిక్షువు ఎప్పుడుగాని బంగారు, వెండి స్వీకరించరాదు. ఎందుకంటే, వాటితో అతను ఈ ఎనిమిది వస్తువులే కాక ఇంకేవో కొనే అవకాశం వుంది.

ఈ నియమాలు రష్యాలోని కమ్యూనిజంలో కనిపించే నియమాలకన్నా చాలా తీవ్రమైనవి.

## V. సాధనాలు

ఇప్పుడు సాధనాలు చూద్దాం. కమ్యూనిజాన్ని సాధించడానికి బుద్ధుడు ప్రతిపాదించిన సాధనాలు చాలా నిర్దిష్టమైనవి. వీటిని మూడు భాగాలుగా విభజించవచ్చు.

మొదటి భాగం పంచశీలను అనుసరించడం.

సిద్ధార్థుడిని బుద్ధుని చేసిన జ్ఞానోదయం ఓ కొత్త మత ప్రవచనానికి కారణమైంది. అందులో అతనిని వెంటాడే సమస్యకు పరిష్కారసూచన ఉంది.

ప్రపంచం దుఃఖంతోనూ, విషాదంతోను నిండిందనీ వాస్తవమే నవీన గీతకు పునాది. ఇది కేవలం గుర్తుపెట్టుకోవలసిన వాస్తవం మాత్రమే కాదు, ముక్తికి సాధనమైన ఓ పథకంలోనైనా మొట్టమొదటిదిగా, ముఖ్యమైందిగా గుర్తించవలసింది కూడా. ఈ సత్యాన్ని గురించి బుద్ధుడు తన నవీన గీతకు ప్రారంభాంశంగా చేశాడు.

బుద్ధుని నవీన బోధకు పునాది ప్రపంచమంతా దుఃఖమయమూ బాధామయమూ అనే వాస్తవమే. ఇది కేవలం గుర్తించవలసిన వాస్తవమేమీ కాదు, ముక్తి సాధనలో ప్రథమమూ ప్రధానమూ అయిన వాస్తవం. ఈ వాస్తవాన్ని గుర్తించడంతోనే బుద్ధుడు తన బోధనలను ప్రారంభించాడు.

ఆ దుఃఖాన్ని, బాధను తొలగించడమే బుద్ధుని బోధల లక్ష్యమూ, ఉద్దేశ్యమూ. తన బోధనలు ప్రయోజనం సాధించాలంటే అది జరగాలి.

ఈ దుఃఖానికి కారణాలను ప్రశ్నించుకుని బుద్ధుడు రెండింటిని పేర్కొన్నాడు.

మనిషి దుఃఖానికి బాధకు ఒక కారణం అతని దుష్ప్రవర్తన. దీనిని నిర్మూలించడానికి పంచశీలను అనుసరించమన్నాడు బుద్ధుడు.

పంచశీలలో క్రింది అంశాలున్నాయి:

1. సజీవంగా ఉన్న దేనినైనా నాశనం చెయ్యడాన్ని గాని, నాశనం కావడానికి దోహదం చెయ్యడంగాని చేయకపోవడం.
2. దొంగతనాన్ని అంటే ఇతరుల సంపదను మోసంచేసిగాని, హింస ద్వారాగాని పొందడాన్ని, ఉంచుకోవడాన్ని – చేయకపోవడం.
3. అసత్యాన్ని చెప్పకుండా వుండడం.
4. మోహం నుంచి దూరంగా వుండడం.
5. మత్తుపానీయాల నుంచి దూరంగా వుండడం.

ప్రపంచ దుఃఖానికి బాధకు బుద్ధుని దృష్టిలో ఒక మనిషి ఇంకో మనిషిని సమానంగా చూడకపోవడం కూడా కొంత కారణం. ఈ అసమానతను ఎలా నిర్మూలించడం? దీనికి బుద్ధుడు అష్టాంగ మార్గాన్ని చెప్పాడు. ఇందులోని అంశాలివి.

1. సరైన ఆలోచనలు – మూఢ నమ్మకాలకు దూరంగా ఉండడం.
2. సరైన ధ్యేయాలు – మేధావుల, గంభీర వ్యక్తిత్వం ఉన్నవారి ఉన్నత, యోగ్య లక్ష్యాలను కలిగుండడం.
3. సరైన భాషణ – దయ, నిర్మోహమాటం, సత్యసంధతగల మాటతీరు.
4. సరైన ప్రవర్తన – శాంతి, నిజాయితి, స్వచ్ఛత గల ప్రవర్తన.
5. సరైన జీవనం – ఏ జీవికీ హాని చెయ్యని జీవనం.
6. తక్కిన ఏడింటిని సరిగ్గా పాటించడం.
7. సరైన జాగ్రత్త – చురుకైన మనసుతో జాగ్రత్తపడటం.
8. సరైన చింతన – జీవితంలో లోతైన రహస్యాలమీద ఉన్నతమైన ఆలోచన కలిగుండడం.

ఉన్నతమైన అష్టాంగ మార్గం భూమిమీద ధర్మసామ్రాజ్యాన్ని స్థాపించడానికి, తద్వారా,

సమాజంలో విషాదాన్ని దుఃఖాన్ని నిర్మూలించడానికి ఉద్దేశింపబడింది.

బుద్ధుని బోధన లోని మూడో భాగం నిర్వాణ సిద్ధాంతం. ఉన్నతమైన అష్టాంగ మార్గంలో నిర్వాణ సిద్ధాంతం అంతర్భాగం. అష్టాంగమార్గం నిర్వాణం లేకుండా అష్టాంగ ఫలవంతం కాదు.

అష్టాంగ మార్గం ఫలవంతం కావడంలో గల కష్టాలను చెబుతుంది నిర్వాణసిద్ధాంతం.

ఈ కష్టాలలో ఏది ముఖ్యమైనవి. బుద్ధుడు వాటిని పది ఆసవాలు, సంకెలలు, ఆటంకాలు అన్నాడు.

మొదటి ఆటంకం ఆత్మభ్రాంతి. మనిషి నిలువెల్లా తనను తాను ఆవరించి ఉన్నంత కాలం, తన మనసుకు సంతృప్తినిస్తాయని అనిపించే పనికిమాలిన వస్తువుల వెంటబడుతూ ఉన్నంతకాలం, అతనికి మహోన్నత మార్గం సిద్ధించదు. అపరిమితమైన ఈ సమస్తంలో తానొక గడ్డిపోచ అన్న వాస్తవాన్ని గ్రహించి కండ్లు తెరిచినప్పుడు, తాత్కాలికమైన అతని వ్యక్తిత్వం ఎంత అశాశ్వతమో తెలుసుకోవడం మొదలుబెట్టినప్పుడు – అప్పుడు మాత్రమే మనిషి ఈ సన్న దారిలోనైనా ప్రవే ంచగలదు.

రెండోది సందేహం, అనిశ్చితత్వం. మనిషి విశిష్టమైన సృష్టిమర్మం తెలుసుకోగలిగినప్పుడు, వ్యక్తిత్వం యొక్కా అశాశ్వతత్వాన్ని తెలుసుకోగలిగినప్పుడు అతడు చేసే పనుల్లో సందేహం, అనిశ్చితత్వం ఉండవు. చెయ్యాలా వద్దా? నా వ్యక్తిత్వం అశాశ్వతమే కదా? ఏదైనా చేయడం ఎందుకు? అనే ప్రశ్నలు మనిషిని సందిగ్ధంలో, స్తబ్దతలో పడేస్తాయి. కానీ జీవితంలో అది పనికిరాదు. అతడు గురువును అనుసరించడానికి సత్యాన్ని ఒప్పుకోడానికి, పోరాటంలోకి ప్రవేశించటానికి మానసికంగా సిద్ధం కావాలి. లేకపోతే అతనికి పురోగతి లేదు.

మూడోది కర్మకాండల సార్థకత మీద ఆధారపడడం. మనిషి బాహ్యాకర్మలు, పౌరోహిత్య అధికారాలు, పవిత్ర కర్మలు సహాయకారి కాగలవన్న నమ్మకానికి చెందిన కర్మకాండ నుండి బయటపకుంటే, అతడు తీసుకునే మంచి నిర్ణయాలు సైతం – అవెంత గట్టివైనా – అతనివి ఎటైనా తీసుకుపోతాయి. ఈ అడ్డంకివి అధిగమించి రాగలిగినప్పుడు మాత్రమే మనుషులు ప్రధాన మార్గంలోకి వచ్చినట్లు చెప్పడానికి వీలవుతుంది. వాళ్ళకు ఇప్పుడో అప్పుడో విజయం లభిస్తుంది.

నాలుగోది శరీర వ్యామోహాలు.

అయిదోది ఇతరుల పట్ల దుర్బుద్ధి.

ఆరోది భవిష్యత్ భౌతిక జీవితంపట్ల కోరికల్ని అణచుకోవడం.

ఏడోది భవిష్యత్తులో ఆధ్యాత్మిక ప్రపంచం పట్ల కోరిక.

ఎనిమిదోది గర్వం. తొమ్మిదోది స్వాతిశయం.

ఇవి మనుషులు అధిగమించడానికి కష్టసాధ్యమైన అవరోధాలు, ముఖ్యంగా మేధావులు తమ కంటె తక్కువ సమర్థులపై, తక్కువ పవిత్రులపై చూపే నిరసనలో వ్యక్తమయ్యే అవరోధాలు.

పదోది అజ్ఞానం. అన్ని కష్టాలనూ జయించినా ఇది మాత్రం అలాగే అజేయంగా నిలిచి ఉంటుంది. వివేకవంతుల్లో, సజ్జనుల్లో కూడా మాంసంలో ముల్లులా మిగిలే ఈ అవరోధం మనిషికి అంతిమ శత్రువు, బద్ధశత్రువు.

మహోన్నత అష్టాంగ మార్గసాధనలో ఈ అడ్డంకుల్ని అధిగమించడానికి నిర్వాణం ఉపయోగపడుతుంది.

అష్టాంగ మార్గ సిద్ధాంతం ఒక వ్యక్తి ఎలాంటి మానసిక స్వభావాన్ని జాగ్రత్తగా అలవరచుకోవాలో చెబుతుంది. నిర్వాణ సిద్ధాంతం అష్టాంగ మార్గాన్ని అనుసరించడానికి వ్యక్తి అధిగమించాల్సిన అడ్డంకుల్ని చెబుతుంది.

బుద్ధుని నవబోధలోని నాలుగోభాగం పారమిత సిద్ధాంతం. పారమిత సిద్ధాంతం వ్యక్తి నిత్యజీవితంలో అనుసరించవలసిన పది సద్గుణాలను చెబుతుంది.

అవి ఇవి: 1) పన్న (ప్రజ్ఞ) 2) శీల 3) నెఖ్ఖాయ (నిష్క్రాయ) 4) దాన 5) వీర్య 6) ఖాంతి (క్షాంతి) 7) సుక్క (సత్యం) 8) అదిఠ్ఠాన (అధిష్ఠాన) 9) మెత్త (మైత్రి) 10) ఉపెఖ్ఖ (ఉపేక్ష).

మోహాంధకారం లేక అవిద్య అనే చీకటిని తొలగించే కాంతి పన్న లేక వివేకం. ఇందులో వ్యక్తి తనకన్నా మించిన వారిని ప్రశ్నించి సందేహాలను నివృత్తి చేసుకోవాలి. మనసు ఎదగడానికి భిన్న కళల్ని శాస్త్రాలను అభ్యసించాలి. వివేకవంతుల సాంగత్యంలో వుండాలి.

శీల నైతికాంశం. చెడు చెయ్యరాదు, మంచిని చెయ్యాలనే కోరిక, తప్పు చేయడం అవమానకరం, చెడు చేస్తే శిక్షపడుతుంది అన్న భయంతో దానిని విడనాడడం శీల. శీల అంటే చెడు చెయ్యడానికి భయపడటం.

ప్రాపంచిక సుఖాలను త్యజించడమే నెఖ్ఖామ.

ప్రతిఫలాపేక్ష రహితంగా సంపదను, రక్తమాంసాలను ప్రాణాన్ని సైతం ఇతరుల క్షేమం కోసం త్యాగం చెయ్యడం దానం.

సరైన ప్రయత్నమే వీర్యం. చెయ్యాలనుకున్న దానిని నీ శక్తితో, నీ ఆలోచనతో వెనక్కి తిరిగి చూడకుండా చెయ్యడం వీర్యం.

సారాంశం. అసహ్యించుకునే వాడిని అసహ్యించుకునేవాడు శాంతింపజెయ్యలేడు. అది సహనం తోనే సాధ్యమౌతుంది.

సుక్కా అంటే సత్యం. బుద్ధుడు కావాలనుకున్నవాడు అబద్ధమాడడు. అతని వాక్కు సత్యం. సత్యం తప్ప మరేమీ కాదు.

అదిత్థాన అంటే గమ్యం చేరాలనే ఖచ్చితమైన నిర్ణయం.

మెత్త అంటే సకల జీవులపట్ల సహనభావాన్ని కలిగి ఉండడం. శత్రువుపట్ల, మిత్రుని పట్ల, మనిషిపట్ల, జంతువుపట్ల సహానుభావాన్ని కలిగుండడం.

ఉపేఖ్క అంటే నిర్లక్ష్యం - నిర్లిప్తత. ఇది ఇష్టాయిష్టాలు లేని మానసిక స్థితి. ఫలితాన్ని చూసి చలించకుండా, దానిని పొందడానికి ప్రయత్నం చేస్తుండడం.

ఈ ధర్మాలను వ్యక్తి తన శక్తికొలదీ ఆచరించాలి. అందుకే అవి పారమితలనబడ్డాయి. అంటే పరిణత దశలు అని అర్థం.

ప్రపంచంలోని దుఃఖాన్ని విషాదాన్ని నిర్మూలించడానికి బుద్ధుడు తన జ్ఞానం ద్వారా బోధించిన బోధలివి.

మనిషి తన నైతిక వైఖరిని మార్చుకుని అష్టాంగ మార్గాన్ని స్వచ్ఛందంగా అనుసరించేట్టు పరివర్తన చెందజేయడమే బుద్ధుడు అనుసరించిన సాధాన (మార్గం).

మనిషి నైతిక మార్గంలో పయనించడానికి తని నైతిక వాంఛలను మార్చడం అన్నది బుద్ధుడు స్వీకరించినవిధానం అన్న విషయం స్పష్టమైంది.

కమ్యూనిస్టులు అనుసరించిన సాధనాలు కూడా అంతే స్పష్టమూ, సూక్ష్మమూ, పదునూ కలిగినవి. అవి 1) హింస 2) నిరంకుశత్వం.

కమ్యూనిజాన్ని స్థాపించడానికి రెండే విధానాలున్నాయని కమ్యూనిస్టులు చెబుతారు. అవి మొదటిది హింస. ప్రస్తుతం అమలులో ఉన్న వ్యవస్థని నిర్మూలించడానికి ఇది తప్ప మరేదీ సరిపోదు. రెండోది శ్రామిక నియంతృత్వం. నూతన వ్యవస్థను కొనాసగించాలనడానికి మరేదీ దానితో సమానంకాదు.

బుద్ధునికి కార్ల్‌మార్క్స్‌కు మధ్యగల సామ్యభేదాల[illegible]ు స్పష్టమైనాయి. ఇద్దరి మధ్య గమనంలో భేదమూ, గమ్యంలో ఐక్యత కనిపిస్తున్నాయి.

## VI సాధనాల మ[illegible]

ఇద్దరి సాధనాలను మదింపు చేద్దాం. ఎవరి [illegible]దో, ఎవరి విధానం ఎక్కువ

కాలం నిలుస్తుందో అడగాలి. రెండువైపులా అపార్థాలున్నాయి. ముందు వాటిని తొలగించాల్సిన అవసరముంది.

హింసనే తీసుకోండి. హింసను తలచుకోగానే వణకిపోయేవాళ్ళున్నారు. అయితే అది సెంటిమెంటు మాత్రమే. హింసను మొత్తంగా తిరస్కరించడం సాధ్యం కాదు. కమ్యూనిస్ట్ దేశాలు కాని దేశాల్లో కూడా హంతకులను ఉరి తీస్తున్నారు. ఉరి హింసలోకి రాదా? కమ్యూనిస్టేతర దేశాలు కమ్యూనిస్టేతర దేశాలమీదికి యుద్ధానికి పోతాయి. మిలియన్ల మంది ప్రజల్ని చంపేస్తాయి. ఇది హింస కాదా? ఒక పౌరుని చంపిన కారణం చేత ఒక హంతకుడిని చంపగలిగినప్పుడు, శత్రుదేశానికి చెందినందువల్ల ఓ సైనికుడిని చంపగలిగినప్పుడు తన యాజమాన్యం వల్ల తక్కిన మానవులకు దుఃఖాన్ని కలిగిస్తున్న ఆస్తిపరుని ఎందుకు చంపకూడదు? వ్యక్తిగత ఆస్తి పరమ పవిత్రమనుకుంటే తప్ప, ఆస్తి యజమానికి మినహాయింపు ఇవ్వడానికి హేతువేదీ లేదు.

బుద్ధుడు హింసకు వ్యతిరేకి. అయితే ఆయన న్యాయాన్ని సమర్థిస్తాడు, న్యాయంకోసం అవసరమైతే బలప్రయోగం చెయ్యడాన్ని ఆయన సమర్థిస్తాడు. వైశాలి సర్వసైన్యాధ్యక్షుడైన సింహసేనాపతితో ఆయన సంభాషించినప్పుడు ఇది ద్యోతకమౌతుంది. బుద్ధుడు అహింసను బోధిస్తున్నాడని తెలిసి సింహసేనాపతి పోయి ఇలా అడిగాడు.

"భగవానుడు అహింసను బోధిస్తున్నారు. ఒక నేరస్థుని శిక్షనుండి తప్పించాలని భగవానుడు బోధిస్తారా? మన భార్యలను, పిల్లల్ని, సంపదను రక్షించుకోడానికి యుద్ధానికి పూనుకోరాదని భగవానుడు బోధిస్తారా? అహింస పేరు జెప్పి మనం సంస్థల చేతిలో బాధపడాలా?"

"సత్యం కోసం న్యాయం కోసం కూడా యుద్ధం చెయ్యడాన్ని తథాగతులు నిషేధిస్తారా?"

బుద్ధుడు బదులిచ్చాడు "నా బోధనల్ని నువ్వు తప్పగా అర్థం చేసుకున్నావు. దోషి శిక్షింపబడాలి. అమాయకుడు శిక్షింపబడకూడదు. నేరస్థుని శిక్షించడం న్యాయమూర్తి తప్పకాదు. శిక్షకు కారణం నేరస్థుని నేరం. న్యాయమూర్తి శిక్షవేసి చట్టాన్ని అమలుపరుస్తాడు – అంతే. అతడు అహింసకేమీ కళంకం తేలేదు. న్యాయంకోసం భద్రత కోసంపోరాడే వ్యక్తి హింసావాది కాదు. శాంతిని పరిరక్షించే అన్ని మార్గాలూ విఫలమైతే అప్పుడు హింసకు బాధ్యత యుద్ధాన్ని ప్రారంభించిన వాడిదే. ఎవరైనాసరే దుష్టశక్తులకు లొంగిపోరాదు. యుద్ధం జరగవచ్చు. అది స్వార్థ ప్రయోజనాల కోసం జరగరాదు.

హింసకు వ్యతిరేకంగా ఇతర వాదనలున్నాయి. గమ్యమే గమనాన్ని సమర్థిస్తుంది అన్నది మతితప్పిన సిద్ధాంతం అని వాదించే వాళ్ళను, గమనాన్ని గమ్యంకాక పోతే ఇంకేది సమర్థిస్తుంది?

ప్రొఫెసర్ జాన్ దెవే అని సరిగ్గానే ప్రశ్నించాడు. గమనాన్ని సమర్ధించేది గమ్యమొక్కటే.

బహుశా, బుద్ధుడు గమ్యమే గమనాన్ని సమర్ధిస్తుంది అని అంగీకరించే ఉంటాడు. అది కాకపోతే మరేమిటి? గమ్యం హింసను సమర్ధిస్తే, హింస గమ్యానికి సరైన మార్గం అవుతుందని ఆయన చెప్పివుంటాడు. గమ్యానికి బలప్రయోగమే శరణ్యమైతే బుద్ధుడు ఆస్తిపరులను కూడా అందులోంచి మినహాయించి ఉండడు. అయితే గమ్యం కోసం ఆయన చెప్పే విధానం భిన్నమైందిగా మనం చూస్తాం. ప్రొఫెసర్ దెవే పేర్కొన్నట్లు, హింస బలప్రయోగానికి మరోపేరు తప్ప మరేమీ కాదు. సృజనాత్మక అవసరాలకు బలప్రయోగం అవసరమే అయినప్పటికీ, బలాన్ని ఒక శక్తిగా వాడడానికి బలాన్ని హింసగా వాడుకోడానికి మధ్య భేదాన్ని పాటించాలి. ఒక గమ్యాన్ని సాధించడం కోసం అనేక ఇతర గమ్యాలను నిర్మూలించవలసి వస్తుంది. కాని ఇవి నిర్మూలించదగిన ఆ ఒక్క గమ్యంలో అంతర్భాగాలే. బల ప్రయోగాన్ని చెడును నిర్మూలించ డంలో సాధ్యమైనన్ని ఎక్కువ గమ్యాలను రక్షించేటట్లు చెయ్యాలి. బుద్ధుని అహింస జైన మత స్థాపకుడైన మహావీరుని శుద్ధ అహింస వంటిది కాదు. అతడు బలాన్ని శక్తిగానే అనుమతించి ఉంటాడు. కమ్యూనిస్టులు అహింసను పరమ సిద్ధాంతంగా చెబుతారు. బుద్ధుడు దానిని పూర్తిగా వ్యతిరేకించాడు."

నియంతృత్వాన్ని బుద్ధుడు సమర్ధించడు. అతడు ప్రజాస్వామిక వాదిగా పుట్టాడు. ప్రజా స్వామికవాదిగా మరణించాడు. ఆయన కాలంలో 14 రాచరిక రాజ్యాలు, 4 రిపబ్లిక్కులు ఉండేవి. ఆయన శాక్య తెగకు చెందినవాడు. శాక్య సామ్రాజ్యం రిపబ్లిక్కు. ఆయన రెండో నివాసం వైశాలి. దానిని ఆయన అపారంగా ప్రేమించాడు. ఎందుకంటే అది రిపబ్లిక్కు. మహాపరినిర్వాణానికి ముందు ఆయన వర్షవాసం వైశాలిలోనే చేశాడు. వర్షవాసం పూర్తయినాక ఆయన అక్కణ్నుంచి మరోచోటికి పోవాలని నిర్ణయించుకున్నాడు. అలా కొంతదూరం వెళ్ళినాక ఆయన ఒకసారి వెనక్కి తిరిగి వైశాలిని చూసి ఆనందునితో అన్నాడు. "తథాగతుడు వైశాలిని చూడడం ఇదే ఆఖరుసారి" ఆ రిపబ్లిక్ మీద ఆయన కొంత మక్కువ ఉండేది.

ఆయన ఆసాంతం సమతావాది. బుద్ధునితో సహా భిక్షువులందరూ అతుకులు వేసిన అంగీలు ధరించారు. పాలకసంపన్న వర్గాలు ఈ సంఘంలో చేరకుండా నివారించడం కోసం ఈ నియమం పెట్టబడింది. కొంతకాలం తర్వాత జీవకుడనే వైద్యుడు అతుకులు లేని ఒకే బట్టతో తయారు చేసిన అంగీని వేసుకునేట్లు బుద్ధుని ఒప్పించాడు. బుద్ధుడు ఆ నియమాన్ని సడలించి దానిని అందరికీ వర్తింపజేశాడు.

భిక్షుక సంఘంలో చేరిన బుద్ధుని తల్లి మహా ప్రజాపతి గౌతమి, ఒకసారి ఆయనకు జలుబు చేసినట్లు తెలుసుకొంది. ఆయనకొక తల రుమాలు కుట్టడం మొదలుబెట్టింది. కుట్టడం పూర్తయిన తర్వాత బుద్ధుని దగ్గరికి తీసుకెళ్ళి తీసుకోమంది. ఆయన దానిని తిరస్క రించాడు. తిరస్కరిస్తూ అది బహుమానమైతే మొత్తం సంఘానికి చెందుతుంది తప్ప, సంఘంలో

ఒక వ్యక్తికి కాదు అన్నాడు. ఆమె ఎంతో ప్రాధేయపడింది. ఆయన ఒప్పుకోలేదు.

భిక్షుక సంఘానికి ఎంతో ప్రజాస్వామికమైన రాజ్యాంగముంది. ఆయన ఆ భిక్షువులలో ఒకడు. మహా అయితే ఆయన మంత్రివర్గ సభ్యులలో ప్రధానమంత్రి వంటివాడు. ఆయన ఎప్పుడూ నిరంకుశుడు కాదు. ఆయన మరణానికి ముందు సంఘాన్ని అజమాయిషీ చెయ్యడానికి ఎవరినైనా నియమించమని రెండు పర్యాయాలు అడిగితే, ఆయన ధర్మమే సంఘానికి ఉన్నతాధికారి అనిచెప్పి, ఆ కోరికను తిరస్కరించాడు. తాను నిరంకుశాధికారిగా ఉండడానికి, మరో నిరంకుశాధికారిని నియమించడానికి ఆయన ఒప్పుకోలేదు.

లక్ష్యాన్ని సాధించే సాధనాల విలువల మాటేమిటి? ఎవరి పద్ధతులు ఉన్నతమైనవి, ఎవరివి శాశ్వతంగా నిలుస్తాయి?

తమ విలువైన లక్ష్యాలను సాధించడంలో ఇతరుల విలువైన లక్ష్యాలను నాశనం చెయ్యలేదని కమ్యూనిస్టులు చెప్పగలరా? వాళ్ళు వ్యక్తిగత ఆస్తిని ధ్వంసం చేశారు. అది విలువైన లక్ష్యం అనుకొని, దానిని సాధించే క్రమంలో ఇతర విలువైన లక్ష్యాలను నాశనం చెయ్యలేదని వాళ్ళు చెప్పగలరా? ఈ లక్ష్యాన్ని సాధించడంలో వాళ్ళు ఎంత మందిని చంపేశారు? మానవ జీవితానికి విలువలేదా? యజమానిని చంపకుండా, ఆస్తిని స్వాధీనం చేసుకోలేరా?

నియంతృత్వాన్నే తీసుకోండి. దాని లక్ష్యం విప్లవాన్ని శాశ్వతం చెయ్యడం. ఇది విలువైన లక్ష్యం అయితే దీనిని సాధించే క్రమంలో ఇతర విలువైన లక్ష్యాలను నాశనం చెయ్యలేదని వాళ్లు చెప్పగలరా? నియంతృత్వం స్వేచ్ఛారాహిత్యంగా, పార్లమెంటరీ ప్రభుత్వం లేనిదిగా చెప్పబడింది. ఈ రెండు వివరణలూ స్పష్టంగా లేవు. పార్లమెంటరీ ప్రభుత్వం ఉన్నప్పుడు కూడా స్వేచ్ఛ లేదు. ఎందుకంటే చట్టం అంటేనే స్వేచ్ఛారాహిత్యం. నిరంకుశాధికారానికి పార్లమెంటరీ ప్రభుత్వానికీ మధ్య ఉండే భేదం ఇదే. పార్లమెంటరీ ప్రభుత్వంలో, స్వతంత్రం మీద ప్రభుత్వం రుద్దిన నిషేధాలను ఆటంకాలను విమర్శించే హక్కు ప్రతి పౌరునికీ ఉంటుంది. పార్లమెంటరీ ప్రభుత్వంలో నీకు ఒక బాధ్యత ఉంది, ఒక హక్కు ఉంది. చట్టాన్ని సమ్మతించడం బాధ్యత, దానిని విమర్శించడం హక్కు. నిరంకుశత్వంలో చట్టాన్ని శిరసావహించే బాధ్యత తప్ప దానిని విమర్శించే హక్కు ఉండదు.

## VII ఎవరి సాధనాలు శక్తిమంతం?

ఇప్పుడు మనం ఎవరి సాధనాలు ఎక్కువ శాశ్వతంగా ఉంటాయో దాన్ని పరిశీలించాలి. బలప్రయోగాన్ని ఉపయోగించే ప్రభుత్వమూ, నైతిక ప్రవృత్తిగల ప్రభుత్వమూ ఈ రెంటిలో ఒకదాన్ని ఎన్నుకోవాలి.

బర్క్ చెప్పినట్లు బలప్రయోగమనేది శాశ్వతమైన మార్గం కాదు. అమెరికాతో సామరస్యం

అనే అంశంపైన మాట్లాడుతూ ఆయన ఒక స్మరణీయమైన హెచ్చరిక చేశాడు.

"అయ్యా! మొట్టమొదటి కేవల బలప్రయోగమనేది తాత్కాలికమే అని చెప్పడానికి నాకు అనుమతివ్వండి. ఆ క్షణానికి అది అణిచివేయవచ్చు. కాని అణచివేసే అవసరాన్ని మాత్రం అది తొలగింపలేదు. ఏ జాతి, ఏ దేశం మాటిమాటికి జయింపబడవలసి ఉంటుందో అది పాలింపబడదు."

నా తరువాతి అభ్యంతరం అనిశ్చితత్వం. బలప్రయోగం యొక్క ఫలితం ఎల్లకాలమూ భయోత్పాతం కలిగింపజాలదు. సైనిక శక్తి అనేది విజయం కాదు. నీవు విజయం సాధించలేకపోతే నీకు ప్రత్యామ్నాయం వుండదు. ఎందుకంటే సామరస్యం అపజయం పాలైతే బలప్రయోగం మిగుల్తుంది. బలప్రయోగం అపజయం పాలైతే మళ్ళీ సామరస్యం అనేది అసంభవం. అధికారమూ, శక్తి అనేవి ఒక్కొక్కసారి మనం కరుణతో సంపాదించవచ్చు; హింస ఒకసారి అపజయం పాలైతే, నీరుగారిపోతే అధికారమూ, శక్తి అనేవి అడుక్కుంటే మాత్రం రావు.

బలప్రయోగానికి మరో అభ్యంతరం ఏదంటే దేనికైతే నీవు సంరక్షించుకోడానికి ప్రయత్నిస్తావో దానినే బలప్రయోగం వల్ల నాశనం చేసుకుంటావు. దేనికోసం నీవు పోరాడుతావో అది నీవు సంపాదింపదగినది. అయితే బలప్రయోగం వలన అది నలిగిపోయి క్రుంగిపోయి పోరాటం వలన సగం నాశనమైన దానినే పొందుతున్నావు."

భిక్షుగణాన్ని ఉద్దేశించి చేసిన ధర్మ ప్రవచనంలో బుద్ధుడు ధర్మ పరిపాలనకు బలప్రయోగంతో కూడిన పరిపాలనకు గల భేదాన్ని చూపాడు. సోదర భిక్షువులను సంబోధిస్తూ ఆయన ఇలా అన్నాడు.

2. "సోదరులారా! చాలా కాలానికి పూర్వం దృఢనేమి అనే చక్రవర్తి ఉండేవాడు. అతడు ధర్మపాలకుడు, భూమి నలుదిక్కులకు అధిపతి, విజేత ప్రజా సంరక్షకుడు. ఆయనకు దివ్యమైన ఒక చక్రముండేది. నాలుగు సముద్రాల పొలిమేరలుగా గల భూమిపైన అతడు ఆధిపత్యాన్ని సాగిస్తూ జీవిస్తూ ఉండేవాడు. ఈ ఆధిపత్యం సాహసం వల్ల కాదు, ఖడ్గంతో కాదు, కేవలం ధర్మంతోనే అతనికి సిద్ధించింది."

3. "సోదరులారా! చాలా వందల ఏళ్ళ తర్వాత, వేల ఏళ్ళ తర్వాత ఆ దృఢనేమి ఒకర్ని పిలిచి ఇలా ఆదేశించాడు. "అయ్యా! నువ్వు పోయి ఆ ధర్మచక్రం ఏదైనా కొంచెం కృంగి ఉన్నదా? లేక విజస్థానం నుంచి కొంత జారిపడి ఉన్నదా? చూచిరా. చూచి నాకు తెలియజెయ్యి" అన్నాడు.

చాలా సంవత్సరాల తర్వాత ధర్మచక్రం కృంగిపోయిన సంగతి చూసి ఒకడు దృఢనేమి వద్దకు వెళ్ళి "అయ్యా! వాస్తవంగా ఆ దివ్యచక్రం కృంగిపోయి నిజస్థానం నుండి భ్రష్టమై ఉంది" అని చెప్పాడు. భిక్షుక సోదరులారా, అప్పుడు దృఢనేమి తన పెద్ద కుమారుని పిలిచి ఇలా అన్నాడు: సౌమ్యుడా! దివ్యచక్రం కృంగి కొంత నిజస్థానం నుండి జారి ఉన్నది అని చెప్తున్నారు. చక్రవర్తి యొక్క దివ్యచక్రం కృంగిపోతే లేక స్థానభ్రష్టం అయితే ఆ చక్రవర్తి చాలాకాలం జీవించడు. నేను మానుషానందాలన్నీ అనుభవించాను. దివ్యానందాలను అన్వేషించాల్సిన సమయం వచ్చింది. ప్రియపుత్రుడా! సాగర వలయితమైన ఈ భూమిపైన ఆధిపత్యం స్వీకరించు. నేను గడ్డాన్ని, శిరోముండనం చేసుకుని, పీతాంబరాలు ధరించి, గృహస్థ జీవనం నుండి గృహరహిత జీవనానికి వెళ్తున్నాను.

అలా సోదరులారా! దృఢనేమి తన కుమారుని సింహాసనం మీద ప్రతిష్ఠించి చేసి శిరస్సు, గడ్డం ముండనం చేయించుకొని కాషాయంబరాలను ధరించి ఇంటిని వదిలి గృహరహిత దశను చేరుకున్నాడు. ఆ రాజర్షి వెళ్ళిన పదవ దినం ఆ దివ్యచక్రం అంతర్థానమైంది.

4. అప్పుడొకానొక వ్యక్తి రాజు దగ్గరికివెళ్ళి దివ్యచక్రం అంతర్థానమైందని చెప్పాడు.

అప్పుడా రాజు దుఃఖించి వ్యధను పొంది రాజర్షి సన్నిధికిపోయి దివ్యచక్రం అంతర్థానం గురించి తెలిపాడు. అభిషిక్తుడైన ఆ రాజు ఇలా చెప్పగా ఆ రాజర్షి ఇలా బదులు చెప్పాడు. "ప్రియ కుమారా! దివ్య చక్రాంతర్థానాన్ని గురించి చింతించకు. దాని గురించిన క్లేశం వద్దు. ఎందుకంటే ఆ దివ్యచక్రమనేది తండ్రి నుండి సంక్రమించిన వారసత్వం కాదు. అది దివ్యచక్రం. కుమారా! నీవు చక్రవర్తుల ఆర్యధర్మ ప్రవర్తనను స్వీకరించు. (ప్రపంచ వాస్తవ సార్వభౌములు నియమించుకున్న ఉత్తమాదర్శానికి అనుగుణంగా వ్యవహరించు) పూర్ణిమా పర్వదినాన స్నానం చేసి ఉన్నత స్థానంలో పండుగకు చేసిన పదార్థాన్ని ఎత్తైన వేదిక మీద పెట్టు. అప్పుడు నీకు మళ్ళీ ఆ దివ్యచక్రం సాక్షాత్కరిస్తుంది. ఆ చక్రం యొక్క నేమికి వెయ్యి ఆకులు ఉంటాయి. నాభి (కుండ) ఇంకా ఇతర సమగ్ర భాగాలతో దివ్యచక్రం నీకు కనబడుతుంది.

5. "తండ్రీ! చక్రవర్తుల ఆర్య ధర్మ లక్షణమేమి?" అని కుమారుడడిగాడు.

"ప్రియకుమారా! సత్యధర్మాలపైన ఆధారపడి వాటిని గౌరవిస్తూ పూజిస్తూ ఆ ధర్మానికి

ఎప్పుడైతే నీ రాజ్యంలో విషయోన్మాదం వల్ల కలిగే అజాగ్రత్తను త్యజించి ప్రజలు ధార్మిక జీవనులవుతారో, క్షమ, సానుభూతి, ఆత్మనిగ్రహం, ఆత్మరక్షణ కలిగి ప్రజలు తరచుగా నీ వద్దకు వచ్చి మంచిచెడ్డలను గురించి ప్రశ్నిస్తూ ఉంటారో, ఏది కర్తవ్యమో, ఏది కర్తవ్యం కాదో, ఏ విధమైన కర్మం సుఖం కలిగిస్తుందో, ఏది దుఃఖహేతువో – వాటినన్నిటినీ గురించి వాళ్ళు చెప్పినదానిని విని, నీవు చెడును పరిత్యజించి మంచిని వాళ్ళు పరిగ్రహించేటట్టు చెయ్యాలి. ప్రియనందనా! ఇది సార్వభౌముల ఆర్య ధర్మ ప్రవర్తన."

"తండ్రీ అలాగే"నని అభిషిక్తుడైన రాజు బదులు చెప్పి, చక్రవర్తుల ఆర్య ధర్మ పరిపాలనను కొనసాగించాడు. అతడట్లు ప్రవర్తించగా పూర్ణిమా పర్వదినాన తలస్నానం చేసి ఉన్నత వేదికవైపు చూడగా దివ్యచక్రం వెయ్యి ఆకులతో, నాభి (కుండ)తో, నేమితో సర్వాంగ సుందరంగా సాక్షాత్కరించింది. అలాంటి సందర్భాల్లో ఏ రాజుకు పూర్తిగా ధర్మచక్రం కనిపిస్తుందో అతడు చక్రవర్తి సమ్రాట్ కాగలడు, "నేను కూడా అలాంటి సార్వభౌముడనౌతాను" అని అనుకున్నాడు.

6. "తర్వాత సోదరులారా! ఆ రాజు సింహాసనం నుంచి లేచి తన రాచరికపు దుస్తులను విప్పి, వామహస్తంతో జలకుండికను ధరించి, దక్షిణ హస్తంతో నీటిని దివ్యచక్రం మీద ప్రోక్షిస్తూ ఇలా అన్నాడు. "ఓ చక్రమా! నీవు తిరుగుతూ ముందుకు వెళ్ళి రాజ్యాలను జయించు."

"అప్పుడు ఆ దివ్య చక్రం కదలి ప్రాగ్దిశగా వెళ్ళింది. దానివెంట చక్రవర్తి చతురంగ బలంతో వెళ్ళాడు. ఎక్కడెక్కడ ఆ చక్రం ఆగిపోతుందో ఆ ప్రదేశంలోరాజు కూడా ఆగుతాడు. అతనితో అతని చతురంగ బలం కూడా ఆగుతుంది. అప్పుడు ఆ తూర్పు ప్రాంతంలోని శత్రువర్గానికి చెందిన రాజులందరూ చక్రవర్తిని సమీపించి "మహారాజా! ఇదంతా మీదే. ఓ బలసంపన్నుడా! మాకు ధర్మాన్ని ఉపదేశించండి" అన్నారు.

అప్పుడు చక్రవర్తి ఇలా అన్నాడు. "మీరు ఏ ప్రాణినీ చంపకూడదు. మీకు ఇవ్వబడని దానిని మీరు తీసుకోకూడదు. మీరు దుష్కామానికి లోబడకూడదు. అసత్యమాడకూడదు. మత్తు పానీయాలను సేవించకూడదు. మీకున్న వాటిని ఈ రీతిగా అనుభవిస్తూ ప్రవర్తించండి."

7. అప్పుడు సోదరులారా! ఆ దివ్యచక్రం తూర్పు సముద్రంలో మునిగి లేచి మరలా దక్షిణాభిముఖంగా తిరుగుతూ వెళ్ళింది.......... (అక్కడ కూడా తూర్పుదిక్కున జరిగినట్లే జరిగింది). అలా దివ్యచక్రం దక్షిణ సముద్రంలో మునిగి పశ్చిమాభిముఖంగా పరిభ్రమిస్తూ వెళ్ళింది. ఉత్తరాభిముఖంగా వెళ్ళింది. అన్నిచోట్ల అలాగే జరిగింది.

సాగరముద్రితమైన సమస్తధరణిని దివ్యచక్రం ఇలా జయించి రాజధానికి వచ్చి నిలిచింది. రాజాంతఃపుర ప్రవేశద్వారంలో వ్యాయమమండపం ముందు దానిని వెలకొల్పారా అన్నట్టు, రాజాంతఃపుర యవనికలను ప్రకాశింపచేస్తూ నిలబడింది.

8. ఇలాగే రెండో రాజు, మూడో రాజు, నాలుగో రాజు, అయిదో రాజు, ఆరో రాజు, ఏడో రాజు పరిపాలించారు. ఇలా అనేక సంవత్సరాలు జరిగిపోయిన తర్వాత ఏడవ రాజు గొప్ప విజేత ఒక వ్యక్తినిలా ఆదేశించాడు:

"అయ్యా! దివ్యచక్రం కృంగి స్థానభ్రష్టమై ఉంటే చూచి నాకు తెలియచేయి."

అలాగేనని అతడు జవాబిచ్చాడు.

అతడు ఇలా చాలా సంవత్సరాల తర్వాత దివ్యచక్రం క్రుంగిపోయి స్థానభ్రంశమై ఉండడం చూచి గొప్ప విజేత అయిన ఆ రాజు దగ్గరికి పోయి చెప్పాడు. ఆ రాజుకూడా (పూర్వం దృఢనేమి ప్రవర్తించినట్లే) ప్రవర్తించాడు. రాజు వెళ్ళిపోయిన ఏడో రోజు దివ్యచక్రం అంతర్ధానమైంది.

తర్వాత ఒక వ్యక్తి రాజుకు ఈ సంగతి తెలిపాడు. రాజు ధర్మచక్రం అంతర్హితం అయి నందుకు విచారించి దుఃఖించాడు. కాని అతను రాజర్షి వద్దకు పోయి ఆర్యధర్మాన్ని గురించి అడిగి తెలుసుకోలేదు. తన అభిప్రాయాలను అనుసరించి ప్రజాపాలన చేశాడు. ఈ పరిపాలన పూర్వ పరిపాలన కంటే భిన్నంగా ఉండడం వల్ల ప్రజలు పూర్వ పరిపాలనలోలాగా అభ్యున్నతిని పొందలేదు. పూర్వపు రాజులందరూ చక్రవర్తి ధర్మాన్ని ఆర్యధర్మాన్ని - పరిపాలించిన వారే.

తర్వాత సోదరులారా! మంత్రులు, రాజోద్యోగులు, ఆర్థిక శాఖోద్యోగులు, రక్షక భటులు, ద్వారపాలకులు, ధర్మసూత్రాల కనుగుణంగా జీవించిన వాళ్ళందరూ రాజు సన్నిధికి వచ్చి ఇలా అన్నారు. "రాజా! పూర్వరాజుల పరిపాలనకు భిన్నంగా అంటే చక్రవర్తుల ఆర్యధర్మానికి భిన్నంగా మీ సొంత భావాలను అనుసరించిన మీ పరిపాలనలో ప్రజలు అభ్యుదయం పొందడం లేదు. మీ రాజ్యంలో మంత్రులు, రాజోద్యోగులు, ఆర్థికోద్యోగులు, రక్షకభటులు, సంరక్షకులు, ధర్మసూత్రాల కనుగుణంగా జీవించేవారు. మేము, ఇతరులు ఆర్యధర్మాన్ని అనుసరిస్తున్నాం. రాజా! ఆ ధర్మాన్ని గురించి మమ్మల్ని ప్రశ్నిస్తే మేము దానిని వివరించగలం."

9. తర్వాత రాజు వాళ్లందరినీ కూర్చోమని చెప్పి ఆర్యధర్మాన్ని గురించి ప్రశ్నించాడు. వాళ్ళు అతనికి వివరించారు. వారిని ఆలకించిన రాజు తగిన ఆలనా పాలనా ఇవ్వనారంభించాడు. అపహాయులైన అనాథలకు మాత్రం ధనమివ్వలేదు. అందువల్ల పేదరికం సర్వత్రా

వ్యాపించింది.

ఎప్పుడైతే దారిద్ర్యం సర్వవ్యాపకమైందో అప్పుడొక వ్యక్తి తనకు ఇతరుల ద్వారా ఇవ్వబడని దానిని తానే స్వయంగా తీసుకున్నాడు. ప్రజలు ఈ పనిని దొంగతనం అన్నారు. అతనిని పట్టుకున్నారు. రాజు దగ్గరికి తీసుకొచ్చి "రాజా! ఇతడు తనకివ్వని దానిని తీసుకొని దొంగతనం చేశాడు" అన్నారు.

రాజు "ఇది నిజమా? నీకివ్వబడని దానిని తీసుకొని వారన్నట్లు దొంగతనం చేశావా?" అని అడిగాడు.

అతడు "రాజా! అవును సత్యమే." అన్నాడు.

'ఎందుకని'

"నేను బతకడానికి ఏ ఉపాధీ లేదు" అన్నాడు. రాజు అతనికి ధనమిచ్చి "ఈ ధనంతో నువ్వు జీవించి నీ తల్లిదండ్రులను బిడ్డలను, భార్యను పోషిస్తూ, ఏదైన ఒక వ్యాపారంలో నిమగ్నం కమ్ము" అన్నాడు.

అలాగేనని అతడు బదులిచ్చాడు.

10. ఇప్పుడు మరొక వ్యక్తి తనకివ్వబడని దానిని దొంగిలించాడు. ప్రజలు అతనిని బంధించి రాజు ఎదుటకి తీసుకొచ్చారు. "రాజా, తనకు ఇవ్వనిదానిని ఇతడు దొంగతనం చేశా"డని చెప్పారు. అప్పుడు రాజు (ఇంతకు ముందు వ్యక్తితో మాట్లాడినట్లే మాట్లాడి, ధనమిచ్చాడు)

11. అప్పుడు సోదరులారా! దొంగతనం చేసిన వారికందరికీ రాజు ధనమిస్తున్నాడనే వార్త లోకంలో బాగా వ్యాపించింది. దీనిని విని ప్రజలనుకున్నారు "మనకు ఇవ్వబడని దానిని దొంగిలిద్దాము" అని.

అలా చేసిన ఒక వ్యక్తిని ప్రజలు పట్టుకొని రాజు దగ్గరికి తీసుకురాగా రాజు అతనిని దొంగతనం చెయ్యడానికి గల కారణాన్ని (ఇంతకు ముందువలె) అడిగాడు.

అతడు "రాజా! తన శరీర పోషణకు ఏ ఆధారము లేదు" అన్నాడు.

ఇలా ధనమిస్తూ పోతే దొంగతనం చెయ్యడం అధికమౌతున్నదని భావించి రాజు అతనికి శిరశ్ఛేదం విధించాలనుకున్నాడు.

"చూడండి. ఈ మనిషికి చేతులు విరిచి వెనక్కికట్టి గట్టిగా ముడివేసి తలగొరిగి భేరీధ్వానంతో ప్రతి వీధిలోనూ, దారి కూడలిలోనూ ఊరేగించి దక్షిణ ద్వారం ద్వారా పట్టణం దక్షిణ దిశకు తీసుకుపోయి అతని తలను నరకెయ్య"మని ఆజ్ఞాపించాడు. ప్రజలను రాజాజ్ఞను నిర్వహించారు.

12. ఇప్పుడు సోదరులారా! దొంగతనం వల్ల మరణశిక్ష వస్తుందని ప్రజలు విని "మన మందరమూ కత్తులు కటారాలు సిద్ధం చేసుకొని మనకు ఇవ్వబడని దానిని మనమే తీసుకొని సొంతదారులకు శిరశ్ఛేదం మనమే చేద్దాం" అనుకున్నారు.

ఆ విధంగా వాళ్ళు పదునైన కత్తులు సంపాదించుకొని పల్లెలమీద పట్నాల మీదాపడి బందిపోటులుగా తయారైనారు. దోచుకోవడం మాత్రమే గాక ప్రజల తలలు నరికేశారు.

13. ఇలా వికలాంగులు, దారిద్ర్య పీడితులకు ఏదీ లభించని కారణంగా సర్వత్రా పేదరికం వ్యాపించింది. పేదరికం సర్వత్రా వ్యాపించడం వల్ల దొంగతనాలు పెరిగాయి. దీనివల్ల హింస క్రౌర్యం పెరిగాయి. దీనివల్ల సామాన్య జనజీవితం నాశనమైపోయింది. హత్యలు పెరగడం వల్ల మానవుల ఆయుః ప్రమాణం తగ్గిపోయి మానవ జీవితంలోని శోభ నశించింది. తర్వాత కొంతమంది వ్యక్తులు తమ జీవిత ఉత్తరార్ధంలో దొంగతనం చెయ్యడం ప్రారంభించారు.

వాళ్ళను రాజు ప్రశ్నించాడు.

"రాజా! మేము దొంగతనం చెయ్యలేదు, వాళ్ళు కావాలని అసత్యం చెబుతున్నారు" అన్నారు వారు.

14. ఇలా నిర్భాగ్యులైన వాళ్ళకు ఏమీ ఇవ్వని కారణంగా పేదరికం మొదలుకొని సమస్త పాపచర్యలూ సంక్రమించాయి. అసత్యమనేది సర్వసాధారణమైపోయింది. అప్పుడు రాజు దగ్గరికి పోయి ఒక వ్యక్తి దొంగతనం చేసిన వారిని గురించి చెప్పి దుర్భాషలాడాడు.

15. అందువల్ల సోదరులారా! నిర్భాగ్యులకు ఏమీ ఇవ్వని కారణంగా పేదరికం... దొంగతనం... హింస... హత్యలు... అబద్ధాలు... దుర్భాషణ... పెరిగిపోయాయి.

16. అసత్యం వల్ల వ్యభిచారం వ్యాపించింది.

17. ఇలా నిర్భాగ్యులైన వాళ్ళకు ఏమీ ఇవ్వని కారణంగా పేదరికం... దొంగతనం... హింస... హత్యలు... అబద్ధాలు... దుర్భాషణ... అవినీతి... పెరిగిపోయాయి.

18. ఇలా ఆ ప్రజలలో మూడు దుష్ప్రవృత్తులు – లోభం, విశృంఖల కామ ప్రవృత్తి వ్యాపించాయి.

ఈ పాపాచరణం ఇలా వ్యాపించి తల్లిదండ్రులు పట్ల భక్తిరాహిత్యం, మహాత్ముల పట్ల భక్తి శ్రద్ధ లోపం, జాతికి గర్వ కారణమైన వారిపట్ల అగౌరవం పెరిగాయి.

19. సోదరులారా! ఇలాంటి ప్రజానీకానికి కలిగిన సంతతి ఆయుః ప్రమాణం పదే ళ్ళకే పరిమితమౌతుంది. ఇటువంటి ఆయుః ప్రమాణం గల వారిలో కన్యలు అయిదేళ్ళకే వివాహయోగ్యులౌతారు. ఇలాంటి వాళ్ళలో రుచుల పరిజ్ఞానం అంతరిస్తుంది, అంటే నెయ్యి, వెన్న, నూనె, చక్కెర, ఉప్పు మొదలైన వాటి రుచులను గురించిన పరిజ్ఞానం నశిస్తుంది. ఇలాంటి వాళ్ళకు కుద్రుస అనే ధాన్యం ముఖ్యాహార ధాన్యం అవుతుంది. మనకీనాడు అన్నము శాకము ఎలా ఉత్తమాహారమో అలాగే వాళ్ళకు కుద్రసధాన్యం ఉత్తమాహారంగా ఉంటుంది. ఇలాంటి వాళ్ళలో ప్రవర్తనకు సంబంధించిన పది నైతిక రీతులు (అంటే పదిపారమితులు) నశించిపోతాయి. దీనికి బదులుగా పది అవినీతి రీతులు అధికంగా విస్తరిస్తాయి. అలాంటి మనుషుల్లో నైతిక ప్రతివిధుల సంగతి అటుంచి, నీతి అనడానికే ఏ భాషాపదమూ ఉండదు. అలాంటి వ్యక్తుల్లో మాతా పితృభక్తి, ధార్మిక శక్తి, జాతి నాయక గౌరవం అంతరించిపోతాయి. నేటిలాగా మర్యాదలు జరగవు.

20. ఇలాంటి వారికి తల్లి, చెల్లెలు, అత్త, గురుపత్ని, మేనత్త, పిన్నమ్మ లేక పెద్దమ్మ తేడా లేదు. (వీళ్ళలో వావి వరసలు లేని ప్రవృత్తి వ్యాపిస్తుంది). మేకలు, గొర్రెలు, పక్షులు, పందులు, కుక్కలు, నక్కలు లాగే ప్రపంచం విశృంఖల వ్యభిచారంలో పడిపోతుంది.

ఇలాంటి వ్యక్తులలో తీక్షణమైన పరస్పరమైన భావమే సహజ లక్షణంగా మిగిలిపోతుంది. తీక్షణమైన దుర్భావం, హత్యలను పురికొల్పే ఆవేశాత్మకమైన ఆలోచనలు పెరుగుతాయి. తల్లి తన బిడ్డలపట్ల ఇలాంటి ప్రవృత్తితో వ్యవహరిస్తుంది. బిడ్డలు తండ్రి పట్ల సోదరుని పట్ల ఇలా ప్రవర్తిస్తారు. సోదరుడి సోదరి పట్ల సోదరి సోదరుని పట్ల ఇలాగే ప్రవర్తిస్తారు. క్రీడాకారులు తమ క్రీడల్ని తిలకించినట్లు ఈ వ్యక్తులు తమ చేష్టల్ని ఆనందంగా తిలకిస్తారు."

నైతిక పతనం సంభవించి పశుత్వం దాని స్థానాన్ని ఆక్రమించినప్పుడు కలిగే సమాజం యొక్క ఒక అందమైన చిత్రణ ఇది కావచ్చు. ధార్మిక రాజ్యానికి పరిరక్షకులుగా ఉండడానికి ప్రతి వ్యక్తీ తప్పక నైతిక శిక్షణ పొందాలని బుద్ధుని అభిమతం.

బలహీనతను ఉన్నతంగా చేస్తుంది. ఇది పేదలకు బలహీనులకు స్వర్గం లభిస్తుందనే హామీ ఇస్తుంది. బుద్ధుని బోధనలలో అటువంటిదేదీ కనిపించదు. బుద్ధుని బోధనలు సంపదను సంపాదించడాన్ని గురించి చెబుతాయి. తన శిష్యులలో ఒకరైన అనాథ పిండికునికి ఆయన చేసిన ధర్మబోధను ఉదహరిస్తాను.

ఒకనాడు అనాథ పిండికుడు సర్వోన్నతులు బసచేసిన చోటుకి వచ్చాడు. వచ్చి ఆయనకు నమస్కరించి ఒక ప్రక్కన కూర్చుని ఇలా అడిగాడు. "మహానుభావా! గృహస్థు పొందదగినవి, ఆమోదింపదగినవి, ఆనందదాయకమైనవి అయినా – సంపాదించడం కష్టమైనవి ఏవి?"

ఈ ప్రశ్న విని ఆయన ఇలా చెప్పాడు. "వాటిలో మొదట పొందదగింది న్యాయసమ్మతమైన సంపద".

'రెండోది మీ బంధువులు సైతం న్యాయసమ్మతంగా సంపదను పొందేట్టు చూడడం',

'మూడోది పడిపోయే వయసు దాకా దీర్ఘకాలం జీవించడం.'

ఓ సంసారీ! ఈ ప్రపంచంలో కోరదగినవి, ఆనందదాయకమైన, ఆమోదయోగ్యమైనవి అయిన ఈ నాలుగు సంపాదించాలంటే నాలుగు నియమాలున్నాయి. అవి విశ్వాసం, సత్ప్రవర్తన, దాతృత్వం, జ్ఞానం – వీటి అనుగ్రహం.

హత్య, దొంగతనం, వ్యభిచారం, అబద్ధం చెప్పడం, త్రాగుడు నుంచి సత్ప్రవర్తనానుగ్రహం మనిషిని నివారిస్తుంది.

లోభ బుద్ధి లేకపోవడం, ఉదారత్వం, దానం చెయ్యడంలో ఉత్సాహం చూపడం, బహుమతులివ్వడంలో నిమగ్నం కావడం – ఇవి గృహస్థులో ఉండే దాతృత్వం అవుతుంది.

అత్యాశ, లోభం, దుష్ట బుద్ధి, సోమరితనం, మైకం, పరధ్యానం, తొందర, సందేహం – ఇవి ఉంటే మనిషి తప్పుడు పనులు చేస్తాడని, చెయ్యవలసిన పనుల్ని విస్మరిస్తాడని, అలా చెయ్యడం ద్వారా సంతోషాన్ని గౌరవాన్ని పోగొట్టుకుంటాడని గ్రహించడం జ్ఞానానుగ్రహం.

అత్యాశ, లోభం, దుష్ట బుద్ధి, సోమరితనం, మైకం, పరధ్యానం, తొందర, సందేహం – ఇవి మెదడుకు అంటిన మాలిన్యాలు. ఈ మాలిన్యాలు అంటని గృహస్థు గొప్ప జ్ఞానాన్ని, ఉన్నతమైన జ్ఞానాన్ని, స్వచ్ఛమైన దర్శనాన్ని, సమ్యక్ జ్ఞానాన్ని పొందుతాడు.

అలా సంపదను న్యాయంగా, చట్టబద్ధంగా సంపాదించడం, గొప్ప కృషితో సంపాదన చెయ్యడం, భుజ బలంతో సమకూర్చడం, చెమట చిందించి సంపాదించడం ఒక వరం. గృహస్థు తాను సుఖపడతాడు, సంతోషపడతాడు. తనను తాను ఆనందంలో నింపుకుంటాడు. తల్లిదండ్రులను, భార్యాబిడ్డలను, సేవకులను, శ్రామికులను, స్నేహితులను సహచరులను సుఖసంతోషాలతో నింపుతాడు.

భౌతిక బలాన్ని ఉపసంహరించిన తర్వాత కమ్యూనిజాన్ని నిలుపుకోడానికి బౌద్ధమతం ఏకైక సాధనమన్నవాస్తవం పట్ల రష్యన్లు ఆసక్తి కనబరుస్తున్నట్లు లేదు.

రష్యన్లు తమ కమ్యూనిజం పట్ల గర్వపడుతుంటారు. అయితే బుద్ధుడు బౌద్ధమత స్థాయిలో నియంతృత్వం లేని కమ్యూనిజాన్ని స్థాపించడం అద్భుతాల్లోకెల్లా అద్భుతమని వాళ్ళు మరచిపోయారు. ఇది అతి చిన్న స్థాయిలోని కమ్యూనిజం కావచ్చు కాని ఈ కమ్యూనిజంలో నియంతృత్వం ఉండదు. లెనిన్ సాధించడంలో విఫలమైన అద్భుతం ఇది.

బుద్ధుడి పద్ధతి విభిన్నమైంది. ఆయన పద్ధతి మనిషి ఆలోచనను మార్చడం. మనిషిని సంస్కరించడం. దానివల్ల మనిషి ఏమి చేసినా ఇచ్ఛికంగా, ఒత్తిడి లేకుండా చేస్తాడు. మనిషి ప్రవృత్తిని సంస్కరించడానికి ఆయన అనుసరించిన ప్రధాన విధానం ధమ్మ (ధర్మం). నిరంతర ధర్మబోధన. మనుషులు చెయ్యడానికి ఇష్టపడని వాటిని - అవి వాళ్ళకు మంచివి అయినా - చెయ్యమని బలవంతం చెయ్యకపోవటం బుద్ధుని మార్గం. ఆయన మార్గం మనిషి ప్రవృత్తిని సంస్కరించడం. దాని ద్వారా వాళ్ళు ఇచ్ఛికంగా పనిచేస్తారు.

రష్యాలో కమ్యూనిస్ట్ నియంతృత్వం గొప్ప విజయాలను సాధించినట్లు ఎవరూ కాదనడంలేదు. అందుకే వెనకబడిన దేశాలకన్నింటికీ రష్యన్ నియంతృత్వం మంచిదే అంటాను నేను. అయితే నియంతృత్వం శాశ్వతంగా ఉండాలని వాదించడం మాత్రం మంచిది కాదు. సంఘం కేవలం ఆర్థిక విలువల్నే కోరుకోదు. అది ఆధ్యాత్మిక విలువల్ని నిలుపుకోవాలని కూడా కోరుకుంటుంది. శాశ్వత నియంతృత్వం ఆధ్యాత్మిక విలువలమీద దృష్టి నిలపలేదు. దృష్టి నిలపాలని అనుకున్నట్లు కూడా లేదు. రాజకీయ ఆర్థిక శాస్త్రాన్ని కార్లైల్ పందుల తత్వశాస్త్రం అన్నాడు. కార్లైల్‌వాదం సరైంది కాదనుకోండి. మనిషికి భౌతిక సౌఖ్యాలు కావాలి కదా! అయితే కార్లైల్‌వాదం ఎంత తప్పో, కమ్యూనిస్ట్ సిద్ధాంతం కూడా అంతే తప్పు. ఎందుకంటే మనుషులు పందులకన్నా మెరుగు కాదన్నది వాళ్ళ సిద్ధాంత లక్ష్యం అయినట్లు కనిపిస్తుంది. మనుషులు భౌతికంగా మనుషులు భౌతికంగా వాళ్ళ సిద్ధాంత లక్ష్యం అయినట్లు కనిపిస్తుంది. మనుషులు భౌతికంగా అభివృద్ధి చెందాలి, ఆధ్యాత్మికంగానూ ఎదగాలి. సమాజం కొత్త పునాది కోసం ప్రయత్నిస్తుంది. ఫ్రెంచి విప్లవంలో స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే మూడు మాటల్లో వ్యక్తమైంది. ఈ వివాదం ఉన్నందువల్లే ప్రజలు ఫ్రెంచి విప్లవానికి ఆహ్వానం పలికారు. అది సమానత్వం

తీసుకురాలేకపోయింది. రష్యన్ విప్లవం సమానత్వ సాధనను ఉద్దేశించింది. కాబట్టి మనం దానివి ఆహ్వానిద్దాం. అయితే సమానత్వాన్ని సాధించడంలో స్వేచ్ఛ సౌభ్రాతృత్వాలను త్యాగం చెయ్యాలన్న దాన్ని సమ్మతించలేం. స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం లేకుండా సమానత్వానికి విలువలేదు. బుద్ధుని మార్గంలో మాత్రమే ఈ మూడూ నిలబడగలవు, మనగలవు. కమ్యూనిజం ఒక్కటి మాత్రం ఇవ్వగలదు, అన్నిటినీ ఇవ్వజాలదు.

అనువాదం: ఆచార్య జి. పార్థసారథి

రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

ఐదవ భాగం

# పుస్తకాల ప్రణాళికలు

ఇందులో "హిందువులకు బ్రాహ్మణులు చేసినదేమిటి?" అనేది అచ్చయిన రూపంలో వుంది. తక్కినవన్నీ టైప్ చేసినవి.

—సంపాదకులు

19 అధ్యాయం

# పుస్తకాల ప్రణాళికలు

## 1

## ప్రాచీన భారతదేశంలో విప్లవం, ప్రతివిప్లవం

### విషయ సూచిక



### పుస్తకం I

మొదటి భాగం– సామాజిక సంఘర్షణల యుగం



### పుస్తకం II

అసమానత్వం అవతరణ

## పుస్తకం III

మొదటి భాగం– విప్లవం, దాని సూత్రాలు
అధ్యాయం 1 విప్లవ శక్తిగా బౌద్ధం అవతరణ
అధ్యాయం 2 విప్లవసూత్రంగా సమానత్వం
అధ్యాయం 3 విశ్వాసం కాదు హేతువు
అధ్యాయం 4 ఆలోచనా స్వేచ్ఛ

రెండవ భాగం– సమాజంపై విప్లవ ఫలితాలు
అధ్యాయం 1 విప్లవం, సామాజిక ఫలితాలు
అధ్యాయం 2 విప్లవం, రాజకీయ ఫలితాలు
అధ్యాయం 3 స్త్రీల స్థితి ఉన్నతీకరణ

మూడవ భాగం– విప్లవం రాజకీయ ఫలితాలు

## పుస్తకం – IV

మొదటి భాగం– ప్రతివిప్లవ కారణాలు
అధ్యాయం 1 రాజహత్య లేదా ప్రతివిప్లవ ఆవిర్భావం
అధ్యాయం 2 మనుస్మృతులు లేదా ప్రతివిప్లవ పవిత్ర గ్రంథం

రెండవ భాగం– ప్రతివిప్లవ సామాజిక ఫలితాలు
అధ్యాయం 1 బ్రాహ్మణుని దైవీకరణ
అధ్యాయం 2 పాలకులుగా బ్రాహ్మణుల ప్రతిష్ఠాపన
అధ్యాయం 3 శూద్రుల అణచివేత
అధ్యాయం 4 స్త్రీల హీనీకరణ

మూడవ భాగం– విప్లవం ప్రతివిప్లవాల మధ్య పోరాటం
అధ్యాయం 1
అధ్యాయం 2
అధ్యాయం 3
అధ్యాయం 4

నాలుగవ భాగం– విప్లవం సామాజిక ఫలితాలు
అధ్యాయం 1
అధ్యాయం 2
అధ్యాయం 3
అధ్యాయం 4

# 2

# హిందువులకు బ్రాహ్మణులు చేసిందేమిటి

మనిక: ఈ ప్రణాళిక అచ్చులో వుంది. తక్కిన ప్రణాళికలు టైప్ చేసిన రూపంలో

# 3

# నేను హిందువును కాగలనా?

## హిందూమత చిహ్నాలు

. చిహ్నాలు సారాంశానికి ప్రాతినిధ్యం వహిస్తాయి.

2. క్రైస్తవం చిహ్నాలు

3. ఇస్లామ్ చిహ్నాలు
4. జైనం చిహ్నాలు
5. బౌద్ధం చిహ్నాలు
6. హిందూ మత చిహ్నాలు ఏవి

మూడు.

1. కులం
2. భక్తి మార్గాల తెగలు

    (i) రామ (ii) కృష్ణ

    (iii) శివ (iv) విష్ణు

3. అధిమానవుడి సేవ

# 4

## భారతదేశం – కమ్యూనిజం

ఒకటవ భాగం– కమ్యూనిజానికి పూర్వరంగ పరిస్థితులు

అధ్యాయం 1 కమ్యూనిజం జన్మస్థానం
అధ్యాయం 2 కమ్యూనిజం – ప్రజాస్వామ్యం
అధ్యాయం 3 కమ్యూనిజం సమాజ వ్యవస్థ

రెండవ భాగం– భారతదేశం, కమ్యూనిజానికి పూర్వరంగ పరిస్థితులు

అధ్యాయం 4 హిందూ సామాజిక వ్యవస్థ
అధ్యాయం 5 హిందూ సామాజిక వ్యవస్థ పునాది
అధ్యాయం 6 సమాజ వ్యవస్థ నుంచి కమ్యూనిజానికి ఎదురయ్యే అవరోధాలు

మూడవ భాగం– అయితే మరేం చేయాలి?

అధ్యాయం 1 మార్క్స్ – ఐరోపా సమాజ వ్యవస్థ
అధ్యాయం 2 మనువు – హిందూ సమాజ వ్యవస్థ

# 5

# భగవద్గీతపై వ్యాసాలు

## విషయాల పట్టిక

# గ్రంథసూచి*

రచయిత ఈ సంపుటంలో* ఉదహరించిన గ్రంథాలు, పత్రికలు, నివేదికలు, వార్తాపత్రికలు క్రింద సూచించబడినవి. ప్రచురణకర్త, ప్రచురణ సంవత్సరం, మున్నగు వివరాలు Asiatic and the Bombay University గ్రంథాలయం నుండి కొంత మంది రచయితల వివరాలు సేకరించబడినవి. మిగతా రచయితల వివరాలు లభ్యం కాలేదు.


Adams, D. S. : *Theology* (Hastings Encyclopaedia of Religion and Ethics, Vol. XII).

Adelphi : *The Nemesis of Ineffective Religion* (1941).

Altekar, Anant Sadashiv : *Source of Hindu Dharma in its Socio-religious aspect* (Pub. Sholapur Institute of Public Administration). Name of the article: *The Position of Smritis as a Source of Dharma*—Kane Memorial Volume.

Ambedkar, Dr. B. R.: *Annihilation of Castes* (New Book Co., Bombay 1936).

—*Castes in India* (Indian Antiquary, Vol. XLVI, 1917, pp. 81-95).

—*Who were the Shudras?* (Thacker & Co., Rampart Row, Bombay 1, 1st Ed., 1946).

First two of these books are included in Vol. 1 of the present series. Third one will be out in due course.

Baines, Sir J. A. : *Census of India Report* (1881).

Boudhayana : *Grihya Sutras.*

Beard : *Freedom in Political Thought* (in ' Freedom—Its Meaning ', Ed. by Ruth Nanda Kishan).

Belvalkar, Shripad Krishna : *Vedant Philosophy* (Basu-Mallik Lectures—University of Calcutta); (Poona, 1929, 1st part).

Bergson : *Two Sources of Morality.*

Bhandarkar, Sir Ramkrishna Gopal : *Vaishnavism, Saivism and Minor Religious Systems* (Encyclopaedia of Indo-Aryan Research) (Stransburg, Karl J. Trubner 1913).

Bhattacharya, Jogendra Nath : *Hindu Castes and Sects* (Calcutta, Thacker Spink & Co., 1896).

Bloomfield Maurice : *The Religion of the Veda : The Ancient Religion of India* (New York. G. P. Putnam's Sons, 1908).

Blunt, E. A. H. *The Caste System of Northern India : With Special reference to the United Provinces of Agra and Oudh* (London, Humphrey Nilford. 1931).

Burnouf : *L'Introduction a L'Historie on Buddhisme Indien*).


* ఆంగ్ల గ్రంథంలో ఇచ్చిన గ్రంథసూచిక యథాతథంగా ఇవ్వడమైనది

Bohtlingk : *Introduction to Bhagvat Gita* (Indian Antiquary, 1908. Supplement).

Boudhayana : *Grihya Sutras.*

Budhiraja, S. D. : *Bhagvat Gita.*

Crawley : *Tree of Life.*

Crawley & Tufts : *Evolution and Ethics.*

Daftari, Keshao Laxman : *Dharmarahasya.*

Date, Yashwant Ramkrishna : *Swadhyaya,* Magazine (1st Year, Double Number).

Dewey, John : *Democracy and Education* (New York, Macmillan, 1916).

Donald, A. Mackenzie : *Buddhism in Pre-Christian Britain* (London, Blackie & Son, 1928).

Eggeling, Julius : *Satpatha Brahmana*—Part I to V (London Sacred Books of the East Series, Oxford 1885).

Encyclopaedia Britannica : 11th Ed., Vol. XXVI.

Fausboll, V. : *Indian Mythology.*

Gait, Sir Edward : *Census of India Report* (1911.)

Garbe, Richards : *Introduction to the Bhagvadgita,* Tr. by D. Mackichen, (Bombay, University of Bombay, 1918).

Hamilton : *A New Account of the East Indies* (1744).

Hazara : *Chronology of Puranas.*

Hopkins, E. Washburn : *The Great Epic of India* (New York, Charles Scribner's Son, 1901).

—*History of the Religion* (New York, the Macmillan Co., 1916).

—*The Religions of India.*

—*History of the Ruling Races.*

Huxley, Tomas H. : *Evolution and Ethics* (London, Macmillan and Co. 1903).

Ibbetson Denzil, *Punjab Census Report* 1881 (Lahore, Govt. of Punjab 1881).

—*Punjab Castes* (Lahore, Govt. of Punjab 1916).

Innes, C. A.: *Gazetter of Malabar and Anjengo District* (Vol I).

Jacks: *Morals and Religion* (Hibbert Journal Vol. XIX).

Jacobi : *The dates of the Philosophical Sutras of the Brahamanas* (The Journal of the American Oriental Society, Vol. XXXI, 1911).

Jaiswal : *Manu and Yajnavalkya.*

—*Hindu Polity.*

Kale, Tryambak Gurunath: *Purana Nirikshana* (Marathi) (Panvel).

Kane, Pandurang Vaman: *A brief Sketch of the Purva Mimansa System* (Bombay 1924).

— *History of Dharma Shastra.*

Kern H. : *Manual of Indian Buddhism* (Stransburg 1896).

Kosambi, Dharmanand : *Hindi Sanskriti An Ahimsa* (Marathi) (Bombay, Author, 1935).

Laski, Harold J.: *Liberty in the Modern State* (London, George Allen and Unwin Ltd. 1930).

Laws- A. C.: *Natural Theology*..

Lyall Sir Alfred.: *Asiatic Studies—Religion and Society* (London, John Murray, 1907).

Maine, Henry James: *Ancient Law* (London, J. M. Dent and Sons, 1861).

Maritain Jacques: *The Conquest of Freedom* in 'Freedom—its Meaning' by Ruth Nanda Kishan).

Max Muller : *Science and Religion* (Royal Institution, 1870) (London Longmans Green and Co., 1882).

—Lecture on the *Growth of Religion,* Hibbert Lectures 1878 (London, 1878);

—*Mahaparinibbana Sutta*;

—*Ancient Sanskrit Literature,* 1860.

Medhatithi : *Commentary on Manu,* Edited by Vishwanath Narayan Mandlik (Bombay 1886).

Mill, J. S. : *Utilitarianism and Liberty,* Representative Govt. (London 1954).

Modern Review (July 1912).

Moore, Edward : *Hindu Pantheon* (London, 1st Ed. by W. O. Simpson, 1810);

— *Hindu Infanticide* (London 1911).

Muir : *White Yajurveda* (Original Sanskrit Texts, London, Trubner & Co., 57 & 59 Ludgate Hill, 1873 2nd Ed.)

Nicolas, M.P. : *From Nietzsche down to Hitler* (London, William Hodge & Co., 1938).

Nietzsche, F. W. : *Anti Christ,* Tr. from the German by H.L. Mencker (Torrance, The Noontide Press, 1880).

*THUS Spake Zarathustra* Translated by Thomas Common (New York, Macmillan Co 1905)

Partigar : *Ancient Indian Historical Tradition.*

Plowman Max : *The Nemesis of Ineffectual Religion* (Adelphi 1941).

Pratt : *Buddhism.*

Pradnaneshwar Yati : *Chaturvarnya*;

—*Upanayan*. Pringle Pattison : *Philosophy of Religion.*

*Studies in Philosophy of Religion* (Oxford, Munro's Encyclopaedia of Education, 1930).

Radhakrishnan, Sarvapalli : *Indian Philosophy*, Vol. I and II (New York, Macmillan, 1923).

Rajwade, V. K. : *Article on Bhagvat Gita* (Bhandarkar Memorial Volume).

Rhys, Davids T. W. : *Buddhism*, Society for promoting Christain Knowledge (London, Northumberland Avenue W. C. 1886).

Ryakan Kimura : *A Historical Study of the Terms—Hinayana and Mahayana, and the Origin of Mahayana Buddhism* (Calcutta University 1927).

Sarkar, B. K. : *The Positive Background of Hindu Sociology.*

Satavalekar, M. D. : *Purushartha*, Vol. XIII.

Seal, Brajendranath : *The Positive Sciences of the Ancient Hindus.*

Sen, Surendra Nath : *Early Career of Kanhoji Angria* and other papers.

Sham Shastri : *Memorial Volumes.*

—*Kautilya's Arthashastra.*

Shankaracharya : *Opposition to Krishnaism.*

Shastri, Harprasad : *Memorial Volume* (Ed. Narendra Nath Law, —*Buddhistic Studies*, Ed. B. C. Law.

Smith Robertson : *The Religion of the Semites* (1927.)

Smith, Vincent A : *Early History of India* (Oxford, 1924).

Stefens : *Commentary on the Law of England* (15th Ed. Vol. IV).

aylor A. E. : *The Faith of a Moralist* Gifford Lectures, 1926-27 (London 1930).

Telang, K. T. : *Bhagvat Gita* (Ed. F Max Muller, Oxford, 1882).

Tilak, B. G. : *Gita Rahasya* (English Translation).

Travels of (1) Alberuni, (2) Duarte Barbosa, (3) Megasthenes.

Utgikar, N. B. : *Garbe's Introduction to the Bhagvat Gita* (Tr. from the German, Bombay 1918).

Vaidya, C. V. : *History of Medieval Hindu India*, in 3 vols. (Poona, 1921).

—*Riddle of the Ramayana*: Bombay, Radhabai Atmaram Sagoon, 1906).

Varthema, Ludovico Di : *Travels of* (Hakyt Society).

Vireshwarananda Swami : *Brahma Sutras* (Advaita Ashram, 1936).

Weber Albrecht : *History of Indian Literature*, Tr. by John Mann and Theodor Zacharae (London, Kegan Paul, Trubner and Co. Ltd., 1878, 1892).

William Jackson, A. V. : *History of India* Vol. II (London 1906.)

Wilson : *Essays on Sanskrit Literature*, Vol. III.

Winternitz : *History of Indian Literature* (English Translation).

**Other Books:** Aitareya Brahmana, Nirukta, Narada Smriti, Mahabharata, Ramayana, Bhagvat Gita, Harivamsha, Yajnavalkya Smriti, Mitakshara.

6 an I be a Hindu

by

B R Ambedkar

68

# Symbols of Hinduism

1. Symbols represent the Soul of a thing,

2. of Christianity

3 Symbols of Islam

4 Symbols of Jainism

5 Symbols of Buddhism

6. What is ~~are the Symbols of~~ Hinduism

undefinable. something

7 What are the symbols ~~Sy...~~ of Hinduism.

~~Two~~ Three

(1) Caste

(2) Cults

(1) Rama

(2) Krishna

(3) Shiva

(4) Vishnu

(3) Service of Superman

'నేను హిందువును కాగలనా?' 'హిందువుల చిహ్నాలు' అనే రచనల పుటల నుంచి డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ పెన్సిల్ చేతిరాత నకలు ప్రతి ఇది.

by B R Ambedkar

Virat Parva 2 1

1. The spies sent by Kauravas to search for the existence of the Pandavas return to Duryodhan and tell him that they are unable to discover them. They ask his permission as to what to do. — M.B. Virat-Parva. Adhya 25.

2. Duryodhan asks for advice from his advisors. Karna said send other spies. Dushasan said. they might have gone beyond the sea. But search for them. — Ibid - Adhya 26.

3. Drona said the Pandavas are not likely to be defeated or destroyed. They may be living as Tapasis. Therefore send Siddhas and Brahamins as spies — Ibid Adyaa 27.

4. Bhishma supports Drona - Ibid Adhya 28

5. Kripacharya supported Bhishma and added - Pandavas are great enemies. But wise man does not neglect even small enemies while they are in अज्ञातवास you should go on collecting armies from now — Ibid Adhya -29

6. Then ~~Su~~ Susharma King of Trigarth - raised quite a different subject. He said that Kichaka who was the

విరాట పర్వంపై రాసుకున్న, భగవద్గీతపై రాయ సంకల్పించిన పుస్తకం శీర్షిక పుటల నుంచి
డాక్టర్ అంబేద్కర్ చేతి రాత.

***B. R. AMBEDKAR,***
***M.A., Ph.D., D.Sc., LL.D., D.Litt., Barrister-at-Law,***
***Member, Council of States.***

***26, ALIPORE ROAD,***
***CIVIL LINES,***
***DELHI,***

Dated the 12th June, 1956.

My dear Rege,

I have returned the Marathi Edition of the Mahabharat. It seems that along with your copies my edition has also been taken away. Will you kindly send me the Marathi translation of the Adi Parwar by registered post. My work on the Revolution and Counter Revolution has been held up. Treat this as most urgent.

Yours sincerely,

B R Ambedkar

(B.R. Ambedkar)

Shri S. Rege,
Librarian,
Siddharth College,
Bombay.

'విప్లవం - ప్రతి విప్లవం' అన్న రచన చేస్తున్నపుడు డాక్టర్ అంబేద్కర్ ఎస్. ఎస్.రెజెకు రాసిన లేఖ ప్రతి ఇది. 1956 జూన్‌లో దీన్ని రాశారు.